# బుద్ధ దర్శనం

ఆంగ్లమూలం

**నారద మహా థేర**

అనువాదం

**అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

**ఆనంద బుద్ధ విహార ట్రస్టు**

బుద్ధనగర్, తుకారామ్‌గేట్, నార్తలాలగూడ

సికిందరాబాద్ - 500 017, ఆంధ్రప్రదేశ్, ఇండియా

Ph : 91 - 040 - 7732421, Fax : 040 - 7733160

Original : *The Buddha and His Teachings* **by Narada Maha Thera**

***"Buddha Darsanam"*** *: A Telugu Translation*
*by* **A. VENKATESWARA REDDY**



ప్రథమ ముద్రణ : **2543** బుద్ధ జయంతి - **1999**

ఆనంద బుద్ధ విహార ట్రస్టు వారి
**16**వ ముద్రణ

ప్రతులు : **1000**

వెల : రూ **125 /-**

ప్రతులకు : ఆనంద బుద్ధ విహార ట్రస్టు, సికిందరాబాద్

ప్రింటర్స్ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్
ముషీరాబాద్, హైదరాబాద్ - **500 020.**

**డా. ఆలపాటి రవీంద్రనాథ్ (1922 – 1996)** కు బౌద్ధం అంటే మొ[illegible]ఎలాగంటే బుద్ధుని మానవ[illegible] హేతు వాదం, [illegible]క వాదాలు ఆయ[illegible] ప్రభావితం చేశాయి. వివి[illegible]రోజుల్లో ఆ[illegible]డవచ్చిన వారితో బౌద్ధాన్ని గురించే [illegible] వారు. ముచ్చటించడమే కాదు, తాను 1[illegible] స్థాపించిన 'మిసిమి' మేధావుల మాస పత్రికలో బుద్ధ ధ[illegible] is the product of what we have thought. It is we are what we think", అనే వాక్యాన్ని [illegible] చేసుకొన్నారు. ధమ్మ పద గాథలను 'మిసిమి' లో వేశారు. వాటి అర్థాన్ని స్ఫురించే చిత్రాలను [illegible] చిత్రాలుగా వేశారు.

అటువంటి బుద్ధ కరుణా ప్రభావిత **రవీంద్రనాథ్** గారి స్ఫూర్తిని జ్ఞాపకం చేసుకొం[illegible] వారి తనయులు మరియు తనయకు ఆనంద బుద్ధ విహార వెలయిస్తున్న ఈ గ్రంథరూప ధారణకు [illegible]తగానో దోహదం చేశారు.

వారికి ఆనంద బుద్ధ విహార కృతజ్ఞతలు తెలియజేసుకొంటోంది.

# అనువాదకుని మాట

నాకు మొదటి నుంచి బౌద్ధం అంటే ఇష్టం. మాయింటి పేరు 'మహా బోధి'. ఎందుకంటె బౌద్ధం హేతుబద్ధం. అది దేవుణ్ణి కాదని 'మనిషి' ని కేంద్రంగా చేసకొంది. దేవుణ్ణి కేంద్రంగా చేసుకొన్న మతాలున్నాయి కాని మనిషిని కేంద్రంగా చేసుకొన్న మతాలు లేవు.

బుద్ధుడు కాల్పనిక వ్యక్తి కాడు. వాస్తవ చారిత్రక పురుషుడు. ఈ ప్రపంచం పుట్టిన తరువాత, అది కాలంలో పుట్టడం నిజమైతే. బుద్ధుని లాంటి మహామహుడు మరొకరు రాలేదని విల్‌డ్యూరాంట్ అంటారు.

అటువంటి బుద్ధుడు స్థాపించిన బౌద్ధం, అన్నిమతాలలోకి అత్యంత సహనాన్ని ప్రదర్శించింది. ఇతరులను తనలో కలుపుకోవడానికి అది కత్తులు దూయలేదు. ఎవరిని ఒత్తిడి చేయ లేదు. ఈ విషయానికి బెర్ట్రాండ్ రసెల్ సాక్ష్యం పలికాడు.

''రా, వచ్చి చూడు, అర్థం చేసుకో, అనుభవం రుజువు పలికితేనే నా పథాన్ని స్వీకరించు'' అని ప్రకటించాడు బుద్ధుడు బహిరంగంగానే. ఇలా ఏ ఇతర మత దార్శనికుడు చెప్ప లేదు.

బుద్ధుని సిద్ధాంతాలు కేవలం బుద్ధి జనితాలు కావు. అవి అనుభవిక సత్యాలు. అందుకే ఎప్పుడూ ఎవరి అనుభవంలోకి రాని ఆత్మను కాదన్నాడు. ''ఆత్మ నిత్యత్వ సిద్ధాంతం బుద్ధికి పుట్టిన జాడ్యం,'' ఆయన దృష్టిలో.

ఇతరులు సిద్ధాంతాలు చేశారు. అవి బుద్ధి నుంచి పుట్టినవి, బుద్ధితో అర్థం చేసుకోతగినవి. కాని బుద్ధునివి అలాంటివి కావు. అనుభవానికి నిలిచేవి. ఇదే ఇతరులకు బుద్ధునికీ ఉన్న తేడా.

అటువంటి బౌద్ధాన్ని ప్రచలితం చేయడానికి ''నేనూ ఒక సమిధనైతే ఎంత బాగుండును,'' అని కలలు కనేవాణ్ణి ఆ కలలు నిజం చేసు కొనే ప్రయత్నంలో ''మానవీయ బుద్ధ'' రాశాను.

ఇప్పుడు మరో అవకాశం వచ్చింది. ఆనంద బుద్ధ విహార ట్రస్టీలు ఆంజనేయ రెడ్డి, వీర నారాయణ రెడ్డి, నారద మహాథేర రాసిన "The Buddha and His Teachings" ను తెలుగు చేయమని కోరారు. ''నేను దానిని మహదానందంగా భావించి, ఆ కృషిలో నా ''బుద్ధ పరాయణత''ను అభివ్యక్తీ కరించు కొన్నాను. వారికి నేను కృతజ్ఞుడను.

ఈ ఆధికారిక గ్రంథం క్లుప్తంగా, అమూలాగ్రంగా బుద్ధుని జీవితాన్ని, ఆయన దర్శనాన్ని మీ ముందుంచు తుంది. ఇది పండితుల కోసం కాదు. మొదటి సారిగా బౌద్ధాన్ని తెలుసు కోవాలను కొనే వారికి.

ఈ గ్రంథం చదివిన వారు ఏ కొంచెంగానైనా, బుద్ధ కరుణతో, మైత్రితో ప్రభావితులైతే, ఈ పైరు బొందు వోక పండి నట్లే.

# విషయ సూచిక

## అనుబంధం

# బుద్ధ దర్శనం

నమొ తస్స భగవతొ అర్హతొ సమ్మా - సంబుద్ధస్స !

ఉన్నతుడు, అర్హతుడు, మహాజ్ఞాని అయిన వానికి నమోవాకాలు

ఒకటో ప్రకరణం

# బుద్ధుడు

## జననం నుంచి పరిత్యాగం వరకు

దేవతల, మానవుల ప్రయోజనం కోసం, సుఖం కోసం, మంచికోసం, ఈ ప్రపంచం మీది అనుకంపతో, ఒక మహాద్భుతమైన, అనన్యుడైన వ్యక్తి ఈ లోకంలో జన్మించాడు. ఎవరీ అద్వితీయ వ్యక్తి? అతడే తథాగతుడు. ఉన్నతుడు, జ్ఞానోదయం అయిన వాడు.

*అంగుత్తరనికాయం* 1, 1, 13, p. 22

**జననం**

ప్రపంచంలోకే అత్యంత మహాధర్మప్రవక్త కానున్న ఓ రాకుమారుడు, నేటి నేపాలులో భారతదేశ సరిహద్దులలో కపిలవస్తు[4] నగరం, లుంబినీ వనం[2]లో క్రీ. పూ. **623**[3]వ సంవత్సరం మే **1** నెల పూర్ణిమ (వైశాఖ శుద్ధ పూర్ణిమ) నాడు జన్మించాడు[1].

అతని తండ్రి[5] కులీన శాక్య[6] తెగకు చెందిన శుద్ధోదన మహారాజు. తల్లి రాణి మహామాయ. అతడు పుట్టిన ఏడోరోజునే మహామాయ మరణించింది. ఈమె చెల్లి మహాప్రజాపతిగౌతమి, మహారాజు మరో భార్య. ఈమె తన స్వంత బిడ్డ అయిన నందుని దాదులకు అప్పగించి, ఆ బిడ్డ పెంపకాన్ని చేపట్టింది.

రాకుమారుని జననాన్ని పురస్కరించుకొని ప్రజలు ఘనంగా వేడుకలు జరుపుకొన్నారు. ఈ శుభవార్త విన్న అసితుడనే మహాఋషి అందరికంటె ఎక్కువగా సంతోషించాడు. ఇతనిని కాలదేవలుడని గూడ అంటారు. ఇతడు రాజగురువైన కారణాన, రాచ పట్టిని చూడ డానికి రాజప్రాసాదానికి వచ్చాడు. ఈయన రాకను మహారాజు మహాప్రసాదంగా భావించి, బిడ్డచేత ఆయనకు నమస్కరింప జేయడానికి, బిడ్డను ఆయన దగ్గరకు పట్టుకెళ్ళాడు. ఆశ్చర్యం, బిడ్డ పాదాలు మెలిదిరిగి ఋషి పుంగవుని జడలు గట్టిన వెంట్రుకలలో విశ్రమించాయి. ఆ

ఋషి ఈ సంఘటనను తన దివ్యదృష్టితో చూచి, బిడ్డ భవిష్యత్తు మహోజ్వలంగా ఉందని తెలుసుకొని, తన పీఠంనుంచి లేచి నిలబడి, చేతులు జోడించి[7], ఆ బిడ్డకు నమస్కరించాడు. తండ్రీ ఋషి మార్గాన్నే అనుసరించాడు.

ఆ ఋషి మొదట మందహాసం చేసి. ఆ తరవాత వేదనను వ్యక్తం చేశాడు. ఆ మిశ్రమానుభూతులకు కారణం - ఏమిటి? అని ఆయన్ను ప్రశ్నించారు: ''నేను మందహాసం చేసిన కారణం ఈ బిడ్డ అంతిమంగా మహాజ్ఞాని, బుద్ధుడు అవుతాడని. నేను వేదనను వ్యక్తం చేసిన కారణం- నేను అరూపలోకం[8]లో పూర్వం పొందిన జననాల కారణంగా ఈ మహామహుని వల్ల కొంచెం అయినా ప్రయోజనాన్ని పొంద లేక పోతున్నానే'' అని సమాధానం ఇచ్చాడు.

**నామకరణ మహోత్సవం**

రాకుమారుడు పుట్టిన ఐదోరోజు అతనికి సిద్ధార్థుడు అని పేరు పెట్టారు. సిద్ధార్థుడు అంటే ''సిద్ధించిన అర్థం'' (తీరిన కోరిక) కలవాడు. అతడు గౌతమ[9] గోత్రానికి చెందినవాడు. అందుకని సిద్ధార్థగౌతముడైనాడు.

ప్రాచీన భారతీయ సంప్రదాయం ప్రకారం నామకరణోత్సవానికి బ్రాహ్మణ పండితులను పిలిపించారు. వారిలో ఎనిమిది మంది విశిష్ట వ్యక్తులు ఉన్నారు. బిడ్డ లక్షణాలను పరిశీలించిన ఎనిమిది మందిలో ఏడుగురు రెండేసి వేళ్ళను ఎత్తి చూపారు. దీనికి అర్థం రెండు విధాల జరిగే అవకాశం ఉందని చెప్పడం. అంటే అతడు మహా చక్రవర్తి గానీ, బుద్ధుడు గాని అయ్యే అవకాశం ఉందని చెప్పారు. ఆ ఎనిమిది మందిలో అందరి కంటె చిన్నవాడు, ధీమంతుడు అయిన **కొండణ్ణ**[10] మాత్రం మిగతా ఏడుగురితో ఏకీభవించ లేదు. రాకుమారుని నుదుటి మీద కుడివైపుకు తిరిగి ఉన్న ఉంగరాల జుట్టు చూసి ఇతడు ఒక వేలు మాత్రమే ఎత్తి చూపి ఇలా అన్నాడు: ''రాకుమారుడు కచ్చితంగా సంసార లంపటాన్ని త్యజించి, బుద్ధుడే అవుతాడు'', అని అతి విశ్వసనీయంగా చెప్పాడు.

**ఏరువాక పండుగ**

రాకుమారుని బాల్యంలో ఒక అద్భుత సంఘటన జరిగింది. అంతకు ముందు ఎన్నడూ లేని అద్భుత సంఘటన అది. ఆ తరవాత అతడు పెద్దవాడై సత్యాన్వేషణ గావిస్తున్నప్పుడు, అతని జ్ఞానోదయాని[11]కి అది కీలకంగా పనిచేసింది.

వ్యవసాయపు పనులు ప్రారంభానికి సూచనగా మహారాజు ఏరువాక వేడుకను ఏర్పాటు

చేశాడు. ఇందులో అందరూ మంచి మంచి దుస్తులు ధరించి పాల్గొన్నారు. నిర్ణీత రోజున రాజు తమ ఆస్థాన జనం వెంటరాగా, దాదుల సహితంగా రాకుమారుని వెంట బెట్టుకొని, పొలానికి వెళ్ళాడు. రాకుమారుని, తెరలు కట్టి పందిరి మంచం మీద పడుకోబెట్టి, వెలగ చెట్టు చల్లని నీడలో ఉంచారు. దాదులు ప్రక్కనే ఉన్నారు. రాజు ఏరువాక వేడుకలో మునిగి పోయాడు. వేడుక ఊపు అందుకోగా. ఉత్సాహం ఉరకలు వేసింది. సంతోషం కట్టలు తెంచుకొంధి.

ఈ అద్భుత దృశ్యాన్ని తిలకించ డానికి దాదులు రాకుమారుని వదిలి వచ్చారు.

పండుగ సంబరం ఇక్కడ ఆకాశ న్నంటుతుంటే, అక్కడ చెట్టు నీడలో అంతా ప్రశాంతంగా ఉంది. ధ్యానం చేసు కోవ డానికి తగిన నిర్మల వాతావరణం నెలకొని ఉంది. వయస్సులో పిన్న, బుద్ధిలో బృహస్పతి అయిన గౌతముడు (కాలిమీద కాలువేసుకొని - Cross legged) ఉచ్ఛ్వాస నిశ్వాసల మీద మనస్సును కేంద్రీ కరించాడు. అప్పటి కప్పుడే అక్కడికక్కడే సమాధి అని పిలవబడే మానసిక ఏకాగ్రత కుదిరింది. ఈ విధంగా అతడు మొదటి ఝానాన్ని[12] సాధించాడు. (ఝానం అంటే పరమానందం). తమ విధులను మరచి ఏరువాక ఉత్సవంలో పడి కొట్టుకుపోతున్న దాదులకు ఆకస్మికంగా తమ విధులు గుర్తొచ్చాయి. పరుగెత్తి కెళ్ళి చూద్దురు గదా, రాకుమారుడు వ్యస్తపాదుడై, గాఢధ్యానంలో మునిగి ఉన్నాడు. ఆ దృశ్యాన్ని చూసి వారు ఆశ్చర్యపోయారు. ఈ సంగతి విన్న రాజు, వేగంగా అక్కడకు చేరుకొన్నాడు. ధ్యాన ముద్రలో ఉన్న పుత్రుని చూసి, అతడికి అభివాదం చేస్తూ ''హే నా ప్రియమైన పుత్రా, ఇధి నా రెండో అభివాదం'' అని అన్నాడు.

**విద్య**

అతని విద్య గురించి మనకు ఏమీ తెలియదు. అయినా అతడు రాచపట్టి కనుక రాజోచితమైన విద్యలను అభ్యసించి ఉండాలి. యోద్ధ తరగతికి చెందిన వాడు గనుక యుద్ధ విద్యలను అభ్యసించాడు.

**వైవాహిక జీవితం**

తనకు ఈడు జోడు అయిన అందాల రాణి యశోధర[13]ను, తన పదహారవ యేట వివాహ మాడాడు. వివాహా నంతరం దాదాపు పదమూడు సంవత్సరాలు భోగ జీవితాన్ని గడిపాడు. రాజ ప్రాసాద ప్రాకారానికి వెలుపలి జీవితం, ఒడి దుడుకులు గురించి తెలియని

ఆనందంలో అతని జీవితం సాగింది. రాకుమారునిగా తన భోగజీవితాన్ని గురించి అతడు ఇలా అంటాడు:

''నేను సున్నిత మనస్కుడను. అత్యంత సున్నితమన
స్కుడను. నా తండ్రిగారి నివాసంలో ప్రత్యేకించి
నా కోసం మూడు పద్మాల కొలనులను నిర్మించారు.
ఒక కొలనులో నీలలోహిత పద్మాలు వికసిం
చాయి. మరోదానిలో అరుణ పద్మాలు, వేరొక
దానిలో శ్వేతపద్మాలు వికసించాయి. కాశీకి[14] చెందని ఏ గంధపు చెక్కలను నేను వాడలేదు.
నా తలపాగ, అంగీ, దుస్తులు అన్నీ కాశీ నుంచి వచ్చినవే.

''ఎండ, చలి, ఆకులు, దుమ్ము, మంచు – ఏదీ నన్ను
తాక కుండ రేబవలు నాపై ఒక శ్వేత ఛత్రాన్ని పట్టి ఉంచారు.

''నా కోసం మూడు ప్రాసాదాలను నిర్మించారు – ఒకటి
చలికాలానికి, మరొకటి వేసవికి, వేరొకటి వర్షాకాలానికి,
వర్షాకాలం నాలుగు నెలలు. వర్షాకాల భవనంలో ఒక్క
సారి గూడ బయటికి రాకుండా ఉన్నాను. ఈ కాలం
అంతా సంగీత విదుషీ మణులు గానం వినిపించారు. ఇత
రుల ఇళ్ళల్లో పులిసిన గంజి ఊక
నుంచి తయారైన అంబలిని బానిసలకు పనివాళ్ళకు
ఎలా ఇస్తారో, అలాగే మా తండ్రిగారి నివాసంలో
బానిసలకు, పనివాళ్ళకు బియ్యం, మాంసాలతో తయా
రైన ఆహారాన్ని ఇచ్చారు[15]''.

కాలం గడిచేకొద్దీ, క్రమంగా అతనికి జీవిత వాస్తవాలు తెలియ సాగాయి. అతని నిశిత పరిశీలనా ప్రవృత్తి, హద్దు లెరగని అతని అనుకంప, అతనిని రాజ ప్రాసాదంలో క్షణికానందంలో కాలం వెళ్ళదీయనీయలేదు. అతడు వ్యక్తిగత దుఃఖమంటూ ఒకటి ఎరగడు. కాని అతడు మానవాళి బాధను తన బాధగా చేసుకొన్నాడు. సుఖభోగాల మధ్య అతడు దుఃఖం సార్వత్రికతను గుర్తించాడు.

సిద్ధార్థ రాకుమారుడు ఈ విధంగా వెను దిరిగి ఆలోచించాడు. ''నేను పుడతాను, గిడతాను. క్షీణిస్తాను, రోగాల బారిన పడతాను. దుఃఖాన్ని, మలినాన్ని అనుభవిస్తాను. మరి నేను ఎందుకు అలాంటి స్వభావం ఉన్న విషయాల వైపు పరుగు తీస్తున్నాను? అలా అటువంటి స్వభావం ఉన్న విషయాల వైపు పరుగులు తీస్తుంటే, నేను వాటి నిష్ప్రయోజకతను ఎలా ఎప్పటికి గుర్తిస్తాను? ఆ అందని, దాట వీలులేని, పరిపూర్ణ భద్రతను, నిర్వాణాన్ని ఎలా అన్వేషిస్తాను? కుటుంబ జీవితం ఇరుకైంది. పరిమిత మైంది. అదొక వైరుధ్యాల పుట్ట. గూడులేని వాని జీవితం స్వర్గమైదానాల్లో వీచేగాలి లాంటిది! పవిత్ర జీవితాన్ని పరిపూర్ణంగా, పరిశుద్ధంగా, దానిని జీవించ వలసిన తీరులో జీవించాలని, ఇంటికే బందీ అయిపోతే, అప్పుడు అతని జీవితం దుర్భరం అవుతుంది.''[17]

ఓ పండుగ రోజున, బాహ్యప్రపంచాన్ని చూడ డానికి విలాస వనానికి వెళ్ళాడు. అక్కడ అతనికి కొన్ని జీవిత నగ్న సత్యాలు ఎదు రయ్యాయి. రాజ ప్రసాదం నాలుగు గోడల మధ్య అతడు కేవలం రసమయమైన జీవితాన్నే చూశాడు. కాని రెండో పక్షం – చీకటిపక్షం, సాధారణ మానవాళి కడగండ్లు – ఉద్దేశపూర్వకంగానే అతని కంట పడ కుండ చేశారు. మానసికంగా ఊహించిన దానిని అతడు ఇప్పుడు మొదటిసారిగా, సుస్పష్టంగా 'వాస్తవం'లో చూశాడు. వనానికి వెళ్ళే మార్గ మధ్యంలో, ఒడి వంగిన ఓ వృద్ధుడు, ఓ రోగి, ఓ శవం, ఓ ప్రశాంత వదనంతో ఉన్న సన్యాసి ఆయన కంట పడ్డారు.[18] ఇటువంటి దృశ్యాలను అతడు అంతకు ముందు ఎన్నడూ చూసి ఉండ లేదు. మానవ జీవితం యొక్క తొలగించ వీలులేని స్వభావానికి, మానవు లందరిని పట్టుకొని పీడించే రుగ్మతలకు, మొదటి మూడు దృశ్యాలు సాక్ష్యం పలికితే, జీవిత దుఃఖాన్ని పరిహరించి, శాంతిని పొందే మార్గాన్ని నాలుగో దృశ్యం చూపింది. అనుకోకుండా ఎదురైన ఈ నాలుగు దృశ్యాలు, జీవితం మీద వెగటు కలిగించి సంసార త్యాగానికి అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించాయి.

మామూలు జనం పొగిడే ఈ ప్రపంచంలో ఐంద్రియక సుఖాల నిస్సారతను అవగతం చేసుకొన్నాడు. జ్ఞానులు ఆనందం పొందే పరిత్యాగం విలువను ఆకళింపు చేసుకొన్నాడు. ఇక అంతే – శాశ్వత శాంతి కోసం, సత్యాన్వేషణకై, ఈ మామూలు ప్రపంచాన్ని విడిచి, దూరంగా వెళ్ళాలని నిశ్చయించు కొన్నాడు.

బాగా ఆలోచించే ఈ అంతిమ నిర్ణయం తీసుకొన్నాడు. అదే సమయంలో, వనాన్ని వదిలి ఇంటి ముఖం పడుతుండగా, పుత్రోదయం అయిందనే కబురు వచ్చింది. ఆ కబురు వినగానే ఎవరైనా సంతోషంతో తన్మయు లవుతారు. కాని ఆయన పొంగి పోలేదు. ఈ ప్రథమ

సంతానం తనకు ప్రతిబంధకమే అనుకొన్నాడు. సిద్ధార్థుడు మామూలు తండ్రి కాడు. అసాధారణమైన తండ్రి. అందుకే పుత్రుడు తనకు ప్రతి బంధకం (రాహువు) అను కొన్నాడు. ''రాహువు పుట్టింది'' అన్నాడు. అందుకే అతనికి 'రాహులుడు'[19] అని పేరు పెట్టాడు అతని తాత.

పర్యాలోచనా పరుడైన సిద్ధార్థ రాకుమారునికి రాజప్రాసాదం సరైన స్థలం కాదు ఉండటానికి. ఈ ప్రపంచాన్ని వదిలి పెట్టాలని అతడు తీసుకొన్న నిర్ణయం నుంచి అందాల రాశి అయిన అతని భార్య కాని, ముద్దు లొలికే కుమారుడు గాని అతన్ని ఏమాత్రం కదిలించలేక పోయారు. ఒక మంచి భర్త కంటె, ఒక మంచి తండ్రి కంటె, ఒక రాజాధిరాజుగా కంటె కూడ అతడు నిర్వహించ వలసిన మహదర్థకమైన పాత్ర ఏదో ఉంది. రాజప్రాసాదంలోని ''ఎర''లు ఏవీ అతని ఆనందానికి ఆస్పదాలు కాలేక పోయాయి. వీడ్కోలుకు కాలం పండింది.

తన కిష్టుడైన రథసారథి చన్నని, తన ప్రియమైన 'కంఠక' మనే అశ్వాన్ని, ఆయత్తం చేయమని ఆదేశించాడు. సిద్ధార్థుడు ఆతరవాత రాకుమారి మందిరానికి వెళ్ళాడు. గది తలుపు తెరిచాడు. గడపపై నిలిచి, నిదురిస్తున్న తన భార్యను, తనయుని రాగ రహిత దృక్కులతో ఒక్కసారి కలయ చూశాడు. వీరిద్దరి యెడ ఆయనకున్న అనుకంప గొప్పది. అంత కంటె గొప్పది మానవాళి యెడ ఆయనకున్న అనుకంప. ''భార్యా బిడ్డలకు అన్నీ పుష్కలంగా ఉన్నాయి. భద్రత ఉంది. నౌకర్లు చాకర్లు ఉన్నారు. వారి భవిష్యత్తుకు లోటు ఏమీ లేదు. అందుకని తాను వారి గూర్చి వ్యాకులత చెందవలసిన పనిలేదు'', అనుకొన్నాడు. దీని అర్థం అతడు వారిని తక్కువ ప్రేమించాడని కాదు. మానవాళిని అంతకంటె అధికంగా ప్రేమించాడు.

తేలిక పడిన హృదయంతో, నడికిరేయి, అంతా వదిలేసి, తనకు అత్యంత విశ్వాస పాత్రుడైన చన్ననితో నిశీధిలోకి నిర్గమించాడు. ఏకాంతుడు. డబ్బులేదు. సత్యం శాంతుల కోసం అన్వేషణ ప్రారంభించాడు. ఈ విధంగా అతడు ప్రపంచాన్ని వదిలి పెట్టాడు. జీవితంలో అనుభవించాల్సింది అంతా అనుభవించి, పండి పోయిన ఒక వృద్ధుడు చేసిన పరిత్యాగం లాంటిది కాదు సిద్ధార్థుడు చేసిన పరిత్యాగం. వదిలి పెట్టడానికి ఏమీలేని ఒక పేదవాని పరిత్యాగం కాదు సిద్ధార్థునిది. నిండు యౌవనంలో ఉన్న ఒక రాకుమారుని పరిత్యాగం. సిరి సంపదల మధ్య పరిత్యాగం. చరిత్రలో మరెక్కడా కానరాని పరిత్యాగం.

సిద్ధార్థ రాకుమారుడు ఈ చరిత్రాత్మకమైన పయనాన్ని తన ఇరవైతొమ్మిదో ఏట చేశాడు.

బహు దూరం పయనించాడు. అనోమా నదిని దాటి దాని ఒడ్డున సేద దీరాడు. ఇక్కడ అతడు తన జుట్టును, గడ్డాన్ని తొలగించాడు. తన నగలను, దుస్తులను చన్నని కందించి, రాజ ప్రాసాదానికి వెళ్ళి పొమ్మని ఆదేశించాడు. తానేమో సన్యాసులు వేసుకొనే పీతాంబరాన్ని ధరించి, ఐచ్ఛిక పేదరిక జీవనాన్ని గడిపాడు.

ఒకప్పుడు సిరిపందల ఒడిలో ఓలలాడిన సిద్ధార్థుడు, ఇప్పుడు సన్యాసిగా, కాసులేని పరిభ్రమకునిగా, దారిలో ఎవరైనా ఏదైనా కాస్త, అదైన ఐచ్ఛికంగా, భిక్షగా ఇస్తే, దానితోనే జీవించ సాగాడు.

శాశ్వత నివాసం లేదు. ఒక చెట్టునీడ, ఒక ఏకాంత గుహ అతనిని రేబవలుల నుంచి కాపాడాయి. పాదరక్షలు లేవు. తలపై ఆచ్ఛాదన ఏదీ లేదు. మాడ్చే ఎండలో, చీల్చే చలిలో అతడు నడిచాడు. బిచ్చ మెత్తు కోవ డానికి, ఒక చిప్ప, శరీరాన్ని కప్పు కోవడానికి మాత్రమే సరిపోయే ఒక బట్ట తప్ప, అతనికి 'నావి' అని చెప్పు కోవడానికి ఏమీ లేవు. తన శక్తి యుక్తు లన్నింటిని అతడు సత్యాన్వేషణ పైనే కేంద్రీ కరించాడు.

**అన్వేషణ**

ఈ విధంగా ఒక పరిభ్రమకునిగా, మంగళ కరమైన దానిని అన్వేషించే వానిగా, అగమ్యమైన శాంతిని వెతుక్కొంటూ, ఆలారకాలాముడనే ఒక విశిష్ట సన్యాసిని చేరి, ఇలా అన్నాడు: ''మిత్రవరా, కాలవరా, నేను మీతో పాటు పవిత్ర జీవితాన్ని గడ పాలని కోరుకొంటున్నాను.'' ''హే మాననీయా, మీరు మాతోనే ఉండ వచ్చు. మేము ఇక్కడ బోధించేది అంత కష్టమైంది ఏమీ కాదు. తెలివిగల వారు ఎవరైన తమ గురువు బోధలను తమ అంతర్బుద్ధి ద్వారా గుర్తించి, దాని సాధనలో ఉండ వచ్చు. అంతకంటె కష్టం ఏమీ లేదు''.

అనతికాలంలోనే అతడు ఆయన బోధలను తెలుసు కొన్నాడు. కాని అవి అతనికి అంతిమ సత్యాన్ని అందించ లేక పోయాయి.

అప్పుడు సిద్ధార్థునికి ఒక ఆలోచన వచ్చింది: ''ఆలారకాలాముడు తనకు ప్రజ్ఞ ద్వారా సత్యం గోచర మైందని, అందులో తాను జీవితస్తున్నాని చెప్పడంలో అతడు కేవలం ఒక విశ్వాసాన్ని ప్రతిపాదించడం లేదు. నిజంగానే ఆలారకాలాముడు దానిని దర్శించి, అర్థం చేసు కొనే జీవిస్తున్నాడు.''

అందుకని అతడు ఆలారకాలాముని దగ్గరకు వెళ్ళి ''మిత్రమా, కాలామా, మీరు మీ ప్రజ్ఞతో, అంతర్జ్ఞానంతో పొందినదానిని మీ దర్శనం ఎంతవరకు ప్రతిబింబించింది?'' అని అడగాడు.

అప్పుడు కాలాముడు ''శూన్యతాదేశాన్ని'' (ఆకిఞ్చన్యాయతన)[20] - ఒక ఉన్నత ఏకాగ్రతా దశను - అతనికి తెలియ జెప్పాడు. అప్పుడు అతనికి తట్టింది: ''విశ్వాసం, శక్తి, సతీ (mindfulness), ఏకాగ్రత, జ్ఞానాలు ఉంది ఒక్క ఆలారకామునికే కాదు, నాకూ ఉన్నాయి. కాలాముడు తాను దర్శించి, దానినే జీవిస్తున్నానని చెబుతున్న ఆ దశను నేను దర్శించ ప్రయత్నిస్తే ఎలా ఉంటుంది?''

తన అంతర్బుద్ధి ద్వారా త్వరలోనే ఆ స్థితిని చేరుకొన్నాడు సిద్ధార్థుడు. కాని అది అతనికి అంతిమ సత్యాన్ని చూపించ లేక పోయింది.

మళ్ళీ సిద్ధార్థుడు కాలాముని దర్శించి అన్నాడు: ''హితుడా, కాలామా, మీరు అంతర్బుద్ధి ద్వారా, జ్ఞానం ద్వారా, సాధించానని చెప్పింది ఇంతేనా? ఇంకేమైనా ఉందా?

''కాని, మిత్రమా, ఈ మార్గంలో నేనూ మీరు సాధించినంత సాధించాను. దానినే జీవిస్తున్నాను.''

అసూయ తెలియని ఆ గురువు తన విశిష్ట శిష్యుని, విజయానికి బహుధా సంతసించాడు. తనతో పాటు సమస్థాయిలో కూర్చుండ బెట్టుకొని గౌరవించాడు. ఆ తరువాత మెచ్చుకొంటూ ఇలా చెప్పాడు:

''సంతోషం, మిత్రమా మహా సంతోషం మీలాంటి గౌరవనీయ సహసన్యాసిని పొందడం మహా సంతోషం. నేను దర్శించిన సత్యాన్నే మీరూ దర్శించారు. మీరు దర్శించిన సత్యాన్నే నేనూ దర్శించాను. నాకు తెలిసిందే మీకు తెలుసు, మీకు తెలిసిందే నాకూ తెలుసు. నేనెలాగో మీరూ అలాగే. మీరు ఎలాగో నేనూ అలాగే. రండి మిత్రమా, రండి. మనమిద్దరం సన్యాసుల సంఘాన్ని నెలకొలుపుదాం''.

అంతర్బుద్ధి, జ్ఞానోదయం, విరాగం, ప్రశాంతత, దుఃఖ నిరోధం, నిర్వాణాలకు దారి తీయక, కేవలం మానసిక ఏకాగ్రతలో ఒక ఉన్నత దశకు చేర్చే జ్ఞానం, శిక్షణలతో, సన్యాసి అయిన గౌతముడు సంతృప్తి పడ లేదు. ముందుగా తనను తాను సంస్కరించు కోకుండా, పరిపూర్ణుని గావించు కోకుండా, ఆధ్యాత్మిక సాధనలో తనకు సరి జోడు అయిన మరో సన్యాసి సహకరించినా గూడా, తాను సన్యాసుల సంఘాన్ని నడపడు. అలా నడిపితే ఒక గుడ్డివాడు మరోగుడ్డి వానిని నడిపించి నట్లవుతుంది. అతని బోధతో అసంతృప్తుడై, మర్యాద పూర్వకంగా అతనినుంచి వీడ్కోలు తీసుకొని వెళ్లి పోయాడు.

రాజకీయ ఆందోళనలు, అలజడులు లేని ఆరోజుల్లో భారత దేశంలోని మేధావులు ఏదో ఒక మతాన్ని గురించో, ధర్మాన్ని గురించో చర్చిస్తూ ఉండే వారు. ఆధ్యాత్మికంగా

ఎదిగిన వారికి, తమ తమ ప్రవృత్తుల కనుగుణంగా, ఏకాంతంలో జీవించడానికి, అన్ని సదుపాయాలు ఆరోజుల్లో ఉన్నాయి. వీరిలో చాలమంది గురువులకు, పెద్దసంఖ్యలో శిష్యగణం ఉండేది. అందువల్ల ఇంతకు ముందరి గురువు కంటె మంచి గురువును పొందడంలో సన్యాసి గౌతమునికి ఏమీ కష్టం కాలేదు.

ఈసారి అతడు ఉద్దకరామపుత్రుడనే గురువును కలుసుకొని, అతని శిష్యరికంలో పవిత్ర జీవితాన్ని గడపడానికి అనుమతి వేడాడు. వెంటనే ఆయన ఇతని శిష్యరికానికి అంగీకరించాడు.

కొద్ది కాలంలోనే గౌతముడు ఆయన శిష్యరికంలో, మానసిక ఏకాగ్రతలో అంతిమ స్థితిని చేరాడు. ఆస్థితి సంజ్ఞాసంజ్ఞ స్థితికానిది[21] (neither perception nor non perception). ఈ భూమి మీద చేసే ఏకాగ్రతా ధ్యానంలో కెల్ల ఇదే చరమ దశ. దీని కంటె పై స్థితి ఏదీ లేదు. ఇందులో చైతన్యం ఉందని కానీ, లేదని కానీ చెప్పలేం. ప్రాచీన భారతీయ ఋషులు ఆధ్యాత్మికంగా ఈ దశను దాటి పైకి పో లేదు.

ఆ ఉత్తముడైన గురువు రాకుమారుడైన తన విశిష్ఠ శిష్యుని విజయాన్ని చూసి ఆనంద భరితు డయ్యాడు. పూర్వపు గురువులా కాక, ఈయన తన శిష్యులందరికి సిద్ధార్థుని గురువును చేయాలనే తలంపుతో ఆహ్వానించాడు. అలా గౌరవించాడు కూడా. ఆయన ''మిత్రమా! మాకు మహదానందంగా ఉంది. నీలాంటి తోటి గౌరవనీయ యతిని చూస్తూంటే, ఎంతో ఆనందంగా ఉంది! ఈ రామునికి తెలిసిన తత్వమంతా మీకు తెలుసు, మీకు తెలిసిన తత్వమే ఈ రామునికి తెలుసు. ఈ రాముడేమిటో మీరూ అదే. మీరే మిటో ఈ రాముడూ అదే. రండి మిత్రమా, ఈ యతి సంఘానికి మీరు నాయకత్వం వహించండి.'' అని అన్నాడు.

ఇప్పటికీ గౌతమునికి తాను అంతిమ సత్యాన్ని కనుగొన్నాననే నమ్మకం చిక్క లేదు. అతడు మనస్సును పూర్తిగా జయించాడు. కాని అతని అంతిమలక్ష్యం ఇంకా చాల దూరంలో ఉంది. అతడు అన్నింటి కంటే ఉన్నతమైన, అంతిమమైన, నిర్వాణాన్ని, దుఃఖ నిరోధాన్ని, అన్నిరకాల తృష్ణ రాహిత్యాన్ని అన్వేషిస్తున్నాడు. ఈ గురువుగారి బోధ గూడ అతనికి సంతృప్తి నివ్వలేదు. ఫలితంగా అక్కడ నుంచి గూడ వెళ్ళి పోయాడు.

తానింతకు ముందు గురువుల దగ్గర తెలుసు కొన్న వాటి కంటె, తన ఆశంసలు చాల ఉన్నత మైనవని అతడు గుర్తించాడు. తనకు కావలసిన పరమ సత్యాన్ని బోధించ గలవాడు ఎవరూ లేరని గూడ అతనికి అవగత మైంది. అంతేకాదు. ఆ పరమ సత్యాన్ని ఎవరికివారు తమకుతామే కనుగొనాలని గూడ గుర్తించాడు. ఈ గుర్తింపుతో వెలుపలి వారి సహాయాన్ని తీసు కోవాలనే ఆలోచనను విరమించు కొన్నాడు.

**పాదసూచికలు**

1. పాలి వెసాఖ, సంస్కృత వైశాఖ, సింహాళ వెసస్‌లకు సదృశం.

2. క్రీస్తు శకం వలె కాక బుద్ధ శకం బుద్ధుని మరణం నుంచి లెక్కించబడింది. బుద్ధుని మరణం క్రీ.పూ. 543లో 'ఆయన 80వ యేట' సంభవించింది. క్రీస్తు శకాన్ని క్రీస్తు పుట్టుక నుంచి లెక్కించారు. బుద్ధుడు కచ్చితంగా ఎప్పుడు మరణించాడనే దాని మీద పేచీలు ఉన్నాయి. అధిక సంఖ్యాకులు మాత్రం బుద్ధుడు 486 B.C. లో మరణించా దంటారు. సాంప్రదాయికంగా శ్రీలంకలో అంగీకృతమైన తేదీలనే బుద్ధ శకానికి ఆధారంగా తీసుకొంటారు.

3. అశోక చక్రవర్తి ఇదే స్థలంలో నాటిన స్తంభం నేటికీ ఆ సంఘటనకు జ్ఞాపక చిహ్నంగా ఉంది.

4. బాబౌన్ రైలు స్టేషన్‌కు వాయవ్యంగా, బెంగాలుకు మూడు మైళ్ళ దూరంలో బస్తి జిల్లాలోని భుయిలా (భూల్యా) గ కపిల వస్తును గుర్తించారు.

5. వంశవృక్షం చూడండి.

6. గౌతమ అనేది గోత్రనామం. శాక్య అనేది తెగపేరు. బుద్ధుడు ఈ తెగకు చెందుతాడు.

సంప్రదాయకంగా చెప్పుకొనే కథప్రకారం, సవతి తల్లి కుట్ర కారణంగా మహాసమ్మట వంశజులైన ఒక్కాకరాజు పుత్రులు ప్రవాసం వెళ్ళి పోయారు. ఈ రాకుమారులు అలా తిరుగుతూ తిరుగుతూ హిమాలయాలకు చేరు కొన్నారు. ఇక్కడ వారు ఋషికపిలుని కలిశారు. ఆయన సలహా మేరకు, ఆయన పేరుతో కపిలవస్తు నగరాన్ని నిర్మించారు. ఈ విషయం తెలుసుకొన్న ఒక్కాక మహారాజు ''రాకుమారులు నిజానికి ఎంత సమర్థులు, (సక్యా వత భో రాజకుమారా)'' అని అన్నాడు. అందువలన వారి తెగ, వారు నిర్మించిన రాజ్యం ''శాక్య'' నామంతో వ్యవహరింప బడు తున్నాయి. ఇ.జె. థామస్ రాసిన *Life of Buddha*, P. 6. చూడండి.

7. Warren రాసిన *Buddhism in Translations*, P.49, ఇంక, జాతక వ్యాఖ్యానం చూడండి.

అసితుని సలహామీద అతని భ్రాత పుత్రుడు సన్యాసం తీసు కొన్నాడు. అనుకొన్నట్లుగా రాకుమారుడు బుద్ధత్వాన్ని పొందాడు. అతడు బుద్ధుని బోధను విని అర్హంత అయ్యాడు. సుత్తని పాతం 3, 11, నాలకసుత్త, P. 131 చూడండి.

8. అరూప లోకాలు పదార్థ రహిత భూమికలు. అరూప ఝానం సాధించిన వారు (అరూప ఝానం= ఆనంద డోలికా స్థితి) ఇక్కడా పుడతారు.

9. పాలీ సిద్ధత్త గౌతమ. సంస్కృత సిద్ధార్థ గౌతమ.

10. సిద్దార్థుడు ప్రపంచ పరిత్యాగం చేశాడని వినగానే, కొండణ్ణ, మిగతా ఏడుగురు బ్రాహ్మణుల నలుగురు కొడుకులూ, సంసారాన్ని వదిలి, అతని అనుయాయు లయ్యారు. ఈ ఐదుగురే బుద్ధుని ముఖ్యమైన మొదటి ఐదుగురు శిష్యులు. ఆగవ ప్రకరణం చూడు.

11. మజ్ఞమనికాయం, 1, 36, మహాసచ్చకసుత్త, P. 237 చూడండి.

12. ఝూన - ఏకాగ్రతత ద్వారా సాధించిన చేతన ఉన్నత స్థితి.

13. బద్దకచ్చానా, బింబక, రాహుల మాత అని కూడ పిలుస్తారు.

14. మధ్య భారతదేశంలో పట్టుకు ప్రసిద్ధి చెందిన రాష్ట్రం. ఇప్పటి కాశీ దాని రాజధాని.

15. *అంగుత్తరనికాయ*, 1,3,4, P. 145; *Gradual Sayings*, 1, P. 12.

16. *మజ్జిమని కాయ*, 1,26 అరియ పరియెసన సుత్త, P.163.

17. *మజ్జిమని కాయ*, 1, 36 మహా సచ్చాక సుత్త, P. 237

18. ''నాలుగు గుర్తులను చూడగానే, నేను గుర్రంపై బయలు దేరాను...'' *బుద్ధ వంశ*, 27, 16, P. 65.

19. రాహుల అంటే ''రాహు'' (గొలుసు) తో ''ల'' బంధింప బడడం.

20. మూడో అరూప ఝూనం.

21. నాలుగో అరూప ఝూనం.

# రాకుమారుడు సిద్ధార్థుని వంశ వృక్షం

## తండ్రివైపునుంచి



# రాకుమారుడు సిద్ధార్థుని వంశ వృక్షం

తల్లి వైపునుంచి



రెండో ప్రకరణం

# జ్ఞానం కోసం సమరం

''తన కుపయోగపడనివీ, చెడ్డవీ, అయిన పనులు చేయడం చాల తేలిక. కాని ప్రయోజన కరమైనవీ, మంచివీ, అయిన పనులు చేయడం నిజానికి ఎంతో కష్టం,''

ధమ్మ పద, **V. 163.**

గౌతముడు నిరుత్సాహం చెందాడే కాని ధైర్యాన్ని వీడ లేదు. అటు అసదృశమైన శాంతిని, పరమ సత్యాన్ని, అన్వేషిస్తూ, మగధ దేశంలో తిరుగుతూ, సెనాని వర్తక కేంద్రమైన ఉరువెలకు కాలక్రమంలో చేరుకొన్నాడు. ఇసుక తిన్నెలతో అక్కడే ఒక నది ప్రవహిస్తోంది. ప్రక్కనే ఓ గ్రామం ఉంది. అక్కడొక అందమైన ప్రదేశాన్ని ఎన్నుకొన్నాడు. అక్కడ అతనికి ఆహారం లభిస్తుంది. అప్పు డతడు ఇలా అను కొన్నాడు.

''నిజంగా ఈ చోటు ఎంత సుందరంగా ఉంది. ఈ అడవి చెట్లు ఎంత మనోహరంగా ఉన్నాయి. జలజల పారే ఈ సెల యేరు ఎంత ఆహ్లాదకరంగా ఉంది. ప్రక్కనే జనపదం గూడ ఉంది. ఇక్కడ నాకు అన్నం లభిస్తుంది. ఏదైనా సాధించా లనుకొనే రాచ బిడ్డల ఆధ్యాత్మిక ప్రక్రియకు ఇది అనువైన చోటు[1]''.

అది అతని తపస్సుకు సరైన చోటు. ప్రశాంత వాతావరణం. మనోహర పరిసరాలు. దృశ్యం ఇంపుగా ఉంది. తాను లక్షించిన దాని సాధన కోసం ఇక్కడే, ఏకాంతంగా ఉండిపోవాలను కొన్నాడు.

అతని భావి గతిని జోస్యం చెప్పిన పిన్న బ్రాహ్మణ పండితుడు కొండణ్ణ, మిగత బ్రాహ్మణుల నలుగురు పుత్రులు బద్దియ, వప్ప, మహానామ, అస్సజి అనేవారు, బుద్ధుని సన్యాసం సంగతి విని, తామూ సంసారాన్ని వదిలి వేసి, అతినితో చేరి పోయారు.

ప్రాచీన భారత దేశంలో కర్మకాండ, క్రతువులకు ఉపవాసాలకు, యజ్ఞ, యాగాదులకు ఎంతో ప్రాముఖ్యం ఉండేది. కఠినమైన సన్యాస జీవితం గడిపి తేనే తప్ప మోక్షం సాధ్యం కాదనే ఒక నమ్మకం ఆకాలంలో ప్రబలంగా ఉండేది. ఆ నమ్మకాన్ని అనుసరించి గౌతముడు ఆరు సంవత్సరాల పాటు తీవ్ర నిష్ఠతో మానవాతీతంగా జ్ఞానోదయం కోసం తపస్సు చేశాడు. అతని కోమల శరీరం ఎండి పోయి, ఎముకలు బయట పడ్డాయి. అతడు శరీరాన్ని శుష్కింప జేసుకొన్న కొలదీ అతని లక్ష్యం గూడ దూరం కాసాగింది.

తాను ఎంతగా శ్రమించిందీ, తాను ఏ ఏ విధానాలను అనుసరించిందీ, అంతిమంగా తాను ఎలా విజయం సాధించిందీ, అతని సొంత మాటలలో వివిధ సుత్తలు (Suttas) వివరించాయి.

మహాసచ్చక సుత్త[2] అతని ప్రాథమిక ప్రయత్నాలను ఈ విధంగా వర్ణించింది

''అప్పుడు ఈ ఆలోచన నా మనస్సులో మెదలింది : నేను పళ్ళు బిగించి, నాలుకను అంగిలకి నొక్కి పట్టి, నా ధార్మిక ఆలోచనలతో అధార్మి కాలోచనలను నిగ్రహించి, అణచి, నాశం చేస్తే ఎలా ఉంటుంది!

' అందుకని నేను పళ్ళు బిగించి, నాలుకను అంగిలకి తన్ని పట్టినా, ధార్మికాలోచనలతో అధార్మికాలోచనలను నిగ్రహించాను, అణచివేశాను, నాశం చేశాను. ఈ కఠోర ప్రయత్నంలో నా బాహు మూలాల (చంకల) నుంచి చెమట ఏరులై పారింది.

'ఒక బలవంతుడు బలహీనుని తలో, భుజాలో పట్టి వంచి, పడగొట్టి, లో బరుచుకొన్న తీరులో నేనూ పోరాడాను.

'నాశక్తి దుర్దమ మైంది. అవిరళ మైంది. అటువంటిది నా శక్తి. ఆ నా అప్రమత్తత (సతీ = Mindfulness) స్థిర పడింది. చెక్కు చెదర లేదు. ఏది ఏమైన శరీరం అలిసి పోయింది. శ్రమ నన్ను పైకొన్న కారణంగా, అతి కఠోరంగా శ్రమించిన కారణంగా, నాశరీరం సేద దీర లేదు. అటువంటి బాధాకర సంవేదనలు నాలో కలిగినా. అవి నామనస్సును ఏమాత్రం ప్రభావితం చేయ లేదు.

'అప్పుడు నేను ఇలా అనుకొన్నాను: ''శ్వాస రహిత ఆనంద స్థితిని అలవరుచు కొంటే ఎలా ఉంటుంది!''

'అలాగే నేను ముక్కుగుండా, నోటి గుండా ఉచ్ఛ్వాస నిశ్వాసలను నిరోధించాను. ఇలా నిరోధించగానే చెవుల నుంచి వచ్చే గాలి హోరు లెత్తించింది. నేను శ్వాసను నిరోధించ గానే కమ్మరి భస్త్రీ (కమ్మరి కొలిమి గాలి ఊదేతిత్తి) చేసే నాదంలా, నా చెవి నుంచి వచ్చేగాలి పెద్ద శబ్దాన్ని సృష్టించింది.

'ఏమైనా నా పట్టు సడల లేదు. నాశక్తి దుర్జేయంగా, అవిరళంగా అలాగే ఉంది. నా సతీ (అప్రమత్తత) స్థిర పడిందే కాని, చెక్కు చెదర లేదు. అయితే నా శరీరం మాత్రం ఈ కఠోర శ్రమ వల్ల అలిసి పోయింది. సోలి పోయింది. అటువంటి బాధాకర సంవేదనలు నామనసు మీద ఏమాత్రం ప్రభావం చూప లేక పోయాయి.

'అప్పుడు నేను ఇలా అనుకొన్నాను: శ్వాస రాహిత్యాన్ని ఆచరిస్తే ఎలా ఉంటుంది?

'అలాగే ముక్కు గుండా, నోటి గుండా, చెవుల ద్వారా శ్వాసను నిరోధించాను. అప్పుడు లోపల బంధితమైన వాయువులు నా కపాలాన్ని మహా బలోపేతంగా మోదాయి. ఒక బలమైన వ్యక్తి, పదునైన సూదితో, తన పుర్రెకు రంధ్రం చేసు కొన్నప్పటి వలె, నేను శ్వాస నిరోధం చేయగానే, లోపలి వాయువులు నా కపాలాన్ని అతి బలంతో, వేగంతో తొలిచాయి. అటువంటి బాధాకర సంవేదనలు నాలో కలిగినా, అవి నా మనస్సును ఏమీ చేయ లేక పోయాయి.

'అప్పుడు నేను మళ్ళీ ఇలా ఆలోచించాను: 'మళ్ళీ నేను ఆశ్వాస రహిత ఆనంద ప్రవాహ స్థితిని అలవరచు కొంటే ఎలా ఉంటుంది!'

'అలాగే ముక్కు గుండ, నోటిగుండ, చెవుల గుండా శ్వాసను నిరోధించాను. ఈ విధంగా శ్వాసను నేను ఆపగానే, నా తలలో విపరీతమైన బాధ ఉవ్వెత్తున లేచింది. ఒక బలమైన వ్యక్తి తన తలను గట్టి తోలు పట్టీతో బిగుతుగా కట్టు కొంటే ఎలాంటి నొప్పి కలుగు తుందో, నా తలలో అంతటి విపరీతమైన నొప్పి కలిగింది. 'ఏమైనా నా పట్టుదల నీరు కార లేదు. ఆ బాధాకర సంవేదనలు నా మనస్సును కొంచెం కూడా కదిలించలేక పోయాయి.

'అప్పుడు మళ్ళీ ఆలోచించాను: ''మళ్లీ అదే శ్వాస రహిత మహదానంద స్థితి కోసం కృషి చేస్తేనో!

'అలాగే మూడింటి గుండ శ్వాసనిరోధం చేశాను. ఈ విధంగా ఎప్పుడైతే శ్వాసను నిరోధించానో, అప్పుడు ఎన్నో వాయువులు నా పొట్టను చీరి వేశాయి. మంచి నిపుణుడైన కసాయి వాడు లేదా అతని శిష్యుడు పదునైన చాకుతో పొట్టను చీల్చి నట్లు గానే బహుళ వాయువులు నా పొట్టను చీరి వేశాయి.

'అయినా నా శక్తి సడల లేదు. అటువంటి బాధాకర సంవేదనలు నా మనస్సును కదిలించ లేక పోయాయి.

'మళ్లీ నేను ఇలా అనుకొన్నాను: శ్వాసరహిత ఆనంద స్థితిని మళ్లీ సాధిస్తే ఎలా ఉంటుంది! అని.

'నేను అలాగే శ్వాసను మూడు ద్వారాల నుంచి బంధించాను. ఇలా బంధించ గానే, నా శరీరం అంతా భగ భగ మండి పోయింది. ఇద్దరు బలవంతులైన మనుషులు ఒక బలహీనుని పట్టుకొని భగభగమండే నిప్పులలో వేసి కాలిస్తే, ఎలా ఉంటుందో, అలా నా శరీరం వేగి పోయింది.

'అయినా నేను శక్తి హీనుడను కాలేదు. ఆ బాధ నన్ను ఏ మాత్రం ప్రభావితం చేయ లేదు.

'ఈస్థితిలో నన్ను చూసిన దేవతలు ఇలా 'గౌతమ యతి మరణించాడు, అన్నారు. మరి కొందరు ఇలా 'గౌతమయతి ఇంకా మరణించ లేదు. కాని మరణిస్తున్నాడు, అన్నారు. ఇంకొంతమంది ఇలా అన్నారు: 'గౌతముడు మరణించ లేదు. మరణిస్తూను లేడు. అతడు అర్హతుడయ్యాడు[3]. అర్హతుడు ఉండే స్థితి ఇదే.''

**విధానంలో మార్పు - నిరాహార పద్ధతి**

''అప్పుడు నాలో నేను అనుకొన్నాను: 'నేను పూర్తి నిరాహార పద్ధతిని అవలం బిస్తేనో!'

దేవతలు నా దరికి చేరి అన్నారు: 'మహాశయా! పూర్తిగా ఆహారాన్ని మానెయ్యవద్దు. మీరు గనుక నిరాహారాన్ని పాటిస్తే, దివ్య సారాన్ని నీ శరీర రంధ్రాల గుండా ఎక్కిస్తాము. దానితో మీ ప్రాణం నిలుస్తుంది'.

''అప్పుడు నేను అనుకొన్నాను: 'నేను గనుక అన్నపానాలు మాని వేస్తే, ఈ దేవతలు దివ్య రసాన్ని నా శరీరం రంధ్రాల గుండ ఎక్కించి నా ప్రాణం నిలుపుతారు. అది నేను మోసం చేసి నట్లే అవుతుంది'. 'ఆ అవసరం లేదు, అని వారికి చెబుతూ వారి సహాయాన్ని తిరిస్కరించాను.'

''అప్పుడు నాకు ఆలోచన వచ్చింది: 'కొంచెం కొంచెంగా ఆహారం తీసు కొంటేనో! దానితో పాటు కొద్దికొద్దిగా ఏ బఠానీల,మసూరాల, పెసల చారో తీసు కొంటేనో!

''చాల కొద్దిగ ఘన, ద్రవ ఆహారం తీసు కోవడంతో నాదేహం బక్క చిక్కి పోయింది. ఆహారం లేని కారణంగా నల్లేరు, రెల్లు, కణుపులులా, నా దేహంలోని పెద్దచిన్న అస్థిసంధులు తయా రయ్యాయి. ఆహార లేమి వల్ల నా తుంటి, ఒంటె మూపురంలా తయారైంది. పూసల దండలా నా వెన్నెముక బయటికి పొడుచుకు వచ్చి వంగి పోయింది. శిథిలావస్థలో ఉన్న ఇంటి వాసాలు చెల్లా చెదురుగా ఉన్నట్లే నా ప్రక్క టెముకలు నిలవ లేక పోతున్నాయి. లోతైన బావిలో నక్షత్రాలు ఎంతో లోతున కనిపించినట్లు, నా కను గుడ్లు లోపలికి పీక్కు పోయాయి. పచ్చి గుమ్మడి కాయను కోస్తే, ఆ తరవాత ఎండకు గాలికి, ఒడిలిపోయి ఎలా ముడుచుకు పోతుందో, అలాగే నా తల చర్మం తయారైంది.

''నా పొట్ట చర్మాన్ని నేను ముట్టు కోవాలని ప్రయత్నిస్తే, బదులుగా నాకు వెన్నెముక తగులు తోంది. నేను వెన్నెముకను తాకాలని ప్రయత్నిస్తే, పొట్ట చర్మం తగులుతోంది. పరిస్థితి

అలా ఉంది. సరిపోయి నంత ఆహారం లేని కారణాన, నా పొట్ట చర్మం వెన్నెముకకు అంటుకు పోయింది. మల మూత్ర విసర్జనకు వెళ్ళి నప్పుడు, అదే చోట కుప్పకూలి పోతున్నాను. శరీరం తిరిగి పుంజు కోవడానికని నా అవయవాలను మర్దన చేసు కొన్నాను. అలా చేస్తుంటే, కృశించిన నా శరీరం మీది వెంట్రుకలు రాలి పోయాయి. నన్ను చూసిన వారు ఇలా అన్నారు: ''గౌతముడు నల్ల బడి పోయాడు''. మరికొందరు, ''నల్లబడి పోలేదు నీలం రంగుకు తిరిగాడు,'' అన్నారు. ఇంకొందరు, ''నలుపూకాదు, నీలమూకాదు, కపిల వర్ణానికి తిరిగాడు,'' అన్నారు. సరిపోయినంత ఆహారం లేని కారణాన, నా శుద్ధ చర్మ వర్ణం ఆ మేరకు మారి పోయింది.

''అప్పుడు నాకు మరో ఆలోచన వచ్చింది : లోగడ ఏ బ్రాహ్మణుడు గాని, యతిగాని తరుణ, తీవ్ర నిశిత బాధలను అనుభవించా రంటే, వారు ఈ మేరకే అనుభవించారు గాని, నా ఇప్పటి స్థితిని దాటి వారు అనుభవించ లేదు. అయినా దుర్భరమైన, ఈ చేదు, యతి నియమాల ద్వారా నేను ఉన్నతిని పొంద లేదు. మానవ స్థితులను దాటి, అత్యంత జ్ఞానాన్ని, ప్రజ్ఞను పొంద లేదు. బహుశ జ్ఞానోదయానికి వేరొక మార్గం ఉందేమో!''

**మారని ప్రలోభాలు**

సుదీర్ఘమైన అతని కఠోర నియమాలు వ్యర్థమని తేలి పోయింది. వాటి మూలాన అతని విలువైన శక్తి ఉడిగి పోయింది. శారీరకంగా అతడు మానవుడే అయినా, సున్నితంగా పోషించ బడిన అతని శరీరం ఈ ఒత్తిడిని తట్టుకో లేక పోయింది. అతని సుందర రూపం గుర్తు పట్ట లేనంతగా మారి పోయింది. అతని బంగారు రంగు దేహచ్ఛాయ వెలతెల పోయింది. రక్తం ఇంకి పోయింది. స్నాయువులు, కండరాలు ముడతలు పడి పోయాయి. కళ్ళు లోతుకు పోయాయి. చూపు మందగించింది. అతడు అన్నివిధాల ఒక కంకాళం మాత్రమే! అతడు దాదాపు మృత్యు ముఖంలో ఉన్నాడు.

అతడు నెరంజరానదీ ఒడ్డున ఇంకా ఆ పరమాన్ని (ప్రధాన = Padhana) ఆకాంక్షిస్తూ, పరమభద్రతా (నిర్వాణాన్ని) స్థితికోసం సమరం[4] సాగిస్తూ ఉండగా నముచీ[4] ఈ విధంగా అన్నాడు[5].

''మీరు చిక్కారు. రూపం మారి పోయింది. మృత్యువుకు చేరువలో ఉన్నారు.

''మీలోని వేయి భాగాలు మృత్యువు పాలయ్యాయి. ప్రాణం ఒక్కటే మిగిలి ఉంది. అయ్యా ప్రాణం నిలుపుకోండి. (చచ్చి పోవడం కంటే) జీవించడం మంచిది. జీవించే, ఏదైన మంచి సాధించాలి.

''బ్రహ్మచర్యం ద్వారా, అగ్నికి నైవేద్యాలు పెట్టడం ద్వారా మంచిని సాధించవచ్చు. ఈ సమరంతో మీరేమి సాధిస్తారు? ఈ సమరపథం చాల కష్టతరం, కఠినం. సిద్ధి తేలిక కాదు.'' ఈ మాటలు అంటూ మారుడు ఆ ఉన్నతుని ముందు నిలబడ్డాడు.

ఈ విధంగా మాటాడిన మారునికి ఉన్నతుడు సమాధానం చెప్పాడు:

''ఓ దుష్టుడా, ప్రమత్తుల బంధువా, నీవు స్వార్థబుద్ధితో ఇక్కడకు వచ్చావు.

''సద్గుణ లేశం వల్ల గూడ ప్రయోజనం లేదు. నీవు ఈ విధంగా మాట్లాడటం అయోగ్యుల దగ్గర అయితే బాగుటుంది

''శ్రద్ధ ఆత్మనిగ్రహం వీర్య (విరియ), ప్రజ్ఞ (పఞ్ఞ)లు నావి. ఇలాంటి నాకు జీవితాన్ని గురించి ఎందుకు చెబుతావు?

''నదీ ప్రవాహాలను గూడ ఈగాలి ఎండ గడుతుంది. ఈ విధంగా పోరాటం సలిపే నాలోని రక్తం ఎందుకు ఎండి పో కూడదు. రక్తం ఎండి పోయి నప్పుడు, పిత్తరసం, కఫం గూడ ఎండిపోతాయి. నాలోని మాంసం నాశం అవుతున్న కొలది నా మనస్సు ఇంకా ఇంకా స్వచ్ఛ మవుతుంది. ఇంకా ఇంకా నా సతీ (mindfulness), జ్ఞానం, ఏకాగ్రతలు స్థిర పడతాయి.

''నేను ఇలా అత్యంత బాధతో జీవిస్తు నప్పుడు నా మనస్సు లాలసను కోరదు. జీవిలోని శుద్ధతను చూడు!

''కామం నీ ప్రథమ ఆయుధం. రెండోది అరతి అంటే పవిత్ర జీవితం యెడల విముఖత మూడోది ఆకలిదప్పులు[6] (ఖుప్పిపాస) నాలుగోది తృష్ణ (తణ్హ). ఐదోది సోమరితనం, మందత (థీన, మిద్ధ). ఆరోది భీరుత (భీరు). ఏడోది విచికిత్స[7] (శంక). ఎనిమిదోది విచలనం, మొండితనం (మక్ఖ - థంభ). తొమ్మిదోది లాభం, పొగడ్త (శిలోఖ), సత్కారం (సక్కార) చెడ్డమార్గాన ఆర్జించిన కీర్తి (యస). పదోది స్వోత్కర్ష, పరనింద (అత్తుక్క మనన పరవంభన).

''ఓ నముచీ ఇదీ నీ దుష్ట సేనావహం. పిరికి వాడు నీ సేనను జయించ లేడు. కాని జయించిన వాడు సుఖాన్ని పొందుతాడు.

''ఈ ముంజ[8] గడ్డిని నేను ప్రదర్శిస్తాను! ఈ ప్రపంచంలో జీవితానికి ప్రయోజనం ఏమిటి! జీవితంలో ఓటమి పాలై బ్రతకడం కంటె యుద్ధంలో మరణం మేలు!

''కొంత మంది సన్యాసులు, బ్రాహ్మణులు ఈ యుద్ధంలో పాల్గొన్నట్టు లేదు. వారికి ధర్మమార్గం తెలియదు. దానిని వారు అనుసరించరు.

''మారుడు ఏనుగు మీద,-అన్ని వైపుల సైన్యం మోహ రించడం చూసి, సమరానికి సమాయత్తుడ నయ్యాను. ముందుకు నడిచాను. మారుడు నన్ను నా స్థానం నుంచి ఏమాత్రం కదల్చ లేక పోయాడు. నీ మహా సేనా, వాహినిని ఈ ప్రపంచం దేవతలూ అందరూ ఏకమై గూడా జయించ లేక పోవచ్చు. ఒక పచ్చి మట్టి చిప్పను రాతితో బద్దలు కొట్టినట్లు, నా జ్ఞానంతో నీ సేనా వాహినిని నాశం చేస్తాను.

''బాగా కుదురు కొన్న సతీ (mindfulness) తో, ఆలోచనలను నిగ్రహించు కొంటూ, అనేక మంది శిష్యులకు శిక్షణ నిస్తూ దేశదేశాలు తిరుగుతాను.

''వారు శ్రమ, పట్టుదలలతో, నే చెప్పేది పాటిస్తూ, నిన్ను లెక్క చేయ కుండా, ఎక్కడకు వెళితే దుఃఖం కలగదో అక్కడకు వెళతారు.''

**మధ్యేమార్గం**

ఆరోజుల్లో, శరీరాన్ని, శుష్కింప జేసు కొంటేనే కాని ముక్తి లభించదని, సన్యాసానికి సంబంధించిన తాత్వికులు భావించేవారు. కాని గౌతముడు, అనుభవంతో, అటువంటి వాటివల్ల ప్రయోజనం లేదని, వాస్తవానికి అవి ఒకడి బుద్ధిని, పట్టుదలను క్షీణింప జేస్తాయని గ్రహించాడు. ఈ బాధాకరమైన విధానాన్ని వదిలి వేశాడు. అలాగే దీనికి వ్యతిరేకంగా రేండో అంచున ఉన్న, నైతిక ప్రగతికి ఆటంకమైన స్వర్గసుఖాలలో ఓలలాడే విధానాన్ని కూడ వదిలి వేశాడు. ఆ కొస, ఈ కొస కాని మధ్యేమార్గాన్ని ఎన్నుకోవాలనే ఆలోచన చేశాడు. ఈ మధ్యమ మార్గం తరవాత, తరవాత, అతని బోధకు ముఖ్య లక్షణమైంది.

ఆనాడు తన తండ్రి ఏరువాకలో నాగలి దున్నుతున్న సమయంలో, తాను వెలగ చెట్టు చల్లని నీడలో, వ్యస్తపాదుడై తన శ్వాసపై తాను కేంద్రీకరించి నప్పుడు, సాధించిన ఝానాన్ని (పరమానందం = ecstasy లేదా attainment సిద్ధి) ఒకసారి గుర్తు చేసుకొని, ఇలా అనుకొన్నాడు. ''మంచిది, జ్ఞానోదయానికి ఇదేమార్గం.''

అలా శుష్కించిన దేహంతో, జ్ఞానోదయం సాధ్యం కాదని అతడు గుర్తించాడు. ఆధ్యాత్మిక ప్రగతికి దేహ దారుఢ్యం ముఖ్యం. అందుకని అతడు మితంగా శరీరాన్ని పోషించాలను కొని, ఘన, ద్రవ అహార పదార్థలను తీసు కోవటం మొదలు పెట్టాడు.

అతను ఏదో సాధిస్తాడు, సాధించింది తమకు చెబుతాడని ఎదురు చూసిన అతని శిష్యులు, అతడు తన విధానాన్ని మార్చుకోవడంతో, నిరాశ చెంది, అతనిని, ఆప్రదేశాన్ని విడిచి, ఇసి పట్టణానికి వెళ్ళి, అక్కడి వారందరికి, ''గౌతముడు విలాస జీవితాన్ని గడుపు తున్నాడు, తపో సమరాన్ని విడ నాడి, సుఖ జీవితాన్ని స్వీకరించాడు,'' అని చెప్పారు.

సహాయం అవసరమైన ఆ సంకట సమయంలో అతనిని ఒంటరి వానిని చేసి, వదిలి పెట్టి పోయారు. అయినా అతడు నిరాశ చెంద లేదు. ఆ మహా సమరంలో వారి సాన్నిధ్యం సహాయ కారియే అయినా. వారి ఐచ్ఛిక ఎడబాటు అతనికి ప్రయోజన కారియే అయింది. ఏకాంతంగా, అరణ్యాలలో, ఒంటరి తనంలో, గొప్పవాళ్ళు నిగూఢ సత్యాలను కనుగొన్నారు, రహస్యమైన సమస్యలను కూడా ఛేదించారు.

**సత్యోదయం**

కొంత ఘన ఆహారంతో, పోయిన బలాన్ని పుంజు కొన్నాడు. అతడు చిన్నతనంలో సాధించిన ఝానానికి తేలికగానే మెరుగు పెట్టాడు. క్రమక్రమంగా రెండు, మూడు, నాలుగు ఝానాలను గూడ అతడు సాధించాడు.

ఝానాల సాధనతో మనస్సును పరిపూర్ణ ఏకాగ్రతతో నిలప గలుగు తున్నాడు. ప్రతి వస్తువును దాని వాస్తవాకృతిలో ప్రతిబింబించే తుడిచిన అద్దంలా, అతని మనస్సు ఇప్పుడు ఉంది. ఈ విధంగా అతని మనస్సు ప్రశాంత మైంది. పరిశుద్ధ మైంది. నిర్మల మైంది. లాలస, మురికి నుంచి స్వేచ్ఛ పొందింది. నమ్యమైంది; దృఢమైంది; స్థిరమైంది; అకంపిత మైంది. అప్పుడు పూర్వ జన్మల స్మృతుల (పుబ్బె-నివాసానుస్సతి నన) కు సంబంధించిన జ్ఞానం మీదికి మనస్సును మరలించాడు. గత జన్మలలోని తన వివిధ భాగ దేయాలను గుర్తు తెచ్చు కొన్నాడు: ''మొదట ఒక జీవితం, తరువాత రెండు జీవితాలు, ఆతరువాత మూడు, నాలుగు, ఐదు, పది, ఇరవై' ఏభై జీవితాల వరకు; ఆ తరవాత వంద, వేయి, వందవేలు, ఆ తరువాత అనేక విశ్వ ఆవృతుల (చక్రాల) వలయాన్ని ఆ తరవాత అనేక విశ్వ అవృతుల లయ, పరిణామాలను గుర్తు తెచ్చు కొన్నాడు. ఆ చక్రంలో అప్పట్లో తాను పలాన, తన పేరు పలాన, తన కుటుంబం పలాన, తాను పలాన ఆహారం తినే వాడు, తాను పలాన సుఖదుఃఖాలను అనుభవించాడు, తన అంతం పలాన విధంగా జరిగింది, మళ్లీ అక్కడ బయలుదేరి తాను మరోచోట జన్మించాడు. ఈ జన్మలో తన పేరు పలాన, కుటుంబం పలాన, కులం పలాన, అనుభవించిన సుఖ దుఃఖాలు పలాన, పలాన విధంగా తన అంతం జరిగింది. అక్కడ నుంచి బయలుదేరి ఇక్కడ జన్మించాడు''.

ఈ విధంగా తన గతజన్మలలోని వివిధ భాగదేయాల వివరాలను గుర్తుకు తెచ్చుకొన్నాడు.

రాత్రి మొదటి జాగరణలో అతడు వాస్తవంగా సాధించిన జ్ఞానం ఇది.

గతానికి సంబంధించిన అజ్ఞానాన్ని ఈవిధంగా పారదోలి, అతని పరిశుద్ధ మనస్సును జీవుల భవాభావాలపై (అంతరించడం, తిరిగి ఆవిర్భ వించడం; చుతూపపాత ఞాన) సారించాడు. విమల, అతిమానవ జ్ఞాన (యోగ) దృష్టితో, జీవులంతా ఒక అస్తిత్వం నుంచి

మరో అస్తిత్వానికి మాగణాన్ని పరికించాడు. ఉచ్చ, నీచ జీవులు, అంద, అందవిహీన, సుఖులు, దుఃఖులు- అంతా వారివారి కర్మల ననుసరించి గతిస్తున్నారని తెలుసు కొన్నాడు. వారి చెడ్డ పనులు, మాటలు, ఆలోచనలు కారణంగా, మంచి వారిని దూషించిన కారణంగా, తప్పుడు నమ్మకాల కారణంగా, వారి శరీరాలు లుప్తమైన తరవాత, మరణించిన తరవాత, ఈ వ్యక్తులు దుఃఖ భాగులై జన్మిస్తారని గ్రహించాడు. ఈ వ్యక్తులు మంచి పనులు, మాటలు, ఆలోచనల కారణంగా, మంచి వాళ్ళని దూషించని కారణంగా, మంచి నమ్మకాల కారణంగా, వారి శరీరాలు నశించిన తరవాత, మరణించిన తరవాత, సుఖకరమైన దివ్యలోకాల్లో జన్మిస్తారని తెలుసుకొన్నాడు.

ఈ విధంగా అతడు తన యోగ అతి మానవ దృష్టితో జీవుల భవాభవాలను చూశాడు.

ఇది నిజంగా అతడు రాత్రి మధ్య జాగరణంలో సాధించిన రెండో జ్ఞానం.

భావికి సంబంధించిన అజ్ఞానాన్ని ఈ విధంగా పరిహరించిన అతడు, తన విమల మనస్సును మలినాల' (ఆసవాల) పరిచ్ఛేదం వైపుకు మళ్ళించాడు, (ఆసవఖ్య్య ఞాన).

వాస్తవ విషయానుగుణంగా అతడు గుర్తించాడు: ''ఇది దుఃఖం. ఇది దుఃఖం కలగడం; ఇది దుఃఖ నివృత్తి; ఇది దుఃఖ నివృత్తి మార్గం.'' అలాగే వాస్తవ విషయాను గుణంగా అతడు గుర్తించాడు: ''ఇవి మలినాలు (ఆసవాలు). ఇది మలినాలు పట్టడం; ఇది మలినాల నివారణం; ఇది మలినాల నిరోధానికి దారి తీసే మార్గం.'' ఈ గుర్తింపుతో, ఈ గ్రహింపుతో, అతని మనస్సు విషయ వాంఛా మలినం నుంచి, అస్తిత్వ తృష్ణ మలినం నుంచి, అవిద్యా మలినం నుంచి విముక్తమైంది.

విముక్తుడు కావడంతో, అతడు తెలుసుకొన్నాడు: ''నేను ముక్తుడనయ్యాను''. అతనికి జ్ఞానోదయం అయింది. ''పునర్జన్మ అంతమైంది; పవిత్ర జీవితం సిద్ధించింది, చేయవలసింది చేశాను. ఇక ఈ స్థితి సంబంధమైంది ఇంకా ఏమీలేదు.''

రాత్రి చివరి జాగరణలో అతడు ఆర్జించిన మూడోజ్ఞానం ఇది.

అజ్ఞానం అంతరించింది. జ్ఞానోదయం అయింది., చీకటి తొలగి పోయింది. వెలుతురు వచ్చింది.

**పాదసూచికలు**

1. మజ్ఝిమనికాయ, 1,26 అరియపరయేసన సుత్త, P. 167
2. మజ్ఝిమనికాయ, 1,36, P. 242 ff.

3 అర్హంత్ బౌద్ధ పదం. దాదాపుగ ఇది ఋషికి సమానం. తరచు అలాగే అనూదిత మవుతుంది. శబ్దార్థం ప్రకారం 'అర్హుడైన వాడు.' దీని నుంచి పుట్టిన క్రియ అర్హం, అవశ్యం, అనే అర్థంలో లేదా 'తగిన' అర్థంలో వాడ బడుతుంది.

4. మారుని మరో పేరు. గ్రంథాల ప్రకారం ఐదురకాల మారులు ఉన్నారు వారు 1) మార దేవుడు (దెవపుత్త) 2) వాంఛ (కిలెశ) 3) కర్మ సంబంధకార్యాలు (అభిసంఖార) (4) స్కంధాలు (కంధ) 5) మృత్యువు (మచ్చు)

5. సుత్తనిపాత, 3,2, పధాన సుత్త, 74 పేజీ నుంచి.

6. ఐచ్ఛిక పేదరికం నుంచి జనించిన

7. అంటే, లక్ష్య నిశ్చయతకు సంబంధించిన ఊగిసలాట.

8. తాము యుద్ధ రంగం నుంచి వెనకడుగు వేయమని తెలియ జేయ డానికి సైనికులు ముంజగడ్డి కిరీటాలను తమ తలలపై లేదా తమ జెండాల మీద ధరిస్తారు.

9. ఆసవాలు (మలినాలు) అంటే అస్తిత్వ దశలకు సంబంధించి అన్నింటి కంటె ఉపరితల భూమిక వరకు, మన: ప్రవాహం దృష్ట్యా గోత్ర భూ స్థితి దాక ప్రవహించేవి. నాలుగు ఆసవాలు ఉన్నాయి: ఇంద్రియ వాంఛలు (కామ), భవ (becoming) దృష్టి (దిత్త= false view), అవిద్య (అవిజ్జ). ఈ ప్రత్యేక గ్రంథంలో మూడింటిని మాత్రమే పేర్కొన్నారు. ఇక్కడ 'భవ' అంటే రూప, అరూప లోకాల్లో పుట్టాలనే వాంఛ.

మూడో ప్రకరణం

# బుద్ధత్వం

''తధాగతులు బోధకులు మాత్రమే''

- ధమ్మపద, V, 276

**బుద్ధుని విశిష్ట లక్షణాలు**

ఆరేళ్ళగ అద్భుతమైన పోరాటం సాగించిన తరవాత, తన ముప్పై ఐదోయేట సన్యాసి గౌతముడు, ఎవరి సహాయం లేకుండా, ఏ అతి ప్రాకృతిక శక్తుల మార్గనిర్దేశకత్వం లేకుండా, కేవలం తన ప్రయత్నమూ, జ్ఞానం మీదనే ఆధారపడి, మలినాల నన్నింటిని పెకలించి వేశాడు. గ్రహణ ప్రక్రియను అంత మొందించాడు. వస్తువులను, విషయాలను యధాతధంగా - తన ప్రజ్ఞతో - ఎరిగి బుద్ధుడయ్యాడు. జ్ఞాని, జాగృతుడు అయ్యాడు. ఇక అప్పట్నించి అతని గౌతమ బుద్ధుడు[1] అని పిలిచారు. భూత భవిష్యత్ బుద్ధుల వరుసలో అతడు ఒకడు.

అతడు పుట్టుకతోనే బుద్ధుడు కాలేదు. స్వయం కృషితో బుద్ధు డయ్యాడు.

'బుద్ధ' అనే పాళి పదం 'బుధ్' అనే క్రియా ధాతువునుంచి వచ్చింది. దీనికి అర్థం ''అవగాహన చేసు కొనుట'' ''మేల్కొనుట'' అని.

అతడు నాలుగు ఆర్య సత్యాలను పూర్తిగా అవగాహన చేసు కొన్నాడు గనుక, అవిద్యా నిద్ర నుంచి మేల్కొన్నాడు కనుక, అతనిని బుద్ధుడని పిలిచారు. అతడు కేవలం వాటిని అర్థం చేసు కోవడమే కాక, ధమ్మ విశ్లేషణ చేసి ఇతరులకూ జ్ఞానోదయం చేశాడు. అతనిని ''సమ్మ సంబుద్ధ'' అంటే పూర్తి జ్ఞానోదయమైన వాడు అని పిలిచారు. ఇలా ఇతనిని పిలవ డానికి కారణం, ఇతర బుద్ధులు కేవలం ధమ్మాన్ని మాత్రమే అర్థం చేసు కొన్నారు. కాని ఇతరులకు జ్ఞానోదయం కలిగించలేకపోవటం.

జ్ఞానోదయానికి పూర్వం అతనిని బోధిసత్త్వుడు[2] అన్నారు. దీనికి అర్థం బుద్ధత్వాన్ని ఆకాంక్షించే వాడు అని.

బుద్ధత్వాన్ని ఆశించే ప్రతి ఒక్కరు బోధి సత్త్వ దశను దాట వలసిందే. ఈ దశలో, ఔదార్యం, సంయమనం, పరిత్యాగం, జ్ఞానం, వీర్యం, సహనం, నిజాయితీ, నిశ్చయం, దాతృత్వం, పూర్ణ ఉపేక్ష - లక్షణాలను తీవ్రంగా కృషి చేసి తనలో వికసింప జేసు కోవాలి.

ఒక ప్రత్యేక శకంలో ఒకే ఒక్క 'సమ్మాసంబుద్ధుడు' మాత్రమే ఉద్భవిస్తాడు. కొన్ని మొక్కలు, చెట్లు ఒక్కొక్క పూవును పూసినట్లే, విశ్వ వ్యవస్థ గూడ ఒకే ఒక సమ్మా సంబుద్ధుని అనుమతిస్తుంది.

బుద్ధుడు ఒక అనన్య వ్యక్తి. అటు వంటి వ్యక్తి ఈ ప్రపంచంలో చాల అరుదుగా జన్మిస్తాడు. ఈ ప్రపంచం మీది అనుకంపతో, దేవతల, మానవుల క్షేమం కోసం, సుఖ సంతోషాల కోసం జన్మిస్తాడు. బుద్ధుని ''అచ్చరియ మనుస్స'' (ఆశ్చర్యకరమైన మనిషి) అంటారు. ఎందుకంటే ఆయన అద్భుతమైన వాడు. అతన్ని ''అమతస్సదాతా'' అంటారు. ఎందుకంటె అతడు చావులేకుండా చేస్తాడు. అతనిని ''వరదో'' అంటారు. ఎందుకంటె అతడు నిర్మల ప్రేమను, గూఢ జ్ఞానాన్ని,పరమ సత్యాన్ని అందిస్తాడు. అతన్ని ''ధమ్మస్సామి'' అంటారు. ఎందుకంటే అతడు ధర్మదేవత గాబట్టి.

బుద్ధుడే చెప్పినట్లుగా, ''అతడు సిద్ధుడు (తథాగతుడు) అర్హుడు. (అర్హమ్), పూర్తి జ్ఞానోదయమైన వాడు (సమ్మా సంబుద్ధ) రూపొందని మార్గాన్ని సృష్టించినవాడు, ఉత్పాదితం కాని మార్గాన్ని ఉత్పాదించిన వాడు, అప్రకటిత పథాన్ని ప్రకటించిన వాడు, బాట తెలిసిన వాడు, బాటను దర్శించినవాడు,మార్గాన్ని గ్రహించిన వాడు.[3]''

బుద్ధుని జ్ఞానోదయంలో ఏ గురువు లేడు. ఆయన మాటల్లో ''నమి ఆచరియె అత్థి[4]'' (''నాకే గురువూ లేడు'') ఈ లోక సంబంధిత జ్ఞానాన్ని ఆయన మామూలు గురువుల[5] నుంచి గ్రహించాడు. ఈ ప్రపంచాతీత జ్ఞానాన్ని ఏ గురువు నుంచీ పొంద లేదు. కేవలం తన ప్రజ్ఞ ద్వారా మాత్రమే తెలుసుకొన్నాడు.

అతడే గనుక మరో ఆచార్యుని నుంచి జ్ఞానాన్ని ఆర్జించి నట్లైతే లేదా తాను ఏమతంలో అయితే పుట్టి పెరిగాడో, అలాంటి హిందూమతం లాంటి వేరే మత వ్యవస్థనుంచి జ్ఞానాన్ని పొంది నట్లైతే, తనను గురించి, అతడు తానొక అసదృశ ఆచార్యుడనని చెప్పుకొని ఉండే వాడు కాదు. (అహమ్ సత్థా అనుత్తరో)[6]. అతడు తన మొదటి ఉపన్యాసంలో, అంతకు ముందు వినని విషయాల మీద, వెలుగు ప్రసరించిందని ప్రకటించాడు.

పరిత్యాగం చేసిన మొదటి దినాలలో నాటి విశిష్ట మతాచార్యుల సలహాలను ఆర్థించాడు. కాని తాను కోరింది వారి బోధలలో ఆయనకు లభించ లేదు. తన్నకై తాను ఆలోచించి, సత్యాన్ని కనుక్కోవలసిందిగా పరిస్థితులు అతనిని ఒత్తిడి చేశాయి. సత్యాన్ని తన లోనే దర్శించాడు. ఆలోచన లోతుల్లో మునకలు వేశాడు.అంతకు ముందు తాను వినని, కనని పరమ సత్యాన్ని గుర్తించాడు.అతని అంతరంగం నుంచే ప్రభాస ప్రభవించింది. అది అతడంతకు ముందు ఎరుగని విషయాలపై వెలుగును ప్రసరించింది.

అతడు తెలియవలసిందంతా తెలుసు కొన్నాడు కనుక, జ్ఞాన కీలకాన్ని సాధించాడు. కనుక, అతనిని సర్వజ్ఞాని (సబ్బఞ్ఞు) అన్నారు. ఈ అతీత జ్ఞానాన్ని అతడు తన అసంఖ్యాక జన్మ శ్రేణులలో చేసిన ప్రయత్నాల వల్ల సాధించాడు.

**బుద్ధుడు ఎవరు?**

ఒకసారి దొన అనే బ్రాహ్మణుడు బుద్ధుని అడుగు (పాదముద్ర)ల విశిష్ట లక్షణాలను గమనించి, ఆయన దరి చేరి, ఈ విధంగా ప్రశ్నించాడు:

''అయ్యా, మీరు దేవతలా[7]?''

''లేదు, నిజంగా నేను దేవుణ్ణి కాను,'' బుద్ధుడు సమాధానం చెప్పాడు.

''అయితే మీరు గంధర్వులా (గంధబ్బ)?[8]''

''కాదు, బ్రాహ్మణా, నేను గంధర్వుడను కాను''.

''అయితే మీరు యక్షులా?[9]''

''కాదు, బ్రాహ్మణా, కాదు.''

''అయితే మీరు మానవులన్న మాట ?''

''లేదు, బ్రాహ్మణా, నేను మానవుణ్ణి కాదు''

''అయితే మీరెవరో తెలపాలని ప్రార్థిస్తున్నాను?''

తాను దేవ, యక్ష, గంధర్వ, మానవ జన్మలను నిర్ధారించే మలినాలను తుడిచి వేశానని చెప్పి, బుద్ధుడు ఇంకా ఇలా అన్నాడు:

''సోయగాల నీనే పద్మం
నీటితో మైల పడి పోదు.
నేను ఈ ప్రపంచం వల్ల మలినమై పోను.
అందుకని బ్రాహ్మణా, నేను బుద్ధుడను.''[10]

దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి, ధర్మ సంస్థాపనార్థం మళ్లీ, మళ్లీ అవతరిస్తానని చెప్పిన భగవద్గీత[11]లోని విష్ణువు అవతారాన్ని తానని ఎన్నడూ బుద్ధుడు చెప్పుకో లేదు.

బుద్ధుని ప్రకారం దేవతలు ఎంతోమంది. జీవులలో వారొక తరగతి. వారికీ జనన మరణాలు తప్పవు.మానవ రూపాన్ని వాహకంగా చేసుకొని, అనేక కాలాల్లో భూమి మీద అవతరించే, మానవుల కర్మను నియంత్రించే, దివ్యశక్తిని కలిగి ఉన్న పరమ దేవుడంటూ ఒకడు లేడు[12].

తన విముక్తి ద్వారా, స్వేచ్ఛగా ఇతరులకు రక్షకుడ నవుతానని బుద్ధుడు ఎప్పుడూ చెప్పుకో లేదు. మలినాలు, పరి శుద్ధతలకు ఎవరికి వారే బాధ్యులు కనుక, ముక్తి కోసం ఎవరికి వారు తమపైతాము ఆధారపడాలని బుద్ధుడు హెచ్చరిస్తాడు ఏ ఒక్కడూ రెండో వానిని పరిశుద్ధమూ చేయలేడు, మలినమూ చేయలేడు[13] తనకూ తన అను చరులకు మధ్య ఉన్న సంబంధాన్ని వివరిస్తూ వ్యక్తిక స్వావలంబనాన్ని, ప్రయత్నాన్నినొక్కి చెబుతూ బుద్ధుడు ఇలా అన్నాడు:

''మీమీ ప్రయత్నాలు మీరు చేసు కోవలసిందే. తథాగతులు కేవలం బోధకులు మాత్రమే.[14]''

బుద్ధుడు, తాను ఏ మార్గాన, ఏ పద్ధతిలో మరణ, దుఃఖాలనుంచి విముక్తమైందీ, పరమ లక్ష్యాన్ని సాధించిందీ, మాత్రమే సూచిస్తాడు. ఇహ ఆ తరవాత, దుఃఖమయ జీవితం నుంచి బయట పడడానికి, ఆ మార్గం అనుసరించాలా? వద్దా? అనే విషయం అనుచరుడే నిర్ణయించు కోవాలి.

''ముక్తి కోసం ఇతరుల మీద ఆధార పడడం మంచిది కాదు. కాని తనమీద తాను ఆధారపడడం మంచిది.'' ఇతరుల మీద ఆధారపడడం అంటే తమ ప్రయత్నం నుంచి తప్పు కోవడమే.

''మీకు మీరే ద్వీపాలు కండి. మీకు మీరే ఆధారం. మరొకరిని ఆశ్రయించ కండి.''[15]

బుద్ధుడు తన చివరి రోజుల్లో చెప్పిన ఈ మాటలు చాల విలువైనవి. ఉత్తేజకమైనవి. తన లక్ష్య సాధనలో స్వప్రయత్నం ఎంత ముఖ్యమో, రక్షకుల ద్వారా ముక్తిని పొందాలని ప్రయత్నించడం ఎంత నిరర్థకమో, అల్పమో, అవి తెలియ జేస్తాయి. అర్థ రహితమైన యజ్ఞాల ద్వారా, నిష్ఫల ప్రార్థనల ద్వారా, ఊహాజనిత దేవతలను మెప్పించి, అనంతర జీవితంలో భ్రమైక సుఖంకోసం అర్రులు చాచడం ఎంత అర్థరహితం!

బుద్ధుడు మానవ మాత్రుడు. మానవుడుగా పుట్టాడు, జీవించాడు. బుద్ధుడుగానే అతని జీవితం అంతమైంది. మానవుడే అయినప్పటికీ, తన విశిష్ట లక్షణాల మూలంగా ఒక అసాధారణ మానవు డయ్యాడు. ఈ ముఖ్యమైన విషయాన్నే బుద్ధుడు నొక్కి చెప్పాడు. తాను అమరుడనే తప్పుడు ఆలోచన ఎవరికీ రాకుండా స్పష్టం చేశాడు. అతనిని గురించి అందరూ అంటూ ఉంటారు: ''దేవుడు లేడని చెప్పే అంతటి మతప్రవక్త మరొకడు లేడు. అయినా అంతటి దైవ సదృశుడూ మరొకడు లేడు.''[16] ఒకటి మాత్రం నిజం. బుద్ధుని, అతని కాలంలో, అతని అనుయాయులు ఎంతగానో గౌరవించారు. అయినా అత డెప్పుడూ తనకు దివ్యత్వం ఉందని గొప్పలకు పో లేదు.

**బుద్ధుని గొప్పతనం**

మనిషై పుట్టి మనిషిగానే జీవితం సాగించి, స్వప్రయత్నంతో బుద్ధత్వమనే పరమ పూర్ణ స్థితిని పొందాడు. ఆ జ్ఞానాన్ని తనలోనే దాచుకోక, మానవ మనస్సులో గుప్త సంభావ్యతలను, అజేయమైన శక్తిని ప్రపంచానికి చాటాడు. కంటికి కనిపించని దేవుణ్ణి మానవుని తలకెత్తి, మానవుని దిగువ స్థానంలో నిలప కుండ, అటువంటి దివ్య శక్తికి హీనుణ్ణి చేయకుండ, మానవుడు ఎలా తన స్వప్రయత్నంతో అత్యంత ఉన్నత జ్ఞానాన్ని సాధించవచ్చో బుద్ధుడు నిరూపించాడు. ఈ విధంగా అతడు మానవుని విలువను పెంచాడు. పూజారుల మీద, బాహ్య దేవతల మీద ఆధారపడ కుండా, దుఃఖమయ జీవితాన్నుంచి బయట పడి, శాశ్వత నిర్వాణానందాన్ని ఎలా సాధించ వచ్చో ఆయన చెప్పాడు. అహం కేంద్రకమైన ప్రపంచానికి, అధికారం కోసం అర్రులు చాచే ప్రపంచానికి, స్వార్థ రహిత సేవా ధర్మాన్ని ప్రబోధించాడు. వర్ణ వ్యవస్థకు ఎదురు తిరిగి, అది మానవాళి ప్రగతికి ఆటంకమని చెప్పాడు. అందరికీ సమానావకాశాలు ఉండా లన్నాడు. అతడు పాపి అయినా, పుణ్యాత్ముడైనా, అల్పుడైనా, గొప్పవాడైనా, చిన్నవాడైనా, పెద్దవాడైనా, జీవితంలో ఒక పుటను తిప్పి, పరిపూర్ణతను ఆకాంక్షిస్తే, అతనికి మోక్ష ద్వారాలు తెరిచే ఉంటాయని బుద్ధుడు ప్రకటించాడు. అతడు అధోగతిలో ఉన్న స్త్రీ స్థాయిని మెరుగు పరిచాడు. అంతేకాదు. సమాజానికి, వారి ఉపయోగమేమిటో వారు తెలుసు కొనేట్టు చేశాడు. ఇంకా వారి కోసం ఒక ధమ్మ సంఘాన్ని స్థాపించాడు[17]. ప్రపంచంలోనే మొదటి సారిగ బానిస తనాన్ని రూపు మాప ప్రయత్నించాడు. జంతు బలులు కూడదన్నాడు. జంతువులను ప్రేమ కరుణల పరిధిలోకి తెచ్చాడు. తన అనుయాయులు తనకు గాని, తన బోధలకు గాని బానిసలు కానవసరం లే దన్నాడు. వారికి ఆలోచించు కొనే స్వేచ్ఛను ఇచ్చాడు. తాను చెప్పే విషయాలను, తనమీది గౌరవంతో కాక, బంగారాన్ని సానబట్టి, పుటం బెట్టి, గీటు రాయి మీద గీసి ఎలా పరీక్షిస్తారో, అలా పరీక్షించిన తరవాతనే ''బుద్ధిమంతులను అంగీకరించ వలసిందని కోరాడు.'' సంతాన వియోగంతో బాధితు లైన ఇద్దరు తల్లులను - పటాచారా, కిసా గౌతమి లను- తన చల్లని మాటలతో ఓదార్చాడు. కుష్ఠురోగి, తిస్సథేరలాంటి పరిత్యక్త రోగులకు స్వయంగా ఉపచారాలు చేశాడు. పేదలకు సహాయం చేశాడు. పరిత్యక్తలైన రజ్జుమాల, సొపక లను అకాల మృత్యువాత పడకుండ రక్షించాడు. అంగులిమాల లాంటి నేరస్తుని, అంబపాలి (అమ్రపాలి) లాంటి వేశ్యను అతడు మార్చి వేశాడు. బలహీనులను ప్రోత్సహించాడు. చీలిపోయిన వారిని కలిపాడు. అజ్ఞానులకు జ్ఞానం అందించాడు. మార్మికులకు స్పష్టతను అందించాడు. విమోహితులకు మార్గనిర్దేశం చేశాడు; పతితులను లేవ నెత్తాడు; కులీనుల ప్రతిష్ఠను ఇనుమడింప జేశాడు.

ఉన్నవాడు, లేనివాడు, పాపి, పుణ్యవంతుడు, నేరస్తుడు – ఒకరేమిటి – అందరూ ఆయన్ను ప్రేమించారు. అందరి ఆశంసలకు అతడు ఆదర్శ మయ్యాడు బోధకు లందరిలోకి అతడే సమా శీలి, కరుణామయుడు.

అతని సంకల్పం, అనుకంప, సేవ, పరిత్యాగం, పరిపూర్ణ పరిశుద్ధత, ఆదర్శప్రాయమైన వ్యక్తిగత జీవితం, అతని అంతిమ విజయాన్ని, ధమ్మ ప్రబోధానికి ఉపయోగించిన దోష రహిత విధానాలు – ఇవన్నీ కలిసి, ప్రపంచంలో ఐదోవంతు జనాభా చేత, బుద్ధుణ్ణి ఈ భూమి మీద పుట్టిన మత బోధకుల్లోకెల్ల అత్యుత్తమమైన బోధకునిగా గుర్తించేట్టు చేశాయి.

బుద్ధుణ్ణి శ్లాఘిస్తూ రాధాకృష్ణన్ ఇలా రాశాడు:

''ప్రాచ్యదేశాల నుంచి వచ్చిన వారిలో గౌతమబుద్ధుడు మహా మేధావి. మానవ జాతి ఆలోచనను, జీవితాన్ని అత్యంతంగా ప్రభావితం చేసిన వారిలో ఆయనకు ఆయనే సాటి. ఒక ధర్మ సంప్రదాయాన్ని నెలకొలపడంలో అతడు అందరికీ పవిత్రుడయ్యాడు. ఆ ధమ్మ ప్రభావమూ, విస్తృతీ, ఏ ఇతర ధర్మం కంటె తక్కువవి కావు. అతడు విశ్వచింతన చరిత్రకు చెందిన వాడు. సంస్కారవంతులైన మానవు లందరికీ వారసుడు ఆయన. అతని బౌద్ధిక ఐక్యత, ధార్మిక అభినివేశ, అంతర్దృష్టిలను బట్టి చూస్తే. నిస్సందేహంగా అతడు ప్రపంచ చారిత్రక పురుషులకే మహామహుడు.''[18]

''చరిత్రలోకే ముగ్గురు మహామహులు[19]'', అనే గ్రంథంలో హెచ్.జి. వెల్స్ అంటాడు:

''మనం బుద్ధునిలో వెలుతురు (జ్ఞానం)ను అన్వేషించే, ఒక సుస్పష్ట మానవ మూర్తిని, ఒక సరళ ధార్మిక నిష్ఠాగరిష్ఠుని, ఒక మానవుని చూస్తాము. అతడూ మానవాళికి ఒక సందేశాన్ని ఇచ్చాడు. అది సార్వజనీనమైంది. మన అత్యంత మంచి ఆధునిక భావాలకు అవి చాల వరకు చాల దగ్గరగా ఉన్నాయి. మన జీవన అసంతృప్తులు, కష్టాలు, అన్నీగూడ మన స్వార్థం కారణంగానే వచ్చాయని ఆయన చెప్పాడు. ఒకడు ప్రశాంత చిత్తుడు కావాలంటే ముందుగా, తనకోసం, తన ఐంద్రియక సుఖాల కోసం, జీవించడం మానేయాలి. అప్పుడతడు ఒక బృహదస్తిత్వంలో సంలీన మవుతాడు. క్రీస్తుకు 500 సంవత్సరాలకు ముందే, బౌద్ధం వేరే భాషలో, మనుషులను అనవధానాని (forget fulness)కి ఆహ్వానించింది. ఒకరకంగా చెప్పాలంటే, మనకూ, మన కార్యకలాపాలకు అతడు చాల దగ్గరగా వస్తాడు. క్రీస్తు కంటె గూడ అతడు సేవలో వ్యక్తి ప్రాముఖ్యాన్ని స్పష్టంగాను, వ్యక్తి అమరుడుగా ఉండాలన్న విషయాన్ని తక్కువ అస్పష్టంగాను దర్శించాడు.''

''ఈ ప్రపంచంలో పుట్టిన అందరిలోకి అతడు అత్యంతంగా గొప్పవాడు,'' అని టాగోర్ చెప్పాడు.

బుద్ధుణ్ణి పొగడుతూ, డెన్మార్క్ పండితుడు ఫాస్ బాల్ (Fausball), ''నేను అతన్ని తెలుసుకొన్న కొలది, అతని మీద నాకు ప్రేమ పెరిగింది,'' అని అన్నాడు.

ఒక వినీతుడైన బుద్ధుని అనుచరుడు అంటాడు: ''నేను అతన్ని అర్థం చేసు కొన్న కొలదీ అతన్ని ప్రేమిస్తాను. అతన్ని ప్రేమించిన కొలదీ అతన్ని తెలుసు కొంటాను.''

**పాదసూచికలు :**

1. అతని శిష్యులు అతనిని బుద్ధుడనీ, భగవానుడనీ, సుగతుడనీ పిలవగా, విదేశీ అనుచరులు ఆయుష్మ భో గౌతముడని, సమణ గౌతముడని, పిలిచారు. తనను గురించి తాను చెప్పు కొనే టప్పుడు అతడు ఉపయోగించిన పదం ''తథాగతుడు''. దీనికి అర్థం '' ఈవిధంగా వచ్చిన వాడు'' లేదా '' ఈవిధంగా వెళ్ళినవాడు.''
2. సంస్కృతం-బోధి సత్త్వుడు (తరువాతి మహాయాన సంప్రదాయాలు ఈ పదానికి అర్థాన్ని పెంచి, ప్రత్యేకార్థంలో వాడారు.)
3. సంయుత్త నికాయ, 111, 58, p. 66; Kindred Sayings, 111, P, 58.
4. మజ్ఞిమ నికాయ, 1,26, అరియ పరియెసన సుత్త, P. 171.
5. కొండణ్ణ, అలారకాలామ, ఉద్దక రామపుత్త, మొదలైన వారు.
6. మజ్ఞిమ నికాయ 1, 26, అరియ పరియెసన సుత్త, P. 171.
7. స్వర్గ భూమికలలో ఉండే అంతరిక్ష జీవి.
8. స్వర్గ సంగీతకారుడు
9. ఒక పిశాచం
10. అంగుత్తర నికాయ, 11,6, P. 39, Gradual Sayings 11, P. 44 - 45.
11. పద్యం - 4, 8.
12. అసంఖ్యాకంగా పెరుగుతున్న బౌద్ధం అనుచరులను హిందూత్వ పరిధి లోకి తేవడానికి, హిందూ ప్రబోధకులు, అక్రమంగా బుద్ధుణ్ణి దివ్య అవతారం చేశారు. ఈ భావాన్ని బుద్ధుడు నాడే తోసి వేశాడు.
13. ధమ్మ పద, V. 165.
14. ధమ్మపద, V. 276.
15. దీఘ నికాయ, 11, 3, మహాపరి నిబ్బాణ సుత్త, P. 100
16. డ్వైట్ గొడార్డ్, బౌద్ధ బైబిల్, బోస్టన్, బీకన్ ప్రెస్, 1970, P. 20.
17. తొలి రోజుల్లోనే శ్వేతాంబర జైనులు, బౌద్ధులు విధించిన నియమాలను విధించకుండానే స్త్రీలను

చేర్చుకొన్నారు. See *"On the Jaina Doctrine of Stri-mukti"*. P.S. Jaini, Paper delivered at the 188th meeting of American Oriental Society, Toranto, Canada 1978.

18. .*"Gautama the Buddha"* Proceedings of the British Academy. Vol. XXIV; rpt. 2nd edition, Bombay: Hind Kitabs, 1946.

19. ఈ శీర్షిక హెచ్. జి. వెల్స్‌లో లేదు. A comprehensive Bibiliography, 3rd. Edn Middlesex, England:H.G. Wells Society, 1972, Ed.

నాలుగో ప్రకరణం

# జ్ఞానోదయం అయిన తరువాత

*''ఈ ప్రపంచంలో రాగ రహితమే సుఖం.''*

- ఉదానుడు.

ఆ గుర్తుంచుకోదగిన పూర్వాహ్నం, జ్ఞానోదయానికి ముందరి రోజు ఉదయం, బోధిసత్త్వుడు బోధివృక్షం[1] సమీపంలో ఉన్న అజపాల వటవృక్షం క్రింద ఆసీనుడై ఉండగా సుజాత అనే ఓ వదాన్య, ప్రత్యేకంగా తయారు చేసిన పాయసాన్ని ఏమీ ఆశించకుండ అతనికి అర్పించింది. ఈ భోజనాన్ని అతడు ఆరగించాడు. అతని జ్ఞానోదయం తరవాత ఏడువారాలు ఉపవాసం చేస్తూ ప్రశాంతంగా, గాఢధ్యానంలో బోధివృక్షం క్రింద, దాని పరిసరాల్లో కాలం గడిపాడు.

**ఆ ఏడు వారాలు :**

**మొదటి వారం**

మొదటి వారం అంతా బుద్ధుడు, బోధి వృక్షం క్రింద ఒకే ఆసనంలో కూర్చొని, విముక్తి సుఖాన్ని[2] ఆనందిస్తూ గడిపాడు.

ఆ ఏడు రోజులు అలా గడిపాక, బుద్ధుడు ఏకాగ్రతా స్థితి నుంచి బయటికి వచ్చి, రాత్రి ప్రథమ యామాన, ప్రతీత్య సముత్పాదం (పొంది పుట్టుట = కారణం లేకుండ ఏదీ పుట్టదు) మీద కేంద్రీకరించాడు: ''ఇది (కారణం) ఉంటేనే అది (ఫలితం) ఉంటుంది. ఇది పుట్టడం వల్లనే (కారణం) అది (ఫలితం) పుడుతుంది.''[3]

అ విద్య మీద ఆధారపడి సంఖారాలు (ధార్మిక అధార్మికలను నిబద్ధించే కర్మలు) పుడతాయి.

సంఖారాలు (నిబద్ధించే కర్మలు) ఆధారంగా (పునస్సంధించే) విజ్ఞానం (విజ్ఞాన) పుడుతుంది.

విజ్ఞానం (పునస్సంధించే) మీద ఆధారపడి నామరూపాలు జనిస్తాయి.

నామరూపాల నుంచి షడాయతనాలు సలాయతన వస్తాయి.

షడాయతనాలు (సలాయతనాలు) అంటే ఆరు జ్ఞానేంద్రియాలు ఇవి మానసిక చర్యకు మూలాధారాలు).

షడాయతనాల నుంచి స్పర్శ (ఫస్స), స్పర్శనుంచి వేదన, వేదన నుంచి తృష్ణ (తృష్ణ), తృష్ణనుంచి ఉపాదాన (గ్రహణం), ఉపాదానం నుంచి భవం (becoming), భవం నుంచి జాతి (పుట్టుక), జాతి నుంచి జరా (ముసలితనం), మరణం, శోకం, పరిదేవనం (రోదనం = lamentation), దుఃఖ (బాధ) దౌమనస్స (మానసిక బాధ) ఉపాయాస (నిస్పృహ) లు జనిస్తాయి.

ఈ విధంగా దుఃఖ ద్రవ్యం మొత్తం జనిస్తుంది.

అంతట, బుద్ధుడు, దీని కంతటికి అర్థాన్ని ఎరిగి, ఆ సమయంలో, జయ జయ ధ్వానాలను చేస్తూ అన్నాడు:

''శ్రమించే, ధ్యాన పరుడైన బ్రాహ్మణుని[4]కి, నిజంగా, ఆ సత్యాలు అవగతమైనప్పుడు, అతని అన్ని సందేహాలు తీరతాయి, ఎందుకంటె అతనికి సత్యం కారణంతో సహా తెలుసు.''

రాత్రి రెండో యామాన ప్రతీత్య సముత్పాదం మీద అవరోహణ క్రమంలో లోతుగా ఇలా పర్యాలోచించాడు: ''ఈకారణం లేక పోతే ఈ ఫలితం లేదు; ఈ కారణం విచ్ఛేదంతో ఈ ఫలితం విచ్ఛేదం జరుగుతుంది.''

అవిద్యానాశంతో సంఖారాలు, సంఖారాల నాశంతో నామరూపాలు, నామరూపాల నాశంతో షడాయతనాలు, షడాయతనాల నాశంతో స్పర్శ, స్పర్శా నాశంతో వేదన, వేదన నాశంతో తృష్ణ, తృష్ణనాశంతో ఉపాదానం, ఉపాదాన నాశంతో భవం, భవం వినాశంతో జన్మ, జన్మ నాశంతో జరా, మరణ, శోక, పరిదేవన, దుఃఖ, దౌమనస్స, ఉపాయాసల నాశం జరుగుతుంది.

ఈ విధంగా దుఃఖ ద్రవ్యం మొత్తంగా అంతరిస్తుంది. అంతట ఆ మహాజ్ఞాని, దీనికంతటికి అర్థాన్ని తెలుసుకొని, ఆ సమయంలో సంతోషంతో విజయాధ్వానం చేస్తూ అన్నాడు: ''తీవ్రంగా శ్రమించే ధ్యాని అయిన బ్రాహ్మణునికి ఈ సత్యం గోచరమైనప్పుడు అతని సందేహాలన్నీ నివృత్తి అవుతాయి. ఎందుకంటే అతనికి కారణ నాశనం అర్థమైంది.''

మూడో యామాన, ఆ మహామహుడు, ప్రతీత్య సముత్పాద ఆరోహణ, అవరోహణ క్రమాలను ఇలా పర్యాలోచించాడు: ''ఈ కారణం ఉంటే, ఈ ఫలితం ఉంటుంది; ఈ కారణం రావడం వల్ల ఈ ఫలితం వస్తుంది. ఈ కారణం లేకపోతే ఈ ఫలితం ఉండదు. ఈ కారణనాశం వల్ల ఈ ఫలితం నాశం అవుతుంది.''

అవిద్య కారణంగా సంఖారాలు ... అన్నీ వరుసగా.

ఈ విధంగా దుఃఖద్రవ్యం జనిస్తుంది.

అవిద్య నాశంతో సంఖారాల నాశం... అన్నీ వరుసగా

ఈ విధంగా దుఃఖ ద్రవ్యం మొత్తం నాశం అవుతుంది.

అప్పుడు బుద్ధుడు, దీని కంతటికి అర్థం తెలిసిన వాడై, ఆ సమయంలో, సంతోషంతో జయధ్వానం చేశాడు:

''శ్రమించే ధ్యాని అయిన బ్రాహ్మణునికి నిజంగా ఈ సత్యాలు అవగతమై నప్పుడు, సూర్యుడు ఆకాశాన్ని వెలుగుతో నింపి నట్లు, అతడు మారుని సంఘాన్ని పెకలించి, ప్రకాశిస్తాడు''.

**రెండో వారం**

రెండోవారంలో పెద్దగా చెప్పుకో దగిన సంఘటనలు ఏవీ లేక పోయినా ఆయన మౌనంగా ప్రపంచానికి ఒక ధార్మిక పాఠాన్ని బోధించాడు. తాను జ్ఞానోదయం కోసం, ఏ చెట్టు క్రింద కూర్చొని సమరం సాగించాడో, ఆ కదలని మెదలని ఆ బోధి వృక్షానికి కృతజ్ఞతా పూర్వంగా. దానికి కొంచెం దూరంలో నిలబడి దాని వంక అనిమేష, నేత్రుడై చూస్తూ ఓ వారం పాటు గడిపాడు.[5]

ఈ ఉదాత్త ఆదర్శ ఉదాహరణ ననుసరించి, ఆయన జ్ఞానో దయానికి జ్ఞాపకచిహ్నమైన ఆ బోధివృక్షానికే కాదు, దాని నుంచి వచ్చిన చెట్లకు గూడ గౌరవ పురస్సరంగా ఈ నాటికీ ఆయన అనుచరులు నమస్కరిస్తారు. [6]

**మూడో వారం**

బుద్ధుడు మూడో వారమైనా గూడ తన తాత్కాలిక నివాసమైన బోధివృక్షాన్ని వదలక పోయే టప్పటికి, అతనికి జ్ఞానోదయం కాలేదేమోనని దేవతలకు అనుమానం వచ్చింది. బుద్ధుడు వారి అనుమానాలను పసి కట్టాడు. వారి సందేహాలను తీర్చడానికి తన మానసిక శక్తులతో ఆభరణా లంకృతమైన ఒక పరిక్రమపథాన్ని (నడువ) ఏర్పరుచుకొని, ఆ బాటమీదే ఓ వారం పాటు అటు ఇటూ పరిక్రమించాడు (నడిచాడు).

**నాలుగో వారం**

నాలుగోవారం అతడు ఆభరణ భూషిత మందిరంలో కూర్చొని అభిధమ్మ (ఉన్నతబోధ) సంబంధమైన గూఢార్థాలను పర్యాలోచించాడు. అతని దేహం, మనస్సులు

ఎంతగా పరిశుద్ధం అయ్యాయంటే, అభిధమ్మంలో ఏడవ పుస్తకమైన ''సంబంధాల ప్రకరణం (ప్రస్థాన = Book of relations) మీద అతడు దృష్టి నిలిపినప్పుడు, అతని దేహం నుండి ఆరు రంగుల కిరణాలు వెలువడ్డాయని[7] గ్రంథాలు చెబుతున్నాయి.

**ఐదో వారం**

ఐదో వారంలో గూడ బుద్ధుడు, బోధివృక్ష సమీపంలో ఉన్న ప్రసిద్ధ అజపాల వటవృక్షం క్రింద, ఒకే ఆసనంలో ఉండి, విముక్తి సుఖాన్ని ఆనందించాడు. అతడు తన అత్యుత్తమ స్థితి నుంచి లేచి బయటికి వచ్చి నప్పుడు, ఒక డాంబికుడైన బ్రాహ్మణుడు అతని దగ్గరకు వచ్చాడు. కుశల ప్రశ్నలు అయిన తరవాత అబ్రాహ్మణుడు బుద్ధుని ఇలా ప్రశ్నించాడు: ''హే గౌరవనీయ గౌతమ, ఏ విధంగా ఒకడు బ్రాహ్మణు డవుతాడు? బ్రాహ్మణుడు కావడానికి ఏమేమి చేయాల్సి ఉంటుంది?''

సమాధానంగా బుద్ధుడు జయ ధ్యానం చేసి ఇలా అన్నాడు:

''చెడును వదిలినవాడు, అహంకారడాంబికాలు లేనివాడు, మలినాల నుంచి విముక్తమైన వాడు, ఆత్మ నిగ్రహం కలిగిన వాడు, జ్ఞాని అయిన వాడు, ఋజు మార్గాన జీవితం గడిపిన వాడు, బ్రాహ్మణుడని చెప్పుకోవచ్చు. అంతకంటె ఈ ప్రపంచంలో ఎక్కడా అతనికి ఔద్ధత్యం లేదు[8]''.

జాతక వ్యాఖ్యానం ప్రకారం, ఈ వారంలోనే, మారునికూతుళ్ళు అయిన తృష్ణ, అరతి, రాగాలు[9] వారి మాయా మంత్రాలతో బుద్ధుని వశం చేసు కోవాలని వ్యర్థ ప్రయత్నం చేశారు.

**ఆరో వారం**

అజపాల వృక్షం నుంచి బుద్ధుడు ముచలింద వృక్షం దగ్గర చేరాడు. అక్కడ ఆరోవారం గడిపాడు, విముక్తానందాన్ని ఆస్వాదిస్తూ. ఆ సమయంలో ఆకస్మికంగా పెద్ద వాన పడింది. అనేక రోజుల పాటు, వర్షపు మేఘాలు, చీకటి వాతావరణం, చలిగాలులు అలాగే ఉండి పోయాయి.

అప్పుడు నాగరాజైన[10] ముచలిందుడు తన నివాసం నుంచి బయటికివచ్చి, బుద్ధుని శరీరాన్ని చుట్టుకొని, తన పడగతో అతని శిరస్సును కప్పుతూ, చలి, వాన గాలుల నుంచి అతనిని కాపాడాడు.

ఏడో రోజు చివర ముచలిందుడు, వాతావరణం తెరపు ఇవ్వగానే, బుద్ధుని శరీరాన్ని వదిలి వేశాడు. ఆ తరవాత తన సర్ప రూపాన్ని విడిచి, ఒక యువకుని రూపం ఎత్తి, బుద్ధుని ముందు, చేతులు జోడించి నిలబడ్డాడు.

అప్పుడు బుద్ధుడు సంతోషంతో జయధ్వానం చేశాడు:

తృప్తి చెందిన వానికి, సత్యం తెలిసిన వానికి, చూడదగిన వానికి ఏకాంత, మంత సుఖం మరొకటి లేదు. మంచితనం సుఖం. అలాగే సర్వజీవుల యెడ సంయమనం. విరాగం (non-attachment) సుఖం. అలాగే ఇంద్రియ వాంఛలను అధిగమించడం. 'నేను' అనే అహంకారాన్ని అణచివేయడం వాస్తవానికి అన్నింటిని మించిన సుఖం''

**ఏడో వారం**

రాజాయతన వృక్షం నీడలో బుద్ధుడు విముక్తానందాన్ని ఆస్వాదిస్తూ ఏడోవారం గడిపాడు.

**బుద్ధుని మొదటి ప్రవచనాలలో ఒకటి:**

అనేక జన్మల ఈ అస్తిత్వంలో

'ఈ యింటి నిర్మాతను

అన్వేషిస్తూ నేను తిరుగాడాను

కాని కనుక్కో లేక పోయాను.

తిరిగి తిరిగి పుట్టడం దుఃఖం.

హే గృహనిర్మాతా[12] నీవు దొరికి పోయావు మళ్ళీ నీవు ఇల్లు [13] కట్ట లేవు.

నీ వాసాలు [14] విరిగి పోయాయి. వెన్నుగాడి వాసం [15] బదా బదలైంది.

మనస్సు అసంఖారాన్ని (నిరూపాధికతను) పొందింది.[16]

తృష్ణ రాహిత్యం జరిగింది.[17]

అతనికి జ్ఞానోదయం అయిన అదే రోజు ఉదయం, బుద్ధుడు సంతోషంతో జయధ్వానం (ఉదానం) చేస్తూ అన్నాడు. ఆయన పలుకులు అతని అత్యున్నత నైతిక విజయాన్ని, అతని ఆంతరంగిక, ఆధ్యాత్మిక అనుభవాన్ని వివరంగా వర్ణించాయి.

ఈ అస్తిత్వంలోని గత పరిభ్రమణాలలో దుఃఖానుభవాన్ని బుద్ధుడు అంగీకరించాడు. ఈ వాస్తవం పునర్జన్మలోని విశ్వాసాన్ని రుజువు చేస్తుంది. ఈ గృహాన్ని నిర్మించిన వాస్తు శిల్పిని, ఈ దేహాన్ని నిర్మించిన శిల్పిని అతడు కనుక్కోలేక పోయిన కారణంగా, అతడు పరిభ్రమణాలు చేయక తప్ప లేదు. ఫలితంగా దుఃఖాన్ని అనుభవించిక తప్ప లేదు. ఇది

అతని చివరి జన్మ. ఈ జన్మలో ఆతడు ఎంతగానో తిరిగి, తిరిగి ఏకాంత ధ్యాన విధానాన్ని కను గొన్నాడు. ఈ విధానానికి అతడు మెరుగులు దిద్దాడు. ఇలాంటి ధ్యానంలో ఉండి, నిరంతర అన్వేషణ ఫలితంగా. తన కంటె వెలుపల లేని, తన హృదయాంతరాళం లోనే ఉన్న, ఆ అంతుచిక్కని ''శిల్పి'' ని కను గొన్నాడు. అది స్వయం సృజితమైన తృష్ణ, లేదా రాగం. అన్నిటిలో గుప్తంగా ఉన్న మానసిక ధాతువు. ఈ తృష్ణ ఎప్పుడు ఎలా పుట్టిందనేది తెలియరానిది. ఎవరైన తాను సృష్టించిన దానిని తాను నాశనం చేయ గలడు. అర్హతత్వం సాధించడం ద్వారా తృష్ణను పెకలించి వేయడమే శిల్పిని కను క్కోవడం. అర్హతత్వాన్ని ఈ పద్యాలలో తృష్ణంతంగా పేర్కొనడం జరిగింది.

స్వయం నిర్మిత గృహం యొక్క వాసాలు - లోభం (పేరాస attachment), దొస (విముఖత aversion) మోహ (భ్రమ illusion) మాన (conceit గర్వం) దిథ్థి (మిధ్యా దృష్టి false view) విచికిచ్ఛా (వాస్తవాన్ని శంకించడం doubt ) థీన (సోమరితనం Sloth) ఉద్దచ్చ (అవిశ్రాంతత restlessness) అహిరిక (నిస్సిగ్గు నైతికంగా Shamelessness) అనొత్తప్ప (ధార్మిక అపశ్చాత్తాపం Moral fearlessness) ల లాంటి క్లేశాలు (మలినాలు Passions). ఈ పక్క వాసాలను నిలిపి ఉంచే ఆధారం వెన్నుగాడి వాసం అవిద్య. ఇది అన్ని క్లేశాలకు ఆధారకారణం. వెన్నుగాడి అయిన అవిద్యను జ్ఞానంతో బదా బదలు చేస్తే, గృహం మొత్తం కుప్ప కూలి పోతుంది. ఆ వాంఛనీయమైన ఈ ఇంటిని శిల్పి నిర్మించేది ఈ వాసాలు, ఆ వెన్నుగాడితోనే. వాటిని నాశం చేస్తే శిల్పి తిరిగి ఈ అవాంఛితమైన ఇల్లు కట్టడానికి సామాగ్రి ఉండదు.

గృహాన్ని నాశం చేయడంతో, మనస్సు స్వేచ్ఛ (అనిబంధిత స్థితి) ను పొందుతుంది. ఈ స్వేచ్ఛే నిర్వాణం. ఐహికమైన దంతా వెనకాతల వదిలి వేయబడుతుంది. కేవలం ఐహికాతీతమైన నిర్వాణం మాత్రమే మిగులుతుంది.

**పాదసూచికలు :**

1. ఉత్తర భారత దేశంలోని బోధగయ వద్ద ఉన్న ప్రసిద్ధమైన రావి చెట్టు. బుద్ధుని జ్ఞానోదయ సమరంలో ఇది అతనికి ఆశ్రయం ఇచ్చింది.
2. అంటే, అర్హతత్వం. ఫలం.
3. 25వ ప్రకరణం చూడండి.
4. బ్రాహ్మణ పదానికి అర్థం వేదాధ్యయనం చేసిన వాడు. దీనిని మామూలుగా పూజారి వర్గానికి అన్వయిస్తారు. కొన్ని సార్లు బుద్ధుడు ఇదే పదాన్ని దుఃఖాన్ని త్యజించిన వానికి, అంటే ఋషికి అన్వయిస్తాడు.

ఈ గ్రంథంలో "బ్రాహ్మణ" పదాన్ని ఋషిపరంగానే ఉపయోగించడం జరిగింది. "బ్రాహ్మిన్" పదం ఒక ప్రత్యేక వర్ణానికి చెందిన సభ్యుని సూచించడానికి ఉపయోగించ బడింది.

5. బుద్ధుడు నిలబడిన స్థానంలోనే అశోక చక్రవర్తి ఒక చైత్యాన్ని నిర్మించాడు. దీనిని 'అనిమిసలొచన' చెతియ అంటారు. అది ఇప్పటికీ ఉంది.

6. బోధి వృక్షం కుడికొమ్మను సంఘమిత్రథేరి సింహళం తీసుకు వెళ్ళగా, దాన్ని రాజు దేవానామ్‌పియతిస్స అనూరాధపురంలో నాటాడు. 2200 సంవత్సరాల వయస్సున్నప్పటికీ, అది ఇప్పటికీ కొమ్మలు రెమ్మలు వేసి చిగురిస్తూనే ఉంది.

7. అవి నీలం, పీత, లోహిత, ఒదాత (శ్వేత) నారింజ (మఞ్జా జెట్ఠ) ఇంక ఈ ఐదురంగుల సమ్మిశ్రణం. (పభస్సర)

8. ఉదాన, P. 3

9. ఈ మూడింటిని, మూర్తీభవించిన క్లేశాలు అన లేము. ఎందుకంటె ఈ సంఘటన జ్ఞానోదయం తరవాత జరిగింది.

10. నాగరాజు మానవుడు కావడానికి వీలు లేదు. ఒక పాము, మానవ రూపాన్ని ఎత్తి భిక్కుగా జీవించినట్లు వినయ పిటకం చెబుతున్నది.

11. ఉదాన P. 10

12. అంటే తృష్ణ

13. దేహం

14. క్లేశాలు

15. అవిద్య

16. నిర్వాణ

17. ప్రసిద్ధ సంతోష జయధ్వానం ధమ్మపదంలో కనిపిస్తుంది. V. 153, 154.

ఐదో ప్రకరణం

# ధర్మబోధకు ఆహ్వానం

''ఎవడు ధమ్మాన్ని తనదిగా చేసుకొంటాడో, అతడు ప్రశాంత మనస్కుడై సుఖంగా జీవిస్తాడు. జ్ఞాని అయిన వాడు ఆర్యులు ఆవిష్కరించిన ధమ్మంలో ఎప్పుడూ సంతోషంగా ఉంటాడు''.

– ధమ్మ పద, V. 79.

**ధమ్మమే గురువుగా**

జ్ఞానోదయం అయిన తరవాత ఒకసారి బుద్ధుడు నెరంజ్జరా నది ఒడ్డున ఉన్న అజపాల వటవృక్షం క్రింద కొంతకాలం, గడిపాడు. అతడు ఏకాంత ధ్యానంలో ఉండగా ఈ క్రింది ఆలోచన మదిలో మెదిలింది.

''వినయ విధేయతలు, గౌరవాభివాదాలు చూపించు కోవడానికి ఒక మనిషి అవసరం. అటువంటి వాడు లేకుండ జీవించడం దుష్కరం. నేను ఒక సన్యాసిని గాని, బ్రాహ్మణుని గాని చేరి, అతనికి వినయ విధేయతలు చూపిస్తూ ఉంటే ఎలా ఉంటుంది?''

అప్పుడతనికి ఇలా అనిపించింది

''ధార్మికతను పరిపూర్ణం గావించు కోవడానికి నేను ఏ బ్రాహ్మణుని దగ్గరో, సన్యాసి దగ్గరో, అతనిని గౌరవిస్తూ అతనితో ఉండాలా? ఈ ప్రపంచంలో ఎక్కడా, దేవతలలో గాని, మారులలో గాని, మానవులలోగాని, ధార్మికంగా నాకంటె ఉన్నతంగా ఉన్న, నేను గౌరవించగల, వినయ విధేయతలు చూపించ గల, నేను కలిసి పయనించ గల, మరో సన్యాసిగాని, మరో బ్రాహ్మణుడు గాని నాకు కనిపించడం లేదు.

''ఏకాగ్రతను పరిపూర్ణం కావించు కోవాడానికి, ఒక సన్యాసి దగ్గరో, ఒక బ్రాహ్మణుని దగ్గరో, వానికి వినయ విధేయుడనై వానితో పాటు జీవించాలా? ఈ ప్రపంచంలో నాకంటె ఏకాగ్రతలో ఉన్నత స్థితిలో ఉన్న, నేను గౌరవించి, విధేయుడనై ఉండ గలిగిన, కలిసి జీవించగల, మరో సన్యాసిగాని, బ్రాహ్మణుడు గాని లేడు.

''జ్ఞానాన్ని పరిపూర్ణం గావించు కోవడానికి నేను మరో సన్యాసి దగ్గరో, బ్రాహ్మణుని

దగ్గరో ఉండాలా? ఈ ప్రపంచంలో జ్ఞానంలో నాకంటె ఉన్నతుడైన బ్రాహ్మణుడు గాని, సన్యాసిగాని నాకు కనపడడం లేదు.

''స్వేచ్ఛను పరిపూర్ణం గావించుకోవడానికి నేను మరో సన్యాసితోనో, బ్రాహ్మణుని తోనో, వానికి వినయవిధేయతలు కనబరుస్తూ, కలిసి జీవించాలా? అటువంటి వారు ఈ ప్రపంచంలో ఎవరూ లేరు''

అప్పుడతడు ఇలా ఆలోచించాడు : ''అలాంటప్పుడు, ఏ సన్యాసినో, బ్రాహ్మణునో కాక, నేను యధార్థీకరణం పొందిన ధర్మాని కే విధేయుడనై ఉంటేనో?''

అంతట బ్రహ్మ సహంపతి, బుద్ధుని మనస్సులోని ఆలోచనా సరళిని పసిగట్టి, మడిచిన చేతిని చాచిన విధంగా లేదా చాచిన చేతిని మడిచిన విధంగా అతడు బ్రహ్మలోకంలో అంతర్ధానమై, బుద్ధుని ఎదుట నిల బడ్డాడు. తరవాత, ఒక భుజాన్ని పైపంచతో కప్పుకొని, కుడి మోకాలిని నేల కాన్చి, చేతులు జోడించి బుద్ధునికి నమస్కరించి ఇలా అన్నాడు:

''హే ఉన్నతుడా! మీరనుకొన్నట్లే, సిద్ధుడా! అలాగే, హే దేవా! మహాజ్ఞానులు, అర్హులు గతంలో గూడ ఇదే ధర్మాన్ని గౌరవిస్తూ, పాలిస్తూ జీవించారు.

''భవిష్యత్తులో గూడ అర్హులు, మహాజ్ఞానులు ఇదే ధర్మాన్ని గౌరవిస్తూ, పాలిస్తూ జీవిస్తారు.

''హే దేవా! అర్హుడా! ఉన్నతుడా! మహా మహా జ్ఞానీ, మీరు ఈ ప్రస్తుతకాలంలో ఇదే ధర్మాన్ని గౌరవిస్తూ పాలిస్తూ జీవిస్తారు.''

ఈ విధంగా బ్రహ్మ సహంపతి పలికి, ఇంకా ఇలా అన్నాడు:

''భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో, ప్రజల దుఃఖాన్ని బాపే జ్ఞానోదయమైన మహానుభావులు అందరూ కూడా ఈ ఆర్యధర్మాన్నే పాలించారు, పాలిస్తారు, పాలిస్తున్నారు. ఇదే బుద్ధుల శీల లక్షణం. అందువల్ల, తమ సంక్షేమాన్ని, గొప్పదనాన్ని, ఆకాంక్షించేవారు బుద్ధుల సందేశాన్ని మననం చేసుకొంటూ, ఆర్యధర్మాన్ని గౌరవించాలి.'' ఇలా అని బహ్మసహంపతి చెప్పి, ఆ తరవాత బుద్ధునికి నమస్కరించి, ఆయన చుట్టూ కుడివైపుగా ప్రదక్షిణం చేసి, వెంటనే అంతర్ధాన మయ్యాడు.

సంఘం[2] గూడ గొప్పదే గనుక, సంఘం యెడల గూడ అతనికి గౌరవం ఉంది.

**ధర్మార్థ బోధకు ఆహ్వానం**

రాజాయతన వృక్షం నుంచి బుద్ధుడు అజపాల వటవృక్షం క్రిందకు చేరి ఏకాంత ధ్యానానికి కూర్చొన్నాడు. అప్పుడు ఆయనకు ఇలా తట్టింది :

''నేను కనుగొన్న ధర్మం నిజంగా గంభీర మైంది. తేలికగా అర్థమయ్యేది కాదు. ప్రశాంతమైంది, అధికృతమైంది, తర్కం పరిధిలో లేనిది, సూక్ష్మమైంది, జ్ఞానులు మాత్రమే అర్థం చేసుకో గలిగింది. ఈ జీవులు విషయ సుఖా సక్తులు. ఈ కారణతా సంబంధమైన ''ప్రతీత్య సముత్పాదం'' (కారణం లేకుండా ఏదీ జరగదు) తేలికగా అర్థం కాదు. ఈ నిర్వాణం గూడ – ఉపాధుల ఉచ్ఛేదం, క్లేశాలను వదిలి వేయడం, తృష్ణ నాశం, విరాగం, ఉచ్ఛేదం – అంత తేలికగా అర్థమయ్యేది కాదు. ఈ ధర్మాన్నే నేను బోధించ వలసి వస్తే అది జనానికి అర్థం కాదు. అది నాకు ప్రయాసను, అలసటను మాత్రమే మిగులుస్తుంది.''

అంతట ఈ పద్య పంక్తులు అంతకు ముందు ఎప్పుడూ విన నివి బుద్ధునికి తట్టాయి.

''నేను చాల శ్రమించి ధర్మాన్ని పట్టుకో గలిగాను. దానిని ఇప్పుడు ప్రకటించ వలసిన అవసరం లేదు. లాలస, ద్వేషాలతో ప్రభావితులైన వారు ఈ ధర్మాన్ని తేలికగా అర్థం చేసుకో లేరు. లాలస బంధితులు, చీకటిలో ఉన్నవారు ఎదురు ఈదే ఈ ధర్మాన్ని, నిగూఢమైన, గంభీరమైన, సూక్ష్మమైన ఈ ధర్మాన్ని, కాన లేరు''.

ఈ విధంగా పర్యాలోచించిన బుద్ధుడు ధర్మార్థ వివరణకు ఉత్సాహం చూపించ లేదు.

అప్పుడు బుద్ధుని మనస్సులోని ఆలోచనలను చదివిన బ్రహ్మసహంపతి, ధర్మం విన కుండానే ప్రపంచం అంతమవు తుందే మోనని భయపడిన వాడై, బుద్ధుని వద్దకు వచ్చి, ధర్మబోధ చేయవలసిందిగా ఆయన్ను ఇలా ఆహ్వానించాడు:

''హే దేవా! అధికృత మహాశయుడు ధర్మ బోధ గావింతురు గాక! సిద్ధుడు (సాధించిన వాడు) ధర్మ సూక్ష్మాన్ని వివరింతురు గాక! ఈ ప్రపంచంలో, కళ్ళల్లో దూళి లేని వారు కొందరున్నారు. వారూ ధర్మం వినకుండానే అంతరిస్తారు. ధర్మాన్ని అర్థం చేసుకొనే వారూ ఉన్నారు.''

ఇంకా అతడు ఇలా అన్నాడు:

''ప్రాచీన మగధలో ఒక ధర్మం వెలిసింది. అది మాలిన్యంతో కూడు కొన్నది. మలిన మనస్కులు తయారించినది అది. మరణరహిత స్థితికి ఈ మీద్వారాన్ని తెరవండి. అమలినుడైన ఈ మహానుభావుడు అర్థం చేసుకొన్న ధర్మాన్ని వారు విందురు గాక! శిలా పర్వతాగ్రాన నిల బడ్డ ఒకడు ఎలాగైతే చుట్టూ ఉన్న వారిని చూస్తాడో, అలాగే ఈ సర్వేక్షుడు, ఈ మహాజ్ఞాని, ధమ్మ ప్రాసాదాన్ని అధివసించుగాక! జరా మరణాలకు దుఃఖానికి గురైన జనాళిని దుఃఖ రహితుడైన ఈ మహానుభావుడు కనికరించుగాక!

''ఓ మహా వీరా లే. సమర విజేత, సార్థవాహా, ఋణ విముక్తుడా, లే. లేచి ఈ

ప్రపంచంలో తిరుగాడు! బుద్ధుడు ధర్మబోధ గావించు గాక! ధర్మాన్ని అర్థం చేసుకొనే వారు తప్పకుండా ఉంటారు''.

అతడు అలా అన్నప్పుడు బుద్ధుడు అతనితో ఇలా అన్నాడు:

''హే బ్రహ్మా! ఇదిగో నాకొచ్చిన ఆలోచన ఇది: 'నేను అర్థం చేసుకొన్న, గ్రహించిన ధర్మాన్ని, లాలస, ద్వేషాలతో నిండిన వారు, అంత తేలికగా అర్థం చేసు కోలేరు. లాలస నిండిన వారు, చీకటిలో ఉన్నవారు, ఈ ధర్మాన్ని కన లేరు. అది వారికి ఎదురీత. గహనం, గభీరం, సూక్ష్మం, చూడ కష్టతరమైంది. ఇలా ఆలోచించిన నా మనస్సు నిష్క్రియాత్మక మైంది. ధర్మ బోధకు ఇష్ట పడడం లేదు.''

బ్రహ్మసహంపతి మరో మారు వేడు కొన్నాడు. కాని బుద్ధుని సమాధానం మాత్రం అదే.

అతడు మూడో సారి వేడుకోగానే, బుద్ధుడు జీవుల యెడ కరుణతో, ప్రపంచాన్ని బుద్ధ దర్శనం (Buddha vision) తో సర్వేక్షించాడు.

ఇలా ప్రపంచాన్ని చూడ గానే బుద్ధునికి, కొంత మంది కళ్ళల్లో తక్కువ మట్టి ఉన్నవారూ (అంతగా పొరలు కమ్మని వారు), కొంత మంది కళ్ళల్లో ఎక్కువ ధూళి ఉన్న వారూ (బాగా పొరలు కమ్మినవారు), కొంతమంది తెలివైన వారూ అయితే, కొంతమంది మంద బుద్ధులు, కొంతమంది మంచి వారైతే, కొంతమంది చెడ్డవారూ, కొంతమంది తేలికగా బోధించడానికి వీలైన వారు, కొంత మంది కష్టంగా బోధించ దగిన వారూ కనిపించారు. భయంతో దుఃఖాన్ని, ఆవలి జీవితాన్ని అసలు చూడ గలిగిన వారు లేనే లేరని గమనించాడు.

నీల, లోహిత లేదా తెల్ల తామర కొలనులలో కొన్ని పద్మాలు నీళ్ళల్లోనే పుడతాయి. కొన్ని నీళ్ళల్లోనే పెరుగుతాయి. కొన్ని నీళ్ళల్లో మునిగే ఉంటాయి. నీళ్ళల్లో మునిగే వృద్ధి చెందుతాయి. కొన్ని నీళ్ళలోనే పుట్టి నీళ్ళల్లోనే పెరిగి, ఉపరితలం మీద ఉంటాయి. మరి కొన్ని, నీళ్ళల్లోనే పుట్టి, నీళ్ళల్లోనే పెరిగి నీళ్ళల్లోంచి బయటికి వచ్చి, నీటిని తాక కుండ ఉంటాయి. అలాగే 'బుద్ధదర్శనం'తో అతడు ప్రపంచాన్ని వీక్షించి నప్పుడు జీవులు తమ కళ్ళల్లో దుమ్ము లేని వారు, (పొరలు కమ్మని వారు= విషయాలను స్వచ్ఛంగా స్పష్టంగా చూడ గలిగిన వారు) ఎక్కువ దుమ్మున్నవారు, తెలివైన వారు, తెలివి లేనివారు, తేలికగా బోధించ తగిన వారు, అలా బోధించడానికి వీలు లేని వారు, మంచి, చెడు లక్షణాలున్న వారు, భయంతో దుఃఖాన్ని ఆవల ప్రపంచాన్ని చూడ లేని వారు అతనికి కనిపించారు. అప్పుడు బుద్ధుడు, ఒక పద్యాన్ని బ్రహ్మ సహంపతిని ఉద్దేశించి చెప్పాడు:

చెవులున్న వారు ఎవరైన దాన్ని విశ్వసిస్తే అటువంటి వారికే ''మరణ రహిత స్థితి ద్వారాలు తెరిచి ఉంటాయి. ఇందులో ఉన్న కష్టం తెలిసిన వాడిని కనుక, ఓ బ్రహ్మ, ఈ వైభవో పేతమైన, బ్రహ్మాండమైన ధర్మాన్ని నేను జనానికి బోధించ లేదు.''

బుద్ధధర్మాన్ని వినడానికి తానే ఒక పరికర మైనందుకు, బ్రహ్మ సంతోషించిన వాడై, బుద్ధునికి గౌరవ పురస్సరంగా నమస్కరించి, అతనికి కుడిప్రక్కగా ప్రదక్షిణం చేసి, వెంటనే మాయ మయ్యాడు.[3]

**ఇద్దరు ప్రథమ శిష్యులు**

అతని చిరస్మరణీయమైన నలభై తొమ్మిది రోజల ఉపవాసం తరవాత, బుద్ధుడు రాజాయతన వృక్షం క్రింద కూర్చొని ఉండగా ఇద్దరు వ్యాపారులు - ఒకడు తపస్సు రెండోవాడు భల్లిక - వీరిద్దరు ఉత్కళ (ఒరిస్సా) నుంచి - ఆదారి గుండా వెళ్తున్నారు. అప్పుడు, వారిద్దరికి గత జన్మలో, రక్త బంధువైన ఒకదేవత[4], వారితో ఇలా అంది :

''బుద్ధుడు రాజాయతన వృక్షం క్రింద, తన జ్ఞానోద యానంతరం నివసిస్తున్నాడు. తేనె తొట్టెతో గోధుమ పిండితో ఆయనను సేవించండి. అది మీకు మంచి చేస్తుంది.''[5]

ఈ స్వర్ణావకాశాన్ని వారు సద్వినియోగం చేసు కొన్నారు. వారిద్దరు ఆయన దగ్గరకు చేరి, గౌరవాభివాదాలు చేసి, తమ క్షేమం కోసం, తామిచ్చే భిక్షను స్వీకరించ వలసిందని బుద్ధుని వేడు కొన్నారు.

**అప్పుడు ఆయనకు ఇలా అనిపించింది :**

''తథాగతు లెవరూ అన్నాన్ని చేతుల్లో స్వీకరించరు. మరి నేనెలా తేనె తొట్టెను, పిండిని అందుకో గలను?

వెంటనే నలుగురు రాజులు[6] బుద్ధుని అంతరంగాన్ని అర్థం చేసుకొని, నాలుగు దిశల నుంచి నాలుగు రాతి చిప్పల[7]ను సమర్పించి ఇలా అన్నారు. ''హే దేవా! తమరు వీటితో తేనెను, పిండిని స్వీకరించ వచ్చు.''

బుద్ధుడు దయా పూర్వకంగా సమయానికి పనికి వచ్చిన ఆ బహుమతులను స్వీకరించి, వ్యాపారు లర్పించిన వినయ పూర్వక కానుకలను అందుకొని, సుదీర్ఘ ఉపవాసానంతరం, భోజనం చేశాడు.

భోజనానంతరం వ్యాపారులు ఆయన పాదాలకు సాష్టాంగ ప్రమాణం చేసి, ఇలా అన్నారు:

''హే దేవా, మేము మిమ్ము శరణు వేడు తున్నాము. ధర్మాన్ని శరణు వేడు తున్నాము. జీవితాంతం శరణు వేడే మమ్ము మీ ఉపాసకులుగా స్వీకరించండి''[8].

వీరే మొదటిగా బౌద్ధాన్ని స్వీకరించిన ప్రథమ ఉపాసకులు[9]. బుద్ధుని, ధర్మాన్ని శరణు వేడడం ద్వారా బౌద్ధు లయ్యారు. ద్వి పుటీ సూత్రాన్ని ఉచ్చరించారు – బుద్ధం శరణం గచ్ఛామి. ధమ్మం శరణం గచ్ఛామి – అంటూ.

**ధర్మబోధ కోసం కాశీ వెళ్ళే దారిలో**

ధర్మ బోధకు అంగీకరించిన తరవాత, అతనికి వచ్చిన మొదటి ఆలోచన : ''నేను మొదటిగా ఈ ధర్మాన్ని ఎవరికి చెప్పాలి? ఎవరు దానిని త్వరగా అర్థం చేసు కొంటారు? అవును అక్కడ ఆలారకాలాముండున్నాడు. అతడు తెలివైన వాడు. పండితుడు. జ్ఞాని. చాలకాలంగా అతని కళ్ళల్లో దూళి ఏమీ లేదు (విషయాలను స్వచ్ఛంగా స్పష్టంగా చూడగలుగుతున్నాడు). నేను ముందుగా ధర్మాన్ని అతనికి చెబితే ఎలా ఉంటుంది? అతడు ధర్మాన్ని త్వరగా అర్థం చేసు కొంటాడు.''

అప్పుడు బుద్ధుని ఎదుట ఒక దేవత ప్రత్యక్షమై ఇలా అంది: ''దేవా! ఆలారకాలా ముడు ఒక వారం క్రితమే గతించాడు.''

అతడు తన అసాధారణ దృష్టితో చూసి, అది నిజమే అనుకొన్నాడు.

ఆ తరవాత అతడు ఉద్దకరామపుత్రు ని గురించి ఆలోచించాడు. వెంటనే ఒక దేవత కనిపించి, అతడు అంతకు ముందరి సాయంత్రమే మరణించాడని చెప్పింది.

బుద్ధుడు తన అసాధారణ దృష్టి సారించి అదీ నిజమేనని తెలుసు కొన్నాడు.

అంతిమంగా బుద్ధుడు, తాను జ్ఞానోదయ సమరం సాగిస్తున్న సమయంలో తనను అంటి పెట్టు కొని ఉన్న ఐదుగురు శక్తిమంతులైన సన్యాసులను గురించి ఆలోచించాడు. తన అసాధారణ దృష్టితో పరికించి, వారు ఐదుగురు కాశీకి సమీపంలో ఉన్న ఇసి పట్టణం దగ్గర 'హరిణవనం'లో ఉన్నట్లు అతడు తెలుసు కొన్నాడు. అందుకని కాశీకి బయలు దేరే సమయం కుదిరే దాక, బుద్ధుడు ఉరువెల లోనే నిలిచి పోయాడు.

బుద్ధుడు రాచబాటన పయనిస్తున్నాడు. తాను జ్ఞానోదయం పొందిన బోధి వృక్షానికి గయకు మార్గమధ్యంలో ఉండగా, ఉపకుడనే సన్యాసి ఎదురై బుద్ధునితో ఇలా అన్నాడు: ''మీ ఇంద్రియాలు స్వచ్ఛంగా ఉన్నాయి. మిత్రమా, మీ దేహ వర్ణం శుద్ధంగా, స్వచ్ఛంగా ఉంది. ఎవరి కోసం మీరు ఈ పరిత్యాగం చేశారు. స్నేహితుడా, ఎవరు మీ గురువు? ఎవరి సిద్ధాంతాన్ని మీరు ప్రచలితం చేస్తున్నారు?

బుద్ధుడు ఇలా సమాధానం చెప్పాడు :

''అన్నింటిని జయించాను. నాకు అంతా తెలుసు.

అన్నింటి నుంచి వియోగం పొందాను. అన్నింటిని పరిత్యజించాను.

తృష్ణనాశంలో నేను పూర్తిగా మునిగి ఉన్నాను (అర్హతత్వం).

నా అంతట నేనే అన్నీ గ్రహించాక, నేను ఎవరిని గురువని చెప్పుకోను?

నాకు గురువు లేడు[12]. నాకు సముడైన వాడూ లేడు.

దేవతలతో సహా ఈ ప్రపంచంలో నాకు ప్రత్యర్థి లేడు.

ఈ ప్రపంచంలో నేనే అర్హతుడను.

నేనొక్కడినే మొత్తం జ్ఞానోదయమైన వాణ్ణి.

ప్రశాంతుడను, సాంత్వనుడను నేనే.

ధర్మచక్ర స్థాపనార్థం నేను కాశీ వెళ్తున్నాను.

ఈ అంధ ప్రపంచంలో మరణ రహిత మృదంగాన్ని నేను వాయిస్తాను.'' [13]

''అయితే స్నేహితుడా, మీరు అర్హతులని, అనంత విజేతలని మీరు ఒప్పు కొంటారా?'' అని ఉపకుడు ప్రశ్నించాడు.

మాలిన్యాల నాశాన్ని సాధించిన విజేత లంటే నా లాంటి వారే. దుఃఖ భాజకమైన ఉపాధులన్నింటిని (పరిస్థితుల నన్నింటిని) జయించాను. అందుకని ఓ ఉపకా, నన్ను విజేత అంటారు,'' అని బుద్ధుడు సమాధానం చెప్పాడు.

''అలాగే అవుగాక మిత్రమా !'' అంటూ తుంచి వేసినట్లు మాట్లాడి, తల ఊపుతూ, ప్రక్క దారి వెంట పడి తన మార్గాన తాను వెళ్ళి పోయాడు ఉపకుడు.

ఈ తిరస్కారంతో విచలితుడు కాని బుద్ధుడు ప్రయాణించి ప్రయాణించి, కాశీలోని హరిణ వనానికి చేరు కొన్నాడు.

**ఐదుగురు సన్యాసులను కలియడం**

బుద్ధుడు రావడాన్ని ఐదుగురు సన్యాసులు దూరంనుంచే చూశారు. అయినా తగిన మర్యాద ఇవ్వరాదనే నిర్ణయించుకొన్నారు. ఎందుకంటే, బుద్ధుడు తన జ్ఞానోదయ సమరంలో మామూలు సన్యాసులు పాటించే నియమాలను, ఆచరణలను పాటించలేదు. పైగా ఆ ఆచరణ వృథా అని బుద్ధుడు అన్నాడు. ఇలా పాటించక పోవడాన్ని యతి పంచకం అపార్థం చేసుకొంది.

వారిలో వారు ఇలా అనుకొన్నారు :

''మిత్రులారా, ఆ వచ్చేది యతి గౌతముడు. అతడు విలాస పురుషుడు. అతడు తపో నిష్ఠను వదిలి వేసి, సుఖమయ జీవితాన్ని సాగించాడు. అతనికి మనం స్వాగతం పలికి మర్యాదలు చేయ వలసిన పని లేదు. అతని భిక్షాపాత్రను, చేలాంచలాన్ని మనం అందుకోవద్దు. అయినా ఒక ఆసనం ఏర్పాటు చేద్దాం, ఇష్టమైతే కూర్చొంటాడు. లేక పోతే లేదు.''

బుద్ధుడు వారిని సమీపించాడు. మహోన్నతమైన, శిఖరాయమాణమైన అతని మూర్తిని చూసి, గౌరవ పురస్సరంగా ఆయన్ను స్వాగతించడం తప్ప, వేరే ఏమీ చేయలేని స్థితిలో వారు పడి పోయారు. ఒకడు ముందుకు వచ్చి ఆయన పాత్రను, చేలాంచలాన్ని అందు కొన్నాడు. మరొకడు ఆసనం ఏర్పాటు చేశాడు. మరొకడు కాళ్ళు కడుక్కోవ డానికి నీరు అందించాడు. అయినా వారు అతనిని పేరుతో పిలిచారు; ''ఆవు సో'' (మిత్రమా) అని పిలిచారు (''ఆవుసో'' అనే పదంతో సములను, చిన్న వాళ్ళను సంబోధిస్తారు).

దీనిని గమనించిన బుద్ధుడు వారినుద్దేశించి ఇలా అన్నాడు: ''ఓ భిక్కులారా, తథాగతుని, పేరుతో గాని, ''ఆవుసో'' అని గాని సంబోధించ రాదు. తథాగతుడు ఉన్నతుడు. అతడు పూర్తిగా జ్ఞానోదయం అయిన వాడు. ఆలకించండి భిక్కులారా, అమర్త్యం (అమత) సాధించాను. మీకు ధమ్మాన్ని ఉపదేశిస్తాను. నా ఉపదేశాను సారం మీరు నడిస్తే, అనతికాలంలోనే, మీ ప్రజ్ఞ, తెలివితేటలతో, ఈ జీవితంలోనే, దేనికోసమైతే కులీన కుటుంబీకులు తమ భార్యా బిడ్డలను పరిత్యజించి, ఇల్లు వీడి వస్తారో, ఆ పవిత్ర జీవిత సిద్ధిని పొందుతారు.''

అంతట ఆ ఐదుగురు యతులు ఇలా బదులు చెప్పారు: ''ఆవుసో, గౌతమ, నీవు కఠినమైన ఆచరణతో, క్రమశిక్షణతో, బాధాకరమైన కఠోర తపస్సుతో, మానవాతీత విశిష్ట జ్ఞానాన్ని, ఆర్యునికి (అరియ) తగిన ప్రజ్ఞ (insight) ను సాధించ లేదు. మరి ఆ కఠోర తపస్సులను వదిలి వేసి, విలాస జీవితంలో పడి, తపస్సు మాని, సంపన్నజీవితం గడిపిన నీకు మానవాతీత విశిష్ఠ జ్ఞానం, ప్రజ్ఞలు - ఆర్యునికి తగినవి - ఎలా పొందావు?''

దానికి వివరణగా బుద్ధుడు ఇలా చెప్పాడు :

''ఓ భిక్కులారా''! తథాగతుడు విలాస జీవితం గడప లేదు. జ్ఞాన సమరం మాన లేదు. సంపన్న జీవితం సాగించ లేదు. ఉన్నతుడే తథాగతుడు. అతడు పూర్తిగా జ్ఞానోదయమైన వాడు. ఓభిక్కులారా వినండి, అమర్త్యతను (అమత) సాధించాను. నేను ధమ్మాన్ని ఉపదేశిస్తాను. నా ఉపదేశాను సారం మీరు నడుచుకొంటే, అనతి కాలంలోనే, దేనికోసం

అయితే కులీన కుటుంబీకులు ఇల్లు, వాకిలి వదిలి వస్తారో, ఆ పవిత్ర జీవిత సిద్ధిని మీరు పొందగలరు.''

మళ్ళీ రెండోసారి ఆ శంకామనస్కులైన సన్యాసులు తమ నిస్పృహను వ్యక్తం చేశారు.

బుద్ధుడు వారికి నమ్మబలుకుతూ, తనకు జ్ఞానోదయం కలిగిందని, మళ్ళీ అదే వివరణ ఇచ్చాడు.

మూడోసారి గూడ, ఆ శిలా సదృశ మనస్కులు, మళ్ళీ అదే సందేహాన్ని వెలిబుచ్చారు. అప్పుడు వారిని బుద్ధుడు ఇలా ప్రశ్నించాడు: ''ఓ భిక్షువులారా, మీతో నేను ఎప్పుడైనా ఇలా మాటాడిన సందర్భం ఉందా?''

''ఎప్పుడూ లేదు, దేవా!''

బుద్ధుడు మూడో సారిగూడ తనకు జ్ఞానోదయం అయిందని, తన ఉపదేశం ప్రకారం నడుచు కొంటే, వారూ సత్యాన్ని గ్రహించ వచ్చునని చెప్పాడు.

బుద్ధుని పవిత్ర పెదవులు నుంచి వెలువడిన నిష్కపట వాక్యమది. వారి అభిప్రాయాలు శిలా సదృశాలే అయినా, సంస్కార యుతులైన ఆ ఐదుగురు సన్యాసులు బుద్ధుడు సాధించిన గొప్ప విజయాలను పూర్తిగా విశ్వసించారు. అతని మీద అతని ధార్మిక మార్గదర్శకత మీద వారికి నమ్మకం కుదిరింది.

అతని మాటలను నమ్మారు. అతని బోధను వినడానికి కూర్చొన్నారు.

ముగ్గురు సన్యాసులు భిక్షకు వెళ్ళగా, మిగిలిన ఇద్దరకు బుద్ధుడు ఉపదేశం గావించాడు. ముగ్గురు తెచ్చిన భిక్షతో ఆరుగురు సర్దుకొన్నారు. ఈసారి ఇద్దరు భిక్కులు భిక్షకు వెళ్ళగా మిగత ముగ్గిరికి బుద్ధుడు ఉపదేశం గావించాడు. ఇద్దరు తెచ్చిన భిక్షతో ఆరుగురు సర్దుకొన్నారు.

జన్మ, జరా, మరణ, దుఃఖ, క్లేశాలకు అతీతులు కాని ఆ యతులు ఈ విధంగా బుద్ధుని చేత హెచ్చరించ బడి, ఉపదేశితులై జీవిత సత్యాన్ని గ్రహించారు. జన్మ, జరా, మరణ, దుఃఖ, క్లేశ రహిత, అనన్య అతీత శాంతిని, నిర్వాణాన్ని కనుగొన్నారు. వారి విముక్తి అపరివర్తనీయమనే జ్ఞానం, అది వారి చివరి జన్మ అనే జ్ఞానం, ఇక ఈ స్థితి మరల ఉండదనే జ్ఞానం, వారికి కలిగింది.

నాలుగు ఆర్యసత్యాలతో కూడిన ధర్మచక్రప్రవర్తనో (ధమ్మచక్కప్పవత్తన) వారికి బుద్ధుడు చెప్పిన మొదటి పాఠం. దానిని వినగానే, వారిలోకి పెద్దవాడైన కొండణ్ణ బుష్వత్వంలో

ప్రథమదశను పొందాడు. మరికొంత ఉపదేశం పొందిన తరవాత మిగతా నలుగురు 'సోతాపత్తి'[15] (ఏరుదాటగల వారయ్యారు) ని పొందారు. ఆత్మరాహిత్యతతో వ్యవహరించే 'అనత్తలక్ఖన సుత్త'[16] (అనాత్మ లక్షణ సూత్రం) వినడంతో ఐదురుగు సన్యాసులు ఋషిత్వంలో అంతిమదశ అయిన అర్హతత్వాన్ని పొందారు.

**ఐదుగురు మొదటి శిష్యులు**

ఈ విధంగా అర్హతత్వాన్ని పొందిన, కొండణ్ణ, బద్దియ, వప్ప, మహానామ, బ్రాహ్మణ వంశానికి చెందిన అస్సజి, అనే ఐదుగురు బుద్ధునికి ప్రథమ శిష్యు లయ్యారు.

గౌతముడు పసివాడుగా ఉన్నప్పుడు నామకరణ మహోత్సవానికి ఆహ్వానితులైన ఎనిమిది మంది బ్రాహ్మణులలో కొండణ్ణ అందరికంటె పిన్న వయస్కుడూ, తెలివైనవాడు. మిగత నలుగురు వృద్ధబ్రాహ్మణులు. గౌతముడు బుద్ధత్వం కోసం సమరం సాగిస్తున్నప్పుడు, ఈ బోధిసత్వుని ఆగమనం కోసం ఈ ఐదుగరు సన్యాసులుగా అడవికి నిష్క్రమించారు. గౌతముడు ఉపయోగంలేని ఉపవాసాలను, కఠోర తపస్సును వదిలి, చిక్కిపోయిన తన శరీరాన్ని మామూలు స్థితికి తెచ్చు కోవడానికి కొంచెం కొంచెంగా ఆహారం తీసుకొంటు న్నప్పుడు, వీరు అతనిని వదిలి ఇసి పట్టణానికి వెళ్ళిపోయారు. వారు వెళ్ళి పోయిన తరవాత కొద్ది కాలానికే బోధిసత్వునికి బుద్ధత్వం కలిగింది.

గౌరవనీయ కొండణ్ణ మొదటి అర్హతుడు అయ్యాడు సంఘం సభ్యులలో ముఖ్యమైన వాడయ్యాడు. ఐదుగురులో ఒకడైన అస్సజి బుద్ధుని ముఖ్యశిష్యుడయ్యాడు. ఇతడే సారిపుత్రుని బౌద్ధానికి మార్చాడు.

**పాదసూచికలు:**

1. *అంగుత్తరనికాయ*, 11,4,3,1, P. 20 Gradual Sayings, 11, P. 20.

2. సంఘం స్థాపించబడిన చాల కాలం తరవాత, శ్రావస్తి దగ్గర జెత వనంలో ఉండగా బుద్ధుడు ఈ ఉపన్యాసం చేశాడు. తన కోసం ప్రత్యేకంగా తయారు చేసిన చీవరాలను (చేలాంచలాన్ని) రాణి మహా ప్రజాపతిని సంఘానికి అందించవలసిందని కోరడం ద్వారా అతడు సంఘం యెడ తన గౌరవాన్ని ప్రదర్శించాడు.

3. మజ్ఝిమనికాయ, 1,2,6, 'అరియ పరియెసన సుత్త' చూడండి.

4. దేవత లంటే అంతరిక్ష దేవతలు. వీరు మామూలు భౌతిక నేత్రానికి కనిపించరు. ఈ స్త్రీ దేవత పూర్వ జన్మలో వ్యాపార వర్గానికి చెందిన ఆమె. బుద్ధుని జీవితానికి సంబంధించిన అనేక సందర్భాలలో అమానవ దేవత కనిపించడం చాల ఆసక్తి కరమైన విషయమే.

5. సత్తు అంటే వేయించిన పిండి. మధువు అంటే తేనె. ప్రాచీన భారత దేశంలో యాత్రికులకు ఈ రెండు అవశ్యక తినుబండారాలు.

6. చాతుమ్మహారాజికలు – నాలుగు దిక్కుల రక్షక దేవతలు.

7. నాలుగు పాత్రలు ఒకటిగా కలిసి పోవాలని బుద్ధుడు కోరు కొన్నాడని వ్యాఖ్యానం.

8. బుద్ధం శరణం గచ్ఛామి (బుద్ధుని శరణు వేడుతున్నాను). ధమ్మం శరణం గచ్ఛామి (ధర్మాన్ని శరణు వేడుతున్నాను). ఇంకా అప్పటికి సంఘం ఏర్పడలేదు గనుక, సంఘం శరణం గచ్ఛామి (సంఘాన్ని శరణు వేడుతున్నాను) అనే మూడో సూత్రాన్ని వారు జపించ లేదు. అర్థవంతంగా ఈ మూడు సూత్రాలను జపించడం ద్వారా ఎవరైన బౌద్ధుడు కావచ్చును.

9. జాతక వ్యాఖ్య ఇలా అంటున్నది : పూజించు కోవడానికి ఏదైన వస్తువును ఇమ్మని బుద్ధుని ఈ మొదటి బౌద్ధులు అడిగి నప్పుడు అతడు తనతలను చేతితో తాకి, కొన్ని వెంట్రుకలను వారికి ఇచ్చాడు.

ఈ అవశేషాలనే రంగూన్ లోని నేటి స్వెడాగన్ (Swe Dagon) పగొడ లో ప్రతిష్ఠించారని విశ్వసించ బడుతోంది. బర్మాబౌద్ధులకు ఇది ఎంతో గర్వ కారణం. ఈ బృహత్తరమైన గంటాకృతి చైత్యం. దూరాన్నుంచి చూస్తే బంగారు కొండలా కనిపిస్తుంది.

10. శూన్యావరణాన్ని (ఆకించిఞ్ఞాయతనం) అందుకొనే దాక బోధిసత్వునికి ధ్యానాలను బోధించిన ప్రథమ గురువు.

11. బోధిసత్వునికి అత్యంత ఉన్నత ఐహిక మానసికస్థితి వికాసాన్ని (న ఏవ సంఞ్ఞా న అసంఞ్ఞాయతన బోధించిన రెండో గురువు.

12. బుద్ధుడు ఈ మాటలు అన్న కారణం ఏమిటంటే, అతడు ఏ గురువు సహాయం లేక నే జ్ఞానోదయాన్ని సాధించాడు. జ్ఞానోదయానికి ముందు అతనికి గురువులు ఉన్నారు. కాని వారెవరు

బుద్ధత్వాన్ని పొందే విధానాన్ని చెప్ప లేక పోయారు. అందుకని, బౌద్ధం సహజంగానే హిందూ వాదంనుంచి పుట్టిందనడం సరి కాదు.

13. మజ్జిమనికాయ, 1,26, అరియ పరివేసన సుత్త, P. 171.

14. ఆరో ప్రకరణం చూడండి : (ధర్మ చక్ర ప్రవర్తన ఉపన్యాసం)

15. శబ్దార్థపరంగా ఏరును దాటగలిగినవాడు. (Stream winner)

16. ఆరో ప్రకరణం చూడండి (అనాత్మలక్షణం పై ఉపన్యాసం)

ఆరో ప్రకరణం

# ధర్మ చక్ర ప్రవర్తన సూత్రం

**మొదటి ఉపన్యాసం :**

''అన్ని మార్గాలలోకి అత్యుత్తమ మార్గం అష్టంగమార్గం.
అన్ని సత్యాలలోకి అత్యుత్తమ సత్యాలు నాలుగు ఆర్య సత్యాలు.
రాగరహిత స్థితి అన్నిస్థితులలోకి మంచిది.
ద్విపాదులలో అత్యుత్తముడు జ్ఞాన దర్శి''.

– ధమ్మపద, V. 273

**పరిచయం:**

ప్రాచీన భారతదేశం విశిష్ట దార్శనికులకు, మతాచార్యులకు ప్రసిద్ధి. జీవితాన్ని గురించి, జీవిత లక్ష్యాన్ని గురించి వీరికున్న అభిప్రాయాలు భిన్నాలు, వైవిధ్యాలు. బుద్ధునికాలంలో ఉన్న అరవై రెండు రకాల తాత్విక సిద్ధాంతాలను గురించి దీఘనికాయంలోని బ్రహ్మజాల సూత్రం పేర్కొంటున్నది.

ఆ రోజుల్లో ప్రబలంగా ఉన్న అన్ని మత సిద్ధాంతాలకు పూర్తిగ వ్యతిరేకమైంది భౌతిక వాదుల శూన్య వాదీయ సిద్ధాంతం. దీనిని ప్రతిపాదించిన చార్వాకుని పేరు మీదుగా దీనిని అనుసరించే వారిని చార్వాకులు అంటారు.

ప్రాచీన భౌతిక వాదాన్ని పాళీలోను, సంస్కృతంలోను 'లోకాయత[1]' అంటారు. దీని ప్రకారం, మరణంతో మానవుడు ఉచ్ఛేదిత మవుతాడు (నాశం అవుతాడు). అతడు తనను జనింప జేసిన శక్తి ఏదైనా ఉంటే దానిని వదిలి వెళతాడు. వారి ఉద్దేశంలో మరణం అన్నింటికి అంతం. ప్రకృత ప్రపంచం మాత్రమే నిజం. ''తిను, త్రాగు, సుఖంగా ఉండు, ఎందుకంటె అందరూ మరణించేవారే,'' అనే ఆదర్శం వారి మతాదర్శంగా కనిపిస్తుంది. ''మతం అనేది మతి మాలిన తప్పుడు మార్గం, అదొక మానసిక వ్యాధి.'' ''ధర్మం (సదాచారం= Virtue) అనేది భ్రాంతి, సుఖభోగమే వాస్తవం. జీవితం అంతం మరణం''. మంచిదైన, ఉన్నతమైన, శుద్ధమైన, అనుకంపాయుతమైన ప్రతి దానిని వారు అవిశ్వాసంతో చూశారు. ఇంద్రియ

సుఖం, స్వార్థం తన ఇష్టాన్ని గట్టిగా ప్రతిపాదించడం లాంటివే గొప్పవి. ''సహజాతాలు, మోహం, ప్రకృతి నుంచి మానవునికి సంక్రమించిన వారసత్వం కనుక వాటిని నియంత్రించాల్సిన అవసరం లేదు''[2], అని వారు చెప్పారు.

ఇది ఒక ప్రక్క అయితే, రెండో ప్రక్క, ముక్తి అనేది కఠోర సన్యాసత్వం, వల్ల మాత్రమే సాధ్యం అవుతుంది అనేది. ఇది శుద్ధమత సిద్ధాంతం. పెద్ద పెద్ద సన్యాసులు దీనిని పూర్తిగా విశ్వసించారు. బోధిసత్త్వుడు జ్ఞానసిద్ధి కోసం సమరం సాగిస్తున్న కాలంలో ఐదుగురు సన్యాసులు ఈ సిద్ధాంతానికే కట్టుబడి ఉన్నారు.

బుద్ధుడు గూడ, అతని జ్ఞానసిద్ధికి ముందు, అన్నిరకాల, రూపాల, కఠోర తపస్సునే ఆచరించాడు. అసాధారణమైన ఆరేళ్ళ సమరం తరవాత, తనను తాను శుష్కింప జేసు కోవడం అర్థ రహితమని అతడు గుర్తించాడు. ఫలితంగా, తన అర్థరహిత, శుష్క కఠోర ఆచరణను వదిలి మధ్యేమార్గాన్ని చేపట్టాడు. ఇలా మారడం వల్లనే అతని అనుంగు శిష్యులు అతనిని వదిలి వెళ్ళారు. వెళ్తూ వెళ్తూ వాళ్లు, ''సన్యాసి గౌతముడు, తపో సమరం మానేసి, విలాస జీవితాన్ని సుఖ జీవితాన్ని పరిగ్రహించాడు,'' అని అన్నారు.

వారు ఆయన్ను వదిలి వెళ్ళడం ఆయనకు భౌతికంగా కొరతే. ఎందుకంటే, వారు ఆయన అవసరాలు తీర్చే వారు. అయినా అతడు నిరాశ చెంద లేదు. వజ్ర సంకల్పుడైన బోధిసత్త్వుడు, వాళ్ళు వెళ్ళి పోవడం ద్వారా తన మానాన తనను ఉండనిచ్చి నందుకు, బహుశ సంతోషించి ఉంటాడు. తరగని ఉత్సాహంతో, మళ్లీ తెచుకొన్న శక్తితో, అతని జీవిత లక్ష్యమైన జ్ఞానోదయం కలిగే వరకు తన సమరం సాగించాడు.

జ్ఞానోదయమైన తరవాత, కచ్చితంగా రెండు నెలల తరవాత, ఆసాల (ఆషాఢ) పూర్ణిమ నాడు, తనకు పరిచర్యలు చేస్తున్న ఆ ఐదుగురు సన్యాసులకు బుద్ధుడు తన మొదటి ఉపన్యాసాన్ని చేశాడు.

**బుద్ధుని మొదటి ఉపన్యాసం**

బుద్ధుని మొదటి ఉపన్యాసానికిచ్చిన పేరు ధమ్మచక్కప్పవత్తన (ధర్మ చక్ర ప్రవర్తన). దీనిని తరచు ''సత్య సామ్రాజ్యంగా'', ''సదాచార మార్గ రాజ్యం''గా ''ధర్మ చక్రం''గా వ్యాఖ్యానించడం జరిగింది. వ్యాఖ్యాతల ప్రకారం ఇక్కడ, 'ధమ్మం' అంటే జ్ఞానం, 'చక్క' అంటే స్థాపించడం; అందుకని 'ధమ్మ చక్కం' అంటే, 'జ్ఞాన సంస్థాపనం,' ధమ్మ చక్క ప్పవత్తన అంటే, జ్ఞాన సంస్థాపనాన్ని వివరించడం. ధమ్మానికి సత్యమని గూడ అర్థం చెప్ప

వచ్చు. చక్క అంటే చక్రం. ధమ్మ చక్కప్పవత్తన అంటే అర్థం సత్య చక్రాన్ని తిప్పడం లేదా స్థాపించడం[3].

ఈ అత్యంత ముఖ్యమైన ఉపన్యాసంలో బుద్ధుడు, తాను కనుగొన్న మధ్యేమార్గాన్ని, వివరించాడు. ఇది అతని నూతన బోధ సారాంశం. బుద్ధుడు ఆ ఐదుగురు యతులకు ఒక హెచ్చరిక చేస్తూ ఇలా ఉపదేశించాడు: ''స్వసుఖాలలో మునిగి తేలడం ఒక కొస అయితే, పూర్తిగా శరీరాన్ని శుష్కింప జేసే కఠోర తపస్సు ఆచరణం మరొక దరి. ఈ రెండు దరులు మీకు శాంతిని, మోక్షాన్ని ఇవ్వవు. కనుక ''అతి'' పనికి రాదు. ఈరెండు దరులను మీరు వదిలి పెట్టండి. మీరు ఇప్పటి వరకు కఠోర సన్యాసాన్ని నమ్మి ఉన్నారు. స్వసుఖ లాలస ఆధ్యాత్మిక వికాసాన్ని అరి కడుతుంది. రెండోదైన శరీరాన్ని ఎండగట్టడం బుద్ధిని నాశనం చేస్తుంది.'' అతడు. రెండు మార్గాలను విమర్శించాడు. ఎందుకంటె అతడు తన వైయక్తిక అనుభవం ద్వారా వాటి నిరర్థకతను, శుష్కతను తేల్చు కొన్నాడు. ఆ అనుభవం నుంచే, పరిపూర్ణతకు, కేవల విముక్తికి దారి తీసే హేతుబద్ధమైన, లాభదాయకమైన, అత్యంత ఆచరణ యోగ్యమైన మార్గాన్ని ప్రతి పాదించాడు.

ఈ ప్రథమ ఉపన్యాసాన్ని, బుద్ధుడు, కాశీకి దగ్గరలో ఉన్న ఇసి పట్టణ హరిణ వనంలో ఉండగా చేశాడు.

ఆయన ఉపన్యాసాన్ని వినడానికి అక్కడున్న మానవ మాత్రులు, బుద్ధునితో ఆరేళ్ళ పాటు అతి సన్నిహితంగా మెలిగిన ఆ ఐదుగురు మాత్రమే. గ్రంథాల ప్రకారం, ఆ ఉపన్యాసాన్ని వినే బంగారు అవకాశాన్ని అగోచరులైన అనేక మంది దేవతలు, బ్రాహ్మణులు దక్కించు కొన్నారు. ఈ ప్రపంచం కాక ఇంకా ఇతర ప్రపంచా లున్నాయని, వాటిల్లో కంటికి కన పడని సూక్ష్మ శరీరులు ఉంటారని బౌద్ధులు విశ్వసిస్తారు. వీరే కాక, బహుశ దేవతలు, బ్రాహ్మణులు, బహుశ ఆ గొప్ప సమయంలో ఉండి ఉండ వచ్చు. అయినా, బుద్ధుడు ముఖ్యంగా ఉద్దేశించింది ఆ ఐదుగురినే. ఆ ఐదుగురికే ఆయన ఉపన్యసించిందీను.

మొదట బుద్ధుడు వారిని ఏ దరికి అతిగా పోవలదని వారించాడు. అతడుపయోగించిన అసలు పదాలు, ''రెండు అంత్యాలు (ఆచివర, ఈ చివర) ఉన్నాయి. ఏ సన్యాసి (పబ్బజితెన) వాటిని కౌగిలించు కోరాదు.'' ఆరెండు అంతాలకు అంటే ఆ చివర ఈ చివరలకు ప్రాముఖ్యం ఇచ్చి చెప్పాడు. 'పబ్బజిత' అంటే ప్రపంచాన్ని సన్యసించిన వాడు. (''పబ్బజ్జ'' అంటే ఇంటిని వదిలి ఇల్లు లేని జీవితాన్ని పరిగ్రహించడం.)

బుద్ధుని మాటలలో చెప్పాలంటే ఒక అంతం (extreme) నిరతం ఇంద్రియ సుఖాలకు అంటిపెట్టుకు ఉండడం. ఈ అంతాన్ని బుద్ధుడు నీచ మైందిగా, గ్రామ్య మైందిగా, ఐహిక మైందిగా, అగౌరవ మైందిగా, ప్రయోజనం లేనిదిగా వర్ణించాడు.

దీనిని బట్టి బుద్ధుడు అందరిని ఇల్లువాకిలి వదిలి, భౌతిక సుఖాలను వదులు కొని, జీవితాన్ని అనుభవించ కుండ, సన్యాసం తీసుకొని, అడవులకు పొమ్మన్నాడని అర్థం చేసుకో రాదు. బుద్ధుడు అంత సంకుచిత మనస్కుడు కాడు.

దీనిని గురించి ఇంద్రియ లోలుడు ఏమనుకొన్నా గాని, నిష్పక్షపాతంగా చూస్తే, ఇంద్రియ సుఖాలు క్షణికాలే నని, అవి పూర్తి తృప్తి నివ్వవని, చివరికి చేదు అనుభవాలు మిగులుస్తాయని తెలుతుంది. ఈ ప్రాపంచిక సుఖాన్ని గురించి మాటాడుతూ బుద్ధుడు –''మామూలు మనిషికి ధనార్జన, సంపదలను అనుభవించడం, అనేవి రెండూ సంతోషానికి మూలం. అవగాహన ఉన్న సన్యాసి ఎవరూ ఈ క్షణిక సుఖాల వెంటపడడు. సగటు మానవునికి ఆశ్చర్యం కలిగించే విధంగా, అతడు వాటిని దూరంగా ఉంచుతాడు. ఏది మొదటి వానికి సంతోషం కలిగిస్తుందో రెండోవానికి అదే భీతిని కలిగిస్తుంది. ఈ రెండోవానికి పరిత్యాగం ఒక్కటే సంతోషం ఇవ్వగలదు,'' అన్నాడు.

రెండో అంత్యం (extreme) కఠోర నియమాలతో శరీరాన్ని శిక్షించడం. దీనిని మామూలు మనిషి పాటించడు. బుద్ధుని దృష్టిలో అది బాధాకరం, హీనం, ప్రయోజన రహితం. మొదటి దాని లాగ దీనిని ఐహికమని నీచ మని గ్రామ్యమని వర్ణించ లేదు. ఈ మూడు పదాలను ఉపయోగించక పోవడం గమనార్హం. నియమం ప్రకారం చెప్పా లంటే, ఇంద్రియ సుఖాలను త్యజించిన నిజాయితీ పరుడైన సన్యాసి, ఈ జీవిత దుఃఖాల నుంచి విముక్తం చెందడానికి, ఈ బాధాకారమైన పద్ధతిని అవలంబిస్తాడు. ఈనిరర్థక పద్ధతిలోని బాధాకర అనుభవాన్ని రుచి చూసిన బుద్ధుడు, దానిని నిరుపయోగ మన్నాడు. అది బాధను పెంచుతుందేకాని తగ్గించదు అన్నాడు.

బుద్ధుడు అసలు విషయాలను స్పష్టం చేసి, తన శ్రోతలలోని దురభిప్రాయయాలను తొలగించాడు. వారి క్లేశ మనస్సులు నిర్మలాలు కాగానే, బుద్ధుడు ఈ రెండు అంతాలకు సంబంధించిన తన అనుభవాలను చెప్పాడు.

తాను తథాగతుడుగా ఈరెండు అంత్యాలలోని దోషాలను గుర్తించి మధ్యే మార్గన్ని అవలంబించానని బుద్ధుడు వారికి చెప్పాడు. ఈ నూతన పథాన్ని లేదా మార్గాన్ని అతడే కనుగొన్నాడు. ఈ నూతన దర్శనానికి అతడు ''మజ్జిమా పతిపదా''–మధ్యమ మార్గమని పేరు పెట్టాడు. ఈ మధ్యమ మార్గాన్ని తన శిష్యులు అనుసరించడం కోసం, దాని అనేక లాభాల గురించి చెప్పాడు. ఆ రెండు విరుద్ధ అంత్యాల వలె కాక, ఈమధ్యమ మార్గం వస్తువులను ఉన్నవాటిని ఉన్నట్లు – చూడ డానికి అవసరమైన ధార్మిక ప్రజ్ఞ (Spiritual

insight) ను బౌద్ధిక జ్ఞానాన్ని (Intellectual wisdom) ప్రసాదిస్తుంది. ప్రజ్ఞ (insight) స్పష్టతను సంతరించుకొన్నప్పుడు, బుద్ధి నిశితమైనప్పుడు ప్రతి దానిని దాని యథార్థ రూపంలో చూడ వచ్చు.

ఇంకా, క్లేశాలను ఉద్దీపింప చేసే మొదటి అంత్యంలా కాక, ఈ మధ్యమ మార్గం మోహ వికారాలను అణచి వేస్తుంది. దీని వల్ల శాంతి చేకూరుతుంది. అన్నింటి కంటె ముఖ్యంగా, అది బుషిత్వానికి ఉన్న నాలుగు లోకోత్తర మార్గాలకు, నాలుగు ఆర్యసత్యాలను అర్థం చేసు కోవడానికి, చివరకు, పరమ లక్ష్యమైన నిర్వాణ యథార్థీకరణానికి తీసుకు వెళ్తుంది.

మరి ఆ మధ్యమ మార్గం ఏమిటి? బుద్ధుడు సమాధానం చెబుతాడు: ''అది ఆర్య అష్టాంగ మార్గం''. ఇందులోని ఎనిమిది అంశాలను ఉపన్యాసంలో పేర్కొన్నాడు.

మొదటిది సమ్యక్ దృష్టి. ఇది బౌద్ధానికి కీలకాంశం. సన్యాసుల శంకలు తీర్చి వారిని సరైన మార్గంలో నడప డానికి బుద్ధుడు సమ్యక్ దృష్టితో ప్రారంభించాడు. సమ్యక్ దృష్టి ''ఒకడు వాస్తవంగా ఏమిటో ఆ జ్ఞానాన్ని అతనికి అంద జేస్తుంది; అది విరాగానికి లేదా పరిత్యాగానికి, మైత్రికి, నిరపాయకరతకు సంబంధించిన ఆలోచనలకు దారి తీస్తుంది. ఇవన్నీ స్వార్థ పరత్వానికి, చెడు సంకల్పానికి, క్రౌర్యానికి వ్యతిరేకాలు. సరైన ఆలోచనలు (సమ్యక్ సంకల్పాలు) సమ్యక్ వాక్కుకు, సమ్యక్ కర్మకు, సమ్యక్ ఆ జీవనానికి - ఈ మూడు కారకాలు ఒక వ్యక్తి నీతిని పరిపూర్ణంగావిస్తాయి దారి తీస్తాయి. ఆరోది సమ్యక్ కృషి. ఇది దుష్టస్థితులను తొలగించి మంచి స్థితులను నెల కొలప డానికి దారి తీస్తుంది. ఈ రకంగా ఒకడు తనను తాను క్షాళనం చేసు కోవడం జాగరూక అంతః పరీక్షణం (Introspection) వల్ల సాధ్యం అవుతుంది. దీనికి ఏడోదైన **సమ్యక్ అవధానం** అవసరం. **సమ్యక్ కృషి సమ్యక్ అవధానాలు** మిళితమైనప్పుడు, సరైన ఏకాగ్రత - అంటే మనస్సు ఏక బిందువుపై కేంద్రీకరించడానికి - వీలవుతుంది. ఏకాగ్రత అనేది ఎనిమిదో అంగం. ఏకబిందు కేంద్రీకృతమైన మనస్సు పాలిష్‌చేసిన అద్దం లాంటిది. ఇందువుల్లో ప్రతిదీ ఉన్నది ఉన్నట్లు కనిపిస్తుంది.

రెండు అంత్యాలను, తన మధ్యమ మార్గాన్ని, తన ఉపన్యాసానికి ఉపోద్ఘాతంగా చేసుకొని, ఆ తరవాత నాలుగు ఆర్య సత్యాలను వివరించాడు.

సత్యానికి పాలీమాట సచ్చ. దీనికి అర్థం ''ఉన్నదేదో అది''. సత్యం సంస్కృతపదం. దీని అర్థం 'అప్రత్యాఖ్యేయ' అంటే నిర్ద్వంద్వమైన విషయం. అటువంటి నాలుగు సత్యాలను బుద్ధుడు ప్రతిపాదించాడు. అవి అతని బోధకు పునాదులు. అవి మానవ జీవికి

సంబంధించినవి. అతని సిద్ధాంతం, దేవుని కేంద్రంగా చేసుకొన్న ఇతర మతాల్లాంటిది కాక, మానవుని కేంద్రంగా చేసు కొంది. బుద్ధుడు పుట్టినా పుట్టక పోయినా, ఈ సత్యాలు ఉంటాయి. వాటిని 'ఒక' బుద్ధుడు ఈ విమోహిత ప్రపంచానికి ఆ విష్కరిస్తాడు. అవి కాలంతో మారేవికావు, ఎందుకంటే అవి శాశ్వత సత్యాలే. వాటిని తాను ఆవిష్కరింప జేసుకోవడంలో బుద్ధుడు ఎవరికి రుణ పడి లేడు. ఈ విషయాన్ని అతడు ఈ ఉపన్యాసంలో చెప్పిన దానిని బట్టి, అర్థం చేసు కోవచ్చు: ''అంతకు ముందు ఎవరూ వినని విషయాలకు సంబంధించి, నాలో ఒక నేత్రం, ఒక జ్ఞానం, ఒక వివేకం, ఒక ప్రజ్ఞ, ఒక ప్రకాశం పుట్టాయి.'' ఈ మాటలు చాల ముఖ్యం. ఎందుకంటె వీటిని బట్టి అతని నూతన బోధలోని మౌలికతను తెలుసు కోవచ్చు. అందు వల్ల హిందూ దర్శనానికి బౌద్ధదర్శనానికి మధ్య కొన్ని సామాన్య లక్షణాలున్న మాట నిజమే అయినా, బౌద్ధం, హిందూమతం నుంచి నిష్పన్నమైనదని చెప్పడం సబబు కాదు.

ఈ సత్యాలను పాళీలో అరియ సచ్చాని (అర్యసత్యాలు) అంటారు. వాటిని అలా ఎందుకంటారంటే, అత్యంతంగా గొప్పవాడైన అరియ[4] (ఆర్యుడు = శ్రేష్ఠుడు) వాటిని కనిపెట్టాడు. అరియ అంటే క్లేశాలను క్షాళనం చేసుకొన్న వాడు.

మొదటి ఆర్యసత్యం దుఃఖాన్ని గురించి చెబుతుంది. మామూలుగా దుఃఖాన్ని ఆంగ్లంలోకి Suffering (పీడ, క్లేశం, వ్యధ) లేదా Sarrow (శోకం, ఖేదం, ఆర్తి) అనే పదాల ద్వారా అనువదిస్తారు. అవేవి సరి అయిన అనువాదాలు కావు. అంతకంటె దగ్గరగా చెప్పే పదాలు ఆంగ్ల భాషలో లేవు. దుఃఖాన్ని వేదనగా చూసినట్లయితే, భరించరాని దని అర్థం. దానిని అమూర్తార్థం (abstract) లో చూసి నట్లయితే 'దు' అంటే అమంతవ్య, తిరస్కార్య, 'ఖ' అంటే శూన్య, ఖాళీ[5]. ప్రపంచం పీడామయం కనుక 'అమంతవ్యం'. ఈ ప్రపంచం వాస్తవం కాదు కనుక 'ఖాళీ' ది. అందుకని దుఃఖం అంటే అర్థం అమంతవ్య శూన్యం, తిరస్కరించదగిన ఖాళీ.

సగటు మనుషులు ఉపరితాలన్నే దర్శిస్తారు. అరియ (ఆర్య) 'వస్తువులు వాస్తవంగా ఎలా ఉన్నాయోఅలానే' వాటిని చూస్తాడు.

అరియకు (ఆర్యునికి) జీవిత మంతా దుఃఖ మయం. అతనికి ఈ ప్రపంచంలో సుఖం అనేది లేదు. అది మానవాళిని భ్రాంతి పూర్వక సుఖాలతో మోసగిస్తుంది. భౌతిక సుఖాలు కొన్ని వాంఛాలను తృప్తి పరి చేవి మాత్రమే.

అన్నీ పుట్టేవే. పుట్టిన ప్రతిదీ జీర్ణమై, రోగాలకు నిలయమై అంతిమంగా మరణించేదే. ఎవడూ గూడ ఈ నాలుగు రకాల దుఃఖ కారణాలకు అతీతుడు కాడు.

తీరని కోరికలు తీరడం గూడ దుఃఖమే. ఎవడూ గూడ తనకు ఇష్టం లేని వస్తువుల, వ్యక్తుల దరి చేరాలని కోరు కోడు. అలాగే తనకు ఇష్టమైన వస్తువుల, వ్యక్తుల నుంచి దూరం కావాలని కోరుకోడు. ఇది సహజ నియమం. కాని కోరు కొన్నవన్నీ ఎప్పుడూ పూర్తిగా తీరవు. కొన్నిసార్లు ఒకడు ఆశించనివీ, వాంఛించనివీ, అతనిని చుట్టు ముడతాయి. అటువంటి ఆశించని, అసంతోషకర పరిస్థితులు ఎదురైనప్పుడు బలహీనులు అజ్ఞానులు, ఆత్మహత్యే పరిష్కారమార్గమని, దానికి పాల్పడతారు.

అసలైన సుఖం అంతరంగంలో ఉంది. అది సంపద, అధికారం, గౌరవం, విజయాలలో లేదు. అటువంటి ఐహిక విషయాలను బలవంతంగా గాని, అన్యాయం గాని పొందినా, లేదా అవి తప్పుదారి పట్టినా, లేదా వాటిని రాగ దృష్టితో చూసినా, అవి దుఃఖ హేతువులే అవుతున్నాయి. వాటిని పొందిన వారికి దుఃఖమే మిగులుతుంది.

ఒక సామాన్యునికి మామూలుగా ఇంద్రియ సుఖాలే ముఖ్యం. అవే అత్యంత సుఖ దాయకాలు. అటు వంటి క్షణ భంగురాలైన సుఖాలను ఆశించడంలో, తృప్తి పొందడంలో, వాటిని సింహావ లోకనం చేసు కోవడంలో ఒకడు సుఖంగా ఉన్నా నను కోవచ్చు. కాని అవి తాత్కాలికం, భ్రమ పూరితాలు. బుద్ధుని ప్రకారం భౌతిక సుఖాల యెడ విరాగం లేదా వాటి అధిగమనం ఇంకా గొప్ప ఆనందం.

క్లుప్తంగా చెప్పాలంటే సమ్మిశ్రణమైన ఈ దేహం దుఃఖ కారణమే!

మూడురకాల తృష్ణ (దప్పిక)లు ఉన్నాయి. మొదటిది స్థూల రూపం. దీనిని కామ తృష్ణ అంటారు. ఇది అన్నిరకాల ఇంద్రియ సుఖాలను కోరడం. రెండోది భవ తృష్ణ. 'ఉండా' లనే కోరిక. అంటే అస్తిత్వ కోరిక. మూడోది విభవతృష్ణ. ఇది అనస్తిత్వ రాగం. 'లేకుండా' లనే కోరిక. వీటిని వ్యాఖ్యానాలప్రకారం అర్థం చేసు కొంటే, చివరి రెండు తృష్ణలు - ఒకటి శాశ్వతత్వంతో ముడివడిన ఐంద్రియక సుఖాల మీది రాగం, రెండోది శూన్యవాదంతో (nihilism) ముడివడిన ఐంద్రియక సుఖ లాలస. భవతృష్ణను రూప భూమికల పై రాగంగాను, విభవ తృష్ణను అరూప భూమికల మీది రాగం గాను చెప్ప వచ్చు. ఎందుకంటే రూప రాగ, అరూప రాగాలు రెండూ బంధాలుగా పరిగణించ బడ్డాయి.

ఈ తృష్ణ, అందరిలోను గుప్తంగా ఉన్న అతి శక్తి మంతమైన మానసిక శక్తి. జీవిత కష్టాలలో ఎక్కువ వాటికి ఇదే ముఖ్య కారణం. ఈ తృష్ణే- అది స్థూలం గాని, సూక్ష్మంగాని -సంసార చక్రంలో తిరిగి తిరిగి జన్మించడానికి కారణ భూత మవుతున్నది. జీవిత రూపాలకు పట్టుకు వేళ్ళాడేట్టు చేసేదీ ఇదే.

సన్యాసత్వంలో రెండోదశ అయిన ''సకదాగామి'' (ఒకసారి తిరిగి వచ్చేవాడు) స్థితి చేర గానే తృష్ణ స్థూల రూపాలు కృశించి, మూడో దశ అయిన ''అనాగామి'' (తిరిగిరాని వాడు) స్థితి చేరగానే అవి పూర్తిగా పెకలించి వేయ బడతాయి. తృష్ణ స్థూల రూపాలు అర్హతత్వ స్థితి చేర గానే పూర్తిగా పెకలించి వేయబడతాయి.

మొదటి ఆర్యసత్య సమ్యగవగాహన, తృష్ణ నాశానికి దారితీస్తుంది. ఈ విధంగా రెండో ఆర్య సత్యం, బాహ్య ఇంద్రియ వస్తువుల యెడ మామూలు మనిషికి ఉన్న దృక్పథంతో వ్యవహరిస్తుంది.

మూడో ఆర్యసత్యం పూర్తి దుఃఖ పరిచ్ఛేదాన్ని చెబుతుంది. ఇదే నిర్వాణం – బౌద్ధుల పారమార్థిక లక్ష్యం. అన్ని రకాల, రూపాల తృష్ణను తీసి వేసు కోవడం ద్వారా, ఈ జన్మలోనే, దానిని సాధించ వచ్చు.

బాహ్య ప్రపంచంతోడి రాగాన్ని పరిత్యజించడం ద్వారా మనోనేత్రంతో నిర్వాణాన్ని చూడ వచ్చు.

జీవి, దాని వివిధ పక్షాల మీద ఆధారపడిన ఈ ప్రథమ ఆర్య సత్యాన్ని జాగ్రతగా దర్శించి, విశ్లేషించి, పరీక్షించాలి. ఈ పరీక్షతో ఒకడు తనను ''ఉన్నవానిని ఉన్నట్లుగా'' అర్థం చేసు కోవ డానికి వీలవుతుంది.

ధమ్మ పద ఇలా అంటున్నది :

''తృష్ణ నుంచి శోకం కలుగుతుంది. తృష్ణ నుంచి భీతి జనిస్తుంది. ఎవడు తృష్ణను జయిస్తాడో అతనికి శోకం లేదు. భయం అంత కంటె లేదు.'' (V.216).

తృష్ణ పునర్జన్మకు (పొనొభవిక) దారి తీస్తుందని బుద్ధుడు చెప్పాడు. బుద్ధుడు పునర్జన్మ సిద్ధాంతాన్ని ప్రతిపాదించ లేదనే పండితు లున్నారు కనుక ఈ సందర్భంలో ఈ పాళీ పదాన్ని (పొనొభవిక) గుర్తుంచు కోవాలి. ఈ రెండో సత్యం పరోక్షంగా గత, వర్తమాన, భావి జన్మల గురించి చెబుతుంది.

ఆర్య అష్టాంగమార్గాన్ని (అరియఠ్ఠఙ్గిక మగ్గ) అభివృద్ధి చేసు కోవడం ద్వారా ఈ మూడో సత్యాన్ని చేరాలి. ఈ అనన్య పథం ఒకటే నిర్వాణానికి సూటి మార్గం. ఇది నాలుగో ఆర్యసత్యం.

నాలుగు సత్యాలను బుద్ధుడు అనేక విధాలుగా వివరించి, ఆ తరవాత తన ఉపన్యాసాన్ని ఇలా ముగించాడు :

''ఓభిక్కులారా, ఈ నాలుగు సత్యాలకు, వాటి మూడు పక్షాలకు, పన్నెండు రీతులకు సంబంధించిన కేవలము, సత్యము, అంతర్బోద్ధికము (intuitive) అయిన జ్ఞానం స్పష్టంగా అర్థం కానంత వరకు, ఆ సదృశ పరమ జ్ఞాన సిద్ధి పొందానని నేను చెప్ప లేదు.

''ఈ సత్యాలకు సంబంధించిన కేవల సత్య అంతర్బోద్ధిక జ్ఞానాన్ని నేను పరిపూర్ణంగా దర్శించి నప్పుడు మాత్రమే. ఆ అనన్య పరమ జ్ఞానసిద్ధి (అనుత్తర సమ్మాసంబోధి) ని పొందానని చెప్పాను.

''నాకు జ్ఞానం, ప్రజ్ఞ కలిగాయి. నా మనస్సు పొందిన విముక్తి అప్రతిహతం. ఇది నా చివరి జన్మ. ఇక మరి నాకు మరో అస్తిత్వం అంటూ లేదు.''

ఉపన్యాసాంతానికి, ఐదుగురిలోకి పెద్దవాడైన కొండణ్ణ ధమ్మాన్ని పూర్తిగా అర్థం చేసుకొన్నాడు. సన్యాసంలో ప్రధమ దశను పొందడంతో, ఏది జనన శీలమైందో, ఏది మరణశీలమైందో గ్రహించాడు - (యమ్ కిఞ్చి సముదయ ధమ్మం సబ్బమ్ తమ్ నిరోధ ధమ్మం).

బుద్ధుడు ధర్మ చక్రోపన్యాసాన్ని విశదీకరించి నప్పుడు భూదేవతలు హర్షధ్వానాలు చేశారు: ''ఈ ప్రపంచంలో ఎవరూ, సన్యాసి గాని, పూజారిగాని, దేవుడు గాని, మారుడు గాని లేదా బ్రహ్మగాని వివరించ లేని ధర్మచక్రాన్ని బుద్ధుడు బెనారస్ సమీపంలోని ఇసి పట్టణం హరిణ వనంలో వివరించాడు.''

దీనిని వినడంతో, అన్ని ఇతర భూమికలలోని దేవతలు, బ్రాహ్మణులు అదే విధంగా హర్షధ్వానం చేశారు.

దేవతల వెలుగును మించిన ప్రభాస ఈ ప్రపంచంలో కని పించింది.

ధర్మప్రభాస ప్రపంచం మొత్తాన్ని దీప్తి మంతం చేసింది. జీవు లందరికి సుఖ శాంతులు తెచ్చింది.

## బుద్ధుని ప్రధమోపన్యాసం

### *ధర్మ చక్ర ప్రవర్తన సూత్రం*

నేను ఇలా విన్నాను :

ఒకసారి బుద్ధుడు కాశీ సమీపంలో ఇసి పట్టణం[7] హరిణ వనంలో ఉంటున్నాడు. అక్కడ బుద్ధుడు ఐదుగురు యతి సమూహాన్ని సంబోధించి ఇలాచెప్పాడు:

''ఓ భిక్కులారా! పరిత్యాగం చేసిన ప్రతి ఒక్కడు పరిహరించాల్సిన రెండు అంత్యాలు (extremes) ఉన్నాయి:

(i) ఇంద్రియక సుఖాలలో ఓలలాడడం – ఇది నీచం, ఛండాలం, ఐహికం, అగౌరవం, నిష్ప్రయోజనం.

(ii) కఠోర తపస్సుతో శుష్కింప జేసుకోవడం – ఇది బాధాకరం, అగౌరవం, నిష్ప్రయోజనం''.

''ఈరెండు అంత్యాలను విడనాడి తథాగతుడు[8] మధ్యేమార్గాన్ని (మజ్జిమా పటిపదా) గ్రహించాడు. ఈ మార్గం దృష్టిని (చక్కు), జ్ఞానాన్ని పెంచుతుంది. శాంతిని (ఉపసమాయ)[9] ఉన్నతజ్ఞానాన్ని (అభిజ్ఞానాన్ని), జ్ఞానసిద్ధిని (సంబోధాయ)'' నిర్వాణాన్ని (నిబ్బాణాన్ని) ప్రసాదిస్తుంది.

''దృష్టిని, జ్ఞానాన్ని, శాంతిని, అభిజ్ఞానాన్ని, జ్ఞానసిద్ధిని, నిర్మాణాన్ని ప్రసాదించే, తథాగతుడు కనుగొన్న ఆ మధ్యమ మార్గం, ఓ భిక్కులారా, ఏది?

అది ఆ ఆర్య అష్టాంగ మార్గమే–అంటే సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ ఆ జీవం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి (సమ్మసతి), సమ్యక్ సమాధులతో గూడిన మార్గం. ఇదే బుద్ధుడు కనుగొన్న ఆర్య అష్టాంగ మార్గం.''

బుద్ధుడు తన ఉపన్యాసాన్ని కొన సాగించాడు :

''భిక్కులారా ఇది దుఃఖ ఆర్యసత్యం (దుఖ– అరియ–సచ్చ). పుట్టడం దుఃఖం, క్షయీ కరణం దుఃఖం, రోగం దుఃఖం, మరణం దుఃఖం. అసంతోషకరమైన వాటికి దగ్గర కావటం దుఃఖం. సంతోషకరమైన వాటికి దూరం కావడం దుఃఖం. అనుకొన్నది పొంద లేక పోవడం దుఃఖం. క్లుప్తంగా చెప్పాలంటే, రాగ సంబంధమైన పంచస్కంధాలు[12] (పంచ పాదాన ఖంధ) దుఃఖం. హేభిక్కులారా, ఇది దుఃఖ కారణ ఆర్య సత్యం. (దుఃఖ అరియ సముదయ అరియ సచ్చ).

''ఈ తృష్ణే పునర్జన్మ (పొనొభవిక)ను కలిగించేది. దీనితో పాటు, ఇది కావాలి, అదికావాలి (ఆ జీవితం కావాలి) అంటూ పట్టుకు వేళ్ళాడే గుణం దీనికి సహచరి అయి వస్తుంది. ఇది ఇంద్రియ సుఖాల తృష్ణ (కామ తృష్ణ), భవం కోసం తృష్ణ (భవతృష్ణ), అనస్తిత్వం కోసం తృష్ణ (విభవ తృష్ణ).

''హేభిక్కులారా'' ఇది దుఃఖ నిరోధ సత్యం (దుఃఖ నిరోధ అరియ సచ్చ) :

ఈ తృష్ణకు దూరం కావడం, తృష్ణను నాశనం చేయడం, దానిని వదిలి వేయడం, పరిత్యాగం చేయడం, దానినుంచి విముక్తి పొందడం, అలా దానినుంచి విరాగం చెందడం.

''ఇప్పుడు భాక్కులారా, దుఃఖనిరోధ ఆర్యసత్యం ఇదిగో. (దుఃఖ.నిరోధ అరిమ సచ్చ) :

ఈ తృష్ణకు దూరం కావడం, దానిని నాశం చేయడం, దానిని పరిత్యజించడం దానిని నుంచి విముక్తి పొందడం. దాని యెడల రాగరహితులు కావడం.

''ఇప్పుడు భిక్కులారా, దుఃఖ నిరోధానికి దారితీసే మార్గ ఆర్యసత్యం గురించి చెబుతాను.

''ఇది ఆర్య అష్టాంగ మార్గం - అంటే సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధులతో గూడిన మార్గం.

I. (i) ''ఇది దుఃఖ ఆర్య సత్యం''

ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ వినని ఈ విషయాలకు సంబంధించి, నాలో ఒక చూపు, జ్ఞానం, దర్శనం, ప్రజ్ఞ, ప్రభాసలు పుట్టాయి.

(ii) ''ఈ దుఃఖ ఆర్యసత్యం జ్ఞాతమై తీరాలి.''

''ఈ విధంగా భిక్కులారా, ఇంతకు ముందెన్నడూ వినని, కనని విషయాల గురించి, నాలో ఒక చూపు, జ్ఞానం, అవగాహన, ప్రజ్ఞ, ప్రభాసలు కలిగాయి.

(iii) ''ఈ దుఃఖ ఆర్యసత్యం జ్ఞాతమైంది.''

''ఈ విధంగా ఓ భిక్కులారా. ఇంతకు ముందు ఎన్నడూ వినని కనని విషయాలకు సంబంధించిన చూపు, జ్ఞానం, ప్రజ్ఞ ప్రభాసలు నాలో కలిగాయి''.

2.(i) ''ఇది దుఃఖ ఆర్యసత్య కారణం''

''ఈ విధంగా ఓ భిక్షువులారా, ఇంతకు ముందు కని, విని ఎరుగని విషయాలకు సంబంధించిన చూపు, జ్ఞానం, అవగాహన, ప్రజ్ఞ ప్రాభాసలు నాకు కలిగాయి''.

(ii) ''ఈ దుఃఖ ఆర్యసత్యకారణ నిర్మూలనం జరగాలి[13].''

''ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ కని విని ఎరుగని విషయాలకు సంబంధించిన చూపు, అవగాహన, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలిగాయి''.

(iii) ''ఈ దుఃఖ ఆర్య సత్యం నిర్మూలిత మైంది.''

''ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు కనని వినని విషయాలకు సంబంధించిన చూపు, అవగాహన, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలిగాయి''.

3 (i) ''ఇది దుఃఖనిరోధ ఆర్య సత్యం''.

ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు మును పెన్నడూ, కని విని ఎరుగని విషయాలకు సంబంధించిన జ్ఞానం, అవగాహన, చూపు, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలిగాయి.

(ii) ''ఈ దుఃఖ నిరోధ ఆర్యసత్యాన్ని గుర్తె రగాలి''

''ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ కని, విని ఎరుగని విషయాలకు సంబంధించిన చూపు, అవగాహన, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలోకలిగాయి''.

(iii) ''ఈ దుఃఖ నిరోధ ఆర్య సత్యం నాలో యధార్ధీకరణం చెందింది''

''ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ కనివిని ఎరుగని విషయాలకు సంబంధించిన చూపు, అవగాహన, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలిగాయి''.

4.(i) ''దుఃఖ నిరోధానికి దారితీసే మార్గానికి సంబంధించిన ఆర్య సత్యం ఇది.''

''ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ కని విని ఎరుగని విషయాలకు సంబంధించిన చూపు, అవగాహన, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలగాయి''.

(ii) ''దుఃఖ నిరోధానికి దారి తీసే మార్గానికి సంబంధించిన ఆర్య సః ్యన్ని వికసింప చేసుకోవాలి.''

''ఈ విధంగా, ఓ భిక్కులార, ఇంతకుముందు ఎన్నడూ కని విని ఎరుగని విషయాలకు సంబంధించిన అవగాహన, చూపు, జ్ఞానం, ప్రజ్ఞ ప్రభాసలు నాలో కలిగాయి.''

(iii) ''దుఃఖ నిరోధానికి దారి తీసే మార్గానికి సంబంధించిన ఆర్య సత్యం వికసించింది.''

ఈ విధంగా ఓ భిక్కులారా, ఇంతకు ముందు ఎన్నడూ కని విని ఎరుగని విషయాలకు సంబంధించిన అవగాహన, చూపు, జ్ఞానం, ప్రజ్ఞ, ప్రభాసలు నాలో కలిగాయి.''

ఉపన్యాసాన్ని ముగిస్తూ బుద్ధుడు ఇలా చెప్పాడు:

''హే భిక్ఖులారా, నాలుగు ఆర్యసత్యాల – వాటి మూడు పక్షాల[14], పన్నెండు రీతులలో సహా[15] – కు సంబంధించిన అంతర్బౌద్ధిక జ్ఞానం కలగ నంత వరకు, ఈ ప్రపంచంలో ఎవరికి – దేవతలకు, మారులకు, బ్రాహ్మణులకు, సన్యాసులకు, పూజారులకు, మానవులకు – అనన్యపరమ జ్ఞాన సిద్ధి (అనుత్తరం సమ్మాసంబోధిమ్) కలిగిందని చెప్ప లేదు.

''ఓ భిక్ఖులారా, నాలుగు ఆర్యసత్యాలు, వాటి మూడు పక్షాలు, పన్నెండు రీతులకు సంబంధించిన జ్ఞానోదయం నాకు అయిన తరువాతే ఈ ప్రపంచానికి – అందరికీ – చెప్పాను.''

''అటువంటి జ్ఞాన దర్శనం నాకు అయింది''. మనస్సు విముక్తం అయింది. దానికిక విచలనం లేదు.[16] ఇదే నా చివరి జన్మ. ఇకమీదట మరో జన్మ లేదు.''

ఈ విధంగా బుద్ధుడు ఉపన్యసించాడు. భిక్ఖులు హర్షధ్వానాలు చేశారు.

ఈ ధమ్మాన్ని బుద్ధుడు వివరించగా, దుమ్ముధూళి లేని సత్య సందర్శనం చేసే కొండణ్ణ నేత్రం (ధమ్మచఖ్ఖు)[17] పరికించింది: ''పుట్టుక ఉన్న ప్రతిదీ నశించి తీర వలసిందే.''[18]

బుద్ధుడు ధమ్మ చక్ర ప్రవర్తన పై ఉపన్యసించి నప్పుడు, భూ దేవతలు ఉచ్చైస్స్వ రంతో అన్నారు : ''ఈ బ్రహ్మాండమైన ధర్మచక్రాన్ని – ఈ ప్రపంచంలో ఎవరూ, సన్యాసులు గాని, దేవుడు గాని, మారుడు గాని, బ్రాహ్మణుడు గాని చెప్ప లేని ఈ ధర్మ చక్రాన్ని – బుద్ధుడు కాశీ సమీపంలోని ఇసి పట్టణం హరిణ వనంలో విపులీకరించాడు.'

దీనిని విని, దేవతలు– చాతుమ్మహా రాజికతావతింస, యమ, తుసిత, నిమ్మానరతి, పరనిమ్మితవసవత్తి, ఇంకా బ్రాహ్మణ పరిషత్తుకు చెందిన బ్రాహ్మణులు, బ్రహ్మ పురోహిత, మహాబ్రహ్మ, పరిత్తాభ, అప్పమాణాభ, అభస్సర, పరిత్తసుభ, అప్పమాణసుభ, సుభకిణ్ణ, వెహప్ఫల, అవిహ, అతప్ప, సుదస్స, సుదస్సి, అకనిఠ్ఠ – అందరూ అలాగే జయధ్వానాలు చేశారు.

ఈ విధంగా, అదే సమయంలో, అదే క్షణంలో, ఈ ధ్వానాలు బ్రహ్మలోకం వరకు విస్తరించాయి. ఈ పదివేల ప్రాపంచిక వ్యవస్థలు తీవ్రంగా కంపించాయి, దద్దరిల్లాయి, వణికి పోయాయి.

దేవతల వెలుగును మించిన ఒక ప్రభాస ఈ ప్రపంచంలో కనిపించింది. అప్పుడు బుద్ధుడు అన్నాడు: ''స్నేహితులారా, కొండణ్ణ విషయాన్ని నిజంగా అర్థం చేసు కొన్నాడు. నిజంగా అర్థం చేసు కొన్నాడు.''

అందువలన గౌరవనీయ కొండణ్ణను అణ్ణాత కొండణ్ణ (అజ్ఞాత కొండణ్ణ) గా పిలిచారు.

**ధమ్మ చక్రసూత్రం మీద కొన్ని పర్యాలోచనలు**

1. బౌద్ధం వైయక్తికానుభవం మీద ఆధారపడింది. అందువల్ల హేతు పూర్వకం, అంతే కాని కాల్పనికం కాదు.
2. బుద్ధుడు అన్నిరకాల ప్రమాణాలను ( all authority) వదిలి వేశాడు. స్వర్గ మాధ్యమాన్ని రూపొందించాడు. ఇది పూర్తిగా అతనిదే.
3. బౌద్ధం ఒక మార్గం, ఒక పథం (మగ్గ)
4. బౌద్ధంలోని కీలకాంశం హేతు బద్ధ అవగాహన.
5. అంధ విశ్వాసాలను అందలం నుంచి లాగి వేశాడు.
6. విశ్వాసాలకు, ఛాందసాలకు బదులు, ఆచరణను నొక్కి చెప్పాడు. విశ్వాసాలు, ఛాందస భావాలు వ్యక్తిని విముక్తుని చేయలేవు.
7. వేదాలలో అంత ప్రముఖ స్థానాన్ని వహించిన కర్మకాండకు బౌద్ధంలో తావు లేదు.
8. ప్రసన్నులను గావించు కోవడానికి ఇక్కడ దేవతలు లేరు.
9. తాబేదారులుగా పనిచేసే పూజారి వర్గం లేదు.
10. లక్ష్యం (నిర్వాణం) సాధించ డానికి, శీల, సమాధి, ప్రజ్ఞలు ముఖ్యం.
11. బౌద్ధం పునాదులు నాలుగు ఆర్యసత్యాలు. వీటిని అనుభవంలో బేరీజు వేసుకో వచ్చు.
12. నాలుగు ఆర్య సత్యాలు వ్యక్తి మూర్తితో ముడిపడి ఉన్నాయి. అందుకని బౌద్ధం మానవ కేంద్రకం, అంతర్ముఖి (introvert).
13. వాటిని బుద్ధుడే స్వయంగా కను గొన్నాడు. అందువల్ల అతడు ఎవరికి రుణ పడి లేడు. అతని మాటల్లో చెప్పా లంటే, ''అంతకు ముందు అవి ఎవరూ విన్నవి, కన్నవి కావు.''
14. అవి సత్యాలు కనుక కాలంతో మారవు.
15. మొదటిది దుఃఖానికి సంబంధించిన సత్యం. ఇది ఒకని వ్యక్తిత్వంతో, వ్యక్తిత్వ నిర్మాణాంశాలతో, జీవితం వివిధ దశలతో, వ్యవహరిస్తుంది. దానిని విశ్లేషించాలి. పరీక్షించాలి. ఈ పరీక్ష తనను తాను సరిగా అర్థం చేసు కోవడానికి తోడ్పడు తుంది.



16. మొదటి సత్యాన్ని హేతు బద్ధంగా అర్థం చేసు కొంటే, దుఃఖ కారణాన్ని తొలగించుకో వచ్చు. దుఃఖ కారణం రెండో సత్యం. ఇది ఐంద్రియక బాహ్య వస్తువులకు సంబంధించి మామూలు మనిషి కుండే మనో వైజ్ఞానిక దృక్పథంతో వ్యవహరిస్తుంది.

17. మనందరిలో గుప్తంగా ఉన్న బలవత్తరమైన శక్తికి రెండో సత్యం సబంధించి ఉంది.

18. తృష్ణ – కన పడని మానసిక శక్తి – జీవితంలో అన్ని అనర్థాలకు కారణం.

19. రెండో సత్యం భూత, వర్తమాన, భవిష్యత్ జన్మలతో పరోక్షంగా వ్యవహరిస్తుంది.

20. అందువల్ల జన్మ పరంపరను బుద్ధుడు అంగీకరించాడు.

21. దాని అనుబంధ సిద్ధాంతమైన కర్మ సిద్ధాంతం, దానిలోనే, అంతర్గతంగా ఉంది.

22. మూడో దైన దుఃఖ నిరోధం, ఒకని మీద ఆధారపడినదే అయినా, హేతువు కతీతమైంది. లోకోత్తరం. మొదటి రెండు, అలా కాక, లౌకికాలు.

23. మూడో సత్యం తనను తాను తెలుసుకోవడం. మనోనేత్రంతో దర్శించ దగిన ధర్మం.

24. ఈ సత్యాన్ని పూర్తి పరిత్యాగం ద్వారా యధార్థీకరణం చేసు కోవాలి. బాహ్య వస్తువులను పరిత్యాగం చేయడం కాదు. బాహ్య ప్రపంచం యెడ అంతరంగ అనురాగం ఉండ కూడదు.

25. ఈ రాగాన్ని పూర్తిగా పెకలిస్తే, మూడో సత్యం గోచర మవుతుంది. కేవలం ఈ శక్తిని నాశం చేయడమే, మూడో సత్యం కాదు – నిర్వాణం. అలాంటప్పుడు అది వినాశంతో సమ మవుతుంది. ఈ ప్రపంచంతో కట్టి పడ వేసే ఈ శక్తిని పెకలించి వేయడం ద్వారానే నిర్వాణాన్ని యధార్థీకరణం చెందించుకోవాలి.

26. నిర్వాణం సాధించ దగిందే గాని ఉత్పత్తి కావించ డానికి వీలయ్యేది కాదు. దానిని ఈ జీవితంలోనే సాధించగలం. కాబట్టి దీనిని బట్టి తేలే దేమంటే, పునర్జన్మ అనేది బౌద్ధ సిద్ధాంతాలలో ఒకటి లయినప్పటికీ, బౌద్ధలక్ష్యం భావి జన్మల మీద ఆధారపడదు.

27. నాలుగో సత్యాన్ని పెంపొందించు కోవడం ద్వారా మూడో సత్యాన్ని సాధించాలి.

28. ఒక మహా ప్రబలమైన శక్తిని పెకలించి వేయడానికి ఎనిమిది శక్తిమంతమైన కారకాలను పెంపొందించు కోవాలి.

29. ఈ ఎనిమిది కారకాలు పూర్తిగా మానసికాలు.

30. గుప్తంగా ఉన్న ఒక చెడ్డ శక్తిని ఎదుర్కోవడానికి ఎనిమిది శక్తిమంతమైన మంచి శక్తులను ఆవాహం చేయాలి.

31. ఈ మహావిజయంతో పాటు లభించే ఇతరాలు ఏమిటంటే, కేవల శుద్ధత, పునర్జన్మల నుంచి పూర్తి విముక్తి, అన్ని క్లేశాల నుంచి విముక్తమైన మనస్సు, అమర్త్యతలు.

32. ఈ విముక్తి ఒక పరిపూర్ణతా లేక కేవల శుద్ధతా? రెండోది అంగీకారం.

33. ఒక ప్రశ్న అడగ వచ్చు! పరిపూర్ణం గావించబడేది ఏది? పరిశుద్ధం అయ్యేది ఏది?

బౌద్ధంలో ఒక మూర్తి గాని, శాశ్వత సత్యంగాని లేవు. కాని చైతన్య స్రవంతి (విజ్ఞాన స్రవంతి) మాత్రం ఉంది.

క్లేశాలను పరిహరించడం ద్వారా ఈ చైతన్య స్రవంతి పరిశుద్ధ మవుతుందని చెప్పడం సబబుగా ఉంటుంది.

## రెండో ఉపన్యాసం

### *అనత్తలక్కన సుత్త*[19]

ఒకసారి బుద్ధుడు, కాశీ సమీపంలోని ఇసిపట్టణం హరిణ వనంలో ఉన్నాడు. అప్పుడు ఆయన ఐదుగురు భిక్ఖులను ఉద్దేశించి, '' ఓ భిక్ఖులారా'' అంటూ సంబోధించాడు.

''ఏమిటి మహానుభావా?'' అని వారు అందు కొన్నారు.

అపుడు బుద్ధుడు ఈ విధంగా అన్నాడు :

''ఈ శరీరం (రూప), ఓ భిక్ఖులారా, ఆత్మ రహితం (అనత్త). హే భిక్ఖులారా, నిజంగా ఆత్మే[20] ఉంటే, ఈ దేహం దుఃఖానికి గురి కాదు. 'శరీరం ఇలా ఉండుగాక, శరీరం ఇలా ఉండ కుండు గాక,' అనే సంభావ్యతలు గూడ ఉంటాయి. కాని శరీరంలో ఆత్మ లేదు కనుక, శరీరం, దుఃఖమయం. అందుకని 'శరీరం అలా ఉండాలని, ఇలా ఉండాలనే' సంభావ్యతకు అసలు అవకాశమే ఉండదు.

''ఇదే విధంగా, వేదనలు, సంజ్ఞలు (సజ్ఞా)సంఖారాలు (మానసిక స్థితులు, విజ్ఞానం[21] (consciousness) ఇవన్నీ ఆత్మ రహితాలు.[22]''

''మీరే మను కొంటున్నారు, భిక్కులారా, ఈ శరీరం నిత్యమా? అనిత్యమా?''

''అనిత్యం దేవా''

''మరి అనిత్యమైంది సుఖకరమా? బాధాకరమా?''

''బాధాకరం దేవా''

''మరి ఈ అనిత్యమైన దానిని, బాధాకరమైన దానిని, క్షణికమైన దానిని చూసి, ఇదా నాది, ఇది నేను, ఇది నా ఆత్మ, అను కోవడం సబబే నంటారా.?''

''కచ్చితంగా కాదు, దేవా''.

''అలాగే భిక్కులారా, వేదనలు, సంజ్ఞలు, సంఖారాలు, విజ్ఞానం - ఇవన్నీ అశాశ్వతం, బాధాకరం

''ఈ అనిత్య, బాధాకర, క్షణికమైన వాటిని చూసి, '**ఇది నాది, ఇది నేను. ఇది నా ఆత్మ**,' అని అనుకోవడం సబబే నంటారా?[23]

''కచ్చితంగా కాదు దేవా''.

''అలాంటప్పుడు భిక్కులారా, శరీరాన్ని - గతానికి చెందినదైనా, వర్తమానానికి చెందినదైనా, వ్యక్తికమైనదైనా, బాహ్యమైనదైనా, స్థూలమైనదైనా, సూక్ష్మమైనదైనా, ఉచ్ఛమైనదైనా, నీచమైనదైనా, దగ్గరదైనా, దూరమైనదైనా దానిని, స్వభావ పూర్వకంగా సమ్యక్ దృష్టితో అర్థం చేసు కోవాలి - '**ఇది నాది కాదు. నేను ఇది కాదు, ఇది నా ఆత్మకాదు.**'

''అన్ని వేచనలు, సంజ్ఞలు, సంఖారాలు, విజ్ఞానం - ఇవి గతానికి చెందినవైనా, ప్రస్తుతానికి చెందిన వైనా, భవిష్యత్తుకు. చెందినవైనా, వ్యక్తికం లేదా బాహ్యమైన వైనా, స్థూలమైనవైనా, సూక్ష్మమైన వైనా, ఉచ్ఛమైనవైనా, నీచమైన వైనా, దగ్గరవైనా, దూరమైన వైనా - వాటిని సమ్యక్ సృష్టితో అర్థంచేసుకోవాలి. వాటి వాస్తవ స్వభావాన్ని గ్రహించాలి. '**ఇవి నావి కావు, ఇవి నేను కాను. ఇవి నా ఆత్మలు కావు.**'

''సుశిక్షితుడై ఆర్యశిష్యుడు, ఇలా అర్థం చేసుకోవడంతో, దేహమన్నా, వేదనలన్నా, సంజ్ఞలన్నా, సంఖారాలన్నా, విజ్ఞానమన్నా జుగుప్సను పెంచు కొంటాడు. అప్పుడు ఆ జుగుప్సాకర వస్తువులకు విముఖుడై, విరాగం ద్వారా విముక్తి పొందుతాడు. అప్పుడతనికి ఇలా జ్ఞానోదయ మవుతుంది: ''నేను విముక్తుడనయ్యాను.'' పునర్జన్మ అంతమైందని అతడు తెలుసుకొంటాడు. జీవించిందే పవిత్ర జీవితమని, చేయవలసింది చేశామని, ఇక ఈ స్థితి మరి లేదని, తెలుసు కొంటాడు. బుద్ధుడు పైవిధంగా చెప్పగా, ఆయన మాటలకు భిక్కులు

హర్షించారు. బుద్ధుడు ఈ బోధను చేయగా, యతి పంచకం మనస్సులు మలినాల నుంచి ఎటువంటి రాగబంధమూ లేకుండా బయట పడ్డాయి.

***పాదసూచికలు:***

1. 'లోకాయత' కున్న ఈ సామాన్య అపార్థాన్ని తొలగించాలి. ఈ పదాన్ని ఉపయోగించిన పాళీగ్రంథాలు (*దీఘ*, 1, 11, 88; *అంగుత్తర*, 1, 163, 166; *అంగుత్తర*, 11, 223; *వినయ*, 11, 139, *సుత్తనిపాత*, P 105 etc). ఈ విషయాన్ని సనాతన బ్రాహ్మణులు అధ్యయనం చేస్తున్నారని చెప్తాయి. కనుక అది ఇక్కడ చెప్పిన సుఖవాదం (Hedonism) కావడానికి వీలు లేదు. బహుశ ఈ 'లోకాయత' అనే పదం విశ్వానికి సంబంధించిన సిద్ధాంతాల అధ్యయనాన్ని సూచిస్తుంది. చాల కాలం తరవాత మాత్రమే వ్యాఖ్యానాలలో తాత్విక భౌతిక వాదులకు (Philosophical materialists) అన్వయించడం జరిగింది. K.N. జయతిలకె, తన గ్రంథం *Early Buddhist Theory of knowledge* (London, 1963), PP. 46 - 57.లో ఈ పదం పై జరిగిన చర్చను, ఆధారాలను సమీక్షించాడు.
2. సర్వేపల్లిరాధాకృష్ణన్, *Indian Philosophy* (2nd Edn, 1929, (rpt) New York, Macmillan, 1941); 1. PP. 281-82. ఈ వాక్యానికి రాధాకృష్ణన్ చూపిన ఆధారా లేవీ A.D. ఎనిమిదో శతాబ్దానికి ముందుకు పోవు. (సం.)
3. రెండో వికల్పిక, శీర్షికకు, భాషాపరమైన అర్థం, బౌద్ధులు వాడిన ప్రకారం ''ధమ్మం'' రెండింటిని (1) బుద్ధుని బోధలను, సిద్ధాంతాన్ని (అందువలన దానికర్థం 'సత్యం') (2) దృగ్విషయాన్ని లేదా అనుభవమూలకాలను. సూచి స్తుంది – సంపాదకుడు.
4. 'అరియ' అనే పాళీపదం 'ఆర్య' అనే సంస్కృత పదానికి సమానార్థకం. క్రీ.పూ. రెండో సహస్రాబ్దంలో భారత ఉపఖండానికి వచ్చిన జాతి తమను ఆర్యులు అని పిలుచు కొంది. తరవాత తరవాత ఈ పదానికి 'కులీన', ధర్మం, శుద్ధ, న్యాయం లాంటి అర్థం వచ్చింది. ఈ కాలం వచ్చే సరికి జాతినామంగా మారిపోయింది. సం.
5. భావనలను ప్రతీకాత్మకం గావించాడానికి ఇదో మంచి ఉదాహరణ. బోధనకు ఇది చాల ఉపయోగం, ఈ ఉదాహరణను వ్యాఖ్యాతలు ఇచ్చారు. అటువంటి వివరణకు నిజమైన భాషా మూలం ఏదీ లేదు.
6. *మహావగ్గ* P. 10; *సంయుత్తనికాయ*, V. 53, 11. P. 420.
7. పూర్వ జన్మలో బుద్ధుడు నేటి సారనాథ్‌లో ఒక లేడిని దానికి ఇంకా పుట్టని చిన్నారిని, రక్షించడం కోసం తన ప్రాణాన్ని త్యాగం చేశాడు. ఆ ప్రదేశానికి ఇప్పటి పేరు పూర్వ జన్మలో బోధి సత్వుని పేరైన, సారంగనాథ ( లేడిని రక్షించిన వాడు) నుంచి వచ్చింది.
8. శబ్దార్థ పరంగా – 'ఇలా వచ్చి వాడు' లేదా ఇలా వెళ్ళినవాడు', అని అర్థం. బుద్ధుడు తా గురించి తాము చెప్పు కొనే టప్పుడు ఈ పదాన్ని ఉపయోగించే వాడు.
9. అంటేక్లేశాలను జయించడం.

10. అంటే, నాలుగు ఆర్య సత్యాల యథార్థీకరణం.

11. అంటే సన్యాసత్వానికి సంబంధించిన నాలుగు పథాలు. నాలుగు ఫలాలు.

12. పంఞ్ఛ్పాపాదాపాదానఖంధ – బౌద్ధం ప్రకారం వ్యక్తి ఐదు సమూహాలతో నిర్మిత మవుతాడు. అవి రూప (పదార్థం) వేదనా, సంజ్ఞ, సంఖార, విజ్ఞానాలు. ఈ ఐదు వ్యక్తి నిర్మితిలో ఉన్న మానసిక – దైహిక నిర్మాణాంశాలు. పదార్థం శక్తులతో గుణ మానసిక – దైహిక నిర్మాణాంశాలు. పదార్థం శక్తులతో గుణాలతో రచించబడింది. మనస్సు మానసికస్థితులు (చెతసికల)తో నిర్మితం. ఇవి మొత్తం ఏభై రెండు. వీటిల్లో వేదన, సంజ్ఞలు, రెండూ రెండు విస్పష్ట సమూహాలు. మిగిలిన ఏభై మొత్తాన్ని సంఖారం అంటారు.

13. ఈ విధంగా పాళి. ఇది తొలగించాల్సిన దుఃఖ కారణమే గాని, దానికి సంబం ధించిన సంత్యం కాదు. అదే భాషను ఉపయోగించని వ్యక్తులు దాచిన గ్రంధాలకు పట్టే స్థితి ఇదే. (సం.)

14. అవి : (i) నాలుగు (సత్యాల) – జ్ఞానం (సచ్చుఞాణ) (ii) నాలు ఆర్యసత్యాలకు విహితమైన ప్రకార్యాల జ్ఞానం (కిచ్చుఞాన) (iii) ప్రతి సత్యం యొక్క ఆయా ప్రకార్యాలు సాధించ బడ్డాయనే జ్ఞానం (కటాఞాణ)

15. ప్రతి సత్యానికి మూడు పక్షాలున్నాయి. అలా చూసినప్పుడు నాలుగు సత్యాలకు పండ్రెండు పక్షాలుంటాయి.

16. అర్హతత్వం ఫలాన్ని ఇక్కడ సూచించడం జరిగింది (అర్హత్తఫల)

17. ధర్మచక్కు (ధర్మ చక్షువు) దిగువ మూడు మార్గాలను సూచిస్తుంది. ఆమూడు: సొతాపత్తి, సకదాగామి, అనాగామి లు. కొండణ్ణ సన్యాసత్వంలో మొదటి దశను – సొతా పత్తిని – పొందాడు. మిగతా యతులు సొతాపత్తిని తరవాత పొందారు.

18. యమ్ కిఞ్చి సముదయమ్ ధమ్మం నబ్బం తమ్ నిరోధధమ్మం.

19. మహావగ్గ. P. 13; సంయుత్త నికాయ, 111,22, 59, P. 66.

20. దేవుడు సృష్టించిన లేదా పరమాత్మ (దివ్యసారం) నుంచి నిష్పన్నమైన ఒకనిత్య అపరివర్తనీయ సత్యం.

21. జీవి ఐదు స్కంధాలతో నిర్మిత మవుతుంది. ఈ ఐదు స్కంధాల వెలుపల జీవి లేదు. స్కంధాలను తొలగిస్తే, అక్కడ ఏమీ ఉండదు. ఆత్మ అనేది వీటి అన్నింటిలో గాని, వీటిల్లో విడి విడి గాని, వీటి బయటగాని ఉండదు.

22. జీవి మిగతా నాలుగు నిర్మాణ భాగాల గురించి బుద్ధుడు ఇదే చెబుతాడు. జీవి నిర్మాణాంశాలలో ప్రతి ఒక్క దానిని గురించి బుద్ధుడు అవే ప్రశ్నలు లేవ దీస్తాడు. అనువాదం ఇక్కడ క్లుప్తీకరించ బడింది.

23. తృష్ణతో ఉన్నవాడు తప్పుగా ఆలోచిస్తాడు. – 'ఇది నాది అని' గర్వంతో (మాన) ఉన్నవాడు – ' నేను ఇది ' అని అను కొంటాడు. తప్పు దృష్టితో ఉన్నవాడు – ' ఇది ఆత్మ' అను కొంటాడు. ఈ మూడు తప్పుడు భావనలు (మఞానా).

ఏడో ప్రకరణం

# ధమ్మ బోధ

''బుద్ధుల జననం ప్రీతం. ఉదాత్త ధర్మబోధ ప్రీతం. సంఘం ఐక్యత ప్రీతం. ఐక్యంగా ఉన్నవారి క్రమశిక్షణ ప్రీతం''

– ధమ్మపద, V. 194

**యస, అతని మిత్రుల ధమ్మస్వీకారం**

కాశీలో యస అనే లక్షాధికారి పుత్రుడు ఒకడు ఉన్నాడు. అతడు విలాస జీవితాన్ని గడుపు తున్నాడు. ఒకనాటి ఉదయం అతడు వేకువనే లేచి ఒక జుగుప్సాకర దృశ్యాన్ని చూశాడు. అతని స్త్రీ పరిచారికలు, సంగీత కారులు అస్తవ్యస్తంగా, వివిధ జుగుప్సాకర భంగిమలలో నిద్ర పోతున్నారు. ఆ దృశ్యం మొత్తం ఎంత జుగుప్సాకరంగా ఉందంటే, అదొక శవగృహాన్ని మరిపించింది. జీవిత డాంబికాన్ని, ధర్మాన్ని అత డప్పుడు గుర్తించాడు. వెంటనే తన ప్రాసాదం విడిచి, '' ఇది నాకు చాల బాధాకరంగా ఉంది. ఇది నేను భరిం చలేను'', అను కొంటూ ఇసి పట్టణ దిశలో వెళ్ళి పోయాడు. అప్పుడు బుద్ధుడు తాత్కాలి కంగా, యతిపంచకాన్ని అర్హతులను చేసిన తరవాత, అక్కడే ఉన్నాడు. ఇది ఐదుగురు సన్యాసులకు ప్రథమోపన్యాసం చేసిన ఐదో రోజు జరిగింది.

ఆ ప్రత్యేక సమయంలో బుద్ధుడు ఆరు బయట ఇటు అటు నడుస్తున్నాడు. దూరం నుంచి వస్తున్న అతనిని చూసి, బుద్ధుడు నడవ నుంచి ఈవలికి వచ్చి, తనకోసం ఏర్పాటు చేసిన ఆసనంమీద ఆసీను డయ్యాడు. యస సమీపించి, ''నాకు చాల బాధాకరంగా ఉంది, నేను భరించ లేను'', అంటూ వాపోతూ నిలబడ్డాడు.

అంతట బుద్ధుడు అన్నాడు: ''ఇక్కడ ఏ బాధలు లేవు ఓ యసా! ఇక్కడ సహ్యం కాని దేమీ ఉండదు యసా! ఇలా దగ్గరకు రా యసా! కూర్చో. నేను నీకు ధమ్మ బోధ చేస్తాను''.

ప్రోత్సాహం కొలిపే బుద్ధుని మాటలు అతనికి ఎంతో ఆనందాన్ని కలిగించాయి. బంగారు పాదరక్షలను విడిచి, బుద్ధుని సమీపించి, నమస్కరించి, ప్రక్కనే యస ఆసీను డయ్యాడు.

బుద్ధుడు అతనికి ధమ్మాన్ని చెప్పాడు. అతడు సన్యాసత్వంలో మొదటి దశ అయిన 'సొతపత్తి'ని (ఋషిత్వంలోని మొదటి దశ) పొందాడు.

మొదట బుద్ధుడు అతనికి దానం గురించి, శీలం గురించి, స్వర్గం గురించి, ఇంద్రియ సుఖాల (కామాదినవ) గురించి, పరిత్యాగ ప్రయోజనాల గురించి (నెఖ్ఖమ్మాని సంస) గురించి వివరించాడు. అతని మనస్సు లోతైన విషయాలను గ్రహించే స్థితికి వచ్చిందను కొన్నప్పుడు, బుద్ధుడు నాలుగు ఆర్య సత్యాల గురించి చెప్పాడు.

యస ఇంట్లో లేక పోవడాన్ని మొదట గుర్తించింది అతడి తల్లే. ఆమె ఈ విషయం తన భర్తతో చెప్పింది. ఆ కోటీశ్వరుడు నాలుగు దిక్కుల అతన్ని వెదకడానికి రౌతులను పంపి, తాను మాత్రం, అతని బంగారు చెప్పుల ముద్రలను అనుసరించి ఇసి పట్టణం వైపు వెళ్ళాడు. బుద్ధుడు తన మనో శక్తితో అతడు రావడాన్ని చాల దూరం నుంచే గమనించి, అతని పుత్రుని అతడు చూడకుండేట్లు సంకల్పం చేశాడు.

కోటీశ్వరుడు బుద్ధుని సమీపించి ''మీరు నా పుత్రుని చూశారా?'' అని అడిగాడు.

''మంచిది, ఇలా కూర్చొండి దయ చేసి, మీరు మీ పుత్రుని చూడ గలుగుతారు,'' అని బుద్ధుడు అన్నాడు.

ఆ సంతోషకర వార్త విని, అతడు కూర్చొన్నాడు. బుద్ధుడు అతనికి ధమ్మం చెప్పాడు. అతడు చాల సంతోషించి ఉచ్చైస్వరంతో ఇలా అన్నాడు:

''బాగుంది ఓ దేవా, చాల బాగుంది. ఇదంతా ఎలా ఉందంటే, దేవా, బోర్లపడిన దానిని సరిగా నిలబెట్టినట్లుగా, దాగి ఉన్న దానిని బహిర్గతం చేసి నట్లుగా, దారి తప్పిన వానికి దారి చూపి నట్లుగా, చీకట్లో కళ్ళున్న వాళ్ళంతా చూడ గలిగే విధంగా దీపం పట్టి నట్లుగా ఉంది.'' అదేవిధంగా ధమ్మాన్ని బుద్ధుడు అనేక రీతుల బోధించాడు.

''నేను, ఓ దేవా, బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం[1], శరణం గచ్ఛామి. ఈ రోజు నుంచి జీవితాంతం శరణు జొచ్చిన నన్ను తమ అనుయాయిగా స్వీకరింతురు గాక!''

సూత్ర త్రయంతో శరణు వేడిన మొదటి అనుయాయి ఇతడే.

తన తండ్రి కిచ్చిన ఉపన్యాసం వినడంతో, యశుడు అర్హతత్వం పొందాడు. యశుని తండ్రి తన కొడుకును చూడ డానికి వీలుగ బుద్ధుడు తన సంకల్ప శక్తిని ఉపసంహరించు కొన్నాడు. కోటీశ్వరుడు తన పుత్రుని చూశాడు. తరవాత బుద్ధుని, అతని శిష్యులను మరు రోజు తన యింటికి భిక్షకు రావలసిందని ఆహ్వానించాడు. బుద్ధుడు మౌనంగానే తన అంగీకారాన్ని తెలిపాడు.

కోటీశ్వరుడు వెళ్ళిపోయిన తరవాత, యడు తనకు అల్ప[2], ఉన్నత దీక్షలను ఇవ్వ ఎలసిందని బుద్ధుని వేడు కొన్నాడు.

''హే భిక్కులారా, రండి, ధర్మాన్ని చక్కగా బోధించడం జరిగింది. దుఃఖాన్ని పూర్తిగా నిరోధించ డానికి పవిత్ర జీవితాలను గడపండి.'' ఈ మాటలంటూ బుద్ధుడు అతనికి ఉన్నత దీక్షను[3] ఉపసంపదను – ప్రసాదించాడు.

గౌరవనీయ యనితో కలుపుకొని అర్హతుల సంఖ్య ఆరుకు పెరిగింది.

ఆహ్వానం మేరకు బుద్ధుడు తన ఆరుగురు శిష్యులతో కోటీశ్వరుని ప్రాసాదానికి వెళ్ళాడు.

గౌరవనీయ యస ని తల్లి, అతని పూర్వాశ్రమ భార్య బుద్ధుడు చెప్పిన ధమ్మాన్ని విని సన్యాసత్వంలో మొదటి దశను పొందారు. ఈ దశ చేరు కోవడంతో వారిద్దరు బుద్ధునికి ప్రధమ మహిళా ఉపాసిక లయ్యారు.[4]

గౌరవనీయ యసనికి నలుగురు విశిష్ట మిత్రులున్నారు. విమల, సుబాహు, పున్నజి, గవంపతి అనువారలు, యస శిరోముండనం గావించుకొని, పీతాంబరం ధరించి పరిభ్రమక జీవితాన్ని గడుపుతున్నాడని విని, అతని దగ్గరకు వచ్చి, తాము అతనినే అనుసరిస్తామని చెప్పారు. అప్పుడు యస వారిని బుద్ధునికి పరిచయం చేశాడు. ధర్మాన్ని విని, వారూ అర్హతు లయ్యారు.

వివిధ మండలాలకు చెందిన ఏభై మంది కులీన కుటుంబాల యువకులు యస ని మిత్రులు – బుద్ధుని దగ్గర ఉపదేశం పొంది, అర్హతులై, సంఘంలో చేరి పోయారు.

బుద్ధునికి జ్ఞానోదయమై రెండు నెలలు గడిచిందో లేదో అర్హతుల సంఖ్య అరవైకి చేరు కొంది. వారంతా ఉన్నత కుటుంబీకులు. మంచి తండ్రులకు తగిన తనయులు.

### ప్రధమ ధర్మదూతలు

అరవైమందికి జ్ఞానోదయం కావించిన అనతి కాలంలోనే. వారందరిని సత్యదూత లుగా, తన నూతన ధర్మాన్ని, తారతమ్యాలు లేకుండ, అందరికీ ప్రచలితం చేయడానికీ, అన్నిదిశలకూ పంప నిర్ణయించు కొన్నాడు. అన్ని దిశలకు వారిని పంపే ముందు వారికి ఈ విధంగా సలహా ఇచ్చాడు:[5]

''అవి దివ్యాలయినా, మానవాలయినా, అన్ని బంధాలనుంచి ఓ భిక్కులారా, నేను విముక్తుడనయ్యాను.''

''మీరు గూడ అలాగే అన్ని బంధాల నుంచి, అవి దివ్యాలుకానీయండి, మాన వీయాలు కానీయండి, విముక్తులయ్యారు.

''అందరి మంచి కోసం, అందరి సుఖం కోసం, ప్రపంచం మీది అనుకంపతో, మానవుల దేవతల[6] మంచి, సుఖం, లాభం కోసం, ముందుకు కదలండి ఓ భిక్ఖులారా. మీలో ఏ ఇద్దరు ఒకే చోటుకు వెళ్ళ వద్దు. శబ్దపరంగాను సారం పరంగాను, మొదట, చివర, మధ్య, అంతట మంచిదైన ఈ ధర్మాన్ని ప్రచారం చేయండి. పవిత్ర జీవితాన్ని[7], పరిపూర్ణమైన, శుద్ధమైన జీవితాన్ని ప్రచలితం చేయండి.

''కళ్ళల్లో దుమ్మున్న వారు ధర్మాన్ని వినగానే దూరంగా పోతారు. ధర్మాన్ని అర్థం చేసు కొనే వారుంటారు.

''ధర్మం బోధించ డానికి నేను గూడ సెనాని గామలో ఉన్న ఉరువెలకు వెళతాను.''

''ఋషి కేతనం ఎగుర వేయండి. మహోన్నత ధమ్మాన్ని ప్రచారం చేయండి. ఇతరుల బాగు కోసం కృషి చేయండి. మీ విధి మీరు నిర్వర్తించిన వారవుతారు.''

ఇతరులపై అనుకంపతో, దీక్ష తీసుకొన్న జ్ఞానోదయమైన శిష్యులను ధమ్మ బోధకు పంపిన ప్రధమ మత గురువు బుద్ధుడు: ఉండడానికి ఒక శాశ్వత స్థిర నివాసం లేకుండ ఏకాంతంగా, చేత చిల్లి గవ్వ లేకుండా, ఈ మత ప్రబోధకులు నిలిచిన చోట నిలవక తిరుగుతూ మహోన్నత ధమ్మ బోధను చేయాలి. కప్పు కోవ డానికి దుస్తులు, బిక్షకు ఒక చిప్ప తప్ప, వారికి మరో ఇతర ఆస్తి పాస్తులు లేవు. చుట్టి రావలసిన క్షేత్రం పెద్దది, బోధకులు సాపేక్షంగా తక్కువ కావడంతో, వారు ఎవరికి వారుగానే (కలిసి కాకుండా) మత ప్రచార ప్రయాణం చేయాలని సలహా ఇవ్వ బడింది. వారంతా అన్ని ఇంద్రియక సుఖాల బంధాల నుంచి విముక్తులైన అర్హతులు గనుక, వారి ముందున్న లక్ష్యం ఒక్కటే: ధమ్మ బోధ చేయడం, పవిత్ర జీవితాన్ని ప్రకటించడం. తమ జీవిత లక్ష్యాన్ని సాధించిన అర్హతులు నిర్వహించాల్సిన మౌలిక పాత్ర, తమ ప్రవర్తన ద్వారా, సిద్ధాంతం ద్వారా ప్రజలను నైతికంగా ఉద్ధరించడం. భౌతికంగా అభివృద్ధి ఆవశ్యకమే అయినా, అది వారి పని కాదు.

**సంఘ సంస్థాపన**

ఆ సమయంలో ఈ ప్రపంచంలో అరవైమంది అర్హత శిష్యులు ఉన్నారు. ఈ పరిశుద్ధులను కేంద్ర బిందువుగా చేసుకొని, బుద్ధుడు సంఘాన్ని స్థాపించాడు. ఇది నిర్మాణంలో ప్రజాస్వామికం. పంపిణీలో కమ్యూనిజం. మొదట్లో చేరిన సంఘ సభ్యులంతా సమాజంలో ఉన్నత స్థితి నుంచి వచ్చిన వారే అయినా, బాగా చదువు కొన్నవారే అయినా, ధనవంతులే

అయినా, సంఘంలో మాత్రం - కుల, వర్గ కోటి ప్రసక్తి లేకుండా - ఎవరైన చేరవచ్చు. అన్ని వర్ణాలకు చెందిన యువకులు, వృద్ధులు, అందరికీ సంఘంలోకి ప్రవేశం కల్పించబడింది. ఎక్కువ తక్కువలు లేకుండా, సంఘంలో అందరూ ఒకే కుటుంబ సభ్యులుగా జీవించారు. ఈ నాటికీ ఉన్న ఈ భిక్షుక సంఘం ప్రపంచంలోకే అత్యంత పురాతన చారిత్రక బ్రహ్మచారి సమాజం[8].

అందరూ భార్యా బిడ్డలను వదిలి, పరిబ్రమక జీవితంలో ప్రవేశించాలని కాదు. ఉపాసకులుగా కూడ ధమ్మం ప్రకారం జీవితం గడిపి ఋషిత్వాన్ని పొందిన వారు ఎంతో మంది ఉన్నారు. ఉదాహరణకు యస ని తలిదండ్రులు, పూర్వపు భార్య బుద్ధుని తొలి ఉపాసకులు. మరి వారు ముగ్గురూ కూడా ఆధ్యాత్మికంగా ఎంతో ఎదిగి ఋషిత్వంలో మొదటి దశను చేరారు.

ఆదర్శ సత్య దూతలుగా ఈ అరవై మంది అర్హతులతో మహోన్నత ధమ్మాన్ని, కేవలం వినాలను కొన్నవారికే, ప్రచారం చేయించాలని బుద్ధుడు నిర్ణయించాడు.

**మరో ముప్పైమంది ధమ్మ స్వీకారం**

బుద్ధుడు తనకు ఇచ్ఛ కలిగినంత కాలం వారణాసి సమీపంలోని ఇసి పట్టణంలో ఉండి, ఆ తరవాత ఉరువెలకు వెళ్ళాడు. మార్గ మధ్యంలో ఒక ఉపవనంలో చెట్టు నీడన కూర్చొన్నాడు.

ఆసమయంలో కేళీ విలాసంగా గడప డానికి ఒక ముప్పై మంది యువకులు తమ తమ భార్యలతో ఆ వనానికి విచ్చేశారు. అందులో ఒకనికి భార్య లేక పోవడంతో, తనతో ఒక వేశ్యను తెచ్చు కొన్నాడు. వాళ్ళంతా తమ కేళీ విలాసాలలో మునిగి ఉండగా, ఈ వేశ్య వారి విలువైన వస్తువులను సంగ్రహించి, కనిపించ కుండా పోయింది. ఆ తరవాత ఆ యువకులు ఆ వేశ్య కోసం వెతుకుతూ, ఆ వనంలోనే ఉన్న బుద్ధుని చూసి, ఎవరైన స్త్రీ అటుగా వెళ్ళిందేమోనని అడిగారు.

''స్త్రీని వెతకడమా? తనను తాను వెదకడమా?' ఏది మంచిది యువకులారా అని బుద్ధుడు ప్రశ్నించాడు.

''తనను తాను అన్వేషించడమే మంచిది, దేవా'', యువకులు చెప్పారు

''అయితే, మంచిది, కూర్చొండి, మీకు ధమ్మం చెబుతాను,'' అన్నాడు బుద్ధుడు.

''మంచిది, అలాగే కానివ్వండి, దేవా,'' అంటూ గౌరవాభివాదం చేసి వినడానికి ఆసక్తులై కూర్చొన్నారు.

వారు శ్రద్ధాళువు లై విని ధర్మ చక్షువును పొందారు. తరవాత వాళ్ళు సంఘంలో చేరి ఉన్నత దీక్షను స్వీకరించారు.

**ముగ్గురు కశ్యప సోదరుల ధమ్మస్వీకారం**

అలా తిరుగుతూ తిరుగుతూ బుద్ధుడు కాలక్రమంలో ఉరువెల చేరాడు. ఇక్కడ ముగ్గురు (జతిల) సన్యాసులు ఉన్నారు. వీరి వెంట్రుకలు జడలు కట్టి ఉన్నాయి. వీరు ఉరువెల కశ్యప, నదీ కశ్యప, గయా కశ్యప లు. వీరు ముగ్గురు వేరు వేరుగా, వరుసగా 500, 300, 200 ల మంది శిష్యులతో ఉంటున్నారు. అందరికంటె పెద్దవాడు తన ఆధ్యాత్మిక సంపత్తితో విమోహితుడై, తాను అర్హతుడ ననే ఒక భ్రాంతిలో పడి కొట్టు కొంటున్నాడు. మొదట బుద్ధుడు అతని దగ్గరకు వచ్చాడు. ఆ రాత్రికి అతని నెగడు గదిలో ఉండ డానికి ఆశ్రయం కోరాడు. ఆ గదిలో ఒక భయంకరమైన నాగరాజు ఉంది. బుద్ధుడు తన మనోశక్తితో నాగరాజుని నియంత్రించాడు. దీనికి ఉరువేల కశ్యపుడు ఎంతో సంతోషించి, బుద్ధుని తనకు అతిథిగా ఉండ వలసిందిగా ఆహ్వానించాడు. అనేక సందర్భాలలో, ఈ సన్యాసి ఒత్తిడిపై, బుద్ధుడు తన మనోశక్తులను ప్రదర్శించ వలసి వచ్చింది. అయినా ఇంక ఆ సన్యాసి తనలాగా బుద్ధుడు అర్హతుడు కాడనే విశ్వాసానికే అంటి పెట్టుకొని ఉన్నాడు. అంతిమంగా బుద్ధుడు తాను అర్హతుడనని అతనిని నమ్మించగలిగాడు. అంతట ఆ సన్యాసి, అతని శిష్యగణమూ సంఘంలో చేరి ఉన్నత దీక్షను స్వీకరించారు.

అతని సోదరులిరువురూ, వారి వారి శిష్యగణం అతనిని అనుసరించారు. ముగ్గురు కశ్యప సోదరులు, వారి వేయి మంది అనుయాయులు వెంటరాగా, బుద్ధుడు, ఉరువెలకు అనతి దూరంలో లేని గయా సీసకు వెళ్ళాడు. ఇక్కడ ఆయన 'ఆదిత్త పరియాయ సుత్త' బోధించాడు. దీనిని విని అంతా అర్హతులయ్యారు.

**ఆదిత్త పరియాయ సుత్త (- ''ప్రతిది జ్వాలలోనే ఉంది[10]'') పై ఉపన్యాసం**

''అన్నీ మంటల్లోనే ఉన్నాయి, భిక్కులారా!, నిప్పుల్లో ఉన్నదంతా ఏది?''

కన్ను మంటల్లో ఉంది. రూపాలన్నీ మంటల్లోనే ఉన్నాయి. నేత్ర విజ్ఞానం (Eye consciousness) మంటల్లో ఉంది. నేత్ర సన్నికర్షతో జనించే వేదన – అది సుఖకరమైనా,

బాధాకరమైనా లేక రెండూ అయినా కాక పోయినా – మంటల్లోనే ఉంది. అది దేనితో జ్వలితమైంది? లాలస, ద్వేషం, అ విద్య, జన్మ, జరా, మృత్యువు, శోకం, వాపోవడం, బాధ, దుఃఖం, నిరాశలు దానిని జ్వలిస్తాయని నేను వా కొంటున్నాను.

ఈ విధంగా పర్యాలోచిస్తే, ఓ భిక్కులారా, ఉపదేశితుడైన అరియ శిష్యుడు కంటితో, రూపాలతో, నేత్ర విజ్ఞానంతో, నేత్ర సన్నికర్షతో, సన్నికర్షతో జనించే వేదన ఏదైన – అది సుఖకరమైన, బాధాకరమైన, ఈ రెండూ అయినా కాక పోయిన–దానితో జుగుప్స చెందుతాడు: అలాగే అతడు చెవితో ధ్వనులతో, ముక్కుతో, వాసనలతో, మనస్సుతో మానసిక విషయాలతో, మనో విజ్ఞానంతో,. మనస్సు సన్నికర్షతో నాలుకతో, రుచితో, శరీరంతో, స్పర్శతో, అది మనస్సుసన్నికర్ష నుంచి జనించే ఏ సంవేదన అయినా, సుఖకరంగాని దుఃఖ కరంగాని, రెండూ కానీ కాకపోనీ– దానితో నిర్వేదం పొందు తాడు. జుగుప్సతో అతడు విరాగి అవుతాడు. విరాగంతో అతడు విముక్తు డవుతాడు. అప్పుడతడు అర్థం చేసుకొంటాడు: ''మరో జన్మలేదని, చేయ వలసిందంతా చేశానని, ఇక మరి ఈ స్థితి లేదని.''

ఈ విధంగా బుద్ధుడు తన ఉపన్యాసం ముగించే సరికి భిక్కులు అన్ని మాలిన్యాలను కడిగి వేసుకొని, అర్హతు లయ్యారు.

**సారిపుత్త, మొగ్గల్లాన అనే ఇద్దరు ముఖ్య శిష్యుల ధర్మస్వీకారం**

రాజగ హకు సమీపంలోని ఉపతిస్స గ్రామంలో – ఈగ్రామాన్ని నాలక అని గూడ అంటారు – ధీశాలి అయిన సారిపుత్రుడనే యువకు డొక డున్నాడు.

అతడు గ్రామంలో ఉన్నత కుటుంబానికి చెందిన వాడు కావడంతో అతనిని ఉపతిస్స అని గూడ అంటారు.

అతడు బ్రాహ్మణ మతంలోనే పుట్టి పెరిగినా, జీవితం యెడ అతనికున్న విశాల దృక్పథం పరిణతి చెందిన జ్ఞానం, తన పూర్వీకుల మతాన్ని వదిలి, అత్యంత సహనం, శాస్త్రీయత లతో గూడిన బుద్ధ గౌతముని బోధను స్వీకరించాడు. అతని అన్నదమ్ములు అక్క చెల్లెళ్లు అతనిని అనుసరించారు. అతని తండ్రి, వంగుత, బ్రాహ్మణ మత విశ్వాసానికే అంటిపెట్టుకొని ఉన్నాడని చెప్ప పనిలేదు. బౌద్ధం పుచ్చు కొన్నా డన్న కారణంగా కుపిత అయిన తల్లి, అతని మరణ సమయంలో, అతని చేతనే బౌద్ధ దీక్ష తీసుకొంది.

ఉపతిస్స విలాసం ఒడిలో పెరిగాడు. కొలిత అనేవాడు ఇతనికి మంచి స్నేహితుడు. కొలిత మరో పేరు మొగ్గల్లాన. చాలకాలంగా ఇతనితో స్నేహం ఉంది. ఒక రోజు వారిద్దరు కొండ తిరుణాలలో సరదాగా కాలం గడుపు తుండగా, ''ఈ భౌతిక సుఖాలన్ని ఎంత వ్యర్థాలు, క్షణికాలు'' - అని గుర్తించారు. వెంటనే వాళ్ళు ఈ ప్రపంచాన్ని వదిలి, మోక్షమార్గాన్ని అన్వేషించాలని నిర్ణయించు కొన్నారు. శాంతి అన్వేషణలో ఈ చోట ఆ చోటని లేక అన్ని చోట్ల తిరిగారు.

ఈ యువ అన్వేషకు లిద్దరు మొదట సంజయుని కలిశారు. ఇతినికి చాల పెద్ద అనుచర గణం ఉంది. అతనిని దీక్ష ఇప్పించమని కోరారు. కాని అనతి కాలంలో అతడు అందించిన అల్ప జ్ఞానంతో అసంతృప్తు లయ్యారు. మానవాళిని పట్టుకు పీడిస్తున్న జాడ్యానికి వారికి మందు దొరక లేదు. అందుకని వారు అతనిని వదిలి, శాంతి కోసం మళ్ళీ వెదకడం ప్రారంభించారు. వారు ఎంతో మంది బ్రాహ్మణులను, సన్యాసులను కలిశారు. కాని వారికి అంతటా నిరాశే ఎదురైంది. చివరకు తిరిగి తిరిగి తమ స్వగ్రామానికే చేరుకొని, ఒకమాట అనుకొన్నారు: ''మనలో ఎవరికి ముందు మార్గం దొరికితే అతడు రెండోవానికి చెప్పాలి అని.''

ఇదిగో, ఈ సమయంలోనే బుద్ధుడు, ప్రపంచానికి ఉన్నత ధమ్మాన్ని అందించడం కోసం, తన మొదటి అర్వై శిష్యులను పంపాడు. బుద్ధుడు ఉరువెల కేసి బయలు దేరాడు. మొదట ఐదుగురులో ఒకరైన గౌరవనీయ అస్సజి రాజగహ కేసి వెళ్ళాడు.

వారి ఆధ్యాత్మిక ప్రగతిని కరుణా దృష్టితో చూస్తుందా అన్నట్లు ఆ అన్వేషకుల సత్కర్మ ఇప్పుడు జోక్యం చేసు కొంది. రాజగహ లో ఉపతిస్స తిరుగుతుండగా, ఒక సన్యాసిని కలిశాడు. ఆ సన్యాసి రూపురేఖా విలాసాలు, ప్రవర్తన వెంటనే అతనిని ఆకట్టు కొన్నాయి. ఆ సన్యాసి కళ్ళు కాడి (yoke) దూరంలో క్రిందికి చూస్తున్నాయి. అతని ప్రశాంత ముఖం అతని లోని గాఢ శాంతిని సూచిస్తోంది. సంరచితమైన శరీరంతో, చక్కగా ధరించిన చీవరాలతో, ఆ గౌరవనీయ మూర్తి, నియత పద విన్యాసంతో, దాత లిచ్చే అన్నం కబళాలను తన భిక్షాపాత్రలో స్వీకరిస్తూ, ఇంటింటికి తిరుగుతూ నడుస్తున్నాడు. '' ఇటు వంటి సన్యాసిని నేను ఎప్పుడూ చూడ లేదు.'' అనుకొన్నాడు, అతడు. ''కచ్చితంగా ఇతడు అర్హతులలో ఒకరై ఉండాలి, లేదా అర్హతత్వ సాధన మార్గంలోని వాడైన అయి ఉండాలి. ఇప్పుడు నేను అతనిని సమీపించి, 'అయ్యా, మీరు ఎవరికోసం ఈ ప్రపంచాన్ని

త్యజించారు? మీ గురువులు ఎవరు? ఎవరి ధమ్మాన్ని మీరు బోధిస్తున్నారు?, అని అడిగితేనో''? అని అతడు ఆలోచించాడు.

ఏమైన ఉపతిస్స ఆ పని చేయ లేదు, ఎందుకంటె, అతని నిశ్శబ్ద భిక్షా యాత్రకు భంగం కలిగించి నట్లు అవుతుంది.

అర్హతుడు అస్సజి, తనకు లభించిన ఆ కొద్ది పాటి ఆహారాన్ని భుజించ డానికి తగిన చోటు కోసం చూస్తున్నాడు. ఉపతిస్స ఇది చూసి, తన పీటను, తన పాత్రలోని నీళ్ళను ఆయనకు ఇచ్చి, ఆ అవకాశాన్ని ఉపయోగించు కొన్నాడు. ఒక శిష్యుడు గురువుకు చేయ వలసిన ప్రాధమిక విధులను ఈ విధంగా నిర్వహించి, ఆయనకు అభివాదాలు చేసి, గౌరవ పురస్సరంగా ఇలా అడిగాడు:

''గౌరవనీయమైన అయ్యా, మీ జ్ఞానేంద్రియం ప్రశాంతంగా ప్రసన్నంగా, మీ దేహచ్ఛాయ స్వచ్ఛంగా, పరిశుభ్రంగా ఉంది. మీరు ఎవరికోసం ఈ ప్రపంచాన్ని త్యజించారు? మీ గురువులు ఎవరు? మీరు ఎవరి ధమ్మాన్ని బోధిస్తున్నారు?''

వినమ్రుడైన అర్హత అస్సజి మర్యాద పూర్వకంగా ఇలా చెప్పాడు: ''ఓ సోదరా, సంఘంలో నేను అతి పిన్న వాణ్ణి. నేను నీకు ధమ్మాన్ని పూర్తిగా వివరించ లేను.''

''గౌరవనీయమైన అయ్యా, నన్ను ఉపతిస్స అంటారు. మీ యథాశక్తి కొద్దో గొప్పో చెప్పండి. ఆ తరవాత దానిని వంద విధాలుగానో, వేయి విధాలుగానో అర్థం చేసు కోవడం నాకు సంబంధించిన విషయం. నాకు వదిలి వేయండి.''

ఉపతిస్స కొన సాగించాడు: ''కొద్దీ గొప్పో చెప్పండి. నాకు కచ్చితంగా దాని సారాంశం చెప్పండి. నాకు సారాంశం చాలు. పదగుంభనం వల్ల ప్రయోజనం లేదు.''

గౌరవనీయ అస్సజి ఒక నాలుగు పంక్తుల పద్యాన్ని చదివాడు. ఆ పద్యం బుద్ధుని గాఢ తత్వాన్ని లేదా కారణ సిద్ధాంతాన్ని నేర్పుగ చెప్పింది:

''యే ధమ్మా హెతు ప్పభవా
తెసమ్ హెతుమ్ తథాగతొ ఆహ
తెసమ్ చయొ నిరొధొ
ఎవమ్ వాదీ మహా సమణొ

కారణం నుంచి జనించే వస్తువుల గురించి

వాటికారణాన్ని గురించి తథాగతుడు చెప్పాడు,

వాటి నిరోధాన్ని గురించి గూడ.

ఆ మహా ఋషి ఈ విధంగా బోధించాడు:

క్లుప్తంగానే చెప్పినప్పటికి, ఆ మహోన్నత బోధను అర్థం చేసుకోవడానికి తగి నంతగానే ఉపతిస్సకు జ్ఞానోదయమైంది. సత్యాన్ని కనుక్కోవ డానికి అతనికి కావలసిందల్లా ఒక చిన్న సూచన మాత్రమే. గౌరవనీయ అస్సజి అతనికి ఊర్ధ్వ మార్గంలో ఎంత చక్కగా మార్గ నిర్దేశం చేశా డంటే, మొదటి రెండు పంక్తులు వినగానే, అతడు సన్యాసత్వంలో మొదటి దశ అయిన సోతాపత్తిని పొందాడు.

మహోన్నత బుద్ధ బోధకు తనను పరిచయం చేసినందుకు అతడు గురువుకు తనివి తీర కృతజ్ఞతలు చెబుదా మంటే అతనికి మాటలే కరువయ్యాయి. సత్యాన్ని అంత అద్భుతంగా విడమరిచి నందుకు, బుద్ధుని గురించి అవసరమైన సమాచారం అందించినందుకు, అతనికి తానెంతో ఋణ పడ్డానని చెప్పి, ఆయన దగ్గర సెలవు తీసు కొన్నాడు.

ఆ తరవాత, అతడు తన గురువు యెడ గౌరవాన్ని ఎంతగా చూపించా డంటే, అస్సజి పలాన చోట బోధిస్తున్నాడని తెలిస్తే, ఆ వైపుకు తిరిగి, గౌరవంగా, వినమ్రంగా చేతులు జోడించి నమస్కరించడం, పండుకొనే టప్పుడు గూడ ఆ దిశకేసి తల పెట్టి పడు కోవడం చేసే వాడు.

ఇప్పుడు అతడు ఒప్పందం ప్రకారం, తన సహచరుడు కొలిత దగ్గరకు, తన సంతోష తరంగాలను తెలియ జేయడానికి, తిరిగి వచ్చాడు. తన స్నేహితుడు ఎంతగా జ్ఞానోదయుం పొందాడో అంతగా జ్ఞానోదయం పొందిన కొలిత, పద్యం మొత్తం వినగానే సన్యాసత్వం లోని మొదట దశను చేరాడు. శాంతి అన్వేషణలో వారు సాధించిన విజయంతో సంతో షాంతరంగులై, విధిగ తమగురువు సంజయుని, - ఇతనిని గూడ నూతన సిద్ధాంతానికి మార్చాలని - దగ్గరకు వెళ్ళారు. ఎంత ప్రయత్నించినా గురువు మార లేదు. అయితే అతని శిష్యులలో చాల మంది వీరితో చేరారు. గురువు మారక పోవడంతో విసిగి పోయి, వారితో చేరిన మిగతా వారితో, ఆదర్శ ఆచార్యుడైన బుద్ధుని చూడడానికి 'వెలువన' ఆరామానికి వెళ్ళారు.

వారి ప్రార్థన ననుసరించి, బుద్ధుడు వారిద్దరిని, ''రండి భిక్కులారా!'' (ఇధ భిక్కవె!) అంటూ సంఘంలో చేర్చు కొన్నాడు.

పదిహేను రోజుల తరవాత, సంచార సన్యాసి దీఘనాఖునికి బుద్ధుడు 'వేదనా పరిగ్గహసుత్త'ను వివరిస్తుండగా విని గౌరవనీయ సారి పుత్రుడు అర్హతత్వాన్ని పొందాడు. అదే రోజు సాయంత్రం బుద్ధుడు తన చుట్టూ శిష్యులనురావించి, కూచో బెట్టుకొన్నాడు. సంఘంలో ప్రధమ శిష్యుని స్థానాన్ని థేర ఉపతిస్సకు (సారి పుత్తకు), రెండో శిష్యుని స్థానం కొలితకు (మొగ్గల్లానకు) బుద్ధుడు ప్రదానం చేశాడు. ఒక వారం ముందే వీరిద్దరు అర్హతత్వం పొందారు.

**పాదసూచికలు :**

1. 'సంఘ' అంటే శబ్దార్థం 'గణం', 'సమూహం'. బౌద్ధ భిక్కులు వ్యవస్థను సూచిస్తుంది (సం.)

2. 'పబ్బజ్జా' అంటే శబ్దార్థంగా ముందుకు వెళ్ళుట, పరిత్యాగం. ఇక్కడ బుద్ధ, ధమ్మ, సంఘాలను శరణు వేడడం ద్వారా సంఘంలోకి అనుమతించ బడడం.

3. సంఘ స్థాపనం మొదటిరోజుల్లో ఉన్నత దీక్షను ఉపసంపదా అనేవారు. దీని శబ్దార్థం ఉన్నత నీతితో నిండిన, ఈ పదాలతో అనుమతించ బడిన. 14వ ప్రకరణం చూడండి.

4. ఉపాసక (పు) ఉపాసికా (స్త్రీ). శబ్దార్థం ప్రకారం త్రిరత్నాలతో సన్నిహితంగా ఉన్నవాడు. ఈ రెండు పదాలను. సన్యసించని బౌద్ధ అనుయాయులకు అన్వయిస్తారు. మూడు శరణాలను వేడడంతోనే ఒకరు ఉపాసకుడు గాని, ఉపాసికగాని, అవుతారు. ఆ మూడు శరణాలు ఇవి :

   *బుద్ధం శరణం గచ్ఛామి*

   *ధమ్మం శరణం గచ్ఛామి*

   *సంఘం శరణం గచ్ఛామి*

   ఇది త్రిపుటి సూత్రం (తెవాచిక)

5. *మహావగ్గ*, PP. 19,20.

6. దేవతలను ఉపయోగించడం గమనించండి.

7. '*బ్రహ్మచరియ*' అనే పాళీ పదానికి దేవునితోగాని, బ్రహ్మతో గాని సంబంధం లేదు. అది పవిత్ర, కులీన, అనే అర్థంలో ఉపయోగించ బడింది. (దీని సంస్కృత సమానార్థకం 'బ్రహ్మచార్య' మామూలుగా విద్యార్థి బ్రహ్మచర్య జీవితాన్ని సూచిస్తుంది. సం.)

8. జైనులు గూడ, తమ సంఘం గూడ అంత పాతదే అంటారు. కాని మౌర్య యుగాంతంలో ఏర్పడిన చీలిక ఈనాటికీ భారతదేశంలో ఉన్న రెండు తెగలకు దారి తీసింది. వారి మతగ్రంథాలు ఇప్పటికీ ఉండడంతో ఈ సంఘటనను తరువాతి కాలానికినెట్టాయి. సం.

9. తనను తా అన్వేషించు కోవడం. ఈ పద బంధం చాల అర్థవంతమైంది. 'అత్తానమ్' 'అత్త' కు ద్వితీయా విభక్తి. అత్త అంటే ఆత్మ. కొంతమంది పండితులు విపరీతార్థం తీయడానికి ప్రయత్నిస్తున్నట్లుగా, ఇక్కడ బుద్ధుడు, ఏరకమైన ఆత్మను, క్షేత్రజ్ఞుని గురించి మాటాడడం లేదు. అతని రెండో ఉపన్యాసంలో స్పష్టంగా ఆత్మ లేదని చెప్పిన బుద్ధుడు ఆత్మ ఉందని ఎలా చెబుతాడు? బుద్ధుని ప్రకారం ఈపద బంధానికి అర్థం, ''నిన్ను నీవు అన్వేషించు'' లేదా ''లోపలికి చూడు.''

10. మహావగ్గ, P.34. అగ్ని ఆరాధకులైన ఆయన శ్రోతల గత కాలపు అలవాటుకు ఈ రూపకం తగ్గట్టుగానే ఉంది.

ఎనిమిదో ప్రకరణం

# బుద్ధుడు - అతని బంధువులు

- *"బంధు సేవ మంగళకరం"*

- మంగల సుత్త

### శుద్ధోదన మహారాజు బుద్ధుని చూడ గోరాడు

బుద్ధుడు రాజగృహలో ఉంటున్నాడని, అతడు ధమ్మబోధ చేస్తున్నాడనే వార్త వృద్ధుడైన మహారాజు శుద్ధోదనుని చెవిని పడింది. దీనితో అతనికి జ్ఞాన సిద్ధి పొందిన తన పుత్రుని చూడాలనే కోర్కె బలీయమై పోయింది. తొమ్మిది సందర్భాలలో వరుసగా తొమ్మిమంది రాజాస్థాన సభ్యులను, మంది మార్బలంతో, బుద్ధుని కపిల వస్తుకు ఆహ్వానించడానికి రాజు పంపించాడు. అతడు ఆశించిన దానికి విరుద్ధంగా, వారంతా ధమ్మాన్ని విని, అర్హతులై, సంఘంలో చేరి పోయారు. అర్హతులు ఇహలోక విషయాలు పట్టించు కోరు కనుక, వారెవరు బుద్ధునికి రాజుగారి వర్తమానం తెలియ జేయ లేదు.

నిరుత్సాహం చెందిన రాజు చివరిగా మరో నమ్మకమైన బంటు కాలుదాయిని పంపించాడు. ఇతడు బుద్ధునితో చిన్నప్పుడు ఆడుకొన్నవాడే. సంఘంలో చేరి పోవడానికి అతనికి అనుమతి ఉన్న కారణంగా, అతడు వెళ్ళడానికి ఒప్పు కొన్నాడు.

ఇతరులకు వలె ఇతనికి అర్హతుడయ్యే అదృష్టం కలిగింది. సంఘంలో చేరి పోయాడు. ఇతడు, ఇతరుల వలె కాక, కబురును బుద్ధునికి చెప్పాడు. ముసలి తండ్రిని ఒకసారి దర్శించమని బతిమి లాడాడు. ఆ ఋతువు ప్రయాణానికి మంచి అనుకూలంగా ఉండడంతో, బుద్ధుడు తన మహా శిష్యగణంతో, మార్గమధ్యంలో ధమ్మాన్ని బోధిస్తూ, అంచెలంచెలుగా పయనిస్తూ, రెండు నెలలో కపిలవస్తు నగరాన్ని చేరాడు.

అతడు ఉండ డానికి నిగ్రోధ వనంలో ఏర్పాట్లు చేశారు. గర్వమతులైన శాక్యవృద్ధులు, "అతడు మాకు తమ్ముడు, మా సోదరుని కుమారుడు, మా మనుమడు," అని తమలో తాము తర్కించుకొని, యువ రాకుమారులతో "మీరు అతనికి నమస్కారం చేసి స్వాగతించండి. మేము మీ వెనక కూర్చొంటాము", అని చెప్పారు. అలాగే వారు అతనిని ఏమాత్రం గౌరవించ కుండ కూర్చుండి పోయారు. బుద్ధుడు అప్పుడు గాలిలోకి 'లేస్తూ', 'ద్వంద్వాద్భుతాన్ని'[1], ప్రదర్శిస్తూ వారి గర్వాన్ని అణిచాడు. రాజు దీనిని తిలకించి, వెంటనే

నమస్కరించి, ''ఇది నామూడవ నమస్కారం.[2]'' అన్నాడు. అప్పుడు శాక్యు లందరికీ, అతనికి నమస్కరించక తప్ప లేదు. అంతట బుద్ధుడు అకసం నుంచి దిగి వచ్చి, తనకు ఏర్పాటు చేసిన ఆసనం పై కూర్చొన్నాడు. వినీతులైన చుట్ట పక్కాలు, ఆయన చెప్పేది వినడానికి, ఆతురతతో తమతమ ఆసనాలలో ఆసీను లయ్యారు.

సరిగా ఇదే క్షణంలో శాక్యబంధువర్గం మీద ఆకస్మికంగా వాన తుంపర పడింది. ఈ అద్భుత సంఘటన వారి మధ్య చర్చను లేవ తీసింది. తన గత జన్మలో తన బంధువుల సమక్షంలో ఇటువంటి సంఘటనే జరిగిందని రుజువు చేయ డానికి అతడు వెస్సంతర జాతక[3] కథను చెప్పాడు.

ఈ ఉపన్యాసంతో శాక్యులంతా ఎంతో సంతోషించి, బుద్ధుని అతని శిష్యులను భోజనానికి పిలవడం తమ విధి అన్న సంగతినే మరిచి, తమ దారిన తాము వెళ్ళి పోయారు. ''నా పుత్రుడు నాయింటికి రాక ఎక్కడికి వెళతాడులే'', అని తనలో తాను అను కొన్నప్పటికీ, ఆయన్ను, శిష్యగణాన్ని భోజనానికి పిలవాలనే విషయం రాజుకూ తట్ట లేదు. ఇంటికి వచ్చి, రాజు, వారి రాక కోసం ఎదరు చూస్తూ, అనేక రకాల భక్ష్యాలు తయారు చేయించాడు.

## బుద్ధుడు భిక్షకు వెళతాడు

### శుద్ధోదనుని ధమ్మ స్వీకారం

మరురోజు గూడ మధాహ్న భోజనానికి ప్రత్యేకమైన ఆహ్వానం ఎదీ లేక పోవడంతో, బుద్ధుడు, అతని శిష్యులు, కపిలవస్తు పురవాసుల ఇండ్లలో భిక్షకు సిద్ధమయ్యారు. బయలు దేరే ముందు బుద్ధుడు ఇలా అనుకొన్నాడు: ''గత జన్మలలో బుద్ధులు తమ బంధువు లున్న నగరాలు ప్రవేశించి నప్పుడు, భిక్షకు తిన్నగా బంధువుల ఇళ్ళకే వెళ్ళారా లేక ఒక వరుస క్రమంలో ఒక ఇంటి తరవాత మరో ఇంటికి వెళ్లారా?'' బంధువుల ఇళ్ళకు కాక, ఒక వరుస క్రమంలోనే వెళ్ళారనే విషయాన్ని మనస్సులో దర్శించి, బుద్ధుడు కపిలవస్తు వీధులు వెంట భిక్షకు వెళ్ళాడు.

పైకి అవమానకరంగా కనిపిస్తున్న బుద్ధుని ఈ ప్రవర్తనను, కోడలు యశోధర ద్వారా విని, రాజు కలత మనస్కుడై, బుద్ధుని సమీపించి, నమస్కరించి, అన్నాడు: ''కుమారా, నన్ను ఎందుకు నాశం చేస్తావు? నీవు భిక్షకు వీధుల వెంట పడడంతో, నేను అవమానంతో ఎంతగానో కుంగి పోతున్నాను. బంగారు పల్లకీలలో తిరిగిన ఈ నగరంలోనే భిక్షచేయడం నీకు తగునా? నన్ను ఈవిధంగా ఎందుకు అవమానిస్తావు?''

''హే మహారాజా, నేను మిమ్ము అవమానించడం లేదు. నేను నా వంశాచారాన్నే అనుసరిస్తున్నాను,'' అని బుద్ధుడు సమాధానం చెప్పాడు. రాజు విస్తు పోయాడు.

''కాని, నా ప్రియ పుత్రా, భిక్షద్వారా జీవితం గడపడం నా వంశాచార మంటావా? నిజంగా, ఓదేవా, మనది మహాసమ్మట వీరుల వంశం. ఇందులో ఏ ఒక్క యోధుడు భిక్ష మెత్త లేదు''.

''హే మహారాజా, అది మీ రాజ వంశాచారం కాక పోవచ్చు. కాని అది మా బుద్ధుల వంశాచారం. అనేక వేల మంది బుద్ధులు భిక్షతోనే జీవించారు.''

వీధిలోనే నిలబడి బుద్ధుడు రాజుకు ఇలా సలహా ఇచ్చాడు: ''(భిక్షకోసం వాకిట) నిలబడడంలో అలక్ష్యం వద్దు. ధర్మబద్ధ జీవితం గడుపు, ధర్మ గుణులు ఈ లోకంలోను, పరలోకంలోను హాయిగా జీవిస్తారు.''[4]

దానిని వినడంతో రాజు సత్యాన్ని గ్రహించాడు. సన్యాసిత్వంలో మొదటి దశను చేరాడు. వెంటనే ఆ తరవాత అతడు బుద్ధుని భిక్షా పాత్రను చేత తీసు కొని, అతనిని, అతని శిష్యులను, రాజ ప్రాసాదానికి తీసుకు వెళ్ళి ఇష్టభోజనం పెట్టాడు. భోజనం ముగింపు సమయంలో, బుద్ధుడు అతనిని ఇలా హెచ్చరించాడు:

''ధర్మ జీవితం గడుపు. కలుషిత జీవితం వలదు. ధర్మ జీవి ఇహ పర లోకాలు రెండింటిలో హాయిగా ఉంటాడు.''[5] అంతట రాజు సన్యాసత్వంలో రెండో దశ అయిన 'సకదాగామి' దశను అందుకొన్నాడు. ప్రజాపతి గౌతమీ సన్యాసత్వంలో మొదటి దశ అయిన 'సోతాపత్తి'ని పొందింది.

లక్ష్యాన్ని సాధించకనే బుద్ధుడు కఠోర తపస్సు కారణంగా మరణించాడని చెబితే రాజు నమ్మ లేదు. ఈ విషయాన్ని తరవాత ఒక సందర్భంలో బుద్ధునితో అంటే, అతడు ధమ్మపాల జాతక్ కథను వినిపించాడు. ఈ కథను ఎందుకు చెప్పాడంటే, పూర్వ జన్మలో గూడ తన పుత్రుడు మరణించాడని ఎముకల పోగును సాక్ష్యంగా చూపినా గూడ, రాజు నమ్మ నిరాకరించాడు. ఈ సారి అతడు సన్యాసత్వంలో మూడోదశ అయిన 'అనాగామి'ని పొందాడు.

మరణ శయ్యమీద, ఆఖరుసారిగా, బుద్ధుణ్ణించి, ధమ్మ ప్రవచనం విని, శుద్ధోధనుడు అర్హతత్వం పొందాడు. ఏడు రోజుల పాటు, ముక్తానందాన్ని అనుభవించిన తరవాత, బుద్ధునికి నలభై సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు, గృహస్థ అర్హతుడుగానే కాలంచేశాడు.

రాకుమారి యశోధర కొలియ జాతిరాజైన సుప్పబుద్ధ, రాణి పమితాల కూతురు. పమితా రాణి శుద్ధోదనుని సోదరి. రాహులమాతా, బింబా, బద్దకచ్చానాలు యశోధరకు ఇతర నామాలు. ఈమె వయస్సు, రాకుమారుడు బుద్ధుని వయస్సు ఒకటే. పదహారవ యేట అతనిని పెళ్ళి చేసు కొంది. శౌర్య ప్రతాపాలను ప్రదర్శించే అతడు ఆమె పాణిని గ్రహించాడు. ఆమె అత్యంత సుఖవంతమైన జీవితాన్నే గడిపింది. ఆమె 29వ యేట, ఏకైక కుమారుడైన రాహులుని ప్రసవించిన రోజుననే, ధీశాలి, ఆలోచనా పరుడు అయిన ఆమె భర్త, ఆమె హృదయ పూర్వకంగా ప్రేమించిన ఆమె భర్త, ఈదుఃఖ మయ జీవితా న్నుండి విముక్తం కావడానికి సంసార పరిత్యాగం చేయాలని నిశ్చయించుకొన్నాడు. విశ్వసనీయ, మనోజ్ఞ అయిన భార్యకు వీడ్కోలు చెప్ప కుండానే, బిడ్డను యశోధర పెంపకానికే వదిలి వేసి, రాత్రికి రాత్రి రాజ ప్రాసాదాన్ని వదిలిపెట్టాడు. యశోధర మామూలుగానే నిద్ర లేచింది. తన ప్రియ భర్తకు నమస్కరించాలని చూసింది. కాని అత డెక్కడ కనిపించ లేదు. తనను, నూతనంగా జనించిన చిన్నారిని, రాకుమారుడు వదిలి వెళ్ళాడని తెలుసుకోగానే, అవర్ణనీయమైన దుఃఖంలో మునిగి పోయింది. ఆమె తన అత్యంత ప్రియమైన వస్తువును ఎప్పటికీ కోల్పోయింది.అన్ని ఆకర్షణలు, విలాసాలు ఉన్న ఆ రాజప్రాసాదం ఆమెకు అంధకార బిలం అయి పోయింది. ప్రపంచ మంతా ఒక్క మాటుగా శూన్యం అయి పోయింది. ఆమెకు మిగిలిన, ఓదార్పు ఒక్కటే - అది ఆమె చిన్నారి కొడుకు.

అనేక మంది రాకుమారులు ఆమె హస్తాన్ని అందుకో జూశారు. కాని ఆమె ఆ ప్రతిపాదన లన్నింటిని తోసి వేసి, తన ప్రియ భర్తకు విశ్వాసపాత్రురాలుగా మిగిలి పోయింది. తన భర్త ఒక సన్యాసి జీవితాన్ని గడుపు తున్నాడని విని, తానూ నగవ్రటా తీసివేసి, సాదా పీతాంబరాన్ని ధరించింది. సన్యాసి గౌతముడు జ్ఞాన సిద్ధికోసం సమరం సాగించిన ఆరు సంవత్సరాల కాలం అంతా యశోధర అతని చర్యలన్నీ గమనించి, తానూ అలాగే చేసింది.

జ్ఞానోదయానంతరం బుద్ధుడు కపిలవత్థు నగరం విచ్చేసిన మరు రోజు రాజు అతనికి రాజప్రాసాదంలో మర్యాదలు చేస్తు న్నప్పుడు, రాకుమారి యశోధర తప్ప, అందరూ ఆయనకు గౌరవాభివాదాలు చేయడానికి వచ్చారు.

అపుడు ఆమె ఇలా అనుకొంది :

''నాలో ఏదైన సద్గుణం ఉంటే, ఆర్యపుత్రులు తనంతతానే నా దగ్గరకు వస్తారు. అప్పుడు నేను అయనను గౌరవిస్తాను.''

భోజనం అయిన తరవాత భిక్షా పాత్రను రాజుకు అందించి, తన ముఖ్యమైన ఇద్దరు శిష్యులతో యశోధర మందిరానికి వెళ్ళి, తనకోసం ఏర్పాటు చేసిన ఆసనం మీద కూర్చొని ఇలా అన్నాడు: ''రాకుమారిని తన కిష్టమైన రీతిలోనే నన్ను గౌరవించ నీయండి. ఏమీ చెప్ప వద్దు.''

బుద్ధుడు తన మందిరానికి వచ్చాడని విన్న ఆమె, ఆస్థానంలోని మహిళ లందరిని పీతాంబరాలు ధరించమని ఆదేశించింది. బుద్ధుడు ఆసీనుడు కాగానే, యశోధర త్వరత్వరగా అతని దగ్గరకు వచ్చి, అతని పాదాలు పట్టుకొని, తల పాదాలపై ఆన్చి, తన కిష్టమైన రీతిలో అతనిని గౌరవించింది.

ఈ విధంగా ఆమె తన వాత్సల్య గౌరవాలను ప్రదర్శించి, గౌరవ పురస్సరంగా కూర్చొంది. అప్పుడు రాజు ఆమె గుణాలను కీర్తించి, ఆమె ప్రేమ, విశ్వాసపాత్రతల మీద వ్యాఖ్యానించి, ఇలా అన్నాడు :

''దేవా, మీరు పీతాంబరాలు ధరిస్తున్నారని విని, నా తనయ తనకై తాను పసుపు రంగు వస్త్రాలను కట్టు కొంది. మీరు రోజుకు ఒక్క పూటే భోంజేస్తున్నారని విని తానూ ఒంటి పూటే భోజనం చేసింది. మీరు ఉన్నత శయనాలను వదిలి వేశారని వినగానే, తానూ నేలపై పవళించింది. పూల మాల, సుగంధ ద్రవ్యాల వాడకం తాము మాని వేసారని వినగానే తానూ మాని వేసింది. ఆమె బంధుగణం తాము ఆమెను పోషిస్తామని కబురంపి నప్పుడు, వారిలో ఏ ఒక్కరి వైపు ఆమె కన్నెత్తి చూడ లేదు. నాకూతురు అంతటి సద్గుణ రాశి.''

'' ఈ జన్మలోనే కాదు, ఓ రాజా, పూర్వ జన్మలో గూడ, నన్ను చక్కగా చూసుకొంది. నాయెడ భక్తి ప్రపత్తులు, విశ్వాస పాత్రతను ప్రదర్శించింది,'' అని బుద్ధుడు 'చందకిన్నర జాతక'[7] కథ చెప్పాడు. ఈ గత జన్మ బంధాన్ని గుర్తుచేసి, ఆమెను ఓదార్చి, ప్రాసాదాన్ని వదలి వెళ్ళిపోయాడు.

శుద్ధోదన మహారాజు మరణించిన తరవాత, పజాపతీ గౌతమీ భిక్కుని అయి నప్పుడు, యశోధర సంఘంలో చేరి, అర్హతత్వం పొందింది.

స్త్రీ శిష్యులలో, అసాధారణ శక్తులను పొందిన వారిలో ఈమె ముఖ్యమైంది. ఆమె తన డెబ్బై ఎనిమిదో ఏట గతించింది.

'థేరి' గాథా లో ఆమె పేరు కనిపించదుగాని, ఆమె ఆసక్తికర పద్యాలు అపదాన్‌లో ఉన్నాయి.

## బుద్ధుడు - రాహులుడు

రాహులుడు రాకుమారుడు సిద్ధార్థుడు యశోధరల ఏకైక పుత్రుడు. అతడు సిద్ధార్థుడు ఈ సంసారాన్ని త్యజించాలని నిర్ణయించుకొన్న రోజునే పుట్టాడు. సిద్ధార్థుడు వనంలో పర్యాలోచనా మగ్నుడై ఉండగా పుత్రుడు పుట్టాడనే శుభవార్త అతనికి అందించ బడింది. వార్తవిని సంతోషించవలసిన గౌతముడు సంతోషించలేదు. పైగా విరుద్ధంగా, ''రాహుజాతో బంధనం జాతం, ఒక రాహువు పుట్టింది ఒక బంధం ఏర్పడింది'', అన్నాడు. ఆ విధంగా అతనికి రాహులుడ[10]ని, అతని తాత శుద్ధోదనుడు నామకరణం చేశాడు. పిల్లవానికి ఏడు సంవత్సరాల వయస్సులో, బుద్ధుడు జ్ఞానోదయం అయ్యాక మొదటి సారి కపిల వస్తుకు వచ్చాడు. అతడు వచ్చిన ఏడో రోజున రాకుమారి యశోధర చిన్ని రాహులునికి ఉల్లాసంగా బట్టలు వేసి, బుద్ధుని వైపు చూపిస్తూ అంది: ''పుత్రా అటు చూడు. ఇరవై వేల సన్యాసులు చుట్టూ ఉన్న, బ్రాహ్మణుడు లాగా కనిపించే, బంగారు రంగు సన్యాసిని చూడు, అతడే నీ తండ్రి. అతని దగ్గర గొప్పధనం ఉంది. పరిత్యాగం చేసిన నాటి నుంచి నేటి వరకు మేము ఆయన్ను చూడ లేదు. ఆయన దగ్గరకు వెళ్ళి నీ ఔరస భాగధేయం అడుగు. వెళ్ళి ఇలా అను: 'ఓ తండ్రీ, నేను రాకుమారుణ్ణి. ప్రతిష్టితుడనైన (consecrated) తరవాత, నేను ప్రపంచానికే చక్రవర్తి నవుతాను. నాకు సంపద కావాలి, ఇవ్వండి. తండ్రికి చెందిన దాని కంతటికి పుత్రుడే హక్కుదారుడు'.''

అమాయకుడైన రాహులుడు బుద్ధుని దగ్గరకు వచ్చి, తల్లి చెప్పినట్లుగా, చాల ప్రేమగా అన్నాడు: ''ఓ భిక్షూ, మీ నీడ కూడ నా కెంతో మహదానందంగా ఉంది.''

భోజనానంతరం బుద్ధుడు ప్రాసాదం నుంచి వెళ్ళాడు. రాహులుడు అతనిని అనుసరించి నడుస్తూ. ''నా వారసత్వాన్ని నాకివ్వండి'', అంటూ ఇంకా సందర్భానికి తగినవి ఎన్నో మాట్లాడాడు. ఎవరూ అతనిని ఆప ప్రయత్నించ లేదు. బుద్ధుడు గూడ తన ననురించి రా వలదని చెప్ప లేదు. వనానికి చేరిన తరవాత, బుద్ధుడు అనుకొన్నాడు: ''అతడు తన తండ్రి ఆస్తి కావాలని కోరు కొంటున్నాడు. కాని అది ఇహ సంబంధమైనది. పూర్తిగా బాధలతో కూడు కొన్నది. నేను బోధి వృక్షం క్రింద సాధించిన ఏడు అంశాల (Seven fold), సంపదను అతనికి ఇస్తాను. అధిభౌతిక వారసత్వానికి అతనిని అధిపతిని చేస్తాను. గౌరవనీయ సారిపుత్తను పిలిచి, చిన్న రాహులునికి దీక్ష నివ్వమని చెప్పాడు.

అప్పటికి రాహులుని వయస్సు ఏడు సంవత్సరాలే. అతనిని సంఘంలో చేర్చు కొన్నారు.

అనుకోని రాహులుని దీక్షా సంఘటనకు రాజు శుద్ధోదనుడు ఎంతగానో చింతించాడు. అతడు బుద్ధుని దగ్గరకు వచ్చి, తలిదండ్రుల అనుమతి లేకుండా ఎవరికీ దీక్ష ఇవ్వ వద్దని

చెబుతూ, ''మీరు పరిత్యాగం చేసి నప్పుడు నేను ఎంతో పరితాపం చెందాను. అలాగే నందుడు పరిత్యాగం చేసిన ప్పుడు. మరీ ఇప్పుడు రాహులుస విషయంలో కుమారుని యెడ తండ్రి ప్రేమ, చర్మం, మాంసం, స్నాయువులు, ఎముకలు మజ్జలోకి చొచ్చుకు పోతుంది. దేవా మా అభ్యర్ధనను మన్నించండి. తలిదండ్రుల అనుమతి లేకుండ దీక్షనివ్వకండి[11]'' అని అర్ధించాడు.

బుద్ధుడు వెంటనే అభ్యర్థనను మన్నించి, దానిని వినయ నియమంగా చేశాడు.

ఏడేళ్ళ కుర్రవాడు పవిత్రజీవితాన్ని ఎలా సాగిస్తాడనేది అనూహ్యం.సమణెర (కొత్తగా చేరిన వాడు) రాహులుడు. సంస్కారి, అత్యంత వినయ విధేయతలు క్రమశిక్షణ కలిగిన వాడు గనుక, పెద్ద వాళ్ళ నుంచి ఉపదేశం స్వీకరించ డానికి ఉవ్విళ్ళూరాడు. అతడు వేకువనే లేస్తాడు. ఒక గుప్పెడు ఇసుక తీసుకొని దానిని పైకి విసురుతాడు. ''ఈ రోజు నేను నా ఉపదేశకుల నుంచి, ఆ ఇసుకలో ఎన్ని రేణువు లున్నాయో అంత ఉపదేశాన్ని గ్రహిస్తాను!'' అనే వాడు.

అతనికి దీక్ష ఇచ్చిన వెంటనే, ఇచ్చిన తొలి ఉపదేశాలలో ఒకటి ''అంబలఠ్ఠిక రాహులో వాద''[12] ఇందులో సత్య సంధత నొక్కి చెప్ప బడింది.

ఒకరోజు గౌరవనీయ రాహులుని చూడడానికి బుద్ధుడు వచ్చాడు. ఆయన్ను దూరం నుంచే చూసి రాహులుడు, ఆయన కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళు తెచ్చి ఉంచాడు. బుద్ధుడు కాళ్ళు కడుక్కొని, పాత్రలో అడుగున కొంచెంనీరు ఉంచి ఇలా అన్నాడు: ''రాహులా, ఈ పాత్రలో మిగిల్చిన కొంచెం నీటిని చూశావా?''.

''చూశాను దేవా!''

''ఈ నీళ్ళు లెక్కలోకి రావు. అలాగే బాహాటంగా అబద్ధాలు చెప్పడానికి సిగ్గుపడని వారి సమణత్వమూ (Monkhood) ను.'' అప్పుడు బుద్ధుడు ఆ కొంచెం నీటిని పారబోశాడు, అప్పుడు ఇలాఅన్నాడు:

''బాహాటంగా అబద్ధాలు చెప్పడానికి సిగ్గుపడని వారు వారి సమణత్వాన్ని వదిలి వేసినట్లే.''

అప్పుడు బుద్ధుడు పాత్రను బోర్లించి ''బాహాటంగా అబద్ధాలు చెప్పడానికి సిగ్గుపడని వారి సమణత్వం ఇలా బోర్ల పడ్డట్టే'' అన్నాడు బుద్ధుడు.

చివరకు బుద్ధుడుపాత్రను సరిగా ఉంచి అన్నాడు: ''బహాటంగా అబద్ధాలు చెప్పడానికి సిగ్గు పడనివారి సమణత్వం ఖాళీ, శూన్యం. బాహాటంగా అబద్ధాలు చెప్పడానికి సిగ్గుపడని వానికి ఎటువంటి ఎగ్గునైన చేయువచ్చని నేను చెబుతాను రాహులా. ఆ విధంగా నడుచుకో, ఆ విధంగా నడవడిక సాగించు : 'ఆట పట్టించడానికి గూడ నేను అబద్ధం చెప్పను.'

అందరికీ అర్థమయ్యే అటువంటి ఉదాహరణలతో సత్యసంధతను నొక్కి చెబుతూ, బుద్ధుడు అతనికి పర్యాలోచన (refelction) విలువను, నీతి కొలతలను, చిన్న పిల్లవాడికి గూడ అర్థమయ్యే రీతిలో, వివరించి చెప్పాడు.

''రాహులా, అద్దం ఎందుకు?'' బుద్ధుడు ప్రశ్నించాడు.

''ప్రతిబింబం చూసుకోవడం కోసం దేవా''

''అలాగే రాహులా బాగా ఆలోచించిన (పర్యాలోచన) తర్వాతే ప్రతిబింబం చూసు కొన్న తరవాతే ఏపని అయిన చెయ్యి. బాగా ఆలోచించిన (పర్యాలోచన) తరవాతే ఏ మాటైనా మాటాడు. మానసిక క్రియ గూడ పర్యాలోచన తరవాతే.

''నీవు శరీరంతో ఏ పని చేయాలన్నా ఆశారీరక క్రియ గురించి పర్యాలోచించు: 'నేను ఇప్పుడు నా శరీరంతో ఈ పని చేయా లనుకొంటున్నాను. నేను చేసే ఈ శారీరక క్రియ నాకు హాని కలిగిస్తుందా? లేక ఇతరులకు హాని కలిగిస్తుందా? లేక నాకు, ఇతరులకు - ఇద్దరికీ హాని కలిగిస్తుందా?' కలిగించేదైతే ఆశారీరక క్రియ అకుశలమైంది. దాని వల్ల దుఃఖం, బాధలు సంభవిస్తాయి.

'నేను ఇప్పుడు చేయాలను కొంటున్న శారీరక క్రియ నాకు ఇతరులకు - ఇద్దరికీ హాని కలిగించేది అని', నీవు నీపర్యాలోచన మీదట గ్రహించినట్లయితే, అది దుఃఖాన్ని బాధను అవశ్యం కలిగిస్తుంది కనుక, ఆకుశల శారీరక క్రియ. శరీరంతో అటువంటి పనిని నీవు ఎప్పుడు ఏ పరిస్థితులలోను చేయ రాదు''.

'నేను ఇప్పుడు చేయా లనుకొంటున్న శారీరక క్రియ నాకు గాని ఇతరులకు గాని ఎటువంటి హాని కలిగించదు', అని నీవు నీ పర్యాలోచన మీదట గుర్తించి నట్లయితే, అది కుశల శారీరక క్రియ అవుతుంది. దాని వల్ల సుఖ సంతోషాలు వస్తాయి. అటువంటి శారీరక క్రియ నీవు చేయ వలసింది.''

ఒక పని చేయడానికి ముందూ వెనకా గూడ పర్యాలోచన జరపాలని సామణెర రాహులుని హెచ్చరిస్తూ బుద్ధుడు అన్నాడు :

''నీవు ఒక పనిని శరీరంతో చేస్తున్నప్పుడు, ఆ పనిని గురించి పర్యాలోచించాలి: 'ఇప్పుడు నేను నా శరీరంతో చేయ బోయే పని నాకు చెడు కలిగిస్తుందా? ఇతరులకు చెడు చేస్తుందా? లేక ఇద్దరికీనా?' చెడు చేస్తే దాని వల్ల దుఃఖం, బాధ కలుగుతాయి.''

''నేను ఇప్పుడు నా శరీరంతో చేయాలను కొంటున్న ఈ పని నాకు హాని కలిగిస్తుంది. ఇతరులకు హాని కలిగిస్తుంది. ఇద్దరికి హాని కలిగిస్తుంది.' అని పర్యాలోచన మీదట తేలినట్లయితే బాధా దుఃఖాలను కలిగించే అటువంటి శారీర క్రియ అకుశల మవుతుంది. అటువంటి శారీరక క్రియకు నీవు దూరంగా ఉండాలి.

'నేను ఇప్పుడు నా శారీరంతో చేయ బోయే పని నాకు గాని, ఇతరులకు గాని, లేక ఇద్దరకు గాని హాని చేయదని', పర్యాలోచన మీద తేలినట్లయితే, అటువంటి సుఖసంతోషాలను కలిగించే శారీరక క్రియ కుశలమే అవుతుంది. అటువంటి శారీరక క్రియను మరల మరల చెయ్యి.''

బుద్ధుడు ఇంకా చెబుతున్నాడు: 'ఇప్పుడు నే చేస్తున్న ఈ పని అకుశలం,' అని నీ పర్యాలోచనలో తేలినట్లయితే, అటువంటి పనిని నివేదించాలి (confess), బహిరంగ పరచాలి. గురువు గారికి లేదా విజ్ఞులకు లేదా పవిత్ర జీవనంలో పాలు పంచు కొంటున్న సహోదరులకు వ్యక్తం చేయాలి. ఇలా చెప్పి, ఇక భవిష్యత్తులో మళ్ళీ అది పునరావృతం కాకుండా చూసు కోవాలి.''

ఇదేవిధంగా మనోవాక్కర్మలకు సంబంధించి హెచ్చరించాడు.

పరిశుద్ధం కావడానికి నిరతపర్యాలోచన ఆవశ్యకమని చెబుతూ బుద్ధుడు తన ఉపన్యాసాన్ని ఇలా ముగించాడు :

''నీవు ఆ విధంగా అభ్యాసం చెయ్యి - నిరత పర్యాలోచనతో మనోవాక్కాయ కర్మలను పరిశుద్ధం గావించుకోవచ్చు.''

సంయుత్త నికాయంలో ఒక ప్రత్యేక ప్రకరణం ఉంది దానిలో బుద్ధుడు సామణేర రాహులునికి ప్రకృతి [13] అనిత్యాన్ని వివరించాడు.

బాల్యంలోనే రాహులుడు సంఘంలో చేరాడు. ఆ తరవాత బుద్ధుడు దొరికిన ప్రతి అవకాన్ని అతనికి సలహా లిచ్చి, మార్గ నిర్దేశం చేయ డానికి ఉపయోగించు కొన్నాడు. ఈ దిగువ పద్యాలతో బుద్ధుడు పదే పదే రాహులుని హెచ్చరించినట్లు సుత్తని పాత[14] చెబుతున్నది:

''అంత మధురమైన, మనోజ్ఞమైన ఐదు విధాల ఇంద్రియ సుఖాలను వదిలి వెయ్యి. విశ్వాసంతో, ఇల్లువదిలి వచ్చాక, దుఃఖాన్ని జయించిన వాడివి కా.

''దూరంగా, ఏకాంతంగా, ప్రశాంతమైన చోట నివాసం ఏర్పరుచుకో. సాదా అహారం తీసుకో.

''దుస్తులతో, భిక్షతో, ఇతర అవసర వస్తువులతో, నివాస గృహంతో, దేనితోను బంధం పెంచుకోకు.

''ప్రాథమిక నియమావళికి (Fundamental code) పంచేంద్రియాలకు సంబంధించి నిగ్రహాన్ని అలవరచుకో.

''శరీరానికి సంబంధించి ప్రమత్తతను అలవరచుకో. మోహం నుంచి బయటపడు.

''లాలసను కలిగించే, ప్రలోభ పెట్టే వస్తువుల (ఇంద్రియ సంబంధ) కు దూరంగా ఉండు.

''జుగుప్స యెడ ఏకాగ్రత సువ్యవస్థిత మనస్సును వికసింప జేసుకో. బాహ్యార్థాన్ని గురించి ఆలోచించకు. ప్రచ్ఛన్న గర్వాన్ని త్యజించు. ఈ విధంగా గర్వాన్ని పరిహరించడం ద్వారా నీవు పరిపూర్ణశాంతిని పొందుతావు.''

అతని పద్దెనిమిదోయేట, రాహులుడు తనలోతాను. తన అందమైన రూపాన్ని చూసుకొని, మురిసి పోయాడు. ఈ ఐంద్రియక వాంఛను పురస్కరించు కొని బుద్ధుడు అతనికి మనస్సంస్కృతిని గురించి గట్టి పాఠం చెప్పాడు. ఒకరోజు బుద్ధుడు రాహులుడు భిక్షకు వెళ్తున్నారు. ఆ జంటను చూసిన వారికి ఎవరికైన, వారు ఒక మంగళ కరమైన రాయంచ-సుందర హంస శావకా (బాలహంస) లా, సింహరాజము-రాజకిశోరాలా అని అనిపిస్తుంది. ఇద్దరూ యోద్ధ జాతికి చెందిన వారే, ఇద్దరూ సింహాసనాన్ని త్యజించిన వారే. రాహులుడు తన గురువును మెచ్చుకొంటూ ఇలా అనుకొన్నాడు: ''నేను గూడ ఉన్నతుడైన నా తండ్రిలా చాల అందంగా ఉన్నాను. బుద్ధుని ఆకృతి అందం. నాదీ అంతే.''[15]

బుద్ధుడు వెంటనే అతని దుష్టాలోచనను పసికట్టి, వెనుదిరిగి, అతనిని ఉద్దేశించి ఇలా అన్నాడు:

''రూపం ఎటువంటిదైనా, దానిని ఇలా చూడాలి'' :

'ఇది నాది కాదు (న' ఇతమ్ మమ); నేను ఇది కాదు (న' ఇసొ అహమ్ అస్మి), ఇదినా ఆత్మకాదు (న మి సొ అత్త)''[16]

రాహులుడు వినమ్రతతో, 'అలా చూడ వలసింది రూపం ఒక్క దానినే నా, ఇంకేమైన ఉన్నాయా?' అని ఆయన్ను అడిగాడు.

పంచ స్కంధాల (ఖంధాలు)ను గూడ అలాగే చూడాలని బుద్ధుడు చెప్పాడు.

గౌరవనీయ రాహులుడు ఈ విధంగా ప్రాప్తజ్ఞానుడై, భిక్షకు గ్రామంలోకి వెళ్ళ కూడ దనుకొని, వెను దిరిగి, ఒక చెట్టు క్రింద వ్యస్త పాదుడై, వెన్నెముక నిలువుగ, సతీ (Mindfulness) సాగించ కూర్చొన్నాడు.

గౌరవనీయ సారిపుత్రుడు, రాహుల సామణెర 'ఆసనం' (Posture) చూసి, దానిని ఒక విధంగా అర్థం చేసుకొని, "అలా కాదు, శ్వాస మీద కేంద్రీ కరించు" అని సలహా ఇచ్చాడు. బుద్ధుని సూచనల మేర అతడు వేరే వస్తువును ధ్యాన కేంద్రంగా చేసుకొన్నాడనే విషయం తెలియ కుండానే.

గౌరవనీయ రాహులుడు రెండు రకాల సూచనలలో, ఏది అనుసరించాలో తెలియక ఆకలీకృతు డయ్యాడు. బుద్ధుడు సూచించిన ధ్యాన వస్తువు వేరు. సారి పుత్రుడు సూచించిన ధ్యాన వస్తువు వేరు. గురువు చెప్పిన దాని మీద – అంటే శ్వాస మీద – కేంద్రీ కరించాడు. ఆతరవాత బుద్ధుని దగ్గరకు వెళ్ళి ఆయన చెప్పిన ధ్యాన పద్ధతిని వివరించమని కోరాడు. రోగి వాంఛలకు అనుకూలంగా కాక, రోగికి అవసరమైన మందు నిచ్చే తెలివైన వైద్యుని వలె, బుద్ధుడు మొదట క్లుప్తంగా 'రూప' ధ్యానాన్ని (Meditation on form) ఇంకా ఇతర స్కంధాల ధ్యానాన్ని వివరించి, ఆ తరవాత అనేక ధ్యాన వస్తువులను – వీటిలో ప్రతి ఒక్కటి తాత్కాలికంగా తొలగించిన విశిష్ట దుష్ట పరిస్థితులతో – కధనం చేసి, ఆ తరవాత 'ఆనాపాన సతీ' (శ్వాస మీది ధ్యానం)ని వివరించాడు.

బుద్ధుని ఉపదేశాను సారం ధ్యానంలో ఆరితేరాడు రాహులుడు. అనతి కాలంలోనే, 'చూల రాహులో వాద సుత్త'ని అర్హతత్వాన్ని పొందాడు.

బుద్ధుడు జ్ఞానోదయం పొందిన పదునాలుగవ యేట సామణెర రాహులుడు ఉన్నత దీక్షను స్వీకరించాడు.

అతడు బుద్ధుని కంటేనూ, గౌరవనీయ సారి పుత్రుని కంటెనూ ముందుగానే మరణించాడు.

గౌరవనీయ రాహులుడు క్రమ శిక్షణలో ఉన్నత ప్రమాణాలు సాధించి విశిష్టు డయ్యాడు. థేరగాథాలో ఈ దిగువ పద్యాలు అతనివిగా చెప్పబడుతున్నాయి:

''రెండు ప్రక్కల అదృష్టవంతుణ్ణే కావడంతో, అందరూ నన్ను 'అదృష్టం వరించిన రాహులుడు,' అంటారు.

''బుద్ధుడు, సత్యసందర్శికి'' పుత్రుడను.

నాలోని మాలిన్యాలు అన్నీ నాశన మయ్యాయి. మరిక నాకు జన్మలేదు.

కానుక లందుకో దగిన అర్హతుడను.

''త్రిపుటి జ్ఞానం నాకుంది. మరణ రహితత్వదృష్టను నేను. ఇంద్రియ వాంఛా బంధితుడనై, వల చిక్కి, తృష్ణ ప్రావారంతో (cloak) పరివృతుడనై, లక్ష్యరహిత రక్త బంధువులతో పరివేష్టితుడనై, నేను ఒక వల (ముఖం) లో చిక్కుకొన్న చేపలాంటి వాణ్ణే (ఒకప్పుడు).

''ఆ ఇంద్రియ వాంఛలను కాల్చి వేశాను. మారుని జాలాన్ని (వల) ఛేదించాను. తృష్ణను సమూలంగా పెకలించి'' వేశాను. ఇప్పుడు నేను ప్రశాంతంగా ఉన్నాను[18].

**పాదసూచికలు :**

1. యమక పాతి హారియ. దీనిని తరచు 'ద్వంద్వాద్భుతం'గా అనువదిస్తారు. ఇదొక మానసిక దృగ్విషయం. దీనిని బుద్ధులు మాత్రమే చేయ గలరు. అతని మానసిక శక్తులతో ఏక కాలంమందే శరీరం నుంచి నిప్పు, నీరు తెప్పించ గలడు. నిప్పు, నీరు అంటె ఎరుపు, బులుగు కిరణాలని *'పతి సంభిదామగ్గ'* వ్యాఖ్యానం చెబుతున్నది.

2. పసిబిడ్డ రాకుమారుడు అసితుని గౌరవించాలని, అతని దగ్గరకు తీసుకు వెళ్ళినప్పుడు ఆ బిడ్డ కాళ్ళు అతని తలపై ఉంచాడు. అప్పుడు రాజు దీనిని చూసి నమస్కరించాడు. రాజు అతనికి చేసిన మొదటి నమస్కారం ఇది. ఏరువాక పండుగ సమయంలో చెట్టు క్రింద వ్యస్తపాదుడై ధ్యాన మగ్నుడై ఉన్నప్పుడు రెండో సారి రాజు అతనికి నమస్కారం చేశాడు.

3. *జాతక,* VI : 547, P. 479 చూడండి. *ధమ్మపద్ధ కథా,* 111, PP. 163 - 164. జాతక వ్యాఖ్యానంలో కెల్ల సుదీర్ఘమైన, ఆసక్తి కరమైన కథ అతని అసదృశ ఔదార్యాన్ని విశదీకరిస్తుంది.

4. *ధమ్మపద,* V. 168.

5. *Ibid,* V. 169

6. *జాతక,* No. 447

7. *జాతక అనువాదం,* IV, 485, P. 179.

8. అంగుత్తర నికాయ వ్యాఖ్య ఇలా అంటున్నది : ఒక బుద్ధుని నలుగురు శిష్యులకు మాత్రమే మహా అసాధారణ శక్తు లున్నాయి. మిగతా వారు 100,000 కల్పాల జ్ఞాపకం చేసుకో గలరు.

అంతకు మించి పో లేరు; కాని మహా అసాధారణ శక్తులు సాధించిన వారు అసంఖ్యాక కల్పాలను గుర్తు చేసుకో గలరు. మన గురువుగారి సంఘంలో ఇద్దరు మహాశిష్యులకు, ధీరబక్కులకు, బద్ద కచ్చానలకు - ఈ నలుగురికే ఈ శక్తి ఉంది.'' *Gradual Sayings,* I.P. 22.

9. P. 584 - 590 బోధి సత్వుడు, బుద్ధదీపంకరుని కలిసి బుద్ధుడు కావాలని నిర్ణయించు కొన్నప్పుడు అతనితో తనకున్న సంబంధాన్ని ఆమె ఇక్కడ చెబుతుంది.

10. శబ్దార్థపరంగా బంధితం లేదా గ్రహణం 'ల'=బంధితం రాహు =శృంఖలం చేత.

11. బుద్ధగాథలు చూడండి, I.P 219

12. మజ్ఝిమనికాయ, 11,11; *The Blessing* చూడండి, P- 173.

13. *సంయుత్తనికాయ,* 11, 18, P P. 244 - 253 *Kindered Sayings* 11, PP. 164 - 168.

14. *సుత్తనిపాత,* 2, 11, *రాహులసుత్త,* Charmers - Buddha's Teachings, P - 81.

15. మజ్ఝిమనికాయ, 11, 12; Blessing, P. 182 చూడండి.

16. అనత్తలక్ఖణ సుత్త ఈ గ్రంథంలో 6వ ప్రకరణం చూడండి.

17. మజ్ఝిమనికాయ, 111, 47.

18. IV. 297, 298, Psalms of the Brethern, P. 183.

తొమ్మిదో ప్రకరణం

# బుద్ధుడు - అతని బంధువులు (తరువాయి భాగం)

''నమ్మకస్తులు బంధువులలో కెల్ల మంచివారు''

- ధమ్మపద, V. 204.

**బుద్ధుడు - అతని సవతి (మారు) తమ్ముడు నందుడు**[1]

బుద్ధుడు కపిలవస్తు వచ్చిన మూడో రోజున రాణి మహా పజాపతీ గౌతమీ పుత్రుడు, రాకుమారుడు నందుడు సంస్కార వేడుక, వివాహ వేడుక, గృహ ప్రవేశ మహోత్సవం (House warming cermony) జరుపు కొంటున్నాడు. ఈ మూడు సందర్భాలలో రాకుమారునికి శుభాకాంక్షలు అందరూ తెలియ జేస్తు న్నప్పుడు, బుద్ధుడు రాజ ప్రాసాదానికి విచ్చేశాడు. భోజనానంతరం బుద్ధుడు తన భిక్షా పాత్రను రాకుమారుని కిచ్చి, దీవించి, భిక్షాపాత్రను తీసుకో కుండానే వెళ్ళి పోవ డానికి లేచాడు.

బుద్ధుడు ఏక్షణంలోనైనా తన వద్ద నుండి భిక్షా పాత్రను తీసు కొంటాడని అనుకొంటూ, అతడు బుద్ధుని అనుసరించాడు. కాని బుద్ధుడు తీసుకో లేదు. రాకుమారుడేమో అతని మీద గౌరవం కొలది అతనిని అనుసరించి వెళ్తూనే ఉన్నాడు.

రాకుమారుడు నందునితో జనపద కల్యాణికి ప్రధానం జరిగింది. అతడు చేతిలో భిక్షా పాత్రతో బుద్ధుని వెంట వెళ్తున్నాడని విన్న ఆమె, చెక్కిళ్ళ వెంట కన్నీరు జాలు వారగా, సగం దువ్విన జుట్టుతో, పరుగెత్త గలిగినంత వేగంగా పరుగెత్తి, రాకుమారుడు నందుని సమీపించి, ఇలా అంది: ''వెంటనే తిరిగిరండి ఆర్యపుత్రా!'' ఈ వాత్సల్యంతో గూడిన ఆహ్వానంతో అతడు చలించి పోయాడు. కాని బుద్ధు డంటే ఉన్న గౌరవంతో అతనికి భిక్షా పాత్రను తిరిగి ఇవ్వ లేక పోతున్నాడు. అందుకని బుద్ధుని, తాత్కాలిక నివాసమైన వనం వరకు, అనుసరించి వెళ్ళాడు. అక్కడకు వెళ్ళిన తరవాత, నందుని బుద్ధుడు అడిగాడు: ''నీవు సన్యాసం స్వీకరిస్తావా?'' బుద్ధుడిగా, అగ్రజునిగా అతడంటే ఎంతో గౌరవం. ఆ గౌరవంతో అయిష్టంగానే సంఘంలో చేర డానికి అంగీకరించాడు.

నంద భిక్కు, పరిత్యాగం వల్ల, ఏమాత్రం ధార్మికానందాన్ని పొంద లేక పోయాడు. కుంగి పోయాడు. ఎప్పుడూ తన వధువును గురించే ఆలోచిస్తూ ఉన్నాడు. ''సోదరులారా,

నేను అసంతృప్తుడను. నేను ఇప్పుడు ధర్మ జీవితం సాగిస్తున్నాను. కాని ఈ జీవితాన్ని ఇక ఏమాత్రం కొన సాగించ లేను. నేను ఇక ఉన్నత ఉపదేశాలను వదిలి వేసి, అధో జీవితానికి అంటే ఉపాసక జీవితానికి మరలి పోతాను,'' అని మానసిక బాధనంతా ఇతర భిక్కులతో వెళ్ళ బోసు కొన్నాడు.

ఇది తెలిసిన బుద్ధుడు, ''అటు వంటి వార్త నిజమేనా?'' అని గౌరవనీయ నందుని అడిగాడు. అతడు తన బలహీనతను అంగీకరించి, తాను తన వధువు గురించి వ్యాకులత చెందుతున్నానని చెప్పాడు.

బుద్ధుడు అతనిని సరైన మార్గంలో పెట్టడానికి ఒక ఉపాయం కను కొన్నాడు. అతనికి దేవ కన్యలను చూపించాలనే ఉద్దేశంతో, తన మానసిక శక్తులను ప్రయోగించి, అతనిని తావతింస స్వర్గానికి తీసుకు వెళ్ళాడు. మార్గమధ్యంలో పైపైన కాలి పోయిన ఒక ఆడుకోతిని అతనికి చూపించాడు. ఒక కాలిపోయిన పొలంలో, ఒక సగం కాలిన గుంజ పట్టు కొని చెవులు, ముక్కు, తోక మాడి పోయిన ఈ కోతి వేళ్ళాడు తోంది. స్వర్గం చేరిన తరవాత, దేవ కన్యలను చూపించి బుద్ధుడు అతనిని అడిగాడు: ''నందా, చూడడానికి ఎవరు అందంగా, మనోజ్ఞంగా ఉన్నారు- దేవకన్యలా? లేక నీ భార్య జనపద కళ్యాణియా?''

''గౌరవనీయమైన ఆర్యా, జనపదకళ్యాణి, ఈ దేవకన్యలతో పోలిస్తే కాలిన కోతిలా ఉంది. వీరు ఎన్నోరెట్లు అందంగా ఉన్నారు.''

''హుషారుగా ఉండు నందా, నేను చెప్పినట్లు నీవు పట్టు విడవ కుండా చేస్తే, వారిని నీ పాలు చేస్తాను''.

''అలా అయితే నేను మహాసంతోషంతో పవిత్ర జీవితాన్ని (సన్యాసి జీవితాన్ని) గడుపు తాను,'' అన్నాడు గౌరవనీయ నందుడు చిన్న పిల్ల వాడిలా.

దేవకన్యలను పొందాలనే ఉద్దేశంతోనే నందుడు పవిత్ర జీవితం గడుపుతా నంటున్నాడని విన్న భిక్కులు, అతనిని ''అమ్ముడు పోయిన వాడు'' (Hireling) అని ఎగతాళి చేశారు. చివరకు, తన మనస్సులోని నీచ ఉద్దేశానికి సిగ్గుపడ్డాడు. అంతట దక్షతతో శ్రమించి అర్హతత్వాన్ని పొందాడు.

ఆ తరువాత బుద్ధుని సమీపించి, ''గౌరవనీయా, మీరు చెప్పినట్లు చేస్తే మీరు దేవ కన్యలను నా పాలు చేస్తామని వాగ్దానం చేశారు. కాని నేను మిమ్మల్ని ఇప్పుడు ఆ వాగ్దానం నుంచి విముక్తుణ్ణి చేస్తున్నాను.'' అని నందుడు అన్నాడు.

బుద్ధుడు సమాధానం చెప్పాడు: నందా, నీవు ఈ ప్రాపంచిక విషయాలు పట్టుకు వెళ్ళాడడం ఎప్పుడైతే మానివేశావో, నీ హృదయం మాలిన్యాల నుంచి విముక్తమైంది. అప్పుడే నేనూ నా వాగ్దానం నుంచి విముక్త మయ్యాను.''

అప్పుడతడు హర్షధ్వానం చేశాడు :

''ఎవడు బుర్దను దాటి, లాలస కంటకా (ముల్లు)న్ని తొక్కి వేశాడో;

'' ఎవడు మోహాన్ని నాశం గావించాడో, సుఖంలోను, బాధలోను అతడు చలించడు''.

అతడు అర్హతత్వాన్ని సాధించిన విషయాన్ని కొంతమంది భిక్కులు శంకించగా, బుద్ధుడు దానికి సమాధానంగా ఈ పద్యాలను ఉచ్చరించాడు:

''సరిగా కప్పని ఇంట్లోకి వాన చొచ్చుకు పోయి నట్లుగానే, వికసించని మనస్సులోకి మోహం చొచ్చుకు పోతుంది.''

''బాగా కప్పిన ఇంట్లోకి వర్షం ఎలా ప్రవేశించ లేదో, బాగా వికసించిన మనస్సులోకి మోహం అలాగే, ప్రవేశించలేదు''[2]

విముక్తానందాన్ని అనుభవిస్తూ, అతడు గురువును ఇలా కీర్తించాడు: ''గురువుల విధానం బహు విశిష్టమైంది. దాని మూలానే నేను పునర్జన్మ అనే బురద నుంచి పెకలించబడి, నిర్వాణతీరంలో ప్రతిష్ఠితుడనయ్యాను!''

అతనికే ఆపాదించబడిన ఈ దిగువ పద్యాలను తథాగతుడు కలిపాడు:

''సరిగా పర్యాలోచించని కారణాన నేను పై మెరుగులకు ఆకర్షితుడ నయ్యాను. రాగ రంజిత ప్రేమలో తల మునకలై నేను వ్యగ్ర, చపల చిత్తుడ నయ్యాను. బుద్ధుడు 'స్వయం ప్రకాశితుడు' అతి నిపుణతతో కనిపెట్టిన విధానాన్ని, నేను సరిగ ఆచరించి, అస్తిత్వంనుంచి నా మనస్సును వెలుపలికి లాగాను''[3].

గౌరవనీయ నంద థేరను ఆత్మనిగ్రహ విషయంలో భిక్షుకులందరిలోకి ముఖ్యునిగా పరిగణిస్తారు.

**బుద్ధుడు - ఆనందుడు.**

రాకుమారుడు సిద్ధార్థుని దాయాది సోదరుడు ఆనందుడు. రాజు శుద్ధోదనుని తమ్ముడు అమితౌదనుని పుత్రుడు. ఇతడు పుట్టడంతోనే బంధు వర్గాని కంతా ఆనందాన్ని తెచ్చిపెట్టాడు గనుక ఆనందుడని పేరు పెట్టారు.

బుద్ధుని ధమ్మసేవ మొదలైన రెండో సంవత్సరంలో, ఆనందుడు ఇతర శాక్య రాకుమారుల – అనురుద్ధ, భద్దియ, భగు, కింబిల, దేవదత్తుల – తోపాటు సంఘంలో చేరాడు. ఆ తరవాత, అనతి కాలంలోనే గౌరవనీయ పున్న మంతానిపుత్త చేసిన ధర్మోపన్యాసం విని, అతడు సన్యాసత్వంలో ప్రథమ దశను చేరుకొన్నాడు.

బుద్ధుడు ఏబై ఐదో పడిలో పడ్డప్పుడు ఆనందుడు అతని ముఖ్య అనుచరు డయ్యాడు. ఉన్న కొద్ది మంది అనుచరులు-వారివిధులు వారు సరిగా నిర్వర్తించటం లేదు. అదీ కాక వారి నడత పొగడ దగింది గానూ లేదు. ఒకరోజు జెత వనంలో ఉండగా బుద్ధుడు ఇలా చెప్పాడు: ''నేను ఇప్పుడు వృద్ధుడ నయ్యాను. మనం ఈ దారిన పోదాం అని నేను చెప్పి నప్పుడు, కొందరు వేరే దారిలో పోతున్నారు. కొందరు నా భిక్షాపాత్రను, చేలాంచలాన్ని నేలమీదకు జార విడుస్తూన్నారు. ఎప్పుడూ నా వెంటే ఉండి నాకు పరిచర్యలు చేయ డానికి ఒక శిష్యుని ఎంచండి[4]''.

వెంటనే భిక్షులందరు – గౌరవనీయ సారిపుత్రుడు మొదలుకొని క్రింది వారి వరకు ప్రతి ఒక్కరు – తమ సేవ లందించ డానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు. కాని బుద్ధుడు వారు సద్బుద్ధితో ముందుకు వచ్చినా, వారి నెవరినీ అంగీకరించ లేదు. ఆనందుడు అంత వరకు మౌనంగా ఉన్నాడు. అప్పుడు భిక్కులు ఆయన్ను సేవలు అందిస్తానని ముందుకు వెళ్ళుమని సలహా ఇచ్చారు.

ఈ దిగువ తెలిపిన ఎనిమిది వరాలు బుద్ధుడు ఇస్తేనే, తాను ఒప్పుకొంటానని ఆనందుడు అన్నాడు:

a) బుద్ధుడు తానుగా గ్రహించిన వస్త్రాలను నాకు ఇవ్వ రాదు.

b) బుద్ధుడు తానుగా గ్రహించిన ఆహారాన్ని నాకు ఇవ్వరాదు.

c) బుద్ధుడు తానుండే సుగంధిశాల (గంధకుటీ)లో నన్ను ఉండ నీయ రాదు.

d) బుద్ధుడు తనను ఆహ్వానించిన ప్రతిచోటకు నన్ను అతనితో తీసుకు పో రాదు.

e) బుద్ధుడు నాతో పాటు నన్ను ఆహ్వానించిన ప్రతిచోటుకు రావాలి.

f) బుద్ధుని చూడడానికి దూరం నుంచి వచ్చిన సందర్శకులను పరిచయం చెయ్య డానికి నాకు అనుమతివ్వాలి.

g) బుద్ధుడు, నా కెప్పుడు ఏ సందేహం వచ్చినా, ఆయన్ను చూడ డానికి అనుమ తివ్వాలి.

h) బుద్ధుడు, నేను లేనప్పుడు చేసిన ఉపన్యాసాలన్నీ నాకు తిరిగి వినిపించాలి.

బుద్ధుడు ఈ నాలుగు నకారాత్మక, సకారాత్మక వరాలను ప్రసాదించాడు. ఇహ అక్కడనుంచి గౌరవనీయ ఆనందుడు ఇరవై ఐదు సంవత్సరాల పాటు, బుద్ధుడు తుదిశ్వాస తీసే వరకు, అతని అనుంగు అనుచరుడుగా, సేవకుడుగా పని చేశాడు. ఒక నీడలా, బుద్ధుడు ఎక్కడకు వెళ్ళినా, ప్రేమతో జాగరూకతతో అతని అవసరాలన్నీ తీరుస్తూ, అతనిని అనుసరించాడు. రేబవలు అతని సేవలన్నీ బుద్ధుని కను సన్నల లోనే నడిచాయి. రాత్రిళ్ళు, కర్ర, దివిటీ చేత బట్టుకొని, తొమ్మిదిసార్లు, బుద్ధుని శయన శాల చుట్టూ, తనను మేలు కొలుపు కోవడానికి, బుద్ధుని నిద్రాభంగం కలగ కుండేందుకు తిరిగేవాడని చెబుతారు.

**ఆనంద బోధివృక్షం**[6]

ఆనంద బోధి వృక్షం నాటడానికి గౌరవనీయ ఆనందుడే కారణం. బుద్ధుడు లేని సమయంలో, ధర్మ నిష్ఠ అనుయాయులు, తాము మామూలుగా తెచ్చే పూలను, పూలమాలలను, ఆయన శయన శాల గడప దగ్గర ఉంచి, సంతోషంగా తిరిగి వెళ్ళి పోయే వారు. అనాథపిండిక ఇది తెలుసుకొని, ఆనందుని ఇలా అర్థించాడు: '' ఆనందా, మీరు బుద్ధుణ్ణుంచి తెలుసు కోండి : - ఆయన ప్రచారం కోసం దూరంగా వెళ్ళి నప్పుడు, ఆయన కోసం వచ్చే భక్తులు తమ నమస్కారాలను తెలియజేసుకోవడానికి ఏదైనా ఒకస్థలాన్ని ప్రత్యేకించే అవకాశం ఉందేమో కనుక్కోండి.'' గౌరవనీయ ఆనందుడు బుద్ధుని సమీపించి ఇలా అడిగాడు:

''దేవా! మీకు సంతుష్టిని కలిగించే పూజార్హ వస్తువులు (Objects of reverence) ఎన్ని ఉన్నాయి?''

''మూడు, ఆనందా, ఒకటి శరీరానికి సంబంధించినవి[7]. రెండు వ్యక్తిక ఉపయోగ కరమైన వస్తువులు, మూడు బుద్ధుని స్మరణకు తెచ్చేవి''

''హే దేవా, మీరు జీవించి ఉండగానే చెతియ[8] నిర్మాణం గావించడం సబబేనా?''

''కాదు, బుద్ధుడు బ్రతికుండగా అటువంటిది వీలుకాదు.అతడి మరణానంతరమే అలాంటి నిర్మాణం సబబు. బుద్ధుని సంస్మరణకు తెచ్చే వస్తువులకు భౌతిక ప్రాతిపదిక లేదు. అది కేవలం మానసికం, కాని మహా బోధి వృక్షం బుద్ధుడు సజీవుడై ఉన్నా, నిర్జీవుడై ఉన్నా, అది ఒక పూజార్హ వస్తువే (చెతియ)''

''దేవా, మీరు ధర్మబోధ యాత్రలు చేసే టప్పుడు, జెతవన విహారంలో ఎవరిని శరణువేడాలి? అలాంటప్పుడు అక్కడ పూజార్హ వస్తువేదీ లేదు. అందుకని దేవా మహాబోధి వృక్షం విత్తనం తెచ్చి జెతవన ప్రవేశంలో నాట మంటారా?''

''మంచిది ఆనందా, అలాగే నాటు. అలా అయితే నేను ఎప్పుడూ జెత వనంలో ఉన్నట్లే అవుతుంది''.

గౌరవనీయ ఆనందుడు, ఈ విషయాన్ని బుద్ధుని ఉపాసకానుచరులైన అనాథపిండిక, విసాఖా, రాజు కొసలలకు చెప్పి, మహా బోధివృక్షం పండు నొకదానిని తీసుకురమ్మని గౌరవనీయ మొగ్గల్లానను అర్థించాడు. వెంటనే అతడు అంగీకరించి, ఆ వృక్షం నుంచి రాలుతున్న పండును గ్రహించి ఆనందునికి అందజేశాడు. దీనిని అతడు రాజుకు అందించగా, రాజు అనాధ పిండికకు దానిని అందజేశాడు. అప్పుడతడు సుగంధ భూమిని చదును, పదును చేసి, గుంట తవ్వి, అందులో పాతి పెట్టాడు. అక్కడ మొలిచి పెరిగిన వృక్షం 'ఆనందబోధి''గా ప్రసిద్ధమైంది.

**ఆనందుడు - స్త్రీలు**

స్త్రీలను సంఘంలో అనుమతించే విషయంలో గూడ ఆనందుడే బుద్ధుని ఒప్పించాడు. ఆనందుడే కనుక జోక్యం చేసుకోక పోతే, మహాప్రజాపతి గౌతమీ భిక్కుని గావడానికి కుదిరేదే కాదు. భిక్కునిలు అతనిని అత్యంతంగా గౌరవించేవారు. అతని ఉపన్యాసాలను శ్రద్ధగా వినేవారు.

ఒకసారి బుద్ధుని సమీపించి, ఆనందుడు ఇలా అడిగాడు:

''దేవా, మేము స్త్రీలతో ఎలా వ్యవహరించాల్సి ఉంటుంది?''

''వారిని చూడనట్లే, ఆనందా''

''మేము వారిని చూడటం తటస్థిస్తే, అప్పుడు ఏమి చేయాలి?''

''వారితో మాటాడ వద్దు, ఆనందా''.

''వారే మాతో మాటాడితే మే మేమి చేయాలి దేవా?''

''జాగరూకత వహించండి, ఆనందా?''

ఆడవారితో మాటడే టప్పుడు జాగరూకతతో ఉండేందుకు గాను భిక్కు లందరికి ఈ హెచ్చరిక చేయ బడింది.

అతని జ్ఞాపకశక్తి అద్భుతం. అదీకాక, అతడు బుద్ధుని ఎల్లప్పుడూ అంటిపెట్టుకొనే అవకాశం ఉండడంతో, అతడు బుద్ధుని ఉపన్యాసాలన్నీ విన్నాడు. అందుకని అతనిని ధర్మ సంరక్షకుని చేశారు.

ధర్మానికి సంబంధించి అతనికున్న అవగాహన ఏపాటి అని ఒకసారి ఒక బ్రాహ్మడు తెలుసుకో గోరి అడిగితే, గౌరవనీయ ఆనందుడు ఇలా అన్నాడు:

''నేను బుద్ధుని నుంచి ఎనభై రెండు వేలు, భిక్కులనుంచి రెండు వేల పాఠాలు గ్రహించాను.

మొత్తం ఎనభై నాలుగు వేల పాఠాలున్నాయి.''[10]

బుద్ధుడు అతనిని ఐదు అంశాలలో, శిష్యులందరిలోకి అగ్రగామిగా పరిగణించాడు. ఆ ఐదు అంశాలు: (1) వ్యుత్పన్నత (2) ధారణ స్మృతి, (3) సత్ప్రవర్తన, (4) స్థైర్యం, (5) ఉపచారం చెయ్యడంలు[11] అతడు విశిష్ట శిష్యుడే అయినా, ధమ్మాన్ని ఔపోశన పట్టినా, బుద్ధుడు మరణించే వరకు ''విద్యార్థి''గానే జీవించాడు. బుద్ధుడు అతనికి చేసిన చివరి హెచ్చరిక – 'ఆనందా గతంలో నీవు ఎంతో మంచి చేశావు. మాలిన్యాలనుంచి వెంటనే బయటపడు''[12]

బుద్ధుని మరణం తరవాతనే అతనికి అర్హతత్వం లభించింది. అర్హతులతో మాత్రమే ఏర్పడిన ప్రథమ సంగీతి (First Council) లో, అతడు ప్రముఖ పాత్ర నిర్వహించాల్సి రావడంతో, పట్టుదలతో ప్రయత్నించి, సంగీతికి ముందు రాత్రి, శయ్యా గతుడు కా బోయే సమయంలో, అతడు అర్హతత్వాన్ని పొందాడు[13].

గౌరవనీయ ఆనందుడు నూట ఇరవై సంవత్సరాల వయస్సులో మరణించాడు. ధమ్మపద వ్యాఖ్యానం ఇలా అంటున్నది: 'రోహిణి నది కిరు వైపుల ఉన్న ప్రజలు అతనిని సమంగానే సేవించారు. అందుకని అతని అవశేషాల కోసం ఇరుపక్షాలు పోటీ పడ్డాయి. అప్పుడతడు వ్యస్త పాదుడై, నది మధ్యలో గాలిలో తేలుతూ కూర్చొని, ధమ్మాన్ని జన, బాహుల్యానికి బోధించి, తన దేహం రెండు భాగాలుగా చీలిపోయి, ఒక భాగం ఈ ఒడ్డున, మరోభాగం ఆ ఒడ్డున పడాలని ఇచ్ఛ గించాడు. అప్పుడతడు అగ్ని భూతం వస్తువుగా ఆనంద మయ ధ్యానం (estatic meditation) లోకి ప్రవేశించాడు. వెంటనే అగ్ని జ్వాలలు అతని శరీరం నుంచి వెలువడ్డాయి. అతడు ఇచ్ఛ గించి నట్లే, శరీరంలోని ఒక భాగం నదికి ఈ వైపుకు, రెండో భాగం ఆ వైపుకు పడి పోయాయి.

అతడు అనేక సందర్భాలలో చెప్పిన అనేక పద్యాలను థేరగాథా ఉటంకించింది. ఈ అందమైన క్షణ భంగుర శరీరాన్ని గురించి అతడు చెప్పిన ఈ దిగువ పద్యం చాల ఆసక్తి కరమైంది.

''ఈ అలంకృత దేహాన్ని చూడు. పుండ్లపుట్ట. దుర్బలరాశి.
ఆలోచించే కొలది అక్కడ ఏమీ మిగలదు, ఏమీ ఉండదు''[14]

**బుద్ధుడు - మహాప్రజాపతీ గౌతమీ:**

మహాప్రజాపతీ గౌతమీ రాజు సుప్పబుద్ధని చెల్లెళ్లు అందరిలోకి చిన్నది. ఆమె పెద్దక్క మహామాయా రాణి. ఇద్దరూ రాజు శుద్ధోదనునే పెళ్లి చేసుకొన్నారు. ఆమెకో కూతురు. పేరు నందా. ఒక కొడుకు పేరు నందుడు. తరవాత ఇద్దరూ సంఘంలో చేరారు. మహామాయా చని పోయినప్పుడు, ఆమె కొడుకు సిద్ధార్థుని దత్తుచేసుకొంది, తన కొడుకు నందుని దాదుల కప్పగిస్తూ.

ఆమె కుటుంబ నామం గౌతమీ. ఆమెకు మహాపజాపతీ అని పేరు పెట్టారు. ఎందు కంటె దైవజ్ఞులు, ఆమె చాల పెద్ద సమూహానికి నాయకురా లవుతుందని చెప్పారు.

శుద్ధోదుని మరణానంతరం, సిద్ధార్థుడు, నందుడు - ఇద్దరు పరిత్యాగం చేసి నట్టు గానే, ఆమె సంఘంలో చేరి పవిత్ర జీవితం గడపాలని నిర్ణయించు కొంది. రోహిణి నది నుంచి ప్రవహించే పంట కాలువలకు సంబంధించి, శాక్యులకు, కొలియులకు మధ్య రేగిన తగవును పరిష్కరించ డానికి, బుద్ధుడు కపిలవస్తుకు విచ్చేసి నిగ్రోధ వనంలో ఉంటు న్నప్పుడు, మహా పజాపతీ గౌతమీ అతని దగ్గరకు వెళ్ళి, స్త్రీలను సంఘంలో చేర్చు కోవ డానికి అనుమతిని అర్థిస్తూ, ఈ విధంగా అంది:[15]

''దేవా! ఆడవాళ్ళు సంసార త్యాగంచేసి, తథాగతులు ప్రకటించిన ధమ్మ శిక్షణల క్రింద పరిభ్రమకులుగా ఉండేందుకు అనుమతించడం బాగుంటుంది''.

కారణం ఏమీ చెప్పకుండానే, తిన్నగా ఆమె అభ్యర్థనను తిరస్కరించి, బుద్ధుడు ఇలా అన్నాడు:

''చాలు, ఓ గౌతమీ, ఆడవాళ్ళను ఆ విధంగా అనుమతించడం మీకు మంచిదిగా అనిపించ కుండు గాక''.

రెండోసారి, మూడోసారి మహా పజాపతీ గౌతమీ, అదే అభ్యర్థనను చేసింది. బుద్ధుడు మళ్ళీ మళ్ళీ అదే సమాధానం చెప్పాడు.

తరవాత బుద్ధుడు తన కిష్ట మొచ్చి నంతకాలం కపిలవస్తులో ఉండి, ఆ తరువాత వెసలి (వైశాలి) చేరి, అక్కడ మహా వనంలో కూటాగార కుటీరంలో ఉన్నాడు.

పట్టు వదలని పజాపతీ గౌతమీ, నిరుత్సాహం చెందక, కేశ ముండనం కావించు కొని, పీతవస్త్రాలు ధరించి, అనేక మంది శాక్య మహిళలు వెంటరా, దారిలో అనేక కష్టాల కోర్చి, 150 మైళ్ల దూరంలో వున్న వెసలికి నడిచి చేరు కొంది. వాచిన పాదాలతో మట్టి కొట్టు

కొన్న దేహంతో, ఆమె వెసలి చేరి, గోపురాకృతి కుటీరం వరండాలో నిలబడింది. గౌరవనీయ ఆనందుడు, దుఃఖిస్తున్న ఆమెను చూసి, కారణం తెలుసు కొని, బుద్ధుని చేరి ఇలా చెప్పాడు:

''చూడండి దేవా, మహా పజాపతీ గౌతమీ వాచిన పాదాలతో ధూళిధూసరితమైన దేహంతో, విచార వదనంతో, బయట వరండాలో నిలబడి ఉంది. దయ చేసి ఆడు వారిని సంఘంలో చేర్చు కోండి. ఆడవాళ్ళు వారి కుటుంబాలను వదిలి, పరిభ్రమక స్థితిలోకి వస్తామంటే వారి అనుమతిస్తే బాగుంటుంది.''

'చాలు, ఆనందా చాలు. అలా అనుమతించడం నీకు సంతోషం కా కుండు గాక!'' అని బుద్ధుని సమాధానం.

రెండోసారి, మూడోసారి అతడు వారి తరపున కల్పించుకొన్నాడు. కాని బుద్ధుడు అవకాశ మీయ లేదు.

అందుకని గౌరవనీయ ఆనందుడు, మరో మార్గాన్ని ఎన్ను కొని, గౌరవ పురస్సరంగా, బుద్ధుని ప్రశ్నించాడు:

'' ఆడవాళ్ళు సంసారాన్ని త్యజించి ఉన్నతుడు (బుద్ధుడు) ప్రకటించిన ధమ్మం శిక్షణల క్రింద ప్రరిభ్రమక స్థితిని ఆశ్రయిస్తే, ఓదేవా, సొతాపన్న ( ఏరుదాటినవాడు) సకదాగామి (ఒకసారి మరలివచ్చేవాడు) అనాగామి (ఎప్పుడు మరలి రాని వాడు), అర్హత స్థితులను చేరే సామర్థ్యం వారికి లేదా?''

''వారు అర్హతత్వం పొంద సమర్థులే,'' బుద్ధుని సమాధానం. ఈ సమాధానం తో కొంచెం ప్రోత్సాహితుడై, గౌరవనీయ ఆనందుడు మరల విన్నవించాడు: ''అలాం టప్పుడు వారు ఋషిత్వాన్ని పొంద సమర్థులైతే వారిని చేర్చు కోవడమే మంచిది. అదీగాక మహా పజాపతీ గౌతమీ, మీకు ఎంతో సేవ చేసింది. పిన్నమ్మగా, దాదిగా మీ బాల్యంలో మిమ్మల్ని సాకింది. తన స్తన్యాన్ని మీకి చ్చింది. తథాగతులు ప్రకటించిన ధమ్మం, శిక్షణల క్రింద ఆడు వారు ఇల్లు వాకిలి వదిలి పరిభ్రమక స్థితిలో ఉండడానికి అనుమతిస్తే బాగుంటుంది.

అంతిమంగా ఆనందుడు చేసిన ప్రార్థనలకు లొంగి పోయి, ''మహా పజాపతీ గౌతమీ ముఖ్యమైన ఎనిమిది నియమాలను ఒప్పు కొంటే, అదే ఆమెకు 'దీక్ష' గా పరిగణించ వచ్చు, అని బుద్ధుడు చెప్పాడు.

ఆ ఎనిమిది నియమాలు ఇవి[16] :

1. ''ఒక భిక్కుని ఉపసంపద[17] తీసుకొని నూరేళ్ళు అయినాసరే, భిక్కు ఎదురైనప్పుడు అతనికి నమస్కరించాలి. అతని ముందు లేచి నిల బడాలి. అతనిని గౌరవించాలి.

ఆ రోజే అతడు ఉపసంపద తీసుకొన్నప్పటికీ, అతని యెడ విహితమైన విధులన్నీ భిక్కుని నిర్వర్తించాలి.

2. ఒక భిక్కుని భిక్కుతోడు లేకుండ ఒంటరిగా (వస్సవాసం) ఉండ రాదు.

3. ఒక భిక్కుని పక్షానికోమాటు (ఉపోసథ)[18] సమావేశ సమయాన్ని గురించి, భిక్కు వచ్చి తమను ఎప్పుడు హెచ్చరిక చేస్తాడనే విషయాన్ని గురించి భిక్షుసంఘాన్ని అడిగి తెలుసు కోవాలి.

4. వస్స (వాసం) తరువాతి 'పవారణ'[19] వేడుకను ఒక భిక్కుని ఇతర భిక్కుల భిక్కునిల ముందు, మూడు విధాలలో - చూడడం, వినడం, అనుమానించడం లలో ఏ విధంలో అయినా తప్పు దొర్లిందేమో నని తెలుసు కోవడానికి ఏర్పాటు చేయాలి.

5. ఒక భిక్కుని ఏదైనా పెద్ద నేరం చేసినప్పుడు, భిక్కుల, భిక్కునిల సంఘం సమక్షంలో మానత్త[20] క్రమశిక్షణను తీసుకోవాలి.

6. నూతనంగా చేరిన భిక్కుని, రెండు సంవత్సరాల పాటు ఆరు నియమాలలో శిక్షణ పొందిన తరవాత, భిక్కుని భిక్కుల సంఘాల నుంచి ఉపసంపదను పొందాలి.

7. ఒక భిక్కుని ఎప్పుడూ గూడ ఒక భిక్కును తూల నాడ రాదు, గర్వించ రాదు.

8. ఇక్కడ నుంచి భిక్కునిలు ఎప్పుడు భిక్కులను హెచ్చరించరాదు. కాని భిక్కులు భిక్కునిలను అనుబోధించ వచ్చు.

ఈ నియమాలను జీవితాంతం అర్చించాలి, పూజించాలి, మానించాలి, గౌరవించాలి. ఎప్పుడూ అతిక్రమించరాదు.''

గౌరవనీయ ఆనందుడు ఈ నియమాలను గౌతమీతో చెప్పి నప్పుడు ఆమె మహోదానందంగా, వాటికి కట్టుబడి ఉంటానని అంగీకరించింది. వాటిని అంగీకరించడంతో ఆమెకు ఉపసంపద ఇవ్వబడింది.

ఈ భిక్కునిల సంఘం స్థాపించడంలో ఉన్న సాధక బాధకాలను బుద్ధుడు ముందు గానె ఊహించి ఇలా అన్నాడు: ''ఆనందా, స్త్రీలకు గనుక తథాగతుడు ప్రకటించిన ధమ్మ శిక్షణల క్రింద ఇల్లు, వాకిలి వదిలి పరిభ్రమక జీవితాన్ని గడపడానికి అనుమతి నివ్వక పోయి నట్లయితే పవిత్ర జీవితం, ఉన్నత ధమ్మం వేలకు వేల సంవత్సరాలు కొన సాగేవి. కాని స్త్రీలు ఈ పరిభ్రమక స్థితిని గ్రహించారు గనుక, పవిత్ర జీవితం ఎక్కువ కాలం కొన సాగదు. ధమ్మం ఐదువందల సంవత్సరాల కంటె ఎక్కువ కాలం కొన సాగదు.''[21]

బుద్ధుడు ఇంకా ఇలా అన్నాడు : ''ఆనందా, ఎక్కువ స్త్రీలుండి తక్కువ పురుషులున్న ఇళ్ళు తొందరగా దొంగల దోపిడికి గురవుతాయి. అలాగే, ఏధమ్మం క్రిందైనా ఏ శిక్షణ క్రిందైనా ఆడు వారిని ఇల్లువదిలి పరిభ్రమక స్థితికి రా అనుమతిస్తే, ఆ పవిత్ర జీవితం ఎక్కువ కాలం సాగదు.

''ఒకడు ముందుగానే ఊహించి, నీరు పొర్లి పోకుండా ఒక జలాశయానికి ఎలా కట్ట వేస్తాడో, అలాగే, నేను ముందుగానే ఊహించి వాళ్ళెప్పుడు అతిక్రమించ కుండ ఈ ఎనిమిది నియమాలను తయారు చేశాను''[22]

బుద్ధుడు చెప్పిన ఈ వివరణ స్త్రీ జనానికి రుచించక పోవచ్చు. కాని అతడు మొత్తంగా స్త్రీలను తప్పు పడుతున్నాడని అనుకో రాదు. అతడి వ్యాఖ్య అంతా వారి లైంగిక బలహీనత మీదే.



అనేక కారణాలవల్ల బుద్ధుడు అయిష్టంగానే స్త్రీలను సంఘంలోకి అనుమతించి నప్పటికీ మనం ఒక విషయం గుర్తుంచు కోవాలి: కొన్ని నియమ నిబంధనలతోనైనా ఆడవాళ్ళకు ఒక సంఘాన్నంటూ స్థాపించిన వాడు చరిత్రలోనే మొదటి వాడు బుద్ధుడు. భిక్కుల సంఘానికి ఎలాగైతే ఇద్దరు ముఖ్య శిష్యులను – గౌరవ సారిపుత్ర, మొగ్గల్లానలను– భిక్కు సంఘానికి నియమించాడో, అలాగే భిక్కునీ సంఘానికి గూడ గౌరవ ఖేమా, ఉప్పలవన్నా అనే స్త్రీ శిష్యులను బుద్ధుడు నియమించాడు.



ఒకరోజు భిక్కుని మహాపజాపతీ బుద్ధుని దగ్గరకు వచ్చి, తాను ఒంటరిగానే ప్రయత్నించి, లక్ష్యాన్ని సాధించ డానికి వీలుగ ఉపన్యాసాన్ని చేయ వలసిందని కోరింది.



అప్పుడు బుద్ధుడు ఇలా ఉపదేశం చేశాడు: ''మీకు తెలిసిన ధమ్మం ఏదైనా కావచ్చు. ఒకటి మాత్రం గుర్తుంచుకోండి గౌతమీ: అందులోని విషయాలు వికారాలకే కాని శాంతికి దోహదం చేయని, గర్వానికేగాని, గౌరవానికి సహాయ పడని, ఎక్కువెక్కువ కావాలని కోరడానికే కాని తక్కువ కోరడానికి ఉపకరించని, సమాజంవైపుకే కాని, ఏకాంతానికి దారి తీయని సోమరితనానికే కాని ఉత్సాహానికి నడపని, అసంతృప్తికే కాని, తృప్తికి దారి తీయని ధర్మమేదైనా అది ధర్మమే కాదని తెలుసు కోండి గౌతమీ. అది ధమ్మం కాదు, వినయం కాదు. అది బుద్ధుడు చెప్పింది కాదు.

''బుద్ధుడు చెప్పిన ధర్మం ఏదైనా వికారాలకు కాక శాంతికి, గర్వానికి కాక గౌరవానికి, ఎక్కువ కోరుకోవడానికి కాక తక్కువ కోరుకోవడానికి, సమాజం వైపుకు కాక ఏకాంతానికి, సోమరి తనానికి కాక ఉత్సాహానికి, పరివేదనకు కాక ప్రశాంతికి దోహదం చేస్తుంది – ఇది ధర్మం, వినయం బుద్ధుని బోధ.''[23]

అనతికాలంలోనే ఆమె అర్హతత్వంతోపాటు, పటిసంభిదా[24] (అంతర్బోధిక విశ్లేషణాత్మక జ్ఞానం) పొందింది.

ఆమెతో పాటు దీక్ష పుచ్చుకొన్న శాక్య మహిళలు కూడ అర్హతత్వాన్ని పొందారు.

ఆమె భిక్ఖునిలలో అనుభవంలో, జ్యేష్ఠత్వంలో ఉచ్చస్థానంలో ఉంది.

ఆమె అర్హతత్వం పొందిన తరవాత ఆమె చెప్పిన పద్యాలు చాల థేరగాథా లలో కనిపిస్తాయి.

**పాదసూచికలు :**

1. ఈ గాథ, అశ్వఘోషుడు రాసిన 'సౌందరనందా'నికి విషయ మవుతుంది. సౌందరనందాన్ని E.H. Johnston ఆంగ్లంలోకి అనువదించాడు. Rpt. Delhi, 1975. Ed.
2. ధమ్మపద, Vs. 13 - 14
3. *Psalms of the Bretheren* Vs. 157, 158, P. 127.
4. జాతక. No. 456; జాతక అనువాదం, iv, P - 61.
5. గంధకుటీ, బుద్ధుని శాలకు అనుప్రయుక్తం చేసిన విశేషణం. ముఖ్యంగా అతని కోసం అనాథపిండిక జేతవనంలో నిర్మించిన శాలకు అనుప్రయుక్తం చేస్తారు. (సం.)
6. జాతక, iv, 479, కాలింగబోధి జాతక, P. 228; జాతక అనువాదం vol. iv. p. 142
7. బుద్ధుని శారీరకావశేషాల లాంటివి.
8. స్మారక సమాధి, స్తూపమని గూడ అంటారు. పాళీ పద రూపం. 'థూప' దక్షిణ ఆసియా అంతట ఉన్న బౌద్ధ స్మారక చిహ్న వాస్తుకళ. Ed.
9. అన్నింటి కంటె పురాతన చారిత్రక పవిత్రవృక్షం. నేటికీ దీనిని భారతదేశంలోని సాహెత్ మాహెత్ (సావత్థి) దగ్గర చూడవచ్చు.
10. *Psalms of the Brethern*, P. 354, థేరగాథా, Vs. 1424
11. అంగుత్తరనికాయ, 1, 1, 14, 4, P. 24. *Gradual Sayings* I. P. 19.
12. దీఘనికాయ, 11, 3, మహాపరినిబ్బాణ సుత్త, P. 72.
13. బుద్ధగాథలు, P. 160.
14. *Psalms of the Brethern*, P. 353, థేరగాథ, V. 1020. ధమ్మపద, V. 147
15. వినయ ధమ్మ, 111, P. 320. అంగుత్తరనికాయ, IV, 8, 6, 1, P. 274.

16. ఇందులోని కొన్ని నియమాలు వినయ శిక్షణకు సంబంధించిన7వి కనుక, బౌద్ధంలో ప్రవేశం లేని పాఠకుడికి అర్థం కావు.

17. ఉన్నత దీక్ష.

18. భిక్షువులు ప్రాథమిక నియమాలను వల్లె వేసు కొనే అమావాస్య, పూర్ణిమ దినాలు.

19. వర్షరుతువు అంతం.

20. ఒక రకం క్రమ శిక్షణ చర్య

21. *Gradnal Sayings* IV, P. 184 చూడండి.

22. *Gradnal Sayings* IV. P. 185 చూడండి.

23. వినయధమ్మ, 111, PP 329 - 330 *Gradnal Sayings,* IV. P.P. 186, 187 చూడండి.

24. అత్త, ధమ్మ, నిరుత్తి – వీటికి సంబంధించిన విశ్లేషణాత్మక జ్ఞానం. ఈ మూటికి సంబంధించిన అవగాహన (పటిభాన)

పదో ప్రకరణం

# బుద్ధుని ముఖ్య వ్యతిరేకులు, అనుకూలురు

*"ఒకఘన శిల గాలికి ఎలా చలించదో,*

*అలాగే జ్ఞాని నిందా స్తుతులకు చలించడు."*

– ధమ్మపద, V. 81.

బుద్ధుడు పేద ధనికుల మధ్య, గొప్పవాళ్ళ అల్పుల మధ్య ఎటువంటి తారతమ్యం చూప కుండ మానవాళి క్షేమం కోరి నిష్కామంగా కృషిచేశాడు. అతని అనుచరులలో అనుయాయులలో, సామాజిక నిచ్చెన క్రింది మెట్లకు, పైమెట్లకు చెందిన వారున్నారు. అతడంటే అంతప్రేమ. అంత గాఢగౌరవం. అందుకే, రాజులు కులీనులు, కోటీశ్వరులు, ఎర్రని ఏగాని లేనివారు, పవిత్రులు, వేశ్యలు, ఆడ, మగ అన్ని స్థాయిలకు చెందిన వారు, ఆయనకు సేవ చేయ డానికి, ఆయన కార్యం గట్టెక్కించ డానికి, మేమంటే మేమని పోటీ పడ్డారు అందరూ. ఆయనకు తగిన ఆరామాలను ధనవంతులు బాగా ఖర్చుచేసి నిర్మిస్తే, పేదలు ఆయన యెడ విశ్వాసాన్ని, భక్తిని తమ వినమ్ర రీతిలో ప్రదర్శించారు. అతడు పరిపూర్ణ ఉపేక్షతో పేదల నుంచి, ధనవంతుల నుంచి ఒకే విధంగా కానుకలను గ్రహించాడు. అంతేకాని ఎవరి యెడ పక్షపాత దృష్టిని ప్రదర్శించ లేదు. కాని పేదలంటే, అధోవర్గాలంటే ఎక్కువ కనికరం చూపాడు. తుమ్మెద పుష్పానికి నొప్పి తగుల కుండా ఎలా తేనెను గ్రహిస్తుందో, అలాగే బుద్ధుడు తన అనుచరులకు, అనుయాయులకు, ఎవరికీ కాసింత గూడ అసౌకర్యం కలగకుండా మసలు కొన్నాడు. రకరకాల కానుకల వర్షం ఆయనపై కురిసింది. కాని ఆయన వాటి నన్నింటిని అరాగంతోనే గ్రహించాడు.

అతనికి ఎటువంటి దురుద్దేశాలు లేక పోయినా, మానవాళికి సేవ చేయడంలో పూర్తిగా నిస్వార్థంతోనే ఉన్నా, బుద్ధుడు బలమైన వ్యతిరేకతలను ఎదుర్కోవలసి వచ్చింది. అతనిని తీవ్రంగా విమర్శించారు, బాగా తిట్టారు, అవమానించారు, కనికరం లేకుండ దాడి చేశారు. ఇటువంటిది ఏ ధర్మప్రచారకునికి జరగలేదు. అతని ముఖ్యప్రత్యర్థులు భిన్న సంప్రదాయాలకు చెందిన, ప్రత్యర్థి తెగలకు చెందిన సామాన్య బోధకులు. వీరి అంధ విశ్వాసాలను. మూఢ కర్మ కాండను బుద్ధుడు విమర్శించాడు. ఈ విమర్శ న్యాయమే. అందరి కంటె ముఖ్యమైన వ్యక్తిగత శత్రువు అతని స్వంత బావమరిది, గతంలో శిష్యుడు ఆయన దేవదత్తుడు. ఇతడు బుద్ధుని చంప డానికి విఫలప్రయత్నం చేశాడు.

**బుద్ధుడు - దేవదత్తుడు :**

దేవదత్తుడు రాజు సుప్పబుద్ధ, బుద్ధుని మేనత్త అయిన పమితాల కొడుకు. యశోధర అతని సోదరి. ఈ విధంగా అతడు బుద్ధునికి మేనత్త కొడుకు బావమరిది అవుతున్నాడు. బుద్ధుడు సంఘాన్ని స్థాపించిన తొలి దినాల్లోనే ఆనందుడు ఇంకా ఇతర శాక్యరాకుమారు లతో పాటే ఇతడూ సంఘంలో చేరాడు. అతడు సన్యాసత్వంలో ఏదశనూ చేరుకో లేదు. కాని ప్రాపంచిక మానసిక శక్తులు (పోతుజ్జనికయిద్ధి) విశిష్టంగానే సాధించాడు. ఇతనిని అన్నిరకాల బలపరిచేవాడు రాజు అజాత సత్తు (అజాతశత్రు). ఇతడు దేవదత్తుని కోసం ఒక ఆరామాన్ని నిర్మించాడు.

తొలిదినాల్లో అతడు ఆదర్శవంతమైన పాత్రనే నిర్వహించాడు. గౌరవనీయ సారిపుత్తు డంతటి వాడు కూడ రాజగహాలో అతని గురించి ఎంతో గొప్పగా చెబుతూ ఉండే వాడు. తరవాత, తరవాత ప్రాపంచిక ప్రయోజనాలకు, గౌరవాలకి లొంగి పోయి, బుద్ధుడంటే అసూయ పెంచు కొన్నాడు. ఈ విధంగా అతని ప్రవర్తన సమూలంగా మారి పోయింది. బుద్ధునికి అందరి కంటె పరమ వ్యక్తిగత శత్రువై పోయాడు. అదే సమయంలో, అతని హృదయంలో బుద్ధుని మీద ద్వేష భావం ఏర్పడడం వలన, అతని మానసిక శక్తులు వాటంతటవే హరించుకొని పోయాయి.

అతడు దుష్టుడైనా, కలుషిత జీవితాన్ని గడిపినా, అతనికి చాల మంది అనుయాయులు, ప్రశంసకులు ఉన్నారు. కొంత మంది అయితే సారిపుత్రుని కంటె ఇతనికే ఎక్కువ విలువ నిచ్చే వారు.

ఒక సందర్భంలో అతడు బుద్ధుని దగ్గరకు వచ్చి, ''మీరు ఎలాగు వృద్ధు లయ్యారు గదా, సంఘ నాయకత్వం మా కప్ప గించండి'', అని కోరాడు. బుద్ధుడు అది వీలు కాదంటూ, ''నేను సారిపుత్ర, మొగ్గల్లానలకే నాయకత్వం అప్ప చెప్పను. అలాంటిది మీకెలా అప్ప చెబుతాను?'' అని నిర్ద్వంద్వంగా చెప్పాడు. ఈ తిరస్కారంతో పెట్రేగి పోయి బుద్ధుడంటే కసి పెంచు కొన్నాడు. ఇది గమనించిన బుద్ధుడు సంఘం గౌరవ మర్యాదలను ఇనుమడింప చేయ డానికి ఒక ప్రకటన చేశాడు: ''బుద్ధుని పేరుతో గాని, సంఘం పేరుతో గాని, ధమ్మం పేరుతో గాని దేవదత్తుడు ఏది చేసినా దానికి దేవదత్తుడే బాధ్యత వహించాల్సి ఉంటుంది'' అని.

అందుకని అతడు బుద్ధుని చంప డానికి అజాతసత్తుతో కుట్ర పన్నాడు. తండ్రిని చంపి సింహాసనం ఆక్రమించమని అజాతసత్తుకి దేవదత్తుడు సలహా ఇచ్చాడు. అదే సమయంలో

తానేమో బుద్ధుని చంపి సంఘానికి నాయకుడు కావాలను కొన్నాడు. కృతఘ్నుడైన అజాతసత్తు ధార్మికుడైన తండ్రిని సంహరించి, సింహాసనాన్ని ఆక్రమించడంలో సఫలీకృతు డయ్యాడు గాని, బుద్ధుని చంపే విషయంలో, దేవదత్తుడు విలుకాండ్రను నియోగించినా, ఆశించింది జరగ లేదు. ఆ అద్దె విలుకాండ్రు బుద్ధుని శిష్యులుగా మారి పోయారు. ఈ ప్రయత్నం ఇలా భంగం కావడంతో తానే స్వయంగా బుద్ధుని చంపాలను కొన్నాడు. గిజ్జకూట సానువులలో బుద్ధుడు నడుస్తూ ఉండగా, ఇతడా కొండపై కెక్కి, నిర్దయతో, ఒక బండ రాయిని బుద్ధుని పైకి దొర్లించాడు. అదృష్టవశాత్తు అది మరో రాతిని ఢీకొని చిట్లిపోయింది. అందులో ఒక చిన్న ముక్క వచ్చి బుద్ధుని కాలికి తగిలి గాయ పరిచింది. రక్తం కారింది. వైద్య శిఖామణి జీవకుడు బుద్ధునికి ఉపచారం చేసి, గాయం నయం చేశాడు.

దేవదత్తుడు మరో విఫల ప్రయత్నం చేశాడు: నలగిరి అనే ఏనుగుకు బాగా సారా పట్టించి, బుద్ధుని మీదికి తోలించాడు. ఆ భీకర గజ రాజం బుద్ధుని సమీపించ గానే, తన ప్రాణాన్నైనా ఒడ్డి, అతనిని రక్షించాలని ఆనందుడు అడ్డం బోయాడు. కాని బుద్ధుడు తన ప్రేమైక కరుణతో దానిని లొంగ దీసు కొన్నాడు.

ఈ చివరి క్రూర చర్యతో దేవదత్తునికి చెడ్డ పేరు వచ్చింది. ప్రజాభిప్రాయానికి తల ఒగ్గి రాజు అతని ఆ రామాని కిచ్చే ఆదరణను, సహాయాన్ని ఉపసంహరించు కొన్నాడు. దేవదత్తుని పేరు ప్రఖ్యాతులు పడి పోయాయి. అతడంటే అంతటా ఆదరణ తగ్గి పోయింది.

ఇప్పుడిహ అతడు కపటంతో, మోసంతో, మాయోపాయంతో జీవించాలని నిర్ణయించు కొన్నాడు. ఇతనికి దుర్మార్గంలో సములైన భిక్కులు కొకాలిక వంటి వారి తోడ్పాటుతో సంఘంలో చీలిక తేవాలని ఆలోచించాడు.

భిక్కులకు ఈ దిగువ ఐదు నియమాలు పాటించవలసిందిగా ఆదేశాలిమ్మని బుద్ధుని అర్థించాడు దేవదత్తుడు.

(i) భిక్కులు జీవితాంతం అరణ్యాలలోనే ఉండాలి.
(ii) వారు భిక్షతోనే జీవించాలి.
(iii) వారు పంసుకూల వస్త్రాలనే ధరించాలి ( అంటే మట్టి కుప్పలనుంచి, శ్మశానాలనుంచి సేకరించిన పేలికలతో తయారుచేసిన వస్త్రాలను ధరించాలి.)
(iv) వారు వృక్షాల క్రిందే జీవించాలి.
(v) మాంసం, చేపలను వారు తిన రాదు.

బుద్ధుడు వీటికి అంగీకరించడని బాగా తెలిసే వీటిని ప్రతి పాదించాడు దేవదత్తుడు. ఎందుకంటె, బుద్ధుని నిరాకరణను వంకగా పెట్టుకొని, అతనిని అపఖ్యాతి పాలు చేసి, అమాయక జనాన్ని తనవైపుకు తిప్పుకోవాలను కొన్నాడు.

ఈ అభ్యర్థనకు, సహనశీలి, కరుణా మయుడు అయిన బుద్ధుడు ఇలా ప్రతిస్పందించాడు: ''భిక్కులు తమ కిష్టమైతే ఈ నియమాలను పాటించ వచ్చు. పాటించాలని నిర్బంధం ఏమీ లేదు.''

బుద్ధుని ఈ నిరాకరణను దేవదత్తుడు సాకుగా చేసుకొని, సంఘంలో చీలిక తెచ్చాడు. భిక్కులకు ఇలా విజ్ఞప్తి చేశాడు :

''సోదరులారా, ఎవరు చెప్తున్న మాటలు మంచివి? నేను చెప్పేవా? లేక తథాగతులు చెప్పేవా? ఎవరైతే దుఃఖం నుంచి బయట పడాలను కొంటున్నారో, వారంతా నాతో చేరి పొండి''.

ధమ్మాన్ని ఇంకా సరిగా అవగాహన చేసు కోని కొత్త భిక్కులు, అతని నియమాలను అంగీకరించి, అతని వైపు చేరి పోయారు. వారిని వెంట బెట్టుకొని అతడు *గయాసీస* వెళ్ళాడు. కాని గౌరవనీయులు సారిపుత్త, మొగ్గల్లానలు, బుద్ధుని సలహా మీద, వారి దగ్గరకు వెళ్ళి, ధమ్మాన్ని వారికి అర్థ మయ్యేట్టు వివరించి, వారిని తమ వైపుకు తిప్పు కోవడంలో విజయం గాంచారు.

ఆ తరవాత దేవదత్తునికి అన్నీ కష్టాలే. అతడు తీవ్రంగా జబ్బు పడ్డాడు. తన మరణానికి ముందు, బుద్ధుని దర్శించాలని, ఎంతగానో ఆశించాడు. కాని అతని దుష్కర్మ అడ్డుకొంది. ఫలితంగా అతడు బుద్ధుని చూడ కుండానే, కుక్కచావు చావలసి వచ్చింది. ఏమైన చివరికి అతడు బుద్ధుని శరణం వేడాడు.

అతడు చేసిన ఘోర పాపాలకు దుఃఖంతో బాధితుడైనా, అతడు తొలి దశలో పవిత్ర జీవితాన్ని గడిపిన కారణంగా, సుదూర భవిష్యత్తులో ఎప్పుడో అతడు 'అత్థిహిస్సర' అనేపేరు గల పచ్చెక (ప్రత్యేక) బుద్ధు డవుతాడని చెప్పబడింది.

**అనాథపిణ్డిక**

బుద్ధుని అన్ని విధాల బలపరిచిన వాడు కోటీశ్వరుడైన అనాథపిణ్డికుడు. బౌద్ధ ఉపాసకులు అందరిలోకి అతడే ఎక్కువ దానం చేసిన వాడు.

అతడి అసలు పేరు సుదత్తుడు. అనాథలకు పిండం పెడతాడు కాబట్టే అతనికి అనాథ పిండికుడనే పేరు వచ్చింది, అ సదృశమైన అతని దాతృత్వం కారణంగా, శబ్దతః (అనాథులకు పిండం పెట్టేవాడు కనుక) అనాథ పిండికుడనే పేరుతోనే పిలవ బడు తున్నాడు. అతడి జన్మస్థలి సావత్తి (శ్రావస్తి).

వ్యాపారం పనిమీద, ఒకరోజు రాజగృహలో ఉన్న తన బావమరిదిని కలిసేందుకు వెళ్ళాడు. మామూలుగా ఇతనికి స్వాగతం పలక డానికి అతడు ముందుకు రా లేదు. అతడేదో విందుకు పదార్థాల తయారీలో, పెరడులో ఉండి పోయాడు. ఈ ఏర్పాట్లన్నీ ఎందుకా అని ఆలోచిస్తే, అవన్నీ మరు రోజు బుద్ధుని ఆగమనం కోసం, అని తెలసి, సుదత్తునికి అవర్ణనీయమైన సంతోషం కలిగింది. ''బుద్ధుడు'' అనే పదం అతడి చెవిని పడగానే, అతడు ఆయన్ను చూడాలను కొన్నాడు. బుద్ధుడు సావత్థి ప్రక్కనే ఉన్న సీతవనంలో ఉన్నాడనీ, ఎలాగు మరు రోజు ఉదయం రానున్నాడనీ తెలుసుకొని, అతడు విశ్రమించాడు. కాని బుద్ధుని దర్శనం చేసు కోవాలనే తహ తహ అతనిని ఆరాత్రంతా నిదుర పోనీయ లేదు. అకాలమే అయినా, బాగా వేకువనే నిద్రలేచి, అతడు సీతవనానికి బయలుదేరి వెళ్ళాడు. బుద్ధుని మీద అతనికి ఉన్న అత్యంత గాఢ విశ్వాసం కారణంగా, అతడి శరీరం నుంచి వెలుగు ప్రసరించింది. మార్గమధ్యంలో శ్మశానవాటిక తగిలింది. అది చిమ్మ చీకటి. అతనికి భయం వేసింది. వెనక్కు తిరిగి పోదామా అని అనుకొన్నాడు. సీవకుడనే యక్షుడు అదృశ్యంగానే, అతనిని ఈ విధంగా ప్రోత్సహించాడు.

''వంద ఏనుగులు, వంద గుర్రాలతో కూడ,
ఇంకా గాడిదలు పూన్చిన వంద రథాలు,
కర్ణాభరణాలంకృతులైన లక్షమంది కన్యలు:
ఇవన్నీ గూడ ఒక అంగ ముందుకు వేయడంలో
పదహారో వంతుకు గూడ సమం కావు.
పౌరుడా, ప్రగమించు, ముందుకు నడు!
ప్రతీపగమనం కంటె ప్రగమనమే నీకు మేలు[1].
(వెనుదిరగడం కంటె ముందుకు పోవడమే మంచిది - అనువాదకుడు)

అతడి భయం అంతర్ధానమైంది. దాని చోట్లో బుద్ధుని మీది విశ్వాసం నిలిచింది. వెలుగు మళ్ళీ కనిపించింది. సాహసంతో ముందుకు అతడు అడుగు వేశాడు. కాని ఇదంతా రెండోసారి మూడోసారి గూడ సంభవించింది. అంతిమంగా అతడు సీతవనం చేరు కొన్నాడు. అక్కడ బుద్ధుడు ఇతనిరాకను ఊహించి, అక్కడే పచార్లు చేస్తున్నాడు. బుద్ధుడు అతనిని 'సుదత్తా' అని కుటుంబ నామంతో సంబోధించి, దగ్గరకు రమ్మని పిలిచాడు.

ఈ విధంగా బుద్ధుడు సంబోధించడం విని అనాథ పిండికుడు సంతసించి, బుద్ధుని కుశలాన్ని అడిగాడు.

బుద్ధుడు ప్రత్యుత్తర మిచ్చాడు:

''అగ్ని ఉచ్ఛేదమైన అర్హతుడు
అన్ని వేళల సంతోషంతో, విశ్రాంతితో, ఉంటాడు.
ఇంద్రియక వాంఛలకు విదళితుడు కాని వాని
అస్తిత్వం ప్రశాంతంగానే ఉంటుంది. నూతన జన్మను
తెచ్చిపెట్టేవి ఏవీ అతని దరి చేరవు.
బరువు బాధ్యతలు తెగి పోతాయి.
దుఃఖాన్ని జయిస్తాడు. హృదయానికి ముళ్ళు గుచ్చు కోవు.
ప్రశాంతంగా సంతోషంతో అతడు విశ్రాంతి తీసు కొంటాడు
ఎందుకంటె అతని మనస్సు శాంతిని సాధించింది[2].''

ధమ్మం వినడంతో అతడు సోతాపన్ను (ఏరుదాటినవాడు) డు అయ్యాడు. వర్షా కాల మంతా సావత్తిలో గడప వలసిందని బుద్ధుని ఆహ్వానించాడు. బుద్ధులకు ఏకాంతవాసమే ఆనంద దాయకమని సూచిస్తూ, బుద్ధుడు అతడి ఆహ్వానాన్ని అంగీకరించాడు. అనాథపిండికుడు సావత్తి వచ్చి, రాకుమారుడు జెతకు చెందిన వనాన్ని కొన్నాడు. ఒక కథ ప్రకారం ఈ వనం విలువను ఎలా నిర్ణయించా రంటే, ఆ వనం మొత్తాన్ని బంగారు నాణేలతో కప్పి, ఆవిలువకు కొన్నాడు. ఆ తరవాత అక్కడ ఎంతో ఖర్చుపెట్టి, ప్రఖ్యాత జేత వన ఆరామాన్ని నిర్మించారు. ఇక్కడ బుద్ధుడు పందొమ్మిది వర్షా కాలాలు గడిపాడు. బుద్ధుడు తన జీవితంలో అధికభాగం ఇక్కడే గడిపాడు. ఇక్కడే అనేక ధర్మోపన్యాసాలు చేశాడు.

ఉపాసకులకు ప్రత్యేక ఆసక్తిని గొలిపే ఉపన్యాసాలను ఎన్నింటినో బుద్ధుడు అనాధపిండికునికి వినిపించాడు, అతడేమీ ప్రశ్నలు అడగక పోయి నప్పటికీ. బుద్ధుని ఎక్కడ కష్ట పెట్ట వలసి వస్తుందోనని అతడెప్పుడూ ప్రశ్నలు అడగ లేదు.

బుద్ధుడు ఒకసారి దాతృత్వం, ఔదార్యాల మీద మాటాడుతూ, అనాధ పిండికునికి ఇలా జ్ఞాపకం చేశాడు: ''నాకు, భిక్షు సంఘానికి ఇచ్చిన భిక్ష ప్రశంసనీయం. అటువంటి భిక్షకంటె, సంఘం ఉపయోగానికి ఆరామం నిర్మించడం ఇంకా ప్రశంసనీయం. అటువంటి ఆరామాల నిర్మాణం కంటె, బుద్ధుని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణు వేడడం ఇంకా ప్రశంసనీయం. ఈ త్రి శరణాల కంటె పంచ శీలాల (Five precepts) పాలనం ప్రశంస నీయం. దీని కంటె ఒక్కక్షణం పాటైనా 'ప్రేమతో కూడిన కరుణ' (మైత్రి) పై ధ్యానం చేయడం ప్రశంస నీయం. అన్నింటికంటే ప్రశంసనీయమైంది, 'వస్తుస్వభావం ప్రవాహం'[3] అనే ప్రజ్ఞ (Insight) ను పెంపొందించు కోవడం[3].''

ఈ ఉపన్యాసాన్నిబట్టి, బౌద్ధ జీవితంలో మొదటి అడుగు ఔదార్యం అనేది స్పష్టం. ఔదార్యం కంటె ముఖ్యమైంది నియమిత ప్రవర్తనకు సంబంధించిన ఐదు శీలాలను పాటించడం. ఈ నియమిత ప్రవర్తన, మాటలను, చేతలను క్రమబద్ధం చేస్తుంది. అంత కంటె ముఖ్యమైంది, ప్రయోజన కరమైంది ఆత్మ వికాసానికి దారితీసే ఉదాత్తగుణం (మైత్రి) అలవరుచు కోవడం. అన్నింటి కంటె ముఖ్యమైంది, ప్రయోజనకరమైంది వస్తువులను ఉన్న వాటిని ఉన్నట్లు, నిజాయితీతో, చూడ గలగడం.

ఒక ఉపాసకుడు అనుభవించే నాలుగు రకాల ఆనందం మీద బుద్ధుడు వ్యాఖ్యానిస్తూ ఇలా ప్రకటించాడు[4]:

''మాటిమాటికి ఇంద్రియ సుఖాన్ని అనుభవించే ఉపాసకుడు సమయం వచ్చినప్పుడు అనుభవించాల్సినవి నాలుగు ఆనందాలున్నాయి: స్వామ్యానందం, సంపద ఆనందం, ఋణ రాహిత్యానందం, అనింద్యతానందం''.

''స్వామ్యానందం అంటే ఏమిటి?''

''ఒకడు చెమ టోడ్చి, కండ బలంతో న్యాయంగా, సంపదను కూడ బెట్టాడు. 'ఈ సంపద నాది. నా కష్టార్జితం. ఇది నేను న్యాయంగా సంపాదించింది', – అనే ఆలోచనతో అతనికి ఆనందం కలుగుతుంది, తృప్తిలభిస్తుంది. ఇదే స్వామ్యానందం.

''సంప దానందం అంటే ఏమిటి?''

''ఒకడు కష్టపడి కూడ బెట్టిన సంపదను అనుభవిస్తాడు. దానితో ప్రశంస నీయమైన పనులు చేస్తాడు. 'నేను సంపాదించిన ఈ సంపదను నేను అనుభవిస్తున్నాను. దీనితో కొన్ని మంచి పనులు చేస్తున్నాను' – అనే ఆలోచనతో అతనికి ఆనందం కలుగుతుంది, తృప్తి లభిస్తుంది. ఇదే సంపదానందం''.

''ఋణరాహిత్యానందం అంటే ఏమిటి?''

''ఒకడు ఎవరికి గాని చిన్న అప్పుగాని, పెద్ద అప్పుగాని లేదు, 'నేను ఎవరికి చిన్నది గాని, పెద్దదిగాని బాకీ లేను' – అనే ఆలోచనతో అతనికి ఆనందం కలుగుతుంది. తృప్తి లభిస్తుంది. ఇదే ఋణ రాహిత్యానందం.''

''అనింద్యతానందం అంటే ఏమిటి?''

''ఒక ఆర్య శిష్యుడు మనసా వాచా కర్మణా అనింద్యుడుగా ఉన్నాడు. 'నేను మనసా వాచా కర్మణా అనింద్యుణ్ణే', అనే ఆలోచనతో అతనికి ఆనందం లభిస్తుంది. తృప్తి కలుగుతుంది. ఇదే అనింద్యతానందం.''

''రుణరాహిత్యానందాన్ని పొందడంతో, ఒకడు

'నిజంగా కలిగి ఉండడం' లోని ఆనందాన్ని గుర్తు తెచ్చుకో వచ్చు.
సంపదానందాన్ని అనుభవించేప్పుడు, 'అది అట్టిదని'
జ్ఞానం వల్ల చూస్తాడు. అలా చూసినప్పుడు అతడు తెలుసుకొంటాడు.

ఈ విధంగా అతడు రెండు పక్షాల నిజంగా జ్ఞాని.
కాని ఇవన్నీ గూడ అనింద్యతానందం వల్ల
(ఒకడు పొందే) ఆనందంలో పదహారవ వంతుకు

గూడ సరిపోవు-''

మరోసారి, ఇంకో సందర్భంలో బుద్ధుడు అనాథ పిండికుని ఇంటికి వెళ్ళి నప్పుడు, ఇంటి లోపల జరిగే ఏదో కోలాహలాన్ని విని, ''అదేమిటి?'' అని అడిగాడు.

''హేదేవా! అది సుజాత గొడవ. ఆమె నా కోడలు, మాతోనే ఉంటుంది. ఆవిడ చాల ధనవంతురాలు. సంపన్న కుటుంబం నుంచి వచ్చింది. ఆమెకు అత్తమామలన్నా, భర్త అన్నా ఏమాత్రం గౌరవం, మర్యాద మన్ననలు, ఆదరభావం లేవు. ఉన్నతుడు (బుద్ధుడు) అన్నా గౌరవం లేదు'', అని సమాధానం చెప్పాడు అనాథ పిండికుడు.

అప్పుడు బుద్ధుడామెను తన ఎదుటకు రావించి, ఏడు రకాల భార్యల గురించి ఆమెకు జ్ఞానోదయం కలిగించే ఉపన్యాసం చేశాడు. ఆనాటికి లాగే, ఈనాటికి అటువంటి రకాల భార్యలు ఉన్నారు.

ఎవరైతే క్రూర మనస్సుతో, చెడుప్రవృత్తితో, దయా రహిత అయి, పర పురుషుల మీది మక్కువతో, భర్తను సరిగా చూడనిది, ఎప్పుడూ పోరు పెట్టేది వేశ్య - అటువంటి భార్యను ''పీడాకరభార్య'' అంటారు.

భర్త వృత్తి, వ్యాపార, వ్యవసాయాల ద్వారా సంపాదించిన ఆర్జనను, అది ఏ కొంచమైన, దుబారా చేసే భార్యను ''చౌర్యశీల భార్య,'' అంటారు.

ఏమీ చేయడానికి ఇష్టపడక, సోమరిగా ఉండి, తిండిపోతు అయి, కఠినంగా, క్రూరంగా ఉండి బూతులు తిడుతూ, కష్ట పడేవారి మీద పెత్తనం చెలాయించే భార్యను ''దొరసాని భార్య'' అంటారు.

కరుణ, ప్రేమలతో, భర్తను తల్లిలా చూసి, కుమారుని, తన భర్త ఆర్జనను కాపాడేది ''మాతృ సదృశ భార్య'' అంటారు.

ఒక అనుంగు సోదరి తన అన్న యెడ చూపే గౌరవం లాంటి గౌరవాన్ని భర్త యెడ ప్రదర్శిస్తూ, అణకువతో, భర్త కోర్కెల కనుగుణంగా నడుచు కొనే భార్యను ''సోదరి సదృశభార్య'', అంటారు.

చాల కాలం తరవాత కలిసిన స్నేహితుని చూసి నప్పుడు కలిగే ఆనందం లాంటి ఆనందాన్ని భర్తను చూడగానే పొందే, కులీన, గుణవతి, పతివ్రత అయిన భార్యను ''మిత్ర సదృశ భార్య'' అంటారు.

బాధా, శిక్షలతో బెదరింప బడినా, కోపగించు కోక ప్రశాంతంగా, ద్వేషరహితంగా భర్తను సహిస్తూ, భర్త కోర్కెల కనుగుణంగా నడుచు కొనే భార్యను ''దాసి భార్య'' అంటారు.

బుద్ధుడు ఇలా ఏడు రకాల భార్యలను వర్ణిస్తూ, వారిలో ''పీడాకర భార్య'', ''చోరశీల భార్య'', ''దొరసానిభార్య''లు మంచివారు కారనీ, అందువలన కోరదగిన వారుకారనీ, మాతృసదృశ, సోదరి సదృశ, మిత్రసదృశ, దాసి భార్యలు మంచి వారనీ, అందువలన వారు పొగడ దగిన వారనీ చెప్పాడు.

''ఓ సుజాతా, మగ వానికి ఇలా ఏడురకాల భార్యలుండ వచ్చు. అందులో నీవు ఏ రకానికి చెందిన దానవు?''

''హేదేవా! ఈ రోజు నుంచి నన్ను దాసిభార్యగా పరిగణించ వచ్చు''.

అనాథ పిండికుడు ప్రతిరోజు బుద్ధుని దర్శిస్తున్నాడు. బుద్ధుడు లేని రోజున భక్తులు నిరాశతో తిరిగి పోతున్నారు. ఈ విషయాన్ని అతడు గమనించాడు. బుద్ధుడు బోధనా కార్యక్రమం మీద ఇతర చోట్లకు వెళ్ళి నప్పుడు గూడ, అతనికి తమ భక్తి ప్రపత్తులను తెలియ జేసుకొనే మార్గం ఏమైనా ఉన్నదా? అని గౌరవనీయ ఆనందుని అడిగి తెలుసు కోవాలను కొన్నాడు అనాథపిండికుడు. ఈ విషయాన్ని ఆనందుడు బుద్ధుడికి తెలిపాడు. ఫలితంగా, నేటికీ నిలిచి ఉన్న ఆనంద - బోధి వృక్షాన్ని ఆరామ ప్రవేశంలో నాటడం జరిగింది.

సుగుణవతి అయిన పున్నలక్ఖనా అతని భార్య. మహా సుభద్దా, చూల సుభద్దా, సుమనాలు ముగ్గురు అతని పుత్రికలు. పెద్ద కూతుళ్ళిద్దరు సొతాపత్తిని పొందారు. అందరి కంటె చిన్నకూతురు సకదాగామి అయింది. అతని ఏకైక పుత్రుడు కాలుడు. ఇతడు మొదట అవిశ్వాసి. ఆ తరవాత తండ్రి నేర్పుతో సొతపన్ను డయ్యాడు.

గౌరవనీయ సారిపుత్తుని గంభీర ప్రవచనం విన్నతరవాత అనాధ పిండికుడు తుదిశ్వాస తీశాడు[5].

అతడు మృత్యుముఖంలో ఉన్నప్పుడు, తాను తీవ్రంగా జబ్బు పడ్డానని బుద్ధునికి తన నమస్కారాలు తెలియ జేయ వలసిందని బుద్ధుని వద్దకు ఒక వార్తాహరుని పంపాడు. ఆ తరవాత, దయతో సారిపుత్రుని తన గృహానికి దయ చేయ వలసిందని అర్థించ మని వార్తాహరుని కోరాడు. ఆహ్వానం అందుకొన్న సారిపుత్రుడు, గౌరవనీయ ఆనందునితో కలిసి అతని ఇంటికి వచ్చి, అతని ఆరోగ్యాన్ని గురించి తెలుసు కొన్నాడు. తాను తీవ్ర తరుణ బాధతో సతమత మవుతున్నానని, తగ్గుముఖం పట్టే లక్షణాలు ఏవీ లేవని చెప్పాడు.

అప్పుడు సారిపుత్రుడు గాఢ ప్రవచనం చెప్పాడు. ఉపన్యాసం చివరలో అనాథ పిండికుని కన్నుల నీరు నిండింది. అతడి కన్నుల నీరు నిండడం చూసిన ఆనందుడు, ''ఏమిటి, మీరు కుప్పకూలి పోతున్నారా?'' అని అడిగాడు. అప్పుడు అనాథ పిండికుడు, ''లేదు, మహాశయా. నేను ఎన్నో మార్లు బుద్ధుని, అతని శిష్యులను విన్నాను. ఇటువంటి ప్రవచనాన్ని ఇంతకు ముందు నేనెన్నడూ విన లేదు.''

''అటువంటి అర్థవంతమైన ప్రవచనాలను శ్వేతవస్త్రధారులైన మామూలు వారికి ఎప్పుడూ బోధించ లేదు. కారణం వారు అర్థం చేసుకో లేరు. కాని ఆ ప్రవచనాలను శిక్షితులైన శిష్యుల కోసం ప్రత్యేకించారు'', గౌరవనీయ సారిపుత్రులు సమాధానం చెప్పారు.

అటువంటి గూఢ ధర్మాన్ని మామూలు వారికి గూడ బోధించ వలసిందని, ఎందుకంటే వారిలో కొంతమంది అయినా అర్థం చేసుకో గలిగిన వారు ఉండ వచ్చునని, అనాథపిండికుడు గౌరవనీయ సారిపుత్రుని బ్రతిమాలాడు.

ఈ ఇద్దరు విశిష్ట శిష్యులు బయలు దేరి వెళ్ళిన కొద్ది సేపట్లోనే అనాథపిండికుడు గతించాడు. ఆ వెంటనే తుసిత స్వర్గంలో జన్మమెత్తాడు.

రాత్రి సమయంలో దేవ అనాథపిండికుడు, జెతవనాన్ని వెలుగుతో నింపుతూ, బుద్ధుని ఎదుటకు వచ్చి, నమస్కరించాడు. గౌరవనీయ సారిపుత్రుని గుణగణాలను మెచ్చుకొంటూ, బుద్ధుడు అతని శిష్యులు తన విహారంలో ఉండడాన్ని చూసి, ఇలా అన్నాడు:

హితేచ్ఛ, జ్ఞానం, సుశిక్షితమైన మనస్సు,

ఉన్నత ధార్మికత మీద ఆధారపడిన నడత,

– ఇవి మనుషులను శుద్ధం చేస్తాయి, కాని సంపద, హోదాలు కావు''

విసాఖా (విశాఖ)

కోటీశ్వరుడైన ధనుంజయుని కుమార్తె విసాఖా. ఈమె ధర్మగుణం గలది. ఉదార చరిత. తల్లి సుమనాదేవి. ఈమె ప్రియమైన తాతగారు కోట్లకు పడగెత్తిన మెండకుడు.

ఆమెకు ఏడు సంవత్సరాల వయస్సప్పుడు అంగ రాజ్యంలో ఆమె జన్మస్థలమైన, భద్దియకు బుద్ధుడు వెళ్ళడం జరిగింది. బుద్ధుని రాకను విన్న ఆమె తాతగారు ఆమెతో ఇలా అన్నాడు: ''ప్రియమైన మనుమరాలా! ఈ రోజు నీకు శుభదినం. నాకు కూడా. నీ ఐదు వందల మంది చెలి కత్తెలను, ఐదువందల రథాలు ఎక్కి రమ్మని ఆదేశించు. ఐదువందల మంది సేవక కన్యలను తోడు రమ్మను. నీవు వారందరితో వెళ్ళి బుద్ధుని ఆహ్వానించు''.

వెంటనే ఆమె దానికి ఒప్పుకొని, చెప్పిన తీరులో బుద్ధుని వద్దకు వెళ్ళి, అతడికి నమస్కరించి, గౌరవ పురస్సరంగా ఒక ప్రక్క ఆసీను రాలైంది. బుద్ధుడు ఆమె ఒబ్బిడి తనంతో సంతోషించిన వాడై, ఆమెకు, ఆమెతో వచ్చిన వారికి ధమ్మబోధ చేశాడు. ఆమె వయస్సులో చిన్నదే కాని, ధార్మికంగా ఆవిడ ఎంతో ఎదిగిన బాలిక. అలా కావడం వలన, ఆమె వయస్సులో చిన్నదై కూడ ఋషిత్వంలో మొదటి దశ అయిన సొతాపత్తిని పొందింది.

యౌవనంలో ఆమెకు పురుషునికున్నంత బలం, స్త్రీ కుండ వలసిన సోయగాలు ఉన్నట్లు గ్రంథాలు తెలుపు తున్నాయి. ఆమె జుట్టు నెమలి తోకను పోలి ఉన్నది. దానిని జార వదిలి నప్పుడు అది పరికిణీ చివరలను తాకేది. అక్కడ జుట్టు చివరలు పైకి ఉంగరాలు తిరిగేవి. ఆమె పెదవులు అరుణిమలతో కాంతు లీను తుంటాయి. మృదువుగా ఉంటాయి. పలువరుస గొగ్గులు లేకుండ సమంగా, ధవళంగా ఉంటుంది. పళ్ళు ముత్యాలలా మెరుస్తాయి. ఆమె చర్మం, పరిమళద్రవ్యాలు అలదకనే, కాంతులీనుతూ ఉంటుంది. నీల పద్మాల స్నిగ్ధత్వంతో, బంగారు కాంతితో మెరిసి పోతుంటుంది. ఆమెకు ఎంతోమంది సంతానం కలిగి నప్పటికీ, యౌవనఛాయలు చెక్కు చెదర లేదు.

జుట్టు, కండరాలు, ఎముకలు, చర్మం, యౌవనం - ఈ ఐదు అంశాలలో ఇనుమడించిన స్త్రీ సౌందర్యంతో అలరారుతున్న యువ విసాఖా ఇటు లౌకిక ప్రపంచ జ్ఞానంలో, అటు ఆధ్యాత్మిక జ్ఞానంలోను ఎంతో గణుతికెక్కింది.

ఆమెకు పదిహేను, పదహారు సంవత్సరాల వయస్సులో, ఒక పండుగ రోజు, తన చెలి కత్తెలు వెంటరాగా, సరదాగా నదిలో స్నానం చేయడానికి వెళ్ళింది. అనుకోకుండ వర్షం వచ్చింది. ఒక్క విసాఖా తప్ప, మిగతా అందరూ ఎలా పడితే అలా, పరుగెత్తుకొంటూ పోయి, దగ్గరలోనే ఉన్న చావడిలో ప్రవేశించారు. అప్పటికే అక్కడ కొంత మంది

బ్రాహ్మణులు ఉన్నారు. వీరు తమ యజమాని కోసం ఐదు రకాల అందంతో అలరారే కన్యకోసం వెతుకుతూ వచ్చి అక్కడ విడిది చేశారు. సంస్కారం, హుందా ఉట్టిపడే విసాఖా, ఏమాత్రం వేగిర పాటు లేకుండా తన మామూలు నడకతో, తడి బట్టలతో, ఆ చావడిలోకి ప్రవేశించింది. ఇతరులు పరుగెత్తు కొచ్చినట్టుగా, ఆమెగూడ పరుగెత్తుకొస్తే బట్టలు తడవకుండా ఉండేవి కదా అని, జిజ్ఞాసా పరులైన బ్రాహ్మణులు ఆమెను విమర్శించారు.

ఆమె సందర్భానుసారం, వ్యవహరించింది. నడత, శీలం, ఆచరణ, రీతిని గురించి ఆశువుగా వారికి ఉపన్యసించింది. కావాలంటే తాను వారి కంటే వేగంగా పరుగెత్తి రాగలనని, కావాలనే అలా చేయ లేదనీ ఆమె వారికి వివరించింది. చూడండి, భూషణాలంకృతుడైన ఒకరాజు, దట్టీ బిగించి, రాజప్రాసాదం ముందు పరుగెడితే బాగుండదు. అలాగే అంబారీ గట్టిన పట్టపుటేనుగు పరుగిడితే ఏమి బాగుంటుంది! అది దాని కున్న సహజ ఠీవితో మంద గమనం చేయాలి. మామూలు సాదాసీదా మనుషుల్లా సన్యాసులూ పరుగులు తీస్తే, విమర్శకు గురవుతారు. అలాగే స్త్రీ, ఒక మగవానిలా పరుగులు తీస్తే ఆ దృశ్యం అంత రాణించదు.

ఆమె చేసిన ఈ ఉపన్యాసంతో బ్రాహ్మణులు సంతోషించి, ఈమె తమ యజమానికి తగిన భార్య అవుతుందని అనుకొన్నారు. అలాగే, వారి యజమానితో వివాహం చేయ డానికి ఏర్పాట్లు జరిగాయి. వారి యజమాని పేరు పున్నవర్ధనుడు. కోటీశ్వరుడైన మిగారుని పుత్రుడు. అయితే అతడు బుద్ధుని అనుచరుడు కాడు. ఆ తరవాత అనేక ప్రయత్నాల తరవాత, ఆమె ఒక బిడ్డను కని, అతనిని మిగారుడని పిలిచింది.

పెండ్లి వేడుక గొప్పగ జరిగింది. పెళ్ళిరోజు, ఆమె తెలివైన తండ్రి కట్నం కానుకలతో పాటు, ఈ దిగువ హెచ్చరికలు చేశాడు.

1. ఇంటి అంతరంగాగ్నిని, బయటికి కొని పోవద్దు[7]
   (ఇంటి పరువును బయటి కీడ్చవద్దు)
2. బయటి నిప్పును ఇంటిలోకి తేవద్దు.
3. ఇచ్చేవారికే ఇవ్వు.
4. ఇవ్వని వారికి ఇవ్వవద్దు.
5. ఇచ్చేవారికీ, ఇవ్వని వారికీ – ఇద్దరికీ ఇవ్వు.
6. హాయిగా కూచో (సంతోషంగా ఉండు).
7. హాయిగా భుజించు.
8. హాయిగా నిద్రపో.

9. నిప్పును సేవించు.

10. గృహదేవతలను పూజించు.

వీటి అంతరార్థం ఇది:

1. భార్య అత్తమామల గురించి, భర్త గురించి, ఇతరుల వద్ద చెడుగా మాటాడ రాదు. వారి లోపాలను, ఇంటి పోరును బయట ఎక్కడా పొక్క నీయ రాదు.

2. ఇతరుల కబుర్లను, కథలను భార్య విన రాదు.

3. తిరిగి ఇచ్చేవారికి వస్తువులను ఇవ్వాలి.

4. తిరిగి ఇవ్వని వారికి ఎప్పుడూ, ఏ వస్తువూ ఇవ్వ రాదు.

5. తిరిగి ఇవ్వకపోయినా, పేదరికంలో ఉన్నచుట్టాలను, స్నేహితులను ఆదు కోవాలి.

6. భార్య కూర్చోనే టప్పుడు ఒబ్బిడిగా, తగిన విధంగా కూచోవాలి. అత్తమామల ముందు, భర్త ముందు కూర్చో రాదు.

7. అందరూ కలిసి భోంచేసే టప్పుడు, భార్య ముందుగా అత్తమామలకు, భర్తకు వడ్డించాలి.

8. నిద్రబోయే ముందు ఎక్కడి సామాన్లు అక్కడ సర్ది ఉన్నాయేమో చూసుకొని, సేవకు లంతా తమతమ పనులను నాటికి ముగించారా లేదా అని తెలుసు కొని, తలుపులన్నీ మూసి వేసి, అత్తమామలు పండుకొన్నారా లేదా అని చూసు కోవాలి. తప్పని సరిగా భార్య వేకువ జామున అందరికంటె ముందుగ నిద్రలేవాలి. ఒంట్లో బాగుండక పోతే తప్ప, పగటిపూట భార్య నిద్ర పో రాదు.

9. అత్తమామలను, భర్తను నిప్పుగ పరిగణించాలి. నిప్పుతో ఎలా జాగ్రత్తగా మసలు కొంటామో వారి తోను అలాగే మసలు కోవాలి.

10. అత్తమామలను, భర్తను గృహదేవతలుగా పరిగణించాలి. బుద్ధుడు గూడ అత్తమామలను దేవతలుగా పరిగణించాడనేది గమనార్హం.

ఆమె తను మెట్టిన ఇల్లు ఉన్న నగరమైన శ్రావస్తికి వచ్చిన రోజున, ఎవరి శక్తికొలది వారు, అన్నిరకాల అంతస్తులకు చెందిన వారు, సమర్పించిన అనేక రకాల కానుకలు వర్షంలా కురిసాయి. కాని ఆమె ఎంత దయగలది, ఉదారమైందీ అంటే, తనకు వచ్చిన కానుకల నన్నింటినీ తిరిగి దాతలకే పంచి ఇచ్చింది. ఒక దయాపూరిత సందేశంతో వారి నందరిని

తన బంధు జనంగా పరిగణించింది. ఇటువంటి ఉదాత్త చర్యతో, ఆమె కాపురానికి వచ్చిన మొదటి రోజే ఆ నగర ప్రజలందరికి అభిమాన పాత్ర అయింది.

ఆమె జంతువుల యెడ గూడ కనికరం చూపు తుందన డానికి సూచనగా ఆమె జీవితంలో ఒక సంఘటన జరిగింది. నడికి రేయి తను బాగా సాకుకొన్న అశ్వం, పిల్లను పెట్టిందని విన్నంతనే, ఆమె తన పరివారంతో సహా, కాగడాలతో అశ్వశాలకు వెళ్ళి, అత్యంతశ్రద్ధతో జాగరూకతతో ఆ గుర్రానికి అవసరమైన సేవలు చేసింది.

ఆమె మామగారు నిర్గంధనాథ పుత్రుడైని వర్ధమాన మహావీరుడు (జినుడు) అనుచరుడు. అతడు అనేక మంది నగ్న సన్యాసులను భిక్షకు ఆహ్వానించాడు. అర్హతులని పిలవబడే వారు రాగానే వారికి మర్యాద మన్ననలను చేయడానికి విసాఖాను రావలసిందిగా కోరాడు. అర్హతులనే మాట వినగానే ఆమె ఎంతో సంతసించింది. త్వరత్వరగా వారున్న చావడికి వచ్చింది. అక్కడ ఆమెకు ఎదురైన దృశ్యం సిగ్గుచెడిన నగ్న సన్యాసుల దర్శనం. సున్నిత హృదయ అయిన విసాఖాకు అటువంటి దృశ్యం భరింప శక్యం కానిది. ఆమె అప్పుడు మామగారిని నిందించి, వారికి మర్యాదలు సేయకనే తన మందిరానికి వెళ్ళి పోయింది. ఆ నగ్న సన్యాసులు ఆ కోటీశ్వరుని తప్పు పట్టారు. గౌతముని అనుచరి అయిన ఆమెను ఆ యింటి కోడలుగా తెచ్చు కొన్నందుకు తప్పు పట్టారు. వెంటనే ఆమెను ఇంటినుంచి పంపి వేయ వలసిందని అతనిని కోరారు. కోటీశ్వరుడు వారికి సర్ది చెప్పాడు.

ఒకరోజు అతడు ఖరీదైన ఆసనంమీద కూర్చొని బంగారు గిన్నెతో మధురమైన అంబలి తింటున్నాడు. ఆ సమయంలో ఒక భిక్షువు భిక్షకోసం ఆ యింటికి వచ్చాడు. మామ గారికి వీవనతో విసరుతున్న ఆమె, భిక్షువు అతనికి కనిపించాలనే ఉద్దేశంతో, అతనికి చెప్ప కుండానే ప్రక్కకు తప్పుకొంది. అతడు చూసి కూడ చూడనట్లే, తన భోజనం కొన సాగించాడు.

విశాఖ మర్యాద పురస్సరంగా భిక్షువుకు చెప్పింది. ''గౌరవనీయా నడవండి. మా మామగారు 'పురానం' తింటున్నారు''.

ఆమె మాటలను అపార్థం చేసుకొన్న అజ్ఞాని యైన ఆమె మామ కుపితుడై, ఆ గిన్నెను తీసి వేయ వలసిందనీ, విసాఖాను ఇంటి నుంచి పంపి వేయ వలసిందనీ ఆదేశించాడు.

విసాఖా ఆ యింటిలో అందరికీ ప్రీతి పాత్రమైంది కావడంతో ఎవరూ ఆమెను తాకడానికి సాహసించ లేదు.

కాని విసాఖా సుశిక్షిత మహిళే అయినా, తన మామగారి దగ్గర నుంచైనా సరే అటువంటి ఆచరణను ఎదిరించ కుండ ఉండలేక పోయింది. ఆమె సగౌరవంగా అంది: ''మామగారూ'' మీ ఇంటి నుంచి నన్ను పంపడానికి ఇది సరైన కారణం కాదు. నేనిక్కడ ఒక సంత నుంచి తెచ్చిన బానిస స్త్రీని కాను. తలిదండ్రులు బ్రతికి ఉన్న కూతుళ్ళెవరు ఈ విధంగా ఇల్లు వదిలి వెళ్ళరు. ఈ కారణంగానే మా నాన్న, నన్ను కాపురానికి పంపుతున్నప్పుడు ఎనిమిది మంది కుల పెద్దలను నియమించి, నన్ను వారికి అప్ప జెప్పాడు. అప్పచెప్పే టప్పుడు ఇలా అన్నాడు: 'నా పుత్రిక ఏదైనా తప్పుచేస్తే, దానిని పరిశోధించండని. మీరు ఇప్పుడు వారికి కబురు పెట్టండి. వారిని రావించి నా తప్పొప్పులు తేల్చ మనండి''.

కోటీశ్వరుడు ఆమె న్యాయమైన కోర్కెను అంగీకరించి, వారిని రావించి, చెప్పాడు: ''ఒక ఆనంద సమయంలో, నేను కూర్చొని, మధురక్షీరాన్నాన్ని బంగారు పాత్రలో తింటూ ఉండగా, ఈ పిల్ల, నేను అ పరిశుభ్రమైన దానిని తింటున్నానని అన్నది''.

ఆమె ఇలా చెప్పి తన అమాయకత్వాన్ని నిరూపించుకొన్నది: ''నేను సరిగ్గా అలాగేం చెప్ప లేదు. ఒక భిక్షువు ద్వారం వద్ద భిక్షకోసం నిలబడి నప్పుడు, మా మామగారు, అతనిని విస్మరించి, మధుర క్షీరాన్నాన్ని తింటున్నారు. ఈ జీవితంలో మా మామగారు మంచి పనులు ఏమీ చేయకుండ, గత జన్మకర్మల గుణాల కారణంగా ఇప్పుడు తింటున్నారని నాలో నేను అనుకొని, భిక్షువుతో ఇలా అన్నాను: 'గౌరవనీయమైన భిక్షూ నడవండి. మా మామగారు పురానాన్ని తింటున్నారని' అన్నాను. ఇందులో నా తప్పు ఏముంది చెప్పండి?''

ఆమె దోషం రుజువు కాలేదు. ఆమె దోషి కాదని మామ గారే అంగీకరించారు.

పగ పట్టిన కోటీశ్వరుడు ఆమెమీద మరో దోషాన్ని ఆరోపించాడు. ఆమె నడి ఝామున ఇంటి వెనకకు మగ ఆడ పచారికలతో సహా వెళ్ళడం తప్పు అన్నాడాయన.

అలా వెళ్ళిన మాట నిజమేనని, అది ప్రసవవేదనలో ఉన్న ఆడుగుర్రం సపర్యల కోసమని చెప్పింది ఆమె. ఒక ఉన్నత వంశ సంజాతురాలు, ఒక బానిస పిల్ల చేయ లేని, మెచ్చుకో దగిన పని చేసిందని కుల పెద్దలు అన్నారు. ఈ విధంగా రెండో దోషారోపణ గూడ నిలవ లేదు.

ఆమెను ఏదో ఒక తప్పులో ఇరికించే దాక పగపట్టిన మామ నిద్రపోడు. తరవాత, మళ్ళీ, ఆమె చేయని నేరానికి ఆమెను తప్పుపట్టాడు. ''మెట్టినింటికి కాపురానికి పంపేటప్పుడు, ఆమె తండ్రి ఆమెకు పదిహెచ్చరికలు చేశాడు. ఉదాహరణకు, ఇంటిలోని నిప్పును బయటికి

తీసు కెళ్ళ గూడదు. మన ఇంటికి ఇరుప్రక్కల ఉన్న ఇరుగు పొరుగు వారికి గూడ మన ఇంటిలోని నిప్పును ఇవ్వకుండా ఉండడం సాధ్యమా?'' అని కోటీశ్వరుడు ప్రశ్నించాడు.

ఈ అవకాశం తీసుకొని తన తండ్రి చేసిన పదిహెచ్చరికల అంతరార్థాన్ని అతనికి సంతృప్తి కలిగే దాక వివరించింది ఆమె.

కోటీశ్వరుని నోరు ఈ విధంగా మూతపడ్డది. ఇంక అతని దగ్గర ఆరోపణాస్త్రాలేమీ లేవు.

ఆమె అమాయకత్వాన్ని నిరూపించుకొన్నా, ఆత్మగౌరవం కల విసాఖా, మొదట తన మామ ఆదేశించి నట్లుగా ఇల్లు విడిచి వెళ్ళాలను కొంది.

కాని ఈలోపు కోటీశ్వరుని దృష్టిపూర్తిగా మారి పోయి, తెలియని తనంతో అన్న మాటలకు కోడలిని క్షమాపణ కోరక తప్ప లేదు.

సహనశీలి అయిన విసాఖా, తన నిజమైన బౌద్ధ స్ఫూర్తితో, అతనిని క్షమించింది. కాని ఒక షరతు పెట్టింది: ''తన కిష్టమైన రీతిలో తన ధర్మ కార్యక్రమాలు నిర్వహించు కోవడానికి పూర్తి స్వేచ్ఛ ఉండాలి''. ఈ షరతుకు ఆమె మామ వెంటనే అంగీకరించాడు.

ఇక విశాఖా బుద్ధుణ్ణి భిక్షకు పిలవడంలో ఏమాత్రం ఆలస్యం చేయ లేదు. బుద్ధుడు వచ్చాడు. తన భిక్షను ఆరగించాడు. భోజనానంతరం బుద్ధుడు ఒక ధర్మోపన్యాసం చేశాడు. కోటీశ్వరుడు ఒక తెరచాటున కూర్చొని, ఆ ఉపన్యాసాన్ని విన్నాడు. ఆ ఉపన్యాసాంతంలో అతడు సొతాపన్ను డయ్యాడు. నిజమైన ముక్తి మార్గంలోకి తనను దింపి నందుకు కోడలికి అనంతంగా కృతజ్ఞతలు తెలుపుకొని, ఉద్వేగం పట్టలేక ఇక నుంచి ఆమెను తన తల్లిగా భావిస్తానని చెప్పాడు.

మరు రోజు బుద్ధుడు ఆమె ఇంటికి వచ్చాడు. ఈ సారి ఆమె అత్తగారు, ధమ్మబోధను విని సొతాపన్న అయింది.

ఆమె తెలివితేటలతో, ఉపాయంతో, ఓర్పు సహనాలతో, తన భర్త ఇంటిలోని వారి నందరిని మార్చి, బౌద్ధులను చేసింది.

ప్రతిదినమూ విసాఖా తన ఇంటిలోనే బౌద్ధ సంఘానికి భిక్ష ఇవ్వ సాగింది. ఆమె ఉదయం సాయంత్రం, బౌద్ధ సంఘం అవసరాలు చూడడానికి, బుద్ధుని బోధలు వినడానికి విహారానికి వెళ్ళేది. సుప్రియ అనే మరో బౌద్ధమహిళ, ఆమెతో పాటు, ఆమెకు తోడుగా విహారానికి వెళ్ళేది.

విసాఖా చాల ఉదారమైనది. బౌద్ధసంఘానికి ఎంతో సేవ చేసింది. ఒకసారి ఆమె బుద్ధుని వద్దకు వెళ్ళి ఎనిమిది వరాలు కోరింది:

1. తాను జీవించి ఉన్నంత వరకు బౌద్ధసంఘానికి వస్త్రాలివ్వడానికి,

2. శ్రావస్తి వచ్చే భిక్షువులకు భిక్ష ఇవ్వడానికి,

3. శ్రావస్తి నుంచి వెళ్ళే వారికి భిక్ష నొసంగడానికి,

4. రోగగ్రస్తులైన భిక్కులకు ఆహారాన్నివ్వడానికి,

5. రోగులకు పరిచర్య చేసే వారికి అన్నం పెట్టడానికి,

6. రోగగ్రస్త భిక్షువులకు మందు మాకు ఇవ్వడానికి,

7. భిక్షువులకు బియ్యపు గంజిని ఇవ్వడానికి, ఇంకా

8. సన్యాసినులకు స్నానవస్త్రాలను (Bathing garments) ఇవ్వడానికి.

బుద్ధుడు ఈ వరాలను ఆమెకు ప్రసాదించాడు.

ఒకరోజు విసాఖా, తన తండ్రి కట్నం క్రింద ఇచ్చిన మంచి దుస్తులను ధరించి ఆరామానికి వెళ్ళడం జరిగింది. ఇంత ఉల్లాసంగా ధరించిన ఇటువంటి దుస్తులతో బుద్ధుని సందర్శించడం బాగుండదని భావించి, ఆ వలువలను విప్పి, మూటగట్టి, ఒక బానిస పిల్లకు ఇచ్చి, తాను తన మామగారిచ్చిన మరో దుస్తులు వేసుకొని వెళ్ళింది. ధర్మోపన్యాసం అయి పోయిన తరవాత బానిస పిల్లతో గూడ ఆరామాన్ని విడిచి వెళ్ళింది. కాని ఆ బానిస పిల్ల తన కిచ్చిన వలువల మూట మాట మరిచింది. గౌరవనీయ ఆనందుడు ఆ వలువల మూటను చూశాడు. ''తరువాత దానిని స్వంతదారుకు అప్పగించవచ్చునని, జాగ్రత్తగా దానిని దాచి ఉంచమని బుద్ధుడు ఆనందునికి చెప్పాడు. బుద్ధుని ఆదేశం మేరకు దానిని ఆనందుడు దాచి ఉంచాడు. అనుకోకుండ తనసేవిక ఆ మూటను మరచి వచ్చిందని గ్రహించిన విసాఖా, ''నీవు వెళ్ళి ఆ మూటను తీసుకురా, ఆనందులు దానిని తాకకుంటేనే సుమా'', అని హెచ్చరించి పంపింది. జరిగిన సంగతి అంత విసాఖాకు వివరించిన మీదట, ఆమె బుద్ధుని దగ్గరకు వెళ్ళి, '' ఆ దుస్తులు అమ్మగా వచ్చిన ధనంతో ఏదైనా మంచి పని చేయాలని నా కోర్కె'' అని విన్నవించింది. సంఘం ఉపయోగం కోసం తూర్పు ద్వారం వద్ద ఆశ్రమాన్ని నిర్మించ వలసిందని బుద్ధుడు ఆమెకు సలహా ఇచ్చాడు. అంత విలువైన వస్త్రాలు కొనే తాహతు, ఎవరికి లేని కారణాన, చివరకు తన దుస్తులను తానే కొనుక్కొని, ఆశ్రమాన్ని ఎంతో ఖర్చుపెట్టి కట్టించింది. దానికి ''పుబ్బారామ'' మని పేరు పెట్టింది. విసాఖా ఆహ్వానంతో,

బుద్ధుడు అతని శిష్యులు ''వస్సావాస,'' వర్షాకాలాన్ని ఈ కొత్తది, విశాలమైన ఆరామంలో గడిపారు. బుద్ధుడు ఈ విధంగా ఆరు వర్షాకాలాలు గడిపేటప్పటికి విసాఖా సంతోషానికి మేర లేదు.

పనిలో ఏమరిలి నందుకు బానిస పిల్లను చివాట్లు వేసి ఉండవలసింది. కాని దయామయి అయిన విసాఖా అలా చేయ లేదు. ఆ ఆరామ నిర్మాణం ద్వారా వచ్చిన పుణ్యంలో కొంత భాగాన్ని ఆమెకు పంచి ఇచ్చింది. ఎందు కంటే ఆ బానిస పిల్ల ఏ మరిపాటు వల్లనే ఈ మంచి పనికి ఆమెకు ఒక అవకాశం లభించింది. – ఈ సంగతి గ్రంథాలు వాకొంటున్నాయి.

అనేక సందర్భాలలో బుద్ధుడు విసాఖాకు అనేక బోధలు చేశాడు. అందులో ఒక ఉపన్యాసంలో గృహస్థులు (laymen) ఎనిమిది పవిత్ర దినాల (ఉపోసథ)లో పాటించ వలసిన ఎనిమిది ప్రబోధనల (అష్టశీలాల) గురించి చెప్పాడు. వీటిని ఈ రోజుకు కూడ ఆసియాలో బౌద్ధ దేశాలన్నీ పాటిస్తూనే ఉన్నాయి.

ఒక స్త్రీ పుణ్యాజన్మలు (Happy States) ఎత్తడానికి అనుసరించే ఎనిమిది గుణాలను గురించి బుద్ధుడు ఇలా చెప్పాడు:

'' ఉత్సాహంతో అతనిని మనసు నందు నిలుపు కోవాలి
ఆమెకు ఎప్పుడూ సంతోషం చేకూర్చే అతనిని
చిన్నచూపు చూడ కూడదు. మంచి భార్య
ఎప్పుడూ అతనికి కష్టం కలిగించే మాట అనదు.
ఆమె భర్త గౌరవించే వారందరిని గౌరవిస్తుంది, ఆమె
తెలివైంది కనుక. చతురతతో, చురుకుగ, సకాలంలో
ఆమె అతని సంపదను, పనిచేసే స్వజనం మధ్య, జాగ్రత్తగా కాపాడుతుంది. అందరికి మృదువుగ
ఆదేశాలిస్తుంది. భర్త కోర్కెలకు, సంకల్పాలకు అనుగుణంగా
వర్తించే ఇటువంటి భార్య, ప్రియమైన దేవతలు ఎక్కడ
నడయాడుతారో, అక్కడ జన్మిస్తుంది''[10].

మరో ఉపన్యాసంలో బుద్ధుడు, ఈ లోకంలోను తరువాతి లోకంలోను సుఖసంతోషాలతో ఉండాలనుకొనే స్త్రీలకు ఎనిమిది గుణాలను గురించి ముచ్చటిస్తూ, ఇలా అన్నాడు:

“ ఓ విసాఖా! ఇక్కడ సమర్థ, సరైన భార్య, తన భర్తకు సంతోషకరమైన పద్ధతులలో, సేవకులను దారిలో ఉంచి, అతని సంపదను పరిరక్షిస్తుంది.

“ ఓ విసాఖా, ఇక్కడ శ్రద్ధలోను, శీలంలోను, చాగం (త్యాగం)లోను, ప్రజ్ఞలోను స్త్రీ నేర్పరితనం గలిగిన దవుతుంది.”[11]

ఆమె సమగ్ర గుణశోభిత కావడంతో, సంఘానికి సంబంధించిన అనేక కార్యాలలో ముఖ్యపాత్రను నిర్వహించ వలసి వచ్చింది. ఒక్కోమాటు, బుద్ధుడే ఆమెను, భిక్కుని సంఘాలలో తలెత్తిన తగవులను తీర్చడానికి, నియోగించే వాడు. ఆమె జోక్యం కారణంగానే కొన్ని ప్రవర్తన నియమాలను (వినయ) భిక్కునిలకు ఏర్పరచ వలసి వచ్చింది.

ఆమె ఉదార చరిత అయిన కారణాన, ఆమెను బుద్ధ ధమ్మ పోషకురాలుగా హితకారిణిగా, బుద్ధుని అనుయాయులలో అతి గొప్ప స్త్రీగా పరిగణించారు.

ఆమె ఉదాత్త నడవడికతో, సుందరశీలంతో, సభ్యత సంస్కారాలతో, మృదు భాషణంతో, పెద్దల యెడ నమ్రత, గౌరవాలతో, దురదృష్టవంతుల యెడ సహానుకంపతో, దయతో గూడిన ఆతిధ్యంతో, ధార్మికావేశంతో, తన నెరిగిన వారి అందరి హృదయాలను చూరగొంది.

పదిమంది తన కొడుకులు, పదిమంది కూతుళ్లు కలిగిన మహామాత ఆమె. ఆమె సంతానం అదృష్టవంతులు. ఆమె పూర్తిగా పండిపోయిన వయస్సులో, అంటే వంద ఇరవై సంవత్సరాల వయస్సులో, మరణించింది.

**పెంపుడు బిడ్డ జీవకుడు**[12]

జీవకుడు పేరుగాంచిన బుద్ధుని వైద్యుడు.

అతడు పుట్టగానే, వేశ్య అయిన అతని తల్లి, అతనిని ఒక బుట్టలో ఉంచి, వీధి ప్రక్కనే ఉన్న చెత్తకుప్పలో పార వేసింది.

ఆదారి వెంట వెళ్తున్న బింబిసారుని పుత్రులలో ఒకరైన అభయుడు, కాకులు పొడుచుకు తింటున్న ఆనిస్సహాయ శిశువుని చూసి, ఆ బిడ్డ ఇంకా జీవించే ఉందని తెలుసు కొని, దాదులను పెంచమని ఆదేశించాడు.

జీవించి ఉండగా దొరికాడు గనుక అతనికి జీవకుడని పేరు పెట్టారు. ఒక రాకుమారుడు అతనిని దత్తత తీసుకోవడంతో అతనిని ‘కొమారభచ్చ’ అన్నారు.

పెరిగిపెద్ద వాడై, ఒక పెద్ద వైద్యుడు, శస్త్ర చికిత్సకుడు అయ్యాడు. తీవ్రమైన తలనొప్పితో బాధ పడుతున్న ఒక కోటీశ్వరునికి రెండుసార్లు విజయవంతంగా శస్త్ర చికిత్స జరిపాడు.

అతడు బుద్ధుని రోజూ మూడు పూటల పరీక్షించే వాడు.

దేవదత్తుడు దొర్లించిన బండరాతి ముక్క బుద్ధుని కాలికి గాయం చేసి నప్పుడు, బుద్ధునికి వైద్యోపచారం చేసి, గాయం నయం చేసింది ఎవరో కాదు, జీవకుడే.

తన నివాసానికి అతి సమీపంలో ఆరామం ఉండడం బహువిధ ప్రయోజనమని గుర్తించిన అతడు తన మామిడి తోటలో ఒక ఆరామాన్ని నిర్మించాడు. ఈ ఆరామాన్ని సంఘానికి అర్పించే వేడుక పూర్తిగావడంతో, అతడు సోతాపన్ను డయ్యాడు.

మాంస భక్షణ సమస్యను వివరించే జీవకసుత్తను[13] బుద్ధుడు జీవకునికి చెప్పాడు. తండ్రిని హత్య చేసిన తరువాత అజాతశత్రువుని, బుద్ధుని వద్దకు తీసుకెళ్లింది జీవకుడే.

అతని ప్రార్థనను మన్నించే బుద్ధుడు, తన శిష్యులను శారీరక వ్యాయామం క్రింద ఊడ్చడం లాంటి పనులను చేయ వలసిందని ఆదేశించాడు.

**పాద సూచికలు:**

1. *Kindred Sayings,* 1, P. 272.
2. *Kindred Sayings,* 1, P. 273
3. See *Gradual Sayings,* IV, PP 264 - 265
4. See *Gradual Sayings* 11, PP. 77 - 78 *అంగుత్తరనికాయ,* 11, 4, 7, 1, PP 67 - 68
5. *మజ్జిమనికాయ,* 111, 43, P, 262 *Further Dialogues of the Buddha,* 11, PP. 302 - 305
6. *Kindered Sayings,* 1. P. 80
7. ఇక్కడ నిప్పు అవమానాన్ని సంకేతిస్తుంది.
8. నిర్గంథనాధ పుత్రుడు. ఇతనిని మామూలు జైనదర్శనస్థాపకుడైన మహావీరునిగా చెబుతారు. బుద్ధునికి అతడు ప్రసిద్ధ సమకాలీనుడు. అయితే వారిద్దరూ ముఖాముఖి ఎక్కడ కలుసుకొన్నట్లు దాఖలాలు లేవు. అతని అనుయాయులు ఇప్పటికీ భారతదేశంలో ఉన్నారు. అతని బోధలు మాత్రం భారత దేశం ఎల్లలు దాటి పో లేదు.
9. మామూలుగా చాంద్రమానంలో 1వ, 8వ, 15వ, 23వ దినాలను, ఉపోసథ లేదా పవిత్ర దినాలుగ

పరిగణిస్తారు. అప్పుడు గృహస్థులు ఈ దిగువ ఎనిమిది ఆదేశాలను (అష్టశీలాలను) పాటిస్తారు. అవి: 1) హత్య చేయకుండుట 2) దొంగతనం చేయకుండుట, 3) లైంగిక కార్యానికి దూరంగా ఉండడం. 4) అబద్ధమాడ కుండుట. 5) మదిరా పానం సేయ కుండుట. 6) మధ్యాహ్నం దాటిన తరువాతనే భోజనం సేయుట. 7) నృత్యం, గానం, సంగీతం, అనుచిత ప్రదర్శనలు, పూలమాలలు, అత్తరులు, భూషణాలు, అభ్యంజనం - వీటికి దూరంగా ఉండుట. 8) ఉన్నత, భోగ ఆసనాలు వుపయోగించకుండ ఉండడం.

వీటిని ఒక విధిగా కొన్ని సార్లు ఉపొసథ దినాలలోనే పాటించినా, మరొక వీలైన రోజున పాటించ డానికి అభ్యంతరం ఏమీ లేదు. కారణం ఏమిటంటే దీని ముఖ్య ఉద్దేశం మాటలను, చేతలను పంచేంద్రియాలను అదుపులో ఉంచడమే.

10. *Gradual Sayings,* IV, PP. 178 - 179

11. *Ibid,* IV PP. 177 - 178

12. ఈ కథ వినయ, మహావగ్గలో ఉంది.

13. మజ్జిమ నికాయ; 11, 5.

పదకొండో ప్రకరణం

# బుద్ధుని రాజపోషకులు

విభవశాలులకు ప్రణామాల, దానాల, విందుల
ఈ పోషణ మోస పూరితమైన బురద నేల.
మాంసంలో గుచ్చిన మొన దేలిన గునపం లాంటి దది.
తప్పుదారి నడిచే వానికి దాని నుంచి బయట పడడం దుస్తరం.
– మహాకశ్యప థేరగాథ **1053 (1056)**

**రాజు బింబిసారుడు**

రాజగహ ను రాజధానిగా చేసికొని మగధ నేలిన రాజు బింబిసారుడు. బుద్ధుని మొదటి రాజ పోషకుడు. పదిహేనవయేట సింహాసనం ఎక్కి నలభై రెండేళ్ళు పాలన చేశాడు.

రాకుమారుడు సిద్ధార్థుడు సన్యాసం గ్రహించి రాజగహ వీధులలో భిక్షకు తిరుగు తుండగా, రాజు తన రాజప్రాసాదం నుంచి అతనిని చూసి, అతని ఉట్టి పడే రాచ కళను, ఉదాత్త ప్రవృత్తిని చూచి, చాల సంతోషించాడు. అతడేవరో కనుగొని రావలసిందని వెంటనే వార్తాహరులను ఆదేశించాడు. భోజనానంతరం అతడు పాండవపబ్బత క్రింద విశ్రాంతి తీసు కొంటున్నాడని తెలుసు కొని, రాజు సపరి వారంగా, రాచ సన్యాసి వద్దకు వెళ్ళి, అతని జన్మస్థలం గురించి, వంశావళి గురించి వాకబు చేశాడు. సన్యాసి గౌతముడు సమాధానం చెప్పాడు:

''హే రాజా, తిన్నగా హిమాలయ పర్వత సానువులలో, ప్రాచీన కులాలు వసిస్తున్న కొసల రాష్ట్రంలో సుసంపన్నమైన, శక్తిమంతమైన రాజ్యం ఉంది. నేను సూర్యవంశజుడను. శాక్య తెగకు చెందినవాడిని. నేను ఇంద్రియ సుఖాసక్తుడను కాను. ఇంద్రియ సుఖాలలోని దుఃఖాన్ని (evil) గ్రహించి, సన్యాసం మంచిదని ఎంచి, ఉన్నతమైన దాని అన్వేషణలో బయలు దేరాను. నా మనస్సు కక్కడే ప్రశాంతి[1]''.

జ్ఞానోదయానంతరం తన రాజ్యానికి దయచేయ వలసిందిగా రాజు ఆయనను అభ్యర్థించాడు.

### బుద్ధుడు బింబిసారుని కలుస్తాడు

తన జ్ఞానోదయానికి ముందు బుద్ధుడు, బింబిసారుని కిచ్చిన మాట ప్రకారం, తన అర్హతులైన శిష్యగణంతో గయనుంచి మగధ దేశ రాజధాని అయిన రాజగృహకు వచ్చాడు. ఇక్కడ తాటి తోపులో ఉన్న సుప్పతిథ్థ తీర్థంలో విడిది చేశాడు.

బుద్ధుని ఆగమనవార్త అసమాన ధర్మబోధకుడుగా అతనికున్న ప్రఖ్యాతి నగరంలో వ్యాపించింది. అతడు వచ్చాడని విన్న రాజు, తన ప్రజలతో వెళ్ళి బుద్ధుని సాదరంగా ఆహ్వానించాడు. బుద్ధుని వద్దకు వెళ్ళి, గౌరవ పురస్సరంగా అభివాదాలుచేసి, ఒక ప్రక్కన కూర్చొన్నాడు. వచ్చిన ప్రజలలో కొంత మంది అతనికి నమస్కరించారు. మరి కొంత మంది చేతులు కట్టుకొని అభివాదం చేశారు. ఇంకొంత మంది తమను తాము పరిచయం చేసు కొన్నారు. ఇంకా కొంతమంది వినమ్రతతో నిశ్శబ్దంగా తమ తమ ఆసనాలను గ్రహించారు. జనబాహుళ్యం బుద్ధుని, గౌరవనీయ కశ్యపుని – ఇద్దరిని అత్యంత గౌరవంతో చూస్తున్నందున 'ఎవరు నాయకత్వం వహిస్తునారు? బుద్ధుడా, కశ్యపుడా? ఎవరు ఎవరి నాయకత్వం క్రింద పవిత్ర జీవితాన్ని సాగిస్తున్నారు?' అనే సమస్యను వారు తేల్చు కోలేక పోయారు. బుద్ధుడు విషయాన్ని పసికట్టాడు. అగ్నియాగాన్ని ఎందుకు త్యజించారని, అప్పుడు బుద్ధుడు, కశ్యపుని ప్రశించాడు. బుద్ధుని ప్రశ్నలోని గూఢార్థాన్ని పసి గట్టిన కశ్యపుడు, ''నేను నిరర్థకాలైన ఐంద్రియక సుఖాల కంటె మోహరాగ విరహితమైన, ప్రశాంతమైన నిర్వాణస్థితిని కావాలని కోరు కొన్నాను, గనుక అగ్నియజ్ఞాన్ని వదిలి వేశాను'', అని చెప్పాడు. దీని తరవాత అతడు బుద్ధుని పాదాల చెంత మోకరిల్లి, బుద్ధుని నాయకత్వాన్ని ఎరుక పరిచి, ఇలా అన్నాడు: ''నా గురువు, నా దేవుడు ఇతడే. ఉన్నతుడు ఇతడే. నేను ఆయన శిష్యుడను మాత్రమే.''

భక్తి ప్రపత్తులు గలవారు ఈ సంభాషణ[2] విని సంతసించారు. అంతట బుద్ధుడు తాను పూర్వ జన్మలో నారదుడుగా పుట్టి, మోహాన్ని వీడని పూర్వకశ్యపుని మార్చిన విధంగానే, ఇప్పుడూ, కశ్యపుని మార్చానని తెలియజేయడానికి, మహాకశ్యప జాతక కథను చెప్పాడు.

బుద్ధుడు ధర్మోపదేశంతో, వారందరిలోను 'ధమ్మచక్షువు' తెరుచు కొంది. రాజు బింబిసారుడు సోతాపత్తిని పొందాడు. బుద్ధుని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణుజొచ్చి, మరురోజు తన ప్రాసాదానికి భిక్షకు రావలసిందిగా, బుద్ధుని అతని శిష్యగణాన్ని ఆహ్వానించాడు. భోజనా నంతరం, బుద్ధుడు, ఎక్కడ వసిస్తాడో తెలుసుకో గోరాడు. దానికి బుద్ధుడు నగరానికి మరీ అంత దగ్గర, దూరంకాని, రాదలుచుకొన్న వారికి వీలైన, పగటి వేళ మరీ అంత జన సమ్మర్దం లేని, రాత్రి వేళ అంతగా ధ్వని లేని, గాలి బాగా వచ్చే,

జనులు ఏకాంతంగా ఉండడానికి తగిన, ప్రత్యేకంగా విడిగా ఉన్నచోటు బాగుంటుందని, చెప్పాడు.

తన వెదురు తోపైతే వీటన్నింటికి సరి పోతుందని రాజు తల పోశాడు. బుద్ధుడు అతని కిచ్చిన సర్వోత్తమ బహుమతికి బదులుగా బుద్ధుడు, అతని పరివారం ఉండడానికి అనువైన ఆదర్శవంతమైన విడిగా ఉన్న వెదురు తోపును బహూకరించాడు. ఈ వెదురు తోపును ''బిడాలారామం'' (ఉడుతల తోపు) అని గూడ పిలుస్తారు. దీనిలో బిక్షువు లుండ డానికి భవనం ఏదీ ఉన్నట్లు లేదు. నీడనిచ్చే చెట్లు, ఏకాంత ప్రదేశాలు మాత్రం ఉన్నాయి. ఏది ఏమైన ఇది బుద్ధుడు అతని శిష్యగణం నివసించ డానికి లభించిన ప్రథమ నివాసస్థల దానం. బుద్ధుడు వరుసగా మూడు వర్షాకాలాలను మరో మూడు వర్షాకాలాలను ఈ ప్రశాంతమైన 'వేలు వనారామం'[4] లో గడిపాడు.

ఈ మార్పుతో రాజు, ఆదర్శచక్రవర్తిగా నెలలో ఆరు రోజులు ఉపాసథను పాటించాడు.

రాజు మహా కొసలుని కూతురు, రాజు పసెనది (ప్రసేనజిత్తు) కొసలుని సోదరి అయిన కొసలాదేవి అతని విశ్వాస పాత్రురాలైన పట్ట పురాణి. అజాశత్రు ఆమె కొమరుడు. ఖేమ అతని మరో భార్య. ఈమె రాజుగారి నేర్పువల్ల బుద్ధ అనుయాయి అయింది. ఆ తరువాత ఈమె, భిక్కునిల సంఘ ప్రథమ మహిళా శిష్యురాలైంది.

అతడు మంచి రాజే అయిన ప్పటికి, అతని గత దుష్కర్మ వల్ల చాల దురదృష్టకరమైన, విషాద పూరితమైన అంతాన్ని అనుభవించాడు.

సింహాసన వారసుడైన రాకుమారుడు అజాతశత్రు దుష్ట దేవదత్త థేరుని ప్రోత్సాహంతో, తండ్రిని చంపి సింహాసనాన్ని ఎక్క ప్రయత్నించాడు. దురదృష్టవశాత్తు రాకుమారుడు బాహాటంగానే దొరికి పోయాడు. అనుకంప గలిగిన తండ్రి, అతని పాప కృత్యానికి శిక్షించ డానికి మారు, అతడాశించిన సింహాసనాన్ని అతనికి అప్ప చెప్పాడు.

కృతఘ్నుడైన కుమారుడు తండ్రిని కారాగారంలో బంధించి, ఆకలితో మరణించేట్టు చేసి, కృతజ్ఞతలు తెలుపు కొన్నాడు. అతని తల్లికి మాత్రమే స్వేచ్ఛగా రోజూ రాజు దగ్గరకు వెళ్ళే స్వేచ్ఛ ఉంది. విశ్వాస పాత్రురాలైన రాణి తన మొల సంచిలో రహస్యంగా ఆహారాన్ని తీసుకు వెళ్ళేది. దీనికి రాకుమారుడు అభ్యంతరం తెలిపాడు. ఆ తరువాత ఆమె ఆహారాన్ని తన సిగలో దాచి తీసుకు పోసాగింది. దీనికీ అతడు కాదన్నాడు. తరవాత ఆమె పన్నీటిలో జలకమాడి, తేనె, వెన్న, నేయి, బెల్లపు సాగు మిశ్రమాన్ని ఒంటికి పులుము కొని వెళ్ళేది. రాజు ఆమె శరీరాన్ని నాకి (lick) జీవించాడు. అతి జాగరూకుడైన రాకుమారుడు దీనిని పసిగట్టి, ఇహ తండ్రి దగ్గరకు వెళ్ళ రాదని తల్లిని ఆదేశించాడు.

రాజు బింబిసారునికి ప్రాణాలు నిలుపు కోవడానికి ఏమీ మార్గం లేదు. కాని, అతడు సొతాపన్నుడు (నదిని దాటిన వాడు) కావడాన ధార్మికానందాన్ని అనుభవిస్తూ కారాగారంలోనే వెనక్కూ ముందుకూ నడిచాడు. అంతిమంగా దుష్టరాకుమారుడు తండ్రి అంతాన్ని ఎలాగైనా చూడాలను కొన్నాడు. నిర్దాక్షిణ్యంగా, అతని అరికాళ్ళ చర్మాని ఒలిచి, ఉప్పుపెట్టి, నూనె వేసి మండే నిప్పులమీద నడిపించ మని తన మంగలిని ఆదేశించాడు.

మంగలిని చూసిన రాజు, తన కుమారుడు తన తప్పును గ్రహించి, దీర్ఘంగా పెరిగిపోయిన గడ్డాన్ని, తల వెండ్రుకలను తీసి వేయ డానికి అతనిని పంపి ఉంటాడని, తనను కారాగారం నుంచి విడుదల చేస్తాడని అనుకొన్నాడు. అనుకొన్నది ఒకటి. అయినది వేరొకటి. అతడు అకాల మృత్యువును పొందవలసి వచ్చింది. బర్బర రాకుమారుని అమానుషా దేశాలను మంగలి నిర్దయగా పాలించాడు. ఆ మంచి మహారాజు బాధతో మరణించాడు. అదే రోజున అజాత శత్రుకు పుత్రో దయమైంది. జనన, మరణాలు రెండింటిని తెలిపే లేఖలు రాజ ప్రాసాదాన్ని ఏక కాల మందే చేరాయి.

శుభవార్తను తెలిపే లేఖను మొదట చది వారు. వాహ్, ప్రథమ సంతానం యెడ అతడు చూపిన ప్రేమ అవర్ణనీయం! అతని శరీరం సంతోషంతో పులకిత మైంది. పితృప్రేమ అతని దేహంలోని ఎముకల మూలగలోకి ప్రాకింది.

వెనువెంటనే అతడు తన ప్రియమైన తల్లి దగ్గరకు వెళ్ళి ఆమెను ప్రశ్నించాడు: ''ప్రియమైన అమ్మా, నేను పసికందుగా ఉన్నప్పుడు నా తండ్రి నన్ను ప్రేమించే వాడా?''

''ఏమిటి నీ వనేది పుత్రా! నీవు నా గర్భంలో ఉండగా, నీ తండ్రి కుడి చేతి నుంచి కొంత రక్తాన్ని త్రాగాలనే విపరీత వాంఛ నాకు ఉండేది. దీనిని నేను పైకి చెప్ప సాహసించ లేక పోయాను. ఫలితంగా నేను పాలి పోయి, చిక్కి పోయాను. చివరకు నన్ను పట్టుకు పీడిస్తున్న ఆ అమానుష వాంఛను వెల్లడించమని బ్రతిమి లాడారు. సంతోషంగా మీ తండ్రి నాకోర్కెను అంగీకరించారు. నేను ఆ జుగుప్సాకరమైన ద్రావకాన్ని త్రాగాను. దైవజ్ఞులు నీవు తండ్రికి శత్రువు వవుతావని జోస్యం చెప్పారు. అలాగా నీకు అజాత శత్రు (పుట్టని శత్రువు) అని నామ కరణం చేశాడు. నేను కడుపు పోగొట్టు కోవాలని చూశాను. కాని నీ తండ్రి నన్ను నిరోధించాడు. నీవు పుట్టిన తరవాత నిన్ను చంపాలని ప్రయత్నించాను. మళ్ళీ నీ తండ్రి అడ్డు పడ్డాడు. ఒక సారి నీ వ్రేలి మీద బొబ్బలేచింది. అప్పుడు నిన్ను ఎవరూ నిద్రపుచ్చలేక పోయారు. కాని, రాజు కొలువులో న్యాయ నిర్ణయం చేస్తున్న నీ తండ్రి, తన ఒడిలోకి తీసు కొని, ఓదారుస్తూ, ఆ బొబ్బను నోటితో పీల్చి వేశాడు. అతని నోటిలో ఆ బొబ్బచితికింది. నా ప్రియమైన కుమారా, అది చీము నెత్తురు. దానిని నీ తండ్రి నీ మీది ప్రేమతో మింగివేశాడు.''

తక్షణమే అతడు బిగ్గరగా అరిచాడు: ''వెళ్ళండి, నా ప్రియమైన తండ్రిని వెంటనే విడుదల చేయండి!''

తండ్రి శాశ్వతంగా కన్ను మూశాడు.

అప్పుడు రెండో లేఖను అతని చేతిలో ఉంచారు.

అజాతశత్రు వేడి కన్నీటిని కార్చాడు. పితృ ప్రేమ అంటే ఏమిటో తండ్రి అయిన తరువాతే తెలిసి వచ్చింది.

రాజు బింబిసారుడు మరణించాడు. ఆ వెంటనే ఒక దేవతగా చాతుమ్మహారాజికస్వర్గంలో జన్మించాడు. జనవసభుడని నామకరణం చేశారు.

తరువాత అజాతశత్రు బుద్ధుని కలిశాడు. ఉపాసకులలో ఒక విశిష్ట ఉపాసకు డయ్యాడు. బుద్ధుని మరణానంతరం జరిగిన భిక్షు ప్రథమ స్నాత కోత్సవంలో ప్రముఖ పాత్రను నిర్వహించాడు.

**రాజు కొసల పసెనది (ప్రసేన జిత్తు)**

మహాకొసల రాజు కుమారుడు, శ్రావస్తి రాజధానిగా కొసల రాజ్యాన్ని ఏలిన పసెనది బుద్ధుని మరో రాజ పోషకుడు. అతడు బుద్ధుని సమ కాలీనుడు. అత డనేక కళలలో ఆరి తేరిన వాడవడం చేత, తను జీవించి ఉండగానే, అతనిని రాజుగా చేశాడు తండ్రి.

బహుశా అతడు బుద్ధధర్మ బోధ ప్రారంభించిన తొలి రోజుల్లోనే పరివర్తిత మయ్యాడు. సంయుత్తనికాయంలో ఇలా ఉంది: అతడొక సారి బుద్ధుని కలిసి అతని పూర్ణ జ్ఞానోదయాన్ని గురించి ప్రశ్నిస్తూ అతనిని వయస్సులో, దీక్షలో చిన్నవానిగా, యువకునిగా చెప్పాడు[5].

తిరస్కరించరాని, తృణీకరించరాని, వస్తువులు నాలుగు ఉన్నాయని బుద్ధుడు బదులు పలికాడు. అవి: క్షత్రియుడు సర్పము, నిప్పు, భిక్షువు[6] (సన్యాసి).

ఆ విషయం మీద రాజుకు బుద్ధుడు ఆసక్తికరమైన ఉపన్యాసం చేశాడు. ఆ ఉపన్యాసంతో రాజు సంతృప్తి చెందినవాడై, వెంటనే బుద్ధుని అనుయాయిగా మారిపోయాడు. అప్పటినుంచి అతడు మరణించే వరకు బుద్ధుని ప్రగాఢ అనుయాయిగానే మిగిలి పోయాడు. ఒక సందర్భంలో రాజు బుద్ధునికి సాగిలపడి, పాదాలంటి, వాటిని ముద్దుల[7]తో ముంచాడని చెప్పబడింది.

అతని పట్టపురాణి మల్లిక. భక్తి ప్రపత్తులున్న మహిళ. ధర్మాన్నెరిగిన మహిళ. రాజు ధార్మి కోత్సాహానికి ముఖ్య ప్రేరణ ఈమె. నిజమైన స్నేహితునిలా, అనేక సందర్భాలలో ఆమె అతనికి ధార్మిక మార్గ దర్శిగా పని చేయ వలసి వచ్చింది.

ఒకరోజు రాజు పదహారు అసాధారణ మైన కలల్ని కన్నాడు. వాటి అసలు అర్థం తెలియక అతడు మనస్సులో చాల మథన పడ్డాడు. ఆ కలలు రాబోయే కష్టకాలానికి సంకేతాలని, ఆ కష్టాల నుంచి బయట పడాలంటే విస్తృతంగా జంతుబలు లివ్వాల్సి ఉంటుందనీ, ఆయన బ్రాహ్మణ సలహాదారులు చెప్పారు. ఈ అమానుషమైన బలికి విస్తృత ఏర్పాట్లు గావించాడు రాజు. ఇదే జరిగి ఉంటే నిస్సహాయులైన అనేక జీవులు మరణించి ఉండేవి. రాణి మల్లిక జరగ బోతున్న ఘోర నేరమైన ఆటవిక చర్యను విని, ఆ కలలకు అర్థం బుద్ధునిచేత చెప్పించు కోవలసిందని అర్థించింది. ఈ లౌకిక బ్రాహ్మణుల స్వప్నావ గాహన కంటె బుద్ధుని అవగాహన చాల గొప్పది అని చెప్పింది. రాజు బుద్ధుని వద్దకు వెళ్ళి, వచ్చిన పని చెప్పాడు. పదహారు కలలను[8] చెప్పి, తాను వాటి అర్థం తెలుసుకో గోరుతున్నానని చెప్పాడు. అంతట బుద్ధుడు ఆ కలలకు పూర్తి అర్థాన్ని చెప్పాడు.

బింబిసారుని వలె కాక, రాజు కొసలునికి బుద్ధుని ఆధ్యాత్మిక, మార్గ దర్శక ఉపన్యాసాలు విన డానికి అనేక అవకాశాలు లభించాయి. సంయుత్త నికాయంలో 'కొసల సంయుత్త' అనే ఒక ప్రత్యేక విభాగం ఉంది. ఇందులో బుద్ధుడు రాజుకు ఇచ్చిన ఉపన్యాసాలు, బోధలు ఉన్నాయి.

ఒకసారి రాజు బుద్ధుని సమక్షంలో ఆసీనుడై ఉన్నాడు. దేహం నిండ పెరిగిన రోమాలతో, జడలతో, పొడ వాటి గోళ్ళతో అటుకేసి వెళ్తున్న కొంత మంది సన్యాసులను చూశాడు. అప్పు డతడు తన ఆసనం నుంచి లేచి, గౌరవ పురస్సరంగా వారికి అభివాదం చేసి, తన నామధేయాన్ని ఉచ్చరిస్తూ, ''నేను రాజు, కొసల పసెనదిని,'' అన్నాడు. వారు వెళ్ళి పోగానే అతడు బుద్ధుని వద్దకు వచ్చి, ఆ వెళ్ళిన వారు అర్హతులా? లేక అర్హతత్వం కోసం ప్రయత్నిస్తున్నవారా? అని తెలుసుకో గోరాడు. భౌతిక సుఖాల అనుభవిస్తున్న సాధారణ గృహస్థులకు వారు అర్హతులో కారో నిర్ణయించడం దుస్తరం అని అంటూ ఇలా కొనసాగించాడు బుద్ధుడు:

''ఒకనితో కలిసి ఉండడం ద్వారా మాత్రమే అతని శీలాన్ని అర్థం చేసు కోవాలి. అది గూడ కొద్ది కాలం పాటు కాదు, దీర్ఘ కాలం కలిసి ఉన్న తరవాతనే. ఈ పని చేయ వలసినవాడు ప్రమత్తుడు కాక అప్రమత్తుడై ఉండాలి. అంతేకాదు అతడు తెలివైన వాడై ఉండాలి. తెలివి హీనుడై ఉండ రాదు. అవతలి వాని నైర్మల్యాన్ని అతనితో భాషించి తెలుసు కోవాలి. కష్టాలు

వచ్చి నప్పుడే అతని మనోబలాన్ని చూడాలి. చర్చ ద్వారానే ఒకని జ్ఞానాన్ని తెలుసు కోవాలి. ఆ చర్చగూడ కొద్ది కాలం కాక చాల కాలం సాగిన తరవాతనే. ఈ చర్చ చేసే వాడు గూడ ప్రమత్తుడు గాక అప్రమత్తుడై ఉండి, తెలివి హీనుడు గాక తెలివైన వాడై ఉండాలి.''

పై విషయాలను క్రోడీకరిస్తూ బుద్ధుడు ఈ పద్యాలను చెప్పాడు:

బాహ్య వేషంతో ఒకడు ప్రఖ్యాతుడు కాడు.
చూసీ చూడకనే ఎవరూ దేనినీ విశ్వసించ రాదు.

శిష్యుల వినీత వేషంలో ఎక్కువమంది విశృంఖలలు
ఈ ప్రపంచలో కనిపిస్తారు. నకిలీ మృత్తికా కర్ణాభరణంలా,
లేదా ఇత్తడి నాణేనికి బంగారు నీరద్దినట్లుగా,

ముసుగులో దాగే కొంతమంది ప్రవర్తిల్లుతారు,
బయటికి అందంగా, ఉన్నతంగా, లోపల కశ్మలంతో[10]

రాజు కొసలుడు, ఒక పెద్ద రాజ్యానికి రాజుగ, పొరుగు దేశాలతో యుద్ధాలు లే కుండ ఉండడం అసంభవమైంది ఒకసారి అతడు తన మేనల్లుడు అజాతశత్రుతో తలపడక తప్ప లేదు. యుద్ధంలో ఓడిపోయాడు. దీనిని తెలుసుకొన్న బుద్ధుడు ఇలా అన్నాడు:

''విజయం ద్వేషాన్ని పెంచుతుంది. జితుడు బాధతో ఉంటాడు. జయాపజయాలను త్యజించిన వారు ధన్యులు.[11]''

మరో సందర్భంలో రాజు కొసలుడు అజాత శత్రుసైన్యాన్ని మొత్తాన్ని వశ పరచు కొని అజాత శత్రును మాత్రం వదిలి పెట్టాడు. దీనిని విన్న బుద్ధుడు ఈ క్రింది పద్యాన్ని చెప్పాడు. మేఘాలు వ్యాపించిన ఆధునిక ప్రపంచానికి ఆసందేశం ఎంతో అర్థవంతంగా ఉంటుంది:

''ఒకడు మరొకనిని కలుషితం చేయవచ్చు
తనలక్ష్యం నెరవేరే వరకు; కాని ఇతరులు
అతనిని కలుషితం చేసినప్పుడు, కలుషితుడైన
అతడు ఇతరులను కలుషితులను చేస్తాడు తిరిగి.
అతని దుష్కర్మ ఫలం పండే వరకు ఆ బుద్ధిహీనుడు
'ఇదే మంచి సమయం, ఇదే మంచి అవకాశం, అనుకొంటూ ఉంటాడు.'
కాని కర్మ ఫలం పండి నప్పుడు, అంతా కీడే ఎదురవుతుంది.

హంతకుడు తనను అంతం చేసే మరో హంతకుని సృష్టించు కొంటాడు.
విజేత తనను జయించే మరో విజేతను సృష్టించు కొంటాడు.
దూషించేవాడికి దక్కేది దూషణే, కంటకునికి కంటకం.
ఈ విధంగా కర్మ పరిపాకం చేత, ఇతరులను
చెరిపే వాడు, తాను తిరిగి చెరప బడతాడు[12].

స్త్రీల గురించి బుద్ధుడు రాజు కొసలునికి చెప్పింది స్త్రీ జనాళికి చాల ఆసక్తి కరమైన విషయం. అది వారిని ప్రోత్సాహ పరుస్తుంది గూడ. ఒకసారి బుద్ధునితో అతడు పవిత్ర విషయాల గురించి ముచ్చ టిస్తున్నాడు. ఇంతలో వార్తాహరుడు ఒకడు వచ్చి, అతని చెవిలో, రాణి మల్లిక ఆడుబిడ్డను కన్నదని చెప్పి వెళ్ళాడు. ఈ అసంప్రీతమైన వార్త రాజుకి రుచించ లేదు. ప్రాచీన భారత దేశంలో - చాల వరకు నేటికి గూడ - కుటుంబంలో ఒక ఆడపిల్ల అదనంగా కలవడం-అంటే ఆడపిల్ల పుట్టడం - సంతోషకర విషయంగా పరిగణించరు. కారణం కట్నాల బాధ. బుద్ధుడు, ఇతర మత ప్రవక్తల వలె కాక, స్త్రీలకు అనన్యమైన శ్రద్ధాంజలి ఘటించాడు. స్త్రీలకు అలంకారాలైన నాలుగు ముఖ్యశీల లక్షణాలను చెప్పాడు:

''నిజంగా కొంతమంది ఆడువారు (పురుషులకంటె) మంచివారు.
ఆమెను ఉద్ధానం చేయండి, పురుషుల దేవుడా.
ఆడు వారిలో తెలివైన వారు, శీలవంతులు, అత్తను - 'తల్లి దేవత'
గా భావించేవారు, పతివ్రతలు ఉన్నారు.

అటువంటి ఉదాత్త స్త్రీకి, ఒక రాజ్యాన్ని ఏలే, సాహస వంతుడైన పుత్రుడు కలుగనీ, ఓ దేవా''[13]

కొంత మంది స్త్రీ లైతే నిజంగా పురుషుల కంటె గొప్పవారు. '' ఇత్థి పి హి ఎకచ్చియా సెయ్యా'' - పదాలు బుద్ధుడు వాస్తవంగా ఉపయోగించినవి. స్త్రీకి అంతగా ఉన్నత అంతస్తు లేని భారత దేశంలో ఏ ఇతర మత గురువూ బుద్ధుని లా ధైర్యంతో అటు వంటి మాటలు ఉచ్చరించ లేదు.

నూట ఇరవై సంవత్సరాల వయస్సున్న నాయనమ్మ చని పోయి నప్పుడు రాజు చాలా దుఃఖించి బుద్ధుని వద్దకు వచ్చి, తల్లి లాగ సాకిన నాయనమ్మను బ్రతికించు కోవడానికి తనకు చేత నైనది ఏదైన చేసి ఉండే వాడినని చెప్పాడు. బుద్ధుడు అతనిని ఓదార్చి, ఇలా అన్నాడు: ''మానవులంతా మరణించే వారే. వారు మరణంతో అంత మవుతారు. వారు ఎదురు చూడ వలసింది మృత్యువే. కుమ్మరి కుండలను కాల్చినా, కాల్చక పోయినా అవి పగిలేవే. పగిలి అంత మవుతాయి. పగలడం వాటి భావిలో ఉంది.''[14]

రాజ్యంలో ఇతర ప్రాంతాలకు అతడు వెళ్ళి రావలసిన ఆవశ్యకత ఉన్నా, దొరికిన ప్రతి అవకాశాన్ని వినియోగించు కొని బుద్ధధర్మాన్ని వినే వాడు. బుద్ధునితో పవిత్ర సంభాషణం సాగించే వాడు. అటువంటి సంధర్భాలలో బుద్ధుడు చెప్పినవే 'ధమ్మచెతియ'[15], 'కన్నకత్థల'[16] సుత్తలు.

రాజుకొసల ముఖ్య సహచరి ఒక పుష్పలావిక కూతురు. ఆమె అతని కంటె ముందుగానే చని పోయింది. రాజు బింబిసారుని సోదరి అతని భార్యలలో ఒకరు. అతని సోదరిలలో ఒకరు బింబిసారుని భార్య, అజాతశత్రు తల్లి.

రాజు కొసలుని కొడుకు విదూదభుడు. ఇతడు, తండ్రి వృద్ధాప్యంలో ఉండగా, ఎదురు తిరిగాడు. శాక్యమహానామ కూతురు. ఈ పిల్ల వాని తల్లి బుద్ధుని బంధువు. ఇతని నానమ్మ ఒక బానిస పిల్ల. రాజు ఆమెను తన సహచరులలో ఒకరిగా తీసు కొన్నప్పుడు ఈ విషయం తెలియదు. శాక్యులు ఇతని నీచ వంశావళిని ఎత్తి చూపి అవమాన కరంగా మాటాడి నప్పుడు, విదూదభుడు పగ తీర్చుకోవ డానికి వారిని నాశనం చేయ ప్రయత్నించాడు. ఈ విదూదభుడు కారణంగానే, రాజు నగరం వెలుపల చావట్లో, ఒకే ఒక సేవకుడు తోడుండగా మరణించ వలసి వచ్చింది. రాజు కొసలుడు బుద్ధుని కంటె ముందుగానే మరణించాడు.

**పాదసూచికలు**

1. సుత్తని పాత, 3,1 పబ్బజ్జాసుత్త
2. ఏడో ప్రకరణం చూడండి.
3. నెం. 545
4. పాళీ 'ఆరామ' పదానికి 'తోట' అని మాత్రమే అర్థం. ఈ ఉదార దానాన్ని బుద్ధుడు అంగీకరించి నప్పుడు అందులో భవనాలు లేవు. కాని ఇప్పుడు 'ఆరామ' అనే పదాన్ని భవనాలతో కూడిన 'ఆశ్రమం'గా ఉపయోగిస్తున్నారు.
5. సంయుత్తనికాయ 1,3,1, P.68 *Kindred Sayings,* 1, P.94.
6. ఒక కుపితుడైన రాకుమారుడు, చిన్న వాడై నప్పటికి, నిర్దాక్షిణ్యంగా ఇతరులకు హాని చేయ గలడు. చిన్నపాము కాటైనా ప్రాణం తీయ గలదు. నిప్పురవ్వ చిన్నదైన దహించ గలదు. యువ సన్యాసి గూడ పెద్ద రుషి కాగలడు, ధార్మిక పండితుడు కాగలడు.
7. మజ్జిమనికాయ, 11,39 ధమ్మ చెతియ సుత్త P. 120, Middle Length Sayings, 11. P. 303.
8. *జాతక కథలు,* 1, 77, PP. 188-92.

9. సంయుత్త నికాయ, 1,3,1, P.68,. Kindred Sayings, 1. P. 93-127

10. *Kindred Sayings*, 1.PP. 104-106,

11. *Kindred Sayings*, 1,PP. 109, 110, ధమ్మపద, 201

12. *Ibid*, P. 110.

13. *Kindred Sayings*, 1, P. 111, సంయుత్తనికాయ, 1,3,16, P.86.

14. See, *Kindred Sayings*, 1, P.122

15. మజ్జిమనికాయ 1. 39

16. *ibid*, 1.40

పన్నెండో ప్రకరణం

# బుద్ధుని ధమ్మదూత్యం

''నేను అన్ని బంధాలు నుంచి విముక్తుడనయ్యాను,
ఆవిదివ్యం కాని, మానుషం కానీ, మీరూ ఓ భిక్కులారా!
అన్ని బంధాలనుంచి విముక్తులయ్యారు.''

– మహావగ్గ **1, 10**

విజయ వంతమైన, ఉపయోగ కరమైన బుద్ధుని, ధర్మ ధూత్యం నలభై ఏండ్లు కొనసాగింది. అతనికి జ్ఞానోదయమైన ముప్పై ఐదో ఏట నుంచి ఎనభయ్యో ఏట అతడు చని పోయే వరకు మానవాళిని అతడు తన ధర్మంతో సేవించాడు. మానవాళికి ఆదర్శప్రాయు డయ్యాడు. సంవత్సర కాల మంతా ఒక చోట నుంచి మరో చోటికి, ఒక్కొక్కప్పుడు ఒంటరిగా, కొన్ని సార్లు శిష్యగణంతో, ప్రజలకు ధర్మ బోధగావిస్తూ, వారిని సంసార బంధాల నుంచి విముక్తం చేస్తూ తిరిగాడు. వర్షాకాలంలో, జూలైనుంచి నవంబరు వరకు కురిసే ఎడతెరిపిలేని వర్షాల కారణంగా, అతడు తన కార్యక్రమాలను విరమించు కొనే వాడు. ఇది భారతదేశంలో ఆరోజుల్లో సన్యాసు లందరికీ పరిపాటే.

ఈ రోజుల్లోలాగే, ప్రాచీన భారతదేశంలో మూడు క్రమం తప్పని రుతువులు సాగేవి. అవి వస్సాన (వర్ష) హేమంత (చలి) జింహాన (వేడి) రుతువులు. వస్సాన లేదా వర్ష రుతువు ఆసాళ (ఆషాఢ) నుంచి అస్సయుగ (ఆశ్వయుజం) వరకు అంటే సుమారుగా జులై మధ్య కాలం నుంచి నవంబరు మధ్య కాలం వరకు కొన సాగేది.

వర్షాకాలంలో, కుండపోతగా కురిసే వర్షాల కారణంగా నదులు పొంగి పొర్లేవి. వీధులు జల మయ మయ్యేవి. వార్తా ప్రసారానికి అంతరాయం ఏర్పడేది. అందుకని ప్రజలు తప్పని సరిగా ఇళ్ళల్లోనే ఉండి పోవలసి వచ్చేది. అంతకు ముందు రుతువుల్లో తెచ్చి దాచుకొన్న తినుబండారాల మీద ఆధార పడి జీవించ వలసి వచ్చేది. ఈ కాలంలో ఒక చోటు నుంచి మరొక చోటుకు పోయి బోధ చెయ్యాలంటే సన్యాసులకు కష్ట మయ్యేది. అనేక రకాల జంతు, వృక్ష జీవజాలం ఎంతగా పెరిగి పోయే వంటే, ప్రజలు తమకు తెలియకనే కొంత జీవజాలాన్ని చంపేవారు. అందుకని సన్యాసులంతా, బుద్ధుని శిష్యులతో సహా, తమ పరిభ్రమణకాలను చాలించి, ఏకాంత ప్రదేశాలలో ఉండే వారు. తప్పని సరిగ బుద్ధుని, అతని

శిష్యగణాన్ని ఆరామాల్లో గడప వలసిందని లేదా విడిగా ఉండే వనంలో వసించ వలసిందని ఆహ్వానించే వారు. కొన్ని సార్లయితే వారు అరణ్యాలలోకి వెళ్లే వారు. ఈ వర్షాకాలంలో ప్రజలు బుద్ధుని చుట్టూ చేరి ఆయన ధమ్మబోధను వినే వారు. ఆ విధంగా బుద్ధుడు తమ సమీప ప్రాంతంలో ఉండడాన్ని చక్కగా వినియోగించు కొనేవారు.

**మొదటి ఇరవై సంవత్సరాలు**

కాశీలో మొదటి సంవత్సరం

ఆషాఢ పూర్ణిమ దివసాన తన మొదటి ఐదుగురు శిష్యులకు ధర్మచక్ర ప్రబోధం చేసిన తరవాత, మొదటి వర్షాకాలాన్ని కాశీ సమీపంలోని ఇసిపతన హరిణ వనంలో గడిపాడు. ఇక్కడ అతడు ఉండేందుకు ప్రత్యేక భవనం అంటూ ఏదీ లేక పోయె. ఈ సమయంలోనే యసని పరివర్తన జరిగింది.

రాజగహలో రెండు, మూడు, నాలుగు సంవత్సరాలు

రాజగహ మగధ దేశానికి ముఖ్య పట్టణం. దీనిని బింబిసారుడు ఏలుతున్నాడు. జ్ఞానోదయానికి ముందు తాను ఇచ్చిన మాట ప్రకారం బుద్ధుడు రాజు వద్దకు వెళ్ళగా, అతడు బుద్ధునికి, అతని శిష్య గణానికి వెదురు తోటను కానుకగా ఇచ్చాడు. ఇది నగరానికి అంత దూరంగానూ లేదు. అంత దగ్గరగానూ లేదు. అందుకని ఈ తోట ఉండడానికి చాల అనువుగా ఉంది. వరుసగా మూడు వర్షాకాలాలు బుద్ధుడు ఇందులోనే గడిపాడు.

వెసాలిలో (వైశాలిలో) ఐదో సంవత్సరం

ఈ సమయంలో వెసాలి సమీపంలోని మహా వనంలో గోపురశాలలో బుద్ధుడు ఉంటున్నాడు. అప్పుడు శుద్ధోధనుని ఆసన్న మరణాన్ని విన్నాడు. అప్పుడతని మృత్యు శయ్యా మందిరానికి వెళ్ళి ధమ్మబోధ గావించాడు. వెంటనే రాజు అర్హతు డయ్యాడు. ఆ తరవాత ఏడు రోజులు విముక్తానందాన్ని అనుభవించి గతించాడు. ఈ సంవత్సరంలో మహా పజాపతి గౌతమీ. అభ్యర్థన మీద భిక్కునీ సంఘాన్ని స్థాపించారు.

రాజు దహనక్రియలు పూర్తి అయిన తరవాత, బుద్ధుడు నిగ్రోధారామంలో ఉంటున్నప్పుడు, మహా పజాపతి గౌతమీ బుద్ధుని వద్దకు వచ్చి, స్త్రీలను సంఘంలో చేర్చు కోమని అర్థించింది. కాని బుద్ధుడు ఆమె అభ్యర్థనను మన్నించక, రాజగహ లోని గోపుర మందిరానికి విచ్చేశాడు. మహా పజాపతి గౌతమీ సన్యాసదీక్ష తీసుకోవాలనే పట్టుదలను వదలక, అనేకమంది శాక్య, కొలియ స్త్రీలతో కపిల వస్తు నుంచి రాజగహకు కాలి నడకన వచ్చింది. గౌరవనీయ ఆనందుని జోక్యంతో ఆమె, ఇతర స్త్రీలు సంఘంలో చేరగలిగారు.

అలహాబాద్ సమీపంలోని కొసంబి లోని మంకుల కొండ మీద ఆరో సంవత్సరం

కపిల వస్తులోని తవ బంధువుల గర్వవంణచడానికి ''ద్వంద్వాద్భుతా''న్ని (యమక-పాటి హారియ)* చేసినట్లుగానే, మళ్ళీ దానిని మంకుల కొండ మీద విముఖ అనుయాయులను తన మార్గంలోకి తిప్పుకోవ డానికి చేశాడు.

తావతింస స్వర్గంలో ఏడో సంవత్సరం

రాకుమారుడు సిద్ధార్థుడు జన్మించిన కొద్ది రోజులకే రాణి మహామాయ మరణించింది. తుసిత స్వర్గంలో ఆమె దేవతగా పుట్టింది. ఈ ఏడో సంవత్సరంలో, వర్షాకాలం మూడునెలలలో , తావతింస స్వర్గంలో దేవతలకు బుద్ధుడు అభిధమ్మాన్ని బోధించాడు. అతని 'తల్లి - దేవత' గూడ అతడు చెప్పేది వినడానికి వచ్చింది. ప్రతిదినం అతడు భూమి మీదకు వచ్చి, తన ధర్మోపన్యాస సారాంశాన్ని గౌరవనీయ సారిపుత్రులకు చెప్పేవారు. అదే ధర్మాన్ని వీరు తన శిష్యులకు పూర్తి వివరాలతో వివరించేవారు. ప్రస్తుతం మనకు లభించిన అభిధమ్మ పిటకంలో ఉన్నది, అతడు వివరంగా చెప్పినది, ఈ ధమ్మ బోధనని భావించ బడుతోంది.

ఈ ఉపన్యాసాలు వినడంతో, అతడి తల్లి అయిన దేవత సన్యాసిత్వంలో మొదటి దశను చేరిందని చెప్పబడింది.

ఎనిమిదో సంవత్సరం భగ్గజిల్లాలోని సుమ్సుమార రాతి వద్ద భెసకలా అరణ్యంలో గడిపాడు.

తొమ్మిదో సంవత్సరం కొసంబిలో

ఈ సంవత్సరమే, మాగందియా బుద్ధుని మీద కోపం పెట్టుకొని అవమానించ పూను కొంది.

మాగందియా మంచి అందమైన కన్య. తల్లిదండ్రులు ఆమెకు పెళ్ళిచేయడం లేదు. ఎందుకంటె, వచ్చే వరులంతా, వారి దృష్టిలో, ఆమెకు సరి పోయిన వారు కారు. ఒక రోజు

---

★ ద్వంద్వ అద్భుతం : శరీరంలో పై భాగం నుంచి జ్వాలలు, క్రింది భాగం నుంచి నీరు రావడం ''యమక - పాటి హారీయం''. శిష్యుల కెవరికి సాధ్యంకాని ఈ అద్భుతాన్ని బుద్ధుడు చేశాడు. ఎనిమిదో ప్రకరణం ఒకటో పాదసూచిక చూడండి (అనువాదకుడు)

బుద్ధుడు ప్రపంచాన్ని సర్వేక్షణం చేస్తు న్నప్పుడు, ఆ తలిదండ్రుల ధార్మిక స్థాయిని పరికించాడు. వారి మీది అనుకంపతో బుద్ధుడు వారి వద్దకు వెళ్ళాడు. అప్పుడా పిల్ల తండ్రి యజ్ఞాగ్నిని ప్రారంభిస్తున్నాడు. ఆ బ్రాహ్మణుడు బుద్ధుని శారీరక అందచందాలు చూసి, ముగ్ధుడై, అతడే తన కూతురుకు సరైన జోడీ అని ఎంచి, తను తిరిగి వచ్చేవరకు అక్కడే ఉండ వలసిందని బుద్ధునికి చెప్పి, తన కూతురును తీసుకు రావడానికి ఇంటికి పరుగు తీశాడు. ఈ సమయంలో బుద్ధుడు అక్కడ తన పాద ముద్రను గుర్తి, మరొక చోటికి కదిలి వెళ్ళాడు. బాగా అలంకరించు కొన్న కూతురుతో ఆ బాహ్మణుడు, అతని భార్య అక్కడకు వచ్చారు. అక్కడ అతని పాదముద్రను చూశారు. సంకేతాలను గుర్తించటంలో ఆరితేరిన అతడి భార్య, అది సాధారణ మానవుని పాదముద్ర కాదు. మోహరాగ, వికారాదులను జయించిన వాని పాదముద్ర అని అంది. ఆ బ్రాహ్మణుడు ఆమె చెప్పిన భావనను ఎగతాళి చేశాడు. దూరాన ఉన్న బుద్ధుని చూసి, తన కూతురును అతనికి అర్పించాడు. తాను ఎలా రాగాదులను జయించిందీ బుద్ధుడు అప్పుడు వర్ణించాడు.

''తృష్ణ, అరతీ, రాగా[1]లను చూసిన నాకు,
ప్రేమ వలని సుఖాలలో ఆసక్తి లేదు
ఈ దేహం ఏమిటి? మలమూత్రాలతో నిండినదే కదా?
దానిని నేను తాకను, కనీసం కాలితో గూడ''[2]

బుద్ధుని ధర్మం విన్న ఆ తల్లిదండ్రులు సన్యాసిత్వంలో మూడోదైన 'అనాగామి'ని పొందారు. కాని గర్విష్ఠి అయిన మాగందియా తనను బుద్ధుడు అవమా నించాడని భావించి, ఇలా తల పోసింది: ''తన అవసరం అతనికి లేక పోతే, అలాగని చెప్పడం సబబే. కాని అతడు తనను మలమూత్ర పూరితమని అంటాడా? అయితే సరే, నేను పుట్టిన వంశం, సామాజిక అంతస్తు, సంపద, యౌవన శోభలతో నాకు తగిన జోడీనే ఎంచుకొని, అప్పుడు ఈ గౌతమ సన్యాసికి బుద్ధి ఎలా చెప్పాలో ఆలోచిస్తాను.''

బుద్ధుని మాటలతో కుపిత అయిన ఆమె, అతని యెడ ద్వేషం పెంచుకొంది. ఆ తరువాత ఆమె ఉదయన రాజుకు దేవేరి అయింది. రాజుగారి దేవేరులలో ఒకరిగా తన అంతస్తును ఆసరా చేసు కొని, ప్రజలకు లంచం పెట్టి, బుద్ధుని తిట్టి, నగరం నుంచి వెళ్ళ గొట్టమని వారిని పురికొల్పింది. బుద్ధుడు నగరంలోకి రాగానే వారంతా బుద్ధుని, ''నీవు దొంగవు, బుద్ధి హీనుడవు, తెలివి తక్కువ వాడివి, ఒంటెవు, ఎద్దువు, గాడిదవు, పశువువు, జంతువువు, అంటూ తిట్టారు. నీకు ముక్తి ఆశ ఎటూ లేదు. నీవు ఎదురు చూడ వలసింది దండన మాత్రమే.''

గౌరవనీయ ఆనందుడు ఈ తిట్లను విన లేక, బుద్ధుని వద్దకు వెళ్ళి, ''దేవా ఈ నగర వాసులు మనలను తిడుతున్నారు. వేరే ఏదైనా చోటుకు వెళదాం.'' అని అన్నాడు.

''ఎక్కడకు వెళదాం, ఆనందా?'' బుద్ధుడు ప్రశ్నించాడు.

''మరో నగరానికి, దేవా,'' ఆనందుడు అన్నాడు.

''మరి అక్కడ గూడ మనలను తిడితేనో?'' బుద్ధుడు ప్రశ్నించాడు.

''ఇంకో నగరానికి దేవా,'' ఆనందుని సమాధానం.

''ఆనందా, ఈ విధంగా ఆలోచించడం కుదరదు. ఎక్కడ కష్టం ఎదురువుతుందో దానిని అక్కడే పరిష్కరించాలి. అప్పుడు మాత్రమే మరో చోటుకు పోవడం కుదురుతుంది. కాని ఆనందా, ఎవరు తిడుతున్నారు?'' బుద్ధుడు ప్రశ్నించాడు.

''ప్రతి ఒక్కడూ, బానిసలు, అందరూ, '' ఆనందుడు సమాధానం చెప్పాడు. ఆనందుని సహనం వహించ వలసిందని మందలిస్తూ బుద్ధుడు అన్నాడు:

''విల్లు నుంచి వదిలిన బాణాఘాతాలు తిన్న ఏనుగు యుద్ధ రంగంలో సహించి నిల బడ్డట్టే నేను ఆదూషణలను సహిస్తాను. వాస్తవానికి చాల మంది జనులు సుశిక్షితులుకారు.

''సుశిక్షిత గజ తురగాలను తీసుకు వస్తారు. రాజు సుశిక్షితమైన జంతువును ఎక్కుతాడు. దూషణ కతీతంగా నిగ్రహుడైన వాడే మనుషులలో శ్రేష్ఠుడు.

''శిక్షణ పొందిన కంచరగాడిదలు, అలా బాగా మేపిన సింధుగుర్రాలు, ఉన్నత దంత గజాలు మంచివి; కాని నిగ్రహుడైన మానవుడు వీటన్నింటి కంటె ఉత్తముడు.''[3]

మళ్ళీ ఆనందుని ఉద్దేశించి బుద్ధుడు ఇలా అన్నాడు: ''కలత చెందకు, వీళ్ళంతా మనలను వారం రోజులు మాత్రమే తిడతారు. ఎనిమిదోరోజు వారు నిశ్శబ్దం వహిస్తారు. బుద్ధులకు ఎదురైన ఏ కష్టమైనా, ఏడు రోజుల కంటె ఎక్కువ ఉండదు.''[4]

పదోసంవత్సరం పారివెయ్యకారణ్యంలో

బుద్ధుడు కొసంబి లో ఉండగా, భిక్కులలో రెండు పక్షాల మధ్య – ధమ్మం తెలిసిన వారు ఒక పక్షం, వినయం తెలిసిన వారు మరో పక్షం – మరుగు దొడ్డి సభ్యతకు సంబంధించిన నియమాలలో ఒక అల్పనియమం దగ్గర తగవు వచ్చింది. దేనిని బల పరిచే వారు ఆ పక్షంలో చేరి పోయారు. బుద్ధుడు కూడ ఈ తగవును తీర్చలేక పోయాడు. వారు తల బిరుసుతో బుద్ధుని సలహాను లెక్క చేయ లేదు. బుద్ధుడు తనలో తాను అనుకొన్నాడు: ''తోపులాడు

కొంటున్న ఈ గుంపు మధ్యలో నాకు ఊరట లేదు. అంతేకాదు, ఈ భిక్కులు నేను చెప్పేది వినిపించుకోవడం లేదు. నేను ఈ జన సంద్రాలను వది లేసి, ఏకాంతంగా ఉంటేనో?'' ఈ ఆలోచనతో, సంఘానికి చెప్పకుండా బుద్ధుడు పారిలెయ్యకారణ్యానికి వెళ్ళాడు. వర్షాకాలమంతా అక్కడ ఒక అందమైన సాల వృక్షం నీడలో గడిపాడు.

ఈ సమయంలోనే ఒక ఏనుగు, ఒకకోతి బుద్ధుని అవసరాలను తీర్చాయని ఒక కథ వలన మనకు తెలుస్తున్నది.[5]

పదకొండో సంవత్సరం ఇకనాలా బ్రాహ్మణ గ్రామంలో

ఈ దిగువ ఇవ్వ బడిన కసీభారద్వాజ సుత్త్ ను ఇక్కడే చెప్పడం జరిగింది.

ఒకసారి బుద్ధుడు మగధ దేశంలోని దక్షిణ గిరి అనే బ్రాహ్మణ గ్రామంలో ఇకనాలా వద్ద ఉన్నాడు. ఆ సమయంలో కసీభారద్వాజునికి చెందిన ఐదు వందల నాగళ్ళు విత్తనాలు ఎద పెట్టడానికి పూన్చ బడ్డాయి. ఆరోజు ఉదయం బుద్ధుడు దుస్తులు ధరించి, భిక్షాపాత్ర చేబూని, దీర్ఘ వసనాన్ని పైన వేసు కొని ఆ బ్రాహ్మణుడు పని చేస్తున్న చోటుకు వెళ్ళాడు. ఆ సమయంలో బ్రాహ్మణుడు అన్నాన్ని అందరికి పంచు తున్నాడు. ఆ అన్నం పంచే చోటుకు వెళ్లి బుద్ధుడు ఒక ప్రక్కగా నిలబడ్డాడు. కసీభారద్వాజుడు బుద్ధుడు భిక్షకోసం నిలబడడాన్ని గమనించాడు. బుద్ధుని కేసి చూసి అతడు ఇలా అన్నాడు. '' ఓ యతీ, నేను, దున్ని విత్తుతాను. అలా దున్ని విత్తిన కారణంగా, నేను తింటాను. ఓ యతీ, మీరు గూడ, దున్ని, విత్తండి. అలా దున్ని, విత్తి, తరవాత తినండి.''

''హే బ్రాహ్మణుడా, నేను గూడ దున్నుతాను, విత్తుతాను, తింటాను,'' అని బుద్ధుడు సమాధానం చెప్పాడు.

''కాని గౌరవనీయ గౌతముని కాడిని గాని, నాగలినికాని, నాగేటి కర్రునిగాని ములు గర్రను కాని, ఎద్దులను గాని మేము చూడం. అయినా గౌతము లంటున్నారు గదా 'నేను దున్నుతాను, విత్తుతాను, దున్ని, విత్తిన కారణంగా తింటాను' అని, ఇదెలా?'' అని బ్రాహ్మణుడు ప్రశ్నించాడు.

ఇంకా ఆ బ్రాహ్మణుడు బుద్ధునితో ఇలా అన్నాడు:

''మీరు వ్యవసాయదారుడినని చెప్పు కొంటున్నారు. కాని మీరు దున్నింది ఎక్కడా కనిపించదు. మిమ్మల్ని దున్నడాన్ని గురించి ప్రశ్నించాము గదా. మీదున్నడం ఏమిటో, మా కర్థ మయ్యేలాగ వివరించండి.''

బుద్ధుడు ప్రత్యుత్తర మిచ్చాడు:

''శ్రద్ధ (Confidence) అనేది విత్తనం, నిగ్రహం (తపస్సు) వర్షం. ప్రజ్ఞ నా కాడి, నాగలి. హిరి (వినీతత = modesty) నా నాగలి పోలు గర్ర. మనస్సు పగ్గం, సతీ (mindfulness) నా నాగలి కర్రు, ములు గర్రలు. 'నేను నా శరీరాన్ని, భాషణాన్ని అదుపులో ఉంచు కొంటాను. ఆహారం విషయంలో మితాన్ని పాటిస్తాను. నేను సత్య సంధతతో కలుపు మొక్కలను ఏరి వేస్తాను. అర్హతత్వాన్ని పొందడంతో ఎద్దులను వదిలివేస్తాను.

''పట్టుదల (విరియ = perseverence) నన్ను నిర్వాణానికి చేర్చే వాహనం. అది వెను దిరగ కుండ పోతుంది. వెళ్లిన తరవాత అది వాపోయే పనే లేదు.

''ఈ విధంగా దున్నడం జరుగుతుంది: మృత్యురాహిత్య ఫలాన్ని అది కాస్తుంది. ఈ దున్నడం జరిగిన తరవాత దుఃఖ విముక్తి జరుగుతుంది.'' అపుడు కసీభారద్వాజుడు పాలన్నంతో నింపిన ఇత్తడి పాత్రను బుద్ధునికి అందించి ఇలా అన్నాడు: ''గౌరవనీయ గౌతముడు పాలన్నం తిందురుగాక. మీరు నిజంగా వ్యవసాయ దారులే, ఎందు కంటే మృత్యు రాహిత్య ఫలాన్ని ఇచ్చే పంటను పండిస్తున్నారు గాబట్టి.''

బుద్ధుడు, ఆ ఆహారాన్ని పరిగ్రహించక ఇలా అన్నాడు:

''ఏవో నాలుగు మాటలు (పద్యాలు) చెప్పగా వచ్చిన దానిని నేను తినను. ఇది, ఓ బ్రాహ్మణా, రుషుల నియమం కాదు. జ్ఞానోదయం అయిన వారు అటువంటి ఆహారాన్ని పరి త్యజిస్తారు. ఈ నియమాన్ని పాటించడమే జీవితం.

''ఆ పరమ పవిత్ర, అనన్య, వ్యాధి కారకుడు గాని యోగికి, వేరే రకం పానీయాన్ని, అన్నాన్ని వడ్డించండి. ఎందు కంటే మంచి పనులు నాటాలను కొనే అతనికి అతడే క్షేత్రం లాంటి వాడు.''

పంద్రెండో సంవత్సరం వెరంజాలో

వెరఞ్జాకు చెందిన ఓ బ్రాహ్మణుడు, బుద్ధుడు వెరఞ్జాలో నలెరుని నింబ వృక్షం దగ్గర, తన శిష్యగణంతో ఉంటున్నాడని విని, అతని వద్దకు వచ్చి, తన శీలానికి సంబంధించిన అనేక ప్రశ్నలను వేశాడు. బుద్ధుడిచ్చిన సమాధానాలతో బహుధా సంతుష్టుడైన ఆ బ్రాహ్మణుడు, బుద్ధుని అనుయాయిగా మారి, బుద్ధుని అతని శిష్యులను ఆ వర్షాకాలం వెరఞ్జాలో గడప వలసిందని ఆహ్వానించాడు. బుద్ధుడు మామూలుగా మౌనంగానే తన అంగీకారాన్ని తెలిపాడు.

దురదృష్ట వశాత్తు ఇదే సమయంలో వెరఞ్జా కరువు వచ్చింది. బుద్ధుడు అతని శిష్యులు గుర్రాలకోసం ప్రత్యేకించిన ఆహారాన్ని తీసుకొని జీవించవలసి వచ్చింది. ఒక గుర్రాల వ్యాపారి అక్కడ దొరికే ముతక ఆహారాన్ని వారికి అంద జేశాడు. బుద్ధుడు ఆ ముతక ఆహారాన్నే పూర్తి సంయమనంతో గ్రహించాడు.

ఈ కాలంలోనే, ఒకరోజు గౌరవనీయ సారిపుత్రుడు, తన ఏకాంత ధ్యాన స్థితి నుంచి లేచి, బుద్ధుని సమీపించి, గౌరవ పురస్సరంగా ఈ విధంగా ప్రశ్నించాడు: ''ఏ ఏ బుద్ధ నియమాలు ఎక్కువకాలం నిలిచాయి? ఏవి నిలవలేదు?''

బుద్ధుడు సమాధానం చెప్పాడు : ''బుద్ధులు చెప్పిన విపస్సి, సిఖీ, వస్సభూలు ఎక్కువకాలం కొనసాగలేదు. కకుసంధ, కొనాగమ, కస్సప నియమాలు ఎక్కువకాలం కొనసాగాయి[7].''

దీనికి కారణం కొంత మంది బుద్ధులు ధమ్మాన్ని వివరంగా బోధించి, శిష్యుల ప్రవర్తనకు సంబంధించిన నియమావళిని తయారు చేసి, అమలు చేయక పోవడం, మరి కొంత మంది బుద్ధులు అమలు చేయడం.

అంతట సారిపుత్త గౌరవ పురస్సరంగా బుద్ధుని, సంఘ క్రమశిక్షణ కోసం, ప్రాథమిక నియమావళి (పాతిమొఖ్ఖ = Fundamental precepts)ని అమలు పరచ వలసిందని, అలాగైతే పవిత్ర జీవితం మన జాలుతుందని అభ్యర్థించాడు.

''సహనం వహించండి సారిపుత్తా, సహనం వహించండి.'' అని చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

''దానికో సమయం ఉంది. అది తథాగతునికి ఒక్కడికే తెలుసు. సంఘంలో కొన్ని మలిన పరిస్థితులు ఏర్పడే వరకు, తథాగతుడు శిష్యులకు క్రమశిక్షణ నియమాలను అమలు పరిచి, పాతిమొఖ్ఖను ప్రతిపాదించడు. ఆ మలిన పరిస్థితులు సంఘంలో ఏర్పడి నప్పుడే, తథాగతుడు వినయాన్ని అమలు పరిచి, ప్రాథమిక నియమావళిని ఆ మలిన పరిస్థితులను తుడిచి పెట్టడానికి, అమలు చేస్తాడు.

''సారిపుత్తా, సంఘం స్థిర పడి నప్పుడు, బలోపేతమై నప్పుడు, అభివృద్ధి చెంది నప్పుడు, పాండితీ ప్రకర్ష పెరిగి నప్పుడు, లాభాలు చేకూరి నప్పుడు, మలిన పరిస్థితులు ఏర్పడతాయి. అప్పుడు మాత్రమే తథాగతుడు వినయాన్ని ప్రకాశించి, ప్రాథమిక నియమావళిని అమలు చేస్తాడు.

''సారిపుత్తా, శిష్య సంఘంలో దుష్ప్రవృత్తి లేదు, బాధలు లేవు, మచ్చలు (దోషాలు) లేక శుద్ధమైంది. గుణగణాలతో స్థిర పడింది. నా ఐదువందల మంది శిష్యులలో చివరివాడు సోతాపన్నుడు. అతడు పతనం చెందడు. స్థిరచిత్తుడు. జ్ఞానోదయం అతడు తప్పని సరిగా పొంది తీరుతాడు.''[8]

వెరఞ్జా వర్షాకాలం వినయ పిటకలోని పారాజిక గ్రంథానికి ఉపోద్ఘాతం అవుతుంది.

వర్షాకాలాంతంలో బుద్ధుడు ధమ్మప్రవచన యాత్ర మీద సొరెయ్య, సంకస్స, కన్నకుజ్జ, పయాగలను తిరిగి, ఆ తరవాత నదిని దాటి, కొంతకాలం బెనారెస్‌లో ఉండి, అక్కడ నుంచి వెసాలికి తిరిగి వచ్చి, మహావనంలోని గోపుర మందిరంలో ఉన్నాడు.

పదమూడో సంవత్సరం చాలియ (రాతి) బండ మీద

పద్నాలుగో సంవత్సరం సావత్థి జెతవన ఆరామంలో

గౌరవనీయ రాహులుడు తన ఇరవయ్యో సంవత్సరం పూర్తి అవుతుండగా ఉన్నత దీక్షను స్వీకరించాడు.

పదిహేనో సంవత్సరం కపిలవత్థులో

తన కూతురు యశోధరను వదిలేసి నందుకు బుద్ధునియెడ కుపితుడైన రాజు సుప్పబుద్ధ దయనీయమైన మరణం ఈ సంవత్సరంలోనే సంభవించింది.

బుద్ధుడు తన జన్మస్థలంలో ఒక వర్షాకాలం మాత్రమే ఉన్నాడని చెప్పాలి.

పదహారో సంవత్సరం ఆలవీ నగరంలో

నరమాంస భక్షకుడైన ఆలవక రాక్షసుని పరివర్తన ఈ సంవత్సరంలోనే జరిగింది.[9]

భీకరమైన ఆలవక రాక్షసుడు బుద్ధుడు తన మందిరంలో ఉండడం చూసి కోపగించి, అతని వద్దకు వచ్చి, ఇంటి బయటికి రావలసిందని కోరాడు. ''అలాగే మిత్రమా'', అని బుద్ధుడు బయటికి వచ్చాడు. ''లోపలికి రా,'' అన్నాడు మళ్ళీ. బుద్ధుడు లోపలకి వచ్చాడు. అలాగే రెండో సారి, మూడో సారి అతడు ఆజ్ఞానించాడు. బుద్ధుడు అతని ఆజ్ఞను పాలించడం జరిగింది. కాని నాలుగోసారి ఆజ్ఞాపించే సరికి, బుద్ధుడు అతని ఆజ్ఞను తిరస్కరించి, అతనికి చేతనైంది చేసుకో మన్నాడు.

''అయితే నేను మిమ్మల్ని ఒక ప్రశ్నడుగుతాను,'' అన్నాడు ఆలవకుడు. ''నీవు సమాధానం చెప్పక పోతే, నిన్ను గందరగోళం చేస్తాను లేదా నీ గుండె చీలుస్తాను, లేదా నీ కాళ్లు పట్టుకొని గంగా నదిలో విసరి వేస్తాను.''

''లేదు మిత్రమా, ఈ ప్రపంచంలో ఎవరూ, బ్రాహ్మణులు గాని, సన్యాసులు గాని, బ్రహ్మలు, దేవతలతో కలుపుకొని, ఎవరూ నా ఆలోచనలను చెదరగొట్టి నన్ను కలత పెట్టడం గాని, నా గుండె చీల్చడం గాని, నన్ను కాళ్ళు పట్టు కొని గంగలోకి విసరడం గాని చేయ లేరు. అయినా మిత్రమా నీ ప్రశ్న అడుగు'', అన్నాడు బుద్ధుడు.

ఆలవకుడు ఈ దిగువప్రశ్నలను అడిగాడు:

''ఈ లోకంలో మనిషి పొందదగిన వాటిల్లో ఉత్తమమైంది ఏది?

ఏది ఆచరిస్తే సుఖం లభిస్తుంది?

అన్ని రుచులలోకి మధుర మైంది ఏది?

ఎలాంటి జీవితం ఉత్తమ మైంది?''

ఈ ప్రశ్నలకు బుద్ధుడు ఇలా సమాధానం చెప్పాడు:

''ఇక్కడ మనిషి పొంద దగిన వాటిల్లో ఉత్తమ మైంది విశ్వాసం. చక్కటి ధర్మాచరణం సుఖాన్నిస్తుంది.

''అన్ని రుచులలోకి సత్యం బహుతీపి.

''అవగాహనతో జీవించిన జీవితం అన్నింటి కంటె ఉత్తమ విధానం''

ఆలవకుడు బుద్ధుని మళ్ళీ ఇలా అడిగాడు:

''వరదను దాటడం ఎట్లా?

సముద్రాన్ని ఉత్తరించడం ఎట్లా?

దుఃఖాన్ని అధిగమించడం ఎలా?

పరిశుద్ధుడు కావడం ఎలా?''

బుద్ధుడు సమాధానం చెప్పాడు:

''విశ్వాసంతో వరదను దాటవచ్చు. అప్రమత్తతో సముద్రాన్ని,

ప్రయత్నంతో దుఃఖాన్ని అధిగమించవచ్చు. జ్ఞానంతో శుద్ధుడు కావచ్చు.''

ఆలవకుడు మరల ప్రశ్నించాడు:

''జ్ఞానం ఎలా వస్తుంది? సంపద ఎలా చేకూరుతుంది?

''ఖ్యాతి ఎలావస్తుంది? స్నేహితులు దేనితో బంధితులవుతారు?

''ఇహం నుంచి పరానికి పోవడంలో దుఃఖం కలగకుండే దెలా?''

బుద్ధుడు సమాధానంగా ఇలా అన్నాడు:

''అప్రమత్తుడు, తెలివైనవాడు అయిన వ్యక్తి విశ్వాసంతో, నిర్వాణానికి దారితీసే విశుద్ధులు చెప్పిన ధమ్మాన్ని వినడం ద్వారా జ్ఞానాన్ని ఆర్జిస్తాడు. ఏది సరైందో దానిని పట్టుదలతో దీక్షతో ఆచరించడం వల్ల ధనాన్ని పొందుతాడు. సత్య సంధత ద్వారా ఒకడు కీర్తిని ఆర్జిస్తాడు. ఔదార్యం స్నేహితులను బంధించి ఉంచుతుంది. సత్య సంధత, నీతి మత్తత్వం, ధైర్యం, స్వేచ్ఛ - అనే ఈ నాలుగు గుణాలున్న కుటుంబి మరణించి గూడ దుఃఖం చెందడు.

''సన్యాసులను గాని, బ్రాహ్మణులనుగాని అడుగిచూడు, సత్యం, ఆత్మనిగ్రహం, ఔదార్యం, సహనాల కంటె ఉత్తమమైంది ఏదైనా వారికి కనిపించిందేమో''.

బుద్ధుని మాటల్లోని అర్థాన్ని తెలుసుకొన్న ఆలవకుడు ఇలా అన్నాడు:

''ఇంకా నేను అనేకమంది సన్యాసులను, బ్రాహ్మణులను అడగ వలసిన పని ఏముంది? ఈ రోజు నా భావి సుఖ రహస్యాన్ని తెలుసు కొన్నాను.

''నా మంచి కొసమే బుద్ధుడు ఆలవీకి వచ్చాడు. ఎటువంటి దానాలు చేస్తే, ఫలం విస్తారంగా ఉంటుందో ఈ రోజు నేను తెలుసు కొన్నాను. పరమ జ్ఞానోదయమైన వానిని, ఉన్నత ధమ్మ పరిపూర్ణతను కీర్తిస్తూ, గ్రామ గ్రామానికి, నగర నగరానికి, వెళ్తాను.''[10]

పదిహేడో సంవత్సరం రాజగహాలో
పద్దెనిమిదో సంవత్సరం చాలియ (రాతి బండ వద్ద)
పందొమ్మిది, ఇరవై సంవత్సరాలు రాజగహాలో

**బుద్ధుడు-అంగులిమాల**

ఇరవయ్యో సంవత్సరంలో ప్రఖ్యాత హంతకుడు అంగుళిమాలను బుద్ధుడు పరివర్తనం కావించాడు.[11] మొదట్లో అతడి పేరు అహింసకుడు (అమాయకుడు). అతడి తండ్రి కొసల రాజుకు పురోహితుడు. నాడు అత్యంత ప్రఖ్యాతమైన తక్షశిల విద్యా కేంద్రంలో విద్య నార్జించాడు. అతడి గురువుకు ఆదర్శప్రాయుడైన ప్రఖ్యాత శిష్యుడు అయ్యాడు.

దురదృష్టవశాత్తు, అతని తోటి విద్యార్థులు అతనంటె అసూయ పెంచుకొని, లేని పోనివి కల్పించి చెప్పి, గురువు మనస్సు విరిచి, అతనికి వ్యతిరేకంగా విషబీజాలు నాటారు. ఆ ఆచార్యుడు, నిజమేదో అబద్ధమేదో పరిశీలింపకనే, అతని జీవితానికి అంతం పలక దలిచి, వేయి మంది మానవుల ఎడమ చేతి వ్రేళ్ళను గురు దక్షిణగా ఇవ్వ వలసిందని ఆజ్ఞాపించాడు.

ఆచార్యుల ఆజ్ఞకు బద్ధుడై, అయిష్టంగానే, కొసలలోని జాలిని అరణ్యానికి వెళ్ళి, గురుదక్షిణ కోసం జనాన్ని చంపడం మొదలు పెట్టాడు. ఈ విధంగా పోగు చేసిన వ్రేళ్ళను చెట్టుకు వ్రేలాడ గట్టాడు. వాటిని కాకులు గద్దలు నాశనం చేయడంతో, ఆ తరవాత అతడు వాటిని దండగా ధరించాడు. ఇలాగైతే ఎన్ని వ్రేళ్ళు దొరికింది, ఇంకా ఎన్నింటిని సాధించాల్సి ఉంది, అనే లెక్క తేలుతుంది. అందుకని అతడు అంగుళిమాలగా ప్రసిద్ధు, డయ్యాడు.

అతడు ఆవిధంగా 999 వ్రేళ్ళను సంపాదించిన తరవాత బుద్ధుడు రంగ ప్రవేశం చేశాడు. బుద్ధుని చూడగానే, అతనిని చంపడం ద్వారా తనకు కావలసిన సంఖ్యాపూర్తి అవుతుందని సంతోషించి కత్తిని తీసి గర్వంతో అతని వెంట పడ్డాడు.

అంగుళిమాల తన మామూలు వేగంతోనే ముందుకు నడిచినా, తన దగ్గరకు రాలేని విధంగా బుద్ధుడు తన మానసిక శక్తుల ద్వారా ఆటంకాలు కల్పించాడు. అంగుళిమాల. ఎంతగా పరుగెత్తినా బుద్ధుని అందుకో లేక పోయాడు. ఒగరుస్తూ, చెమటలు కక్కుతూ అతడు ఆగి పోయి కేకలు పెట్టాడు: ''ఓ సన్యాసీ, నిలబడు'' అని. బుద్ధుడు ప్రశాంతంగా అన్నాడు: ''నేను నడుస్తు న్నప్పటికి ఆగిపోయే ఉన్నాను. నీవూ, అంగుళిమాలా, ఆగిపో.'' ఆ బంది పోటు ఆలోచించాడు: ''ఈ సన్యాసులు నిజమే చెబుతారు, అసలు ఆగి పోయింది నేను, అయినా తానాగి పోయినట్లు చెప్పు కొంటున్నాడు. దీని భావమేమై ఉంటుంది?''

నిలుచొని అతడు ప్రశ్నించాడు:

''హే సన్యాసీ, నడుస్తున్న మీరు ఆగి పోయా మంటున్నారు!
ఆగి పోయిన నన్ను ఆగిపోలే దంటున్నారు మీరు!
మీ మాటలకు (నడుస్తున్న వారిని ఆగిపోయారని, ఆగిపోయిన
వారిని నడుస్తున్నారని చెప్పేమీ మాటలకు) అర్థం ఏమిటి సన్యాసీ?
మీరు ఆగి పోయారని, నేను ఆగి పోలేదని, మీరెలా చెబుతారు?''.
బుద్ధుడు మృదు మధురంగా ఇలా అన్నాడు:
''అవును, నేను ఆగిన మాట నిజం, ఎప్పటికీ ప్రాణుల యెడ
హింసను త్యజించడం ద్వారా.
నీవేమో, నీతోటి మానవులపై వేటు వేయడం మాన లేదు.
అందువలన ఆగింది నేను, ఆగంది నీవు.''[12]

అంగుళిమాల సత్కర్మ ఉపరితలానికి తోసుకొచ్చింది. ఆ వచ్చిన సన్యాసి ఎవరో కాదు, ఆ బుద్ధగౌతముడే తననుద్ధరించ డానికి అనుకంపతో అక్కడికి వచ్చాడని అతడు అప్పుడు తల పోశాడు.

ోని జాలిని అరణ్యానికి వెళ్ళి,
ఈ విధంగా పోగు చేసిన వ్రేళ్ళను
వేయడంతో, ఆ తరవాత అతడు
ఎ, ఇంకా ఎన్నింటిని సాధించాల్సి
మాలగా ప్రసిద్ధు, డయ్యాడు.

బుద్ధుడు రంగ ప్రవేశం చేశాడు.
లసిన సంఖ్యాపూర్తి అవుతుందని

ు నడిచినా, తన దగ్గరకు రాలేని
లు కల్పించాడు. అంగులిమాల
గరుస్తూ, చెమటలు కక్కుతూ
ు'' అని. బుద్ధుడు ప్రశాంతంగా
వు, అంగులిమాలా, ఆగిపో.''
చెబుతారు, అసలు ఆగి పోయింది
దీని భావమేమై ఉంటుంది?''

న్నారు!

ఆగిపోయిన
ంటి సన్యాసీ?
చెబుతారు?''.

ల యెడ

లేదు.

ఆ వచ్చిన సన్యాసి ఎవరో కాదు,
ృడికి వచ్చాడని అతడు అప్పుడు

వెంటనే అప్పటి కప్పుడే అతడు తన కవచాన్ని, ఖడ్గాన్ని త్యజించి, మారి పోయాడు. తరువాత, అతని అభ్యర్థన మీద, అతనిని సంఘంలో బుద్ధుడు, 'రా, ఓ భిక్కూ' అనే మాటతో చేర్చుకొన్నాడు.

అంగుళి భిక్కు అయ్యాడనే వార్త అంతట వ్యాపించింది. కొసల రాజు అతని పరివర్తన వార్త విని మిక్కిలిగా సంతోషించాడు. ఎందుకంటె అతని ప్రజలకు అతడు ఎప్పుడూ అపాయంగానే తయా రయ్యాడు.

కాని గౌరవనీయ అంగులిమాలకు మనశ్శాంతి లేదు. ఎందుకంటె అతని ఏకాంత ధ్యానంలో గూడ పాత జ్ఞాపకాలు పదే పదే వచ్చేవి. అతడు బలిగొన్న వారి దయనీయ ఆర్తనాదాలు వినిపించేవి. అతని పాపకర్మ కారణంగా, అతడు వీధుల్లోకి భిక్షకు వెళ్ళి నప్పుడు, రాళ్ళతో కర్రలతో కొట్టేవారు. పగిలిన తలతో, ఓడుతున్న రక్తంతో తిరిగి సంఘానికి వచ్చేవాడు. తన కర్మ ఫలాన్ని అనుభవిస్తున్నాడని అతనికి బుద్ధుడు గుర్తు చేసే వాడు.

ఒకరోజు అతడు మామూలుగా భిక్షకు వెళ్ళి నప్పుడు, ఒక స్త్రీ ప్రసవవేదనతో బాధపడడం చూశాడు. కరుణతో కంపితుడై, ఆ దయనీయ స్త్రీ వేదనను బుద్ధునికి నివేదించాడు. ఈ దిగువ సత్యవచనాలను ఉచ్చరించ వలసిందని బుద్ధుడు అతనికి సలహా ఇచ్చాడు. తరువాత ఆ సత్య వచనాలు ''అంగులిమాల పరిత్త,''గా ప్రఖ్యాతి చెందింది.

''సోదరీ, నేను ఆర్యకులంలో జనించిన తరవాత (అంటే, దీక్ష పుచ్చు కొన్న తరవాత) ఏ ప్రాణిని నేను తెలిసి అంతం చేయ లేదు. ఈ సత్యం ద్వారా నీవు నీ బిడ్డ ఆరోగ్యంగా (Whole) ఉందురు గాక!''

ఈ పరిత్తను అతడు అధ్యయనం చేసి, బాధ పడు తున్న ఆ సోదరి వద్దకు వెళ్లి, తెర ఈవల ఉన్న ఆసనంపై కూర్చొని, ఈ మాటలనే ఉచ్చరించాడు. వెంటనే ఆమెకు తేలికగా ప్రసవమైంది. ఈ పరిత్త సామర్థ్యం నేటికి ఉంది.

కాలక్రమంలో అంగులిమాల అర్హతత్వాన్ని పొందాడు.

బుద్ధునితో తన సంభాషణను దృష్టిలో ఉంచుకొని, అతడు ఇలా అంటాడు:

''కొందరు ఒత్తిడికి లొంగి పోతారు
మరి కొందరు కొక్కేనికి (Hook), వేరు కొందరు కొరడాకు.
కాని నేను, దండం కాని, ఖడ్గంగాని అవసరం లేని
వానితో వినీతుడ నయ్యాను.''[14]

బుద్ధుడు తన మిగతా ఇరవై ఐదు సంవత్సరాల జీవితాన్ని, అనాధపిండికుడు, మరో ముఖ్య దాత విసాఖాల దాతృత్వంతో నిర్మితమైన శ్రావస్తిలోని జేతవన ఆరామంలో గడిపాడు

**పాదసూచికలు**

1. మారుని ముగ్గురు కొమరితలు
2. *Buddhist Legends,* 1, P. 274
3. *ధమ్మపద,* vv. 320, 321, 322
4. *Buddist Legends* చూడండి. 1.P. 176
5. *ధమ్మపదట్ఠ కథా, 'కోసంబకవత్థు'*
6. సుత్తనిపాత 1,4, P. 12
7. వినయపిటక, 'సుత్తవిభంగ (పారాజికా)' PP. 1-11, 1.B. Horner, *Book of the Discipline,* 1. PP. 1-23
8. బుద్ధుడు గౌరవనీయ ఆనందుని ఉద్దేశించి మాటాడుతున్నాడు.
9. *సుత్తనిపాత,* 1:10, *ఆలవక సుత్త,* P. 31, Chalmers, *Teachings of the Buddha,* P.45.
10. *Kindred Sayings,* 1.PP. 276-278
11. *Psalms of the Brethem,* PP. 318-325. cf. *మజ్ఝిమనికాయ,* 11, 36, అంగులిమాల సుత్త, P. 197.
12. *Psalms of the Brethem,* PP. 320 - 321
13. Protective discourse
14. *Psalms of the Brethem,* P. 323.

పదమూడో ప్రకరణం

# బుద్ధుని దినచర్య

" బుద్ధుడు జాగరితుడయ్యాడు
జాగరితం చేయడానికి అతడు ధమ్మాన్ని చెబుతాడు "

– మజ్జిమనికాయ

ఈ భూమి మీద ప్రభవించిన అందరు మతాచార్యులలోకి అత్యంత శక్తి మంతమైన వాడు, క్రియాశీలకమైన వాడు బుద్ధుడు మాత్రమే. తన శారీరకావసరాలు తీర్చుకొనేటప్పుడు తప్ప, మిగతా రోజంతా అతడు ధమ్మ కార్యాలలోనే మునిగి పోయే వాడు. తన దైనందిన విధుల నిర్వహణలో అతడు చాల నియమ బద్ధంగా, వ్యవస్థా బద్ధంగా వ్యవరించే వాడు. అతని అంతరంగ జీవితం ధ్యాన, సంబంధి. నిర్వాణానంద సంబంధి. అతని బాహ్య జీవితం ప్రపంచ సముద్ధరణ కోసం స్వార్థరహిత సేవకు అంకిత మైంది. అతనికి జ్ఞానోదయం అయింది. ఇతరులకు జ్ఞానోదయం కలిగించి, జీవన బాధల నుంచి వారిని విముక్తం చేయాలని అతడు శాయశక్తుల ప్రయత్నించాడు.

అతడి రోజు ఐదుభాగాలుగా విభాజిత మైంది. అవి : (1) ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు (2) మధ్యాహ్నం తరువాత (3) మొదటి జాము (4) రెండో జాము (5) మూడో జాము.

**ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు**

మామూలుగా వేకువనే, బుద్ధుడు తన దివ్య నేత్రంతో, తానెవరికి తోడ్పడ గలనని ప్రపంచాన్ని సర్వేక్షిస్తాడు. ఎవరికైన అతని ఆధ్యాత్మిక సాహాయ్యం అవసర మను కొంటే, అనాహూతంగానే, ఎక్కువగ కాలి నడకన, కొన్నిసార్లు మనోశక్తులను ఉపయోగించి ఎగిరి వెళ్ళి, ఆవ్యక్తిని సరైన మార్గంలోకి తిప్పుతాడు. తప్పని సరిగ అతడు దుర్మార్గులు, మలినులను వెతుక్కుంటూ వెళతాడు. కాని అమలినులు, గుణవంతులు ఆయన్ను వెతుక్కొంటూ, వస్తారు. ఉదాహరణకు, బుద్ధుడు తనకై తానే, గజదొంగ, హంతకుడు అయిన అంగులిమాలను, దుష్టరాక్షసుడు ఆలవకుని, వెతుకొంటూ వెళితే, సచ్చీలి, యువ విసాఖా, ఉదార కోటీశ్వరుడు అనాధ పిండికుడు, మేధావులు సారిపుత్రుడు, మొగ్గల్లానలు, ఆధ్యాత్మిక మార్గనిర్దేశం కోసం ఆయన్ను వెతుక్కొంటూ వచ్చారు.

ఎవరికి ఆధ్యాత్మిక సేవలు అవసరమో వారికి వాటిని అందించే వాడు. ఎక్కడైన ఒక మామూలు గృహస్థ భిక్షకు అతనిని ఆహ్వానించక పోతే, రాజులు సాష్టాంగపడే అతడు, చేతిలో భిక్షాపాత్రతో, సందులు గొందుల గుండ, తాను ఒంటరిగా గాని, శిష్యులతోగాని భిక్షకోసం తిరుగుతాడు. మౌనంగా ప్రతి వాకిట ఒక్కమాట గూడ ఉచ్చరించ కుండ, ఏమి ఇస్తే దానిని తీసు కొంటాడు. ఏది భిక్షాపాత్రలో వేస్తే దానినే గ్రహిస్తాడు. ఆ తరవాత ఆరామానికి వెనుదిరిగి వెళతాడు. అతని ఎనభయ్యో ఏట గూడ, ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉన్నా, వైశాలి వీధుల్లో భిక్షకు కెళ్ళడం మాన లేదు.

మధ్యాహ్నానికి ముందు అతడు తన భోజనం పూర్తి గావిస్తాడు. భోజనా నంతరం ప్రజలకు చిన్న ఉపన్యాసం చేస్తాడు. వారిలో త్రి శరణాలను, పంచ శీలాలను ప్రతిష్ఠిస్తాడు. వారు సంఘంలో చేర దలుచు కొంటే వారికి దీక్ష నిస్తాడు. ఆ తరవాత తన మందిరానికి విశ్రాంతికి వెళతాడు.

**మధ్యాహ్నం తరువాత**

మధాహ్న భోజ నానంతరం ఆరామంలో అతడు తన ఆసనం స్వీకరించ గానే అతడు చెప్పే ధర్మార్థాన్ని వినడానికి భిక్కులంతా అక్కడకు వస్తారు. కొంత మందైతే, వారి వారి ప్రవృత్తులకు తగిన ధ్యాన వస్తువులను తెలుసు కోవడానికి వస్తారు. మరి కొందరైతే, తమ గౌరవాభి వందనాలను తెలియ జేయడానికి అక్కడకు వస్తారు. ఆ తరవాత అంతా తమ తమ గదులకు వెళ్ళి పోతారు.

శిష్యులకు ప్రవచనం అయిన తరవాత, విశ్రాంతి తీసుకోవ డానికి తన ప్రత్యేక సుగంధ మందిరానికి వెళతాడు. అతడు కావాలను కొంటే కుడిప్రక్కకు తిరిగి పండు కొని, సావధానంతో (mindfulness)తో అంటే అప్రమత్తతో నిదురిస్తాడు. లేవ గానే మహాకరుణా సంపత్తిని పొందు తాడు. తరువాత తన దివ్య నేత్రంతో, ప్రపంచాన్ని, అందులో ముఖ్యంగా ధ్యానం కోసం ఏకాంతంలోకి వెళ్ళిన భిక్కులను, ఇతర శిష్యులను, వారి కేమైనా అధ్యాత్మిక సాహాయ్యం అవసర మవుతుందనే ఉద్దేశంతో, పరికిస్తాడు. వారిలో ఎవరైన సరైన మార్గంలో లేక సలహా అవసరమై వారు దూరంలో ఉండడం తటస్థిస్తే, ఆయనే తన మనోశక్తులతో అక్కడకు వెళ్ళి, వారిని మందలించి, తన శాలకు వెళ్ళి పోతాడు.

సాయంత్రానికి ఉపాసకులు అతడు చెప్పే ధమ్మం వింటానికి అతని చుట్టూ చేరతారు. వారి అంతర్గత ప్రవృత్తులను, శీలాన్ని బుద్ధనేత్రం[1]తో పరికించి వారికి ఒక గంటసేపు ప్రవచనం చేస్తాడు. శ్రోతల్లో ప్రతి ఒక్కరు వేరు వేరుగా నిర్మితమైనప్పటికి, బుద్ధుని ఉపన్యాసం తనకు మాత్రమే ఉద్దేశిత మైందని ప్రతి ఒక్కడు భావిస్తాడు. బుద్ధుడు ధమ్మో పదేశం చేసే పద్ధతి అది. నీతి కథలతోను, అందరికీ అర్థమయ్యే ఉదాహరణలతోను తన ధర్మాన్ని బోధించి

మాత్రమే ఇతరులను తన ధర్మంలోకి మారుస్తాడు. ఎందుకంటె అతడు వారి ఉద్వేగాలకు కాక, బుద్ధికి పట్టేట్టు ప్రయత్నిస్తాడు.

మామూలు మనిషికి బుద్ధుడు ముందుగ ఉదారతా గుణాల గురించి, వినయం గురించి, దివ్యానందం గురించి చెబుతాడు. ధార్మిక విషయాలలో ముందుకు పోయిన వారికి, భౌతిక సుఖాల వలని దుఃఖాన్ని గురించి, పరిత్యాగంలోని మంచిని గురించి చెబుతాడు. ఇంకా బాగా ప్రగతి సాధించిన వారికి ఆర్యసత్యాల గురించి వివరిస్తాడు.

అంగులిమాల, ఖేమల లాంటి అరుదైన వ్యక్తుల సందర్భాలలో శ్రోతల హృదయ పరివర్తనకు మానసిక శక్తులను ఉపయోగిస్తాడు.

బుద్ధుని ఉన్నత బోధలు మామూలు జనాన్ని, మేధావులను ఇద్దరిని ఒకే విధంగా ఆకట్టు కొంటాయి. ఒక బౌద్ధకవి ఇలా పాడతాడు:

''జ్ఞానులకు సంతోషాన్నిచ్చే, మధ్యరకం వారి తెలివితేటలను పెంచే, మంద మతుల చీకటిని పారదోలే ఈ భాషణం అందరికీను.''[2]

ధనవంతులూ, పేదలూ, ఉన్నతులు అధోవర్గాలు - అందరూ తమతమ పాత విశ్వాసాలను వీడి నూతన శాంతి సందేశాన్ని స్వీకరించారు. శైశవ సాసన (సందేశం), బుద్ధ సందేశం, ఐదుగురు సన్యాసులను కేంద్రంగా చేసుకొని వెలసిన ఈ సాసన, వేలాదిగా జనంలోకి పాకి పోయింది. మొత్తం మధ్య భారతాన్నే ముంచి వేసింది.

**మొదటి జాము**

మొదటి జాము అంటే సాయంత్రం ఆరు గంటల నుంచి రాత్రి పదిగంటల వరకు. ఈ యామంలో భిక్కులు బుద్ధుని స్వేచ్ఛగా కలవ వచ్చు. వారి సందేహాలను తీర్చుకోవచ్చు. ధర్మ సూక్ష్మాలను చర్చించ వచ్చు. ధ్యానానికి సరైన వస్తువును బుద్ధుని నుంచి తెలుసుకోవచ్చు. బుద్ధబోధను విన వచ్చు.

**రెండో జాము**

రెండో జాము అంటే రాత్రి పది గంటలనుంచి నడిరేయి రెండు గంటల వరకు. ఈ సమయంలో, భౌతిక నేత్రానికి కనిపించని అంతరిక్ష వాసులు – దేవతలు, బ్రాహ్మలు – బుద్ధుని వద్దకు వచ్చి, ధమ్మాన్ని అడిగి తెలుసు కొంటారు. తరచుగా సుత్తలో కనిపించే వాక్యం: ''రాత్రి సగానికి మించి పోగా, అధిగమించిన శోభతో ఒక దేవత బుద్ధుని వద్దకు వచ్చి, గౌరవ పురస్సరంగా నమస్కరించి, ఒక ప్రక్కన నిలబడ్డాడు''. ఆ దేవతల ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు, చేసిన ఉపన్యాసాలు సంయుక్త నికాయంలో కనిపిస్తాయి.

**మూడో జాము**

మూడో జాము అంటే తెల్లవారుజాము 2 గంటలనుంచి ఉదయం 6 గంటల దాక. ఇది నాలుగు భాగాలుగా విభాజితమైంది. ఇందులో మొదటి భాగంలో అటు ఇటు పచారు చేయడం. ఇది అతనికి శారీరక వ్యాయామంగా ఉంటుంది. రెండో భాగంలో, అంటే 3 గంటలనుంచి 4 గంటలవరకు, కుడి-ప్రక్కకు ఒత్తిగిల్లి, తేలికగా నిద్ర పోతాడు. మూడో భాగంలో అంటే 4 గంటలనుంచి 5 గంటల వరకు అస్ఖలిత స్థితిని చేరి, నిర్వాణానందాన్ని అనుభవిస్తాడు. చివరి గంట అంతా, అంటే 5 గంటలనుంచి 6 గంటల వరకు, మహానుకంపతో (మహాకరుణా సంపత్తితో) తేలి పోయి, ప్రేమపూరిత కరుణను జీవులన్నింటి యెడ సారించి, వారి హృదయాలను కోమలం చేస్తాడు. ఈ గంటలో తన బుద్ధనేత్రాన్ని ప్రపంచం మీదికి సారించి ఎవరికైనా తానేమైనా చేయ గల నేమోనని చూస్తాడు. వారెంత దూరంలో ఉన్నప్పటికీ, గుణవంతులు, అతని సహాయం అవసరమైన వారు, అతనికి చాల స్పష్టంగా కనిపిస్తారు. మహాకరుణ కారణంగా, తనంతట తానే బుద్ధుడు వారి దగ్గరకు వెళ్ళి, వారికి అవసరమైన ధార్మిక సహాయాన్ని చేస్తాడు.

రోజంతా అతడు ధార్మిక విధులకే అంకిత మవుతాడు. ఇతర జీవుల వలె కాక, అతడు రాత్రిళ్ళు ఒక గంట మాత్రమే నిద్ర పోతాడు. వేకువన, ఉదయాన పూర్తిగా రెండు గంటలు పరిమితులు లేని ప్రేమతో ప్రపంచాన్ని పరివేష్టించి, కోట్లాది జీవులకు సుఖసంతోషాలను సంప్రాప్తం చేస్తాడు. ఐచ్ఛిక పేదరికాన్ని అనుభవిస్తూ, ఎవరికీ నొప్పి కలగని రీతిలో, భిక్ష గైకొంటూ, ఒక చోటు నుంచి మరో చోటుకు తన పరమధర్మాన్ని ప్రబోధిస్తూ, సంవత్సరంలో ఎనిమిది నెలల పాటు, నిర్విరామంగా అందరి క్షేమం కోరి అతడు ఎనభయ్యో ఏట వరకు కృషి చేశాడు.

ధర్మప్రదీపిక ప్రకారం ఈ మూడో జాము ఈ నాలుగు భాగాలుగా విభాజితమైంది

వ్యాఖ్యానాల ప్రకారం ఈ చివరియామం మూడు భాగాలుగానే విభాజితమైంది. మూడో భాగంలో బుద్ధుడు మహానుకంపతో తేలి పోతుంటాడు.

**పాదసూచికలు**

1. దుష్టతా సంబంధ జ్ఞానంతోను, అంతర్గత ప్రవృత్తుల (ఆసయానుసయ ఞాణ)తోను, విశ్వాసం, సతి, ఏకాగ్రత, బలం, జ్ఞానం (ఇంద్రియ పరోపరియత్తఞాణ) లాంటి శక్తుల జడత్వం, తీక్ష్ణతల జ్ఞానంతోను నిర్మిత మవుతుంది.

2. సతపఞ్ఞాసతక, V.78

పద్నాలుగో ప్రకరణం

# బుద్ధుని పరినిర్వాణం (మరణం)

''సూర్యుడు పగలు మాత్రం ప్రకాశిస్తాడు. చంద్రుడు రాత్రిళ్ళు మాత్రమే. కవచం ధరించిన రాజు రణ రంగంలో రాణ కెక్కుతాడు. బ్రాహ్మణుడు ధ్యానంతో విరాజిల్లుతాడు. కాని బుద్ధుడు రాత్రిం బవళ్ళు అని లేకుండా అన్నిట ఎప్పుడూ రాణిస్తాడు''.

– ధమ్మపద, V. 387

బుద్ధుడు అసాధారణుడు. అయినా అతడు మర్త్యుడే. జీవు లన్నింటికి లాగే ఆయనకు రోగం, రొమ్ము నొప్పి ఉంటాయి. క్షీణత ఉంటుంది. తాను తన ఎనభైయ్యో ఏట గతిస్తానని అతనికి తెలుసు. అతడు నిగర్వి కనుక తన కార్యకలాపాలకు కేంద్రాలైన శ్రావస్తి, రాజగృహ లాంటి ప్రఖ్యాత నగరాలలోనే కాక, దూరంగా, ప్రసిద్ధం కాని కుసీనారా లాంటి శివారులో తన అంతిమ శ్వాసను విడవ దలిచాడు.

బుద్ధుని మాటల్లో చెప్పా లంటే, అతడు ఎనభయ్యో ఏట ''అరిగి పోయిన బండి'' లా ఉన్నాడు. వయస్సులో వృద్ధుడే అయినా, సంకల్పంలో పటిమ తగ్గ లేదు. అందుకని సుదీర్ఘమైన, దుస్తరమైన మార్గాన్ని గౌరవనీయ ఆనందుని వెంట నిడుకొని ఉత్తరించాలను కొన్నాడు. అతని ముఖ్య శిష్యులైన, గౌరవ నీయులైన సారిపుత్రుడు, మొగ్గల్లానలు ఆయన కంటె ముందే మరణించారు. అలాగే రాహులుడు, యశోధరలూ.

అతడి అంతిమ యాత్రకు రాజగృహ ఆరంభ బిందువు.

రాజగృహ నుంచి బుద్ధుని ప్రయాణానికి ముందు, పితృ హంతకుడైన అజాతశత్రు, సుభిక్షంగా ఉన్న వజ్జియన్ గణతంత్ర రాజ్యం మీద దాడిచేయాలని అనుకొన్నాడు. తన దుష్ట ప్రణాళికకు బుద్ధుడు ఏమంటాడో కనుక్కు రమ్మని తన మంత్రిని బుద్ధుని వద్దకు పంపాడు.

**సంక్షేమ నిబంధనలు**

బుద్ధుడు ప్రకటించాడు 1) వజ్జియనులు తరచు సమావేశం అవుతున్నంత కాలం 2) వారంతా కలసిమెలసి ఉన్నంత కాలం, ఐక్యంగా తమ విధులను నిర్వర్తించినంత కాలం 3) చట్టం చేయని దానిని అమలు చేయనంత కాలం, చట్టం చెప్పిన దానికి ఎదురు తిరగ

నంత వరకు, బాగాపాతుకు పోయిన ప్రాచీన వజ్జియన్ల సిద్ధాంతాల కనుగుణంగా పని చేసినంత కాలం 4) వజ్జియన పెద్దలు చెప్పిన దానిని విని, వారిని గౌరవించి నంత వరకు, 5) వారి కుటుంబాలకు చెందిన స్త్రీలను, పిల్లలను బలాత్కారంగా నిలవరించ నంత కాలం లేదా ఎత్తుకు పోనంత వరకు, 6) బాహ్య, అంతర్గత పూజా వస్తువులను గౌరవించి పూజించి నంత కాలం, ధర్మబద్ధ పండుగలను వేడుకలను వదిలి పెట్ట నంత కాలం అర్హతులు రాజ్యప్రవేశం చేసిన తరువాత ప్రశాంతంగా జీవించ డానికి వీలుగ వజ్జియనులు వారికి అన్నివిధాల రక్షణ సౌకర్యాలను కల్పించి నంతకాలం - వారు (వజ్జయనులు) పతనం కా రాదు. అభివృద్ధితో ఉండాలని మనం ఆశించాలి.

వజ్జియన్లకు బుద్ధుడు చెప్పిన ఈ ఏడు సంక్షేమ నియమాలను విన్న ప్రధాన మంత్రి విస్సకార, యుద్ధంలో మగధరాజు వజ్జియన్లను జయించ లేడనే నమ్మకం కుదిరి, బుద్ధుని వద్ద సెలవు గై కొన్నాడు.

తన శిష్యుల సంక్షేమం కోసం, సరిగ్గా అలాంటి నియమాలనే ప్రభోదించ డానికి, ఈ అవకాశాన్ని తీసు కొన్నాడు. రాజగహ లోని తన శిష్యుల నందరిని రావించి ఇలా చెప్పాడు:

1) ''ఓ శిష్యులారా, భిక్కులంతా తరుచు కలిసి, సమావేశాలు జరుపుకొన్నంత కాలం; 2) భిక్కులంతా ఐక్యంగా ఉండి, ఐక్యంగా కదిలి, ఐక్యంగా సంఘ విధుల నన్నింటిని నిర్వర్తించి నంత కాలం; 3) అంతకు ముందు అమలులో లేని వాటిని అమలు చేయ నంత వరకు, ఉన్న వాటిని రద్దుచేయ నంత వరకు, అంతకు ముందే ప్రకటితాలైన నియమాలను పాటించి నంత కాలం; 4) సంఘ నాయకులను, పితరులను, అనుభవం గడించి సుదీర్ఘంగా దీక్ష వహించిన స్థవిరుల అనుభవాలను భిక్కులు గౌరవించి, పాలించి నంతకాలం, వారి భాషణాన్ని గౌరవించి నంత కాలం, 5) మరల మరల పునర్జన్మలకు దారి తీసే పెల్లుబికిన రాగ (లోభ) ప్రభావానికి లోను కానంత వరకు, 6) భిక్కులు ఒంటరిగా అరణ్యాలలో ఉన్నంత కాలం, 7) అంత వరకు రాని స్థితికి తోటి శిష్యులు వచ్చేట్లుగా, అంతకుముందే వచ్చి చేరిన వారు ప్రశాంతంగా ఉండే వీలుగ, భిక్కులు తమంత తామే సావధానం (Mindfulness) అభివృద్ధి చేసు కొన్నంత కాలం, పతనం కారు, అభివృద్ధి చెందుతారు . ఈ ఏడు సంక్షేమ నియమాలు భిక్కులు సరిగా పాటించి నంతకాలం, ఈ నియమాల గురించి భిక్కులకు సరిగా వివరించినంత కాలం వారు పతనం కారు. అభివృద్ధి చెందుతారు.''

అనంతమైన అనుకంపతో బుద్ధుడు మరో ఏడు సంక్షేమ నియమాల మీద భిక్కులకు జ్ఞానోదయం కలిగించాడు.

''భిక్కులు వ్యాపారంలో మునిగి పోనంత కాలం, ఊసు పోని కబుర్లలో కూరుకు పోనంత కాలం, నిద్రాళువులు కానంత కాలం, సమాజంలో బంధితులు కానంత వరకు, క్షుద్రవాంఛా ప్రభావితులు కానంత వరకు, దుష్టులతో సహవాసం చేయనంత కాలం, కలవనంత కాలం, చెడుకు ఉన్ముఖులు కానంత కాలం, అర్హతత్వాన్ని పొంద కుండ దిగువ స్థాయిలోనే ఆగి పో లేరు''

బుద్ధుడు ఇంకా ఇలా కొన్ని నియమాలను కలిపాడు: ''భిక్కులు ధార్మికంగా, వినీతంగా, ఋజు ప్రవృత్తితో, అభ్యసనంతో, ఎడ తెగని శక్తి మంతత్వంతో, సర్వదా సావధానంతో, పూర్తి జ్ఞానంతో ఉన్నంత కాలం భిక్కులు పతనం కారు. అభివృద్ధి చెందుతారు.''

**సారిపుత్రుని ప్రశంస**

ఇంకా అనేక ఇతర ప్రవచనాలతో భిక్కులకు జ్ఞానోదయం కలిగించిన బుద్ధుడు, గౌరవనీయ ఆనందుని సమేతంగా, రాజగృహ ని వదిలి, అంబలట్ఠికకు, అక్కడ నుంచి నాలందాకు వెళ్ళి, అక్కడ పావారికమామిడి తోపులో ఉండి పోయాడు. ఈ సమయంలో, గౌరవనీయ సారిపుత్రుడు బుద్ధుని కడ కేతెంచి అతని జ్ఞానాన్ని ప్రశంసించాడు: ''హేదేవా, స్వీయ జ్ఞానోదయ పరంగా, బుద్ధుని కంటె జ్ఞాని అయిన వాడు, గొప్పవాడు అటు సన్యాసులలోగాని, ఇటు బ్రాహ్మణులలో గాని, ఇక్కడ గాని, మరెక్కడ గాని, ఇంతకుముందు గాని, ఇప్పుడు గాని, భవిషత్తులో గాని లేరు, ఉండరు, ఉండ బోరు, అని చెప్ప డానికి నా కెంతో ఆనందంగా ఉంది.''

ఒక శిష్యుని నుంచి అటువంటి ప్రశంసను అంగీకరించని బుద్ధుడు సారిపుత్రునికి జ్ఞాపకం చేశాడు: ''సారిపుత్రా మీరు గత, భావి బుద్ధుల గుణాలను ఆస్వాదించ కనే అటువంటి ప్రశంసా గీతాలలో ఓల లాడుతున్నారు.''

జ్ఞానోదయం అయిన బుద్ధు లందరికి సంబంధించిన సన్నిహిత జ్ఞానం లే దంటూ, తనకు ధమ్మ వంశ క్రమం మాత్రమే తెలుసు నని గౌరవనీయ సారిపుత్రుడు చెప్పాడు. ధమ్మవంశ క్రమం అంటే పరమ బుద్ధతత్వాన్ని చేర్చే ప్రక్రియ. అంటే, పంచ బంధకాలను – 1) ఇంద్రియ వాంఛలను, 2) దుస్సంకల్పాన్ని, 3) సోమరితనం, జడతలను, 4) అవిశ్రాంతతను, గాఢాలోచనను, 5) డోలాయమానస్థితిని (సంశయం) – అధిగమించడం ద్వారాను, గాఢహృదయ మోహాలను బలహీనం గావించడం ద్వారాను,

నాలుగు రకాల సతీలో మనస్సును స్థిరీకరించడం ద్వారాను, సప్తజ్ఞానోదయ కారకాలను సరైన పద్ధతిలో పెంపొందించు కోవడం ద్వారాను బుద్ధ తత్వాన్ని ఆర్జించే ప్రక్రియ – అదే ధమ్మవంశ క్రమం.

**పాటలిపుత్త (పాటలీపుత్రం)**

నాలందా నుంచి బుద్ధుడు పాటలిగ్రామం చేరు కొన్నాడు. అక్కడ, మగధ ముఖ్య మంత్రులు సునీధరుడు, వస్సకా ముఖ్యమంత్రులు, శక్తిమంతులైన వజ్జయనులను తిరగ గొట్టడానికి కోటను నిర్మిస్తున్నారు. ఇక్కడ బుద్ధుడు ఒక ఖాళీగా ఉన్న ఇంటిలో ఉన్నాడు. తన అసాధారణ దృష్టితో బుద్ధుడు, వేల కొలది దేవతలు అక్కడ, ఇంకా అనేక చోట్ల తారాడడం చూసి, పాటలిపుత్త ముఖ్య నగరం అవుతుందని, అరియల వాస కేంద్రం, వ్యాపారకేంద్రం, అన్నిరకాల వస్తువుల మార్పిడి కేంద్రం అవుతుందనీ, కాని అది నిప్పు, నీరు, తగవుల వలన కలిగే మూడు అపాయాలకు గురవుతుందని జోస్యం చెప్పాడు.

బుద్ధుని రాక ను విన్న మంత్రులు ఆయనను, ఆయన శిష్యులను తమ యింటి కి భోజనానికి పిలిచారు. భోజనానంతరం బుద్ధుడు వారిని ఇలా మంద లించాడు:

''శ్రద్ధాళువు ఎక్కడైనా నివసించ నీయండి
అక్కడ అతడు సంఘీయులను, ఆత్మ నిగ్రహులైన మంచి
వారిని పోషించుగాక! అతని మంచి పనులతో లభించిన
పుణ్య ఫలాన్ని అక్కడ పరివేష్టించిన దేవతలకు అర్పించుగాక!
సమ్మానిస్తే వారు సమ్మానిస్తారు. గౌరవిస్తే వారు గౌరవిస్తారు. తిరిగి
తల్లి, తన ఏకైక పుత్రునికి ఎలా ప్రసన్నంగా ఉంటుందో వారూ
అతనికి ప్రసన్ను లవుతారు.
దేవతలు ప్రసన్ను లయిన వానికి అదృష్టం పడుతుంది''[1]

అతడు నగర సందర్శనం చేసి నందుకు గౌరవ సూచకంగా, అతడు నగరం విడిచి వెళ్ళిన (నిష్క్రమణ) ద్వారానికి ''గౌతమద్వారం'' అని, అతడు నదిని దాట టానికు కొన్న దోనెకు ''గౌతమ దోనె'' అని పేరు పెట్టారు. ఒక ప్రక్క అక్కడి వారంతా అతడు దాట టానికి ఏర్పాట్లు చేస్తుంటే, బుద్ధుడు గంగను తన మనోశక్తుల ద్వారా దాటి వెళ్ళి పోయాడు.

**భవిష్యత్ స్థితులు**

గంగ ఒడ్డునుంచి బుద్ధుడు కొటిగామకు వెళ్ళాడు. అక్కడనుంచి నదిక గ్రామానికి వెళ్ళాడు. అక్కడ ఇటుక రాతి మందిరంలో ఉన్నాడు. అప్పుడు ఆనందుడు బుద్ధుని వద్దకు వచ్చి, గౌరవ పురస్సరంగా, ఆ గ్రామంలో చని పోయిన అనేక మంది ఉత్తర గతులు ఎలా ఉంటాయని ప్రశ్నించాడు. బుద్ధుడు వారి భావి గతుల గురించి ఓపికగా సమాధానం చెప్పాడు: ఆర్య (శ్రేష్ఠ) శిష్యుడు తన భావిగతిని గురించి తనంత తానే తెలుసుకొనే విధంగా సత్య దర్పణాన్ని (Mirro of Truth) సంపాదించడం ఎలాగో అక్కడి వారికి బోధించాడు. ఆర్యశిష్యుడు ఈ విధంగా తన భావిని చూస్తాడు. ''జంతు లోకంలో గాని, పెత (ప్రేత) లోకం లో గాని, దుఃఖ, దుష్ట, హీన స్థితులలో గాని నాకు జన్మ ఉండదు. సొతాపన్నుడను గనుక, నాకు పతనం లేదు. అంతిమ జ్ఞానోదయం తప్పదు.''

**ధమ్మదర్పణం (ధమ్మాదాస)**

''హే ఆనందా, ధమ్మ దర్పణం అంటే ఏమిటి?

''ఇక్కడ శ్రేష్ఠుడైన శిష్యుడు, బుద్ధుని యందు పూర్ణ విశ్వాసం ఉంచుతాడు, తన గుణాలను ఈవిధంగా నెమరు వేసు కొంటూ:

''నిజంగా పరమ ఉన్నతుడు (బుద్ధుడు) పూర్తిగా జ్ఞానోదయం అయిన వాడు. జ్ఞానం, శీలం కలవాడు. సిద్ధించిన వాడు. అన్ని ప్రపంచాలను ఎరిగిన వాడు. వ్యక్తులకు బుద్ధి గరుపడం లో అసామాన్య సారధి. దేవతల మానవుల గురువు, సర్వజ్ఞాని, పవిత్రుడు'.

ఈ విధంగా ధమ్మ లక్షణాలను మననం చేసు కొంటూ ధమ్మంలో విశ్వాసం ఉంచుతాడు:

'' పరమ అధికృతుడు (బుద్ధుడు) ప్రతిపాదించిన ధమ్మం, ఎవరికి వారు తెలుసుకోవలసిందే. అది అప్పటికప్పుడు ఫలితాన్ని ఇస్తుంది. అన్వేషణకు ఆహ్వానం పలుకుతుంది. తరవాత నిర్వాణానికి దారితీస్తుంది. జ్ఞానులు ఎవరికి వారు అవగతం చేసుకో దగింది''.

''ఈవిధంగా సంఘం గుణాలను మననం చేసుకొంటూ, సంఘంలోని విశ్వాసం ఉంచుతాడు:

'బుద్ధ శిష్యసంఘ శీలం చాల గొప్పది. దాని నడత రుజు మార్గం. అది జ్ఞాన వంత మైంది. ఈనాలుగు జతలు ఎనిమిది మంది వ్యక్తులవుతారు. ఈ ఉన్నతుని శిష్య సంఘం

బహుమతు లివ్వడానికి, ఆతిధ్యం ఇవ్వ డానికి, కానుకలివ్వ డానికి, పూజించ డానికి, బహుధా తగినది. ఇది ప్రపంచానికే గుణంలో అసమానమైంది'.

''అటు వంటి శ్రేష్ఠుడైన శిష్యునికి అరియలు (శ్రేష్ఠులు) మెచ్చుకొనే విధంగా, అఖండమైన, మచ్చలు లేని అకలంకమైన, లోపరహితమైన, స్వేచ్ఛాయుతమైన, జ్ఞానుల మెప్పు వడసిన, వాంఛా కలుషితం కాని గుణశీలం లభిస్తుంది.''

నదిక నుంచి బుద్ధుడు అలరారుతున్న వెసాలి (వైశాలి) నగరానికి వెళ్ళాడు. అక్కడ అందమైన వేశ్య ఆమ్రపాలికి చెందిన వనంలో ఉన్నాడు. ఆమె రాకను ఊహించిన బుద్ధుడు, తన శిష్యులను చెదరని మనస్కులుగ అట్టిపెట్టడానికి, వారికి సతీని( అప్రమత్తతను = mindfulness) బోధించి, అలాగ పర్యాలోచనతో ఉండ వలసిందని చెప్పాడు.

**అంబపాలి (ఆమ్రపాలి)**

బుద్ధుడు తన మామిడి తోటకు వేం చేశాడన్న వార్త విన్న అంబపాలి, బుద్ధుని వద్దకు వెళ్ళి అతనిని అతని శిష్యులను మరుసటి రోజు భోజనానికి రావలసిందని ఆహ్వానించింది. లిచ్ఛవి కులీనుల ఆహ్వానాన్ని కాదని, **అతడు** ఆమె ఆహ్వానాన్నే అంగీకరించాడు. ఎందుకంటె వారి ఆహ్వానం ఆలస్యంగా అందింది. బుద్ధునికి భోజనం పెట్టే అవకాశాన్ని తాము చేజిక్కించు కోవాలనుకొని లిచ్ఛవి కులీనులు చాల ఎక్కువ సొమ్మును ఆమెకు ఇవ్వజూపి, తమకా అవకాశాన్ని ఇవ్వవలసిందని అర్థించారు. కాని ఆమె గౌరవ పురస్సరంగా వారి అభ్యర్థనను తిరస్కరించింది. ఆమె ఆహ్వానం మేరకు అతడు ఆమె ఇంట భోజనం చేశాడు. భోజనానంతరం, ఆంబపాలి, కాబోయే అర్హంత, చాల ఉదారంగా తన విశాలమైన మామిడి తోపును బుద్ధునికి, శిష్యులకు కానుకగా ఇచ్చింది.[2]

అది వర్షరుతువు కావడాన, బుద్ధుడు తన శిష్యులను వెసాలిలో లేదా ఆచుట్టుప్రక్కల కాలం వెళ్ళ బుచ్చ వలసిందని సలహా ఇచ్చాడు. బుద్ధుడు మాత్రం, చివరిదీ, నలభై తొమ్మిదోది అయిన తన 'ఆశ్రమాన్ని' (retreat) వెసాలి సమీపంలోని బెలువగ్రామంలో గడప నిశ్చయించాడు.

**బుద్ధుని అనారోగ్యం**

ఈ సంవత్సరం బుద్ధుడు ''తీవ్ర ఆనారోగ్యంతో బాధపడ్డాడు. తీవ్రమైన నొప్పులతో మరణాంతం బాధ పడ్డాడు.'' వజ్ర సంకల్పంతో, సతీ, పర్యాలోచనలతో, బుద్ధుడు తన బాధను పైకి చెప్పుకోకుండా అనుభవించాడు.

తాను ఎక్కువకాలం బ్రతకనని, బుద్ధునికి తెలిసి పోయింది. సంఘానికి తగు సూచనలు ఇవ్వకుండ, తనకు పరిచర్యలు చేస్తున్న శిష్యులకు ఏమీ చెప్పకుండ చని పోవడం సరైన పద్ధతి కాదని అతడు అనుకొన్నాడు. అందుకని తన సంకల్పంతో ఆనారోగ్యాన్ని అణచి, అర్హంతానందాన్ని నిరతం అనుభవించాలని నిర్ణయించు కొన్నాడు.

బుద్ధుడు కోలుకొన్న వెంటనే, గౌరవనీయ ఆనందుడు బుద్ధుని దగ్గరకు వచ్చి, అతడు కోలు కొన్నందుకు సంతోషాన్ని వెలి బుచ్చాడు. ఏమీ సందేశం ఇవ్వకుండ బుద్ధుడు గతించ దన్న ఆలోచన తనకు సంతృప్తి నిచ్చిందని చెప్పాడు.

బుద్ధుడు చిరస్మరణీయమైన, అర్థవంతమైన సమాధానం ఇచ్చాడు. ఆ సమాధానం బుద్ధుని అనన్య దృక్పథం ఏమిటో, ధమ్మం ఏమిటో, సంఘం ఏమిటో స్పష్టంగా తెలియ జెప్పింది.

**బుద్ధుని సమాశ్వాసనం**

''హే ఆనందా, సంఘం నా నుంచి ఏమి ఆశిస్తున్నది? నేను ధమ్మాన్ని బోధించడంలో గూఢ బోధ (esoteric) అని, సాధారణ బోధ (exoteric) అని తేడా చూపించ లేదు[3]. సత్యాల విషయంలో తథాగతునికి, ఒక గురువుకులా, మూసిన పిడికిలి ఏదీ లేదు. (ఏమీ దాచుకోకుండా చెప్పాడని అర్థం. గురువులు సాధారణంగా అంతా చెప్పరు). ఎవరైన అనుకో వచ్చు: 'నేను భిక్షుసంఘానికి నాయకుడనని, సంఘం నామీద ఆధారపడి ఉందని. అతడు (నేను) మాత్రమే సంఘానికి సంబంధించిన ఏ విషయం మీద నైనా నిర్ణయాలు చేయ వలసి ఉందని.

''ఆనందా తథాగతుడు అలా అనుకోవడం లేదు. భిక్కు సంఘాన్ని నడప వలసింది అతడు కాదు. సంఘం అతని మీద ఆధార పడి లేదు. అలాం టప్పుడు, సంఘానికి సంబంధించిన ఏవిషయం మీద నైన అతడు ఎందుకు ఆదేశా లివ్వాలి?

''ఆనందా, నేనూ వృద్ధుడ నయ్యాను, శిథిల మయ్యాను. అంత్యం సమీపించింది. ఇప్పుడు నాకు ఎనభై ఏళ్ళు వచ్చాయి. అరిగి పోయిన బండికి తాళ్ళు కట్టి నడిపి నట్లు, తథాగతుని శరీరం గూడ అతుకులతో నడుస్తోంది. ఆనందా, ఎప్పుడైతే తథాగతుడు (కొన్ని అనుభూతులను పెరికి వేయడం ద్వారా, వస్తువులను పట్టించుకోవడం ద్వారా) సంకేత రహిత మానసిక ఏకాగ్రతలోకి లంఘిస్తాడో, అప్పుడు మాత్రమే తథాగతుని దేహం ఆరోగ్యంగా ఉంటుంది.

''అందువల్ల ఓ ఆనందా, మీకు మీరే ద్వీపాలు కండి. మీకు మీరే శరణు. బయటి వారిని శరణు వేడ వద్దు. ధమ్మాన్ని మీ ద్వీపంగా స్వీకరించండి. దానినే ఆశ్రయించండి. బాహ్యాశ్రయం వలదు.

''ఆనందా, ఒక భిక్కు తనకు తానే ఒక ద్వీపంగా, ఒక ఆశ్రయంగా, బాహ్యాశ్రయం లేకుండ, ధమ్మమే ఆశ్రయంగా ఎలా జీవిస్తాడు?

''ఇక్కడ, ఓ ఆనందా, ఒక భిక్కు అవిశ్రాంతంగా, పర్యాలోచనతో, జాగరూకతతో, ఈ ప్రపంచం మీద లోభ బుద్ధి విడనాడి, అవిరళంగా శరీర వేదన, చేతన, ధమ్మాలకు సంబంధిచిన సతీని పెంపొందించు కొంటూ జీవిస్తాడు.[4]

''ఎవరైతే నామరణానంతరం తనకు తానే ఒక ద్వీపంగా, తనకు తానే ఆశ్రయమై, బాహ్యాశ్రయాన్ని కోరక, ధమ్మమే ఒక ద్వీపంగా, ధమ్మమే ఒక శరణ్యంగా, బాహ్యాశరణ్యం లేకుండ, ఇప్పుడుగాని, తరవాతగాని జీవితం గడుపుతారో, ఆ భిక్కులు 'వినయం' మీద ఏకాగ్ర చిత్తులైన వారిలో కెల్ల అగ్ర గాములుగా ఉంటారు.''

ఇక్కడ బుద్ధుడు, వ్యక్తి అమలినుడై, ఈతి బాధ నుంచి విముక్తి పొందే విషయంలో, వ్యక్తి ప్రయత్నానికి విశేష ప్రాధాన్యం ఇచ్చాడు. ఇతరులను ప్రార్థించడం వలన కాని, వారిమీద ఆధార పడడం వల్ల గాని ప్రయోజనం ఏమీ లేదు. ఇతరులను ఆశ్రయించ వద్దని బుద్ధుడు ఒక ప్రక్క బహిరంగంగా చెబుతుంటే, బౌద్ధులు ఎందుకు బుద్ధుని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణు వేడాలి? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. త్రిరత్నాలను (బుద్ధ, ధమ్మ, సంఘ) శరణు వేడడంలో, బౌద్ధులు బుద్ధుని విముక్తి మార్గం చూపే ఉపదేశకునిగా, ధమ్మాన్ని సాధనంగా, జీవితాన్ని జీవించవలసిన విధానానికి సంఘాన్ని ఉదాహరణగా స్వీకరిస్తారు. కేవలం వాటిని ఆశ్రయించి నంత మాత్రానే విముక్తి సాధ్యమని వారనుకోరు.

వృద్ధాప్యమూ, బలహీనతలు పైకొన్నా, బుద్ధుడు తనకు లభించిన అవకాశాన్నెల్లా, అనేక విధాల భిక్కుల ఉపదేశానికి వినియోగించు కోవడం మాత్రమే కాక, వ్యక్తి గత ఆహ్వానాలు లేనప్పు డెల్లా స్వయంగా తానే భిక్షకు వెళ్ళే వాడు. ఒక రోజు మామూలుగా వెసాలికి భిక్షకు వెళ్ళాడు. భోజ నానంతరం, ఆనందుడు వెంటరాగా, చాపాల చెతియకు వెళ్ళాడు. వెసాలి, ఇంక నగరంలోని దేవాలయాలు కలిగించిన హర్షాతిరేకాన్ని గురించి మాటాడుతూ ఆనందుని ఉద్దేశించి ఇలా చెప్పాడు :

''ఎవరైతే నాలుగు ప్రాథమిక విజయ సోపానాలను (చతుస్సిద్ధి పాదల=ఇద్ధిపాద)[5]ను ఆలవరుచు కొని, వృద్ధిచేసి, ప్రావీణ్యం సంపాదించి, వాటిని భూమిక చేసుకొని, అభ్యాసం

చేసి, తమవిగా చేసు కొంటారో, వారు కావాలనుకొంటే ఒక కల్ప (వంద సంవత్సరాల) కాలం లేదా ఇంకొంచెం ఎక్కువ కాలం (కల్పావశేషం) జీవించ గలరు. ఓ ఆనందా. తథాగతుడు వాటిని అలవరుచు కొన్నాడు, అభ్యసించాడు, వాటి మీద పట్టు సాధించాడు. వాటిని వృద్ధి చేశాడు, భూమికగా చేసు కొన్నాడు. అతడే కనుక కావలను కొంటే అతడు ఒక కల్పకాలంగాని, అంత కంటె కొంచెం ఎక్కువ కాలంగాని జీవించ గలడు.''

బుద్ధుడు అంతస్పష్టంగా సూచించి నప్పటికి, గౌరవనీయ ఆనందుడు దానిని సరిగా అవగాహన చేసుకో లేక పోయాడు. ''అందుకే బుద్ధుని, అనేకమంది మంచి కోసం, ప్రయోజనం కోసం, సుఖ సంతోషాల కోసం, ప్రపంచం మీది అనుకంపతో, దేవతల, మానవుల లాభం, క్షేమం, సుఖం కోసం, నూరేళ్ళు అంతకంటె కొంచెం ఎక్కువ కాలం జీవించ వలసిందని కోర లేక పోయాడని'' గ్రంథం చెబుతున్నది.

ఆ సమయంలో గౌరవనీయ ఆనందుని మనస్సు మారుని ప్రభావానికి లోనై ఉందని సుత్తం పేర్కొంటున్నది.

**బుద్ధుడు తన మరణాన్ని ప్రకటించాడు**

అన్ని రకాల జీవిత బాధలనుంచి విముక్తిగావించే ఒక అద్వితీయ మార్గాన్ని ఉపదేశించేందుకు, సత్యాన్వేషకులకు వస్తువుల యథారూపాన్ని బోధించేందుకు, బుద్ధుడు భూమి మీద అవతరించాడు. ఈ సుదీర్ఘ ధర్మసేవా కార్యక్రమంలో తనకు, తన అనుచరులకు తృప్తి కలిగే విధంగా పని చేశాడు. ఎనభైయ్యో యేట తాను వచ్చిన పని పూర్తి అయిందని అతడు భావించాడు. తన అనుచరులకు, ఉపాసకులకు, ఉపాసకులు కాని వారికి - అవసరమైన ఉపదేశం చేశాడు. వారు అతని ఉపదేశాన్ని బాగా జీర్ణించు కొనడమే కాక, ఇతరులకు దానిని ఉపదేశించే స్థితికి ఎదిగారు. ఆ కారణాన, తన మిగిలిన జీవితాన్ని అర్హ తానందాన్ని అనుభవిస్తూ, తన సంకల్ప బలంతో, తన అదుపులో ఉంచుకో దలచుకో లేదు. చాపాల చెతియ (చైత్యం)లో ఉండగా బుద్ధుడు, గౌరవనీయ ఆనందునికి, తాను మూడు నెలలో మరణిస్తానని ప్రకటించాడు.

అందరి మంచి, సుఖసంతోషాల కోసం, ఒక కల్పం (నూరు సంవత్సరాల) పాటైన జీవించమని బుద్ధుని గౌరవనీయ ఆనందుడు వేడు కొన్నాడు.

''చాలు ఆనందా, తథాగతుని వేడు కొన వద్దు. అటువంటి అభ్యర్థనకు సమయం మించి పోయింది''.

అప్పుడు బుద్ధుడు ఆనందునికి జీవితక్షణిక స్వభావాన్ని గురించి చెప్పి, మహావనంలోని గోపురశాలకు వెళ్ళి, వెసాలి చుట్టు ప్రక్కలున్న భిక్కులందరిని పిలవ నంప వలసిందిగా అతనిని కోరాడు.

అలా సమావేశమైన భిక్కులకు బుద్ధుడు ఇలా సందేశించాడు:

''ఈ పవిత్ర జీవితం దీర్ఘకాలం కొన సాగడానికి, ప్రపంచం మీది కరుణతో అందరి ప్రయోజనం కోసం, దేవతల, మానవుల క్షేమం కోసం, అది శాశ్వతంగా కొన సాగ డానికి, నేను బోధించిన సత్యా లన్నింటిని అధ్యయనం చేయండి, అభ్యసించండి, అలవరుచు కోండి, వాటిని అభివృద్ధిపరచండి.

''ఆ సత్యాలు ఏమిటి? అవి :
సతీ యొక్క నాలుగు భూమికలు
నాలుగు రకాల సమ్యక్ప్రయత్నం
నాలుగు సిద్ధి (accomphistments) సాధనాలు
ఐదు (శక్తు) (faculties)
ఐదు బలాలు (powers)
జ్ఞానోదయంలోని ఎనిమిది కారకాలు, ఇంక
ఆర్య అష్టాంగ మార్గం''[7]

ఆ తరవాత అతడు తన అంతిమ సందేశాన్ని ఇలా ఇచ్చి, బహిరంగంగా సంఘానికి తన మరణ సమయాన్ని ప్రకటించాడు:

''చూడండి భిక్కులారా, మీకు చెబుతున్నాను: ''ప్రత్యయాత్మక (conditioned) వస్తువులన్నీ క్షణ భంగురాలు. శ్రద్ధతో కష్ట పడి పని చేయండి అనతి కాలంలోనే తథాగతుడు గతి స్తున్నాడు. ఇప్పటి నుంచి మూడు నెలలకు తథాగతుడు గతిస్తాడు.

''నాకు వయస్సు పండింది. నా జీవితం హ్రస్వం. మిమ్మల్ని వదిలి నేను వెళ్తున్నాను. హే భిక్కులారా, శ్రమించండి. అప్రమత్తులు (సతీ)గా, గుణశీలురుగా ఉండండి. మీ మీ మనస్సులను నిరుష్ట నిర్దిష్ట ఆలోచనలతో సంరక్షించుకోండి. ఈ నిర్వహణంలో ఎవరైతే అప్రమత్తంగా ఉంటారో వారు ఈ జీవన పర్యాటకం నుంచి బయట పడ వచ్చు. అలా దుఃఖాన్ని అంతమొందించ వచ్చు''.

చివరిగా ఒక మాటు వెసాలి వైపు దృష్టి సారించి, గౌరవనీయ ఆనందునితో భందగామ వెళ్ళి, భిక్కులను ఉద్దేశించి ఇలా చెప్పాడు:

''నీతి, ఏకాగ్రత, జ్ఞానం, విముక్తి సర్వోన్నతాలు.

వీటన్నింటిని ప్రఖ్యాత గౌతముడు యధార్థం చేసు కొన్నాడు.

వాటి అర్థాన్ని ఆకళింపు చేసు కొనే, శిష్యులకు బుద్ధుడు ధమ్మాన్ని ఉపదేశించాడు.

దర్శనంతో గురువు దుఃఖానికి అంతం పలికి, అన్ని రాగాలను ఆర్పివేశాడు.''

**నాలుగు మహోపదేశాలు**

అక్కడ నుంచి, గ్రామం నుంచి గ్రామానికి వెళుతూ, భోగంగర చేరు కొన్నాడు. అక్కడ నాలుగు మహోపదేశాలను చేశాడు. వీటి ద్వారా బుద్ధుని మాటలను స్పష్టం చేయ వచ్చు. పరీక్షించ వచ్చు.

1. ఒక భిక్కు ఇలా అనవచ్చు – ''బుద్ధుడే స్వయంగా చెప్పగా నేను విన్నాను: 'ఇది ధమ్మం, ఇది వినయం (discipline), ఇది ఆచార్యుని భోధ.'' అతడి మాటలను మనం అంగీకరించనూ రాదు, తిరస్కరించనూ రాదు. అటువంటి మాటలను అంగీకరించ కుండా, తిరస్కరించ కుండ, వాటిల్లోని ప్రతి మాటను, ప్రతి అక్షరాన్ని పూర్తిగా అధ్యయనం చెయ్యాలి. వాటిని సుత్తలతోను, వినయతోను సరి జూడాలి. ఆరకంగా చూసినప్పుడు అవి సుత్తతోను, వినయతోను ఏకీభవించ నట్లైతే, అప్పుడు నీవు ఈ దిగువ నిర్ణయానికి (వినిగమనానికి) రావచ్చు: 'తప్పకుండ ఇది బుద్ధుడు చెప్పిన మాటకాదు. భిక్కుదానిని తప్పుగా అర్థం చేసుకొన్నాడు.'

''అందువల్ల నీవుదానిని తిరస్కరించాలి.

''నీవు అలా సరి జూసి నప్పుడు ఆ పలుకులు సుత్తతోను, వినయతోను ఏకీభవించి నట్లయితే నీవు ఈ దిగువ నిర్ణయానికి రావచ్చు: 'తప్పక ఇది బుద్ధుడు చెప్పిన మాటే. భిక్కు దానిని సరిగానే అర్థం చేసు కొన్నాడు.'

''దీనిని మనం ప్రథమ మహోపదేశంగా పరిగణిద్దాం.

2. మళ్ళీ భిక్కు ఇలా చెప్పవచ్చు – ఆ ఆరామంలో అర్హులైన స్థవిరులతో పాటు సంఘం ఉంటున్నది. ఆ సంఘం నోటి నుంచి నేను ఇలా విన్నాను: 'ఇది ధమ్మం ఇది వినయం, ఇది ఆచార్యుని బోధ.' అతడు చెప్పిన దానిని మనం అంగీకరించనూరాదు, తిరస్కరించనూ రాదు. అంగీకరించ కుండ, తిరస్కరించ కుండ, ప్రతి మాటను, ప్రతి అక్షరాన్ని సుత్తతోను, వినయ నియమాలతోను సరిపోల్చి చూడాలి. అలా పోల్చినప్పుడు అవి సుత్తతోను, వినయ నియమాలతో సమరసంలో లేక పోయి నట్లయితే, నీవు ఈ దిగువ నిర్ణయానికి రావచ్చు: ''తప్ప కుండ ఇది బుద్ధుడు చెప్పింది కాదు. దీనిని భిక్షువు తప్పుగా అర్థం చేసు కొన్నాడు.''

అందువల్ల నీవు దానిని తిరస్కరించాలి.

అవి అలా పోల్చి చూసి నప్పుడు సరిపోతే నీవు ఈ దిగువ నిర్ణయానికి రావచ్చు: ''తప్పకుండా ఇది ఆ బుద్ధుడు చెప్పిన మాటే. సందేహం లేదు. భిక్కు దానిని సరిగానే అర్థం చేసు కొన్నాడు.''

దీనిని రెండో మహోపదేశంగా పరి గణించ వచ్చు.

**3.** మళ్ళీ భిక్కు ఇలా అనవచ్చు – ''ఆ ఆరామంలో మంచి పండితులైన వారు, ధమ్మాన్ని, వినయాన్ని, మాతృకలను<sup></sup> (మాతికా) బాగా జీర్ణించు కొన్న పండితులైన స్థవిరులు, భిక్కులు ఉన్నారు. ఆ స్థవిరుల నోటనుంచి నేను ఇలా విన్నాను: 'ఇది ధమ్మం, ఇది వినయం, ఇది బుద్ధుని బోధ'.'' అతని మాటలను అంగీకరించ కుండ, నిరాకరించ కుండ, వాటిలోని ప్రతిమాటను, అక్షరాన్ని బాగా అధ్యయనం చేసి, సుత్తలతో పోల్చి, వినయ నియమాలతో సరి చూడాలి. అలా సరిచూసి నప్పుడు, సుత్తలతోను, వినయంతోను, అవి ఏకీభవించ నట్లయితే, అప్పుడు నీవు ఈ దిగువ నిర్ణయానికి రావచ్చు: ''తప్పకుండా ఇది బుద్ధుని మాటకాదు. భిక్కు దీనిని తప్పుగా అర్థం చేసుకొన్నాడు.''

అందుకని నీవు దానిని నిరాకరించాలి.

అలా పోల్చి సరిచూసినప్పుడు, అవి సుత్తలతో, వినయంతో ఏకీభవించినట్లయితే, అప్పుడు నీవు ఈ దిగువ నిర్ణయానికి రావచ్చు: ''తప్పక ఇది బుద్ధుని మాటే. భిక్కు దీనిని సరిగానే గ్రహించాడు?''

దీనిని మూడో మహోపదేశంగా పరిగణించవచ్చు.

**4.** మళ్ళీ భిక్కు ఇలా అనవచ్చు – ''అక్కడ ఆరామంలో, పండితుడు, బోధల్లో నిష్ణాతుడు, ధమ్మ, వినయ, మాతృకలలో మునకలు వేసిన వాడు అయిన స్థవిర భిక్కు ఉన్నాడు. ఆయన నోటినుంచి నేను ఇలా విన్నాను : 'ఇది ధమ్మం, ఇది వినయం, ఇది బుద్ధ బోధ.'' అతని మాటలను తిరస్కరించనూ రాదు, ఆమోదించనూ రాదు. వాటిని అక్షరక్షరమూ పూర్తిగా క్షుణ్ణంగా అధ్యయనం చేసి, సుత్తలతోను, వినయ నియమాలతోను పోల్చి నిగ్గు తేల్చాలి. అలా పోల్చినప్పుడు, అవి వాటితో పొసగ నట్లైతే అప్పుడు నీవు ఈ నిర్ణయానికి రావచ్చు. ''తప్పకుండ ఇది బుద్ధుని వాక్కుకాదు. భిక్కు దానిని సరిగా అర్థం చేసుకోలేదు''.

అందుకని నీవు దానిని తిరస్కరించాల్సి ఉంటుంది.

''అలా సరిపోల్చి చూసినప్పుడు, అవి సరి పోతే, నీవు ఈ దిగువ న్నిర్ణయానికి రావచ్చు'':
''తప్పకుండా ఇది ధమ్మమే, ఇది వినయమే, ఇది బుద్ధుని బోధే.''

దీనిని నాలుగో మహోపదేశంగా పరిగణించ వచ్చు.

భిక్ఖులారా ఇవి నాలుగు మహోపదేశాలు'''.

**బుద్ధుని ఆఖరి భోజనం**

అటువంటి మహోపదేశాలతో శిష్యులకు జ్ఞానోదయం కలిగించిన బుద్ధుడు, పావాకు బయలు దేరి వెళ్ళాడు. అక్కడ చుంద డనే లోహ కారుడు (కమ్మరి) బుద్ధునికి, అతని శిష్యులకు ఆతిధ్య మిచ్చి, మర్యాదలు చేశాడు. మహోత్సాహంతో చుందడు మహా రుచికరమైన ''సూకర మద్దవ''మనే ప్రత్యేక వంటకాన్ని తయారు చేయించాడు. బుద్ధుని సలహా మీద, అతడు దానిని బుద్ధునికి మాత్రమే వడ్డించి, మిగిలిన దానిని భూమిలో పాతి పెట్టాడు.

ఆ భోజనం చేసి నాక, బుద్ధునికి జిగట విరోచనాలు పట్టు కొన్నాయి. చాల బాధ పడ్డాడు. వాటిని ప్రశాంతంగా, పైకి చెప్పుకోకుండ భరించాడు.

పెద్ద జబ్బుతో, చాల బలహీనంగా ఉండి కూడ బుద్ధుడు కుసినార[10]కు నడిచి పోవాలని న్నిర్ణయించు కొన్నాడు. కుసినార అతని అంతిమ విశ్రాంతి స్థలం. పావా నుంచి ఆరుమైళ్ళ దూరంలో ఉంది. ఈ ప్రయాణం మొత్తం మీద బుద్ధుడు, శరీర బలహీనత, జబ్బు కారణంగా, ఇరవై ఐదు చోట్ల ఆగుతూ పోవలసి వచ్చిందని చెబుతారు.

మార్గమధ్యంలో ఒకచెట్టు మొదట్లో కుర్చొని, తాను దప్పిగొని ఉన్న కారణాన, గౌరవనీయ ఆనందుని నీరు తే వలసిందని కోరాడు. అతికష్టం మీద, గౌరవనీయ ఆనందుడు ఒక సెలయేటి నుంచి మంచినీటిని తెచ్చాడు. అంతకు ముందు ఆ సెలయేటి గుండ ఐదు వందల బళ్ళు వెళ్ళిన కారణంగా దాని నీరంతా బురదనీరైంది.

ఆ సమయంలో పుక్కుస అనే వ్యక్తి బుద్ధుని వద్దకు వచ్చి, బుద్ధుని ప్రశాంతతను మెచ్చు కొన్నాడు. అతని సంక్షోభం లేకుండటం పై ఉపన్యాసం విని, రెండు బంగారు వస్త్రాలను బహూకరించాడు.

బుద్ధుని సూచన మేరకు ఒక దానితో బుద్ధుని, మరోదానితో గౌరవనీయ ఆనందుని కప్పాడు.

గౌరవనీయ ఆనందుడు ఆరెండు వస్త్రాలను బుద్ధుని మీద ఉంచి నప్పుడు, బుద్ధుని చర్మం కాంతితో మెరవడం చూసి ఆశ్చర్య పోయాడు. అప్పుడిలా లన్నాడు: ''హేదేవా,

అది ఎంత ఆశ్చర్యకరం, ఎంత అద్భుతం – ఉన్నతుల చర్మం అంత స్పష్టంగా, అత్యంత తేజోమయంగా ఉండడం. ఎందుకంటె, బాగా మెరుగు పెట్టిన బంగారు వస్త్రాలు, బుద్ధుని శరీరం మీద ఉంచడానికి సిద్ధం చేస్తుండగానే ఆ బంగారం వెలా తెలా పోయింది.''

అంతట బుద్ధుడు చెప్పాడు: ''రెండు సందర్భాలలో తధాగతుని శరీరం స్పష్టంగా, అత్యంత తేజోమయంగా కనిపిస్తుంది. ఆరెండు సందర్భాలు ఏవంటే, తధాగతుడు బుద్ధత్వాన్ని పొందిన రాత్రి, తధాగతుడు గతించే రాత్రి.''

కుసినార సమీపంలో రెండు సాల వృక్షాల మధ్య మల్లులకు చెందిన సాలతోపులో రాత్రి మూడో జాములో మరణిస్తానని అప్పుడు బుద్ధుడు ప్రకటించాడు.

**చుందని ప్రశంసనీయ భోజనం**

అతడు తన చివరి స్నానం కకుద్ధ నదిలో చేశాడు. ఆ తరవాత కొంచెం సేపు విశ్రాంతి తీసు కొని ఈ విధంగా చెప్పాడు: '''తధాగతుడు చివరిగ నీవు పెట్టిన భోజనం తిని మరణించాడు. 'అది నీకు, చుంద, దుఃఖ భాజకం, అదినీకు నష్టం', అని ఎవరైనా చుందునితో చెప్పి, లోహ కారుడైన అతనికి, ఆనందా, పశ్చాత్తాపం కలిగించ వచ్చు. అది నీకు మంచిది, నీకు శ్రేయస్సు, చివరిగ తధాగతుడు నీవు పెట్టిన అన్నం తిని గతించాడు,'' అని చెప్పి లోహకారుడు చుందనికి అటువంటి పరితాపం కలగకుండ నివారించాలి.

''స్వయంగా, ఆ తధాగతుని నోటి నుంచే విన్నాను చుందా . ఆయన తనకు పెట్టిన రెండు భోజనాలు సమఫలం, సమలాభం గలిగినట్టివి. ఆరెండు భోజనాలు ఏవంటే, ఒకటి తధాగతుడు ఏ భోజనాన్ని తిన్నప్పుడు ఆయనకు ప్రజ్ఞ (insignt) కలిగిందో అది. రెండోది తధాగతుడు ఏ భోజనాన్ని తిన్నప్పుడు ఏమీ మిగలకుండ నిశ్శేషంగా ఉచ్ఛేదం (cssation) జరుగుతుందో అది, ఈ రెండు భోజనాలు సమఫల, సమలాభం కలిగినట్టివి. ఏ భోజనం కంటె గూడ ఎక్కువ లాభాన్ని ఎక్కువ ఫలాన్ని ఇచ్చేవి. లోహకారుడు చుంద చేసిన కర్మ, జీవిత కాలాన్ని పెంచుతుంది. కీర్తికి దారి తీస్తుంది. స్వర్గానికి గొని, పోతుంది. ఉత్కృష్టుని చేస్తుంది'. ఈ విధంగా ఆనందా, లోహకారుడు చుందునిలో కలిగే పశ్చాత్తాపాన్ని పరిహరించాలి.''

చివరి భోజనాన్ని ఉదారంగా ఇచ్చిన దాతపై అనుకంపతో ఈ ఓదార్పు మాటలను చెబుతూ మల్లుల సాల తోపుకు వెళ్ళాడు. అప్పుడు ఆనందునితో, అక్కడి జంట సాల వృక్షాల మధ్య తల ఉత్తర దిక్కుగా ఉండేట్లు పడకను తయారు చేయ మన్నాడు. బుద్ధుడు దాని మీద కుడివైపుకు తిరిగి, కాలి పై కాలు వేసుకొని, సతీతో ఆత్మ సంయమనంతో పడు కొన్నాడు.

**బుద్ధుని గౌరవించిన తీరు**

ఋతువు కాని రుతువులో సాల వృక్షాలు పుష్పించడం, ఇంకా బాహ్య పవిత్ర ప్రదర్శనలను చూసి బుద్ధుడు తన శిష్యులకు ఇలా సందేశ మిచ్చాడు: ''ఆనందా, ఈ విధంగా కాదు తథాగతుని గౌరవించ వలసింది, పూజించ వలసింది, సమ్మానించ వలసింది, పురస్కరించ వలసింది, సంభావించ వలసింది, ఉపాసించవలసింది. ఏ భిక్కు లేదా భిక్కుని, ఉపాసక లేదా ఉపాసిక ధమ్మం ప్రకారం నడుస్తారో, విధిప్రకారం పనులు చేస్తారో, ఉచిత మార్గాన గమిస్తారో, వారు తథాగతుని పూజించేది, గౌరవించేది, సత్కరించేది, సమ్మానించేది, ఉపాసించేది, అత్యంత శ్రద్ధాసక్తులతో; అందుకని ఆనందా, 'మనం ధర్మ బద్ధంగా, విధి విహితులుగా, న్యాయ మార్గాన జీవింతువము గాక', అని చెప్పుకొంటూ అభ్యాసం చేయండి''.

ఒకప్పుడు బుద్ధునికి పరిచర్యలు చేసిన గౌరవనీయ ఉపవాన ఇప్పుడు బుద్ధుని ముందు వీవన విసరుతూ నిలబడి ఉన్నాడు. బుద్ధుడు అతనిని ఒక ప్రక్కగా నిలబడ మన్నాడు.

బుద్ధునికి అతడు అంతగా సేవ చేస్తుంటే, ఎందుకు అతనిని ప్రక్కకు తొలగ మన్నాడో గౌరవనీయ ఆనందుడు తెలుసుకో గోరాడు.

బుద్ధుడు సమాధానం చెప్పాడు: ''దేవతలు పెద్ద సంఖ్యలో తథాగతుని చూడ వచ్చారు. వారికి ఇతడు అడ్డం నిలబడడంతో వారు అసంతృప్తు లయ్యారు''.

**నాలుగు పవిత్రస్థలాలు**

తనతో సంబంధం ఉండడం వల్ల పవిత్రాలైన నాలుగు చోటుల గురించి బుద్ధుడు చెప్పాడు. వాటిని గౌరవంతోను, ఆదరంతోను విశ్వాసులైన అనుయాయులు దర్శించాలి.

1. బుద్ధుని జన్మస్థలం (భారత సరిహద్దులలో నేపాలులో ఉన్న లుంబిని)
2. బుద్ధునికి జ్ఞానోదయమైన స్థలం (బుద్ధగయా, గయాస్టేషన్ నుంచి ఎనిమిది మైళ్ళు)
3. బుద్ధుడు స్థాపించిన అసమాన సత్యచక్రం ఉన్నచోటు (సారనాథ్)
4. బుద్ధుడు పరినిర్వాణం పొందిన స్థలం (కుసినారా-నేటి కాసియా - గోరఖ్‌పూర్ స్టేషన్ నుంచి సుమారు 32 మైళ్ళు)

''ఎవరైతే తమ తీర్థయాత్రలలో విశ్వాసహృదయంతో మరణిస్తారో వారు వారి శరీరం నాశం తరువాత, స్వర్గ ధామంలో పునర్జన్మిస్తారు,'' అని బుద్ధుడు చెప్పాడు.

ఆ సమయంలో సుభద్దుడ నే పర్యాటక సన్యాసి కుసినారలోనే ఉంటున్నాడు. రాత్రి చివరి ఝాములో సన్యాసి గౌతముడు పరినిర్వాణం చెందుతున్నాడనే వార్త అతడు విన్నాడు. అతడు తనలో తాను ఇలా అనుకొన్నాడు: ''ఈ ప్రపంచంలో పూర్తిగా జ్ఞానోదయమైన అర్హతులు వాస్తవానికి చాల చాల అరుదుగా గాని జన్మించరని పెద్ద పెద్ద గురువులు, వారి గురువులు, పర్యాటక సన్యాసులు ఎందరో చెప్పగా విన్నాను. ఈ రాత్రి అంతిమ యామంలో సన్యాసి గౌతముడు పరినిర్వాణం చెంద బోతున్నాడు. నా కొక సందేహం ఉంది. ఆ సందేహాన్ని పార దోలే సిద్ధాంతాన్ని బోధించగల సామర్థ్యం ఒక్క సన్యాసి గౌతమునికే ఉందని నా విశ్వాసం.''

అపుడు మల్లుల ఉపవతన సాల తోపుకు పర్యాటక సన్యాసి సుభద్దుడు వెళ్ళి, అక్కడే ఉన్న గౌరవనీయ ఆనందునితో ఇలా అన్నాడు : ''ఈ ప్రపంచంలో పూర్తిగా జ్ఞానోదయమైన వారు వాస్తవానికి చాల అరుదుగా గాని జన్మించరని పెద్ద పెద్ద గురవులు, వారి గురువులు, పర్యాటక సన్యాసులు చెప్పగా విన్నాను. ఈ రాత్రి చివరియామంలో సన్యాసి గౌతముడు పరినిర్వాణం చెందబోతున్నాడు. నాకో సందేహ వచ్చింది. నాకు సన్యాసి గౌతముని మీద పూర్తి విశ్వాసం ఉంది. అతనికే నా సందేహ తీర్చే సామర్థ్యం ఉంది. హే ఆనందా! నేను వారిని ఒక క్షణం దర్శించ వచ్చా?''

''చాలు సుభద్దా, చాలు. ఆయన్ను ఇప్పుడు ఇబ్బంది పెట్టవద్దు. ఆ మహామహుడు ఇప్పుడు చాల అలసి పోయి ఉన్నారు,'' అని ఆనందుడు అన్నాడు.

ఒకటికి రెండు సార్లు సుభద్దుడు తన అభ్యర్థనను విన్నవించు కొన్నాడు. రెండోసారి, మూడో సారి గూడ ఆనందుడు అదే సమాధానం చెప్పాడు.

బుద్ధుడు వీరిద్దరి మధ్య జరిగిన సంభాషణను విన్నాడు. విని ఆనందుని ఉద్దేశించి ఇలా అన్నాడు:

'' ఆనందా, అతనిని నిరోధించ వద్దు. సుభద్దుని, ఓ ఆనందా, ఈ సిద్ధి పొందిన వానిని దర్శించనీ. సుభద్దుడు నన్ను ఏది అడిగినా, అతడు జ్ఞాన దాహంతోనే అడుగుతాడు గాని, నన్ను ఇబ్బందికి గురి చేయ డానికి కాదు. నేను అతనికి ఏ సమాధానం చెప్పినా, అతడు దానిని వెంటనే అర్థం చేసు కొంటాడు.''

అంతట ఆనందుడు సుభద్దుని బుద్ధునికి పరిచయం చేశాడు. సుభద్దుడు స్నేహ పిచ్చుల అభివాదాలు బుద్ధునికి తెలిపి, ఒక ప్రక్కగా కూర్చొని ఇలా అన్నాడు: ''గౌతమా, అనేక

సంఘాల, పరిషత్తుల, గణాల, మతశాఖల, మతాల ప్రఖ్యాతి చెందిన నాయకులు, గురువులు, ఆచార్యులు, సన్యాసులు, జన బాహుళ్యంలో మంచి వారుగా ఉన్నతులుగా పేరు పొందిన వీరంతా - ఉదాహరణకు, పూరణ కశ్శపుడు, మఖ్ఖలి గోశాలుడు, అజిత కేశకంబలుడు, పకుధ కచ్చాయనుడు, సంజయ బేలపుత్రుడు, నిర్గంధనాధ పుత్రుడు[12] - వీరంతా, వారు చెప్పు కొన్నట్లుగా, సత్యాన్ని పూర్తిగా అర్థం చేసుకొన్నారా లేదా? లేక వారిలో కొంత మందిది అర్థం చేసు కొని, మిగతా వారు అర్థం చేసుకో లేదా?''

''అదలా ఉండనీండి సుభద్దా! వారు పూర్తిగా అర్థం చేసుకొన్నరా లేదా అనే దానితో మీరు సత మతం కాకండి. నేను మీకు ధమ్మాన్ని బోధిస్తాను. జాగ్రతగా విని, మనస్సులో నిలుపు కోండి. నేను చెబుతాను''.

''అలాగే కానివ్వండి దేవా'', అన్నాడు సుభద్దుడు.

బుద్ధుడు ఇలా చెప్పాడు:

''ఎక్కడైతే ఆర్య అష్టాంగ మార్గం ఉండదో అక్కడ ప్రథమ సమణుడు[13] గాని, రెండో సమణుడు[14] గాని, మూడో సమణుడు[15] గాని, నాలుగో సమణుడు[16] గాని ఉండడు. ఎక్కడైతే ఆర్య అష్టాంగ మార్గం ఉంటుందో అక్కడ మొదటి సమణుడు, రెండో సమణుడు, మూడో సమణుడు, నాలుగో సమణుడు ఉంటారు. ఇక్కడ, ఓ సుభద్దా, ఆర్య అష్టాంగ మార్గం ఉంది.

''నిజంగా ఇక్కడ మీకు మొదటి సమణుడు, రెండో సమణుడు, మూడో సమణుడు, నాలుగో సమణుడు కనిపిస్తారు. ఓ సుభద్దా, శిష్యులు సరిగా ప్రవర్తిస్తే, జీవిస్తే, ప్రపంచం అర్హంతలకు గొడ్డు బోదు.

''మంచిదైన దాని కోసం నేను అన్వేషణ మొదలు పెట్టి నప్పుడు నా వయస్సు ఇరవైతొమ్మిది. నేను దీక్ష వహించి ఇప్పటికి ఏభై ఒక సంవత్సరాలు అయింది. ఈ పరివేషానికి (fold) కి వెలుపల, యధార్థీకరణం చెందింప బడగల ఈ ధమ్మాన్ని పాక్షికంగా గూడ అచరించే ఒక్క సన్యాసి గూడ లేడు.''

అంతట సుభద్దుడు బుద్ధునితో ఇలా అన్నాడు:

''బాగుంది దేవా, బాగుంది! ఇది ఎలా ఉందీ అంటే, ఒరిగి పోయిన రాయిని ఒకడు సరిగా నిలబెట్టి నట్లుగా, గుప్తంగా ఉన్నదానిని బహిరంగం చేసి నట్లుగా, దారి తప్పిన వానికి దారి చూపించి నట్లుగా, చీకట్లో దీపం చూపించి నట్లుగా కళ్ళున్న వాళ్ళందరికీ కనిపించే విధంగా, ఉంది.''

''మరి నేను దేవా, బుద్ధుని శరణు పొందుతాను, ధమ్మాన్ని, సంఘాన్ని శరణ పొందుతాను. నేను అల్ప దీక్షను[17] (పబ్బజ్జా = ప్రవ్రజ్య) ఉన్నత దీక్షను[18] (ఉపసంపద) ఉన్నతుని సమక్షంలో తీసుకో వచ్చా?''

''ఇతర ధర్మాలకు (మతాలకు) చెందినవారు ఎవరైన అల్ప లేదా ఉన్నత దీక్షను తీసుకో వాలంటే, నాలుగు నెలల పాటు[19] పరీక్షలో, శోధనలో (probation = నవ శిష్యుడుగా) ఉండాలి. నాలుగు నెలల అనంతరం, శిష్యులు ఆమోదిస్తే, అతనికి ప్రవ్రజ్య ఇచ్చి భిక్కు స్థాయి ఇవ్వడం జరుగుతుంది. అయిన, అవగాహన మీద ఆధారపడి, నేను కొంత మందికి వ్యక్తిగత మినహాయింపు (execption) కల్పిస్తాను, అన్నాడు బుద్ధుడు.''

అప్పుడు సుభద్దుడు అన్నాడు:

''దేవా, ఇతర మతాలకు చెందినవారు ఈ ధమ్మంలో అల్ప ఉన్నత దీక్షను పొంద గోరి నప్పుడు నాలుగు నెలలు శోధనలో ఉండ వలసి వస్తే, నేను గూడ అలాగే శోధనలో నాలుగు నెలలు ఉంటాను. శిష్యుల ఆమోదం తరవాతే నన్ను సంఘంలో చేర్చుకొని భిక్కు స్థాయిని కల్పించండి.''

అంతట బుద్ధుడు ఆనందునితో అన్నాడు:

''అయితే ఆనందా. సుభద్దునికి దీక్షనివ్వండి''.

''దేవా, అలాగే'', ఆనందుడు సమాధానం చెప్పాడు.

పర్యాటక సన్యాసి సుభద్దుడు ఆనందునితో ఇలా అన్నాడు:

''ఓ గౌరవనీయ ఆనందా, మీరు సఫలురయ్యారు! నిజంగా అదెంతో గొప్ప ఫలం. ఎందుకంటే, స్వయంగా ఆ ఉన్నతుని సమక్షంలోనే ఇతరులకు శిష్యరికం ఇవ్వడానికి మీరు అభిషిక్తులయ్యారు.''

సుభద్దుడు, బుద్ధుని సమక్షంలోనే అల్ప, ఉన్నత దీక్షను తీసుకొన్నాడు.

ఉన్నత దీక్షతీసుకొన్న కొలది కాలంలోనే గౌరవనీయ సుభద్దుడు, మనుషులకు దూరంగా, ఏకాంతంగా, శక్తివంతంగా, పట్టుదలతో, ఈ జీవితంలోనే తన అంతర్జ్ఞానం (intuition)తో యధార్థీకరించుకొని అసమాన పవిత్ర జీవితంలో సిద్ధి పొందాడు. అతడు అదే స్థితిలో జీవితాన్ని కొనసాగించాడు. అటువంటి జీవితం కోసం కులీన కుటుంబీకులు తమ సంసారాలను వదిలి సన్యాస జీవితాన్ని స్వీకరిస్తారు. తన పవిత్ర జీవితం పూర్తి అయిందని, తనకిక పునర్జన్మ లేదని అతడు గ్రహించాడు.

గౌరవనీయ సుభద్దుడు అర్హతులలో ఒకడయ్యాడు. బుద్ధుడు స్వయంగా పరివర్తించిన వారిలో గౌరవనీయ సుబద్దుడు చివరివాడు.

ఆనందునికి చెప్పిన చివరి మాటలు !

గౌరవనీయ ఆనందుడు బుద్ధుని దేహాన్ని ఏమి చేయాలో తెలుసుకో గోరాడు.

బుద్ధుడు సమాధానం చెప్పాడు : ''తథాగతుని అవశేషాలను పూజించే ప్రయత్నాలేమీ చేయకండి. మీమీ సంక్షేమం (అంటే అర్హతత్వం) గురించి చూసు కోండి. మీ సంక్షేమానికి మీరు అంకితం కండి. సహాయకారులుగా ఉండండి. శ్రమించండి. మీ బాగోగుల మీద దృష్టి నిలపండి. తథాగతుని మీద గాఢ విశ్వాసం గల వారిలో తెలివైన యుద్ధవీరులు, గృహస్థులు ఉన్నారు. వారు తథాగతుని అవశేషాలను తగురీతిలో గౌరవిస్తారు.''

ఈ ఆసక్తి కరమైన మతపర విషయాలు ఒక కొలిక్కి వస్తుండగా గౌరవనీయ ఆనందుడు ఒకప్రక్కకు వెళ్ళి తన మనస్సులో మెదిలిన ఈ ఆలోచనతో కంటనీరు పెట్టుకొన్నాడు: ''ఇక ముందు చేయ వలసిన పని చాలా ఉంది. నేను ఇంకా విద్యార్థినే. ఏమిటో ఏమీ తెలియని వాడను. నన్ను కరుణతో చూసు కొనే నా గురువు అంతిమంగా గతిస్తున్నాడు.''

ఆనందుడు అక్కడ లేక పోవడాన్ని గమనించిన బుద్ధుడు, అతన్ని రావించి ఇలా అనునయించాడు: -''చాలు, ఆనందా, వగవకు చింతించకు. మనకు సంతోషాన్నిచ్చే, ఆహ్లాదం కలిగించే వాటికి, ప్రియమైన వాటికి, దూరం కావలసి వస్తుందని ఇంతకు ముందే నీకు చెప్పలేదా?

''ఓ ఆనందా, నీవు చాల మంచి పనులు చేశావు. మాలిన్యాల నుంచి త్వరలోనే విముక్తుడ వవుతావు.''

అతని ప్రధాన గుణాలపై వ్యాఖ్యానిస్తూ, ఆనందుని అభినందించా డప్పుడు బుద్ధుడు.

అనేక విధాల బుద్ధుడు ఆనందుని మందలించిన తరవాత, కుసినార కెళ్ళి, అక్కడి మల్లులకు తథాగతుని ఆగామి మరణ వార్తను తెలియ జేయ వలసిందిగా ఆనందుని ఆదేశించాడు. ఆవిధంగా మల్లులకు బుద్ధుని ఆగామి మరణ వార్త తెలియ జేయ బడింది. వారంతా తమ తమ భార్య, పిల్లలతో బుద్ధునికి అంతిమ వీడ్కోలు పలకడానికి విలపిస్తూ వచ్చారు. వారిలో యువకులు, కన్యలు ఉన్నారు.

**అంతిమ దృశ్యం**

అప్పుడు బుద్ధుడు ఆనందునితో ఇలా చెప్పాడు:

''ఆనందా నీవు ఈ విధంగా అనుకోవచ్చు: 'గురువు లేకుండా ఆయన బోధ మాత్రమే ఉంది. మనకు గురువు లేడు.' అలాకాదు, ఆనందా, నీవు అలా అనుకోవద్దు. నేను బోధించిన ధమ్మం, ప్రతిష్ఠించిన వినయం, నేను గతించిన తరవాత ఇవే మీ గురువు.

''ఓ ఆనందా, నా మరణానంతరం, సంఘం అవసరమని భావిస్తే చిన్న చిన్న నియమాలను ప్రక్కన బెట్ట వచ్చు,'' అని బుద్ధుడు అన్నాడు.

ఈ సందర్భంలో ఆ విషయాన్ని బుద్ధుడు ఒక ఆదేశంగా చెప్పకుండ, ఊహామాత్రంగా (సలహాగా) చెప్పాడు. చిన్న చిన్న నియమాలను వదిలి వేయాలని బుద్ధుని కోర్కె అయితే, అతడు దానిని ఆదేశంగానే చెప్పి ఉండే వాడు. ఊహకు వదిలి వేసే వాడు కాడు. కాని, ప్రథమ సంగీతికి అధ్యక్షత వహించే గౌరవనీయ కశ్యపుడు, సంఘం అమోదంతో చిన్న చిన్న నియమాలను నిషేధించ దని బుద్ధునికి ముందుగానే తెలుసు. అందుకని అతడు, సూచన ప్రాయంగా, రేఖా మాత్రంగా చెప్పాడని వ్యాఖ్యాతలు అంటున్నారు.

ఈ చిన్న చిన్న నియమాలేవో బుద్ధుడు స్పష్టంగా చెప్పని కారణాన, వాటికి సంబంధించి అర్హంతలు ఎటువంటి నిర్ణయానికి రాలేని కారణాన, వారు ఏ నియమాన్ని మార్చకుండ యథా తథంగా ఉంచాలనుకొన్నారు.

బుద్ధుడు మళ్ళీ శిష్యులనుద్దేశించి చెప్పాడు: ''ఓ శిష్యులారా, బుద్ధుని గురించి కాని, ధమ్మాన్ని గురించి కాని, సంఘాన్ని గురించి గాని లేదా పథాన్ని గురించి కాని, విధానాన్ని గురించి గాని, సందేహాలు ఏమైనా ఉంటే అడగండి. ఆ తరవాత, నేను గతించిన తరవాత, 'అయ్యో ఆ ఉన్నతుని ఎదుట ఉండికూడ ఆయన్నడిగి తెలుసుకోలేక పోతిమే' అని వగచి ప్రయోజనం లేదు.'' ఈ విధంగా బుద్ధుడు అన్న తరవాత శిష్యులంతా మౌనం వహించారు.

రెండోసారి, మూడోసారి గూడ, బుద్ధుడు శిష్యుల నుద్దేశించి అవే మాటలు చెప్పాడు. రెండోసారి మూడోసారి గూడ శిష్యులు మారు మాటాడ లేదు.

బుద్ధుడు శిష్యుల నుద్దేశించి చెప్పాడు: ''బహుశ అది గురువు యెడల ఉండే భక్తి ప్రపత్తులు కారణంగా మీరు నన్ను ప్రశ్నించడం లేదు. ఓ శిష్యులారా, ఒక స్నేహితుడు మరొక స్నేహితుని అడిగినట్లు అడగండి.''

అయినా శిష్యులు మాటాడ లేదు.

అంతట ఆనందుడు బుద్ధునితో ఈవిధంగా అన్నాడు:

''అద్భుతం! దేవా, ఆశ్చర్యం! ఈ శిష్యగణం నాకు సంతోషాన్నే కలిగించారు. బుద్ధుని గురించిగాని, పద్ధతిని గురించిగాని, పథాన్నిగురించి గాని, సంఘాన్ని గురించి గాని ఒక్క శిష్యునికి గూడ సందేహం లేదు.''

''ఆనందా, నీ విశ్వాసం అలాంటిది. అందుకని ఈ విషయాన్ని గురించి నీవు అలా మాటా డుతున్నావు. ఈ శిష్యగణంలో ధమ్మ మన్నా, సంఘ మన్నా, మార్గ మన్నా, విధాన మన్నా సందేహించే వాడు ఒక్కడూ లేడని తథాగతునికి తెలుసు. ఈ ఐదువందల మంది శిష్యులలో, ఓ ఆనందా, ఆఖరి వాడెవరో అతడే నదిని దాటుతాడు (Stream, winner = సోతాపన్నుడు). అతడు పడి పోడు. తప్పకుండ అతనికి జ్ఞానోదయం అవుతుంది.[20]

బుద్ధుడు శిష్యులకు చివరి ఉపదేశం ఇచ్చాడు:

''చూడండి శిష్యులారా, గుర్తుంచుకోండి. ఘటియిత వస్తువులన్నీ (సంఖారాలన్నీ) మార్పుకు లోనయ్యేవే. అభినివేశంతో ముందుకు నడవండి. (వయధమ్మా సంఖారా, అప్పమాదెన సంపాదెథ).

ఇవి బుద్ధుని చివరి మాటలు.

**గతించడం**

బుద్ధుడు ప్రథమఝానాన్ని (ecstacy) పొందాడు. దాని నుంచి పైకి లేస్తూ, రెండో, మూడో, నాలుగో ఝానాలను పొందాడు. నాలుగో దాని నుంచి అనంతాకాశాయతనాన్ని (ఆకాసానఞ్చాయతనాన్ని) పొందాడు. అక్కడ నుంచి ఉద్దానమై అనంత విజ్ఞానాయతనాన్ని (విఞ్ఞాణఞ్చాయతన) పొందాడు. దాని నుత్తరించి సంజ్ఞా అసంజ్ఞా కాని ఆయతనాన్ని (న' ఇవ సఞ్ఞా న' ఆసఞ్ఞాయతనను) చేరాడు. దీనిని ఉత్తరించి సంజ్ఞా, ఇంద్రియజ్ఞాన రాహిత్యాన్ని (సఞ్ఞా వెదయిత నిరోధాన్ని) చేరాడు.

ఇంకా ఇప్పటి వరకు దివ్య చక్షువును ఆర్జించని గౌరవనీయ ఆనందుడు గౌరవనీయ అనురుద్ధుని ఉద్దేశించి అన్నాడు: ''ఓ గౌరవనీయ అనురుద్ధా ఉన్నతుడు గతించాడు.''

''లేదు సోదరా, లేదు. ఉన్నతుడు కాల ధర్మం చెంద లేదు. సఞ్ఞావెదయిత నిరోధాన్ని (సంజ్ఞా ఇంద్రియ జ్ఞానాల Perception and Sensation రాహిత్యాన్ని మాత్రమే) చేరాడు.''

అప్పుడు బుద్ధుడు సంజ్ఞా ఇంద్రియజ్ఞాన రాహిత్యాన్ని ఉత్తరించి ఈ రెండూ కాని ఆయతనాన్ని చేరాడు. దీనిని కూడ అతడు దాటి, శూన్యతాయతనాన్ని (nothingness) చేరాడు. దీనినీ దాటి అనంత విజ్ఞాన (consciousness) ఆయతనాన్ని చేరాడు. దీని నుంచి అనంతాకాశాయతనాన్ని చేరాడు. దాని నుంచి నాలుగో ఝానాన్ని (cestarcy), దీని నుంచి మూడో ఝానాన్ని, దీని నుంచి రెండో ఝానాన్ని, దీనినుంచి మొదటి ఝానాన్ని

చేరాడు. మళ్ళీ వరుసగా తిరిగి ఒకటో ఝానం నుంచి నాలుగో ఝానానికి చేరాడు. దీని తరవాత వెంటనే బుద్ధుడు అంతిమంగా వైసాఖ చాంద్రమాసాన శుద్ధ పూర్ణిమ క్రీ.పూ. 543న (మహాపరి నిర్వాణం పొందారు) గతించాడు.

**పాదసూచికలు :**

1. *Dialogues of the Buddha*, 11. P. 91.

2. ఆమ్రపాలి తరవాత సంఘంలో చేరి అర్హతత్వం పొందింది.

3. అనంతరమ్ అబాహిరమ్ కరిత్వా - ఈ రెండు పదాలు వ్యక్తులకు బోధలకు అన్వయిస్తాయి. ''నా ధమ్మంలో ఈ భాగాన్ని ఇతరులకు బోధించను'' - అటువంటి ఆలోచన ధమ్మాన్ని అంతరంగికులకే పరిమితం చేస్తుంది. ''నాధమ్మంలో ఈ భాగాన్ని ఇతరులకు చెబుతాను'' - అటువంటి ఆలోచన కొంత ధమ్మాన్ని ఇతరులకు నిషేధించి నట్ల వుతుంది. ''నేను వీనికే బోధిస్తాను'' - అటువంటి ఆలోచన అంతరంగికులకు పరిమితం చేస్తుంది. '' ఇతనికి నేను బోధించను'' - ఇటు వంటి ఆలోచన వ్యక్తుల మధ్య విచక్షణను పాటించి నట్లవుతుంది. శిష్యుల విషయంలోగాని, బోధనల విషయంలోగాని బుద్ధుడు అటువంటి తేడాలు చూపించ లేదు. బుద్ధుని బోధలో రహస్యబోధ (esoteric teaching) అంటూ ఏదీ లేదు. శిష్యులలో గూడ లోపల శిష్యులని, బయటి శిష్యులని తేడాలను చూపించ లేదు.

4. నాలుగురకాల సతిపట్ఠానలు ఉన్నాయి (సతీ భూమికలు). ఇక్కడ ధమ్మ అనే పదాన్ని వేరే అర్థంలో వాడడం జరిగింది. అందుకని ఒకే ఆంగ్లపదంతో చెప్పడం కుదరదు. అది మానసిక, భౌతిక విషయాలను - రెండింటిని సూచిస్తుంది. (మజ్ఝిమని కాయ 1, 10, సతి పట్ఠానసుత్త.

5. నాలుగు ఇద్ధి పాదలు (విజయ సోపానాలు) **will** (చంద) **effort** (విరియ) **thought** (చిత్త), **investigation wisdom** (విమంస)

6. ఇక్కడ కప్ప అంటే మామూలు జీవితకాలం. అది సుమారు 100 సంవత్సరాలు. కప్పావశేషం (కల్పావశేషం) అంటె కల్పలో అదనపు భాగం అంటే సుమారు 120 సంవత్సరాలు.

7. ఇవి జ్ఞానోదయం నిర్మాణ మూలకాలు (*బోధిపక్ఖియధమ్మ*)

8. 'మాతిక' సాధారణంగా ఒక జాబితాను సూచిస్తుంది. పుస్తకాల్లలో మొదట్లో కనిపించే విషయసూచిక లాంటి, సంగ్రహంగా చెప్పే వర్ణనలను సూచిస్తుంది. వినయపిటకలో అభిధమ్మ పిటకను సూచించ డానికి దీనిని ఉపయోగించారు. బహుశ అభిధమ్మపిటక అటువంటి

జాబితాలనుంచి వచ్చి ఉండ వచ్చు. పైన ఇవ్వబడిన జ్ఞానోదయం ముప్పైరెండు నిర్మాణకాంశాల జాబితా బహుశా అత్యంత ప్రాచీన మాతికలలో ఒకటి కావచ్చు.

9. వ్యాఖ్యానం ప్రకారం అది అంత చిన్నది, అంత వయస్సునదీ కాని మగ పంది మాంసం అయి ఉండ వచ్చు. దానిని ఆయన కోసంగా చంప లేదు, కొంతమంది అదొక రకం పుట్టగొడుగు అన్నారు. అదేదో ప్రత్యేక రుచికరమైన ఆపేరుతో పిలవ బడిన, వంటకమై ఉండ వచ్చు. లేదా ఏదైనా రసాయనిక వంటకమైనా అయి ఉండ వచ్చు.

(*Questions of King Milinda*, 1, p.244, and *Dialogues of the Buddha*, 11, P. 137 n. 1చూడండి.

10. వ్యాఖ్యానం ప్రకారం, కుసినారను తన మరణ ప్రదేశంగా ఎన్ను కోవడానికి బుద్ధునికి మూడు కారణా లున్నాయి. మొదటిది, ప్రజలకు ఉత్తేజం గలిగించి, మంచిగ జీవించ డానికి వారికి మహాసుదశ్శన సుత్తను బోధించాలను కోవడం. రెండు, తాను తప్ప మరెవరు పరివర్తించలేని తన చివరి శిష్యుడైన సుభద్దుని పరివర్తింప జేయడం కోసం. మూడు తన అవశేషాలను తన శిష్యులకు పంచడానికి దొన (దోణుడు) నికి అవకాశం కల్పించడం కోసం.

11. ఈసుభద్దుడు, తన వృద్ధాప్యంలో సంఘంలో చేరిన మరో సుభద్దుని కంటె వేరని గుర్తించాలి. 'బుద్ధుని మరణం దుఃఖించాల్సిన సందర్భం కాదు, ఎందు కంటె గురువు ఆదేశాలను పాటించ కుండ భిక్కులు తమ ఇష్టం వచ్చి నట్లు నడుచు కొనే స్వేచ్ఛ ఉంది, అని చెప్పిన వాడు ఈ వృద్ధ సుభద్దుడు. ఇతడు చేసిన ఈ వ్యాఖ్య కారణంగా గౌరవనీయ కశ్శపుడు వెంటనే ధమ్మ వినయ స్నాతకోత్సవాన్ని జరిపాడు.

12. వార ా బుద్ధుని కాలంలోనే వికసించారు.

13. మొదటి సమణుడు సోతాపన్నుడు, నదిని జయించిన (దాటిన) వాడు.

14. సకదాగామి, ఒక సారి తిరిగి వచ్చు వాడు.

15. అనాగామి, ఎప్పటికి తిరిగిరాని వాడు.

16. అర్హంత, పరిపూర్ణరుషి, గౌరవనీయుడు, యోగ్యుడు.

17. పబ్బజ. ప్రవజ్య, పరిత్యాగం. కొత్తగా వచ్చిన వారికి దీక్షనివ్వడాన్ని సూచిస్తుంది. తల వెంట్రుకలు,

మీసాలు గడ్డాలు తీసి వేసి పీత వస్త్రాలను కట్టి, త్రిశరణాలను దేశాలను (దశశీలాలను) తీసు కొనడం ద్వారా దీనిని నిర్వహిస్తారు.

18. ఉపసంపదా - ఇది ఉన్నత దీక్షను సూచిస్తుంది. ఇరవై ఏళ్ళ పూర్తి అయిన తరవాత మాత్రమే దీనిని ఇస్తారు. దీనిని తీసుకొన్న వాడు సంఘంలో పూర్తి సభ్యుడవుతాడు. ఇతనిని భిక్ఖు అంటారు.

19. దీక్ష పుచ్చు కోవడానికి, బుద్ధా కాంక్షడు, శోధనకు (probation) నిలవ నక్కర లేదు.

20. ఇక్కడ ఉద్దేశించింది ఆనందుని. ఆ మాటలతో ప్రోత్సాహితుడై తరవాత అర్హతత్వాన్ని పొందాడు.

పదిహేనో ప్రకరణం

# ధమ్మం

## బుద్ధుని బోధలు

**ధమ్మం అంటే ఏమిటి ?**

*''ఈ ధమ్మం గంభీర మైంది, కనిపించేది కాదు, అర్థం చేసు కోవడం కష్ట తరం. ప్రశాంతం, ఉన్నతమైంది. తర్కం పరిధిలో లేనిది, సూక్ష్మమైంది. జ్ఞానులు మాత్రమే అర్థం చేసుకో గలిగింది''.*

– మజ్జిమ నికాయ

**తిపిటక (త్రిపిటక)**

బుద్ధుడు గతించాడు. కాని అతని మహోత్కృష్ట బోధ, ఆయన జీవిత కాలంలో విజయవంతంగా సాగించిన ఆధమ్మ బోధ, ఎటువంటి అరమరికలు లేకుండ మానవాళికి అందించిన ఆ బోధ, నేటికీ నాటి శుద్ధత చెక్కు చెదర కుండ లభిస్తోంది.

ఆయన బోధలు లిఖిత రూపంలో లేనప్పటికి, ఆయన శిష్యులు జ్ఞాపకం పెట్టుకొని, మౌఖికంగా ఒక తరం నుంచి మరో తరానికి అందిస్తూ వచ్చారు.

బుద్ధుడు మరణించిన మూడు నెలల తరవాత, అజాతశత్రు సింహాసనం ఎక్కిన ఎనిమిదో సంవత్సరంలో, ధమ్మ శుద్ధతను పరిరక్షించాలనే తలంపుతో, 500లమంది దిట్టమైన అర్హంతలు రాజగహ లో పునశ్చరణ తరగతులు నిర్వహించారు. బుద్ధునికి అత్యంత సన్నిహితుడు ప్రియతముడు అయిన, బుద్ధుని నోటి నుంచి వచ్చే ప్రతి మాటను విన డానికి ప్రత్యే కావకాశా లున్న ఆనందుని, ధమ్మం మీద ఎదు రయ్యే ప్రశ్నలకు సమాధానం చెప్ప డానికి ఎన్నుకొన్నారు. గౌరవనీయ ఉపాలి థేరుని, వినయానికి సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలు చెప్ప డానికి ఎన్ను కొన్నారు.

మన కిప్పుడు లభిస్తున్న ఈ రూపంలో, నాటి మొదటి సమావేశం త్రిపిటకాలను క్రోడీ కరించింది. ఈ త్రిపిటకాలలో మొత్తం బుద్ధుని బోధ ఉంది.

తరవాతి రెండు సంగీతులు[1] 100 సంవత్సరాలకు ఒకటి, 236 సంవత్సరాలకు మరొకటి జరిగాయి. బుద్ధుని బోధలోని శుద్ధతను కలుషితం కాకుండ ఉంచ డానికే ఈ రెండు సంగీతులు జరిగాయి.

క్రీ.పూ. 83లో సింహళ రాజు వత్త గామని అభయ్[2] పాలనలో, అర్హంతల సంగీతి జరిగింది. బౌద్ధచరిత్రలోనే మొదటి సారిగ త్రిపిటకాలు సింహళంలోని అలువిహార[3]లో లిఖిత రూపాన్ని దాల్చాయి. అలు పెరుగని ఆ కులీన దూర దృష్టిగల అర్హంతలకు మనం కృతజ్ఞతలు చెప్పాలి. ఇప్పుడు గాని, ఇహ భవిష్యత్తులో గాని విమర్శకులకు, ప్రగతి కాములైన పండితులకు వాటిని కలుషితం చేసే అవకాశమే లేదు.

బుద్ధుని బోధ సారాన్ని కలిగి ఉన్న త్రిపిటకం పరిమాణంలో దాదాపుగ బైబిల్‌కు పదకొండు రెట్లు ఉంటుంది.

తిపిటక[4] అనే పదానికి అర్థం మూడు బుట్టలు. అవి వినయపిటక, సుత్తపిటక, అభిధమ్మ పిటకాలు

**వినయ పిటక**

వినయ పిటక పవిత్ర సంఘానికి ఆయువు పట్టు, లంగరు లాంటిది. భిక్కులు, భిక్కునిల సంఘాల నియమ నిబంధనలకు సంబంధించిది ఇది. బుద్ధునికి జ్ఞానోదయమైన ఇరవై సంవత్సరాల వరకు సంఘం క్రమశిక్షణ కోసం ఇదమిద్ధమైన నియమాలను వేటినీ రూపొందించ లేదు. ఆ తరవాత, సమయం వచ్చింది, బుద్ధుడు సంఘం భావి క్రమశిక్షణ కోసం నియమాలను ప్రకటించాడు. నియమాలు పెట్ట డానికి గల కారణాలు, వాటి అను పానులు, సంఘం యొక్క విశిష్ట వినయ వేడుకలు వినయ పిటకంలో వర్ణించ బడ్డాయి. సాసన[5] (Dispensation) ఆవిర్భావం నుంచి క్రమ వికాస చరిత్ర, బుద్ధుని సంక్షిప్త జీవిత చరిత్ర, అతని ధర్మ దూత్యం, మూడు సంగీతుల వివరాలు – ఇవి అదనంగా ఇందులో ఉన్నాయి. పరోక్షంగా ఇది ప్రాచీన చారిత్రక విశేషాలను, భారతీయ సంప్రదాయాన్ని, ప్రాచీన కళా, విజ్ఞాన శాస్త్రాలను తెలియ జేస్తుంది.

వినయ పిటకం చదివిన వారు ఎవరైన, సంఘం ప్రజా స్వామిక రాజ్యాంగం, సంపదను ఉమ్మడిగా అనుభవించడం, భిక్కుల అసమాన్య నైతిక ప్రవర్తన, బుద్ధుని అతిశయించిన పాలనా సామర్థ్యాలను చూసి, ఆశ్చర్యం చెంద కుండ ఉండ లేరు. బుద్ధుడు నాడే నేటి పార్లమెంటరీ విధానాన్ని ఊహించాడు. లార్డ్ జెట్‌లాండ్ ఇలా రాస్తున్నాడు: ''రెండు వేలు అంత కంటె ఎక్కువ సంవత్సరాలకు పూర్వమే భారత దేశంలోని బౌద్ధ అసెంబ్లీలలో ఈనాటి మన పార్లమెంటరీ విధాన ప్రాధమికాంశా లున్నా యంటే చాల ఆశ్చర్యకరంగా ఉంది''[6]

వినయ పిటకంలో ఈ దిగువ ఐదు పుస్తకాలున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | పారాజిక పాలి | విభంగ | (పెద్ద నేరాలు) |
| 2. | పాచిత్తియ పాలి | | (చిన్న నేరాలు) |
| 3. | మహావగ్గ పాలి | ఖందక | (గొప్ప విభాగం) |
| 4. | చుల్లవగ్గ పాలి | | (అల్ప విభాగం) |
| 5. | పరివార పాలి | | (వినయ ముఖ్యాంశం) |

**సుత్త పిటక**

సంఘానికి, ఉపాసికులకు అనేక సందర్భాలలో బుద్ధుడు చెప్పిన అనేక ఔపదేశిక ప్రవచనాలు ముఖ్యంగా సుత్త పిటకలో ఉన్నాయి. గౌరవనీయ సారిపుత్రుడు, మొగ్గల్లాన, ఆనందుడు చెప్పిన ఉప దేశాలు ఇందులో కూర్చ బడ్డాయి. వీటికి గూడ బుద్ధుని ఉపదేశాల కున్న గౌరవమే ఉంది. ఎందు కంటె వీటిని బుద్ధుడు ఆమోదించాడు. అనేక ఉపదేశాలు ముఖ్యంగా, భిక్షువుల ప్రయోజనాన్ని ఉద్దేశించినవి. అవి పవిత్ర జీవితానికి, ధమ్మ వివరణకు సంబంధించినవి. ఉపాసకుల భౌతిక, నైతిక ప్రగతికి సంబంధించిన అనేక ఉపన్యాసాలు అందులో ఉన్నాయి. ఉదాహరణకు సిగాలో వాద సుత్త[7] ముఖ్యంగా ఉపాసకుల విధులకు సంబంధించింది. పిల్లల నుద్దేశించిన కొన్ని ఆసక్తికర ఉపన్యాసాలు గూడ అందులో ఉన్నాయి.

ఈ పిటక నిర్దేశక గ్రంధం లాంటిది. ఎందుకంటే, అనేక సందర్భాలలో అనేక మందికి వారి వారి ప్రవృత్తులకు తగినట్లు ఉపదేశాలను చెప్పడం జరిగింది. వాటిల్లో కొన్ని, ఒకదానికి ఒకటి, పైకి చూడడానికి వ్యతిరేకాలుగా కనిపించ వచ్చు. వాటిని అలా అపార్థం చేసుకో రాదు. ఎందుకంటే, ఆయా ప్రత్యేక సందర్భాలకు తగినట్లు బుద్ధుడే చెప్పాడు. ఒకే ప్రశ్నకు, ఊరికే తెలుసు కోవాలని ఒక బుద్ధి హీనుడు అడిగి నప్పుడు బుద్ధుడు మౌనం వహించి, అదే ప్రశ్నను నిజమైన సత్యాన్వేషి అడిగి నప్పుడు, సవివరంగా సమాధానం ఇచ్చాడు.

సుత్తపిటకలో ఈ దిగువ ఐదు నియమాలు (సంహిత) ఉన్నాయి.

1. దీఘ నికాయ (దీర్ఘ ఉపన్యాసాల సంపుటి)
2. మజ్ఝిమ నికాయ (మధ్యరకం (దైర్ఘ్యంలో) ఉపన్యాసాల సంపుటి)
3. సంయుత్త నికాయ (సంబంధిత వాక్యాలు సంపుటి)
4. అంగుత్తర నికాయ (క్రమ వాక్యాల సంపుటి)
5. ఖుద్దక నికాయ (హ్రస్వసంపుటి)

ఈ ఐదోది పదిహేను గ్రంథాలుగా విభాజితమైంది.

1. ఖుద్దక పాఠ (హ్రస్వమూలపాఠాలు)
2. ధమ్మపద (సత్యపథం)
3. ఉదాన (హర్షధ్వానం)
4. ఇతి ఉత్తక ('ఇట్లు చెప్పెను' - ఉపన్యాసాలు)
5. సుత్త నిపాత (ఉపదేశ సంపుటి)
6. విమానవత్థు ( ఆకాశ హార్మ్యాల కథలు)
7. పెత వత్థు (ప్రేతాలకథలు)
8. థేరగాథా (భిక్కుల గేయాలు)
9. థేరీగాథా (భిక్కునిల గేయాలు)
10. జాతక (బోధిసత్వుని జన్మకథలు)
11. నిద్దేస (వ్యాఖ్యానాలు)
12. పటిసంభిదా (విశ్లేషణాత్మక గ్రంథం)
13. అపదాన (అర్హంతల జీవితాలు)
14. బుద్ధవంశ (బుద్ధుని చరిత్ర)
15. చరియా పిటక (నడత తీరులు)

**అభిధమ్మ పిటక**

అభిధమ్మ పిటక మూడింటిలోకి అతి ముఖ్యమైంది, అత్యంత ఆసక్తికరమైంది. సరళోపదేశా లున్న సుత్తపిటక కంటే భిన్నంగా, బుద్ధుని బోధలలోని గంభీర తత్వం ఇందులో ఉంది. అభిధమ్మం అంటే బుద్ధుని ఉన్నత ధమ్మం. ఇది బుద్ధుని బోధ సారాన్ని వివరిస్తుంది[8].

కొంత మంది పండితుల ప్రకారం, అభిధమ్మం బుద్ధుని బోధ కాదు, తరువాత బౌద్ధ భిక్కులు రచించారంటారు. కాని సంప్రదాయం మాత్రం దీని కీలక భావనలన్నీ బుద్ధ ప్రతిపాదితాలే అని వా కొంటున్నది. కుశల ధమ్మాలు (మంచి స్థితులు) అకుశల ధమ్మాలు, (చెడు స్థితులు) అభ్యాకతా ధమ్మాలు (అనిశ్చిత స్థితులు) లాంటి అభిధమ్మ మాతృక (మాతిక)[9]లు మాత్రం బుద్ధుడు ప్రతిపాదించినవే. ఇవి ఆరు గ్రంధాలలో - కథావత్తు మినహాయించి[10] - ఉన్నాయి. ఈ శీర్షికలన్నింటిని గౌరవనీయ సారిపుత్రుడు విశదీ కరించాడు. ఈ గౌరవం ఆయనకే దక్కింది.

అభిధమ్మ రచయిత కాని, రచయితలు కాని, వారు ఎవరైనా, అతడు బుద్ధునితో సరితూగ దగిన మహా మేధావి సృష్టి మాత్రమే కాగలదు. (అంతకు తక్కువ వాడెవడూ దానిని

రచించలేదు - అనువాదకుడు). కార్యకారణ సంబంధాలను సవివరంగా వర్ణించిన సంక్లిష్ట సూక్ష్మ పట్ఠాన పకరణను చూస్తే ఈ సంగతి తెలుస్తుంది.

జ్ఞానులైన సత్యాన్వేషకులకు అభిధమ్మం అవశ్యక మార్గ నిర్దేశ గ్రంథం. అది మేధకు విందు. మౌలికంగా ఆలోచించే వారి ఆలోచనకు మేత అది. జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొని బుద్ధ జీవితాన్ని గడప దలచు కొన్న శ్రద్ధాసక్తులున్న శిష్యులకు అది ఆహారం. అల్పజ్ఞ పాఠకుల క్షణి కాసక్తికి అది ఉద్దేశించింది కాదు.

ఆధునిక మనోవిజ్ఞానశాస్త్రం, పరిమితమైనదే అయినా, అది మనస్సు, ఆలోచనలు, ఆలోచనా ప్రక్రియ, మనోధర్మాలను చర్చించే టప్పుడు అభిధమ్మ పరిధిలోకి వస్తుంది. కాని అది (అభిధమ్మం) ఆత్మను గాని, సైకీ (Phyche)ని గాని అంగీకరించదు. సైకీలేని మనోవిజ్ఞాన శాస్త్రాన్ని అది బోధిస్తుంది.

ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్ర గ్రంథాన్ని చదివి నట్లు అభిధమ్మాన్ని చదవా లంటే, అతనికి నిరాశే మిగులుతుంది. ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్రవేత్తకు ఎదురయ్యే సమస్య లన్నింటిని పరిష్కరించే ప్రయత్నం ఇందులో లేదు.

చిత్త (consciousness)ను నిర్వచించారు. ఆలోచనలను నైతిక కోణం నుంచి విశ్లేషించి, వర్గీకరించారు. మనోధర్మాలను (చెతసిక) గణించారు. ప్రతి చిత్త రకాన్ని వివరంగా ప్రతిపాదించారు. ఆలోచనలు ఎలా జనిస్తాయనే విషయాన్ని సూక్ష్మంగా పరిశీలించారు. 'భవంగ' (భవ ఉపాధి), 'జవన' (ప్రచోదనం) ఆలోచనా-క్షణాలను అభిధమ్మం వివరించిది. వీటికి ఆధునిక మనో విజ్ఞాన శాస్త్రంలో సమా నార్థకాలు లేవు. మనోవిజ్ఞాన శాస్త్ర పరిశోధకులకు ఇవి చాల ఆసక్తి జనకాలు. విద్యార్థులకు, పండితులకు ఆసక్తి కలిగించే అప్రస్తుత సమస్యలు - అవి విముక్తికి దోహదం చేయక పోతే - వాటిని కావాలనే ప్రక్కకు నెట్టారు.

పదార్థాన్ని గురించి సంగ్రహంగానే చర్చించారు. అయితే వారు దానిని భౌతిక శాస్త్రజ్ఞులకు అనుగుణంగా విశదీ కరించ లేదు. పదార్థ ప్రాథమిక ప్రామాణాల (units)ను, పదార్థ ధర్మాలను, పదార్థ మూలాన్ని, పదార్థానికి, మనస్సుకు ఉన్న సంబంధాన్ని వివరించారు. మనస్సు, పదార్థాలకు సంబంధించిన వ్యవస్థీకృత విజ్ఞానాన్ని అభిధమ్మం ఇవ్వదు. వస్తువులు యథార్థంగా ఎలా ఉన్నాయో వాటిని అలాగే అర్థం చేసుకోవడానికి అది జీవి నిర్మాణాంశాలైన రెండు కారకాలను పరిశోధించింది. ఆ కోణం నుంచి ఒక తత్వాన్ని రూపొందించడం జరిగింది. ఆ తత్వం మీద ఆధారపడి, అంతిమ లక్ష్యమైన నిబ్బాన (నిర్మాణం)ను చేరదానికి

ఒక ధార్మిక వ్యవస్థను పెంపొందించారు. శ్రీమతి రైస్ డేవిడ్స్ సరిగానే చెప్పింది: ఇందులో రెండు విషయా లున్నాయి: ఒకటి మన లోపల, మనచుట్టు, మనకు ఏమి కనిపిస్తుందో దానినీ, రెండు మనం ఏమి చూడాలని కోరుకొంటున్నామో దానినీ, అభిధమ్మం చర్చించింది.''

సుత్త పిటకలో లోకధర్మ (Conventional) బోధ ఉంటే, అభిధమ్మ పిటకలో పారమార్ధిక బోధ (ultimate teaching) ఉంది. ''బుద్ధుని బోధలను పూర్తిగా అర్థం చేసు కోవా లనుకొంటే అభిధమ్మాన్ని అర్థం చేసుకు తీరాలి. ఎందు కంటే అది వాస్తవికతకు ద్వారాలు తెరుస్తుంది'', అనే విషయాన్ని దాదాపుగా అభిధమ్మ వ్యాఖ్యాతలంతా అంగీకరించారు.

అభిధమ్మంలో ఈ క్రింది ఏడు కృతులు ఉన్నాయి.

1. ధమ్మ సంగని (ధమ్మ వర్గీకరణ)
2. విభంగ (విభజనలు)
3. ధాతు కథా (మూలకాల మీద ఉపన్యాసం)
4. పుగ్గల పణ్ణత్తి (వ్యక్తుల గ్రంథం)
5. కథా వత్తు (వివాదాంశాలు)
6. యమక (జంటల పుస్తకం)
7. పట్ఠాన (కార్యకారణ సంబంధ గ్రంథం)

**బౌద్ధం ఒక తత్త్వమా ?**

ఈ పవిత్రగ్రంథాలలో పొదిగిన ధర్మం సత్యాలకు, వాస్తవాలకు, సంబంధించింది. అందుకని ఎవరైన వైయక్తిక అనుభవంతో పరీక్షించి, రుజువు చేసుకో వచ్చు. అంతేగాని, ఇవాళ మహా సత్యాలని అంగీకరించి, రేపు విసరి కొట్టే ఉహాగానాలకు, సిద్ధాంతాలకు సంబంధించింది కాదు. బుద్ధుడు విప్లవాత్మక తాత్విక సిద్ధాంతాలను ప్రతిపాదించనూ లేదు. ఒక నూతన భౌతిక విజ్ఞాన శాస్త్రాన్ని ఆవిష్కరించనూ లేదు. జీవిత దుఃఖాలను బాపడానికి సంబంధించి నంత వరకు లోపలి, బయటి విషయాలను సరళ, సాదా పదాలలో వర్ణించాడు. అనన్యమైన విముక్తి మార్గాన్ని చూపాడు.

అంతే కాదు, బుద్ధుడు తనకు తెలిసిం దంతా చెప్ప లేదు. ఒక సందర్భంలో అతడు ఒక అరణ్యంలో ఉన్నప్పుడు, ఒకచెట్టునుంచి గుప్పెడు ఆకులు తీసుకొని, ఇలా అన్నాడు: ''ఓ భిక్కులారా, నేను మీకు బోధించింది నా గుప్పెట్లోని ఆకులకు సమానం. నేను మీకు బోధించంది అరణ్యంలోని మొత్తం ఆకులకు సమానం.''[11]

ఒకడు అమలినుడు (పరిశుద్ధుడు) కావ డానికి కేవలం ఏ మేరకు అవసరమని అతడు భావించాడో ఆమేరకే అతడు బోధించాడు. అతని ఉన్నత లక్ష్యానికి (నిర్వాణానికి) అనవసరమని భావించిన వాటి విషయంలో అతడు మౌనం వహించాడు. అనుకో కుండా అతడు నేటి ఆధునిక తాత్వికుని, విజ్ఞాన శాస్త్రవేత్తను ముందుగానే ఊహించాడు.

హెర్క్లీటస్ (Heraclitus 500 B.C.) అంతా ప్రవాహమే, (పంత్వేర్థి) విశ్వం పరిణామి (becoming) అన్నాడు. ఎప్పుడూ ఏదీ లేదు. ప్రతిదీ భవమే (becoming). ''అదే ప్రవాహంలోకి రెండు సార్లు కాలిడ లేడు.'' అనే ప్రఖ్యాత వాక్యాన్ని చెప్పిన వాడు ఇతడే. పైథగరస్ (532 B.C.) ఎన్నో చెప్పాడు. అందులో ఒకటి ఆత్మల పునర్జననం. డాక్కార్ట్ (Descartes 1596 - 1650) 'హేతు బద్ధమైన శంక' అనే న్యాయ స్థానంలో ప్రతి దానిని పరీక్షించాల్సిన అవసరం ఉందని ప్రకటించాడు. స్పినోజ (spinoza 1632 - 1677), శాశ్వత సత్యం ఒకటి ఉందని ఒప్పు కొంటూనే, అస్తిత్వం (భవం) అంతా క్షణ భంగురమే అన్నాడు. అతని ఉద్దేశంలో, దుఃఖాన్ని జయించా లంటే, క్షణ భంగురం, వికారం లేని, నిత్య శాశ్వత వస్తువుల జ్ఞానాన్ని అర్జించాలి. బర్క్లీ (Berkely 1685- 1776) అణువు అని మనం పిలిచేది ''అధి భౌతిక కల్పన'' మాత్రమే అన్నాడు. హ్యూమ్ (1711 - 1776) మనస్సును విశ్లేషించి, చేతన అంటే క్షణికమైన మానసిక స్థితులే అన్నాడు. హేగల్ (Hegel 1770 -1831) దృగ్విషయం అంతా పరిణామమే అన్నాడు. షోపన్‌హర్ (Schopenhauer 1788-1860) ''ప్రపంచం సంకల్పంగా, భావంగా'' (World as will and Idea) అనే గ్రంథంలో దుఃఖం, దాని కారణాన్ని పాశ్చాత్య పరిభాషలో చెప్పాడు. ఆన్రీ బర్గ్‌సన్ (Hemri Bergson 1859-1941) పరివర్తన (change) సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, అంతర్బుద్ధి (intitution) విలువను నొక్కి చెప్పాడు. విలియమ్ జేమ్స్ (1842 - 1916) చైతన్య స్రవంతి (stream of consciousness) సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఆత్మ లేదన్నాడు.

బుద్ధుడు అనిత్యత, దుఃఖం, అనాత్మ సిద్ధాంతాలను 2500 సంవత్సరాలకు పూర్వమే ప్రతిపాదించాడు.

బుద్ధుని నైతిక, తాత్విక బోధలను అధ్యయనం చేయాలి, ఆచరించాలి, అన్నింటిని మించి, ఎవరికి వారు వాటిని తెలుసుకోవాలి. చెందించుకోవాలి. అందుకని జీవన సంద్రాన్ని దాటించే తెప్పగా ధమ్మాన్ని వర్ణించారు.[12]

అందుకని, కచ్చితంగా మాటాడితే, బౌద్ధాన్ని తత్వమని అన లేము. ఎందు కంటే అది జ్ఞానాన్ని ప్రేమించడం (love of wisidom) కాదు, జ్ఞానన్వేషణా (search after wisdom) కాదు[13]. అంతేకాదు ''అది, అజ్ఞాతాన్ని వివరించే ప్రాక్కాల్పనిక వ్యాఖ్యానమూ

కాదు (అధిభౌతిక శాస్త్రంలోలా). లేదా కచ్చ పచ్చగ తెలిసిన దాని ప్రాక్కాల్పనిక వ్యాఖ్యానమూ (నీతి, రాజకీయ శాస్త్రాలలో లా) కాదు.[14]

''కొన్ని ప్రత్యేక విషయాల అన్వేషణ కాక, మనం నివసించే, మనం జీవించే జీవితం లాంటి జీవితాన్ని సాధ్యం చేసే ఈ ప్రపంచం ప్రాథమిక శిలాన్ని అన్వేషించడ మని తత్వానికి అర్థం చెబితే''[15] బౌద్ధం తత్వానికి దగ్గరగా ఉంటుంది. కాని అది అంత కంటె విస్తృతమైంది.[16]

తత్వం ప్రధానంగా జ్ఞానానికి సంబంధించి ఉంటుంది. ఆచరణకు సంబంధించి కాదు; కాని బౌద్ధం ఆచరణను, యథార్థీకరణను నొక్కి చెబుతుంది.

**బౌద్ధం ఒక మతమా?**

''బౌద్ధం'' (Buddhism) అనే గ్రంథంలో ఆచార్య రైస్ డేవిడ్స్ పుట ఒకటిలో రాస్తాడు:

''మతం అంటే ఏమిటి? రెలిజియన్ అనే పదం, మన భాషా కుటుంబానికి చెందని భాషలలో లే దనేది అందరికి తెలుసు. దాని వ్యుత్పత్తి సందిగ్ధం. సిసరో, ఒక వాక్యంలో, re, lego ల నుంచి సాధించి, దాని అసలైన అర్థం ప్రార్థనలను, మంత్రాలను మళ్ళీ మళ్ళీ ఉచ్చరించడం అని చెప్పాడు. మరో వ్యాఖ్యానం ప్రకారం ఈ పదం re, lego ల నుంచే వస్తుంది. అయితే దీని ప్రకారం ఈ పదం మౌలికార్థం బంధం. ఎడతెగని బంధం (దేవతలతో అనే దానిలో సందేహం లేదు). మూడో వుత్పత్తి ఈపదాన్ని lex తో అనుసంధించి, నియమ బద్ధమైన, అకలంక విశ్వాస బద్ధ మనో చట్రంగా అర్థం చెప్పింది.''

మామూలుగా మతం అనే పదాన్ని ఏ అర్థంలో వాడతామో, ఆ అర్థంలో, బౌద్ధం మతం కాదు. ఎందుకంటె అది ఒక ''పూజాక్రతువుల, విశ్వాసాల వ్యవస్థ'' కాదు. ఏ అతి ప్రాకృతిక దేవుని యెడ దానికి విశ్వాసం లేదు.

బౌద్ధం తన అనుయాయుల నుంచి అంధ విశ్వాసం ఆశించదు. కేవల విశ్వాసాన్ని కాదని, దాని స్థానంలో ''జ్ఞానం మీద ఆధారపడిన విశ్వాసాన్ని'' ఉంచడం జరిగింది. బౌద్ధునికి ఋషిత్వంలో ప్రథమ దశను (సోతాపత్తి) చేరేవరకు అప్పు డప్పుడు అనేక సందేహాలు కలగ వచ్చు. ఈ ప్రథమ దశ చేరాక బుద్ధునికి, ధమ్మానికి, సంఘానికి సంబంధించిన అన్ని సందేహాలు నివృత్తి అవుతాయి. ఈ దశను చేరిన తరవాతే ఎవరైన బుద్ధుని నిజమైన అనుచరులు కాగలరు.[17]

బుద్ధుని మీద అనుచరుని విశ్వాసం ఎలాంటి దంటే, ఒక ప్రఖ్యాత వైద్యుని మీద రోగి కుండే విశ్వాసం లాంటిది. గురువు యెడ శిష్యుని కుండే విశ్వాసం లాంటిది. ఒక బౌద్ధుడు బుద్ధుని అసమాన్య మార్గ దర్శిగా, పరిశుద్ధ మార్గాన్ని సూచించే గురువుగా, శరణం పొందినా గూడ, ఆశరణం దాస్యం కాదు. తాను కేవలం బుద్ధుని శరణు వేడడం వల్ల లేదా, కేవలం అతనిలో విశ్వాసం ఉంచడం వల్ల, పరిశుద్ధుడు కాగలడని ఏ బౌద్ధుడు అనుకోడు. ఖచ్చితంగా చెప్పా లంటే ఎవడు ఎవనినీ పునీతం కావించ లేడు, కలుషితం చేయ లేరు. బుద్ధుడు గురువుగా ఒక పరికరం అవుతున్నాడే కాని, వాస్తవానికి మనం పునీతం కావడానికి మనదే బాధ్యత.

ధమ్మ పదంలో బుద్ధుడు అంటాడు

> ''పాపాలు తనకై తాను మాత్రమే చేస్తాడు : తను కారణంగానే తను మలిను డవుతాడు. తనకైతాను మాత్రమే చెడును వర్జించ గలడు, తను మాత్రమే తనను అమలినుని చేసుకోగలడు.
>
> మలినా మలినాలు తన మీదనే ఆధార పడతాయి.
> ఎవడు ఎవనినీ అమలినుని చేయ లేడు''. *(V 165)*

బౌద్ధుడు ఏ (పవిత్ర) గ్రంథానికి గాని, ఏ వ్యక్తికి గాని బానిస కాడు. బుద్ధ ధమ్మాన్ని ఆచరించటం వల్ల అతడు తన ఆలోచనా స్వాతంత్ర్యాన్ని కోల్పోడు. తనంత తానే బుద్ధత్వాన్ని పొందే దాక తన జ్ఞానాన్ని అభివృద్ధి చేసు కోవడానికి, తన స్వేచ్ఛా సంకల్పాన్ని అమలు పరుచు కోవడానికి, అతనికి అన్ని విధాల స్వేచ్ఛ ఉంది. ఎందుకంటె అందరూ బీజరూప బుద్ధులే. సహజంగా బౌద్ధులు బుద్ధుని ప్రామాణికంగా అనుశాసనికునిగా చెప్పు కొంటారు. కాని బుద్ధుడు అటువంటి అనుశాసనికతను త్యజించాడు.

బౌద్ధంలో సత్యానికి ప్రమాణం ఏమిటంటే అవ్యవహిత యథార్థీకరణం. దానిలో ముఖ్యాంశం హేతు పూర్వక అవగాహన. ఎవరో పెద్ద వాడు చెప్పాడనే కారణంగా దేనినీ సత్యాన్వేషకులు అంగీ కరించ రాదని బుద్ధుడు సలహా ఇచ్చాడు. తమ హేతు పూర్వక ఆలోచనతో, ఎవరికి వారే ఒక విషయం తప్పొ, ఒప్పొ అని నిర్ణయించు కోవాలని ఆయన చెప్పాడు.

కాలామ లని పిలవబడే కెసుపుత్త పౌరులు ఒకసారి బుద్ధుని వద్దకు వచ్చి అన్నారు: ''తమకు బోధించ డానికి వచ్చిన అనేక మంది సన్యాసులు, బ్రాహ్మణులు తమతమ ధమ్మాన్ని పొగిడి, ఇతర ధమ్మాలను తెగడారు. అందులో ఎవరు చెప్పేది ఒప్పో, తప్పో తెలియడం లేదు'', అని చెప్పారు.

''అవును, ఓ, కాలామలారా, మీరు సందేహించడం సబబే. మీరు ఏదీ తేల్చుకో లేక ఊగిస లాడడమూ సబబే. సందేహాస్పద విషయం కనుక ఊగిసలాట జరిగింది,'' అని బుద్ధుడు పలికి వారికి ఈ దిగువ సలహాను ఇచ్చాడు. ఆసలహా నేటి హేతు వాదులకు నాటి శంకావాదులకు సమానంగానే అన్వయిస్తుంది.

''రండి, ఓ కాలామలార, వినండి. కేవలం జనశ్రుతి మీద ఎంతో కాలం నుంచి ఇలాగే వింటున్నామని భావించి, ఆధారపడి, దేనిని అంగీకరించ కండి, కేవలం సంప్రదాయంగా వస్తున్నంత మాత్రాన (తరతరాలుగా ఇలా వస్తున్నదనిభావించి) దేనినీ అంగీకరించ కండి. కేవలం పుకార్ల (పరిశోధించకుండ ఇతరుల చెప్పిన దానిని నమ్మి) మీద ఆధారపడి దేనినీ ఆమోదించ వద్దు. మీ మతగ్రంథాల కనుగుణంగా ఉన్నంత మాత్రాన దేనిని అంగీకరించ వద్దు. దేనినీ సంభావన (ఊహ) మీద ఆధారపడి అంగీకరించ వద్దు. అనుమానం (inference) మీద, పైకి కనిపించే రూపాలను పరిగణనలోకి తీసుకొని దేనిని అంగీకరించ వద్దు. నీవు అంతకు ముందే ఏర్పరుచు కొన్న అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నదని ఏ విషయాన్ని అంగీకరించ వద్దు. ఒక విషయం ఆమోద యోగ్యంగా కనిపిస్తుందని, ఆమోదించి తీరాల్సిన విషయమని, దానిని ఆమోదించ వద్దు. మన గౌరవాన్ని చూర గొన్నాడు కనుక ఆసన్యాసి చెప్పింది వాస్తవమని అంగీకరించ రాదు.''

''ఇవి అనైతికాలని, ఇవి నింద్యాలనీ, జ్ఞానులు వీటిని అభిశంసించారనీ, ఈ ఈ పనులు చేస్తే నాశం జరుగు తుందనీ, దుఃఖం కలుగు తుందనీ, నీకై నీకు తెలిసి నప్పుడు, నిజంగా నీవు వాటిని వర్జించు.''

''ఇవి నైతికాలనీ, అనింద్యాలనీ, జ్ఞానులు వీటిని మెచ్చుకొన్నారనీ, వీటినిచేస్తే సుఖ సంతోషాలు, శుభం కలుగు తుందనీ, నీకై నీకు తెలిసి నప్పుడు నీవు అలా జీవించు, అలా పని చెయ్యి''[18].

ఈ ఇరవయ్యో శతాబ్దిలో గూడ ఎప్పుడో బుద్ధుడు 2500 సంవత్సరాల క్రితం చెప్పిన ధమ్మ వచనాలు వాటి ఆవశ్యకతను, తాజా తనాన్ని కోల్పో లేదు.

జ్ఞాన సార సముచ్చయం, సాదా ఉదాహరణతో, వేరే మాటలతో, అదే సలహాను ఇస్తుంది:

''తెలివైన వాడు బంగారాన్ని పుటం పెట్టి, నరికి, గీటు రాయితో గీసి పరీక్షిస్తాడు. అలాగే నేను చెప్పిన దానిని, నా మీద గౌరవంతో గాక, పరీక్షించి ఆమోదించండి.''

బుద్ధుడు తన శిష్యులను సత్యశోధన చేయమన్నాడు. మీ కంటె పై వాడు చేసే అనునయాన్ని మీరు పట్టించు కోవద్దు.

సరే, ఇప్పుడు బౌద్ధంలో అంధ విశ్వాసం లేదని ఒప్పుకొంటాం, కాని బుద్ధ ప్రతిమల పూజ, విగ్రహారాధన లేదా అని ఎవరైన ప్రశ్నించవచ్చు.

ఇహ పర లేదా ధార్మిక లాభాల నాశించి బౌద్ధు లెవరూ ఏ ప్రతిమను పూజించరు. కాకపోతే బౌద్ధం ప్రతిపాదించే దానికి శ్రద్ధ ఘటిస్తారు. ఒక బౌద్ధుడు ప్రతిమకు అగరువత్తులు, పూలు అర్పించా డంటే, అవి ఆ ప్రతిమకు కాదు, బుద్ధునికి, బుద్ధుని గుణాలను, పూల క్షణభంగురతను పర్యాలోచిస్తూ, బుద్ధుని మీది విశ్వాసానికి గుర్తుగా అతడు అలా చేస్తాడు. ఒక మంచి అవగాహన ఉన్న బౌద్ధుడు, తాను ఆ మహోన్నతు బుద్ధుని సమక్షంలో ఉన్నానని, తాను బుద్ధు నంతటి వాడివి కావాలనే అనుభూతి పొందడం కోసం అలా చేస్తాడు.

విగ్రహాల గురించి తన *Travel Diary of a Philospher* లో కౌంట్ కెయిసర్‌లింగ్ ఇలా రాశాడు: ''ఈ ప్రపంచంలో బుద్ధ ప్రతిమ కంటె భవ్యమైన మరో ప్రతిమను నేను కానను. ఈ దృగ్గోచర ప్రపంచంలో అది పరిపూర్ణమైన మూర్తీభవించిన ధార్మికత.''

మళ్ళీ చెప్పా లంటే బౌద్ధులు బోధి వృక్షాన్ని గూడ పూజించరు. కాని దానిని జ్ఞానోదయం ప్రతీకగా గ్రహించి గౌరవార్హంగా పరిగణిస్తారు.

బౌద్ధులు అటువంటి బాహ్యరూపాలను గౌరవ పురస్కారంగా చూసి నప్పటికి, వారు బద్ధుని దేవునిగా ఆరాధించరు.

ఈ బాహ్యరూపాలు తప్పని సరి ఏమీ కాదు. కాక పోతే తన శ్రద్ధను ఏకాగ్రతతో నిలప డానికి అవి ఉపయోగ పడతాయి. ధీశాలి అయిన వాడు ఇవి లేకుండానే, తేలికగా తన శ్రద్ధను బుద్ధుని మీద కేంద్రీ కరించి, అతనిని దర్శించ వచ్చు.

మన మంచి కోసం, మనకున్న విశ్వాసం వలన, అటువంటి అభివాదాలను ఘటిస్తాము. కాని బుద్ధుడు మన నుంచి ఆశించేది అటువంటి నమస్కారాలను కాదు. తన బోధను వాస్తవంగా పాటించాలని.

బుద్ధుడు గతించ డానికి కొంత ముందు చాల మంది శిష్యులు తమ అంతిమ నమస్కారాలు చెప్పడానికి వచ్చారు. ఒక భిక్కు మాత్రం ధ్యాన మగ్నుడై తన గదిలోనే ఉండి పోయాడు. ఈ విషయం బుద్ధునికి ఎరుక పరిచారు. బుద్ధుడు అతనిని రావించి ''ఏమిటి విషయం?'', అని అడిగాడు. అప్పు డా శిష్యుడు ఇలా సమాధానం చెప్పాడు: ''దేవా, మూడు నెలలో మీరు గతిస్తారని నాకు తెలుసు. గురువును గౌరవించడ మంటే, మీరు గతించే లోగా అర్హంతను కావడ మేనని అనుకొన్నాను.''

విశ్వాస పాత్రుడైన విధిబద్ధుడైన ఆ శిష్యుని బుద్ధుడు ప్రశంసించాడు: ''చాల బాగుంది! నన్ను ప్రేమించే వారు ఎవరైన ఈ భిక్కుతో పోటీ పడండి. నా బోధను ఎవరు బాగా పాటిస్తారో వారు మాత్రమే నన్ను బాగా గౌరవించి నట్లు.''[19]

మరో సందర్భంలో బుద్ధుడు అన్నాడు: ''ధమ్మాన్ని కన్నవాడు నన్ను కంటాడు''.[20]

ఇంకా బౌద్ధంలో విజ్ఞాపన, వినతి, ప్రార్థనలు ఏవీ ఉండవని చెప్పాలి. బుద్ధుణ్ణే ఒకడు ఎంతగా ప్రార్థించినా అతనికి విముక్తి కలగదు. తనను ప్రార్థించిన వారికి బుద్ధుడు ఎటు వంటి ఇహ లోక అనుగ్రహాలను ఉపకారాలను ప్రసాదించడు, ప్రసాదించ లేడు. బౌద్ధుడు ఎప్పుడూ ముక్తి కోసం ప్రార్థించ కూడదు. అతడు తన మీద తాను ఆధార పడి తన స్వేచ్ఛ, శుద్ధతల కోసం పట్టుదలతో శ్రమించాలి. బుద్ధుడు శిష్యులకు తమ మీద తాము ఆధార పడాలని, ఇతరుల మీద ఆధార పడ రాదని చెబుతూ ఇలా అన్నాడు :

''ప్రయత్నం అంతా మీదే,
తథాగతులు కేవలం గురువులు మాత్రమే''[21]

బుద్ధుడు ప్రార్థనల[22] వల్ల ఏమాత్రం ఉపయోగం లేదని చెప్పడమే కాదు, అందులోని బానిస మనస్తత్వాన్ని తెగడాడు. ప్రార్థనలకు బదులుగా బుద్ధుడు, ఆత్మ (self) సంయమనం, నిగ్రహం, స్వీయ పరిశుద్ధత, స్వీయ జ్ఞానాలను పెంపొందించే ధ్యానం ప్రాముఖ్యతను నొక్కి చెప్పాడు. అది మనస్సుకు, హృదయానికి బల వర్ధకౌషధంగా పని చేస్తుంది. ధ్యానం బౌద్ధసారం.

ఇతర మతాలలో లాగ, బౌద్ధంలో భయ పడాల్సిన, ఆరాధించాల్సిన సర్వశక్తిమంతుడైన భగవంతుడు లేడు. సర్వ శక్తిమంతమైన, కారణ రహితుడు అయిన, ఒక అతి ప్రాకృతిక దేవుని అస్తిత్వాన్ని బౌద్ధం నిరాకరిస్తుంది. బౌద్ధంలో ఈ శోన్మేషాలు (revelations) గాని, దేవదూతలు గాని, ప్రవక్తలు గాని లేరు. కర్మలను నిర్దేశించే, మనకు వరాలు, శాపాలు ఇస్తారని భావించే, ఏ అతి ప్రాకృతి శక్తులకు బౌద్ధుడు దాసుడు కాడు. బౌద్ధులు దివ్యోన్మేషాలను విశ్వసించరు కనుక, బౌద్ధం సత్యం మీద తనదే గుత్తాధిపత్యమని ప్రకటించు కొని పరమత దూషణకు పూను కోదు. ''అసహనం మతానికి పరమ శత్రువు.'' ఇతరులు తనను గురించి గాని, తన బోధన గురించిగాని, తన సంఘాన్ని గురించిగాని చెడుగా మటాడి నప్పుడు, అసంతృప్తి చెంద వద్దని, కోపం తెచ్చుకో వద్దని, తన సహజ లక్షణమైన సహనంతో, బుద్ధుడు తన శిష్యులకు, సలహా ఇచ్చాడు. ''మీరు అసహనం ప్రదర్శించి నట్లయితే, మీరు ధార్మికంగా నష్ట పోవడమే కాక, వారు చెప్పే దాంట్లో వాస్తవం ఎంతో, అవాస్తవం ఎంతో తెలుసుకో

లేరు'' - అన్నాడు బుద్ధుడు. ఇదెంతో మంచిమాట. ఇతర మతాల (విశ్వాసాల) వారు అన్యాయంగా చేసిన విమర్శల గురించి బుద్ధుడు ఇలా అన్నాడు: ''ఇదెలాంటి దంటే ఒకడు స్వర్గం మీదికి ఉమ్మివేస్తే - అది స్వర్గాన్ని కలుషితం చేయదు. కాని అది తిరిగి అతని మీదే పడుతుంది, అలాంటిది.''[23]

అంధంగా విశ్వసించి తీర వలసిన విశ్వాస నియమాలు కాని, వివేచన రహితంగా కేవలం విశ్వాసం మీద ఆధారపడి ఆమోదించ వలసిన ఆధికారిక మత ఆదేశాలు కాని, మతం పుచ్చు కోవ డానికి ముందుగా చేయ వలసిన మూఢ కర్మకాండ, క్రతువులు గాని, తాను పరిశుద్ధుడు కావ డానికి చేయ వలిసిన అర్థం పర్థం లేని యజ్ఞాలు, ఉపవాసాలు గాని బౌద్ధానికి లేవు.

నిక్కచ్చిగా చెబితే బౌద్ధం ఒక మతం కాదు. ఎందుకంటే అదొక విశ్వాస, పూజా వ్యవస్థ కాదు. ''దేవుడు ఉన్నా డనడానికి, తాము విధేయులుగా ఉండవలసిన, సేవించవలసిన, గౌరవించ వలసిన దేవతలకు తమ కర్మను నిర్ణయించే అధికారం ఉందనడానికి గుర్తుగా సూచించే బాహ్య చర్య లేదా ఆకృతి మతం'' అని వెబ్‌స్టర్ నిఘంటువు చెప్పిన నిర్వచనం ప్రకారం గూడ బౌద్ధం మతం కాదు.

కారల్ మార్క్స్ చెప్పాడు: ''మతం అనేది ఆత్మ రహిత పరిస్థితుల ఆత్మ, హృదయ రహిత ప్రపంచ, హృదయం. ప్రజల మత్తు మందు.'' బౌద్ధం అటు వంటి మతమూ కాదు. ఎందు కంటే బౌద్ధ దేశాలన్నీ బౌద్ధం అనే ఊయెలలో పెరిగాయి. వాటి ప్రస్తుత సాంస్కృతిక వికాసం ముఖ్యంగా బుద్ధ బోధల ప్రభావ సత్ఫలితమే.

''జీవితాన్ని పైపైన తడమడం గాక, దాని దిశగా గాక, దాని లోకి చూడడం నేర్పే బోధ అని మతానికి అర్థం చెబితే, జీవితాన్ని ఇలా లోతుగ చూసే దృష్టితో మానవుల నడతకు మార్గ నిర్దేశం చేసే బోధగా మతానికి అర్థం చెబితే, జీవితాన్ని ధైర్యంగా, మృత్యువున ప్రశాంతంగా, ఎదుర్కొనేట్లు చేసే బోధగా మతానికి అర్థం చెబితే[24], లేదా జీవిత దుఃఖాలన్నింటి నుంచి విముక్తం గావించే బోధగా మతానికి అర్థం చెబితే, అప్పుడు తప్పకుండ బౌద్ధం మతాలకు మతం అవుతుంది. బౌద్ధం అంటే ఏమిటి? అని డా. ధాల్కే వాదిస్తూ ఇలా రాశాడు: ''దీనితో, బౌద్ధాన్ని ఒక మతంఅని, బౌద్ధం మీద నిందా ప్రకటన చేశారు. మామూలు అర్థంలో ఈ జీవితం కంటె పూర్తిగా భిన్నమైన మరో జీవితం ఉందని మతం చెబుతుంది. ఈ అర్థంలో బౌద్ధం మతం కాదు, కాలేదు.'' (*Buddhism and its Place in the Mental World*, P. 27)

**భౌద్ధం ఒక నైతిక దర్శనమా ?**

బౌద్ధానికి ఒక మంచి నీతి సంహిత ఉంది. దీనిలో భిక్కుల కొక నీతి సంహిత, ఉపాసకులకు మరొకటి ఉన్నాయి. ఇది మామూలు నీతి బోధ కంటె చాల ఎక్కువ అయింది.

శీలం (నీతి) అనేది ఒక ప్రాథమిక దశ మాత్రమే. అదొక లక్ష్యానికి సాధనం. అంతేకాని దాని కదే లక్ష్యం కాదు. అది అత్యంత ఆవశ్యకమే అయినా, కేవలం దీని ద్వారానే ముక్తి లేదా పరిపూర్ణ శుద్ధతను పొందడం కుదరదు. విశుద్ధ పథంలో ఇది మొదటి దశ మాత్రమే. శీలానికి ఆవల ప్రజ్ఞ (Wisidam) ఉంది. బౌద్ధానికి శీలం భూమిక అయితే, ప్రజ్ఞ శిఖరం అవుతుంది. పక్షికి రెండు రెక్కలులా, ఈ రెండు గుణాలు పరిపూరకాలు. ప్రజ్ఞ మనిషికి నేత్రం అయితే శీలం పాదాలు. బుద్ధుని బిరుదులలో ఒకటి విజ్ఞాచరన సంపన్న. అతడు ప్రజ్ఞాశీల సంపన్నుడు.

బౌద్ధానికి పునాది అయిన నాలుగు ఆర్య సత్యాలలో మొదటి మూడు బుద్ధుని తత్వాన్ని చెబితే, నాలుగోది ఆతత్వం మీద ఆధార పడిన శీలాన్ని చెబుతుంది.

బౌద్ధంలో శీలం సందేహాస్పదమైన ఈశోన్మేషం మీద ఆధార పడదు. అది ఒక అసాధారణ మేధావి మనస్సు నుంచి వచ్చిన పరికల్పన కాదు. వ్యక్తుల అనుభవం ఆధారంగా, రుజువు చేయ డానికి వీలైన విషయాల ఆధారంగా రూపొందిన హేతుబద్ధ, ఆచరణాత్మక, సంహిత అది. మాక్స్‌ముల్లర్ ఉద్దేశంలో, ప్రపంచంలో ఇంతవరకు వచ్చిన నైతిక సంహితలలో కెల్ల అత్యంత పరిపూర్ణమైంది ఇది.

ఆచార్య రైస్ డేవిడ్స్ ఇలా అంటాడు: ''ప్రపంచంలోని బౌద్ధ, బౌద్ధేతర మత దర్శనాల నన్నింటిని పరిశీలించాను. వాటి అన్నింటిలో ఏదీ గూడ, రామణీయకతలో, అవగాహనలో బుద్ధుని అష్టాంగ మార్గాన్ని అధిగమించ లేదు. ఆ మార్గానుసారం నేను నా జీవితాన్ని మలుచు కోవడంలో సంతృప్తి పొందుతాను''

బౌద్ధంలో నైతికంగా మంచి, చెడ్డ కర్మ లున్నాయి, మంచివి చెడ్డవి కాని కర్మ లున్నాయి. అన్ని కర్మలను ఉచ్చేదించే కర్మ లున్నాయి. ఇది చాల ఆసక్తికరమైన విషయం. ఒకడు ముక్తి పొందా లంటే సత్కర్మలు కావాలి. కాని, పవిత్ర జీవిత అంతిమ లక్ష్యం చేరిన తరువాత, అతడు మంచి చెడ్డ కర్మలకు అతీతు డవుతాడు.

బుద్ధుడు అంటాడు: ''ధర్మ విషయాలను పరిత్యజించాలి. మరి అధర్మవిషయాలను ఎంతగా పరిత్యజించాలో''[25]

లోభ, దోష, మోహాలతో గూడిన కర్మ దుఃఖ భాజకం. అలోభ, అదోష, ప్రజ్ఞలతో గూడిన కర్మ మంచిది.

అర్హంత, అకలుషితుడైన వానికి, నైతిక విలువలతో పని లేదు. ఎందుకంటె అతడు మంచి చెడులకు అతీతుడు. దీనికి అర్థం అతడు నిష్క్రియుడని కాదు. అతడు చాలగా క్రియా శీలుడే. కాని అతని క్రియ స్వార్థ రహితం. తను నడిచిన మార్గాన్ని ఇతరులకు చూపడంలో సహాయ పడతాడు. మామూలుగా అతని కర్మలను మంచివిగానే పరిగణిస్తారు. అతని కర్మలలో అతనికి సంబంధించి నంత వరకు సృజనాత్మక శక్తి ఉండదు. విషయాసక్తుని కర్మల వలె కాక, ఇతని కర్మలు అతనిపై కర్మ ప్రభావాన్ని చూపవు.

అతని కర్మలను పాళీలో కిరియ (క్రియ - ప్రకార్యక) అంటారు. శుద్ధ తమ బంగారాన్ని ఎవడు మరింత శుద్ధి చేయ లేడు.

లోకోత్తరపథ విజ్ఞాన సంబంధమైన నాలుగురకాల మానసిక స్థితులు: - సొతాపత్తి (నదిని దాటిన వాడు), సకదాగామి (ఒకసారి తిరిగి వచ్చు వాడు), అనాగామి (ఎప్పుడూ తిరిగి రాని వాడు), అర్హత్త (అర్హతుడు) - ఇవి కుశలాలే అయినా, వీటి వల్ల కర్మ సంచయం జరగదు. కాని, దీని కంటె భిన్నంగా, ఇవి వ్యక్తిక పరిణామ స్రవంతిని క్రమంగా ఎండ గడతాయి. అలా క్రమంగా మంచిచెడు కర్మల ఉచ్ఛేదానికి దారి తీస్తాయి. ఈ నాలుగు అలౌకిక విజ్ఞాన రకాలలో ప్రజ్ఞ ప్రబలమైంది. ప్రజ్ఞ కర్మమూలాన్ని చేదిస్తుంది. లౌకిక విజ్ఞాన రకాలలో చేతన (Volition) ప్రబల మైంది. ఇది కర్మ క్రియలకు దారితీస్తుంది.

బౌద్ధం ప్రకారం శీలానికి కొలబద్ద ఏమిటి?

దీనికి సమాధానం బుద్ధుడు యువసామణెర రాహులుని మంద లించడంలో ఉంది:

"నీవొక పని చేయాలను కొంటే రాహులా, ఈ విధంగా పర్యాలోచించు: 'నేను చేయ బోయే పని, నాకు లేదా ఇతరులకు, లేదా ఇద్దరికి హాని కలిగిస్తుందా? అలా అయితే అది చెడ్డ పని. అది దుఃఖహేతువు అవుతుంది'. అటువంటి పనిని నుంచి నీవు వెను దిరుగు.

"నీవొక పని చేయాలను కొన్నప్పుడు ఇలా ఆలోచించు: 'నే చేయ బోయే ఈ పని నాకు, ఇతరులకూ - ఇద్దరికీ హాని కలిగించదా? హాని కలగించ నట్లయితే అది మంచి పని. అది సుఖ హేతువు అవుతుంది'. అటువంటి పని నీవు మరల మరల చెయ్యి"[26]

శీలాన్ని కొలవడంలో బౌద్ధుడు తన ఇతరుల శ్రేయస్సును పరిగణన లోకి తీసు కొంటాడు, జంతువులను కూడ కలుపు కొని.

కరణీయ మెత్త సుత్తలో బుద్ధుడు ఉపదేశిస్తాడు: ''ఒక తల్లి తన ప్రాణాన్ని గూడ లెక్కించక తన బిడ్డను ఎలా కాపాడు కొంటుందో, అలాగే ప్రతి ఒక్కడు సర్వ జీవుల యెడ అనంత ప్రేమపూరిత కరుణా చింతనను అలవరుచు కోవాలి''[27]

ధమ్మపదం, V.129 అంటుంది:

''దండనంటే అందరికీ భయమే, ప్రాణం అందరికీ తీపే. ఇతరులూ తనలాగే అనుకొని, ఎవరూ ఇతరులకు హాని చేయ కుందురు గాక, ఇతరులను చంప కుందురు గాక!

అసాధారణ ఉన్నత ప్రమాణిక శీలాన్ని అర్థం చేసు కోవాలంటే తన అనుయాయులంతా జాగరూకతతో ధమ్మ పదాన్ని, సిగాలోవాదసుత్తను, వ్యఘ్ఘపజ్జసుత్తను, మంగల సుత్తను, మెత్తసుత్తను, రావసుత్తను, వసలసుత్తను, ధమ్మికసుత్త మొదలైన వాటిని చదవాలని బుద్ధుడు ఆశిస్తాడు.

నైతిక బోధగా అది అన్ని నీతి దర్శనాలను మించింది. కాని శీలం అనేది బౌద్ధానికి ఆరంభమే కాని, అంతిమ లక్ష్యం కాదని గుర్తుంచు కోవాలి.

ఒక అర్థంలో బౌద్ధం దర్శనం కాదు. మరో అర్థంలో అది దర్శనాలకు దర్శనం.

ఒక అర్థంలో బౌద్ధం మతం కాదు. మరో అర్థంలో అది మతాలకు మతం.

**బౌద్ధం అంటే**

బౌద్ధం అధి భౌతిక మార్గం కాదు, కర్మకాండ పద్ధతీ కాదు.
అది శంకాత్మకమూకాదు, వైధికమూ కాదు,
అది శాశ్వత వాదమూ కాదు, శూన్య వాదమూ కాదు.
అది కఠోర ఆత్మని గ్రహమూ కాదు, విచ్చల విడిగా కోర్కెలకు వశం అవడమూ కాదు.
అది ఆశావాదం కాని, నిరాశావాదం కాని కాదు
అది కేవలం ఇహ లోకానికో పర లోకానికో సంబంధించింది కాదు.
అది బహిర్ముఖీ కాదు, అంతర్ముఖీ కాదు.
అది దివ్య కేంద్రకం కాదు, కాని మానవ కేంద్రకం,
అదొక అనన్య జ్ఞానోదయ పథం.

బౌద్ధం అంటే పాళీ బాషలో ధమ్మం. శబ్దార్థపరంగా ధమ్మం అంటే నిల బెట్టేది. ఆలంబనగా ఉండేది, బల పరిచేది, కొన సాగించేది, చెదర కుండ అట్టే పెట్టేది అని అర్థం. అంటే దాని సుత్తల ప్రకారం నడుచు కొన్న వారిని బల పరుస్తుంది, నిల బెడుతుంది. ఆ విధంగా దుఃఖావస్థలలో పడ కుండ నిలవ రిస్తుంది. దీనికి సరైన ఆంగ్ల పదం లేదు.

ఏదైతో ఉన్నదో అది ధమ్మం. అది వాస్తవికతను చెప్పే ధమ్మం. అది దుఃఖ నివృత్తి సాధనం. అసలు అదే విముక్తి. బుద్ధులు పుట్టినా, పుట్టక పోయినా అక్కడ శాశ్వతంగా ధమ్మం ఉంటుంది. దానిని యథార్థం చేసుకొనేది ఒక బుద్ధుడు మాత్రమే. ఒక బుద్ధుడు, ఒక జ్ఞానోదయం అయినవాడు వచ్చి చెప్పే వరకు, అది అవిద్యా నేత్రాలున్న మానవుల కంట ఎప్పటికీ పడదు.

''తథాగతుడు వచ్చినా, రాకపోయినా ఓ భిక్కులారా, 'ఔపాధిక వస్తువులన్నీ (సంఘాతాలన్నీ) భంగురాలే, దుఃఖాలే, అనాత్మకాలే. ఈ విషయాన్ని తథాగతుడు యథార్థం చేసు కొంటాడు, అర్థం చేసుకొంటాడు. అతడు ఇలా అర్థం చేసుకొని, యథార్థం చేసుకొన్న తరువాత, ఆ విషయాన్ని ప్రకటిస్తాడు, బోధిస్తాడు, స్థాపిస్తాడు, బహిరంగ పరుస్తాడు, విశ్లేషిస్తాడు, స్పష్టం చేస్తాడు. ఈ విధంగా: ప్రత్యయిక (హేతువును పొంది) (సంఘాత) వస్తువులన్నీ క్షణికాలు, దుఃఖాలు. వేటిల్లోను ఆత్మ లేదు''[28]

మజ్ఝిమని కాయంలో బుద్ధుడు ఇలా అంటాడు: ''బుద్ధుడు ఒకే ఒక విషయాన్ని బోధిస్తాడు, అదేమంటే దుఃఖం, దుఃఖనివృత్తి''[29]

ఇది వాస్తవికతా ధర్మం.

ఉదాన చెబు తున్నది: ''ఓ భిక్కులారా, మహా సముద్రానికి ఉన్నది ఒకే ఒక రుచి. అది ఉప్పగా ఉండడం. అలాగే భిక్కులారా, ఈ ధర్మానికి ఉన్నదీ ఒకే ఒక రుచి. అది మోక్ష రుచి''[30]

ఇది విముక్తి సాధనం.

ఈ పరమోన్నత ధమ్మం మనిషికి వెలుపలిది కాదు. అది పూర్తిగా అతని మీద ఆధార పడి ఉంది. దానిని అతడు యథార్థీకరణం చెందించుకో వలసిందే. విషయం అలా ఉంది గనుక బుద్ధుడు ఇలా ఉపదేశించాడు:

''అత్తదీపా విహరథ అత్తపటిసరణా'' - తనకు తాను ఒకద్వీపంలా ఉండాలి. తనకు తాను ఒక శరణం లా.

''ధమ్మదీపా విహరథ, ధమ్మ పటిసరణా, నాఞ పటిసరణా'' - ఒక ద్వీపంలో నివసించినట్లుగా ధమ్మంలో వసించు, ఒక శరణాన్ని నమ్ము కొన్నట్లుగా ధమ్మాన్ని నమ్ముకో''.[31]

**పాద సూచికలు :**

1. మహావంశ అనువాదం PP. 14 - 50 చూడండి.

2. Ibid., PP. 19 - 50

3. ఇది సింహళ అంతర్భాగంలో కాండీనుంచి 24 మైళ్ళ దూరంలో ఉన్న శివారు. సింహళ బౌద్ధులకు నేటికీ ఈ పవిత్ర రాతి దేవాలయం ఒక యాత్రాస్థలమే. ఒల ఆకుల మీద వ్రాసిన గ్రంథాల మొత్తాన్ని ఒకచోట పేరిస్తే అవి ఆరు ఏనుగులు ఎత్తు అవుతాయని, మహా వ్యాఖ్యాత బుద్ధఘోషుని జీవిత కథ అయిన 'బుద్ధఘోసుప్పత్తి' పేర్కొంటున్నది.

4. సంస్కృతం - త్రిపిటిక

5. మొత్తం బౌద్ధ సంఘానికి అన్వయించిన పాళి పదం సాసన (dispenstion)

6. G.T. Garrat సంపాదకించిన *Legacy of India*, PP. X, XI చూడండి.

7. ''దయా పూరిత సహవేదనలు, న్యాయ భావం ఉన్న, ఆ గంగా తీర వాసుల, జనపదాల ప్రజలు సుఖంగా ఉందురు గాక. అటువంటి సహవేదనలను, న్యాయ భావాలను ఈ సరళ, నిర్వ్యాజ వాక్యాలు విశ్వసిస్తున్నాయి''. *Buddism,* P. 148. ఈ సుత్త దీఘ నికాయంలో ఉంది, 111, 31, P. 180

8. Narada Thera *The Manual of Abidhamma* చూడండి.

9. పరినిబ్బాణ సుత్తలో పేర్కొన్న *'మాతికా'* ను గమనించండి. ప్రకరణం 14, n. 8 above చూడండి.

10. *Points of Controversy,* the authorship of which is attributed to Venerable Moggaliputta Tissa who presided at the Third council in the time of King Asoka.

11. సంయుక్త నికాయ, V, P, 437 - 38; *Kindred Sayings*, V. P. 370

12. మజ్ఝిమనికాయ, 1, 22, P. 135

13. Webster's Dictionary

14. W. Durant, *The History of Philosophy* P. 2

15. Webb, *History of philosophy.*

16. ''జ్ఞాన దర్శనం అనే అర్థంలో ఒక తత్వం. ఇది ''ఏమిటి'' అనే ప్రశ్నకు, జీవితం ఏమిటి? అనే ప్రశ్నకు సంపూర్ణ సమాధాన మిస్తుంది - ఇది అది కాదు''. (డా. థాల్కే *Buddhism* - P 25)

17. ఒక మామూలు అనుషంగికుడు (adherent) అనుయాయిగా శుద్ధమైన వాడుగానే ఉండ వచ్చు. అంత మాత్రం చేత, బుద్ధ ధమ్మాన్ని యథార్థీ కరణం చెందించు కోవడంలో భాగస్వామి కాడు

18. అంగుత్తరని కాయ, 1. P. 187; Gradual Sayings, 1, PP. 171 - 172 ఇంతకు ముందరి అనువాద వివరణ భాగాలు (కుండలీకరణంలో ఉన్నవి) వ్యాఖ్యానం, ఉపవ్యాఖ్యానాల కనుగుణంగా ఉన్నాయి.

19. *Buddhist Legends* 111, PP. 249 - 50 చూడండి.

20. సంయుత్త నికాయ, 111, P. 120

21. ధమ్మపద V. 276.

22. ''ప్రార్థన ఒక క్రియ. దానిలో నేను నిష్ణాతుడను కానని బాహాటంగా అంగీకరిస్తున్నాను'' Canon B.H. Streeter in Modern churchman. sept. 1924, P. 347. '' ఎవరో వింటున్నారనే నమ్మకం లేకపోతే మనుషులు ఎందుకు ప్రార్థిస్తారో నాకు అర్థం కాదు''. - పోల్చండి. Rev. C. Beard, *Reformation,* P. 419.

''ప్రార్థనలు ఆంతరంగిక భావ ప్రసారాలు. ఆ దేవునితో స్వార్థంతో బేర మాడతాయి. ఇహ లోకపు కోర్కెలు తీరాలని కోరతాయి. 'తనుతనాన్ని' పెంచుతాయి. ధ్యానం, అలాకాక, ఆత్మపరివర్తనం'', రాధకృష్ణన్ చెప్పాడు.

23. రాధాకృష్ణన్ ''గౌతమబుద్ధుడు'' చూడండి.

24. మాజీభిక్షు సిలచార. Cylon *Daily News* వెసక్ నెం. మే, 1939. చూడండి.

25. *మజ్జిమ నికాయ,* 1.22, P. 135

26. *మజ్జిమ నికాయ,* 1, 66,
*రాహులోవాద సుత్త,* P. 416

27. *సుత్త నిపాత.* 1, 8, (149), P. 26

28. *అంగుత్తర నికాయ,* 1, P. 286

29. *మజ్జిమ నికాయ,* 1, 22, P. 140

30. 5, 5, 12, P. 56 (PTS, Ed. 1948) Also at *Vinaya* 11, 9, 2

31. పరినిబ్బాణ సుత్త; ప్రకరణం. 14 పైన చూడు.

పదహారో ప్రకరణం

# బౌద్ధం ముఖ్య లక్షణాలు

''ప్రతి ఒక్కడు ఎవరికి వారే స్వయంగా యథార్థీకరణం చెందించుకోగల, సద్యఃఫలాన్నిచ్చే, పరిశోధనకు స్వాగతం పలికే, పరినిర్వాణానికి దారి తీసే, జ్ఞానులు అవగాహన చేసుకోగల ధమ్మాన్ని ఆ ఉన్నతుడు చక్కగా నిరూపించాడు.''

– మజ్ఝిమ నికాయ

**బౌద్ధం పునాదులు**

బుద్ధుడు స్వయంగా కనుగొని, ప్రపంచానికి అందించిన నాలుగు ఆర్యసత్యాలు బౌద్ధానికి స్థిరమైన పునాదులు. ప్రధాన లక్షణాలు.

అవి (1) దుఃఖం (బౌద్ధం అస్తిత్వానికి ప్రధాన కారణం) (2) దాని కారణం, అంటే తృష్ణ (3) దాని అంతం అంటే నిర్వాణం (బౌద్ధానికి పరమార్థం) (4) మధ్యేమార్గం.

మొదటి మూడు బౌద్ధ తత్వాన్ని ప్రతిబింబిస్తే, నాలుగోది ఈ తత్వాన్ని అనుసరించిన బౌద్ధశీలాన్ని ప్రతిబింబిస్తుంది.

బుద్ధ ధమ్మానికి అంతర్భూతాలైన ఈ నాలుగు సత్యాలు ఈ దేహం మీద ఆధారపడినవే. అవి పూర్తిగా మానవునితోను, ఇతర సత్యాలతోను ముడివడి ఉన్న, ప్రశ్నించరాని సత్యాలు.

బుద్ధులు అవతరించినా, అవతరించక పోయినా ఈ సత్యాలు విశ్వంలో ఉంటాయి. వాటిని బుద్ధులు ప్రపంచానికి బహిర్గతం చేస్తారు.

దుఃఖం అనే ఇరుసు మీద బౌద్ధం తిరుగుతూ ఉంటుంది. బౌద్ధం దుఃఖాన్ని నొక్కి చెప్పి నప్పటికి, అది నిరాశా వహ మతం కాదు. అది పూర్తిగా ఆశా వహమూ కాదు, నిరాశా వహమూ కాదు, వాస్తవికతకు సంబంధించింది. దుఃఖాన్ని అంత మొందించి, శాశ్వత సుఖాన్నిచ్చే మార్గం నిర్దేశించ కుండ బుద్ధుడు కేవలం దుఃఖమనే సత్యాన్నే నొక్కి చెప్పి నట్లయితే అతడు నిరాశా వాది అవుతాడు. బుద్ధుడు దుఃఖం సార్వత్రికతను దర్శించాడు. ఈ సార్వత్రిక మానవాళి రుగ్మతకు మందును గూడ నిర్దే శించాడు. మనం ఊహించ గల అత్యంత సుఖం, బుద్ధుని దృష్టిలో, నిర్వాణం. నిర్వాణం అంటే దుఃఖాన్ని పూర్తిగా తుడిచి వేయడం.

బ్రిటానికా విజ్ఞాన సర్వస్వంలో నిరాశావాద (Pessimism) రచయిత ఇలా రాస్తాడు:

''నిరాశా వాదం జీవితం యెడ నిరాశా, నిస్పృహల దృక్పధాన్ని సూచిస్తుంది. మానవ వ్యవహార మంతా బాధా దుఃఖాలతో నిండి ఉంటుందనే ఒక అస్పష్ట సాధారణ అభిప్రాయాన్ని అది సూచిస్తుంది. బుద్ధుని మౌలిక సిద్ధాంతం, ఆశావహతలో, పాశ్చాత్యులు ప్రతిపాదించిన అశావహ సిద్ధాంతానికి సరి పోతుంది. అతని సిద్ధాంతాన్ని నిరాశా వహం అనడ మంటే, 'ఆత్మ (Personality) లే కుండ సుఖం ఉండడం అసంభవం' అనే పాశ్చాత్య సూత్రాన్ని, దానికి అన్వయించడమే. నిజమైన బౌద్ధుడు శాశ్వతా నందంలో మునకలు వేయ డానికి ఉత్సాహంతో ఎదురుచూస్తుంటాడు.

**సుఖం**

బుద్ధుడు, తన శిష్యులను, జీవితంలోని కష్టాలను గురించి నిరంతరం ఆలోచిస్తూ, జీవితాన్ని దుఃఖ మయం చేసు కోమని చెప్పడు.

జ్ఞానోదయానికి ఆవశ్యకమైన, ముందుగ అనుసరించి తీరవలసిన విషయంగా, ప్రీతి (Joy)ని ప్రతి బౌద్ధుడు అలవరచు కోవాలి. నిష్పక్ష పాతులైన చాల మంది రచయితల దృష్టిలో, ప్రపంచంలో కెల్ల బౌద్ధులే అత్యంత సంతోషకరమైన వారుగా ప్రసిద్ధి చెందారు. వారికి పాపుల మనే న్యూనతా భావన లేదు.

పవిత్ర జీవితాన్ని సాధ్యమై నంత నిండుగా గడిపే ఆర్య సంఘ సభ్యులు, బహుశ, అందరి కంటె సుఖులు. ''అహో సుఖం, అహోసుఖం, మేము సుఖంగా ఉంటున్నాం'' - ఇవి తరుచుగా అతడి అనుచరుల నుంచి వినవచ్చే మాటలు.

ఒక రోజు ఒక దేవుడు బుద్ధుని వద్దకు వచ్చి ఇలా ప్రశ్నించాడు:

అరణ్యాల నాటపట్టు చేసుకొన్నవారు.

పవిత్ర జీవితాన్ని రుషులులా జీవించేవారు.

ఏక భక్తంతో తమ ఉపవాసాన్ని విర మించువారు.

ఎలా అంతగా కాంతులీనుతున్నారో తెలపండి.

బుద్ధుడు సమాధానం చెప్పాడు:

''వారికి గత మంటే వగపు లేదు.

అనాగతం కోసం వెంప ర్లాడరు.

ఇప్పుడిక్కడ ఏముందో దాని తోనే జీవిస్తారు.

అందుకనే వారు ప్రశాంతి కాంతు లీనుతుంటారు''[1]

భూత, భవిష్యత్తుల గురించి వ్యాకులత చెంద కుండ, శాశ్వత వర్తమానంలో భిక్కులు సుఖ సంతోషాలతో ఉంటారు.

**సుఖ పరంగా కారణతా సిద్ధాంతం**

సంయుత్తనికాయంలో, సుఖాన్ని దృష్టిలో ఉంచుకొని, ప్రతీత్యసముత్పాదానికి ఆసక్తి కరమైన వ్యాఖ్యాన్ని చెప్పారు. బుద్ధుడు అంటాడు:

''దుఃఖం శ్రద్ధ (Confidence) కు దారితీస్తుంది. శ్రద్ధ ప్రమోదాని (Rapture), ప్రమోదం ప్రీతి (Joy) కి, ప్రీతి ప్రశాంతత (tranquility)కు, ప్రశాంతత సుఖాని (happiness)కి, సుఖం సమాధికి (Concentration), సమాధి వస్తువుల యథాతథా జ్ఞానానికి, దర్శనానికి (యథాభూతఞాణదస్సన = యథాభూత జ్ఞాన దర్శనం) దారి తీస్తాయి. వస్తువుల యథాతథ జ్ఞానదర్శనం నిరాకరణకు (నిబ్బిదా = repulsion), నిరాకరణ విరాగాని (non attachment) కి, విరాగం విముక్తి (విముత్తి)కి, విముక్తి ఇంద్రియజ్ఞాన ఉచ్ఛే దానికి అంటే అర్హంతత్వాని దారితీస్తాయి''[2]

ఈ ముఖ్యమైన పాఠం, దుఃఖం ఎలా సుఖానికి, అంతిమంగా ఋషిత్వానికి దారి తీస్తుందో స్పష్టంగా చెబుతున్నది.

**బౌద్ధంలో సహనం**

ఈనాలుగు ఆర్య సత్యాలను అర్థం చేసు కోవ డానికి అంధ విశ్వాసం అవసరం లేదు. మొదటి రెండు సత్యాలు ఇహానికి సంబంధించినవి. వీటిని లౌకికులు అనుభవంతో తెలుసు కోగలరు. తరువాతి రెండు సత్యాలు లోకోత్తరాలు. వీటిని రుషిత్వం పొందడం ద్వారా అర్థం చేసుకో వచ్చు.

అజ్ఞాత విషయాల వలని భయం ఆధారంగా కాక, వైయక్తిక అనుభవంతో ఎవరైన పరీక్షించు కోగల ఈనాలుగు పునాదుల మీద బౌద్ధం నిర్మిత మైంది. అందు వలన బౌద్ధం హేతు బద్ధమైంది, ఆచర ణాత్మకమైంది.

ధమ్మంలో అహేతుక మైంది కాని, ఆచరించ డానికి వీలు లేనిది కాని, ఏమీ లేదు. బుద్ధుడు బోధించిందే ఆచరించాడు. ఆచరించిందే బోధించాడు. అడు తన బోధలో

నొక్కి చెప్పింది ఆచరణ. ఎందు కంటే కేవలం ఏ ధమ్మమూ ఒక వ్యక్తిని పరిశుద్ధుని చేయ లేదు.

ధమ్మపదం లోని, V.19 ఇలా అంటుంది:

''ఎన్ని పవిత్ర గ్రంథాల నౌపోశన పట్టిన నేమి
వాటి ననుసరించి నడుచు కో నప్పుడు

అటు వంటి ప్రమత్తుడు ఇతరుల ఆవుల లెక్కించు గోపాలుడు;
ఒక పరివ్రాజకునికి లభించే ఆశీస్సులు అతనికి దక్కవు''

ఒక హేతుబద్ధమైన, ఆచరణాత్మకమైన దర్శనంలో ఒక మార్మిక రహస్య సిద్ధాంతానికి తావు ఉండదు. పరినిర్వాణ సూత్రంలో బుద్ధుడు ఇలా నొక్కి చెప్పాడు:

''రహస్య బోధ, బహిరంగ బోధ అనే తేడా లేకుండ సత్యాన్ని బోధించాను. ఎందు కంటె సత్యం విషయంలో తథాగతునికి, కొన్ని విషయాలను శిష్యులకు చెప్ప కుండా దాచుకొనే ఒక గురువు బద్ధముష్టి (మూసిన పిడికిలి) లాంటి దేదీ లేదు''.

'అనంతరం', 'అబాహిరమ్' అనే పదాలను బుద్ధు డుపయోగించాడు. బుద్ధుడే గనుక, ''నా ధమ్మంలో ఇంత వరకు ఇతరులకు బోధించను, లేదా ఇంత వరకు మాత్రమే ఇతరులకు బోధిస్తాను'' అని అను కొన్నట్లయితే, అతడూ ''బుద్ధ ముష్టి'' ఆచార్యుల కోవకు చెందేవాడు. ''నేను వీరికి బోధిస్తాను'', ''వారికి బోధించను'' అని బుద్ధుడు అను కొన్నట్లయితే, అంతర్వర్గాన్ని, బాహ్యావర్గాన్ని తయారు చేసి ఉండే వాడు. బుద్ధుడు అటు వంటి వివక్ష ఎప్పుడూ ప్రదర్శించ లేదు.

రహస్య ధర్మాల గురించి బుద్ధుడు అంగుత్తర నికాయంలో (1, P. 261) ఇలా అంటాడు:

'' ఓ శిష్యులారా, బహిరంగత కాక, రహస్యం ముగ్గురికి కావాలి. ఎవరు వాళ్ళు? స్త్రీలకు; బహిరంగత కాక రహస్యం వారికి అవసరం. బహిరంగత కాక రహస్యం మంత్ర విదులకు (priests) కావాలి. అసత్య సిద్ధాంతాలకు బహిరంగత కాక, రహస్యం కావాలి. పరిపూర్ణ బుద్ధుడు ప్రవచించిన ధమ్మం, నియమం, రహస్యం గావు. అవి ప్రపంచం అంతట ప్రకాశిస్తాయి.

మానవాళిని కలత పెట్టే కొన్ని సమస్యల మీద బుద్ధుడు తన, మనోగతాన్ని వివరించ లేదు. అతడు ఎప్పుడూ వివాదాస్పద విషయాల మీద మౌనాన్నే దాల్చాడు. ఎందు కంటె అతని కార్యానికి అవి అప్రస్తుతాలు; ఒకని విముక్తికి అవి ఆవశ్యకాలు కావు.

ఒక సందర్భంలో మాలుంక్యపుత్త అనే ఒక భిక్కు బుద్ధుని దగ్గరకు వచ్చి, కొన్ని తాత్విక సమస్యలకు అవ్యవహితంగా పరిష్కారం చెప్పాలని, లే నట్లయితే తాను చీవరాలను విడిచి వేస్తానని బెదిరించాడు.

''దేవా, ఉన్నతులు (మీరు) ఈ సమస్యలను విశదీకరించ కుండ ప్రక్కన పెట్టారు. నిరాకరించారు. ప్రపంచం నిత్యమా, అనిత్యమా? జీవం, దేహం – రెండు ఒకటేనా, వేరు వేరా? తథాగతుడు మరణానంతరం ఉంటాడా, ఉండడా? తథాగతుడు మరణానంతరం ఉండడం, ఉండకపోవడం – రెండూ జరుగుతుందా (తదుభయం)? తథాగతుడు మరణానంతరం ఉండడం, ఉండకపోవడం – రెండూ కాదా (తదనుభయం)?[3]

నైతిక ప్రగతికి అవరోధమైన అటువంటి వ్యర్థ విషయాల మీద సమయాన్ని, శ్రమను వృధా చేయ వద్దు అని బుద్ధుడు అతనికి సలహా ఇచ్చాడు.

''ఇది ఎలాంటి దంటే, విషపూరిత బాణం గుచ్చుకొన్న ఒకడు, బాణాన్ని పెరికి వేయాలన్న శస్త్ర చికిత్సకునితో, 'నన్ను గాయ పరిచిన వారి వివరా లేమిటో, నాలో నాటుకొన్న ఆబాణం స్వభావం ఏమిటో – లాంటి ప్రశ్నలకు సమాధానం తెలిసే వరకు, బాణాన్ని నా నుంచి పెరక డానికి వీలు లేద'న్నట్లుగా ఉంది. ఈ ప్రశ్నలకు సమాధానం దొరికే లోపల అతడు మరణిస్తాడు. అదే విధంగా ఎప్పటికైనా ఈ ప్రశ్నలకు వివరణ దొరికే లోపల వ్యక్తి మరణిస్తాడు.''

ఈ అధిభౌతిక ప్రశ్నల సమాధానం విరాగానికి, విమోహానికి, జ్ఞానోదయానికి లేదా నిర్వాణానికి దారి తీయదు.

మరో సందర్భంలో ఈ విషయాల మీద, అతని శిష్యులు వివరణ కావాలని కోరి నప్పుడు, అతడు ''గుడ్డివాళ్ళు – ఏనుగుకథ'' తో వారిని మౌనం వహించేట్టు చేశాడు[4].

ఏనుగు ఎలా ఉంటుందో వర్ణించమని ఒక ఏనుగును కొంతమంది అంధుల ముందుంచారు. ఏనుగు వివిధ భాగాలను తాకిన అంధులు, ఏనుగును గురించి, తమ తమ ప్రత్యేక భావాలను చెప్పారు. ఎవరికి వారు తమ తమ భావాల మీద ఆధార పడి వాదానికి దిగారు. సహజంగానే వారి వాదం తగవుగా మారింది.

కేవలం కుతూహలాన్ని మాత్రమే సంతృప్తి పరిచే, విముక్తికి దారి తీయని, నిరుపయోగ తాత్విక సమస్యలను బుద్ధుడు తన సహజ మౌనంతో నిరాకరించాడు.

మానవాళి కాసక్తి కలిగించే ప్రతి నైతిక, తాత్విక సమస్యకు తన దగ్గర పరిష్కారం ఉందని బౌద్ధం చెప్పు కోదు. అంతే కాదు, అది ఆధ్యాత్మికంగా లాభం చే కూర్చని నిరర్థక తాత్విక

సమస్యలతో కాని, సిద్ధాంతాలతో గాని వ్యవహరించదు. 'దుఃఖాన్ని బాపుట' అనే ప్రత్యేక ఆచరణీయ లక్ష్యం బౌద్ధానికి ఉంది. ఆ లక్ష్యం కారణంగానే అది అప్రస్తుత పార్శ్వ సమస్యలను ప్రక్కన బెడుతుంది. అయినా, జీవిత వాస్తవిక స్వభావాన్ని నిశితంగా పరిశీలించ డానికి అన్ని విధాల ప్రోత్సాహం ఇస్తుంది.

ఒత్తిడులకు, బలాత్కారాలకు, మూర్ఖపు పట్టు దలలకు బౌద్ధంలో చోటు లేదు. **2500** ల సంవత్సరాల దాని చరిత్రలో బుద్ధుని పేరుతో ఒక్క రక్తపు బొట్టు గూడ చింద లేదు. బుద్ధ ధమ్మాన్ని ప్రచలించ డానికి ఏ మహారాజు కత్తి దూయ లేదు, బలాత్కార పద్ధతిలో గాని, ప్రత్యాదేశ పద్ధతి ద్వారాగాని, ఎవరినీ పరివర్తించ లేదు. ఇవన్నీ బౌద్ధానికి విశేష ప్రశంసలే. అయినా ఈ భూమి మీద ప్రభవించిన వారిలో కెల్ల ప్రధమ మహాధర్మ బోధకుడు బుద్ధుడు. బౌద్ధం ప్రపంచ మంతా వ్యాపించింది. ఇంకా వ్యాపిస్తున్నది. ఇతర పరోక్ష మత మార్పిడి ఏజన్సీల, సామ్రాజ్యవాదం, సంగ్రామ పద్ధతుల, వాదాల ద్వారా కాక, దానిలోని అంతర్గత గుణాలతో, దాని బోధల అసమాన సౌందర్యంతో అన్ని దేశాలకు శాంతి యుతంగా వ్యాపిస్తోంది.

అల్డ్‌స్ హక్స్‌లీ రాస్తున్నారు: ''ఏరకంగాను బాధించ కుండ, అభిశంసించ కుండ, మత వ్యతిరేకుల అణచి వేత లేకుండ, ప్రపంచ మతా లన్నింటిలోకి బౌద్ధం ఒక్కటే విస్తరించింది. భౌతిక వాదానికి అంటిపెట్టుకొన్న జనులలోకి ప్రసరించిన క్రైస్తవం కంటె, తన అనుయాయుల రక్త దాహ ప్రవృత్తిని, కంచుయుగానికి చెందిన పాతనిబంధనల గ్రంధ సాహిత్యాన్ని ఉటంకించి సమర్థించుకొనే క్రైస్తవం కంటె, బౌద్ధం అన్నివిధాల ఉన్నతమైందని సాక్షా లున్నాయి''

లార్డ్‌రసెల్ అంటారు: ''ప్రపంచంలోని అన్నిమతాలలోకి నేను బౌద్ధాన్ని – ముఖ్యంగా తొలి బౌద్ధాన్ని – ఎంచు కొంటాను. ఎందు కంటె, దానిలో కొంచెం గూడ పీడించడం లేదు.''

బుద్ధుని పేరుతో, అమాయిక స్త్రీల రక్తంతో, ఏ పవిత్ర స్థలమూ ఎర్ర బార లేదు; నిజాయితీ చింతనా పరుణ్ణి ఎవరినీ సజీవ దహనం చేయ లేదు. మత వ్యతిరేకులను దయా రహితంగా వేయించ లేదు.

మార్మికతను గురించి బోధించని బౌద్ధం, మహాత్మ్యాలను గురించి మాటాడదు. అతని మానసిక వ్యవసాయం కారణంగా బుద్ధునికి అసాధారణ శక్తులున్న మాట నిజం. కాని అతడు ఎప్పుడూ మహాత్మ్యాలను ప్రదర్శించ లేదు. యమక పాటిహారియ్, (తప్పుగా దీనిని ద్వంద్వ అద్భుతం అన్నారు) ఒక మానసిక దృగ్విషయం. దీనిని ఒక్క బుద్ధుడు

మాత్రమే చేయ గలడు. ఈ ఒక్క ప్రత్యేక సందర్భంలో, తన మనో శక్తుల ద్వారా, ఏక కాల మందే తన దేహ రంధ్రాల నుంచి నీరు, నిప్పు వచ్చే టట్లు చేశాడు.

బౌద్ధం ఉద్వేగానికి కాక బుద్ధికి సంబంధించింది. దానికి అంగబలం (సంఖ్యకంటె) కంటె భిక్కుల శీలం ముఖ్యం.

ఒకసారి కోటీశ్వరుడు, నిగంధనాతపుత్త అనుయాయి, అయిన ఉపాలి బుద్ధుని వద్దకు వచ్చి, అతని ధమ్మబోధను విని, సంతుష్టుడై, వెంటనే తాను బుద్ధుని అనుయాయి అవుతానని తన కోర్కెను వెల్లడించాడు. కాని బుద్ధుడు అతనికి ఇలా సలహా ఇచ్చాడు:

''ఒక సత్యమైన సూత్రానికి సంబంధించి, హే గృహస్తూ, పూర్తిగా పరిశీలించండి. మీ లాంటి విశిష్ట మానవుడు క్షుణ్ణంగా వివేచించాలి. అది మీకు తగును''.

ఈ అనుకోని బుద్ధుని మాటలతో సంతోషాంతరంగుడై ఇలా అన్నాడు:

''దేవా, నేను మరో ఆచార్యునికి అనుచరుడిగా మారినట్లైతే, అతడి అనుచరులు, పలాన పలాన కోటీశ్వరుడు తమ మతం పుచ్చుకొన్నాడని చెప్పుకొంటూ, నన్ను ఊరేగింపుగా వీధి వీధి, ఊరు ఊరు తిప్పే వారు. కాని దేవా, మీరో, నను మరో మాటు పరిశీలన జరప మంటున్నారు. మీ ఆరోగ్యకరమైన సలహా చాల సంతోషా న్నిచ్చింది'', మళ్ళీ మెచ్చు కొంటూ ఇలా అన్నాడు: ''నేను రెండోసారి బుద్ధం శరణం గచ్ఛామి, ధమ్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి.''

అతడు దృఢ విశ్వాసంతోనే బౌద్ధుడుగా మారినా, బుద్ధుడు మాత్రం, తన హద్దులెరుగని అనుకంప, పరిపూర్ణ సహనాలతో, అతనిని తన పాత గురువుని, అతని ఆచారం ప్రకారం కొలవమని చెప్పాడు.

బాహ్య ప్రమాణాలతో లేదా కేవల అనునయాలతో సత్యాన్వేషణకు లెవరూ ప్రభావితులు కారాదని చెబుతూ, బుద్ధుడు ఇంకా ఎంత వరకు వెళ్ళాడంటే, తన శిష్యులు ఎవరూ 'అధికృతులకు వంగి దాసోహం' అనవద్దని అభ్యర్థించాడు.

బౌద్ధం స్వేచ్ఛాన్వేషణా స్ఫూర్తితో, పరిపూర్ణ సహనంతో సంతృప్తమైంది. అది వివృత మనస్సు నుంచి, అనుకంపా ప్లావితమైన హృదయం నుంచి వచ్చే బోధ. జ్ఞాన, కరుణ అనే రెండు విధాల విశ్వానికి వేడిని, వెలుతురును ఇచ్చే బౌద్ధం, జననమరణ సంద్రంలో ఉక్కిరి బిక్కిరి అవుతున్న ప్రతి జీవిని తరింప జేసే వెలుగును ప్రసరిస్తుంది.

బుద్ధుడు ఎంత దయా మయుడు, సహనశీలి అంటే, ఉపాసకులకు ఆదేశా లిచ్చే అధికారాన్ని గూడ ఉపయోగించడు. ఆదేశికంగా – నీవు ఇలా చెయ్యి, అలా చెయ్యకు –

అని చెప్ప కుండా, 'అలా చెయ్యడం నీకు బాగుంటుంది, ఇలా చెయ్యకుండ ఉండడం నీకు బాగుంటుంది' అని బుద్ధుడు చెప్పే వాడు.

బౌద్ధులు మామూలుగా పాటించాల్సిన విధులు ఆజ్ఞలు కావు. అవి తమకై తాము ఇష్టపూర్తిగా పాటించే వినయాలు (శిఖాపద)

ఈ రకమైన సహనాన్ని సహానుకంపను బుద్ధుడు స్త్రీ పురుషుల యెడ సర్వ జీవుల యెడ ప్రదర్శించాడు.

**బౌద్ధం - కులం**

బానిస తనాన్ని నిర్మూ లించాలని, ఒక ఉన్నత నీతిని, మానవ జాతి అంతా సహోదరులే అనే భావనలను ప్రతిపాదించి, ఆ రోజుల్లో భారత దేశాన్ని పట్టి పీడిస్తున్న అగౌరవ వర్ణ వ్యవస్థను బాహాటంగా స్పష్టంగా ఖండించిన వాడు, మానవాళి చరిత్ర కంది నంత వరకు, బుద్ధుడే ప్రథముడు. బుద్ధుడు ప్రకటించాడు:

''పుట్టుక వలన ఎవడూ జాతి బాహ్యుడు కాడు.
పుట్టుక వల్లనే ఎవడూ బ్రాహ్మణుడు కాడు.
అతడు చేసిన పనులను బట్టి జాతి బాహ్యుడు
అతడు పనులను బట్టి అతడు బ్రాహ్మణుడు''[6]

'ఎవడు బ్రాహ్మణుడు' అనే సమస్య మీద ఇద్దరు యువ బ్రాహ్మణుల మధ్య జరిగిన చర్చను సుత్త నిపాత (పుట 112) లోని వాసెత్థసుత్త పేర్కొంటున్నది. అందులో ఒకడేమో, జన్మ వల్ల బ్రాహ్మణు డవుతాడని, మరొక డేమో శీలం వల్ల బ్రాహ్మణు డవుతాడని వాదించారు. వారిద్దరూ ఒకరు మరొకరి వాదంతో ఏకీభవించ నందువల్ల, ఆ వివాదాన్ని బుద్ధునికి నివేదించారు.

అలాగ వారు బుద్ధుని వద్దకు వెళ్ళి, తమ తగవు విని పించారు. మొక్కలు, పురుగులు చతుష్పాద జంతువులు, పాములు, చేపలు, పక్షుల విషయంలో వాటి వాటి జాతులు, గుర్తులు వాటికి ఉన్నప్పటికీ, మనుషుల విషయంలో అటు వంటి జాతులు, గుర్తులు లేవనే విషయం మొట్ట మొదట బుద్ధుడు వారికి గుర్తు చేశాడు. ఆ తరవాత మనుషులు తమ తమ వృత్తులను బట్టి ఎలా విభేదీ కరణం చెందారో వివరించాడు. చివరిగ బుద్ధుడు ఇలా వ్యాఖ్యానించాడు:

''పుట్టుక ఒకనిని బ్రాహ్మణుని కాని, అబ్రాహ్మణుని కాని చేయదు.
జీవితం, అతడు చేసిన పని, ఒకనిని నిజమైన బ్రాహ్మణుని చేస్తుంది.

వారి వారి జీవితాలు వారిని వ్యవసాయ దారులుగ, వ్యాపారులుగ, బానిసలుగా మలుస్తాయి.

వారి వారి జీవితాలు వారిని దొంగలుగా, సైనికులుగా, గురువులుగా, రాజులుగా చేస్తాయి.''

ఈ కుల సమస్యను గురించి మళ్ళీ ఆసక్తికరమైన సంవాదం మధురసుత్త లో కనిపిస్తుంది. గౌరవనీయ కచ్చానకు మధుర రాజు ఈ దిగువ వృత్తాంతాన్ని చెప్పాడు:

''బ్రాహ్మణులు ఇలా అంటున్నారు కచ్చాన: 'ప్రజలు విభాజితమైన నాలుగు వర్ణాలలోకి బ్రాహ్మణులు విశిష్టులు. బాహ్మణులు మాత్రమే పరిశుద్ధులు. బ్రాహ్మణులు కాని వారు కారు. బ్రాహ్మణులు మాత్రమే బ్రహ్మ క్రమ సంతానం. వారు బ్రహ్మ నోటి నుంచి పుట్టారు. అతడు వారిని ప్రత్యేకంగా తన వారసులను చేశాడు, అయ్యా, మీరు దీనికి ఏమంటారు?''

'అది వట్టి బూటకం మాట' అన్నాడు గౌరవనీయ కచ్చాన. ఒక ధనవంతుడు ఏ కులానికి, ఏ వర్ణానికి చెందిన వాని నైనా తనకు సేవకుడుగా నియమించు కోగలడు. ఏ కులానికి చెందినా ఒక దుష్టుడు దుఃఖాభాజక స్థితిలో, ఒకగుణవంతుడు ఆనందమయ స్థితిలో, జన్మించ గలరు. కులంతో నిమిత్తం లే కుండా నేరస్తుని నేరాన్నిబట్టి శిక్షించడం జరుగుతుంది. ఇలా ఎలా జరుగుతుంది, సంఘంలో చేరిన వారందరికీ ఏ వివక్ష లేకుండ సమాన గౌరవం లభిస్తుందని అతడు నొక్కి చెప్పాడు.

బౌద్ధం ప్రకారం, బుద్ధుని అనుయాయి కావడానికి గాని, అందరినీ శిష్యులుగా చూసే బౌద్ధ సంఘంలో చేర డానికి గాని, కులమూ, రంగూ అడ్డు రావు. జాలరులు, పాకీవాళ్ళు, వేశ్యలతో పాటు, సైనికులు, బ్రాహ్మణులను గూడ సంఘంలో చేర్చు కొన్నారు. వారికి సంఘంలో ఉన్నత స్థానాలను ఇవ్వడం గూడ జరిగింది.

వినయ శాఖకు సంబంధించిన విషయాలలో, ఇతరుల కంటె గూడ, మంగలి అయిన ఉపాలికి, ముఖ్య శిష్యుని స్థానం ఇవ్వబడింది. రాజులు, కులీనులు అర్హంతగా గౌరవించిన సునీత పేరికి పాకీ వాడు. తాత్వికుడైన సాతి జాలరి పుత్రుడు. వేశ్య ఆమ్రపాలి సంఘంలో చేరి అర్హంత అయింది. ఆత్మ హత్యకు ఆయత్త మవుతూ ఉండగా బుద్ధుడు పరివర్తితం చేసిన రుజ్జుమాల బానిస. పున్నా యజమాని, కోటీశ్వరుడు అయిన అనాథ పిండికుని ఆహ్వానాన్ని బుద్ధుడు కాదని, వర్షాకాలమంతా తన ఆతిధ్యాన్ని స్వీకరించమని కోరిన పున్నా ఆహ్వానాన్ని మన్నించాడు. చాపా, లేళ్ళ వేటగాని పుత్రిక. సుభ కంసాలి పుత్రిక. ఏరకమైన వివక్ష చూపకుండ అందరికీ బౌద్ధద్వారాలు తెరిచే ఉంటాయని చెప్పడానికి బౌద్ధగ్రంథాల నుండి ఎన్నో ఉదాహరణలు చూప వచ్చు.

బుద్ధుడు అందరికీ సమా నావకాశాలు కల్పించి అందరి అంతస్తును పెంచాడు.

బౌద్ధంలో శిశువుకు పాలు, బలవంతునికి మాంసం లభిస్తుంది. పేద ధనికులు- ఇద్దరికీ బౌద్ధం నచ్చుతుంది.

**బౌద్ధం, - స్త్రీలు**

స్త్రీల అంతస్తును పైకి లేపింది కూడా బుద్ధుడే. సమాజానికి వారి ప్రాముఖ్యతలను గుర్తించేట్టు చేసింది గూడ బుద్ధుడే.

బుద్ధునికి ముందు భారతదేశంలో స్త్రీలకు గౌరవం లేదు. హేమచంద్రుడనే ఒక భారతీయ రచయిత స్త్రీలను ''నరకానికి దారి చూపే దివిటీలుగ'' వర్ణించాడు.

బుద్ధుడు స్త్రీలను హీనంగా చూడ లేదు. వారు స్వభావ రీత్యా దుర్బలులని మాత్రమే అన్నాడు. స్త్రీ పురుషులిద్దరిలోను వారి వారి అంతర్గత 'మంచి' ని చూశాడు. తన బోధలో ఇద్దరికీ ఉచిత స్థానాలను కల్పించాడు. సేవకు గాని, పరిశుద్ధులు కావడానికి గాని, లింగం అడ్డు కాదు.

పాళీలో, కొన్నిసార్లు స్త్రీలను సూచించ డానికి ఉపయోగించిన పదం 'మాతుగామ'. ఈ పదానికి అర్థం 'మాతృజనం' లేదా 'మాతృ సమాజం.' ఒక తల్లిగా స్త్రీ బౌద్ధంలో గౌరవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. తల్లి స్వర్గారోహణానికి సుఖకరమైన నిచ్చెనగా పరిగణించ బడింది. భార్య భర్తకు మంచి స్నేహితురాలుగా చూడ బడింది.

మొదట్లో స్త్రీలను సంఘంలో చేర్చు కోవడానికి సకారణంగానే నిరాకరించినా, తరవాత గౌరవనీయ ఆనందుడు, పెంపుడు తల్లి మహాపజాపతీ వేడు కోవడంతో అతడు ఒప్పుకొని, భిక్కునిల సంఘాన్ని నెల కొల్పాడు. నియమ నిబంధనలతో స్త్రీ సంఘాన్ని ప్రపథమంగా నెల కొల్పిన వాడు బుద్ధుడే.

భిక్కు సంఘానికి అర్హంతలు సారిపుత్రుని, మొగ్గల్లానలను ముఖ్య శిష్యులను చేసినట్లే, అర్హంతలు ఖేమా, ఉప్పలవణ్ణ లు భిక్కుని సంఘానికి ముఖ్య స్త్రీ శిష్యులుగా చేశారు. అత్యంత విశిష్ట, పవిత్ర అనుయాయులలో చాల మంది స్త్రీ శిష్యులను గూడ బుద్ధుడే స్వయంగా పేర్కొన్నాడు. తాము అభివృద్ధి చెంద డానికి స్త్రీల స్వాతంత్ర్యం ఒక కారణమని వజ్జిలు నమ్మారు. బుద్ధుని రాకకు పూర్వం, స్త్రీలకు తగినంత స్వేచ్ఛ లేదు. తమ మానసిక సామార్థ్యాలను, అంతర్గత ధార్మిక శక్తులను ప్రదర్శించే అవకాశం వారికి కలగ లేదు. ఇప్పటి లాగే ప్రాచీన భారతంలో ఒక కుటుంబంలో ఆడపిల్ల పుడితే, దానిని అవాంఛ నీయమైన దానిగా, అదనపు భారంగా భావించే వారు.

ఒకసారి బుద్ధుడు రాజు కొసలునితో మాటాడు తున్నాడు. అప్పుడొక వార్తాహరుడు వచ్చి రాజుతో, ఆయనకు ఆడపిల్ల పుట్టిందని నివేదించాడు. సహజంగానే రాజు అసంతుష్టు డయ్యాడు. బుద్ధుడు రాజును ఓదార్చి, ఇలా ప్రోత్సాహకరంగా మాట్లాడాడు

''రాజా, మగ బిడ్డ కంటె ఆడు బిడ్డే
ఘనమని రుజువు చేయవచ్చు.''[8]

బుద్ధుని రాకకు పూర్వం అనేక ప్రతి బంధకాల క్రింద అణచ బడిన స్త్రీలకు, భిక్కుని సంఘస్థాపన తప్ప కుండా ప్రసాదమే. ఈ సంఘంలో రాణులు, రాకుమార్తెలు, ఉన్నత కుటుంబీకుల కూతుళ్ళు, వితంతువులు, అందరిని పోగొట్టు కొన్న స్త్రీలు, నిస్సహాయ స్త్రీలు, వేశ్యలు - వారి వారి కులం అంతస్తులతో సంబంధం లేకుండ, ఒకేస్థాయిలో నివసించారు. ఓదార్పు, శాంతులను పొందారు. అంతకు ముందు గుడిసెలలో, ప్రాసాదాలలో తమకు లభించని స్వేచ్ఛా వాయువులను పీల్చారు. మరోవిధంగా అయితే మరుగున పడి పోయే చాల మంది సంఘంలో చేరడం ద్వారా అనేక విధాల తమ విశిష్టతను చాటు కొన్నారు. స్వేచ్ఛను పొందారు.

మొదటి శిష్యురాలైన ఖేమ బింబిసారుని అందమైన భార్య. మొదట్లో ఆమె బుద్ధుని చూడ నిరా కరించింది. ఎందుకంటె, బుద్ధుడు బాహ్య సౌందర్యాన్ని తక్కువగా చూస్తాడని విన్నది. ఒకరోజు ఆమె అనుకో కుండ, కేవలం, ఆస్థల సౌందర్యాన్ని చూడ డానికి ఆరామానికి వెళ్ళింది. క్రమంగా బుద్ధుడు బోధిస్తున్న శాల వైపుకు ఆకర్షితు రాలైంది. ఆవిడ మనస్సును పసికట్టిన బుద్ధుడు తన మనోశక్తులతో ఒక అందాల యువతిని, తన ప్రక్కన నిలబడి, వీవనతో విసరు తున్నట్లుగా సృష్టించాడు. ఖేమ ఆమె అందానికి ముగ్ధు రాలైంది. బుద్ధుడు, తాను సృష్టించిన ఆప్రతిమను, యవ్వనం నుంచి మధ్య వయస్సుకు, మధ్యవయస్సు నుంచి వృద్ధాప్యానికి మార్చి, అంతిమంగా ఆమె పళ్ళు విరిగిన నోటితో, తెల్ల జుట్టుతో, ముడతలు పడిన శరీరంతో నేల మీద పడేట్టు చేశాడు. అప్పుడు మాత్రమే బాహ్య సౌందర్య గర్వాన్ని, జీవిత భంగురతను ఆమె గుర్తించింది. ఆమె అనుకొంది: ''ఎటువంటి దేహం ఎలా అయింది? నా శరీరం గతీ ఇంతే కదా!''

బుద్ధుడు ఆమె ఆలోచనలను గ్రహించి ఇలా అన్నాడు:
లాలిసదాసులు ప్రవాహం వాలుకు కొట్టుకు పోతారు
తా నేసుకొన్న తన గూటినుంచి జాలు వారుతున్న సాలీడులా
కాని తమ బంధాల ద్విపుటిని పుటుక్కున తెంచుకొని
విముక్తులైనవారు, ఆలోచనలను ఎక్కడో నిలిపి,

ప్రపంచ పరిత్యాగం చేస్తారు,

ఇంద్రియ సుఖాన్ని దూరాన ఉంచి ఆనందాన్ని పొందుతారు.

ఖేమ అర్హంత అయింది. రాజు అనుమతితో సంఘప్రవేశం చేసింది. భిక్కునిలలో ప్రజ్ఞాపరంగా అగ్రభాగాన నిలించింది.

తన ఇద్దరు బిడ్డలను, భర్తను, తలిదండ్రులను, సోదరుని కోల్పోయిన పతాచారా, బహు విషాద పరిస్థితులలో, బుద్ధుని సంకల్ప బలంతో, బుద్ధుని సమక్షానికి ఆకర్షితు రాలైంది. బుద్ధుని సాంత్వన వచనాలు విని, ఆమె ఋషిత్వంలో ప్రథమ దశను అందుకొని, సంఘంలో చేరింది. ఒక రోజు ఆమె తన కాళ్ళను కడుక్కొంటూ, మొదట్లో నీరు చిన్న ధార అయి కొద్ది దూరమే పోయి ఇంకి పోవడం, రెండోసారి మరికొంచెం దూరం పోయి యింకి పోవడమూ, మూడో సారి ఇంకొంచెం ఎక్కువ దూరం ప్రవహించి ఇంకి పోవడాన్ని గమనించింది. ''అలాగే మర్త్యులంతా మరణిస్తారు. కొంతమంది బాల్యంలో, మరికొంత మంది మధ్య వయస్సులో లేదా వృద్ధాప్యంలో మరణిస్తారు.'' అని ఆమె అనుకొంది. బుద్ధుడు ఆమె ఆలోచనలను తెలుసుకొని, ఆమె ఎదుటికి తన ప్రతిమను ప్రక్షేపించి, ధమ్మాన్ని బోధించాడు. ఆమె అర్హంత అయింది. ఆ తరవాత అందరినీ పోగొట్టుకొన్న ఎంతో మంది తల్లులను ఆమె ఓదార్చింది.

ధమ్మదిన్నా, బద్ధా కాపిలాని అనే ఇద్దరు భిక్కునిలు ధమ్మాన్ని చెప్పడంలో గౌరవ స్థానం పొందారు.

మృత్యువైన మారునికి, ఈ దిగు సమాధానాన్ని చెప్పింది భిక్కునీ సామా[10] యే:

''ఎవరి ఆలోచనలు సంయమనాలో, ఎవరిలో జ్ఞానం ప్రగమిస్తుందో, ఎవరికి ధమ్మంలో సరైన అవగాహన ఉంటుందో వారు స్త్రీలు అయితే నేం, పురుషు లైతే నేం, స్త్రీ పురుష స్వభావాలకు అక్కడ చోటు లేదు. '' నేను స్త్రీనా, పురుషుణ్ణా లేక మరొకటా? అని ప్రశ్నించే వారితో దుష్టుడైన మారుడు మాటాడ వచ్చు. కాని మాతో కాదు.''

ఉపాసికలలో గూడ చాల మంది ఔదార్యానికి, పవిత్రతకు, భక్తికి, జ్ఞానానికి, ప్రేమ పూరిత కరుణకు పేరెన్నిక గల వారున్నారు.

వారందరి లోకి, సంఘానికి ముఖ్య పోషకురాలైన విసాఖా, అగ్రభాగాన నిల బడుతుంది.[11]

సుప్రియ (సుప్పియా) చాల పవిత్ర మహిళ. ఆమె అంగడి నుంచి మాంసం తేవ డానికి, అశక్తురాలై, తన తొడ నుంచే ఒక ముక్క కోసి, రోగి అయిన ఒక భిక్షువుకు పెట్టింది.

నకులమాత విశ్వాసి అయిన భార్య. తన మంచి గుణాలను ఉచ్చరిస్తూ, మృత్యువు కోరల నుంచి తన భర్తను కాపాడు కొంది.

సామావతి పవిత్రమైన ప్రియమైన రాణి. తన ప్రత్యర్థి కుట్ర వల్ల దహనమై పోతూ కూడ, ఏ మాత్రం చెడు దృష్టి లేకుండా, తన ప్రత్యర్థి యెడ, ప్రేమ పూరిత కరుణను ప్రసరించింది.

రాణి మల్లిక అనేక సందర్భాలలో రాజు పసెనదికి మంత్రాంగం నెరపింది.

ఖుజ్జుత్తరా అనే ఒక పని పిల్ల ధమ్మబోధ గావించి, అనేక మందిని పరివర్తితం చేసింది.

పునబ్బసుమాతా ధమ్మాన్ని వినాలనే కౌతుతంతో, తన ఏడుస్తున్న బిడ్డను ఇలా బుజ్జగించింది:

ఏడువకు చిట్టి ఉత్తరా! గొడవ చేయకు, పునబ్బసు,
మహాజ్ఞానియైన ఆచార్యుడు బోధించిన ప్రమాణాన్ని వినాలి...
నా బిడ్డ నాకు చాల ప్రియమైంది, నా భర్తా నాకు ప్రియమైన వాడే.
నాకు వీరిద్దరి కంటె ప్రియ మైంది మార్గం చూపే ధమ్మం కాదా!''[12]

తనకున్న ఒకే ఒక పుత్రుడు మరణించి నప్పుడు ఎందుకు విలపించ లేదని ఒక చింతనా శీలియైన తల్లిని ప్రశ్నించి నప్పుడు, ఆమె చెప్పింది:

''కోరకనే అతడు వచ్చాడు. పొమ్మనకనే పోయాడు.

ఎలా వచ్చాడో అలాగే వెళ్ళి పోయాడు. వగ చేందుకు ఏముంది?''[13]

సుమనా, సుభద్రా అనే వారు ఇద్దరు అక్కా-చెల్లెళ్ళు. అద్భుతమైన శీల సంపన్నులు. వారికి బుద్ధుని యందు నిస్సందేహ విశ్వాసం ఉంది.

బుద్ధుని కాలంలో స్త్రీలు నిర్వహించిన పాత్రను వర్ణించ డానికి ఈ కొద్ది ఉదాహరణలు చాలు.

**బౌద్ధం - నిరపాయత**

అవధు లెరుగని బుద్ధ కరుణ మానవాళి యెడనే కాక మూగ ప్రాణులైన జంతువుల పైకి గూడ సారించ బడింది. జంతుబలిని నిషేధించిన వాడు బుద్ధుడే. అంతే కాదు, తన శిష్యు లందరిని ప్రేమ పూరిత కరుణ (మైత్రి) తో సర్వజీవులను చూడాలని ఉపదేశించాడు. పాదాల దగ్గర పారాడే అతి చిన్న ప్రాణిని సైతం మైత్రితో చూడా లన్నాడు. జీవితం అందరికి విలువైందే, అందుకని ఏ మనిషికీ మరో జీవి ప్రాణం తీసే హక్కు లేదు.

భిక్కు ఈ మైత్రిని ఎంత వరకు ఆచరించా లంటే, అసలు అతనిని వినయ నియమాలు భూమిని తప్పకుండ, తప్పించకుండా నిరోధించాయి. అతడు నీటిని వడ కట్ట గుండా తాగే వీలు లేదు.

బౌద్ధ రాజులలో అత్యంత గొప్ప వాడైన అశోకుడు, రాతి మీద, రాతి స్తంభం మీద, ఇలా చెక్కించాడు: ''ప్రాణులు ప్రాణులను పోషణకు ఉపయోగించరాదు. పురుగు లున్నప్పుడు, పొట్టునైనా, సరే కాల్చ రాదు.''

ఒక నిజమైన బౌద్ధుడు ప్రతి జీవి యెడ ఈ మైత్రిని (మెత్త) పాటించి, తాను అందరిలో, ఒకడు కావాలి. ఏ విధమైన వివక్ష లేకుండా కలిసి పోవాలి. బౌద్ధ ముఖ్య లక్షణమైన ఈ బుద్ధ మైత్రి, ఒకరి నుంచి ఒకరిని వేరు చేసే కులాల, వర్ణాల, మత శాఖల అడ్డుగోడలను ఛేదిస్తుంది. వేరు వేరు మతాల వారు, తాము వేరు వేరు మతాలకు చెందిన వారమనే కారణంగా ఒకే వేదిక మీద అన్నదమ్ములులా, అక్క చెల్లెళ్ళులా కలుసుకో లేక పోతే, ఆ మతాచార్యులు తమ నియుక్త కార్యంలో విఫలమై నట్లే.

చుల్ల వ్యూహ, మహా వ్యూహ సుత్తల మీద ఆధార పడిన 'ఆర్య సహన శాసనం'లో అశోకుడు ఇలా అంటాడు: ''అన్నింటి కంటె ఏకత మంచిది. అంటే, అందరూ గూడ ఇతరుల సిద్ధాంతాలను ఇష్టంతో వినాలి.''[14]

బౌద్ధాన్ని ఏ ఒక జాతికో, దేశానికో పరిమితం చేసే లక్షణాలేవీ దానిలో లేవు. అది విశ్వజనీనం.

బౌద్ధునికి దూరం దగ్గరలు, మిత్రులు, శత్రువులు, మతం మారినవాడు, అంటరాని వాడని ఏమీ లేదు. ఎందుకంటె, అవగాహనతో తెలుసుకొన్న విశ్వజనీన ప్రేమ, సర్వ జీవుల సౌభ్రాత్వాన్ని స్థిర పరిచింది. నిజమైన బౌద్ధుడు ప్రపంచ పౌరుడు.

అందుకని బౌద్ధం ముఖ్య లక్షణాలు ఏవంటే, దాని హేతుబద్ధత ఆచరణీయత, సామర్థ్యత, అకలహత, హాని రాహిత్యం, సహనం, సార్వత్రికతలు.

**2500**ల ఏళ్ళుగా కొనసాగుతున్న బౌద్ధం, అన్నిరకాల ఏకీకరణ, ఉన్నతీ కరణల ప్రభావాల కంటె, ఉన్నతమైంది, శ్రేష్ఠమైంది.

★ ★ ★ ★

జాతులు (Nations) వచ్చాయి పోయాయి. బలం ఒత్తిడి ఆధారంగా నిర్మితమైన మహా సామ్రాజ్యాలు వెల్లి విరిశాయి, నాశన మయ్యాయి. కాని ప్రేమ హేతువుల మీద

ఆధారపడిన బుద్ధుని ధమ్మ రాజ్యం మాత్రం ఇంకా వృద్ధి చెందుతూనే ఉంది. దాని అనుయాయులు దాని ఆర్య సూత్రాలను అంటి పెట్టుకొని ఉన్నంత కాలం, ఇక ముందు గూడ వెల్లి విరుస్తూనే ఉంటుంది.

**పాదసూచికలు :**

1. *Kindred Sayings,* PP.7,8
2. సంయుత్త నికాయ, 11, P.32, Kindred Sayings, 11, P. 27.
3. మజ్జిమ నికాయ, 1,63, చూల మాలుంక్య సుత్త, P. 426
4. ఉదాన, 6,4, P. 66 ff; Wordward, Some Sayings of the Buddha PP. 190 ff చూడండి.
5. ప్రకరణం 8 చూడండి.
6. సుత్త నిపాత, వసల సుత్త, · P. 21.
7. మజ్జిమ నికాయ, 11,84, PP. 83 ff.
8. *Kindred Sayings,* 1,P.111
9. Psalms of the Sisters, P. 82
10. సంయుత్తనికాయ, 1,5,2, 129
11. పదో ప్రకరణం చూడండి
12. *Kindred Sayings,* I.P. 270
13. జాతక కథలు, No. 25354, V.P. 110.
14. రచయిత రాతి శాసనం XII ను దృష్టిలో ఉంచుకొన్నాడు. అందులో ఇలా ఉంటుంది (ప్రాకృతి) : "సమవాయొవ సాధు, కిం? అమన మనసా ధమ్మం సునేయ చ షుషుషేయు చ తి" Lit "ఏకత మాత్రమే మంచిది. ఎందుకని? వేరు వేరు అభిప్రాయాల వారు ధమ్మాన్ని విన వచ్చు, పాటించవచ్చు." (ఇక్కడ "ధమ్మాన్ని" విస్తృతార్థంలో చూడాలి.) సం.

పదిహేడో ప్రకరణం

# నాలుగు ఆర్య సత్యాలు

''మున్నెన్నడు వినని విషయాల మీద నాలో వెలుగు ప్రసరించింది''

- ధమ్మచక్క సుత్త

ఉన్నదేదో అది సచ్చ. సంస్కృతంలో దీని సమానార్థకం సత్యం. దీనికి అర్థం అబాధితం, నిర్వివాదం.

బౌద్ధం ప్రకారం సత్యమని పిలవబడేదానికి సంబంధించి అటువంటి నాలుగు సత్యాలు[1]న్నాయి.

రోహితస్స సుత్తలో బుద్ధుడు ఇలా అంటాడు:

''దాని సంజ్ఞ (Perceptions) లతో, ఆలోచనలతో సహా ఈ నిలువెత్తు మానవ దేహంలో ఈ ప్రపంచాన్ని, ప్రపంచం మూలాన్ని, ప్రపంచం ఉచ్ఛేదాన్ని, ఆ ప్రపంచ విచ్ఛే దానికి దారి తీసే మార్గాన్ని, నేను ప్రకటిస్తున్నాను.''[2]

ఈ ప్రత్యేక సందర్భంలో ప్రపంచం (లోకం) అంటే దుఃఖం అని అర్థం చేసు కోవాలి.

ఈ ఆసక్తి కరమైన వాక్యాలు, బుద్ధుడు స్వయంగా తన అంతర్బుద్ధితో కను గొన్న నాలుగు ఆర్య సత్యాలను ప్రస్తా విస్తున్నాయి. బుద్ధులు వచ్చినా రాకపోయినా, ఈ సత్యాలు ఎప్పుడూ ఉంటాయి. అటువంటి సత్యాలను ఒక బుద్ధుడు ఈ ప్రపంచానికి ఆవిష్కరిస్తాడు. అవి శాశ్వత సత్యాలు. కాలంతో మారవు. మార లేవు. వాటిని యధార్థీ కరణం చేసు కొన్నందుకు బుద్ధుడు ఎవరికి రుణ పడి లేడు. అతడే అన్నాడు: ''అంతకు ముందు వాటిని ఎవరూ విన లేదు.''

అందుకని బౌద్ధం హిందూ మతం నుంచి వచ్చిందని చెప్పే వాదం సరి కాదు. బౌద్ధానికి హిందూ మతానికి మధ్య కొన్ని సామాన్య సిద్ధాంతా లున్న మాట నిజం. ఈ సామాన్యతకు కారణం ఆ సిద్ధాంతాలు శాశ్వత సత్యాన్ని లేదా ధమ్మాన్ని దృష్టిలో ఉంచు కోవడం వల్లనే.

ఈ సత్యాలను పాళీలో 'అరియసచ్చాని' అంటారు. వాటిని ఆర్య సత్యాలని ఎందుకన్నా రంటే వాటిని అతి గొప్ప అరియ (శ్రేష్ఠుడు) కను గొన్నాడు. అతడు బుద్ధుడు. వికారాలకు అత డెంతో దూరుడు.

మొదటి సత్యం దుఃఖాన్ని గురించి చెబుతుంది. దుఃఖానికి సరైన ఆంగ్ల సమానార్థకం లేదు. Suffering లేదా Sorrow లతో సూచిస్తారు.

ఒక వేదనగా దుఃఖం అంటే సహించడం కష్టమైన దని. (దు = కష్టం, ఖ = సహించడం). ఒక అమూర్త సత్యంగా దుఃఖాన్ని తిరస్కరించదగిన (Contemptible = దు) రిక్తం (emptiness = ఖ) - అర్థంలో ఉపయోగిస్తారు. ప్రపంచానికి దుఃఖం ఆధారం. అందువల్ల తిరస్కరించ దగినది. ప్రపంచంలో వాస్తవికత లేదు - అందుకని రిక్తం, శూన్యం. దుఃఖం అంటే గర్హించ దగిన శూన్యం.

సామాన్యులు ఉపరి తలాన్నే చూస్తారు. కాని ఆర్యుడు (అరియ) వస్తువులను యథాతథంగా - అవి వాస్తవంలో ఎలా ఉన్నాయో అలా - చూస్తాడు. అరియకు జీవిత మంతా దుఃఖ మయం. భయ పూర్వక సుఖాలతో మానవాళిని మోసగించే ఈ ప్రపంచంలో, అతనికి నిజమైన సుఖం కని పించదు. భౌతిక సుఖం కేవలం ఏదో ఒక వాంఛ సంతృప్తం కావడం. వాంఛితం ఈడేరగానే దానిని హీనంగా చూడడం జరుగుతుంది. వాంఛలన్నీ అతోషణీయాలు, అతృప్తాలు.

ఎవరికీ జాతి (జననం) జరా (ముసలి తనం) వ్యాధి, అంతిమంగా మరణం తప్పవు. ఎవడూ ఈ అనివార్య దుఃఖ కారణాలకు అతీతుడు కాడు.

తీరని కోరిక గూడ దుఃఖమే. మనం ద్వేషించే వస్తువులతో, మనుషులతో సంబంధం పెట్టుకోవా లనుకోము. అలాగే మనం ప్రేమించే వాటి నుంచి వేరుగా ఉండాలని కోరు కోము. మనం పెంచుకొన్న కోరికలు, ఎలాగైన, అన్ని వేళల తీరవు. మనకు ఇష్టం లేనిది, కోరనిది మన మీద రుద్ద బడుతుంది. కొన్ని సార్లు అటువంటి అనుకోని ఆశించని, అసంతోషకర పరిస్థితులు భరించ రానివి, బాధాకరాలు అవుతాయి. బలహీన అజ్ఞాన జనం అటువంటి పరిస్థితులలో, మార్గాంతరం లేక, ఆత్మ హత్యకు - ఆత్మహత్య తమ సమస్యకు పరిష్కారమై నట్లు - పాల్పడతారు.

నిజమైన సుఖం అంతరంగంలో ఉంది. సంపద, అధికారం, గౌరవాలు లేదా విషయాలలో సుఖం లేదు. అటువంటి లౌకిక ఆర్జితాలు, బలాత్కారంగా, అన్యాయంగా ఆర్జించిన వైనా, అవి పక్కదారి పట్టినా, వాటి మీద అనురాగం పెంచు కొన్నా, అవి దుఃఖ హేతువు లవుతాయి. స్వంత దారులకు దుఃఖాన్ని కలిగిస్తాయి.

మామూలు సగటు మనిషికి సాధారణంగా ఐంద్రియక సుఖాలే పరమ సుఖాలు. భౌతిక సుఖాలను ఆశించడంలో, తృప్తి పరుచు కోవడంలో, జ్ఞాపకం చేసు కోవడంలో ఒకెంత

క్షణికా నందం ఉన్న దనడంలో సందేహం లేదు. కాని అవి క్షణికాలు, భ్రమ జనితాలు. బుద్ధుని దృష్టిలో, విరాగత లేదా భౌతిక సుఖాల అధిగమనం గొప్ప ఆనందం.

క్లుప్తంగా చెప్పా లంటే, ఈ సంఘటిత దేహమే దుఃఖహేతువు.

ఈ మానవ ప్రాణి మీద, జీవితం యొక్క అనేక పక్షాల మీద, ఆధారపడిన దుఃఖమనే మొదటి సత్యాన్ని జాగ్రత్తగా విశ్లేషించి, పరీక్షించాలి. తాను వాస్తవంగా ఏమిటో అది తెలుసు కోవడానికి ఈ పరీక్ష తోడ్పడుతుంది.

ఈదుఃఖానికి కారణం తృష్ణ లేదా రాగం. ఇది రెండో ఆర్య సత్యం.

ధమ్మ పదం, V. **216**. ఇలా అంటుంది:

''తృష్ణనుంచి విచారం, తృష్ణనుంచి భయం వస్తాయి.
తృష్ణనుంచి పూర్తిగా బయట పడ్డవానికి, విచారం లేదు.
భయం అంత కంటె లేదు.''

ఈ తృష్ణ అనేది అందరిలోను ఉండే అంతర్గత మానసిక బలమైన శక్తి. జీవితంలోని అన్నిరకాల రుగ్మతలకు కారణం ఇదే. ఈ తృష్ణే - అది స్థూలమైన సూక్ష్మమైన - సంసారంలో పునర్జన్మలకు దారితీస్తుంది. అన్ని రకాల జీవితానికి మనిషిని అంటి పెట్టుకొనేట్టు చేసేది అదే.

ఋషిత్వంలో రెండో దశ అయిన సకదాగామిని చేరడంతో 'స్థూలరూప తృష్ణ' బలహీనం అవుతుంది. మూడో దశ అయిన అనాగామి చేరడంతో, అది పూర్తిగా అంతర్హిత మవుతుంది. 'సూక్ష్మరూప తృష్ణ' అర్హంతత్వం పొందగానే అంతర్హిత మవుతుంది.

బుద్ధుడే స్వయంగా ప్రతిపాదించిన మధ్యే మార్గాన్ని అనుసరించి, నిర్వాణ పరమా నందాన్ని పొంది నప్పుడు దుఃఖం, తృష్ణ – రెండూ కూడ అప్పుడు మాత్రమే ధ్వంసం అవుతాయి.

మూడో ఆర్యసత్యం దుఃఖాన్ని పూర్తిగా విచ్ఛేదించటం. ఇది బౌద్ధుల పరమ లక్ష్యమైన నిర్వాణం. అన్నిరకాల తృష్ణను పూర్తిగా నాశనం చేయడంతోనే ఇది సాధ్య మవుతుంది.

బాహ్య ప్రపంచం మీద అంతర్గతంగా ఉండే రాగాన్ని పరిత్యజించడం ద్వారా మనో చక్షువుతో నిర్వాణాన్ని తెలుసు కోవాలి[3].

నాలుగో ఆర్యసత్యమైన ఆర్య అష్టాంగ మార్గం ద్వారా ఈ సత్యాన్ని యదార్థం చేసు కోవాలి. నిర్వాణాన్ని చేరే ఒకే ఒక తిన్నని మార్గం ఈ అనన్య అష్టాంగ మార్గం మాత్రమే.

ఇది పూర్తిగా ఒక కొసకు పోయి, బుద్ధిని బల హీనం కావించే కఠోర నియమాలతో, శరీర కృశింపును చేపట్టదు, రెండో ప్రక్కకు పోయి, నైతిక ప్రగతిని అడ్డుకొనే విషయ లంపటంలో మునిగి పోదు. అంటే మధ్యే మార్గం ఇది.

ఇందులో ఈ దిగువ తెలిపిన ఎనిమిది కారకాలున్నాయి.

1. సమ్యగవగాహన (సమ్మా దిఠ్ఠి = సమ్యగ్దృష్టి)
2. సమ్యగాలోచన (సమ్మా సంకప్ప = సమ్యగ్సంకల్పం)
3. సమ్యగ్భాషణ (సమ్మా వాచా = సమ్యగ్వచనం)
4. సమ్యగ్చర్య (సమ్మా కమ్మంత = సమ్యక్కర్మ)
5. సమ్యగ్జీవితం (సమ్మా ఆజీవ = సమ్యగ్జీవనం)
6. సమ్యగ్యత్నం (సమ్మా వాయామ = సమ్యగ్వ్యాయమం)
7. సమ్యగప్రమత్తత (సమ్మా సతి = సమ్యగ్ స్మృతి)
8. సమ్యకేకాగ్రత (సమ్మా సమాధి = సమ్యగ్సమాధి)

1. సమ్యగవగాహన అంటే నాలుగు ఆర్యసత్యాలకు సంబంధించిన జ్ఞానం. మరో రకంగా చెప్పాలంటే, తనను తాను, తాను నిజంగా ఏమిటో దానిని, అర్థం చేసుకోవడం. ఎందుకంటే, రోహితస్స సుత్త చెప్పినట్లు, ఈ సత్యాలన్నీ " ఒక నిలువెత్తు మానవ దేహానికి" సంబంధించినవే. బౌద్ధంలో కీలకాంశం సమ్య గవగాహనయే.

2. స్పష్టమైన దృష్టి లేదా సమ్య గవగాహన స్పష్టమైన ఆలోచనకు దారి తీస్తుంది. అందుకని, అష్టాంగమార్గంలోని రెండోకారకం సమ్యగాలోచన. Right resolutions (సరైన తీర్మానాలు) Right aspirations (సరైన ఆశంసలు) – అనే ఆంగ్ల పదబంధాలు పాళీ పదాన్ని సరిగా వివరించ లేవు. Right ideas (సరైన భావాలు) లేదా Right mindfulness (సరైన అప్రమత్తత) పాళీ అర్థానికి దగ్గరగా వస్తాయి. "Right thoughts" (సమ్యగాలోచనలు) పాళీమాటకు దాదాపు సమానార్థకం.

సమ్మ సంకప్ప (సంకల్పం) అంటే వితక్క (వితర్క) మానసిక స్థితి. మనం దానిని ఇంగ్లీషులో బాగా చెప్పలేం కనుక, "Initial application" (ప్రారంభ మనోనియోగం) అంటాం. ఈ ముఖ్య మానసిక స్థితి తప్పుడు భావాలను లేదా అభిప్రాయాలను తొలగిస్తుంది. ఇతర ధార్మిక అనుబంధాలను నిర్వాణం వైపుకు మరల్చ డానికి వీలు కల్పిస్తుంది.

ఒకణ్ణి మలినుని గానో, అమలినుని గానో చేసేవి అతడి ఆలోచనలే. అతడి ఆలోచనలు అతని స్వభావాన్ని మలుస్తాయి. అతని కర్మ (విధి)ను నియంత్రిస్తాయి. మంచి ఆలోచనలు

ఒకనిని ఎలా పైకి తీసుకు వెళతాయో, దుష్టాలోచనలు అతనిని క్రిందికి నెడతాయి. ఒక్కొక్కసారి, ఒకే ఒక ఆలోచన ప్రపంచాన్ని పరిమార్చ గలదు, లేదా రక్షించనూ గలదు.

సమ్యగ్సంకల్పం రెండు పనులు చేస్తుంది: దుష్టాలోచనలను తొలగిస్తుంది. మంచి ఆలోచనలను పెంపొందిస్తుంది.

ఈ ప్రత్యేక సందర్భంలో సమ్యగాలోచనలు మూడు విధాలు. ఆ మూడు ఇవి :

i) నెక్కమ్మ (నిష్కామ కర్మ) - ఇహలోక సుఖాలను లేదా రాగానికి, స్వార్థ పరతకు, అంతా స్వీయార్థం అనేభావనకు వ్యతిరేకమైన స్వార్థ రాహిత్యాన్ని పరిత్యాగం చేయడం

ii) అవ్యాపాద (ద్వేషరాహిత్యం = Non-ill-will, goodness) విముఖతకు, చెడ్డ సంకల్పానికి, ద్వేషానికి వ్యతిరేకమైన ప్రేమ పూర్వక కరుణ, సత్సంకల్పం లేదా కనికరము.

iii) అవి హింసా క్రౌర్యానికి, కనికర లేమికి వ్యతిరేకమైన అహింస, నిరపాయత లేదా అనుకంప.

ఈ మంచి, చెడు శక్తులు అంతర్గతంగా అందరిలోనూ ఉన్నాయి. ఇహ ప్రపంచంలో మనం ఈదు లాడు తున్నంత కాలం, ఈ దుష్ట శక్తులు, అనుకోని సమయాల్లో, మనలను చెదర గొట్టే బలంతో, ఉపరి తలానికి వస్తాయి. అర్హతత్వాన్ని పొంది ఒకసారి వాటిని పూర్తిగా నాశం చేస్తే, మన విజ్ఞాన (Consciousness) స్రవంతి పూర్తిగా పరిశుద్ధ మవుతుంది.

అవిద్యతో గూడిన రాగ ద్వేషాలు ఈ మోహ ప్రపంచంలో ఉన్న దుఃఖానికి ముఖ్య కారణాలు. ''ప్రపంచం మొత్తానికి శత్రువు లాలస (రాగం = lust). దీని ద్వారానే అన్ని చెడులు ప్రాణులను చేరతాయి. ఈ లాలసకు ఏదేని కారణం అడ్డు పడితే, అది కోపంలోకి మారుతుంది.''

ఒకడు వాంఛనీయ వస్తువుల వైపుకు ఆకర్షితు డవుతాడు లేదా అవాంఛనీయ వస్తువులకు విముఖు డవుతాడు. రాగం ద్వారా, భౌతిక సుఖాలకు అంటి పెట్టు కొని, ఏదో విధంగా తన వాంఛలను తీర్చుకో ప్రయత్నిస్తాడు. విరాగం ద్వారా అవాంఛనీయ విషయాల నుంచి వెనక్కు పోతాడు. వాని చూస్తేనే అతనికి చిరాకు కలుగుతుంది. కనుక; అతడు వాటిని నాశం చేసే దాక పోతాడు. తన అంతర్ప్రజ్ఞ (intutive insight) ద్వారా అహంకారాన్ని వదిలి పెట్టడంతో, రాగం ద్వేషం - రెండూ కూడ అంతర్హిత మవుతాయి.

ధమ్మపద, V. 251, ఇలా అంటుంది:
లాలస లాంటి అగ్ని లేదు, ద్వేషంలాంటి పట్టు లేదు.
మోహం లాంటి వల లేదు తృష్ణ లాంటి నది లేదు.''

i) నెకమ్మ (నిష్కామ = ఇంద్రియలాలస (కామ) నుంచి స్వేచ్ఛ) ఎదిగిన పిల్లవాడు చిన్నచిన్న ఆట వస్తువులను వదిలి వేసినట్లు, ఆధ్యాత్మిక నిశ్రేణిని ఆరోహిస్తున్నవాడు క్రమక్రమంగా భౌతిక సుఖాల యెడ ఉన్న సూక్ష్మ, స్థూల రాగాన్ని వదిలి వేస్తాడు. వారు ప్లిలలు కావడాన, వారికి పెద్దవాళ్ళ కుండే అవగాహన ఉండదు. వారి తాత్కాలిక సుఖాల నిరర్థకతను గురించి వారికి నచ్చ చెప్ప లేము. పెరిగి పరిణత చెందిన తరవాత, వస్తువులు నిజంగా ఎలా ఉన్నాయో వాటిని అలాగే అర్థం చేసు కోవడం మొదలు పెడతారు. ఐచ్ఛికంగానే వారు తవమ ఆట వస్తువులను త్యజిస్తారు. ఆధ్యాత్మిక యాత్రికుడు నిరత ధ్యాన పర్యాలోచనలతో పైకి పోయిన కొలది, భౌతిక సుఖాల వెంట పడడంలోని నిరర్థకతను, వాటిని వదిలి వేయడం వల్ల లభించే సుఖాన్ని గుర్తిస్తాడు. పూర్తి స్థాయిలో అతడు విరాగాన్ని అలవరుచు కొంటాడు. ''ఈ ప్రపంచంలో విరాగం సుఖం, అలాగే అన్ని ఇంద్రియ సుఖాలను అధిగమించడం'' - అనేది బుద్ధుని తొలి పలుకులలో ఒకటి.

ii) అవ్యాపాద (అద్వేషం = Non-ill-will - ఇది మరో అత్యంత విప్లవాత్మక వికారం) కోపం, దోషం, దుస్సంకల్పం లేదా ద్వేషం, - ఇవన్నీ పాళీ పదం వ్యాపాదకు అర్థాలు. అది ఎవరిలో అయితే రేగుతుందో వారిని తిని వేస్తుంది. ఇతరులను గూడ. అవ్యాపాద అనే పాళీపదం అశత్రుత్వం. ఇది అత్యంత అందమైన గుణం. మెత్తా (మైత్రి)కి సమానం. దీనికర్థం వివక్ష లేకుండ అందరి యెడ ప్రేమ పూరక కరుణ లేదా మంచి తనాన్ని చూపడం. ఎవరి మనస్సు ప్రేమ పూరక కరుణతో నిండి ఉంటుందో వారికి ఎవరి యెడ ద్వేషం ఉండదు. ఒక తల్లి, తనకు తన ఏకైక బిడ్డకు మధ్య తేడాను చూపించక, తన ప్రాణాన్ని అయిన ఇచ్చి బిడ్డను ఎలా కాపాడుతుందో, అలాగే ఈ మధ్యే మార్గాన్ని అనుసరించిన ఆధ్యాత్మిక యాత్రికుడు, అందరితో మమేకమై, తన ప్రేమ పూరక కరుణను ప్రసరిస్తాడు. బౌద్ధుని మైత్రి, సర్వజీవులను - జంతువులను గూడ కలుపుకొని - పరివేష్టిస్తుంది.

iii) అవిహింసా లేదా కరుణ అహింస (నిరపాయత) లేదా అనుకంప సమ్యగ్సంకల్పంలో మూడోది చివరిది అయిన అంశం.

కరుణ మధుర గుణం. ఇది కులీనుల, సున్నిత హృదయాలను, ఇతరుల బాధలకు చలింప జేస్తుంది. బౌద్ధుని మైత్రివలె, బౌద్ధుని కరుణ గూడ అపారమైంది. అది కేవలం తన మతస్థులకో, తన జాతీయులకో, లేదా కేవలం మానవులకో పరిమితమైంది కాదు. పరిమిత అనుకంప నిజమైన కరుణ కాదు.

ఒక అనుకంపా పరుడు పువ్వులా మృదువైన వాడు. ఇతరుల కష్టాలకు అతడు చలించి పోతాడు. ఒక్కొక్కమాటు, ఇతరుల బాధలను బాపడానికి అతడు తన ప్రాణాలను సైతం అర్పించ డానికి వెను కాడడు. ప్రతిజాతక కథలోను, బోధి సత్వుడు బాధితులకు, పరిత్యక్తులకు సహాయం చేసి, వారికి సంతోషం కలిగించ డానికి శాయ శక్తుల కృషి చేసి నట్లు మనం చదువుతాము.

తన రోగిష్టిమారి బిడ్డ కష్టాలను తీర్చడానికే, తల్లి ఏది చేసినా, ఆలోచించినా, ఏమి మాటాడినా. కరుణ శీలము అటువంటి ప్రేమ మూర్తి అయిన తల్లి శీలం లాంటిది. ఇతరుల కష్టాలను చూసి సహించలేని తత్వం దానిది. అది పరిపూర్ణ అహింసగా, నిరపాయతగా అభివ్యక్త మవుతుంది. ఒక కరుణామయ మూర్తి పరిపూర్ణ అహింసాపరుడు, నిరపాయుడు. బాధితుల నిస్సహాయ స్థితి కరుణా చరణతకు అవ్యవహిత కారణం. అన్నిరకాల క్రూరత్వాన్ని తొలగించడమే కరుణకు పరమావధి. కరుణకు ప్రత్యక్ష శత్రువు క్రూరత్వం. పరోక్ష శత్రువు సాధారణ దుఃఖం.

బుద్ధమైత్రి పేద, ధనికులకు ఇద్దరికీ వర్తిస్తుంది. ఎందుకంటె, బౌద్ధం తన శిష్యులకు హీనులను ఉద్ధరించమని, పేదలకు సాయపడమని, అవసరం ఉన్నవారికి, పరిత్యక్తులకు తోడుండమని, రోగులకు పరిచర్య చేయమని, చని పోయిన వారి బంధువులను ఓదార్చమని, దుష్టులకు దయ చూపమని, అజ్ఞానులకు జ్ఞానం అందించమని బోధిస్తుంది.

బౌద్ధం ఉపాసకులకు, భిక్కులకు - ఇద్దరికి గూడ అనుకంప ప్రధాన సూత్రం.

బౌద్ధ అహింస గురించి అల్డస్ హక్స్లీ రాస్తాడు:

''భారతీయ శమవాద (Pacifism) పూర్తి రూపం మనకు బుద్ధ బోధలో కనిపిస్తుంది. సర్వ జీవుల యెడ అహింసను లేదా నిరపాయతను బౌద్ధం బోధిస్తుంది. ఆయుధాల తయారీ, అమ్మకం, విషాలు, మత్తు పదార్థాల తయారి, సైనికుడుగా పని చేయడం, జంతువులను వధించడం - వీటితో వేటితో మామూలు మనుషులకు ఎటువంటి సంబంధం ఉండ రాదని అది నిషేధిస్తుంది.''

**బుద్ధుడు తన శిష్యులకు ఇలా బోధించాడు:**

''ఓ భిక్కులారా, కారణం ఏదైనా కాని, ఎవరైన మిమ్ము గురించి, సమయం సందర్భం లేకుండ, ఉచితానుచితాలు మరచి, సభ్యతా సంస్కారాలు లేకుండ, తెలివిగానో, తెలివి తక్కువ గానో, దయతోనో కోపంతోనో, మాటాడవచ్చు. అలాం టప్పుడు, మీ మనస్సులు కలుషితం కాకుండ, చెడు మాటలు మీ పెదవి దాటకుండ, మిమ్మల్ని మీరు

సంయమించుకోవాలి. దుష్ట సంకల్పం లేకుండ హృదయ పూర్వకంగా దయానుకంపలను ప్రదర్శించాలి. అటువంటి వ్యక్తులనే మనం నిరర్థకం కాని ప్రేమపూరిత ఆలోచనా స్రవంతులతో మన కౌగిలిలోకి తీసుకోవాలి. అక్కడనుంచి మనం ప్రపంచాన్ని, దుష్టసంకల్ప శత్రుత్వ విముక్తమైన, అనంతంగా వ్యాకోచించే ప్రేమ పూరిత కరుణామయ ఆలోచనలతో ముంచెత్తాలి. ఈ విధంగా మిమ్మల్ని మీరు మలుచు కోవాలి.

ఎవరి మనస్సు, స్వార్థపర ఆలోచనలనలు నుంచి, ద్వేషం, క్రౌర్యాల నుంచి, విముక్తమై, స్వార్థరహిత స్ఫూర్తితో, ప్రేమాస్పద కరుణతో, నిరపాయతతో సంతృప్త మవుతుందో వారు పరిపూర్ణ ప్రశాంతితో ఉంటారు. అతడు నిజంగా, తనకు, ఇతరులకు గూడ ఒక వరం లాంటివాడు.

3. సమ్యగాలోచన మూడవ కారకమైన సమ్యగ్భాషణానికి దారి తీస్తుంది. అబద్ధాలు ఆడడం, అవమానించే పరుష పదజాలాన్ని ఉపయోగించడం, చపల భాషణం చేయడం నుంచి దూరంగా ఉండాలని ఇది చెబుతుంది.

స్వార్థ వాంఛలను తొలగించు కోవాలని ప్రయత్నించే ఎవరైన అబద్ధాలాడడం, స్వార్థలక్ష్యం లేదా ఉద్దేశంతో అపవాదులు వేసే పనులకు పూను కోరు. తోటి వారిని అనైక్య పరచడం లేదా వారిపై నింద వేయడం, వారిని మోసం చేయడం, అవమానించడం లాంటి పనులు చేయ డానికి బదులు, నమ్మకస్తుడు, రుజువర్తనుడు అయిన అతడు ఇతరులలో ఎప్పుడూ మంచిని, సౌందర్యాన్నే చూస్తాడు.

ప్రేమ పూరక కరుణను జనింప జేసే అహింసాయుత మనస్సు, ముందుగా తనను, తరువాత ఇతరుని, గాయ పరిచే, పరుష పదజాలాన్ని ఉపయోగించ లేదు. అతడు మాటాడేది సత్యమూ, మధురమూ, సంతోషకరమూ అయినదే కాక, ఉపయోగ కరమూ, ఫల ప్రదమూ, లాభ కరమూ అయినది కూడా.

4. చంపడం, దొంగతనం, లైంగిక అపప్రవర్తనల నివృత్తితో వ్యవహరించే సమ్యక్చర్య, పై దాని ననుసరించి వస్తుంది.

ఈ మూడు దుష్కర్మలు, అవిద్యతోగూడిన కోపం, తృష్ణల ఫలితం. ధార్మిక యాత్రికుని మనస్సు నుంచి ఈ కారణాలను క్రమంగా తొలగించడంతో, ఆ తరవాత వచ్చే నింద్యా ప్రవృత్తులకు ఆ మనస్సులో చోటు ఉండదు. ఇహ ఏమిషతోను అతడు చంపడు. దొంగతనం చేయడు. మనస్సు పరిశుద్ధం కావడంతో అతడు పరిశుద్ధ జీవితాన్ని గడుపుతాడు.

5. మొదట ఆలోచనలను, మాటలను, కర్మలను పరిశుద్ధం చేసుకొన్న తరవాత, ధార్మిక యాత్రికుడు, ఉపాసకునికి నిషేధాలైన ఐదు రకాల వ్యాపారం నుంచి దూరంగా

ఉంటూ, తన జీవితాన్ని పరిశుద్ధం గావించుకొంటాడు. ఆ ఐదు వ్యాపారాలు ఏమిటంటే, ఆయుధాలతో, మనషులతో, మాంసంతో (అంటే మాంసం కోసం జంతువులను పెంచడం) మత్తు పానీయాలతో, విష పదార్థాలతో వ్యాపారం చేయడం.

సన్యాసులకు చిత్తశుద్ధి లేనట్లయితే వారి జీవితం చెడ్డ జీవితం.

ఖచ్చితంగా చెప్పాలంటే, అభిధమ్మం ప్రకారం, సమ్యగ్భాషణం, సమ్యగ్చర్య, సమ్యగ్జీవితాలు మూడు విరతు (Abstinences) లేకాని, మూడు విరుద్ధ గుణాలు కావు.

**౬. సమ్యగ్యత్నం నాలుగు విధాలు, అవి:**

i) అంతకు ముందే జనించిన చెడును త్యజించే యత్నం.
ii) జనించని చెడును జనించ కుండ నిరోధించే యత్నం.
iii) జనించని మంచిని జనింప చేసే యత్నం.
iv) అంతకు ముందే జనించిన మంచిని ఇంకా వృద్ధి చేసే యత్నం.

అష్టాంగ మార్గంలో సమ్యగ్యత్నం చాల ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తుంది. ప్రార్థించడం ద్వారాగాని, ఇతరులను శరణు వేడడం ద్వారాగాని, కాక, ఎవరికి వారు స్వప్రయత్నంతోనే తమ తమ మోక్షాన్ని పొందుతారు.

మనిషిలో ఒక చెడ్డ చెత్త కుప్ప, సుగుణ నిలయం రెండూ ఉన్నాయి. ప్రయత్నంతో ఒకడు ఈ చెత్త కుప్పను తీసి వేసి, గుప్తంగా ఉన్న మంచి గుణాలను అలవరుచు కొంటాడు.

7. శరీరం, వేదనలు, ఆలోచనలు, మానసిక వస్తువులు – వీటికి సంబంధించిన నిరత అప్రమత్తతయే సమ్యగ్యత్నం.

ఈనాలుగు వస్తువుల మీది అప్రమత్తత (సతి), వాంఛ నీయత, సుఖం, శాశ్వతత్వం, అమర్త్య ఆత్మలకు సంబంధించిన భావనలను వరుసగా తొలగించ డానికి ప్రయత్నిస్తుంది.

8. సమ్యగ్యయత్నం, సమ్యగప్రమత్తతలు సమ్యగేకాగ్రతకు దారితీస్తాయి. మనస్సును ఏక బిందువుపై నిలపడం ఏకాగ్రత.

వస్తువులను నిజంగా ఎలా ఉన్నాయో ఆలా చూడడానికి ఏకాగ్రచిత్తం ఒక శక్తిమంతమైన సాధనంగా ఉపయోగిస్తుంది. అది లోలోపలికి చొచ్చుకు పోయే ప్రజ్ఞ (insight) ద్వారా ఆపని చేస్తుంది.

అష్టాంగ మార్గంలోని ఎనిమిది కారకాలలో, మొదటి రెండు జ్ఞానం (ప్రజ్ఞ = పఞ్ఞా) క్రిందకు, తరువాతి మూడు శీలం (నీతి Morality) క్రిందకు, చివరి మూడు సమాధి

(concentration) క్రిందకు వస్తాయి.

| | | |
|---|---|---|
| | | సమ్యగ్భాషణం |
| శీల | = | సమ్యగ్చర్య |
| | | సమ్యగ్జీవనం |
| | | సమ్యగ్ ప్రయత్నం |
| సమాధి | = | సమ్యగ్ ప్రమత్తత |
| | | సమ్యగ్సమాధి |
| పజ్ఞా | = | సమ్యగవగాహన |
| | | సమ్యగాలోచనలు |

వికాసక్రమంలో శీల, సమాధి, ప్రజ్ఞలు, మార్గం లోని మూడు దశలు. ఖచ్చితంగా చెప్పాలంటే, పారమార్థిక కోణం నుంచి, అష్టాంగ మార్గ నిర్మాణ మూలకాలైన ఈ కారకాలు, మానసిక ధర్మాలను (చెతసిక=మానసిక వస్తువులు, మానసిక కారకాలు - వీటితోపాటు ఏక కాలమందే ఉదయించే, విజ్ఞానం (చిత్త)తో బంధితాలు. దీనితో నిబద్ధాలు) సూచిస్తుంది. ఈ మానసిక ధర్మాలు ఒక సమూహంగా లోకోత్తర చిత్తం (Supramundane consciousness) లో కనిపిస్తాయి. లోకోత్తర చిత్తం లక్ష్యం నిర్వాణం.

అవి వరుసగా జ్ఞాన శక్తి (పఞ్ఞింద్రియ), ప్రథమనియోగం (వితక్క), మూడు నివృత్తులు (విరతి) వీర్య (విరియ Energy) సతి (అప్రమత్తత =mindfullness), ఏకాగ్రత (ఏకగ్గత = one pointedness)లు.

ఈ కారకాలన్నీ తన మోక్షంకోసం పాటుపడే ఆకాంక్షుని మానసిక దృక్పథాన్ని సూచిస్తాయి.

**పాద సూచికలు :**

1. ఆరో ప్రకరణం చూడండి

2. సయుత్తనికాయ, 1, P. 62. Kindred Sayings, 1, P.86 చూడండి.

3. 33, 34 ప్రకరణాలు చూడండి.

పద్దెనిమిదో ప్రకరణం

# కర్మ

''జీవులన్నింటికి వాటి కర్మ వాటికి ఉంటుంది''.

– మజ్ఝిమ నికాయ

కర్మ[1] నైతిక కారణతా నియమం. పునర్జన్మ దాని అనుబంధ సిద్ధాంతం. కర్మ, పునర్జన్మలు – రెండూ అంతర్గత సంబంధితాలు. బౌద్ధంలో ప్రాథమిక సిద్ధాంతాలు.

బుద్ధుని ఆగమనానికి ముందర ఈ రెండు సిద్ధాంతాలు భారత దేశంలో బహుళ ప్రచారంలో ఉన్నాయి. అలా ఉన్నప్పటికీ, ఇప్పుడవి మన కందుతున్న రూపంలో, పూర్తిగా వాటిని విశదీకరించి, సూత్రీకరించి, విప్పి చెప్పిన వాడు బుద్ధుడే.

మానవాళి మధ్య ఉన్న ఎక్కువ తక్కువలకు కారణం ఏమిటి?

ఈ అసమతౌల్య ప్రపంచాన్ని మనం ఎలా వివరించ గలం?

ఒకడు సుఖ సంపదలలో, మంచి మానసిక, నైతిక, శారీరక గుణాలతోను, వేరొకడు కటిక దారిద్ర్యంలోను, కష్టాల కడలిలోను జీవిస్తున్నాడు? ఒకడు ఎందుకు కోటీశ్వరుడుగా, మరొకడు నిరుపేదగా పుడుతున్నాడు? ఒకడు అద్భుత బుద్ధి సంపన్నుడుగా, మరొకడు బుద్ధి హీనుడుగా ఎందుకుంటున్నారు? ఒకడు ఋషి లక్షణాలతో మరొకడు నేర ప్రవృత్తితో ఎందుకు పుడుతున్నారు? అదే ఊయెలలో పెరిగిన వారిలో కొందరు భాషా వేత్తలు, కళాకారులు, గణిత వేత్తలు, సంగీత విద్వాంసులు ఎందుకు అవుతున్నారు? కొందరు ఎందుకు పుట్టు అంధులు, బధిరులు, అంగ వికలలు అవుతున్నారు? పుట్టుక నుంచే కొందరు ఎందుకు శాపగ్రస్తులు, వరపుత్రులు అవుతున్నారు?

ఈ అసమానతలకు కారణం ఉండైనా ఉండాలి, లేదా లేక నైనా ఉండాలి. కారణం లేదనుకోండి, అప్పుడది శుద్ధ యాదృచ్ఛికం అవుతుంది.

బుద్ధి ఉన్న వాడెవడూ ఈ అసమానతలకు కారణం అంధ దైవ యోగ మని, శుద్ధ యాదృచ్ఛికత అని అనడు.

ఈ ప్రపంచంలో ఎవనికైన, ఏదో ఒక కారణంగా, అతనికి తగిందే జరుగుతుంది. సాధారణ తెలివి ఉన్న మనుషులు మామూలుగా అసలు కారణాన్ని గాని, కారణాలను

గాని గ్రహించ లేరు. దృశ్యమాన ఫలితానికి ఉన్న అదృశ్య కారణం లేదా కారణాలు, అవశ్యం ఈ ప్రకృత జన్మకే చెందినవి అయి ఉండాల్సిన అవసరం లేదు. అవి దగ్గరి లేదా సుదూర పూర్వ జన్మలకు చెందినవై ఉండవచ్చు. దూర సంవేదనా గ్రహణ శక్తితో గాని, గత సంజ్ఞానాత్మక జ్ఞానంతో గాని, బాగా ఎదిగిన రుషులకే, మామూలు భౌతిక నేత్రానికి చూడ సాధ్యంకాని సంఘటనలను, చూడడం సాధ్య మవుతుంది. అటువంటి సంభావ్యతను బౌద్ధులు ఒప్పు కొన్నారు.

మానవాళిలో అధిక భాగం ఈ అసమానతకు కారణాన్ని సృష్టికర్త సంకల్పానికి అంట గడతారు. సర్వ శక్తిమంతుడైన దేవుని లేదా కారణ రహిత విశ్వశక్తి అస్తిత్వాన్ని బుద్ధుడు బాహాటంగానే కాదన్నాడు.

ఇప్పుడు, ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలు ఈ మానవాళిలోని అసమానతలను ఎలా వివరిస్తారు?

వారు ఈ అసమానతలకు కారణాన్ని, ఇంద్రియ జ్ఞానం ఆధారంగా, రసాయనిక – భౌతిక కారణాలలోను, ''వారసత్వం – పరిసరాల''లోను చూస్తారు.

ప్రసిద్ధ జీవ శాస్త్రవేత్త జులియన్ హక్సీ ఇలా రాస్తారు:

''కొన్ని జన్యువులు రంగును, మరికొన్ని ఎత్తు, బరువులను, ఇంకొన్ని సంతానోత్పాదకతను, జీవిత కాల ప్రమాణాన్ని, వేరేవి పటుత, అపటుతలను, ఇంకా వేరేవి ఆకృతిని, కొలతలను నియంత్రిస్తాయి. వారసత్వ లక్షణాల అన్ని సంభావ్యతలు లేదా అధిక భాగం సంభావ్యతలు జన్యు నియంత్రితాలే. మానసిక లక్షణాలకు, అందులో ముఖ్యంగా సంశ్లిష్ట సూక్ష్మ లక్షణాలకు రుజువులు చాల కష్టం. కాని అవి ఆనువంశికాలే అనడానికి సాక్ష్యాలు పుష్కలంగా ఉన్నాయి. కాని ఆ వారసత్వానికి, శారీరక లక్షణాల వారసత్వ యంత్రాంగం కంటె భిన్నమైన యంత్రాంగం ఉంద నడానికి సాక్ష్యం లేదు. మన మూర్తిమత్వంలోను, శారీరక విశేషాలలోను వచ్చిన వారసత్వం ఎలాగో, రకరకాల జన్యు పరస్పర చర్యమీద ఆధారపడి ఉంటుంది. ఫలదీ కరణ సమయంలో జన్యు పరస్పర చర్య జరుగుతుంది''[2]

విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పిన అటువంటి రసాయనిక – భౌతిక దృగ్విషయం పాక్షిక కారణ మేనని, అవే పూర్తిగా వ్యక్తుల మధ్య ఉండే సూక్ష్మ విశేషాలను వివరించ లేవని ఎవ్వరైన అంగీకరించాలి. అయినా, శారీరకంగా ఒకేవిధంగా ఉన్న, ఒకే జన్యువులను పంచుకొన్న, ఒకే వాతావరణంలో పెరిగిన ఏకాండ కవలలు ప్రవృత్తి రీత్యాను, బౌద్ధికంగాను, నైతికంగాను ఎందుకు పూర్తిగా విభేదిస్తున్నారు?.

తలిదండ్రుల నుంచి వారసత్వంగా వచ్చిన, అడ్డు కొలతలో అంగుళంలో 30 మిలియన్ల వంతుగా ఉన్న, అనంతంగా సూక్ష్మమైన రసాయనిక భౌతిక సూక్ష్మజీవి, మనిషిలో ఒక భాగాన్ని- భౌతిక భూమికను- మాత్రమే వివరించ గలుగుతుంది. ఎక్కువ సంశ్లిష్ట సూక్ష్మ మానసిక బౌద్ధిక తేడాలను వివరించ డానికి ఇంకా ఎక్కువ జ్ఞానం కావాలి. గౌరవనీయమైన, ఉన్నత వంశావళిలో ఒక నేరస్తుడు ఎందుకు పుడుతున్నాడో, దుష్టకుటుంబంలో ఒక ఋషి ఎందుకు జన్మిస్తున్నాడో, బాల మేధావులు, ధార్మిక గురువులు ఎలా పుడుతున్నారో ఆనువంశికతా సిద్ధాంతం వివరించ లేదు.

ఈ వారసత్వ సిద్ధాంతాన్ని చర్చిస్తూ డా. పాస్కల్ తన అవతార వాదం (incarnation) లో ఇలా రాస్తారు :

''అనువంశికతలో సూక్ష్మజీవి (germ) పాత్రను చూస్తే, శారీరక జీవి (Physical germ), అది మనిషిలోని ఒక భాగాన్ని మాత్రమే వివరించ గలుగుతుంది. అది ఆనువంశికత దైహిక పక్షాన్ని వివరిస్తుందే కాని, నైతిక, బౌద్ధిక సమస్యల గురించి అదేమీ చెప్ప లేదు. అదే గనుక పూర్తి మనిషికి కారణమైతే, ఒక వ్యక్తిలో అతని తాత ముత్తాతల, తలిదండ్రుల లక్షణాలే కన పడాలి కాని, మరి ఏ ఇతర లక్షణం కనిపించ రాదు. తలిదండ్రుల గుణాల మొత్తానికి మించి బిడ్డ గుణా లుండ డానికి వీలు లేదు. మరి గౌరవనీయ కుటుంబాలలో పుట్టు నేరస్తులు కని పిస్తున్నారు. క్షుద్ర సమాజంలో ఋషులు జన్మిస్తున్నారు. ఏ కాండ కవలలను తీసు కోండి. అదే సూక్ష్మజీవి నుంచి, అదే సమయం, పరిసరాలలో పుట్టినా, పెరిగినా, వారి దేహాలు ఒకే తీరులో ఉన్నా, ఆ ఏకాండ కవలలో ఒకడు దేవత, మరొకడు రాక్షసుడు అవుతున్నాడు. ఆనువంశికతా సిద్ధాంత వేత్తకు బాల మేధావుల సమస్య తలనొప్పి కలిగిస్తూనే ఉంది. ఈ మేధావుల వంశావళిలో, ఈ శక్తులకు కారణభూతమైన పూర్వీకుడు ఒకడైనా ఉన్నాడా? వారి వంశావళిలో అటువంటి వారు లేక పోవడానికి, 'వారసత్వం మేధావితనానికి కారణం కాదు', అనే విషయాన్ని జోడిస్తే, మరి మొజర్ట్స్, బీథోవెన్స్, డాంటేలకు పుట్టుకతోనే మేధావి సంతానం లేనందువల్ల భౌతికవాదం అనువంశికతను వివరించ లేదని మనం అనుకోవాలి. ఆనువంశికత అన్నివేళల యథార్థం కావడం లేదు, ఎలాగంటే అనేక శారీరక లక్షణాలు పునరావృతం కావడం లేదు. అపాయకరాలైన శారీరకలోపాలున్న కుటుంబాలలో సంతానానికి ఆ అవలక్షణాలు వచ్చి తీరాలని లేదు. కొందరి సంతానం వాటి నుంచి తప్పించు కొంటున్నారు. కణజాల లోపాలు గుప్తంగానే ఉండి పోతున్నాయి. ఇవి తిరిగి ఆ సంతానం సంతానంలో కనిపించ వచ్చు గాక. అంతేకాదు, అత్యంత విభిన్న మనస్తత్వాలు మనకు అదే కుటుంబంలో కానవస్తాయి.[3] ఒక్కొక్కప్పుడు గుణవంతులైన

తలిదండ్రులు తన బిడ్డలో దుష్టప్రవృత్తికి గకావికలై పోతారు. కనుక వారసత్వమూ - పరిసరమూ అవి చేయ వలసినవి చేయ లేకనైనా పోతుండాలి లేదా అవి తమది కాని దానిని ఇష్టానైనా ఉండాలి''.

బౌద్ధం ప్రకారం, ఈ అసమానతకు 'అనువంశికత - పరిసరం' ప్రకృతి - పోషణ[4] (Nature and Nurture) లే కారణం కాక, కర్మ నియమం పని చేయడం కూడ కారణమే. కర్మ నియమం పని చేయడం అంటే, వేరే మాటల్లో చెప్పా లంటే, అసమానతలు గత, ప్రకృత కర్మ ఫలితంగా వచ్చాయి. మన సుఖదుఃఖాలకు కారణం మనమే. మన స్వర్గాన్ని మనమే సృష్టించు కొంటాం. మన నరకాన్ని మనమే సృష్టించు కొంటాం. మన కర్మకు మనమే శిల్పులం.

**అసమానతకు కారణం**

మానవాళిలో ఉన్న పైకి కనిపించే, అవివరణీయ అసమానతతో కలత చెందిన సుభ అనే ఒక సత్యాన్వేషి బుద్ధుని దగ్గరకు వెళ్ళి, దానిని గురించి ఇలా ప్రశ్నించాడు:

''దేవా ఏమిటి కారణం, ఏమిటి హేతువు - కొంత మంది అల్ప జీవులు, కొంతమంది దీర్ఘకాలం జీవిస్తున్నారు? కొంత మంది రోగులు, కొంత మంది ఆరోగ్యవంతులు, కొంతమంది అందంగా, కొంతమంది అందవిహీనంగా ఉంటున్నారు? కొంతమంది శక్తి హీనులు, కొంత మంది శక్తి మంతులు, పేదలు, ధనవంతులు, హీనులు, కులీనులు, జ్ఞానులు, అజ్ఞానులు - ఏమిటి ఈ తేడాలు ఎందుకు దేవా?''

బుద్ధుడు ఇలా సమాధానం చెప్పాడు :

ప్రతి ప్రాణికి దేని కర్మదానికి, దేని వారసత్వం దానికి, దేని సహజాత కారణం దానికి, దేని రక్త బంధువులు దానికి, దేని ఆశ్రయం దానికి ఉంటుంది. వారి కర్మ వారిని ఉన్నత, నీచ స్థితులలోకి వర్గీకరిస్తుంది''[5].

ఆ తరవాత అతడు అటు వంటి తేడాలను కార్యకారణ నియమంతో విశదపరిచాడు.

ప్రాణాన్ని తీసి, ఒక వేటకాడు చేతులను రక్త సిక్తం చేసుకొని, గాయ పరిచి, చంపడం లోనే నిమగ్నమై, జీవుల యెడ దయ చూపక మానవుడుగా జన్మించి నప్పుడు, అతడు చంపిన ఫలితంగా అల్పాయుష్కుడే అవుతాడు.

ఒకడు చంపడం పరిహరించి, బడితెను, ఆయుధాన్ని ప్రక్కనపెట్టి, సర్వప్రాణుల యెడ దయానుకంపలతో ఉంటే, అతడు మానవుడుగా జన్మించి నప్పుడు, హత్య చేయని కారణంగా, దీర్ఘాయుష్మంతు డవుతాడు.

ఒకడు అలవాటుగా ముష్టి, మట్టిగడ్డ, బడితె, ఖడ్గాలతో కొట్టి , ఇతరులకు హాని కలిగిస్తూ ఉండి, మానవ జన్మ ఎత్తినప్పుడు, అతడు చేసిన హింస కారణంగా అనేక వ్యాధులతో పీడితు డవుతాడు.

ఒకనికి ఇతరులకు హాని కలిగించే అలవాటు లేక పోతే, అతడు మనిషై పుట్టి నప్పుడు అతడు హాని చేయని ఫలితంగా, మంచి ఆరోగ్యాన్ని అనుభవిస్తాడు.

ఒకడు కలహకారి, కోపిష్టి అయి, చిన్న మాటకే చికాకు పడి, కోపాన్ని, తిరస్కారాన్ని, అయిష్టతను వెళ్ళ గక్కితే, అతడు మానవుడుగా జన్మించి నప్పుడు, అతని చెడ్డ చిరాకు కారణంగా, అంద విహీను డవుతాడు.

ఒకడు కలహకారి, కోపిష్టి కానప్పుడు, పెద్దగా తనను తిట్టి నప్పుడు గూడ కోపం, అయిష్టం, తిరస్కారాలు వెళ్ళ గ్రక్కకుండ ఉంటే, అతడు మనుష్య జన్మలో, అతని సౌశీల్యం ఫలితంగా, అందంగా పుడతాడు.

ఒకడు ఇతరుల లాభాలను, వారికి జరిగే మర్యాద మన్నలను చూసి, ఈర్ష్యాసూయలను పెంచు కొంటే, గుండెలో నిలుపు కొంటే, మనుష్యుడై పుట్టి నప్పుడు, అసూయ కారణంగా శక్తి హీను డవుతాడు.

ఒకడు ఇతరుల లాభాలను, వారికి జరిగే మర్యాద మన్ననలను చూసి అసూయ చెందక పోతే, అసూయను తన హృదయంలో నిలుపు కోక పోతే, అతడు మనిషిగా పుట్టి నప్పుడు, అసూయ లేమి వల్ల, శక్తిమంతు డవుతాడు.

ఒకడు దానంగా దేనినీ ఇవ్వకపోతే, అతడు అతని లోభ బుద్ధి కారణంగా, మనుష్య జన్మలో, పేదవుతాడు.

ఒకడు దాన ధర్మాలు చేస్తే, అతడు, మానవ జన్మ ఎత్తినప్పుడు, అతని దాతృత్వ శీలం వల్ల, ధనవంతు డవుతాడు.

ఒకడు మొండి, గర్వమతి, గౌరవార్హులను గౌరవించని వాడు అయితే, మానవాళి మధ్య పుట్టి నప్పుడు, అతడు అతని అహంకారం అప్రణిపాతాల వల్ల, హీనజన్ముడవుతాడు.

ఒకడు మొండి, గర్వమతి కాకుండ, అర్హులైన వారిని గౌరవిస్తే, అతడు మానవుడై జన్మించి నప్పుడు, అతని అణకువ, వినయాల కారణంగా ఉన్నత జన్ము డవుతాడు.

ఒకడు పండితుల, గుణవంతుల దరి చేరి, ఏది మంచి, ఏది చెడు, ఏది తప్పు ఏది ఒప్పు, ఏది ఆచరించాలి, ఏది ఆచరించ రాదు, ఏది చేయవచ్చు, ఏది చేయ గూడదు,

ఏది సంక్షేమానికి తీసుకు వెళ్తుంది, ఏది వినాశానికి దారి తీస్తుంది, అని వారిని ప్రశ్నించి తెలుసు కోకుంటే, అతడు, మానవజన్మ ఎత్తి నప్పుడు, అతనికి తెలుసుకోవాలనే ఉత్సుకత లేని కారణంగా, అవిద్యా పరుడవుతాడు.

ఒకడు పండితులను, గుణవంతులను చేరి, పై చెప్పిన విధంగా ప్రశ్నలడిగి తెలుసు కొంటే, అతడు మానవుడై పుట్టి నప్పుడు, అతని అన్వేషణా స్ఫూర్తి కారణంగా, విజ్ఞానవంతు డవుతాడు.

చర్య – ప్రతిచర్యల ఈ సాదృశ్యం పరంగా, పాఠకునికి బహుశ, డా. గ్రిమ్ మాటలు ఆసక్తి గొలప వచ్చు: ''ఈ ఆకర్షణ నియమాన్ని మరణ సమయంలో, నూతన జీవిని (new germ) చిక్కించుకొనే నియంత్రణగా, ఈ సందర్భాలన్నింటిలోను చూపించడం అంత కష్టం కాదు. ఎవడు అనుకంప రహితుడై, మనుష్యులను జంతువులను చంప గలడో, అతడు అంతర్గతంగానే, హ్రస్వ జీవిత ప్రవృత్తిని తనతో తీసుకు వెళతాడు.

ఇతర జీవులు కొద్ది కాలంపాటే జీవిస్తే అతనికి ఎంతో సంతృప్తి కలుగుతుంది. అంతే కాదు, ఇంకా సంతోషిస్తాడు. అందుకని కొద్ది కాలం మాత్రమే జీవించే జీవులకు ఆకర్షితు డవుతాడు. ఆకర్షణ, అతడు మరణించిన తరవాత, మరో సూక్ష్మ జీవిని గ్రహించడంలో అభివ్యక్త మవుతుంది. అది అప్పుడు అతనికి నష్టంగా పరిణమిస్తుంది. అలాగై కూడ, అంతర్గతంగానే తమను తాము కురూపి శరీరాలుగ మలుచుకోగల శక్తి ఉన్న సూక్ష్మ జీవులకు, ఇతరులను కించ పరచడంలో, వికృతం గావించడంలో సుఖాన్ని పొందే వానితో ఆకర్షణ బాంధవ్యం ఉంటుంది.

''వికృత దేహాలకు, తత్సంబంధ సూక్ష్మ జీవులకు ఒక వికృత వ్యక్తి తనలోపలే తాను, ఆకర్షణను పెంచు కొంటాడు. ఎందుకంటే, ముఖాన్ని వికృతం గావించటం కోపానికి శీల లక్షణం.

''ఎవడు అసూయా పరుడో, గర్విష్ఠో, పిసినారో, అతడు తన లోలోపల, ఇతరు లంటే అయిష్టం చూపే, వారిని కించ పరిచే ప్రవృత్తిని వహిస్తాడు. అలాగే పేద బాహ్య పరిస్థితులలో పెరగాల్సిన సూక్ష్మ జీవులు అతనికి ఆకర్షితాలవుతాయి.

పైవాటి ఫలితంగానే లింగపరమైన మార్పు గూడ వస్తుంది. దీఘనికాయం No. 21 లో ఇలా ఉంది: ''శాక్య కుటుంబానికి చెందిన గోపిక అనే ఆమె, మరణానంతరం, గోపక దేవ పుత్రగా జన్మించింది. ఎందుకంటె ఆమె స్త్రీ మనస్సు (Female mind) ను నిరాకరించి, లోపల పురుష మనస్సును రూపొందించు కొంది.''[6]

మనం నిజంగా వారసత్వ లక్షణాలతోనే పుట్టాం. అదే సమయంలో, మనలో, విజ్ఞాన శాస్త్రం వివరించలేని, అంతస్సిద్ధ సామర్థ్యాలు ఉన్నాయి. ఈ జీవి రూపొంద డానికి ఆస్కారమైన శుక్రం అండాలను ఇచ్చినందుకు మనం తలిదండ్రులకు రుణ పడి ఉంటాం. ఈ బీజరూప జనక సమ్మేళనానికి, పిండోత్పత్తికి అవసరమైన కర్మశక్తి, ప్రాణం పోసేదాక, అక్కడ అవి నిద్రావస్థలో ఉంటాయి. అందువలన కర్మ, ఈ జీవి గర్భంలో పడడానికి అవశ్యకం.

శారీరక, మానసిక లక్షణాల రూప ధారణలో తలిదండ్రుల నుంచి వారసత్వంగా వచ్చిన కణాలు, జన్యువుల కంటె గూడ, కొన్నిసార్లు, గత జన్మలలో సంచితమై వారసత్వంగా వచ్చిన కర్మప్రవృత్తులు, పెద్ద పాత్రను నిర్వహిస్తాయి.

ఉదాహరణకు బుద్ధుడు, అందరిలాగే, అతని తలిదండ్రుల నుంచి, ఉత్పాదక కణాలను, జన్యువులను వారసత్వంగా పొందాడు. కాని శారీరకంగా, నైతికంగా, బౌద్ధికంగా అతనితో సరితూగ గల వారు ఎవరూ గూడ, అతని సుదీర్ఘ గౌరవనీయ వంశా వళిలోనే లేరు. బుద్ధుని మాటలలో చెప్పా లంటే, అతడు రాచ వంశావళికి కాక, ఆర్య బుద్ధుల వంశావళికి చెందిన వాడు. అతడు నిజంగా అతి మానవుడే, అతని కర్మ యొక్క అసాధారణ సృష్టి అతడు.

లఖ్ఖన సుత్త[7] ప్రకారం, ముప్పై రెండు ముఖ్యలక్షణాలు లాంటి అసాధారణ శారీరక లక్షణాలను, గత జన్మలలో చేసిన పుణ్యకార్యాల ఫలితంగా, బుద్ధుడు వారసత్వంగా పొందాడు. ప్రతి శారీరక లక్షణాన్ని పొందడంలో ఉన్న నైతిక కారణాలను సుత్తలో స్పష్టంగా వివరించారు.

కర్మప్రవృత్తులు మన శారీరక లక్షణాలను ప్రభావితం చేయ గలగడమే కాక, పైతృక కణాల జన్యువుల శక్మ (Potentality) ను నీరవం చేస్తుందని ఈ అనన్య ఉదాహరణ నుంచి మనకు తెలుస్తుంది. అందువల్ల, ''మనం మన కర్మలకు వారసులం'' అని బుద్ధుడు చేసిన ప్రహేళికా వాక్యం అర్థవంత మవుతుంది.

ఈ విపర్యాస సమస్యను చర్చిస్తూ అత్థసాలినీ అంటుంది:

కర్మభేదం కారణంగానే జీవులు ఉన్నత, నీచ, కులీన, అకులీన, సుఖ – దుఃఖ భాగులుగా జన్మిస్తాయి. కర్మ భేదం కారణంగానే, అందం – అంద వికారం, శరీరసౌష్ఠవం – అంగవైకల్యం లాంటి వైయక్తిక శారీరక లక్షణాలు వస్తాయి. కర్మ భేదం కారణంగానే, లాభనష్టాలు, కీర్తి అపకీర్తులు, నిందా పొగడ్తలు, సుఖదుఃఖాలు లాంటి పరిస్థితులు జీవులకు సంప్రాప్తిస్తాయి.

కర్మ ప్రపంచాన్ని నడుపుతుంది, కమ్మవల్లనే మనుషులు జీవిస్తారు,
కర్మ బద్ధులు జీవులన్నీ,
ఇరుసు ఆధారంగా రథచక్రం దొర్లినట్లు.
కర్మవల్లనే ఒకనికి వైభవం, ప్రశంస లభిస్తాయి.
కర్మకారణంగానే బంధం, నాశం, అణచి వేతలు.
కర్మకు ఫలాలు అనేకమని తెలిసి
నీ వెందు కంటావు, ''ప్రపంచంలో కర్మలేదని''[8]

ఈ విధంగా, బౌద్ధుని దృక్కోణం నుంచి, మన ప్రకృత మానసిక, నైతిక, బౌద్ధిక, ప్రావృత్తిక తేడాలన్నీ మన గత, ప్రకృత చర్యల ప్రవృత్తుల ప్రభావితాలే.

**ప్రతిదానికీ కర్మకారణం కాదు**

బౌద్ధం ఈ తేడాలను కర్మ నియమానికే అంటగట్టినా, అనేక కారకాలలో దానిని ముఖ్యమైన దానిగానే భావించినా, ప్రతిదీ కర్మవల్లనే సంభవించిందని చెప్పదు. కర్మ నియమం ముఖ్యమైందే. సందేహం లేదు. అది బౌద్ధం వర్ణించిన ఇరవై నాలుగు కారణ స్థితులలో (ప్రత్యయాలలో) ఒకటి మాత్రమే[9].

''మనిషి అనుభవించే ప్రతి కుశల, అకుశల, తటస్థ అనుభూతులకు ఏదో ఒక పూర్వ కర్మయే కారణం'', అనే తప్పుడు అభిప్రాయాన్ని నిరాకరిస్తూ బుద్ధుడు ఇలా చెప్పాడు:

''అలాగైతే పూర్వ కర్మ కారణంగానే ఒకడు హంతకుడో, దొంగో, అబద్ధాల కోరో, అపవిత్రుడో, అపవాదు వేసేవాడో, గందరగోళం వ్యక్తో, అసూయా పరుడో, దురాశా పరుడో, గాడి తప్పిన వాడో అవుతా డన్నమాట . ఈ విధంగా పూర్వ కర్మే ఆవశ్యక కారణమని నమ్మేవాడు, ఈ కర్మనో, ఆ కర్మనో చేయ డానికి లేదా చేయ కుండ ఉండడానికి, అతనికి వాంఛ, ప్రయత్నం, ఆవశ్యకతలు ఉండవలసిన అవసరం లేదు – (అంటే అతడు ఏమీ చేయ నవసరం లేదు. అతనిని అతని పూర్వ కర్మే నడిపిస్తుం దన్నమాట)''[10]

బుద్ధుడు చెప్పిన ఈ మాటలు శారీరక పరిస్థితులు, మానసిక దృక్పథాలు గత కర్మ నుంచే పుడతాయనే విశ్వాసాన్ని ఖండిస్తున్నాయి. ప్రస్తుత జీవితాన్ని గత కర్మే పూర్తిగ నిబద్ధించి, నియంత్రించి నట్లయితే, అప్పుడు కర్మ తప్పకుండా విధి వాదం, పూర్వ నిశ్చిత వాదం అవుతుంది. అలాంటప్పుడు ఎవడూ కూడ తన వర్తమాన, భావి జీవితాన్ని మలుచు కొనే అవకాశమే లేదు, స్వేచ్ఛే లేదు. ఇదే వాస్తవమైతే స్వేచ్ఛా సంకల్పా (free will) నికి తావెక్కడ?

స్వేచ్ఛా సంకల్పం అర్థరహితం అవుతుంది. జీవితం యాంత్రిక మవుతుంది. మన అదృష్టాన్ని, భావిని పూర్తిగా నియంత్రించే భగవంతుడు మనలను సృష్టించినా, లేదా మన జీవిత గతిని, విధిని, నియంత్రించే అనివార్య గతకర్మ మనలను తయారు చేసినా, రెండూ ఒకటే. ఉన్న తేడా అల్లా 'దేవుడు', 'కర్మ' అనే పదాలలో మాత్రమే. ఆ రెండూ నిర్వహించే పనులు ఒకటే కావడాన, ఒకదాని స్థానంలో రెండో దానిని ప్రక్షేపించ వచ్చు.

బౌద్ధుల కర్మనియమం అటువంటి విధి వాదం కాదు.

**పంచనియామాలు.**

బౌద్ధం ప్రకారం భౌతిక (శారీరక) మానసిక రంగాలలో పని చేసే ఐదుప్రక్రియలు లేదా నియమాలు'' ఉన్నాయి.

అవి :

1. ఉతు నియామ, భౌతిక అసేంద్రియ ప్రపంచం అంటే కాలికంగా వచ్చే గాలులు, వర్షాల దృగ్విషయం, క్రమం తప్పని రుతువులు, రుతువుల మార్పుల సంఘటనల లక్షణాలు, గాలుల వర్షాల కారణాలు, ఉష్ణ స్వభావం మొదలైనవి ఈ కోవకు చెందుతాయి.

2. బీజనియామ, సూక్ష్మజీవుల, విత్తనాల ప్రపంచం (భౌతిక - సేంద్రియం). ఉదాహరణకు, వరి గింజ నుంచి ఉత్పత్తి అయిన బియ్యం, చెఱుకు, పంచదారల నుంచి వచ్చే తీపి రుచి, కొన్ని ఫలాల విలక్షణ గుణాలు, కణాల, జన్యువుల, కవలల శారీరక సాదృశ్యతలకు సంబంధించిన శాస్త్రీయ సిద్ధాంతం, ఈ ప్రపంచానికి చెందుతుంది.

3. కర్మనియామ, చర్య (కర్మ) ఫలం ఉదాహరణకు, వాంఛనీయ, అవాంఛనీయ కర్మలు తదను గుణంగా మంచి, చెడు ఫలితాలను ఇస్తాయి.

   నీరు పల్లాన్ని ఎరిగినట్లే, కర్మ గూడ, అవకాశం లభించి నప్పుడు, దండన పారితోషిక రూపంలో కాక, ఒక అంతస్సిద్ధ క్రమంలో ఆవశ్యక ఫలితాన్ని ఇస్తుంది. కర్మ ఫలాల వరుస క్రమం సూర్యచంద్రాదుల సహజ ఆవశ్యక క్రమం లాంటిది. కర్మఫలం సూత్రమూ అలాంటిదే.

   కర్మలో అంతర్గతంగా సాతత్సతా సూత్రం ఉంది.

రకరకాల అనుభవాలు, వైయక్తిక లక్షణాలు, సంచిత జ్ఞానం మొదలైనవి, తుడిచి తిరిగి రాయడానికి వీలైన తోలు కాగితం లాంటి మనస్సు మీద చెరిగి పోకుండ ముద్రిత మవుతాయి. ఈ అనుభవాలన్నీ, లక్షణాలన్నీ జన్మనుంచి జన్మకు వలస పోతాయి. చిన్న నాటి మన అనుభవాలను మర్చి పోయి నట్లే, కాలం గడవడంతో, అవీ విస్మృతా లవుతాయి. ఏ ఉపదేశం లేకుండానే వేరు వేరు భాషలలో మాటాడే బాల మేధావులు, అద్భుత బాలలు ఈ కర్మ సాతత్యతా సూత్రానికి ఉదాహరణలు.

4. ధమ్మనియామ, ప్రమాణ ప్రపంచం; ఉదాహరణకు ఒక బోధిసత్త్వుడు చివరి సారిగా జన్మించే సమయంలో సంభవించే సహజ దృగ్విషయం. గురుత్వాకర్షణ సిద్ధాంతం, ఇంకా అటువంటి ప్రకృతి నియమాలను, మంచిగా ఉండడానికి కారణాన్ని, ఈ కోవలో చేర్చవచ్చు.

5. చిత్త నియామ, మానసిక నియమం, ఉదాహరణకు విజ్ఞాన ప్రక్రియలు, విజ్ఞాన మూలకాలు, రెండు మనస్సుల మధ్య అతీంద్రియ భావ ప్రసారం, (telepathy) దూర సంవేదన గ్రహణం (telesthesia), ప్రతీప సంజ్ఞానం (retrocognition) పూర్వబోధ (Premonition ముందుగా తెలియుట), దూరదర్శనం, (clairvoyance), దూర శ్రవణం (Clairaudence) ఇతరుల అలోచనలు చదవడం (thought reading) లాంటి మానసిక శక్తులు, ఇంక ఇతర మనోదృగ్విషయం - వీటిని ఆధునిక విజ్ఞాన శాస్త్రం వివరించ లేదు - లాంటి విషయాలు.

ప్రతి మానసిక, భౌతిక దృగ్విషయాన్ని సర్వపరివేష్టితాలైన ఈ ఐదు ప్రక్రియలతో లేదా నియమాలతో వివరించ వచ్చు. అసలు ఈ ఐదు వాటి కవే నియమాలు. అటువంటి కర్మ ఈ ఐదింటిలో ఒకటి. అన్ని ఇతర ప్రకృతి నియమాలలాగే, వీటికీ అమలు పరిచే వాడు ఒకడు అవసరం లేదు.

వాటిని, కొంతవరకు, మానవుని ప్రయత్నం తెలివి తేటలతో, మనశ్శక్తితో, నియంత్రించ డానికి వీలైనవే అయినా, భౌతిక అసేంద్రియ ప్రపంచం, భౌతిక సేంద్రియ ప్రపంచం, ప్రమాణ ప్రపంచం - ఈ మూడూ కొద్దో గొప్పో యాంత్రిక రకాలే. ఉదాహరణకు, నిప్పు సహజంగా కాలుతుంది. అతి చలి గడ్డ కట్టిస్తుంది. కాని మనిషి కాల కుండానే నిప్పులమీద నడిచాడు. హిమాలయాల్లో నగ్నంగా తపస్సు చేశాడు. ఉద్యాన శాస్త్రజ్ఞుడు పూల, పండ్ల వ్యవసాయంలో అద్భుతాలు సృష్టించాడు. యోగులు గాలిలో ఎగిరారు. మానసిక నియమమూ అంతే యాంత్రికం. కాని బౌద్ధ శిక్షణ మనోనియంత్రణను

లక్షిస్తుంది. ఇది సరైన అవగాహన, నైపుణ్యంతో గూడి సంకల్పం (volition) తో మాత్రమే సాధ్యం. కర్మనియం స్వయంచాలితంగానే పని చేస్తుంది. కర్మ బలంగా ఉన్నపుడు, కావాలనుకొన్నా గూడ, దాని నిర్నిరోధ ఫలంతో జోక్యం చేసుకో లేదు. కాని ఇక్కడ గూడ, సరైన అవగాహన, నిపుణ సంకల్పాలతో చాల సాధించ వచ్చు. భవిష్యత్తును తన కనుగుణంగా తిప్పుకోవచ్చు. మంచి కర్మను అంటిపెట్టుకొని ఉంటే, చెడ్డ ఫలానుభవాన్ని నిరోధించ వచ్చు.

కర్మనియమం నిజంగా బహుక్లిష్టమైంది. ఒక్క బుద్ధుడు మాత్రమే దానిని పూర్తిగా అర్థం చేసు కొన్నాడు. బౌద్ధుడు కమ్మ అంతిమ నాశాన్ని లక్షిస్తాడు.

కమ్మ విపాకం (కర్మఫలం) నాలుగు అచింత్యాలలో ఒకటని బుద్ధుడు అంగుత్తరని కాయంలో చెప్పాడు.

**పాదసూచికలు :**

1. సంస్కృతం కర్మ
2. The stream of life.
3. షేక్స్‌పియర్ గురించి కల్నల్ బిగ్రెసాల్ ఇలా రాశాడు:
   "అతడి తలిదండ్రులలో ఎవరికి చదవడం, రాయడం రాదు. అతడొక కుగ్రామంలో అవిద్యాగ్రామంలో పెరిగాడు,"
4. "మానవుల మధ్య అసమానత 'ప్రకృతి – పోషణ' అనే రెండు మూలాల నుంచి వస్తుంది". జె.బి.యస్. హాల్డేన్, *"The Inequality of Mankind"* అనే గ్రంథలో రాశాడు. P. 23.
5. మజ్ఝిమ నికాయ, 111, 135, చూలకమ్మవిభంగ సుత్త P, 202. cf. Venerable Nagasena's reply to the identical question put by king Milinda. See Warren *Buddhism in Translations*, P. 214
6. The ***Doctrine of the Buddha***
7. దీఘ నికాయ, 111, 30, P. 142
8. P. 65, *The Expositor*, 1, PP. 87 - 88
9. *The comapendium of Philosophy*, pp. 191 - 192; Narada Thera, *Manual of Abhidhamma* pp. 367, ff
10. *అంగుత్తర నికాయ*, 1, P. 173; *Gradual sayings*, 1, P. 157
11. *అభిదమ్మావతర*, P. 54; C.A.P. Rhys *Davids Bhuddhism*, P. 119 చూడండి.
12. *See Gradual sayings*, 11, P. 90

పందొమ్మిదో ప్రకరణం

# కర్మ అంటే ఏమిటి?

''చేతనమే (కర్మ)''

– అంగుత్తరనికాయ.

**కమ్మ**

పాలీపదం 'కమ్మ' అనే పదానికి అర్థం చర్య, చేయడం. ఏ ఔద్దేశిక చర్య అయినా, అది మానసికమైనా, శాబ్దికమైనా లేదా శారీరకమైనా, దానిని కర్మగా పరిగణిస్తారు. ''మనోవాక్కాయకర్మ'' – అనే పదబంధంలో ఉన్నదంతా దీనిలో ఉంటుంది. మామూలుగా చెబితే, మంచి, చెడ్డ చేష్టలన్నీ 'కర్మ' అన బడతాయి. దాని పరమార్థంలో అది నైతిక, అనైతిక ఇచ్ఛలన్నీ కర్మయే. అనైచ్ఛిక, అనుద్దేశిత, అచేతన చర్యలు, అవి సాంకేతికంగా చర్యలు కానప్పటికీ, కర్మ క్రిందికి రావు. ఎందుకంటే, కర్మను నిశ్చయించడంలో అత్యంత ముఖ్యమైన కారకం 'సంకల్పించడం' అక్కడ లేదు.

బుద్ధుడు అంటున్నాడు: ''హే భిక్కులారా, చేతన (సంకల్పించడం) కమ్మ. సంకల్పించడంతో ఒకడు శరీరం, భాష, ఆలోచనలతో పని చేస్తాడు.''[1]

బుద్ధుల, అర్హంతల చర్యలు తప్ప, ప్రతి సంకల్పిత (చేతన) చర్య, కమ్మ అవుతుంది. వారి చర్యలు సాపవాదాలు, ఎందుకయ్యా యంటే, అవి మంచి, చెడులనుంచి విముక్త మయ్యాయి. కర్మ మూలాలైన అవిద్య, తృష్ణలను వారు సమూలంగా పెకలించి వేశారు. ''వాటి బీజాలను నాశనం గావించడం వల్ల స్వార్థ వాంఛలు ఇక ఏ మాత్రం కలగవు'' – అని రత్న సుత్తం అంటున్నది. దీని అర్థం బుద్ధులు, అర్హంతలు నిష్క్రియులని కాదు. అందరి క్షేమం కోసం, సుఖం కోసం వారు విరామ మెరుగక పని చేస్తారు. వారి చర్యలను మామూలుగా మంచివి గాను, నైతికాలుగా పరిగణిస్తారు. వాటంతట వాటినిగా చూస్తే, వాటికి సృజన శక్తి లేదు. వస్తువులను విషయాలను యథాతథంగా చూడ గలగడంతో వారు అంతిమంగా – కార్యకారణ బంధాన్ని – విశ్వ శృంఖలాలను తెంచు కొన్నారు.

కొన్ని మతాలు ఈ ఎక్కువ తక్కువలను కర్మకు ఆపాదిస్తాయి. కాని అనుద్దేశిత చర్యలు గూడ కర్మయే అని అవి చెప్పి నప్పుడు, వాటితో బౌద్ధంతో ఏకీ భవించవు.

వాటి ప్రకారం, ''తల్లిని ఒకడు అనుకోకుండ హత్య చేసినప్పుడు అది ఘోర కృత్యమే అవుతుంది. నిప్పును తాకిన మనిషి కాలినట్లుగా, తెలిసిగాని, తెలియక గాని ఒకడు ఒక జీవికి హాని చేసినా, ఒకజీవిని హత్యచేసినా, అతడు అపరాధియే!''

''కాని ఇది విస్పష్ట మౌఢ్యానికి దారితీస్తుంది. తల్లి, పిండము – ఇద్దరూ ఒకరి కొకరు హాని చేసు కొంటున్నారు.... ఇంకా నిప్పుతో పోల్చడం అంత బాగాలేదు: ఒకడు మరొకనిచే హత్యచేయిస్తే అతడు అపరాధి కాడు. ఎందుకంటే ఇంకొకరితో నిప్పును తాకించినప్పుడు, మనం కాలడం లేదు. మళ్ళీ అచేతన పాపం, చేతన పాపం కంటె ఎక్కువ భారమైంది: కాలిన ఇనుముని అది కాలినదని తెలియక తాకినవానికి, తెలిసి తాకినవాని కంటె, ఎక్కువ కాలుతుంది.''[2]

కర్మ పని చేయడంలోని ముఖ్యాంశం మనస్సు. మనం చేసే ప్రతిపనికి, ఆయా క్షణాలలో మనం అనుభవించే మనస్సు లేదా చేతన రంగు పులుముతుంది. ''మనస్సు ప్రమత్తంగా ఉన్నప్పుడు శారీరక చర్య ప్రమత్తంగా ఉంటుంది. భాషణం, ఆలోచనలు గూడ అంతే. మనస్సు అప్రమత్తంగా ఉంటే, శారీరక చర్య, భాషణం, ఆలోచనలు గూడ అప్రమత్తంగా ఉంటాయి.''[3]

అన్ని పరిస్థితుల కంటె ముందు ఉంటుంది మనస్సు
అవన్నీ మనస్సు తయారించినవే;
ఒకడు క్రూర మనస్సుతో మాటాడినా, ఏదైనా చేసినా,
బండిని లాగే జంతువు గిట్టలనంటి బండిచక్రం వచ్చినట్లుగా, అతనిని అంటి బాధ వస్తుంది.
అన్ని పరిస్థితులకు ముందుండేది మనస్సు, మనస్సు ముఖ్యం. అవి మనో నిర్మితాలు,
ఒకడు మంచి మనస్సుతో ఏది మాటాడినా, చేసినా,
అప్పుడు, ఎప్పుడు, వీడని ఛాయలా, సుఖం అతనిని వెన్నంటి వస్తుంది.[4]
పదార్థరహిత మనస్సు అన్ని కర్మ సంబంధ చర్యలను నిబద్ధిస్తుంది.

కర్మ అంటే గత చర్యలే అయి తీరవలసిన అవసరం లేదు. గత, ప్రస్తుత చర్యలు రెండూ దానిక్రిందకు వస్తాయి. అందుకని ఒక అర్థంలో, 'ఇప్పటి మనం, గత చర్యల ఫలితం. భవిష్యత్తులో మనం, ఇప్పటి చర్యల ఫలితం అవుతాం. మరో అర్థంలో అయితే, 'ఇప్పటి మనం, పూర్తిగా గత కర్మల ఫలం కాము, 'భావి మనం' పూర్తిగా ఇప్పటి చర్యల ఫలం కాము, వర్తమానం గత కాలపు బిడ్డ అనడంలో, భావి వర్తమానపు బిడ్డ అనడంలో ఏమాత్రం సందేహం లేదు. కాని వర్తమానం అటు గతానికి, ఇటు భావికి నిజమైన సూచిక అని చెప్పలేం. ఎందుకంటే కర్మ పని తీరు అంత సంక్లిష్టంగా ఉంటుంది. ఉదాహరణకు, ఈ రోజు పరమ నేరస్తుడైన ఒకడు, రేపు ఋషి కావచ్చు. నిన్నటి మంచి వాడు ఈరోజు దుర్మార్గుడుకావచ్చు.

ఒక తల్లి తన బిడ్డకు చెప్పే ఈ మాటల్లో కర్మ సిద్ధాంతం ఉంది: ''మంచిగా ఉండు. నీవు సుఖంగా ఉంటావు. అప్పుడు నిన్ను మేము ప్రేమిస్తాం. కాని నీవు చెడ్డగా ఉంటే, నీవు దుఃఖాల పాలవుతావు. మేము నిన్ను ప్రేమించం.''

సదృశం సదృశాన్ని ఆకర్షిస్తుంది. మంచి నుంచి మంచి పుడుతుంది. చెడు నుంచి చెడు పుడుతుంది. ఇది కర్మ సిద్ధాంతం.

క్లుప్తంగా చెప్పాల అంటే, నైతికంగంలో, కార్యకారణం నియమమే కర్మ. లేదా కొంత మంది పాశ్చాత్యులు చెబుతున్నట్లు అది ''చర్య ప్రభావం''

**కర్మ - విపాకం**

కర్మ అంటే చర్య, క్రియ. విపాకం అంటే పండు, ఫలితం, దాని ప్రతిచర్య. ప్రతి వస్తువును ఛాయ ఎలా వెన్నంటి ఉంటుందో, అలాగే ప్రతి సంకల్ప చర్యకు, అని వార్యంగా, దాని ఫలితం దానికి ఉంటుంది. కర్మ బీజం లాంటిది. ఆ చెట్టును కాచిన పండు విపాకం, అదే ఫలితం. కర్మ మంచిదీ కావచ్చు, చెడ్డదీ కావచ్చు. అలాగే దాని ఫలితమూనూ. కర్మ ఎలా మానసికమో ఫలమూ అలాగే. కర్మ విత్తన స్వభావాన్ని బట్టి, దానిని సుఖంగా లేదా ఆనందంగా, అసంతోషంగా లేదా దుఃఖంగా అనుభవించ వచ్చు. దానికి తోడుగా వచ్చే లాభకరమైన సంపద, ఆరోగ్యం, దీర్ఘాయుస్సుల లాంటి భౌతిక పరిస్థితులను ''ఆనిసంస'' మంచి ఫలితాలు అంటారు.

దానికి సహచరులుగా వచ్చే నష్ట, భౌతిక పరిస్థితులను 'ఆదీనవ' (చెడ్డ ఫలితాలు) అంటారు. అవి పేదరికం, అందవికారం, రోగం, అల్పాయుస్సులు లాగ దర్శన మిస్తాయి.

కర్మ అంటే ఐహిక విజ్ఞానం యొక్క నైతిక, అనైతిక రకాలు. విపాక అంటే ఐహిక విజ్ఞాన ఫలితాల, రకాలు.

అభిధమ్మం[5] ప్రకారం, సంవేదన ప్రపంచానికి (కామావచర) సంబంధించిన పన్నెండు రకాల అనైతిక విజ్ఞానాన్ని, ఎనిమిది రకాల విజ్ఞానాన్ని, రూప ప్రపంచానికి చెందిన (రూపావచర) ఐదురకాల నైతిక విజ్ఞానాన్ని, ఇంకా ఆకృతి రహిత ప్రపంచానికి చెందిన (అరూపావచర) నాలుగు రకాల నైతిక విజ్ఞానాన్ని, కర్మ నిర్మిస్తుంది.

లోకోత్తర విజ్ఞానాన్న, సంబంధమైన ఎనిమిది రకాలు కర్మ క్రిందికి రావు. ఎందుకంటే, అవి కర్మ మూలాలను ఛేదించ ప్రయత్నిస్తాయి. వాటిల్లో ముఖ్యాంశం ప్రజ్ఞ (పఞ్ఞా) అయితే, ఇహలోక సంబంధితాలలో అది సంకల్పం (చేతన)

రూపారూప ప్రపంచాలకు చెందిన నైతిక విజ్ఞాన తొమ్మిది రకాలు. అవి ఐదు రూపావచర, నాలుగు అరూపావచర ఝానాలు. ఇవి పూర్తిగా మానసికాలు.

మాటలు, చేతలు అనేవి మొదటి ఇరవైరకాల ఇహలోక విజ్ఞాన కారణంగా వచ్చాయి. వాక్చర్యలను (శాబ్దికచర్యలు) భాషణం ద్వారా మనస్సు నిర్వహిస్తుంది. శారీరక చర్యలను, శరీర పరికరం ద్వారా మనస్సే నిర్వహిస్తుంది. శుద్ధ మానసిక చర్యలకు మనస్సు పరికరం తప్ప మరొకటి లేదు.

విజ్ఞాన (Consciousness) సంబంధాలైన ఈ ఇరవై తొమ్మిది రకాలను కర్మ అంటారు. ఎందుకంటే, ఏ బాహ్య శక్తి మీద ఆధార పడ కుండ, అవి తమ తమ ఫలితాలను స్వయం చాలితంగా ఇవ్వడానికి వాటికి ఆశక్తి ఉంది.

తన నైతిక, అనైతిక ఆలోచనల అనివార్య ఫలితాలుగా ఒకడు అనుభవించే ఆ విజ్ఞాన రకాలను సంవేదన ప్రపంచానికి సంబంధించిన ఫలిత విజ్ఞానం (Consciousness) అంటారు. రూప ప్రపంచానికి చెందిన ఫలిత విజ్ఞాన ఐదురకాలను, అరూప ప్రపంచానికి చెందిన ఫలిత విజ్ఞాన నాలుగు రకాలను విపాక, లేదా కర్మ ఫలం అంటారు.

మనం ఏది విత్తుతామో, దానినే, ఎక్కడో ఒక అక్కడ, ఎప్పుడో ఒకప్పుడు, ఈ జన్మలోనో, భావి జన్మలోనో పంట నూర్చుకొంటాం. ఈ రోజు మనం కోసుకొనే పంట మనం ఇప్పుడో లేదా గతంలోనో నాటిందే.

సంయుక్త నికాయం ఇలా అంటున్నది:[6]

''నాటిన విత్తనానికి అనుగుణంగానే,
దాని నుంచి నీవు ఫలాన్ని కోసు కొంటావు.
మంచి చేయు వాడు మంచినే నూర్చు కొంటాడు.
చెడు చేయు వాడు చెడునే కోసు కొంటాడు.
విత్తనాన్ని చక్కగా నాటి, పాతితే,
నీవు దాని నుంచి మంచి ఫలితాన్ని అనుభవిస్తావు''.

కర్మకు కర్మే నియమం. బాహ్య స్వతంత్ర శక్తుల ప్రమేయం లేకుండ, దాని పరిధిలో అది పని చేసు కొంటూ పోతుంది.

కర్మలో అంతర్గతంగా దాని ఫలాన్ని ఇచ్చే బీజం ఉంది. కారణం కార్యాన్ని పుట్టిస్తుంది. కార్యం కారణాన్ని వివరిస్తుంది. విత్తనం ఫలాన్ని ఇస్తే, ఫలం విత్తనం ఏదో చెబుతుంది. అటువంటిది వాటి మధ్య సంబంధం. అలాగే కర్మ, ఫలం గూడ.

మానవాళికి సర్వసాధారణ, భాగదేయమైన సుఖదుఃఖాలు అటువంటి కారణాల అనివార్య ఫలితాలు. బౌద్ధం దృక్పథాన్నుంచి చూస్తే, ఒకడు మంచో, చెడో చేసినందుకు , ఏ అతి ప్రాకృతిక శక్తో, సర్వజ్ఞాన పాలక శక్తో, అతని కిచ్చిన దండన పారితోషికాలు కావవి. ప్రతి దానిని, గతాన్ని విస్మరించి, ఈ ఒక్క తాత్కాలిక జీవితంతోనో, ఒక్క శాశ్వత భావి జీవితంతోనో వివరించే ఆస్తికులు ఒక మరణోత్తర న్యాయా (Post - Mortem Justice)న్ని విశ్వసించ వచ్చు. మానవ జాతి విధిని నియంత్రిస్తూ, ఎక్కడో స్వర్గంలో కూర్చొని ఉన్న సర్వజ్ఞాని, సర్వశక్తి మంతుడు, ప్రస్తుత సుఖదుఃఖాలను మనిషికిచ్చిన వరాలుగా, శాపాలుగా వారు అనుకో వచ్చు. ఆధారం లేకుండా సృజితమైన ఒక శాశ్వతాత్మను గట్టిగా కాదనే బౌద్ధం, దేవుడు కాని, సర్వానుకంపతో గూడిన బుద్ధుడు గాని నిలిపి వేయ లేని, (ఆపలేని) సహజ నియమాలను, న్యాయాలను విశ్వసిస్తుంది. ఈ సహజ నియమం ప్రకారం చర్యలు, మానవ న్యాయం (Human Justice) అతనిని పట్టించు కొన్నా పట్టించు కోక పోయినా, వ్యక్తికి దండన పారితోషికాలను తెచ్చి పెడతాయి.

కొంతమంది బౌద్ధం మీద ఇలా బురద చల్లుతారు: అయితే బౌద్ధులైన మీరు కూడ కర్మ సిద్ధాంత నల్లమందును పేదలకు, ఇలా చెప్పి, పట్టిస్తున్నారన్న మాట:

''మీ గత జన్మ చెడ్డ కర్మ వల్ల ఈ జన్మలో మీరు పేదలుగా జన్మించారు. అతడి గత జన్మ మంచి కర్మ కారణంగా అతడు ధనికుడుగా పుట్టాడు. కనుక నీవు వినీతుడవై నీ కున్న దానితో సంతృప్తి పడు. వచ్చే జన్మలో ధనికుడుగా పుట్టడానికి ఈ జన్మలోమంచి చెయ్యి.

నీ గత జన్మ కర్మ కారణంగానే నీవు ఇప్పుడు అణచ బడుతున్నావు. వినమ్రుడవై నీకష్టాలను సహనంతో అనుభవించు. నీకు తప్పక మరణానంతర జీవితం సుఖ కరంగాను, మంచిదిగాను ఉంటుంది.''

బౌద్ధకర్మ సిద్ధాంతం ఎప్పుడూ అటు వంటి నియతి దృక్పథాన్ని అంగీకరించదు. మరణా నంతర న్యాయాన్ని అంతకంటె అది అంగీకరించదు. ఎటువంటి స్వార్థ ప్రేరణలు లేని పరమ దయామయుడైన బుద్ధుడు, భ్రమ పూర్వకమైన మరణానంతర సుఖ జీవితాన్ని వాగ్దానం చేసి ధనికులను రక్షించాలని, పేదలను ఓదార్చాలని కర్మ సిద్ధాంతాన్ని బోధించ లేదు.

బౌద్ధకర్మ సిద్ధాంతం ప్రకారం, ఎవడూ అనివార్య ఆవశ్యకతతో బంధితుడు కాడు. ఎందుకంటే, కర్మ అనేది, మనం నిస్సహాయంగా లొంగి పోవలసిన ఒక అజ్ఞాత, మార్మిక శక్తి మనమీద విధించిన 'విధి' గాని, పూర్వ నిర్దేశిత 'అదృష్టం' కాని కాదు. అది ఎవనికి వాడు చేసు కొన్నది. వాని మీదికే జరిగే ప్రతిచర్య అది. అందువల్ల కొంత మేరకైన దానిని ప్రక్కకు మళ్ళించే శక్తి అతనికి ఉంటుంది. ఎంత వరకు మరల్చ వచ్చు అనేది ఆ వ్యక్తి మీద ఆధారపడి ఉంటుంది.

**కర్మకారణం**

అవిద్య, వస్తువులను ఉన్నవాటిని ఉన్నట్లుగా తెలుసుకో లేక పోవడం, కర్మ ముఖ్య కారణం. అవిద్య ఆధారంగా కర్మ సంబంధ సంస్కారం పుడుతుంది (అవిజ్జా పచ్చయా సంఖారా) అంటాడు బుద్ధుడు పటిక్క సముప్పాద (ప్రతీత్యసముత్పాదం)లో.

అవిద్యతో అనుసంధానమైన దాని సహచరి తృష్ణ (తణ్హా) కర్మ మరో మూలం. ఈ రెండు కారణాలు దుష్కార్యాలకు నిబద్ధిస్తాయి. ఒక విషయాసక్తుని చర్యలన్నీ, అలోభ, అదోస, అమోహ లాంటి మూడు మంచి మూలాలతో ముడివడి ఉన్నప్పటికీ, వాటిని కర్మగానే భావిస్తారు. ఎందుకంటే అవిద్య, తృష్ణల మూలాలు అతనిలో సుప్తస్థితిలో ఉంటాయి. లోకోత్తర పథ విజ్ఞాన నైతిక రకాలు కర్మ క్రిందికి రావు. ఎందుకంటే అవి మూల కారణాలను పెరికి వేయ జూస్తాయి.

**కర్మకారుడు**

కర్మ కారుడెవడు? కర్మఫలాన్ని అనుభవించే దెవడు? ఆత్మను గురించిన ఒక రకం బాహ్య సంచయమా?

ఈ సూక్ష్మ ప్రశ్నలకు సమాధానంగా బుద్ధ ఘోషుడు విశుద్ధిమగ్గలో ఇలా అంటాడు:

''అక్కడ కర్మ చేసే వాడంటూ ఒకడు లేడు,
దాని ఫలాన్ని అనుభవించే వాడూ లేడు,
నిర్మాణాంశాలు (ఘటనాంశాలు) మాత్రమే ప్రచలిస్తూ ఉంటాయి.
ఇది నిజంగా వాస్తవ జ్ఞానం,''[7]

బౌద్ధం ప్రకారం రెండు సత్యాలున్నాయి – ఒకటి కనిపించే సత్యం, రెండోది పారమార్థిక సత్యం. కనిపించే సత్యం అంటే మామూలు సాంప్రదాయిక సత్యం (సమ్ముతి సచ్చ = సంవృతి సత్యం). పారమార్థిక సత్యం అంటే అమూర్త (కనిపించని) సత్యం (పరమత్థసచ్చ.)

ఉదాహరణకు, మనకు కనిపించే బల్ల సంవృతి సత్యం. ఈ బల్లనే పారమార్థిక దృష్టితో చూస్తే అది కొన్ని బలాల (forces) గుణాల (qualities) సంయోగం.

ఒక విజ్ఞాన శాస్త్రవేత్త నిత్య జీవితంలో నీటిని నీరంటాడు. కాని అదే నీటిని అతడు ప్రయోగ శాలలో హైడ్రోజన్, ఆక్సిజన్‌ల సంయోగం ($H_2O$) అంటాడు.

అదేవిధంగా నిత్యవ్యవహారాలలో, పురుషుడు, స్త్రీ, సత్యం, ఆత్మ అని వాడుతూ ఉంటాం. ఈ అశాశ్వత ఆకృతులు మానసిక – దైహిక దృగ్విషయం. ఈ దృగ్విషయం ఏ

రెండు క్షణాలలోను ఒకటిగా ఉండదు. క్షణ క్షణమూ మారుతూ ఉంటుంది.

అందుకని బౌద్ధులు, ఒక మారని సత్వా(entity) న్ని విశ్వసించరు. చర్యకంటె వేరుగా ఒక కర్త ఉన్నాడని, సంజ్ఞ కంటె వేరే సంజ్ఞాతు డున్నాడని, చేతన వెనుక వేరే చేతను డున్నాడని బౌద్ధం అంగీకరించదు.

అలాంటప్పుడు కర్మ చేసేది ఎవడు? ఫలాన్ని అనుభవించేది ఎవడు?

సంకల్పించడమే లేదా చేతనే (will) కర్మ. కర్మ ఫలాన్ని కోసు కొనేది వేదన(feeling) యే. ఈ శుద్ధ మానసిక స్థితులు తప్ప, నాటే వాడొకడు, కోసుకొనే వాడొకడు లేరు.

గౌరవనీయ బుద్ధ ఘోషుడు చెప్పినట్లుగా, వృక్షమనే ఒక పేరుతో బరగే పదార్థ మూలకాల విషయంలో, ఒక దశలో, ఒక పండు పండినప్పుడు, 'ఆ చెట్టు కాయ కాసింది' అని ఎలాగా అంటారో, అలాగే, దేవుడు లేదా మనిషి అనే పేరుతో బరిగే ''స్కంధాలు'' (ఖందలు = aggregates) ఒక దశలో సుఖంగాని, దుఃఖంగాని సంభవించి నప్పుడు, దేవుడు లేదా మనిషి సుఖంగా గాని, దుఃఖంగా గాని ఉన్నా డంటాం''

ఈ విషయంలో బౌద్ధులు డాకార్ట్ (Deseartes)తో కాక, విలియమ్ జేమ్స్‌తో ఏకీభవిస్తారు. ఎందుకంటె డాకార్ట్ ఆలోచన, ఆలోచించే వాడు వేరు వేరు అంటే, విలియమ్ జేమ్స్ ఆ రెండూ ఒకటే అన్నాడు (Thought itself is the thinker)[8].

**కర్మ ఎక్కడ ఉంది ?**

ఒక మనో విశ్లేషకుడు ఇలా రాశాడు: ''అది సైకీ (మనిషి మనో నిర్మితి = Psyche) లో ఉంది. మామూలుగా అందుబాటులో ఉండదు. కొందరు మాత్రమే దానిని చేర గలరు. అది వ్యక్తి అనుభవించిన ప్రతి అనుభవాల, అతని మీద పడిన ప్రతి ప్రభావాల, ప్రతిముద్రల రికార్డు. ఏ ఒక్కటిని వదిలి వేయని రికార్డు అది. అచేతన (Subconscious) ఎప్పటికీ చెరగని వ్యక్తిక అనుభవాల రికార్డు మాత్రమే కాదు, ప్రాక్తన ప్రచోదనల, ప్రవృత్తుల నిలయం. వాటిని నాగరిక మానవుడు ఇప్పటికీ అధిగమించ లేదు. ఆ ముద్రలు, అనుభవాలు, ప్రచోదనలు, ప్రవృత్తులు అచేతనంలో క్రియా శీలంగా ఉండి, ఊహించని సమయాలలో పగల గొట్టుకు బయట పడాలని చూస్తుంటాయి''.

ఒక ముఖ్యమైన మార్పుతో, ఒక బౌద్ధుడు అదే విషయాన్ని ఇలా ప్రతిపాదిస్తాడు: మనో విశ్లేషణ ప్రతి పాదించి నట్లుగా అనుభవాలు సైకీలో ఉండవు. ఎందుకంటె మనోమూర్తి మత్వంలో వాటిని నిలవ ఉంచే గ్రాహకపాత్ర, గిడ్డంగి ఏదీ ఉంద నడానికి రుజువు లేదు. ఈ సైకీ అనేది ఒక ప్రాక్కల్పన. అసలు మనిషి అనేవాడు నిరతం మారే ప్రవహించే సంశ్లిష్ట యంత్రాంగం. అనుభవించిన ప్రతి అనుభవం, గ్రహించిన ప్రతి ముద్ర, ఏర్పడిన ప్రతి శీల లక్షణం - అది దివ్యంకాని, మానవం కాని, మృగీయం కాని, - వైయక్తిక మానసిక -

దైహిక ప్రవాహం మీద ఆధార పడుతుంది. క్లుప్తంగా చెప్పా లంటే, సందర్భం వచ్చి నప్పుడు దానంత అదే వివిధ దృగ్విషయాలుగ బయట పడడానికి మొత్తం కర్మశక్తి (Kammic force) గతిశీల మానసిక ప్రవాహం (చిత్తసంతతి) మీద ఆధారపడి ఉంటుంది.

''మరి గౌరవనీయమైన అయ్యా కర్మ ఎక్కడ ఉంది?'' అని రాజు మిళిందుడు గౌరవనీయ నాగసేనుని ప్రశ్నించాడు:

'హే మహారాజా' ఈ ప్రవహించే విజ్ఞానం (Conscious) చేతనంలో గాని, శరీరంలోని ఏదో ఒక భాగంలోగాని 'కర్మ' నిలవ చేయ బడిందని చెప్పడం లేదు. మామిడి చెట్లులో మామిడి పండ్లు పలాన భాగంలో ఉన్నాయని చెప్పడానికి వీలు లేదు. కాని అవి మామిడి చెట్టు లోనే ఉండి, రుతువు వచ్చి నప్పుడు బయటికి వస్తాయి. అలాగే ఈ ప్రవహించే విజ్ఞానంలోగాని, లేదా శరీరంలో మరేదైనా భాగంలో కాని కర్మ ఉందని చెప్పడం లేదు. కాని అది మనస్సు పదార్థాల మీద ఆధారపడి సమయం వచ్చినప్పుడు అభివ్యక్తం అవుతుంది.''[9]

గాలి, నిప్పు ఏ ఒక ప్రత్యేక ప్రదేశంలోను నిలవగా లేవు. అలాగే 'కమ్మ' శరీరం లోపలగాని, వెలుపల, గాని నివాసం ఉండదు.

కర్మ వ్యక్తిక శక్తి. అది ఒక ఉనికి నుంచి మరో ఉనికికి ప్రసారిత మవుతుంది. అది గుణాన్ని మలచడంలో ముఖ్యపాత్ర వహిస్తుంది. ఒకడు పుట్టుకతోనే ఎందుకు మేధావి అవుతున్నాడో, అద్భుతవ్యక్తి అవుతున్నాడో ఇది వివరిస్తుంది. ప్రపంచ సంక్షేమానికి ఈ సిద్ధాంతాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

**పాదసూచికలు**

1. *అంగుత్తరనికాయ,* 111, p. 415; *The Expositor,* 1. P. 117; *అత్థసాలినీ,* P. 88.
2. La Vallee poussin, *The way to Nirvana,* PP. 68 - 69.
3. *అత్థసాలినీ,* P. 68; *The Expositor,* 1, P. 91
4. *ధమ్మపద 1* w. 1, 2.
5. See *Compendium of Phylosophy,* ch. 1;
   *Manual of Abhidhamma,* ch. 1.
6. Vol. 1, P. 227; *Kindred Sayings,* 1, P. 293
7. XIX, 20; See warren, *Buddhism in Translations,* P. 248; *The path of Purity,* 111, P. 128
8. *Psychology,* 1. P. 401.
9. *విశుద్ధిమగ్గ చూడండి.* ch. xvii.

ఇరవయ్యో ప్రకరణం

# కర్మ పని తీరు

''ఈ ప్రపంచాన్ని కర్మ నడుపుతుంది''

– అత్థసాలినీ

కర్మ పని తీరు బహు క్లిష్టమైంది. ఒక్క బుద్ధుడు మాత్రమే దానిని అర్థం చేసుకో గలడు. అభిధమ్మం ప్రకారం, ఈ చిక్కు విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకో వడానికి ఆలోచనా ప్రక్రియ (చిత్తవిధి = చిత్తవృత్తి)ను అధ్యయనం చేయాలి.

మనిషి సారంగా ఎంచబడే మనస్సు లేదా విజ్ఞానం (Consciousness) మానవుని సంక్లిష్ట యంత్రాంగంలో అత్యంత ముఖ్య పాత్రను నిర్వహిస్తుంది. ఒకని మనస్సు అతనికి బద్ధశత్రువు, మిత్రుడూనూ.

ఒకడు, స్వప్నరహిత నిద్రాస్థితిలో ఉన్నప్పుడు, క్రియాత్మకంగాని, దాదాపు నిష్క్రియాత్మకమైన ఒకరకం విజ్ఞానాన్ని అనుభవిస్తాడు. అది గర్భధారణ, మరణ సమయం లోని విజ్ఞానాన్ని బోలి ఉంటుంది. ఇటువంటి విజ్ఞానాన్ని బౌద్ధ భాషలో ''భవంగ'' అంటారు. దీనికి అర్థం జీవిత కారకం (factor of life) లేదా అస్తిత్వ అవశ్య కారణం లేదా పరిస్థితి. అది ప్రతిక్షణం పుడుతూ, గిడుతూ, ఏ రెండు వరుస క్షణాలలో ఒకటిగా ఉండని, ప్రవాహంలా ప్రవహిస్తుంటుంది.

ఈ రకం విజ్ఞానాన్ని స్వప్నరహిత నిద్ర లోనే కాక, జాగృత స్థితిలో గూడ మనం అనుభవిస్తాం. మన జీవన గతిలో, భవంగ ఆలోచనా క్షణాలను, ఏ ఇతర రకం విజ్ఞానం కంటె గూడ మనం అనుభవిస్తాం. అందువల్ల భవంగ అపరిహార్య జీవిత పరిస్థితి అవుతుంది.

కొంతమంది పండితులు, భవంగ, అచేతన (Subconscious) లు – రెండూ ఒకటే అన్నారు. తత్త్వశాస్త్ర నిఘంటువు ప్రకారం, ''కొంత మంది మనో విజ్ఞాన శాస్త్రవేత్తలు, తత్త్వవేత్తలు పేర్కొన్నట్లుగా, విజ్ఞానాన్ని దేహళి (గడప) క్రింద ఉండే ఒక అర (గది)''

పాశ్చాత్య తత్త్వవేత్తల ప్రకారం చేతనం, అచేతనం ప్రక్క ప్రక్కనే ఉంటాయి. బౌద్ధతత్త్వం ప్రకారం, చేతన ఎప్పుడూ ఏదో ఒక మానసిక లేదా భౌతిక వస్తువును పట్టుకు వేళ్ళాడుతుంది. అలా పట్టుకు వేళ్ళాడే విజ్ఞానం ఏక్షణానికి ఆక్షణం ప్రత్యేకమైందే. అటువంటి ప్రత్యేక

Consciousness అంటే ఆధునికులం 'చేతన' అంటాం. బౌద్ధులు విజ్ఞానం అంటారు.
– అనువాదకుడు

(క్షణిక) విజ్ఞానాన్నే మనం క్షణం క్షణం అనుభవిస్తుంటాం. అలా అనుభవించని ప్రత్యేక చేతన క్షణాలు ఉండవు. అటువంటి విజ్ఞాన కాల పరిమితిని ''ఒక ఆలోచనక్షణం'' అంటారు. ప్రతి ఆలోచన క్షణాన్ని అనుసరించి మరో ఆలోచన క్షణం వస్తుంది. త్వరిత గతిని సాగే అటువంటి ఆలోచన క్షణాల పరంపరను మానవ జ్ఞానం అర్థం చేసుకో లేదు. ఒక మెరుపు కాలంలో బిలియన్ల బిలియన్ల ఆలోచనా క్షణాలు సంభవిస్తాయని వ్యాఖ్యాతలు చెబుతున్నారు.

భవంగ ఒక ఉపతలమూ (Sub-plane) కాదు. F.W. మేయర్ చెప్పిన బోధాతీత (అవ్యక్త = Sub-plane) విజ్ఞానమూ కాదు. బహుశా మనం ఈ తాత్విక పదాలను వేరు వేరు అర్థాలలో వాడుతున్నామేమో.

భవంగ అని ఎందుకు అన్నారంటే, సాతత్య అస్తిత్వానికి అది అవశ్యక స్థితి. Life-continuum (జీవిత సాతత్యశ్రేణి) అనే ఆంగ్ల పదాన్ని భవంగకు దగ్గరి పదంగా సూచించారు.

ఒకడు భవంగ విజ్ఞానాన్ని బాహ్య ఉద్దీపనలు చెదరగొట్టనంత కాలం ఎప్పుడూ అనుభవిస్తాడు. అది ఒక 'ఆలోచన క్షణం' పాటు ప్రకంపించి, భౌతిక లేదా మానసిక వస్తువు మనస్సులో ప్రవేశించగానే, గతిస్తుంది. ఉదాహరణకు మనస్సులో ప్రవేశించిన వస్తువు భౌతిక రూపం అనుకొందాం. ఇప్పుడు, భవంగ విజ్ఞాన స్రవంతి నిలిచి పోయి నప్పుడు 'ఇంద్రియ ద్వార చేతన' (Sense-door consciousness) పుట్టి అదేక్షణంలో గతిస్తుంది. ఇంద్రియ ద్వార విజ్ఞాన చేసే పని ఏమిటంటే, విజ్ఞానాన్ని వస్తువు మీదికి తిప్పడం. వెంటనే దీని తరవాత చాక్షుస విజ్ఞానం (visual consious) పుడుతుంది. ఇది వస్తువును చూస్తుంది. దీనికి అంత కంటె ఏమీ తెలియదు. ఈ ఇంద్రియ వ్యాపారా (sense operation) న్ని అనుసరించి, అలా చూసిన వస్తువును గ్రహించడం జరుగుతుంది. ఆతరవాత 'అన్వేషక' ఆలోచన క్షణం రంగం మీదికి వస్తుంది. ఇది అలా చూసిన వస్తువును క్షణం పాటు పరిశీలిస్తుంది. దీనిని అనుసరించి నిశ్చయ 'ఆలోచనక్షణం' వస్తుంది. అప్పుడు విచక్షణ పనిచేస్తుంది. విచక్షణలో స్వేచ్ఛా సంకల్పం దాని పాత్రను అది నిర్వహించ వచ్చు. మానసికంగా ముఖ్యమైన 'జవన' అని పిలవబడే తరువాతి దశ దీని మీద ఆధారపడుతుంది. ఈ దశలోనే ఒక చర్య నైతికమో, అనైతికమో నిర్ణయించ బడుతుంది. కర్మ ఈ దశలోనే నిర్వహించ బడుతుంది.

సరిగాచూస్తే అది నైతికం. తప్పుగా చూస్తే అనైతికం. మనస్సులో ప్రవేశించిన వస్తువు వాంఛనీయత అవాంఛనీయతలతో నిమిత్తం లేకుండ, 'జవన' ప్రక్రియను నైతికంగా లేదా అనైతికంగా పరిగణించ వీలవుతుంది. ఉదాహరణకు ఒకనికి శత్రువు ఎదురైతే, అయత్నంగా

కోపం వస్తుంది. దీనికంటె భిన్నంగా సంయమనుడైన ఒక జ్ఞాని, శత్రువు మీదికి ప్రేమను ప్రసరించవచ్చు. ఈ కారణాననే బుద్ధుడు ఇలా చెప్పాడు.

చెడ్డ పనులు చేసి ఒకడు మలిను డవుతాడు;
చెడ్డ పనులు చేయక ఒకడు అమలిను డవుతాడు;
మలినం కావడానికి, కాక పోవడానికి కారణం అతడే
ఒకడు మరొకని ఎప్పుడూ పరిశుద్ధం చేయలేడు.[1]

పరిసరం, పరిస్థితులు, అలవాట్లు లాంటివి మన ఆలోచనలను నిబద్ధిస్తాయనేది అందరూ అంగీకరిస్తారు. ఆయా సందర్భాలలో స్వేచ్ఛా సంకల్పం తగ్గిపోతుంది. ఏది ఏమైన, అటువంటి సందర్భాలలో, బాహ్యశక్తులను కాదని, మనం స్వేచ్ఛా సంకల్పాన్ని ఉపయోగించి నైతిక, అనైతిక ఆలోచనలను తెచ్చుకొనే సంభావ్యత ఉంది. బాహ్య విషయం ఒక కారణమే అయినా, అంతిమంగా, మన చర్యలకు, మనమే ప్రత్యక్ష బాధ్యత వహించాల్సి ఉంటుంది.

సరైన రీతిలో 'జవన'ను అనువదించడం చాల కష్టం. కొంతమంది ఫస్స (పశ్య, స్పర్శ = Apperception) ను జవనకు సమానార్థకంగా సూచించారు. కొంత మందైతే ప్రచోదనా (impulse) న్ని పర్యాయ పదంగా సూచించారు. ఇది మొదటి పదం కంటె అన్యాయంగా ఉంది. ఇక్కడ పాళీ పదాన్నే ఉంచడం జరిగింది. జవనానికి శబ్దార్థం పరుగెత్తుట. దానిని అలా అనడం ఎందుకు జరిగిందంటే, ఆలోచనాక్షణ గతిలో, అదే వస్తువుతో వరుసగ ఏడు ఆలోచనాక్షణాల పాటు లేదా మరణ సమయంలో వరుసగ ఐదు ఆలోచనాక్షణాల పాటు అది పరుగెడుతుంది. ఈ ఆలోచనా క్షణాలలో సంభవించే మానసిక స్థితులు సదృశంగానే ఉంటాయి. కాని వాటి బీజ శక్తి మారుతూ ఉంటుంది.

అత్యంత సూక్ష్మకాలంలో సంభవించే ఆలోచనా ప్రక్రియ, రెండు ఆలోచనా క్షణాలపాటు ముద్రితమై అంత మవుతుంది. ఈ విధంగా ఒక ఆలోచనా ప్రక్రియ పదిహేడు ఆలోచనా క్షణాలలో పూర్తి అవుతుంది.

ఈ ఆలోచనా ప్రక్రియను విశదీ కరించ డానికి గ్రంథాలు మామిడిచెట్టును ఉపమానంగా చెబుతాయి. తలవరకు కప్పుకొని ఒకడు మామిడి చెట్టు మొదట్లో పడుకొని గాఢ నిద్ర పోతాడు. గాలివీస్తుంది. కొమ్మలు కదిలి, ఒక పండు నిదురించే అతని తలప్రక్కన పడుతుంది. తలకు కప్పుకొన్న వస్త్రాన్ని తీసి వేసి, దానివైపుకు తిరుగుతాడు. దానిని చూస్తాడు. తీసుకొంటాడు. దానిని పరిశీలిస్తాడు. అది బాగా పండిన మామిడి పండని నిర్ధారించు కొంటాడు. లాలా జలంతో కలిపి దానిని నమిలి తింటాడు. మళ్ళీ నిద్ర కుపక్రమిస్తాడు.

స్వప్నరహిత నిద్ర కలతలేని భవంగ ప్రవాహానికి సమానం. గాలి చెట్టును తాకడం అనేది

గత భవంగకు సదృశం. కొమ్మలు ఊగడం ప్రకంపిత భవంగకు సరి పోలుతుంది. పండు పడడం అనేది భవంగ నివృత్తికి సమానం. పండు వైపుకు తిరగడం అంటే ఇంద్రియ ద్వారం చేతనను పిలవడం. వస్తు దర్శనం సంజ్ఞ (perception); చేతితో తీసుకోవడం గ్రహణ చేతనకు, పరిశీలించడం అన్వేషక చేతనకు, అది పండిన మామిడి పండని నిర్ధారణ చేసుకోవడం నిర్ధారక చేతనకు సదృశం. వాస్తవంగా తినే ప్రక్రియ జవనప్రక్రియకు, ముద్దలు మింగడం ధారణ (retention) కు సరి పోలుతుంది. మళ్ళీ అతడు నిద్ర కుపక్రమించడం మనసు తిరిగి భవంగలో పడి పోవడానికి సరి పోతుంది. ఏడు ఆలోచనాక్షణాలలో, పైన పేర్కొన్న రీతిలో, మొదటి ఆలోచన – క్షణం – బీజశక్తిలో అన్నింటి కంటె బలహీనమైనది – యొక్క ఫలితాన్ని ఈ జీవితంలోనే అనుభవించ వచ్చు. దీనిని 'అవ్యవహిత ప్రభావక కర్మ' (immediately effective kamma) అంటారు. అది ఈ జన్మలోనే పని చేయక పోతే, దాని ప్రభావక శక్తిని కోల్పోతుంది.

తరువాత బలహీనమైంది. ఏడో ఆలోచనా క్షణం. దీని ఫలితాన్ని ఒకడు తరువాతి జన్మలో అనుభవించ వచ్చు. అందువలన దీనిని 'అనంతర ప్రభావక కర్మ' అన్నారు. ఇది గూడ రెండో జన్మలో పనిచేయకపోతే, మొదటి దానిలాగే, నిర్వీర్యం అయి పోతుంది.

**ఆలోచనా ప్రక్రియ ఇలా జరుగుతుంది:-**

| 1 | 2 | 3 |
|---|---|---|
| ★ ★ ★ ★ | ★ ★ ★ | ★ ★ |
| అతీత భవంగ | భవంగ చలన | భవంగ ఉపచ్ఛేద |
| గత భవంగ | ప్రకంప భవంగ | నివృత భవంగ |
| **4** | **5** | **6** |
| ★ ★ ★ ★ | ★ ★ ★ | ★ ★ |
| ఆవజ్జన | పంచవిజ్ఞాణ | సంపతిచ్ఛన |
| ఇంద్రియద్వార విజ్ఞాన | ఇంద్రియ విజ్ఞాన | గ్రహణ విజ్ఞాన |
| **7.** | **9. 10. 11. 12. 13.** | **14. 15.** |
| ★★ | ★★ ★★ ★★ ★★ ★★ | ★★ ★★ |
| సంతిరణ | జవన | |
| అన్వేషక విజ్ఞాన | | |
| **8** | **16** | **17** |
| ★ ★ ★ | ★ ★ ★ | ★ ★ ★ |
| వొట్ఠపన | తదాలంబన | |
| నిర్ణాయక విజ్ఞాన | ముద్రించే విజ్ఞాన | |

అంతిమ ముక్తి లభించే వరకు సంసారంలో తిరుగాడుతున్నంతకాలం మధ్యంతర ఆలోచనా క్షణాల ప్రభావం కనిపించవచ్చు – ఈ రకం కర్మను 'అనిర్దిష్టక ప్రభావకం' అన్నారు.

కర్మ పని చేసే కాలాన్ని బట్టి దానిని ఇలా విభజించారు:

1. దిట్ఠధమ్మ వెదనియ కమ్మ (అవ్యవహిత ప్రభావక కమ్మ)
2. ఉపపజ్జ వెదనియ కమ్మ (అనంతర ప్రభావక కమ్మ)
3. అపరాపరియవెదనియ కమ్మ (అనిర్దిష్టప్రభావక కమ్మ)
4. అహోసి కమ్మ (అప్రభావక కమ్మ)

**నిదర్శనాలు**

ఈ జీవితంలోనే మంచి కమ్మఫలాన్ని పొందిన వైనం:

ఒక భార్య భర్త ఉన్నారు. వారు ఇంటినుంచి బయటకు వెళ్ళి నప్పుడు ధరించడానికి ఇద్దరికీ గూడ ఒకే ఉత్తరీయం (పైగుడ్డ) మాత్రమే ఉంది. భర్త ఒకరోజు బుద్ధుని ధర్మప్రవచనం విని, మిక్కిలి సంతృప్తుడై, తనకున్న ఆ ఒకే ఒక ఉత్తరీయాన్ని కానుకగా సమర్పించ దలిచాడు. కాని అతని అంతస్సిద్ధ లోభం ఆ పనిని చేయ నీయ లేదు. అతడు తన మనస్సుతో యుద్ధం చేశాడు. చివరకు లోభాన్ని జయించాడు. పై వస్త్రాన్ని బుద్ధునికి కానుకగా ఇచ్చి, ఆశ్చర్యంతో అన్నాడు: ''నేను గెలిచాను, నేను గెలిచాను.'' ఈ కథను విన్న రాజు సంతోషించి, మెప్పు కోలుగా, ఉదార బుద్ధితో అతనికి ముప్పై రెండు దీర్ఘ వస్త్రాలను ఇచ్చాడు. ఆ భక్త భర్త తన కొకటి, తన భార్య కొకటి అట్టేపెట్టుకొని, మిగతావి బుద్ధునికి కానుకగా ఇచ్చివేశాడు.[2]

ఈ జీవితంలోనే చెడ్డకర్మ ఫలాన్ని అనుభవించిన వైనం:

ఒక వేటగాడు తన వేట కుక్కలను వెంట బెట్టుకొని అడవికి వేటకు వెళ్తూ, భిక్షకు వెళ్తూ ఉన్న ఒక భిక్కుని చూశాడు. వేటగానికి ఆరోజు వేట ఏమీ దొరక లేదు. దీనికి కారణం తానా రోజు భిక్కుని ముఖం చూడడమే అనుకొన్నాడు. వేట నుంచి తిరిగి ఇంటికి వస్తూ మళ్ళీ ఆభిక్కుని దారిలో చూశాడు. అతడు రెండోసారి ఎదురవ్వడంతో కోపంతో రెచ్చిపోయి, భిక్కు ఎంతగా అర్థించినా వినకుండ, అతనిపై తన వేటకుక్కలను ఉసి కొల్పాడు. పారిపోయే మార్గం లేక భిక్కు చెట్టు ఎక్కాడు. క్రూరుడైన ఆ వేటగాడు చెట్టు దగ్గరకు పరుగెత్తికెళ్ళి, బాణంతో భిక్కు అరికాళ్ళను చీరాడు. అతడు విపరీతంగా బాధ పడడంతో, అతని చీవరం వేటగాని మీద పడి అతనిని పూర్తిగా కప్పి వేసింది. అప్పుడు వేట కుక్కలు భిక్షువే క్రింద పడ్డాడని భావించి, తమ యజమానినే తిని వేశాయి.[3]

**అనంతర ప్రభావక కర్మ:**

ఒక కోటీశ్వరుని సేవకుడు రోజంతా పొలంలో పనిచేసి సాయంకాలానికి ఇంటికి తిరిగి వచ్చాడు. ఆరోజు పూర్ణిమ కావడంతో అందరూ అష్టశీలాలను పాటిస్తున్నారు. కనీసం తాను సగం రోజైన వాటిని పాటించ వచ్చని భావించి, ఆ ఆ శీలాలను గ్రహించి, రాత్రికి ఉపవాసం ఉన్నాడు. దురదృష్టవశాత్తు అతడు మరురోజు ఉదయం మరణించాడు. అతడు చేసిన మంచి పని ఫలితంగా దేవగా జన్మించాడు[4].

రాజు బింబిసారుని కొడుకు అజాత శత్రు. తను మరణించిన వెంటనే, తండ్రిని చంపిన పాపానికి, దుర్దశలో జన్మించాడు.

**అవిశిష్ట ప్రభావక కర్మ :**

ఈ రకం కర్మ ఎవరికీ తప్పదు. బుద్ధులకు అర్హంతలకుగూడ ఈ గత కర్మ ప్రభావం తప్పదు. అనుభవించి తీర వలసిందే.

అర్హంత మొగ్గల్లాన, ఎప్పుడో సుదూర పూర్వజన్మలో, తన క్రూర భార్య చేత ప్రేరితుడై, తండ్రిని, తల్లిని చంప ప్రయత్నించాడు[5]. దీని ఫలితంగా చాల దుఃఖావహస్థితితో బాధ పడ్డాడు. తన చివరి జన్మలో అతనిని దొంగలు గదలతో బాది చంపారు.

నగ్న సన్యాసుల భక్తురాలైన ఒక స్త్రీని బుద్ధుడు హత్య చేశాడని ఆరోపించారు. పూర్వజన్మలలో బుద్ధుడు ఒక పచ్చెక (ప్రత్యేక) బుద్ధుని అవమానించిన కారణంగా ఈ ఆరోపణ అతని మీదికి వచ్చింది.

దేవదత్తుడు బుద్ధుని చంపాలని ప్రయత్నించి నప్పుడు, బుద్ధుని పాదానికి చిన్నగాయ మైంది. ఏదో ఒక పూర్వజన్మలో బుద్ధుడు మారు తమ్ముని ఆస్తి కాజేయ డానికి అతనిని చంపి నందువల్ల ఇప్పుడు ఈ గాయమైంది.

ప్రకార్యాన్ని (కిచ్చ) బట్టి కర్మను మరో రకంగా విభజించారు.

1. జనకకమ్మ (పునరుత్పత్తి కర్మ)
2. ఉపత్థంబకకమ్మ (సంస్తంభ కర్మ)
3. ఉపపీడకకమ్మ (ప్రతిక్రియాత్మక కర్మ)
4. ఉపఘాతకకమ్మ (వినాశక కర్మ)

బౌద్ధం ప్రకారం, మరణ సమయంలో ప్రబలంగా ఉన్న మంచి లేదా చెడ్డ కర్మ, ప్రతి తదనంతర జన్మను నిబద్ధిస్తుంది. ఈ రకం కర్మను సాంకేతికంగా 'జనక' కర్మ అంటారు..

ఒక వ్యక్తి మరణం ''తాత్కాలిక దృగ్విషయం యొక్క తాత్కాలిక అంతం మాత్రమే.'' ప్రస్తుత రూపం చని పోయినా, దాని స్థానంలోకి పూర్తిగా దానికి సదృశం కాని, పూర్తిగా అసదృశం కాని, మరో ఆకృతి వస్తుంది. మరణ సమయంలో ప్రబలంగా ఉన్న ఆలోచనను బట్టి ఇది జరుగుతుంది. ఎందుకంటే, శరీరాన్ని ఇప్పటివరకు ప్రేరేపించిన కమ్మశక్తి శరీరలయంతో పాటు నాశం కాలేదు. ఈ అంతిమ ఆలోచనా ప్రక్రియను ''జనక (పునరుత్పత్తి) కర్మ'' అంటారు. ఇది, తదనంతర జన్మలో వ్యక్తి స్థితిగతులను నిర్ణయిస్తుంది.

అంతిమ ఆలోచనా ప్రక్రియ వ్యక్తి సాధారణ శీలం మీద ఆధారపడి ఉంటుందనేది నియమం. కొన్ని అసాధారణ పరిస్థితులలో, బహుశ ప్రతికూల, అనుకూల పరిస్థితులను బట్టి, మరణ సమయంలో ఒక మంచివాడు చెడ్డ ఆలోచనను, ఒక చెడ్డవాడు మంచి ఆలోచనను చేయ వచ్చు. అతడి సాధారణ శీలం ఎలాంటిదైనా, భావిజన్మను ఈ అంతిమ ఆలోచనా ప్రక్రియయే నిర్ణయిస్తుంది. దీని అర్థం గత చర్యల ప్రభావాలు తుడిచి పెట్టుకు పోతాయని కాదు. అవి తగిన సమయంలో తమ అపరిహార్య ఫలితాలను ఇస్తాయి. జన్మలో అటువంటి తారుమారు మార్పులు కారణంగానే మంచి తలిదండ్రులకు చెడ్డ పిల్లలు పుట్టడం, చెడ్డవాళ్ళకు మంచి వాళ్ళు పుట్టడం జరుగుతుంది.

ఇప్పుడు, ఈ జనక కర్మను తోడై కొనసాగించడానికి, లేదా బలహీనపరిచి నిరోధించ డానికి, మరో పూర్వ కర్మ జోక్యం చేసుకో వచ్చు. అటువంటి చర్యలను సంస్తంభక కర్మలని (పరష్టంబక) ఉపపీడక కర్మలని (ప్రతిక్రియాత్మక కర్మలని) అంటారు.

కర్మనియమం ప్రకారం జనక కర్మ బీజ శక్తిని పూర్తిగా నాశం గావించ వచ్చు. ఈ పని, అధిక శక్తిమంతమైన గతవ్యతిరేక కర్మతో సాధ్య మవుతుంది. ఎగురుతున్న బాణాన్ని దాని వ్యతిరేక శక్తి అడ్డు కొని నేలకు దించిన విధంగానే, అవకాశం కోసం ఎదురు చూసే గత వ్యతిరేక కర్మ గూడ, అనూహ్యంగా పనిచేసి, జనక కర్మ బీజశక్తిని పూర్తిగా నాశం చేయ గలదు. అటువంటి చర్యను ఉపఘాతక (నాశక) కర్మ అంటారు. ఇది పై రెండింటి కంటె బలమైంది. ఎలా గంటె ఇది అడ్డుకొనడమే కాక, మొత్తం శక్తినే నాశం చేస్తుంది.

ఈ నాలుగు కర్మలు పనిచేస్తాయన డానికి ఉదాహరణగా, బుద్ధుని చంపాలని ప్రయత్నించిన, సంఘంలో చీలిక తెచ్చిన, గౌరవనీయ దేవదత్తుని పేర్కొన వచ్చు.

అతని మంచి జనక కర్మ అతనిని రాచకుటుంబంలో పుట్టేట్టు చేసింది. అతడు సుఖ సంపదలలో కొనసాగడం సంస్తంభ కర్మఫలం. అతడు సంఘ బహిష్కృతుడై అవమానితు డై నప్పుడు అతని ఉపపీడక కర్మ పని చేసింది. అంతిమంగా ఉపఘాతక కర్మ అతనికి దుఃఖమయ జీవిత అంతాన్ని తెచ్చి పెట్టింది.

ఈ దిగువ వర్గీకరణం ఫల (effect) గురుత్వాన్ని బట్టి జరిగింది.

1. గరుక కమ్మ
2. ఆసన్న కమ్మ
3. ఆచిణ్ణ కమ్మ
4. కతత్తా కమ్మ

మొదటిది గరుక కర్మ. దీని అర్థం బరువైన తీవ్రమైన చర్య. దీనిని అలా ఎందుకన్నారంటే, ఇది తప్పకుండా తన ఫలితాన్ని ఈ జన్మలోగాని, తరువాతి జన్మలో గాని ఇస్తుంది. నైతికంగా బలమైన, ప్రధమమైన చర్యలు ఝానాలు. బలమైన అనైతిక చర్యలు ఏవంటే, తరవాత ప్రభావం చూపే ఘోర దారుణ నేరాలు (ఆనంతరియ కర్మలు). ఇవి మాతృహత్య, పితృ హత్య, అర్హంత హత్య, బుద్ధుని గాయ పరచడం, సంఘంలో చీలిక తేవడం లాంటివి.

ఉదాహరణకు, ఝానాన్ని వికసింప జేసుకొని, ఆ తరువాత దారుణ నేరానికి (ఆనంతరియ కర్మకు) పాల్పడితే, అతని సత్కర్మను బలమైన ఈ చెడ్డ కర్మ తుడిచి పెడుతుంది. అతడి తరువాతి జన్మను, అతడు మొదట్లో ఝానాలు సాధించి నప్పటికీ, దుష్కర్మ నిబద్ధిస్తుంది. ఉదాహరణకు గౌరవనీయ దేవదత్తుడు అతడి మనో శక్తులను కోల్పోయి శోకార్తుడుగా జన్మించాడు. ఎందుకంటె, అతడు బుద్ధుని గాయపరిచాడు. ఆ పైన సంఘాన్ని చీల్చాడు.

బుద్ధుడు వాకొన్నట్లు, రాజు అజాత శత్రు, పితృహత్య చేయ నట్లైతే, ఋషిత్వం ప్రధమ దశను పొంది ఉండేవాడే. ఇతడి విషయంలో బలమైన దుష్కర్మ అతడి ఆధ్యాత్మిక సిద్ధిని నిరోధించింది.

భావి జన్మను నిబద్ధించ డానికి అక్కడ ఒక గరుక కర్మ లేనట్లైతే, ఆసన్న కర్మ పని చేయ వచ్చు, ఆసన్న కర్మ అంటే మరణ సమయానికి ఆసన్న సమయంలో, అంటే మరణానికి అవ్యవహి తంగా ముందు చేసే కర్మ లేదా తెచ్చుకొనే జ్ఞాపకం. భావి జన్మను నిబద్ధించడంలో ఈ అంతిమ లేదా ఆసన్న చర్యకున్న ప్రాముఖ్యాన్ని పురస్కరించుకొని, చనిపోయే ముందు ఏదేని ఒక మంచి పని చేయమని అతనికి గుర్తుచేసే ఆచారం, మరణ శయ్యా మీద అతని చేత మంచి పనులు చేయించడం లాంటి ఆచారం, నేటికీ బౌద్ధ దేశాలలో కొన సాగుతున్నది.

అదృష్టవశాత్తు ఒకడు మరణ సమయంలో ఒకమంచి పనిని చేయడం గాని, మంచి ఆలోచన చేయడం గాని చేస్తే, అతడు చెడ్డ వాడైనా, కొన్నిసార్లు, సంతోషంతో మరణించ వచ్చు. మంచి జన్మ ఎత్తవచ్చు. అంటే దీని అర్థం, అతడు మంచి జన్మ ఎత్తి నప్పటికీ, అతని జీవితంలో చేసిన చెడ్డ కర్మల నుంచి విముక్తు డవుతాడని కాదు.

కొన్ని సందర్భాలలో ఒక మంచివాడు, హఠాత్తుగా ఒక చెడ్డపనినో, ఆలోచననో గుర్తు చేసు కోవడం వల్ల దుఃఖంతో మరణించ వచ్చు. ఇది బహుశ అననుకూల పరిస్థితులలో జరిగి ఉండ వచ్చు.

ప్రభావరీత్యా చూస్తే అలవాటు కర్మ (ఆచిణ్ణ కర్మ) తరవాత వస్తుంది. అతడు తన కత్యంతంగా ఇష్టమైన దానిని దృష్టిలో ఉంచుకొని పదే పదే విడువకుండ అలవాటుగా ఆచరించే కర్మ.

అలవాట్లు, మంచి వైనా చెడ్డవైనా, అవి మన రెండో స్వభావం అవుతాయి. దాదాపుగ అవి వ్యక్తి శీలాన్ని మలుస్తాయి. మనం విశ్రాంత సమయంలో, మనం అలవాటు ఆలోచనల, చేతల, గాడిలో పడి పోతుంటాం. అలాగే, మరణ సమయంలో గూడ, ఇతర పరిస్థితులు ఏవీ పనిచేయక పోతే, మనమూ, తప్పని సరిగ, అలవాటు ఆలోచనలను, చర్యలనే జ్ఞప్తి చేసుకొంటాం.

ఈ తరగతిలో చివరిది సంచిత కమ్మ (కతత్తా అంటే చేయబడింది కనుక). పై మూడింటి క్రిందకు రాని దంతా దీని క్రిందకు వస్తుంది. ఒక ప్రత్యేక వ్యక్తి యొక్క ప్రత్యేక నిధి ఇది.

ఇక మిగిలిన చివరి విభజన, ప్రభావం పని చేసే తలం (Plane) ఆధారంగా జరిగింది అవి :

1. కామ లోకం (ఇంద్రియ ప్రపంచం) లో పండే అకుశల కర్మలు (evil actions)

2. ఇంద్రియ లోకంలో పరిణతి చెందే కుశల కర్మలు (good actions)

3. రూప లోకంలో పరిణతి చెందే కుశల కర్మలు.

4. అరూప లోకంలో పండే కుశల కర్మలు.

**కామలోకంలో పండే అకుశల కర్మలు :**

మనో వాక్కర్మలు కారణంగా జరిగే పది అకుశల కర్మలున్నాయి. ఇవి దుష్కర్మను కలుగ జేస్తాయి. వీటిల్లో మూడు కర్మ (పని) నిబద్ధాలు. అవి చంపడం (పానాతిపాతా = killing), దొంగతనం (అదిన్నాదానా = stealing), లైంగిక దుశ్శీలత (కామేసు మిచ్ఛాచారా = sexual misconduct) లు.

వాక్కుకు సంబంధించినవి నాలుగు. అవి, మిధ్యా భాషణం (ముసావాదా = lying), అపవాదు వేయటం (పిశునావాచా= slandering), పరుషవచనం (ఫరుసావాచా= harsh speech) నిరర్థకభాషణం (సంఫప్పలాపా = frivolous talk).

మనస్సుకు సంబంధించినవి మూడు. అవి : లోభం (అభిజ్ఞా = covetousness), దుస్సంకల్పం (వ్యాపాద = ill-will) మిధ్యా దృష్టి (మిచ్ఛాదిత్థి = false view)

చంపడం అంటే, ఉద్దేశ పూర్వకంగా ఒక జీవిని నాశం చేయడం. పాళీపదం 'పాణ' అనే దానికి అర్థం ఒక వ్యక్తి ప్రత్యేక అస్తిత్వానికి సంబంధించిన మానసిక - దైహిక జీవితం. ఈ జీవితాన్ని, దాని పూర్తి గతిని, పూర్తి కానీయకుండ, ఉద్దేశ పూర్వకంగా, నీతి బాహ్యంగా, తుంచి వేయడమే ''పాణాతిపాత''. పాణ (ప్రాణి) అంటే శ్వాసించేది. అందువల్ల సర్వజీవులను - జంతువులతో కలుపుకొని- ప్రాణులంటాం. మొక్కలు ఈ కోవకు చెందవు. ఎందుకంటె వాటికి మనస్సు లేదు. అయినా, భిక్షువులు మొక్కల జీవితాన్ని గూడ అంత మొందించ రాదు. కాని ఈ నియమం ఉపాసకులకు వర్తించదు.

దుష్ట కర్మ అయిన హత్యకు ఐదు పరిస్థితులు ఒనగూడాలి: (1) ఒక ప్రాణి ఉండాలి. (2) అది ప్రాణి అని తెలియాలి. (3) ఛంపే ఉద్దేశం ఉండాలి (4) చంపే ప్రయత్నం ఉండాలి (5) ఫలితంగా మరణం సంభవించాలి.

చంపబడే జీవి మంచితనం, గురుత్వం మీద ఆధారపడి దుఃఖ భారం ఉంటుంది. ఒక మంచి వ్యక్తిని లేదా పెద్ద జంతువును చంపితే అది, చిన్న జంతువును లేదా చెడ్డ వ్యక్తిని చంపిన దానికంటె, ఘోర దారుణ నేర మవుతుంది. ఎందుకంటె ఆ చెడు చేయా లంటే, బృహత్ప్రయత్నం చేయ వలసి ఉంటుంది. పైగా అందువల్ల సంభవించే నష్టం గూడ ఎక్కువే.

చంపడం వలని దుష్ప్రభావాలు : అల్పాయువు, అనారోగ్యం, అయిన వాళ్ళకు దూరం కావడం వలని దుఃఖం, నిరంతర భీతి.

దొంగతనం (స్తేయం) జరగడానికి పరిస్థితులు ఒన గూడాలి. అవి : (1) పరుల సొమ్ము ఉండాలి. 2) అది పరులదని తెలియాలి 3) దొంగతనం చేయాలనే ఉద్దేశం ఉండాలి. 4) దొంగతనం చేసే ప్రయత్నం జరగాలి. 5) వాస్తవంగా సొమ్మును సంగ్రహించడం ఉండాలి. దొంగతనం వలని అనివార్య ఫలితాలు పేదరికం, బాధ, నిరాశ, పరాలంబన జీవనం.

కామాతి చారం జరగడానికి నాలుగు పరిస్థితు లుండాలి. అవి : 1) అనుభవించాలనే ఆలోచన ఉండాలి, 2) దాని ననుసరించిన ప్రయత్నం 3) సంతృప్తి పరిచే సాధనం 4) సంతృప్తి.

కామాతి చారం వలన కలగే దుష్పరిణామలు : అధిక సంఖ్యలో శత్రువులను కలిగి ఉండడం, అవాంఛనీయ భార్యలతో, భర్తలతో సంయోగం, స్త్రీగా లేదా కొజ్జాగ జన్మించడం.

అసత్య భాషణానికి నాలుగు పరిస్థితు లుండాలి. అవి : 1) ఒక అసత్యం 2) మోస పుచ్చాలనే ఉద్దేశం 3) దానిని పలకడం 4) వాస్తవంగా వంచన జరగడం.

దీని దుష్పరిణా మాలు తిట్లు తినడం, పరువు పోగొట్టు కోవడం, అవిశ్వస నీయుడు కావడం, దుర్గంధ పూరిత నోరు.

పిశున వచనం (అపవాదు)నికి నాలుగు పరిస్థితు లుండాలి అవి : 1) విభజించవలసిన మనుషులు 2) వారిని విడగొట్టాలనే ఉద్దేశం లేదా తాను ఒకనికి ప్రీతి పాత్రుడు కావాలనే కోరిక 3) తదనుగుణ ప్రయత్నం 4) భావ ప్రసారం.

దీని వలని అనివార్య ఫలితాలు : కారణం లేకుండానే మిత్రత్వం చెడి పోవడం.

పరుషవచనం వలని చెడు ఫలితం రావడానికి మూడు పరిస్థితులుండాలి. అవి : తిట్టించుకోవలసిన ఒక మనిషి 2) కోపాలోచన 3) వాస్తవంగా తిట్టడం.

దీని వలని అనివార్య దుష్ట ఫలితాలు, అది పూర్తిగా హాని రహితమే అయినా, ఇతరులతో ద్వేషితుడు కావడం, కర్కశమైన గొంతును కలిగి ఉండడం.

నిరర్థక వచనం లేదా అర్థం పర్థం లేని వాగుడు వలని దుష్పరిణామం ఫలించడానికి రెండు పరిస్థితు లుండాలి. అవి : 1) నిరర్థక వచన ప్రవృత్తి 2) తదనుగుణంగా వాగడం.

ఈ నిరర్థక వచనం వలని అనివార్య ఫలాలు శారీరక లోపాలు, విశ్వాసానర్హ భాషణం.

లోభం వలని దుష్ట పరిణామం పండా లంటే రెండు పరిస్థితు లుండాలి. అవి : 1) మరొకని ఆస్తి 2) దానికేసి చూపించి ''అది నాదగు గాక!'' అని అనుకోవాలి.

దీని వలని అనివార్య దుఃఖ ఫలితాలు తన కోర్కెలు తీరక పోవడం.

దుస్సం కల్పం వలని దుష్ప్రభావాలకు రెండు పరిస్థితు లుండాలి. అవి 1) మరోవ్యక్తి ఉండాలి. 2) అతనికి హాని చేయాలనే తలంపు ఉండాలి.

దీని వలని దుష్ఫలితాలు కురూపం, బహువిధరోగాలు, గర్హనీయ స్వభావం.

మిథ్యా దృష్టి అంటే వస్తువులను, విషయాలను తప్పుగా చూడడం. కర్మకు ఫలితం లేదనే మిథ్యా విశ్వాసాలు గూడ దీని క్రిందికే వస్తాయి.

ఇది పరిపక్వానికి రావా లంటే రెండు పరిస్థితు లుండాలి. అవి 1) వస్తువులను చూడడంలో వక్రమార్గాన్న నుసరించుట 2) ఆ వక్రభావనతో దానిని అర్థం చేసు కోవడం

దీని వలని దుష్ఫలితాలు నీచ వాంఛలు, జ్ఞానం లేక పోవడం, మందమతి, దీర్ఘ రుగ్మతలు, నింద్యార్హభావాలు

బౌద్ధం ప్రకారం పదిరకాల మిథ్యా దృష్టులు ఉన్నాయి. అవి:[7]

1. ఔదార్యం లాంటి గుణ మేదీ అసలు లేనే లేదు. అంటే దాన ధర్మాల వల్ల మంచి ఫలం ఏమీ లేదు. 2) ఉదారంగా దాన ధర్మాలు చేయడం లాంటి గుణం అసలు లేనే లేదు. లేదా 3) అతిథులకు బహుమతులివ్వడం. వీటి అంతరార్థం గూడ అటువంటి దానచర్యల వల్ల ఫలిత మేమీ లేదు. 4) మంచి, చెడ్డ కర్మల వల్ల ఫలితం ప్రయోజనాలు ఏమీ లేవు. 5) ఈ ప్రపంచాన్ని 6) ఆవలి ప్రపంచాన్ని విశ్వసించక పోవడం – అంటే ఈ ప్రపంచంలో పుట్టిన వారికి గత జీవితం (past life) లేదనడం, ఇంకా ఈ ప్రపంచంలో జీవించేవారికి భావి జీవితం లేదనడం. 7) తండ్రీ 8) తల్లీ లేదనడం - అంటే వారి కేది చేసినా దాని వలన ఫలితం లేదనడం. 9) మరణించే జీవులు, మళ్ళీ పుట్టే జీవులు లేవనడం. 10) తమతమ అతీత మేధా సంపత్తితో ఈ ప్రపంచాన్ని, ఆవలి ప్రపంచాన్ని యధార్థీ కరణం చెందించు కొని, అదే సంగతిని మనకు చెప్పిన ధర్మ నిష్ఠాపరులు, నిగ్రహులు అయిన సన్యాసులు గాని, బ్రాహ్మణులుగాని లేరనడం (ఇక్కడ సూచన: బుద్ధులకు, అర్హంతలకు, అని గమనించాలి)

**ఇంద్రియ ప్రపంచంలో పండే మంచి కర్మ**

పది రకాల కుశల కర్మ లున్నాయి. అవి 1) దాన 2) శీల 3) భావనా (meditation) 4) అపచాయన (reverence) 5) సేవ (వెయ్యావచ్చ = service) 6) పుణ్యం బదిలీ (పత్తి దాన = Transference of merit) 7) పరుల సత్కార్మలకు సంతోషించుట (అనుమొదనా) 8) ధమ్మాన్ని ఆలకించడం (ధమ్మసవన) 9) ధమ్మాన్ని ఉపదేశించడం (ధమ్మదేసనా) 10) స్వీయ దృష్టిని సరి చేసు కొనడం (దిఠ్ఠిజ్జకమ్మ)

పైవాటిలో ఏడు, పది నైతిక చర్యలను ఉపవిభాగాలుగా విడ గొట్టడం ద్వారా, కొంతమంది, ఈ పది నైతిక చర్యలనే పన్నెండు చేశారు.

ఇతరుల సత్కార్మ ప్రశంసను (పసంసా) ఇతరుల సత్కారలకు సంతోషించడం (అనుమొదనా)తో కలుపుతారు. త్రిశరణాల గ్రహణం, అప్రమత్తతలు ఒకని దృక్పథాలను సరి చేసు కోవడానికి దోహదం చేస్తాయి.

ఔదార్యం సంపద నిస్తుంది. నైతిక ప్రవర్తన కులీన కుటుంబాలలో, సుఖకర పరిస్థితులలో జన్మించ డానికి దోహదం చేస్తుంది. ధ్యానం రూపారూప లోకాలలో జన్మించడానికి,

జ్ఞానాన్ని, ముక్తిని బడయడానికి దోహదం చేస్తుంది. పుణ్యం బదిలీ భావి జన్మలలో పుష్కలంగా సంపదల నిస్తుంది. ఇతరుల సత్కార్మలకు సంతోషించడం, అతడు ఎక్కడ జన్మించినా, అతనికి సంతోషాన్నిస్తుంది. ధమ్మాన్ని చెప్పడం, వినడం - రెండూ జ్ఞాన దోహదాలే. గౌరవించడం కులీన జనకుల నిస్తుంది. సేవ గొప్ప పరివారాన్నిస్తుంది. ఇతరుల సత్కార్మ ప్రశంస వల్ల తాను ప్రశంసితు డవుతాడు. త్రిశరణాల స్వీకారం రాగాన్ని నాశం చేస్తుంది. అప్రమత్తత (సతి) వివిధ రకాల సంతోషాలకు దారితీస్తుంది.

**రూపాలోకంలో పరిపక్వమయ్యే కుశల కర్మ (మంచికర్మ)**

ఈ దిగువనిచ్చిన ఐదురకాల రూప ఝానాలు పూర్తిగా మానసికాలు:

i) మొదటి ఝాన నైతిక విజ్ఞానం (First Jhana moral conscious) ఇందులో తొలి సంప్రయోగం (వితక్క = ఆలోచన = initial application), విచార, ప్రీతి, సుఖ, ఏకాగ్రతలు ఉంటాయి.

ii) రెండో ఝాన నైతిక విజ్ఞానం. ఇందులో విచార, ప్రీతి, సుఖం, ఏకాగ్రత లుంటాయి.

iii) మూడో ఝాన నైతిక విజ్ఞానంలో ప్రీతి, ఏకాగ్రత లుంటాయి.

iv) నాలుగో ఝాన నైతిక విజ్ఞానంలో సుఖం. ఏకాగ్రత లుంటాయి.

v) ఐదో ఝాన నైతిక విజ్ఞానం (Fifth Jhana moral consciousness) లో ఉపేక్ష (సమచిత్తం), ఏకాగ్రత లుంటాయి.

ఈ ఝానాలు రూపాలోకంలో సదృశ ప్రభావాలను కలిగి ఉంటాయి.

**అరూపాలోకంలో పరిపాకం చెందే కుశల కమ్మ**

ఇవి నాలుగు అరూప ఝానాలు. అరూపలోకంలో వీటికి సదృశ ఫలాలుంటాయి. అవి :

1. అనంతాకాశంలో ఉండే నైతిక విజ్ఞానం (moral consciousness) (ఆకాసాన ఞ్చాయతన)

2. అనంత విజ్ఞానంలో ఉండే నైతిక విజ్ఞానం (విఞ్ఞాణ ఞ్ఞాయతన)

3. శూన్యతలో ఉండే నైతిక విజ్ఞానం (ఆకిఞ్ఞఞ్ఞాయతన)

4. సంజ్ఞా (perception) సంజ్ఞా రహిత నైతిక విజ్ఞానం (న' ఏవ సంజ్ఞా న' ఆసంజ్ఞాయతన)'

**పాదసూచికలు :**

1. ధమ్మ పద, V. 165
2. *Buddhist Legends* (ధమ్మపదట్ఠకథా), 11, P. 262
3. *Buddhist Legends*, 11,P.282
4. *Ibid*,1,P.278
5. కొన్ని గ్రంధాల ప్రకారం అతడు నిజంగా చంపాడు.
6. ''మొక్కలలో, నరాల ద్వారా ఉద్దీపనల ప్రసారం ఉండదు. నరాలు నాడీ కేంద్రంగా వాటికి తెలియదు.'' Dr, Karl V. Frisch, *you and Life*, P. 125.
7. *ధమ్మ సంగణి*, P. 233; *The expositor*, 11.P.493; *Buddhist Psychology*, P. 355. చూడండి.
8. 'అభిధమ్మ సంథహ' ప్రకారం ఐదురూప ఝానా లున్నాయి. కాని విశుద్ధిమగ్గనాలుగు ఝానాలనే పేర్కొంటున్నది. ఈ రెండు వ్యాఖ్యానాల మధ్య పెద్ద తేడా లేదు. మొదటి దానిలో ఝానాలను ఐదు నిర్మాణ మూలకాల ననుసరించి ఐదుగా విభజించారు. రెండో దానిలో, రెండో ఝానం, మొదటి రెండు లేకుండ, చివరి మూడు నిర్మాణ కాంశాలు ఉంటాయి.
9. వివరాలకు నారద థేర రాసిన, *A Manual of Abhiddhamma.*

ఇరవై ఒకటో ప్రకరణం

# కర్మ స్వభావం

''నీవు విత్తిన దానిని బట్టే ఫలం ఉంటుంది''

- సంయుత్త నికాయ

విత్తిన దానికి సమ-నిష్పత్తిలోనే ఫలితాన్ని అభవించి తీర వలసిందేనా? తప్పని సరేం కాదు! అంగుత్తర నికాయంలో బుద్ధుడు అంటున్నాడు:

''మనిషి అతని కర్మకు సమంగా ఫలితం అనుభవించి తీరాలంటే, అప్పుడిక ధార్మిక జీవితానికి గాని, దుఃఖాన్ని పూర్తిగా పరిహరించే అవకాశానికి గాని చోటు ఉండదు. కాని ఒకడు అనుభవించే ఫలితం కర్మానుసారం ఉంటుందని చెబితే అప్పుడు ధార్మిక జీవితానికి, దుఃఖ పూర్తి పరిహారానికి చోటు ఉంటుంది.''[1]

కనుక బౌద్ధంలో కర్మను ఒకడు మలుచుకొనే అవకాశం ఉంది.

''ఆ కాశంలోగాని, సముద్ర మధ్యంలోగాని, కొండ గుహలోగాని ఎక్కడ ఉన్నా, దుష్కర్మ ఫలితాల్ని అనుభవించక తప్పదని'' ధమ్మపదం (127) వాకొన్నా, గత కర్మ రుణం అంతా తీర్చ వలసిన ఆవశ్యకత లేదు. అదే గనుక వాస్తవమైతే, ముక్తి అసంభవ మవుతుంది. శాశ్వతంగా దుఃఖం మిగిలి పోతుంది.

ఎవడూ కర్మకు యజమాని కానీ బానిసకానీ కాడు. పరమ దుర్మార్గుడు కూడ ప్రయత్నించి మంచి వాడు కావచ్చు. మనం ఎప్పుడు ఏదోగా మారుతూ ఉంటాం, పరిణమిస్తూ ఉంటాం (becoming). దేనిగా పరిణమిస్తున్నా మనేది మనం చేసే కర్మల మీద ఆధారపడి ఉంటుంది. ఏ క్షణంలోనైనా మనం మంచికి గాని, చెడ్డకు గాని మార వచ్చు. ఒకడు ఎంత దుర్మార్గుడైనా గూడ అతనిని అతని దుష్ట స్వభావం కారణంగా, నిరుత్సాహ పరచ రాదు, తెగడరాదు. అతన్ని దయ గనాలి. ఎందుకంటె, అతనిని అభిశంసించే వారు కూడ ఒకప్పుడు అదేస్థితిలో ఉండి ఉండవచ్చు. వారు మంచి వారుగా మారినట్లుగానే, అతడూ మంచికి మార వచ్చు, బహుశా వారికంటె త్వరగా నేనేమో. అతని బీజ రూప మంచి తనం ఎవరికి తెలుసు? అతని కోసం ఏమంచి కర్మ వేచి ఉందో ఎవరికి తెలుసు?

గజదొంగ, వేయిమంది సహోదరులను చంపినవాడు అయిన అంగుళిమాల, అతని గత దుష్కర్మలను క్షాళనం చేసుకొని అర్హంత అయ్యాడు.

మానవులను భక్షించే భీకర రాక్షసుడు ఆలవకుడు మాంస భక్షణ అలవాట్లను మాని వేసి రుషిత్వంలో ప్రధమ సోపానం ఎక్కాడు.

వేశ్య అయిన అంబపాలి, తన శీలాన్ని పరిశుద్ధం కావించుకొని, అర్హంత అయింది.

తన రాజ్యవిస్తరణ కాంక్షతో కనికరం లేకుండ ప్రాణహాని కలిగించి, కళంకితుడైన అశోకుడు చివరకు ధర్మాశోకుడు, సద్గుణ అశోకు డయ్యాడు. అతడు ఎంత మంచి వాడుగా మారి పోయా డంటే, ''మానవ చరిత్రలో కిక్కిరిసి పోయిన లక్షలాది చక్రవర్తుల పేర్లలో, రాజుల, మహారాజుల పేర్లలో, అశోకుని పేరు వెలిగి పోతోంది. చారిత్రాత్మకా కాశంలో ధృవ తారలా వెలుగొందు తోంది.''[2]

కేవలం కృత నిశ్చయంతో శీలాన్ని ఎలా పరివర్తించుకో వచ్చో చూపే కొన్ని ఉదాహరణలు ఇవి:

ఒక్కోసారి, ఒక అల్పదుష్కర్మ తను ఇవ్వాల్సిన ఫలితాన్ని ఇవ్వడం, పెద్ద దుష్కర్మ ప్రభావం అల్పంగా ఉండడం జరగ వచ్చు.

బుద్ధుడు అంటున్నాడు :

''ఓ భిక్కులారా, దేహంలో, మనస్సులో, నీతిలో, జ్ఞానంలో సంయమనం లేని ఒకడు, అల్పసుగుణాలతో ఉండి, అల్పదుష్కర్మల ఫలితంగా బాధామయ జీవితం గడుపుతాడు. అతడు చేసిన ఏ చిన్న దుష్కర్మ అయినా అతనిని దుఃఖితుని చేస్తుంది.

''ఓ భిక్కులారా, దేహం, మనస్సు, నీతి, జ్ఞానాలలో సంయమనుడై, మంచి చేసిన వాడు ఉన్నతాత్ముడు. అతడు అందరియెడ అనంత అనుకంపతో జీవిస్తాడు.

''అటు వంటి వ్యక్తి చేసిన అదే దుష్కర్మకు ఫలితం ఈ జన్మలోనే పరిపాక మవుతుంది. కొంచెం ప్రభావం గూడ మరణానంతరం కని పించదు. పెద్ద ప్రభావం సంగతి చెప్పనే అక్కరలేదు.[3]

''అది, ఒకచిన్న పాత్రలోని కొద్దిపాటి నీటిలో ఉప్పుకల్లు వేయుడంలాంటిది. భిక్కులారా, మీరే మంటారు? పాత్రలోని ఆ కొంచెం నీరు ఉప్పులై పానార్హం కాదంటారా?''

''అవును దేవా.''

''ఎందుకని?''

''ఎందుకని అంటే, పాత్రలో ఉన్న నీరు అల్పం. అందుకని ఉప్పుకల్లు మూలాన ఆనీరు ఉప్పులై, పాన యోగ్యం కాకుండా పోయాయి.''

''ఒకడు ఉప్పుగల్లును గంగానదిలో కలిపా డనుకోండి. మీరేమంటారు భిక్కులారా? గంగానది ఉప్పునీరైపోతుందా? ఆ ఉప్పు గల్లు వల్ల గంగ నీరు పానయోగ్యం కాకుండా పోతుందా ?''

''కాదు, దేవా కాదు.''

''ఎందుకు కాదు?''

''ఎందుకని అంటే గంగలోని నీరు చాల ఎక్కువ. అందువల్ల అది ఉప్పునీరుగా మారదు.''

సరిగ్గా అదేవిధంగా ఒకడు అల్పదుష్కర్మచేసినా అతడు దుఃఖితుడవుతాడు. మళ్ళీ, ఇంకొకడు అదే రకమైన అల్పదుష్కృత్యం చేసినా, అతడు ఈ జన్మలోనే దానిని పరిహరించు కొంటాడు. దాని ప్రభావం కొంచెం గూడ అభివ్యక్తం కాదు (మరణానంతరం). మరి పెద్ద ప్రభావం సంగతి చెప్పనే అవసరం లేదు.

''ఒకడు అర్థరూపాయి, రూపాయి, వందరూపాయలు దొంగతనం చేసి జైలు పాలైన సందర్భం తీసుకోండి. మళ్ళీ ఒకడు అర్థరూపాయి, రూపాయి, వందరూపాయలు దొంగతనం చేసీ, జైలు పాలవ్వని సందర్భం తీసుకోండి.''

''అర్థరూపాయికి, రూపాయికి, వందరూపాయలకు ఎవరిని జైలులో పెట్టారు?''

''ఎప్పుడైన, ఒకడు పేద అయిన వాడినే జైలులో పెట్టారు.

''అర్థరూపాయికి, రూపాయికి, వందరూపాయలకు ఎవరిని జైలులో వేయ లేదు?''

''ఎప్పుడైన, ఒకడు ధన సంపదలతో తులదూగిన వాడినే జైలులో వేయలేదు.''

సరిగ్గా అదేవిధంగా, అతడు చేసిన అల్ప దుష్కర్మ అతనిని దుఃఖితుని చేస్తుంది. మళ్ళీ, అదే అల్ప దుష్కర్మ చేసిన మరొకడు దాని ప్రభావాన్ని ప్రస్తుత జన్మలోనే పరిహరిస్తాడు. మరణా నంతరం దాని ప్రభావం కొంచెం గూడ మిగలదు. పెద్దదాని మాట చెప్పే దేముంది.''[4]

**ప్రతికూల ఫలితాలకు కారణం**

మంచి మంచి నిస్తుంది కాని, మంచి చేసిన వాడు తను చేసిన పనికి తరవాత విచారిస్తే, రావలసిన వాంఛనీయ ఫలితాలు అతనికి దక్కకుండా పోతాయి.

దీనికి సమర్థనగా ఈ దిగువ ఉదాహరణము పేర్కొనవచ్చు:

ఒకసారి, కొసలరాజు పసెనది బుద్ధుని దగ్గరకు వచ్చాడు. వచ్చి ఇలా అన్నాడు:

''దేవా, ఇక్కడ సావత్తి (శ్రావస్తి)లో కోటీశ్వరుడైన ఒక కుటుంబి మరణించాడు. అతనికి కొడుకు లెవరూ లేరు. ఇప్పుడు నేను అతని ఆస్తిని రాజప్రాసాదానికి బదిలీచేసి వస్తున్నాను. లక్షల బంగారం, వెండిమాట చెప్ప నవసరం లేదు. కాని అతడు, విదిల్చిన మెతుకులను, పులిసిన గంజిని తినేవాడు. అతడు బట్టలు ఎలాంటివి వేసుకొనే వాడను కొన్నారు? ముతక జనపనార దుస్తులను ధరించే వాడు. ఇహ అతని బండి విషయానికి వస్తే, విరిగిపోయి, కర్రలలో కిత్తనార పట్టాకప్పిన బండి అది''.

అంతట బుద్ధుడు అన్నాడు:

''అయినా గూడా ఓ రాజా, అతడు తన ముందరి జన్మలో, తగరసిఖీ అని పిలవబడే ప్రత్యేక బుద్ధునికి భిక్ష ఇచ్చాడు. అలా భిక్ష ఇచ్చి నందుకు తరవాత చింతిస్తూ ఇలా అనుకొన్నాడు: 'ఎందుకు ఇచ్చాను, నా సేవకుల కిస్తే బాగుండేదే. నా పని వారలకిచ్చినా బాగుండేది.' ఇంతేకాక ఆస్తికోసం, తన సోదరుని ఏకైక పుత్రుని మట్టుపెట్టాడు. ఈ కోటీశ్వరుడు తగరసిఖీ ప్రత్యేక బుద్ధునికి భిక్ష ఇచ్చిన కారణంగా, ఏడుసార్లు దివ్యానంద స్థితులలో జన్మించాడు. ఆ చేసిన మంచి పని అవశేషం వల్ల ఈ శ్రావస్తిలోనే ఏడుసార్లు కోటీశ్వరుడుగా జన్మించాడు.''

''ఈ కోటీశ్వరుడు, దానం చేసి, ఆ తరవాత 'నా సేవకులకు, పనివారలకు ఇస్తే బాగుండేదని' చింతించాడు కనుక, ఈ చర్యకు (చింతించినందుకు) ఫలితంగా అతనికి మంచి దుస్తులన్నా, మంచిబండి అన్నా, పంచేంద్రియాల ఆనందమన్నా ఆసక్తి అభిరుచి లేవు.''

''ఈ కోటీశ్వరుడు ఆస్తికోసం, తన సోదరుని ఏకైక పుత్రుని చంపి వేశాడు కనుక, దీనికి ప్రతిక్రియగ అనేక సంవత్సరాలు, అనేక వందల సంవత్సరాలు, అనేక వేల సంవత్సరాలు, అనేక వేల వందల సంవత్సరాలు బాధతో దుఃఖితుడు కావలసిందే. ఈ కర్మావశేషంగానే అతనికి ఈ ఏడో జన్మలో గూడ పిల్లలు లేరు. పిల్లలు లేని కారణంగా అతని ఆస్తి రాజు బొక్కసానికి చేరింది.''[5]

ఈ కోటీశ్వరుడు తన గత జన్మలో చేసిన పుణ్యాకార్యం వల్ల ఇంతటి మహాసంపదను ఆర్జించాడు. కాని అతడు తాను చేసిన మంచి పనికి చింతించి నందున, అతడు కర్మ అందించిన ఆ మహాసంపదలను అనుభవించ లేక పోయాడు.

**హితకర, అహితర శక్తులు**

కర్మపని చేసే విషయంలో మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. కర్మ స్వయం చాలకంగా తన పని తాను చేసుకు పోతుంది. అలాంటి కర్మకు అనుకూలంగా, ప్రతికూలంగా పనిచేసే

హితకర, అహితకర శక్తులున్నాయి. జననం, కాలం, మూర్తిమత్త్వం (ఉపాధి) - ఇవి కర్మ ఫలానికి అటువంటి సహాయకాలు, అవరోధాలు.

ఉదాహరణకు, ఒకడు కులీన కుటుంబంలో సర్వసంపదల మధ్య జన్మిస్తే, కొన్నిసార్లు అతని ఈ అదృష్ట జన్మ అతని దుష్కర్మ పరికానికి అడ్డు పడుతుంది.

అలాకాక ఒకడు దురదృష్టకరమైన లేదా బాధాకర స్థితులలో జన్మిస్తే, ఈ దురదృష్టకర జన్మ అతని దుష్కర్మ పరిపాకానికి తోడై నిలుస్తుంది.

దీనిని సాంకేతికంగా గతి సంపత్తి (అనుకూల జన్మ) గతి విపత్తి (ప్రతి కూల జన్మ) అంటారు.

ఒక తెలివి హీనుడు, ఒక మంచి కర్మ కారణంగా, రాచబిడ్డగా పుట్టి, తలిదండ్రులు రాజురాణి అయిన కారణంగా, ప్రజలచే గౌరవించ బడతాడు. అదేవ్యక్తి దురదృష్ట జన్మ ఎత్తితే (తక్కువ కుటుంబంలో పుడితే) అతనికి ఆవిధమైన గౌరవం లభించదు.

ఉదాహరణకు సింహళరాజు దుత్తగామని తమిళుల మీద దాడి చేయడం వల్ల దుష్కర్మను, మంచి ధార్మిక, సామాజిక కార్యాలను చేపట్టడం వల్ల సత్కర్మను ఆర్జించాడు. అతని మంచి జనక కర్మ వల్ల దివ్యానంద స్థితిలో జన్మించాడు. సంప్రదాయం ప్రకారం అతని చివరి జన్మ భావి బుద్ధుడు మైత్రేయుని (మెట్టెయ్య) కాలంలో జరగు తుంది. అందుకని అతని దుష్కర్మ, అతని అనుకూల జన్మ కారణంగా విజయవంతంగా పని చేయ లేదు.

మరో ఉదాహరణ చెప్పాలంటే, పితృహంతకుడైన రాజు అజాతశత్రు, తరువాత తరువాత బుద్ధునితో ఏర్పడిన సాంగత్యం వల్ల, అతని భక్తి ప్రవత్తులు కారణంగా, విశిష్ట వ్యక్తి అయ్యాడు. ఇప్పుడతడు తన దారుణ నేరం ఫలితంగా బాధాతప్త స్థితిలో ఉన్నాడు. అందువలన అతని అనుకూల జన్మ అతడు చేసిన సత్కర్మల ఫలితాన్ని అనుభవించనీయదు.

కర్మ పని చేయడానికి అనుకూలమూ, ప్రతికూలమూ అయినవి ఇంకో రెండు కారకాలున్నాయి. అవి అందం, కురూపాలు.

సత్కర్మ వల్ల ఒకడు మంచి జన్మ ఎత్తి, అంగవికలుడైతే, అతడి సత్కర్మ ఫలం వల్ల లభించే ప్రయోజనాలను అనుభవించ లేడు. అంగ వైకల్యం ఉండి, సింహాసనానికి సహజ వారసుడే అయినా, అతడు ఆ ఉన్నతస్థానాన్ని చేర లేడు.

అంతేకాదు, అందగానికి అందం ఒక లాభం. పేదలకు పుట్టినా అందగాడైతే, అతడు అందరి దృష్టిని ఆకర్షిస్తాడు. అలా వారి ప్రభావంతో తాను విశిష్ట వ్యక్తి గావచ్చు.

అనుకూల సమయం లేదా సందర్భం, ప్రతికూల సమయంలేదా సందర్భం – ఈరెండు కారకాలు కర్మ పని చేయడాన్ని ప్రభావింతం చేస్తాయి. ఒకటి కర్మ పని తీరు నకు దోహదం చేస్తే, రెండోది అడ్డుకొంటుంది.

కరువు సంభవించి నప్పుడు, ఏ ఒక్కడూ మినహాయింపు లేకుండా, అందరూ కర్మను అనుభవించి తీరాలి. ఇక్కడ ప్రతికూల పరిస్థితులు, దుష్కర్మ పని చేయడానికి అవకాశాలను కల్పిస్తాయి. అనుకూల పరిస్థితులు దుష్కర్మ పని చేయడాన్ని నిరోధిస్తాయి.

ఈ హితకర అహితకర శక్తులలో అతిముఖ్యమైంది ప్రయత్నం. కర్మ పని తీరులో, ప్రయత్నం ఉండడం, లేక పోవడం అనేది ముఖ్య పాత్రను నిర్వహిస్తుంది. ప్రస్తుత ప్రయత్నంతో తాజా కర్మను, నూతన పరిసరాలను, వాతావరణాన్ని, అసలు ఒక కొత్త ప్రపంచాన్నే సృష్టించుకో వచ్చు. అన్నీ ఉండి, అంటే మంచి వాతావరణం, పరిస్థితులు, సౌకర్యాలు ఉండిగూడ ఒకడు తీవ్ర ప్రయత్నం చేయ నట్లైతే, అతడు బంగారు అవకాశాన్ని పోగొట్టు కోవడమే కాదు, తనను తానే నాశం గావించుకో వచ్చు. పురుషకారం (వ్యక్తి ప్రయత్నం) ఈ ప్రపంచంలో ప్రగమించ డానికి ధార్మికంగా పై కెదగ డానికి ఆవశ్యకం.

ఒకడు తన రుగ్మతను నయం చేసుకోవడానికి, తన కష్టాలలోంచి బయట పడడానికి, తన ప్రగతికి తీవ్రంగా పాటు పడడానికి, ఎటువంటి ప్రయత్నమూ చేయక పోతే, అక్కడ దుష్కర్మకు తన దుష్టఫలితాలను ఇవ్వడానికి మంచి అవకాశం లభిస్తుంది. అలాకాక, అతడు తన కష్టాల నుంచి బయట పడడానికి, తన పరిస్థితులను మెరుగు పరుచుకోవ డానికి, తనకు లభించిన అరుదైన అవకాశాలను వినియోగించు కోవ డానికి, తన నిజమైన ప్రగతికి తీవ్రంగా కృషి చేసి నట్లైతే అప్పుడు అతని సత్కర్మ అతనికి సహాయ పడుతుంది.

సముద్రంలో పడవ మునిగి నప్పుడు, బోధిసత్త మహాజనకుడు మహాప్రయత్నంతో తనను తారక్షించుకోగా, ఇతరులు దేవతలను ప్రార్థించి, వారి భావిని దేవతల చేతుల్లో పెట్టారు. ఫలితం ఏమిటంటే బోధిసత్త బయట పడగా, మిగతా వారంతా మునిగి పోయారు.

మన కర్మకు మనం పూర్తిగా యజమానులమూ, బానిసలమూ కాక పోయినా, ఈ హితకర, అహితకర కారకాలను బట్టి, కొంత వరకు, కర్మఫలం, బాహ్య పరిస్థితుల, పరిసరాల, మూర్తిమత్త్వం, వ్యక్తి ప్రయత్నంల లాంటి కారణాలమీద ఆధార పడుతుందని తేలుతుంది.

ఈ కర్మ సిద్ధాంతమే బౌద్ధునికి ఒక సాంత్వనాన్ని, ఆశను, ఆశంసను ఓదార్పును, ఊరటను, నైతిక ధైర్యాన్ని ఇస్తుంది.

అనుకోనిది జరిగి నప్పుడు, కష్టాలు, అపజయాలు, దురదృష్టం అతన్ని ఎదుర్కొన్న ప్పుడు, తాను నాటిన దానిని తాను కోసు కొంటున్నానని, పాత అప్పును తీర్చు కొంటున్నానని బౌద్ధుడు గ్రహిస్తాడు. ప్రతి దానిని కర్మకే వదిలి వేసి, చేతు లెత్తి వేయ కుండ, కలుపు మొక్కలు ఏరి, వాటి స్థానంలో మంచి విత్తనాలను నాటే తీవ్ర ప్రయత్నం చేస్తాడు. ఎందుకంటె భవిష్యత్తు అతని చేతుల్లోనే ఉందని అతనికి తెలుసు.

కర్మను విశ్వసించే వాడు అత్యంత కలుషితమైన వాణ్ణిగూడ నిందించడు. ఎందు కంటే ఏ క్షణంలోనైనా వారికి తమను తాము దిద్దుకొనే అవకాశం రావచ్చు. వారు దుఃఖ భాజక స్థితులను అనుభవిస్తున్నా, వారికి శాశ్వత శాంతిని పొంద గలమనే ఆశ ఉంటుంది.

కమ్మ నియమాన్ని పూర్తిగా విశ్వసించిన ఏ భౌద్ధుడు, తనను ఉద్ధరించ డానికి మరొకని వేడడు. కాని తన ముక్తి కోసం తన మీద తాను అచంచల విశ్వాసంతో ఉంటాడు. అతి ప్రాకృత శక్తులను మంచి చేసు కోవ డానికో, అత్మార్పణ గావించు కోవడానికో బదులు తన సంకల్ప బలం మీద ఆధార పడి, అందరి సుఖ సంతోషాల కోసం నిరంతరం పాటు పడతాడు.

కర్మమీది ఈ విశ్వాసం "అతని ప్రయత్నాన్ని బలపరిచి, ఉత్సాహాన్ని పెంపొందిస్తుంది." ఎందుకంటె అది వ్యక్తిక బాధ్యతలను బోధిస్తుంది.

మామూలు బౌద్ధునికి కర్మ అడ్డంకిగా ఉంటే, మేధావికి అది మంచి చేయ డానికి ప్రోత్సాహకంగా ఉంటుంది.

ఈ కర్మ నియమం దుఃఖ సమస్యను, విధి మర్మాన్ని, ప్రతిదీ పూర్వనిశ్చితమనే కొన్ని మతాల సిద్ధాంతాలను, అన్నింటిని మించి మానవాళి అసమానతలను వివరిస్తుంది.

మనవిధికి మనమే శిల్పులం, కర్తలం. మనం మన సృష్టి కర్తలం. మనం మన నాశకులం. మన స్వర్గాలను, మన నరకాలను మనమే నిర్మించుకొంటాం.

మనం ఆలోచించేది, చేసేది, మాటాడేది - అంతా మనదే అవుతుంది. ఈ ఆలోచనలు, మాటలు, చేష్టలు కర్మ అనబడతాయి. ఇవి ఈ సంసార పర్యాటకంలో మనలను ముంచుతూ, తేలుస్తూ జీవితం నుంచి జీవితానికి సాగిపోతాయి.

బుద్ధుడు అంటాడు:

''మనిషి ఇక్కడ చేసిన పాపపుణ్యాలు –
ఇక్కడ నుంచి అతడు తనతో తీసుకు పోయే ఆస్తి పాస్తులు.
అతని అడుగులను పసికట్టి, వెంటాడే ఛాయలా అవి వస్తాయి.
అందుకని అతని మరో జీవితం కోసం బాగా నిలవచేసుకోనివ్వు.
మరో భావి ప్రపంచంలో అది నిశ్చయ వేదికలు,
మంచివారికోసం వేచి ఉంటాయి   సుగుణాలకు పారితోషికాలు.

**పాదసూచికలు :**

1. *అంగుత్తర నికాయ,* 1.P.249; See Warren, *Buddhism in Translations,* P. 218
2. H.C. Wells, *Outline of History,* rev. edn., 1971, P.339
3. భావిదుఃఖానికి వశుడుకాని అర్హంత ఇక్కడ సూచితం
4. *అంగుత్తర నికాయ,* 1, P. 249. See warren, Buddhism in Translations, PP.218ff.
5. *సంయుత్తని కాయ,* 1, P.91.

ఇరవై రెండో ప్రకరణం

# జీవిత మూలం ఎక్కడ?

*''శిష్యులారా, ఈ జీవన యానానికి ఆది తెలియదు. తృష్ణా బంధితులై, అవిద్యలో కూరుకు పోయిన, ఈ జీవుల పరుగుకు, యానానికి, ఆరంభ బిందువు ఉన్మేషం కాలేదు''.*

– సంయుత్త నికాయ

బౌద్ధులు పునర్జన్మను కేవలం ఒక సిద్ధాంతంగా పరిగణించరు. దానిని సాక్ష్యాలతో రుజువు చేయ డానికి వీలైన వాస్తవంగా పరిగణిస్తారు. ఈ జీవితంలోనే నిర్వాణాన్ని సాధించడం దాని లక్ష్యం అయినా, బౌద్ధానికి పునర్జన్మ ఒక ప్రాథమిక సిద్ధాంతం. బోధిసత్వుని ఆదర్శం, పరిపూర్ణత సాధించాలనే దాని అనుబంధ స్వేచ్ఛా సిద్ధాంతం – ఈ రెండూ ఈ పునర్జన్మ సిద్ధాంతం మీద ఆధారపడి ఉన్నాయి.

పునర్జన్మను, ఆత్మవలసగా, అవతారంగా, పరిగణించి, దానిని పైథాగరస్, ప్లేటో లాంటి తాత్వికులు, షెలీ, టెనిసన్, వర్డ్స్ వర్త్ లాంటి కవులు, ఇంకా ప్రాచ్య, పాశ్చాత్య దేశాలకు చెందిన వారు మరెందరో, విశ్వసించారని మనకు ఆధారాలు తెలుపు తున్నాయి.

బౌద్ధుల పునర్జన్మ సిద్ధాంతం, ఇతర దర్శనాల ఆత్మ వలస, అవతార సిద్ధాంతాల కంటె భిన్నమైంది. ఎందుకంటె, పరమాత్మ నుంచి వచ్చిన, లేదా దేవుడు సృజించిన వలస పోయే శాశ్వతాత్మ అస్తిత్వాన్ని బౌద్ధం నిరాకరిస్తుంది.

పునర్జన్మను నిబద్ధించేది కర్మ. గత కర్మ ప్రస్తుత జన్మను నిబద్ధిస్తుంది. ప్రస్తుత కర్మ, గత కర్మతో కలసి భవిష్యత్తుని నిబద్ధిస్తుంది. వర్తమానం గతానికి బిడ్డ. ఇది తిరిగి భవిష్యత్తుకు మాతృక అవుతుంది.

వర్తమానానికి సంబంధించిన వాస్తవికతకు రుజువు అక్కర లేదు. ఎందుకంటె అది స్వయం సిద్ధం (Self evident). గతం వాస్తవికత స్మృతిమీద, అభ్యాసంమీద, భావి వాస్తవికత ఊహ మీద, అనుమానం (inference) మీద ఆధార పడతాయి.

గత, వర్తమాన, భావి జీవితం ఉందని అంగీకరిస్తే, ''అసలు జీవితానికి ఆరంభం ఎక్కడ?'' అనే ప్రశ్నకు మనం వెంటనే సమాధానం చెప్పాలి.

ఈ ప్రశ్నకు సమాధానంగా ఒక మతం వారు, ఒక ''ప్రథమ కారణాన్ని'' (First cause) ప్రతిపాదిస్తారు. ఈ ప్రథమ కారణం ఒక విశ్వ శక్తి కావచ్చు. లేదా ఒక మహాశక్తి మంతుడైన

దేవుడు కావచ్చు. మరోమతం వారు ఈ ప్రథమ కారణాన్ని కాదంటారు. ఎందుకంటే మామూలుగా అనుభవంలో కారణం ఎప్పుడూ కార్యం అవుతూనే ఉంటుంది, కార్యం కారణం అవుతూనే ఉంటుంది. ఇటువంటి కార్య కారణ వలయంలో ప్రథమ కారణం ఎక్కడ ఉంటుంది? మొదటి దాని ప్రకారం జీవితానికి ఒక ఆరంభం ఉంటుంది. రెండోదాని ప్రకారం జీవితానికి అది అంటూ ఉండ డానికి వీలు లేదు. 'గుండ్రని త్రిభుజం' ఎంత హాస్యాస్పదమో, కొంత మంది దృష్టిలో, ప్రథమ కారణం అంత హాస్యాస్పదమైంది.

జీవితం ఎప్పుడో అనంత ప్రాక్తన కాలంలో ప్రారంభమైందనీ, దానికి సృష్టికర్తే ప్రారంభకుడు లేదా ప్రథమ కారణమని ఎవరైన వాదించ వచ్చు.

ఇదే నిజమైతే, అదే ప్రశ్నను ఈ ప్రతిపాదిత (అభ్యుపగమిత) సృష్టికర్తను గురించి గూడ వేయవచ్చు. సృష్టి కర్తకు ఆది ఏది?

ప్రథమ కారణాన్ని గురించి అనేక అభిప్రాయా లున్నాయి. ప్రథమ కారణాన్ని పరమాత్మగా, బ్రహ్మగా, ఈశ్వరునిగా, జెహోవాగా, దేవుడుగా, దేవదేవుడుగా, అల్లాగా, పరమ సత్యంగా, స్వర్గంలోని తండ్రిగా, సృష్టికర్తగా, ప్రారంభ చాలకుడుగా, కారణరహిత కారణంగా, దివ్యసారంగా, అదృష్టంగా, ప్రకృతిగా, ప్రధాన, లాంటి సాకూత పదాలతో కొంత మంది దార్శనికులు, మతాలు వర్ణిస్తున్నాయి.

హిందూమతం ప్రకారం జీవితానికి ఆరంభం పరమాత్మ. ఈ పరమాత్మ నుంచి ఆత్మ వస్తుంది. ఈ ఆత్మ ఒక అస్తిత్వం నుంచి మరో అస్తిత్వానికి వలస పోతుంది. ఈ వలస ఆత్మ తిరిగి పరమాత్మలో కలిసే దాకా సాగుతుంది. తిరిగి పరమాత్మలో కలిసిన ఆత్మలు తిరిగి మళ్ళీ వలసపోయే అవకాశం ఉందా లేదా అని ఎవరైన ప్రశ్నించవచ్చు.

ఒక పారమార్థిక ప్రారంభం ఉందని ఒప్పుకొంటూనే, క్రైస్తవం, ప్రతి దానిని దేవుని ఆజ్ఞకు ఆపాదిస్తుంది.

షోపన్‌హోర్ అంటాడు: ''శూన్యం నుంచి వచ్చానని భావించిన వాడెవడైనా మళ్ళీ తాను శూన్యం అవుతానని అనుకొని తీరాలి. ఎందుకంటె తాను లేక ముందు ఒక అనంత కాలం గడిచింది: తరవాత మరో అనంతకాలం (elternity) ఆరంభమైంది. ఈ అనంతకాలంలో తాను మరణించడు – ఈ ఆలోచనే దారుణం.

''జననమే కనుక వాస్తవా రంభమైతే, అలాంటప్పుడు మరణం గూడ వాస్తవ అంత్యం కావాలి. 'అవస్తు (nothing) నుంచి మనిషి చేయబడ్డాడు' అనే ఆలోచన. 'మరణం వాస్తవ అంత్యం' అనే భావనకు అవశ్యం దారి తీస్తుంది.''

సెన్సర్ లెలిస్ ఇలా వాదిస్తాడు: '' ఆస్తిక్య సూత్రాలప్రకారం, మనిషి అతని ఇష్టంతో నిమిత్తం లేకుండానే, అ కారణంగానే సృష్టించ బడ్డాడు. పుట్టి నప్పటి నుంచి గిట్టేవరకు, అతని వాంఛలు, ఆశంసలు, ఆశలు, పెనగులాటలు, ప్రార్థనలు, అభ్యర్థనలతో నిమిత్తం లేకుండా, అతనిని సృష్టించినప్పుడే, అతడు మంచివాడో చెడ్డవాడో, అదృష్టవంతుడో దురదృష్టవంతుడో కావాలని నిర్ణయమైంది. అటువంటిదీ దైవాధీన వాదం (theological fatalism).

''మానవులంతా పాపులు. వారందరిలోను ఆడమ్ చేసిన పాపం అవశ్యకంగా ఉంది', అని అనడం దయ, ప్రేమ, న్యాయం, సర్వశక్తిమంత సమతలకు ఒక సవాలు''.

హక్స్‌లీ అంటాడు: ''ఈ విశ్వాన్ని ఎవడైనా ఉద్దేశపూర్వకంగా నడుపుతున్నాడని మనం భావించ వలసి వస్తే, నాకు అనిపిస్తుంది కదా, అతడు ఏమాత్రం హితకారుడు, ధర్మాత్ముడు కాక, అహితుడు, అన్యాయి అని''

ఐన్‌స్టైన్ ప్రకారం, ''ఈ దేవుడే గనుక సర్వశక్తి మంతుడైతే (omnipotent), ప్రతి సంఘటన, ప్రతి మానవ చర్య, ఆలోచన, అనుభూతి, ఆశంస గూడ అతని, పనే కావాలి; మరి అలాంటి దేవుని ఎదుట మానవులను తమ ఆలోచనలకు, చేతలకు బాధ్యులుగా చేయాలనే ఆలోచన ఎలా వస్తుంది?

''పారితోషిక - దండనలను విధించడంలో, కొంతవరకు అతడు తన మీద తానే తీర్పు చెప్పు కొంటున్నా డన్నమాట. మరి అతనికి ఆపాదితాలైన మంచితనం, ధర్మతలతో దీనిని కలిపి చూడడం ఎలా?''

చార్లెస్ బ్రాడ్‌లాఫ్ ప్రకారం, ''ప్రపంచంలో కీడు (చెడ్డ) ఉండడం సృష్టికర్త వాది (theist) కి పెద్ద అవరోధం. దేవుడు సర్వశక్తి మంతుడు, సర్వాంతర్యామి, సర్వజ్ఞాని అని వాదించేవానికి, అంతా మంచే అనిచెప్పే వానికి, బాధ, దుఃఖం, నేరం, పేదరికాలు పెను సవాళ్ళు''

''దేవుడు, మానవుని కష్టాల'' మీద రాస్తూ జె.బి. యస్. హాల్డేన్ - మానవుని శీలం పరిపూర్ణం చెందాలంటే దుఃఖం (Suffering) ఉండాలి. లేదా దేవుడు సర్వశక్తిమంతుడైనా కాక పోయి ఉండాలి. కొంతమంది అదృష్టవశాత్తు మంచి వంశలో పుట్టడం, విద్యను కలిగి ఉండడం వల్ల వారు చాల తక్కువగా దుఃఖాన్ని అనుభవించా రనేది మొదటి సిద్ధాంతాన్ని తోసి పుచ్చుతుంది. విశ్వాన్ని మొత్తంగా ఏకంగా చూసి నప్పుడు, బౌద్ధికంగా ఏర్పడే ఏ ఖాళీనైనా నింపడానికి దేవుని ప్రతిపాదించే సందర్భంలో మాత్రమే రెండో సిద్ధాంతానికి అభ్యంతరం. మరి సృష్టికర్త ఏమో తనకు కావలసింది సృష్టించ గలడని అనుకోవచ్చు.''

లార్డ్ టెనిసన్ తన వృద్ధాప్యంలో రాసిన ''నిస్పృహ'' (Depair) అనే పద్యంలో దేవుని మీద ఇలా దాడి చేశాడు: ''ఈసయ, 45,7 లో దేవుడు అంటాడు: 'నేను శాంతిని చేకూరుస్తాను, దుఃఖాన్ని సృష్టిస్తాను''.

'' ఏమిటి! అంతబాగా మనలను సేవించిన ఆ అనంత ప్రేమ మూర్తికి వినుతి పలకాలా?
సరిగా చెప్పాలంటే, నిరంతర నరకాన్ని సృష్టించిన అనంత క్రౌర్యమేగా,
మనలను చేసిందీ, ముందుగా మనలను ఊహించిందీ, ముందుగా అభిశంసిందీను మళ్ళీ తనకు కావలసిందేదో తను చేసు కొంటోంది.
మన మూలుగులు ఎప్పుడూ వినని మన మృత అమానుష మాతృమూర్తేనయం.''

దేవుడు తన ప్రతిమకు అనుగుణంగా మనిషిని సృష్టించాడని ప్రాచీన చాందస రచయితలు ఆధికారికంగా ప్రకటించారు. దీనికి భిన్నంగా, ఆధునిక చింతనా పరులు, మనిషే, దేవుణ్ణి, తన రూపంలో సృష్టించాడని చెప్పారు. నాగరికతా వికాసంతో దేవుని భావన నిగ్గుతేలుతూ వచ్చింది. ఈ యుగంలో, వ్యక్తిక దేవుని (personal god) స్థానంలో అవైయక్తిక దేవుని ప్రతిష్టించాలనే ప్రవృత్తి పెరిగింది.

మానవుడు సృష్టించిన వాటిలోకెల్ల మహోన్నతమైవది దేవుడు అంటాడు వాల్టేర్.

ఈ విశ్వానికి వెలుపలగాని, లోపలగాని, అటువంటి సర్వశక్తి మంతుని, సర్వవ్యాపకుని – మంచి నంతటిని పుణికి పుచ్చుకొన్న – భావన చేయడం అసంభవం.

ఈ సమస్యను ఆధునిక విజ్ఞాన శాస్త్రం తన పరిమిత వ్యవస్థీకృత జ్ఞానంతో పరిష్కరించ ప్రయత్నిస్తున్నది. శాస్త్రం దృష్ట్యా, మనం తలిదండ్రుల నుంచి వచ్చిన శుక్రాండాలతో తయారు చేయ బడ్డాము. కాని విజ్ఞాన శాస్త్రం, మనిషి శారీరక యంత్రాంగం కంటె అనంతంగా ముఖ్యమైన మరో వికాసాన్ని సంతృప్తి కరంగా వివరించ లేక పోతున్నది. విజ్ఞాన శాస్త్రవేత్తలు ఒకప్రక్క ప్రాణం, ప్రాణం నుంచే వచ్చిందం (Omne vivum ex vivo) టూనే, మనస్సు, ప్రాణాలు జీవరహితం నుంచి వచ్చా యంటున్నారు.

శాస్త్రం దృష్ట్యా మనం పూర్తిగా తలిదండ్రుల నుంచే వచ్చాం. ఈ విధంగా మనకు ముందు తప్పని సరిగా మన తలిదండ్రు లున్నారు. వారికి వారి తలిదండ్రు లున్నారు. వారికి వారి తలిదండ్రు లున్నారు. ఈ విధంగా జీవానికి ముందు జీవం ఉంది. ఈ గొలుసు మొదటి జీవపదార్థం ( ప్రోటోప్లాజమ్) వరకు పోతుంది. మరి ఈ మొదటి జీవ పదార్థం ఎక్కడినుంచి వచ్చిందంటే మాత్రం విజ్ఞాన శాస్త్రవేత్తలు తమకు తెలియ దంటారు.

**ఈ జీవారంభం గురించి మరి బౌద్ధం ఏమంటుంది?**

మనం ముందుగ ఒక విషయం స్పష్టం చెయ్యాలి. బుద్ధుడు ఎప్పుడూ గూడ, మానవాళిని వేధించిన తాత్విక, నైతిక ప్రశ్నలన్నింటిని పరిష్కరించాలని, ప్రయత్నించ లేదు. అతడెప్పుడూ జ్ఞానాభివృద్ధికి దారితీయని ఊహాజనిత, శుష్క సిద్ధాంతాలను గురించి చర్చించ లేదు. ఏదో ఒక ప్రథమ కారణాన్ని ప్రతిపాదించి, దానిని గుడ్డిగా నమ్మ వలసిందని అత డెప్పుడు తన అనుచరులను ఒత్తిడి చేయ లేదు. అతడు ముఖ్యంగా ఒకే ఒక ఆచరణాత్మకమైన, ప్రత్యేకమైన సమస్యను పరిష్కరించ పూను కొన్నాడు: అది దుఃఖం, దాని నాశం; మిగతా పార్శ్వ సమస్యలను పూర్తిగా విస్మరించాడు.

పవిత్ర జీవితంతో క్రమక్రమంగా ముక్తిని పొందే విధానంతో అసంతృప్తుడైన మాలుంక్యపుత్త, ఒకసారి బుద్ధుని వద్దకు వచ్చి, తన సైద్ధాంతిక సమస్యలకు వెంటనే సమాధానం చెప్ప వలసిందని అసహనంతో కోరి, సరైన సమాధానం లభించక పోతే చీవరాలు వదలి వేస్తానని చెప్పాడు.

''దేవా, మీరు, ఈ దిగువ సిద్ధాంతాలను ప్రక్కన బెట్టారు, లేదా అసలు వదిలి వేశారు. అవి: ఈ ప్రపంచం శాశ్వతమా కాదా? సాంతమా అనంతమా? మీరు ఈ ప్రశ్నలకు సమాధానం చెబితే మీతో పవిత్ర జీవితం గడుపుతాను. లేనట్లయితే మామూలు కుటుంబినై పోతాను.

''ఈ ప్రపంచం శాశ్వతమని ధన్యజీవి (బుద్ధుడు) భావిస్తే ఆవిషయమే నాకు వివరించ నీయండి. శాశ్వతం కాదని ధన్యజీవి భావిస్తే అదే విషయం నాకు తెలియ జేయ నీయండి. శాశ్వతమో అశాశ్వతమో తెలియక పోతే, ఋజు ప్రవర్తన గల వారు ఎవరైన చేసేది 'నాకు తెలియదు, నా కందులో జ్ఞానం లేదు' అని ఒప్పుకోవడమే''

''భిక్కు జీవితానికి, అటువంటి ప్రశ్నల సమాధానాలకు సంబంధం ఏమిటి?'' అని బుద్ధుడు ప్రశాంతంగా ప్రశ్నించాడు.

''సంబంధం ఏమీ లేదు దేవా,'' అన్నాడు భిక్కు.

నైతిక ప్రగతికి పనికిరాని అటువంటి విషయాల మీద కాలాన్ని, శ్రమను వృధా చేయ వలదని మందలించి బుద్ధుడు ఇలా అన్నాడు:

''ఓ మాలుంక్యపుత్రా, ఈ ప్రశ్నలకు ధన్య జీవి (బుద్ధుడు) సమాధానం చెప్పే వరకు 'నేను భిక్కు జీవితం గడపను' అని ఎవరైనా అంటే, ఎప్పటికైనా ఆయన నుంచి ఆ ప్రశ్నలకు సమాధానాలు లభించే లోపల అతడు జీవించి ఉండడు.

ఇదెలాంటి దంటే, విషం పూసిన బాణం దిగబడిన ఒకని దగ్గరకు అతని బంధువులు, స్నేహితులు, ఒక శస్త్రచికిత్సకుని తీసుకువచ్చారట, బాణాన్ని వెలికి తీయడానికి. అతడేమో, 'నా ఒంటిలో ఈ బాణం నాటింది ఎవడు? నాలో నాటుకొన్న ఈ బాణం స్వభావం ఏమిటి?' - లాంటి ప్రశ్నలకు సమాధానాలు, చెబితే కాని, బాణాన్ని పీకనీయనన్నాడట. ఈ ప్రశ్నలకు సమాధానాలు ఎప్పటికైనా కనుగొనే దాక అతడు జీవించి ఉండడు.

సరిగ్గా అలాగే ఉంది, 'ప్రపంచం శాశ్వతమా? అశాశ్వతమా? సాంతమా? అనంతమా?' అనే ప్రశ్నలకు సమాధానం ఇచ్చేవరకు భిక్కు జీవితం గడపనని మొండి కేయడం. ఈ ప్రశ్నలకు ఎప్పటికైనా సమాధానం లభించే దాక అతడు జీవించి ఉండడు.

ప్రపంచం శాశ్వతమని విశ్వసిస్తే పవిత్ర జీవితాన్ని పాటించడం ఉంటుందా? లేదు! ప్రపంచం శాశ్వతం కాదని విశ్వసిస్తే అప్పుడో? అప్పుడూ లేదు. కాని ప్రంపంచం శాశ్వతం అని నమ్మినా, అశాశ్వతం అని నమ్మినా, జనన, జరా, మరణాలుంటాయి. ఈ జీవితంలోనే వాటి ఉచ్ఛేదాన్ని తెలుపుతాను.

''మాలుంక్య పుత్రా, ప్రపంచం శాశ్వతమో, అశాశ్వతమో, సాంతమో, అనంతమో నేను ఎరుక పరచ లేదు. మరి నేనెందుకు తెలియ జేయ లేదను కొంటారు? ఎందుకంటే వాటిని తెలుసు కొన్నందు వల్ల ప్రయోజనం ఏమీ లేదు. అవి పవిత్ర జీవనానికి దారితీయవు. అవి విరాగానికి, లోభ రాహిత్యానికి, ఉచ్ఛేదానికి, ప్రశాంతతకు, అంతర్బొద్ధిక జ్ఞానానికి, జ్ఞానోదయానికి, లేదా నిర్వాణానికి తగినవి కావు. అందుకని వాటిని గురించి తెలియ జేయలేదు''[1]

బౌద్ధ ప్రకారం, మనం కర్మ మాతృక నుంచి పుట్టాం. తలిదండ్రులు కేవలం పాదార్థిక పారను మాత్రమే ఇస్తారు. కనుక జీవికి ముందు జీవి ఉంటుంది. గర్భధారణ సమయంలో, పిండానికి ఊపిరి పోసే ప్రథమ విజ్ఞానాన్ని (consciousness) నిబద్ధించేది కర్మయే. ఈ విధంగా పూర్వ జన్మ నుంచి వచ్చిన అదృశ్య కర్మశక్తి, అంతకుముందే ఉన్న శారీరక దృగ్విషయంలో మానసిక, ప్రాణిక దృగ్విషయాలను జనింప చేస్తుంది. ఈ విధంగా మనిషి తయారవ డానికి కావలసిన మూడు పదార్థాలు పూర్తి అవుతాయి.

**జీవుల పుట్టుక గురించి బుద్ధుడు ఇలా చెప్పాడు:**

ఎక్కడ ఆ మూడు సంయోగిస్తాయో, అక్కడ జీవాణువు నాట బడుతుంది. జీవం నాట బడాలంటే తల్లి దండ్రి ఏకం కావాలి. అంతేకాదు, తల్లి ఫలప్రదాయక రుతువులో

ఉండాలి. ఇంకా గంధబ్బ (పుట్టు వలసిన జీవి) ప్రత్యక్ష మవ్వాలి. ఈ మూడు కుదిరి నప్పుడే జీవం ఏర్పడుతుంది.[2]

ఇక్కడ గంధబ్బ (= గంతబ్బ) అంటే గర్భధారణ[3]ను పర్యవేక్షించే ఒక తరగతి దేవతలని అర్థం చేసుకో రాదు. ఈ పదం, ఒక ప్రత్యేక గర్భంలో జన్మించ డానికి సిద్ధంగా ఉన్న జీవిని సూచిస్తుంది. ఈ పదాన్ని ఈ ఒకే ఒక ప్రత్యేక సందర్భంలో మాత్రమే ఉపయోగించారు. కాని దీనిని ఒక శాశ్వతాత్మగా అపార్థం చేసుకో రాదు.

ఒక జీవి ఇక్కడ పుట్టాలంటే, మరోచోట ఎక్కడో ఒక జీవి మరణించాలి. జీవుడు పుట్టడం అంటే, స్కంధాలు లేదా మానసిక – శారీరక దృగ్విషయం ఈ జీవితంలో ఆ విర్భవించడం. ఇది సరిగ్గా గత జన్మలో ఒకజీవి మరణానికి సదృశంగా ఉంటుంది. మామూలు సంప్రదాయక పద్ధతిలో చెబితే, ఒకచోట సూర్యుడు దయించడం అంటే, మరోచోట సూర్యు డస్తమించడం. జీవితాన్ని ఒక సరళ రేఖగా కాక తరంగంగా అర్థం చేసు కొంటే ఈ చిక్కు సమస్యను తేలికగా అర్థం చేసుకో వచ్చు. జనన మరణాలు ఒకే ప్రక్రియలో రెండు దశలు. మరణానికి ముందు జననం ఉంటుంది. అంతే కాదు, మరణం జననాకి ముందుంటుంది. ప్రతి వైయక్తిక జీవిత ప్రవాహానికి సంబంధించిన జనన మరణ నిరత అనుక్రామికనే సాంకేతికంగా చెబితే ''సంసారం'' అంటాం. సంసారం అంటే మరల మరల సాగే పర్యాటకం.

**మరి జీవితం అసలు మూలం ఎక్కడ?**

బుద్ధుడు స్పష్టంగా చెప్పాడు: ఈ సంసారానికి గుర్తింపదగిన ఆది అంటూ ఒకటి లేదు. అవిద్యతో ఆటంకితులై, తృష్ణతో బంధితులై తిరుగాడే, జీవితాన్ని కొనసాగించే, జీవుల 'ఆది' జ్ఞాతం' కాదు[4].

సంసారం అంటే శబ్దార్థం ప్రకారం ఆవర్తక పర్యాటకం. అత్థసాలినీ సంసారాన్ని ఇలా నిర్వచించాడు: ''ఖంధానం పటిపాతి ధాతుఆయ నానమ్ చ అబ్బోచ్ఛిన్నమ్ వత్తమానా సంసారో'తి పవుచ్చతి'', సంసార అంటే తెంపులేని స్కంధాల, మూలకాల, ఇంద్రియ భూమికల అనుక్రామికత.

అవిద్య, తృష్ణల మురికి నీటితో కూడినంత వరకు ఈ జీవిత ప్రవాహం. అనంతంగా సాగుతూనే ఉంటుంది. ఈ రెండింటిని పూర్తిగా తొలగించి నప్పుడు మాత్రమే జీవిత ప్రవాహం ఆగి పోతుంది. బుద్ధుడు, అర్హంతల విషయంలో మాదిరిగా పునర్జన్మ ఆగి

పోతుంది. ఈ జీవశక్తి, అవిద్య, తృష్ణలతో నిండని సందర్భం కనిపించదు కనుక, ఈ జీవిత ప్రవాహం మొదలును నిర్ణయించలేం.

ఇక్కడ బుద్ధుడు ప్రాణుల జీవిత ప్రవాహాన్ని గురించి మాత్రమే చెప్పాడని మనం గమనించాలి.

ఈ విశ్వం పుట్టుక, పరిణామాల గురించి ఇహ విజ్ఞానశాస్త్రవేత్తలే పరిశోధించాలి.

**పాదసూచికలు :**

2. *ibid,* 1, 38, మహాతన్హా సంఖ్య సుత్త, P. 256 నూనె, వత్తి ఉన్నా జ్వాలను చేయడానికి బయటదైన నిప్పును ప్రవేశ పెట్టాలి.

3. See F. L. Woodward, *Some Sayings of the Buddha* P. 29.

4. సంయుత్తని కాయ, 11, P. 178; *Kindred Sayings,* 11, P 118.

ఇరవై మూడో ప్రకరణం

# సృష్టి కర్త అని పిలవబడే దేవుని గురించి బుద్ధుడు

''మీ బ్రహ్మను నేను అన్యాయులలో ఒకనిగా జమకడతాను
అధర్మాశ్రయ ప్రపంచాన్ని అతడు నిర్మించాడు''.

– జాతక

ఇతర మతాలు వాకొనే 'సృష్టికర్త – దేవుని' కి పాళీపదం ' ఇస్సర' (సంస్కృతం ఈశ్వర) లేదా బ్రహ్మ.

అనేక సందర్భాలలో బుద్ధుడు శాశ్వతాత్మ (అత్తా) అస్తిత్వాన్ని కాదన్నాడు. 'సృష్టికర్త – దేవుడు' లేడని చెప్పిన సందర్భాలు చాల తక్కువ. అయితే బుద్ధుడు ఎప్పుడూ గూడ ఒక శక్తి రూపంలో గాని, జీవి రూపంలో గాని సృష్టి కర్త ఉనికిని అంగీకరించ లేదు.

బుద్ధుడు ఎప్పుడు ఒక అతిప్రాకృతిక దేవుణ్ణి మనిషికి పైన నిలబెట్టక పోయి నప్పటికీ, కొందరు పండితులు, బుద్ధుడు ఈ ముఖ్యమైన ప్రశ్నమీద మౌనాన్నే పాటించాడని అంటున్నారు. ఈ దిగువ ఉటంకించిన ఆయన వాక్యాలు, బుద్ధుని దృష్టిలో 'సృష్టికర్త – దేవుడు' ఏమిటో తెలియజేస్తాయి.

ఆ రోజుల్లో ప్రబలంగా ఉన్న మూడు వైవిధ్య అభిప్రాయాలను గురించి బుద్ధుడు అంగుత్తరని కాయంలో చెబుతాడు. అందులో ఒకటి: ''ఏరకమైన సుఖం, బాధ, తటస్థ అనుభూతులను ఈ మనిషి అనుభవించినా, అవన్నీ గూడ పరమ దేవుని సృష్టే''[1]

ఈ దృష్ట్యా చూస్తే, సృష్టికర్త మనలను ఎలా చేశాడో అదే మనం. మన అదృష్టం, విధి, పూర్తిగా అతని చేతుల్లో ఉంది. మన 'విధి' ని అతడు ముందు గానే నిర్దేశించాడు. అతని సృష్టికి ఉంద నుకొన్న స్వేచ్ఛా సంకల్పం అబద్ధం.

ఈ దైవాయత్త దృక్పథాన్ని విమర్శిస్తూ బుద్ధుడు దేవదహ సుత్తంలో అంటాడు: ''అలాగైతే పరమ దేవుని సృష్టికారణంగానే మనుషులు, హంతుకులు, దొంగలు, అబద్ధాల కోరులు, అపవిత్రులు, అపవాదుకారులు, వదరు బోతులు, తిరుగు బోతులు, అసూయాపరులు, లోలుపులు, వక్రదృష్టులుగా తయారయ్యా రన్నమాట. పరమ దేవుడే అన్నింటికి మూలమని భావించే వారికి, ఈ పనిచెయ్యాలి, ఇది చేయ నవసరం లేదు, అనే కోరికగాని ఆవశ్యకత గాని లేదు.[2]

నగ్న సన్యాసులు కఠోర స్వీయ క్లేశ దమన దీక్షను గురించి దేవదహా సుత్తలో బుద్ధుడు చెప్పాడు: ''ఓ భిక్కులారా, దైవ సృష్టి కారణంగానే జీవులు బాధా సుఖాలను అనుభవిస్తున్నట్లయితే, అప్పుడు ఈ నగ్న సన్యాసులు కఠోర క్లేశ దమనం అనుభవిస్తున్నారు కనుక, వీరిని ఒక క్రూరదైవం సృష్టించాడని చెప్పాల్సి ఉంటుంది.''

తెలుసుకోవాలనే ఆసక్తి ఉన్న భిక్కుకు, ఉన్నాడని భావించ బడిన సృష్టికర్తకు మధ్య జరిగిన హాస్య సంభరితమైన సంభాషణాన్ని కెవద్ధ సుత్త చెబుతున్నది:

''హే మిత్రమా, భూమి, నిప్పు, నీరు, గాలి – ఈనాలుగు మూలకాలు, తమ జాడను ఏమాత్రం వదల కుండ, ఎక్కడ అంతర్హిత మవుతున్నాయి''? దీనికి ఆ మహాబ్రహ్మ సమాధానం చెప్పాడు: ''సోదరా, నేను బ్రహ్మను, పరమాన్ని, నా పైన ఎవరూ లేనివాణ్ణి, ముఖ్యుడను, విజేతను, పాలకుడను, పుట్టిన, పుట్టబోయే వారందరికి తండ్రిని''

రెండోసారి భిక్కు అదే ప్రశ్నను వేశాడు. మహాబ్రహ్మ అదే ఛాందస సమాధానం చెప్పాడు.

భిక్కు మూడోసారి అదే ప్రశ్నను అడిగినప్పుడు, మహాబ్రహ్మ అతనిని చేయి పట్టుకొని ప్రక్కకు తీసుకు పోయి, దాచకుండా చెప్పాడు:

''హే సోదరా, నా పరిజన దేవతలు ఇలా నమ్ముతారు: 'బ్రహ్మ అన్నింటిని చూస్తాడు, అతనికి అన్నీ తెలుసు, అన్నింటిలోకి వ్యాపించి ఉన్నాడు? కాని సోదరా, ఈనాలుగు మూలకాలు తమ గుర్తులను ఏమాత్రం వదిలి పెట్టకుండా, ఎక్కడ అంతర్హిత మవుతాయో నాకు మాత్రం తెలియదు. అందువలన ఓ సోదరా, ఈ ప్రశ్నకు సమాధానం కోసం ఆ ధన్యుని (బుద్ధుని) వదిలి, మరోచోట వెదకడం మహా పాపం, పెద్ద నేరం. వెను దిరుగు సోదరా, బుద్ధుని చేరు, ఆయన ఏమి చెబుతాడో విను. దానినే విశ్వసించు?''

'సృష్టికర్త – దేవుడ'ని పిలవబడే మహాబ్రహ్మ మూలాన్ని గురించి పాతిక సుత్తలో బుద్ధుడు ఇలా అన్నాడు:[4]

''దీనికి సంబంధించి, ఓ శిష్యులారా, మొదట పుట్టినవాడు (ఒక నూతన ప్రపంచ పరిణామంలో) ఇలా అనుకొంటాడు: నేనే బ్రహ్మను, మహా బ్రహ్మను, విజేతను, సర్వద్రష్టను, విధాతను, ప్రభువును, ముఖ్యుడను, కర్తను, సృష్టికర్తను, భాగ్యవిధాతను, నాకు నేనే ప్రభువైన వాడను, ఉన్నవాటికి ఉండబోయేవాటికి తండ్రిని. ఈ జీవులన్నింటిని నేనే సృష్టించాను. అది అలా ఎందుకైంది? కొంచెం కాలం ముందు నేను ఇలా కోరు కొన్నాను: 'ఆ ఇతరులు గూడ ఈ జీవ పరిణామ దశకు చేరుకోవచ్చు! నామనస్సులో కోరిక అట్టిది. అదే జరిగింది. అవన్నీ ఈ పరిణామ దశకు చేరుకొన్నాయి.'

అతని తరవాత పుట్టిన ఆ జీవులన్నీ గూడ ఈ విధంగా ఆలోచించాయి: ''ఈ యోగ్యుడు బ్రహ్మ అయి ఉండాలి. పర బ్రహ్మ అయి ఉండాలి. సర్వ దృష్ట, విజేత, విధాత, ప్రభువు, కర్త, సృష్టికర్త, ముఖ్యుడు, తనకు తా యజమాని, ఉన్నవాటికి, ఉండబోయే వాటికి తండ్రి అయి ఉండాలి.'

''అదలా ఉండగా, శిష్యులారా మొదట పుట్టిన ఆజీవి దీర్ఘాయువు, అతి సుందరుడు, శక్తిమంతుడు అయి, అతని తరవాత పుట్టిన వారు అల్పాయుష్కులు, అల్ప సుందరులు అల్ప శక్తి మంతులు అవుతారు. మరో ఇతర జీవి ఆ స్థితినుంచి మరణించి ఈస్థితికి (భూమిమీద) రావడం జరగ వచ్చు. అలా వచ్చిన తరవాత, కుటుంబ జీవితం నుంచి కుటుంబ రహిత జీవితానికి మరల వచ్చు. ఈ రకంగా పరిత్యాగం వరకూ వచ్చిన తరవాత, ఉత్సాహం, ప్రయత్నం, అర్పణ, మనస్ఫూర్తి, పరిపూర్ణ ప్రజ్ఞలతో పూర్తిగా లీనమైన ఏకాగ్రతను చేర వచ్చు. అక్కడ హర్షోన్మత్త మనస్సుతో పూర్వ నివాస స్థానాన్ని మనస్సుకు తెచ్చు కొంటాడు గాని అంతకు ముందు గతించిన దానిని కాదు. అతడు ఇలా అంటాడు: 'ఆ పూజనీయ బ్రహ్మ, విజేత, సర్వద్రష్ట విధాత, ప్రభువు, కర్త, సృష్టికర్త, ముఖ్యుడు, విధాత, నిర్దేశకుడు, నా ప్రభువు, ఉన్నవాటికి ఉండబోయే వాటికి తండ్రి, మనం ఎవరి చేత అయితే సృజింప బడ్డామో అతడు శాశ్వతుడు, స్థిరుడు, నిత్యుడు, అపరివర్తనుడు, అతడు ఎప్పటికీ మరెప్పటికీ నిలిచి ఉంటాడు. ఆ బ్రహ్మ చేత సృష్టించబడిన మనం ఇక్కడ అశాశ్వతులం, అనిత్యులం, అస్థిరులం, అల్పాయుష్కులంగా, మరణించాలని నిర్దేశితుల మయ్యాం'.

'' ఈ విధంగా సర్వజీవుల 'ఆది' నిశ్చితమైంది. దీనిని మీరు సాంప్రదాయికసిద్ధాంతమని చెప్పు కొంటారు. అంటే అంతా ఒక అధిపతిచే, బ్రహ్మచే సృష్టింపబడిందని చెబుతారు.''

భూరిదత్త జాతకో (నెం.543)లో బోధిసత్త్వుడు సృష్టికర్త దివ్యన్యాయాన్ని గురించి ప్రశ్నిస్తాడు.

''కన్నులున్న వాడెవడైన జుగుప్సాకర దృశ్యాన్ని చూడగలడు,
మరి బ్రహ్మ తన సృష్టిని ఎందుకు సరిగా ఉంచడు?
అతని శక్తికి హద్దులే లేక పోతే,
మరి అతడు ఎందుకు అంత అరుదుగా దీవన లిస్తాడు?
అతడు సృజించిన జీవులన్నీ ఎందుకు బాధలకు గురవుతాయి?
అందరికి ఎందుకు సుఖాన్ని ఇవ్వడు?
ఎందుకు ఈ మోసం, అబద్దం, అవిద్యలు ఉన్నాయి?

ఎందుకు అన్ృతం జయిస్తుంది, సత్యం, న్యాయం ఓటమి పాలవుతాయి?
నేను మీ బ్రహ్మను అన్యాయులలో ఒకనిగా జమకడతాను
అతడు అధర్మాశ్రయ ప్రపంచాన్ని నిర్మించాడు''

ప్రతిదానిని పరమాత్మ సృష్టించాడనే సిద్ధాంతాన్ని తోసి వేస్తూ, మహా బోధిజాతక్ (నెం.528)లో బోధిసత్త్వుడు అంటాడు:

''ప్రతి జీవిలోను సుఖాన్ని లేదా దుఃఖాన్ని, మంచి లేదా చెడ్డ కర్మను నింపగల సత్తా ఉన్న సర్వశక్తి మంతుడైన ఒక ప్రభువు ఉంటే, అతడు పాప కళంకితుడు. మనిషి గమిస్తూ ఉంటాడు, అయినా తన సంకల్పం ప్రకారం.

**పాదసూచికలు :**

1. *అంగుత్తర నికాయ*, 1, P.174 *Gradual Sayings,* 1.P.158
2. *మజ్జిమ నికాయ*, 11, 101, P. 222.
3. *దీఘ నికాయ*, 1,11, P. 221
4. *దీఘ నికాయ*, 111, 24, P. 29; Dialogues of the Buddha, 111, PP.26,27.
5. *జాతక కథలు*, VI, P.110
6. *Ibid,* v,P. 122

ఇరవై నాలుగో ప్రకరణం

# పునర్జన్మ విశ్వాసానికి హేతువులు

*''గత జన్మలలోని నా బహువిధ భాగ్యాన్ని గుర్తుతెచ్చుకొన్నాను''*

- మజ్ఞిమనికాయ

**మనం పునర్జన్మను నమ్మేదెలా?**

పునర్జన్మ మీద సాధికారికంగా చెప్పగలిగిన వారిలో మనకుంది బుద్ధుడు ఒక్కడే. జ్ఞానోదయమైన మొదటి రాత్రే, మొదటి జాములో, బుద్ధుడు ప్రతీప సంజ్ఞానాత్మక జ్ఞానాన్ని (retro - cognitive knowledge) పెంపొందించు కొన్నాడు. దానివల్ల ఆయన తన గత జన్మలను చూడ గలిగాడు.

''నా గతజన్మల బహువిధ అదృష్టం ఇలా ఉంది: మొదట ఒక జీవితం, ఆ తరవాత రెండు జీవితాలు, ఆ తరవాత మూడు, నాలుగు, ఐదు, పది, ఆ తరవాత ఇరవై నుంచి ఏభైదాకా, ఆ తరవాత వంద, వేయి, నూరువేలు తరవాత ఇంకా ఇంకా.''

రెండవ యామంలో బుద్ధుడు, తన యోగ దృష్టితో, ఒక అస్తిత్వ దశలో అంతర్హితమై, మరో అస్తిత్వదశలో పునర్దర్శన మిస్తున్న జీవులను పరికించాడు. వాటి వాటి కర్మల (deeds)ననుసరించి, గతిస్తున్న నీచ, ఉన్నత, సుందర, అందవికార, సుఖ, దుఃఖ జీవులను అతడు చూశాడు.''[1]

పునర్జన్మ గురించి బుద్ధుడు ప్రప్రథమంగా పలికిన పలుకులివి. గ్రంథాలలో ఉన్న విషయాలను బట్టి, ఈ పునర్జన్మ కఠోర సత్యాన్ని బుద్ధుడు, అంతకు ముందున్న ఏ మూలా న్నుంచి గ్రహించ లేదని, తన స్వంత వ్యక్తిక ఆర్జిత జ్ఞానంతోనే దర్శించాడని ఋజువు అవుతున్నది. ఆ జ్ఞానం అసాధారణం, తాను స్వయంగా పెంపొందించు కొన్నది, కావాలంటే దానిని ఎవరికి వారు పెంపొందించుకో గలిగినది.[2]

తన మొదటి జయధ్యానంలో బుద్ధుడు అంటాడు:

''ఈ గేహ నిర్మాతను వెతుక్కొంటూ, నేను ఎన్నో జన్మల తిరిగాను. మరల మరల పుట్టడం నిజంగా దుఃఖ భాజకం''[3]

తన ప్రథమ ఉపన్యాసమైన ధమ్మచక్క సుత్తలో రెండో ఆర్య సత్యం మీద మాటాడుతూ, బుద్ధుడు అంటాడు: ''ఈ తృష్ణయే పునర్జన్మకు దారితీస్తుంది.'' ఈ ఉపన్యాసాన్ని బుద్ధుడు ఈ పలుకులతో ముగిస్తాడు: ''ఇది నా చివరిజన్మ. ఇంక నాకు పునర్జన్మ లేదు.''

తన ధమ్మాన్ని బోధించాలనే నిర్ణయం తీసు కోవడానికి ముందు, బుద్ధుడు జీవుల యెడ అనుకంపతో, 'బుద్ధ – దర్శనం'తో ప్రపంచాన్ని సర్వేక్షించి నప్పుడు, జీవులు భయంతో దుఃఖాన్ని, ఆవలిప్రపంచాన్ని చూసి నట్లుగా ఆయన కనుగొన్నాడని మజ్జిమనికాయ చెబుతున్నది.

చెడు చేసిన జీవులు మరణం తరవాత దుఃఖ భాగులుగా జన్మించారని, మంచి పనులు చేసిన జీవులు మరణం తరవాత ఆనందమయ జన్మ ఎత్తారని, బుద్ధుడు తన అనేక ఉపన్యాసాలలో స్పష్టం చేశాడు.

జాతక కథలు చాల ఆసక్తికరంగా ఉంటాయి. అవి బుద్ధుని గత జన్మల గురించి చెబుతాయి. అవి నైతికంగా చాల ముఖ్యమైనవి. ఇవి కాక మజ్జిమనికాయ, అంగుత్తరనికాయ అడప దడప, బుద్ధుని కొన్ని గతజన్మల గురించి ప్రాసంగికంగా చెబుతాయి.

తనకు అవ్యవహితంగా పూర్వికుడైన బుద్ధుకశ్యప కాలంలో తను జోతిపాలుడుగా పుట్టానని, గారవనీయ ఆనందునికి బుద్ధుడు చెప్పినట్లుగా ఘటీకారసుత్త్ చెబుతున్నది. అనాథ పిండిక దేవగా పునర్జన్మ ఎత్తిన వెంటనే ఒక రాత్రి అతడు బుద్ధుని దగ్గరకు వెళ్ళినట్లు అనాథ పిండికోవాదసుత్త్ వర్ణిస్తున్నది. చక్రాలు (రథాల) బాగుచేసే పచెతనునిగా పుట్టిన ఒక గత జన్మను ఉద్దేశించి బుద్ధుడు మాటాడినట్లు అంగుత్తర నికాయ[7]లో ఉంది. తనకు పూర్వం ఉన్న కొందరు బుద్ధులను గురించి బుద్ధుడు పేర్కొన్నట్లు సంయుత్తనికాయలో ఉంది.

మరణించిన వారి గురించి సూటిగా చేసిన అసాధారణ సూచన పరినిబ్బాన సుత్తలో ఉంది. ఒక ప్రత్యేక గ్రామంలో చని పోయిన అనేక మంది భావి జన్మ ఎలా ఉంటుందో బుద్ధుని నుంచి తెలుసుకో గోరాడు గౌరవనీయ ఆనందుడు. బుద్ధుడు ఓపిగ్గా వారి విధిని వర్ణించాడు.

పునర్జన్మ సిద్ధాంతం రుజువు చేయబడగల సిద్ధాంతమని[8] బుద్ధుడు చెప్పా డనడానికి త్రిపిటక నుంచి అనేక ఉదాహరణలను ఎత్తి చూప వచ్చు.

బుద్ధుని ఉపదేశం మేర, ఆయన శిష్యులు గూడ 'ప్రతీప – సంజ్ఞానాన్ని' (retro - coqnitive) పెంపొందించు కొన్నారు. పరిమితంగానే అయినా, తమ అనేక గతజన్మలను వారు చూశారు. ఈ పరంగా బుద్ధుని శక్తి అనంతం.

బుద్ధునికి ముందు గూడ, కొందరు భారతీయ ఋషులు దూర శ్రవణం, దూర దర్శనం, అతీంద్రియ భావ ప్రసారం, అతీంద్రియ సంస్పర్శ లలాంటి అసాధారణ శక్తులను కలిగి ఉన్నారు.

ఈ అసాధారణ శక్తులను విజ్ఞాన శాస్త్రం పరిగణన లోకి తీసుకోక పోయినా, బౌద్ధం ప్రకారం, బాగా ఏకాగ్ర చిత్తాన్ని అలవరచు కొన్న కొందరు, ఈ మానసిక శక్తులను ఆర్జించి, తమ గత జన్మలను, ఈ జన్మలోని గత సంఘటనలను గుర్తుకు తెచ్చు కొన్నట్లుగా, దర్శించ గలిగారు. ఆ శక్తుల సాహాయ్యంతో, పంచజ్ఞానేంద్రియాలను వాడ కుండ, ఆలోచనలను ఒక చోట నుంచి మరో చోటుకు ప్రసారం చేయడం, ప్రత్యక్షంగా ఇతర ప్రపంచాలను దర్శించడం సాధ్యమైంది.

కొంతమంది అసాధారణ మనుషులు, ముఖ్యంగా వారు బాలురుగా ఉన్నప్పుడు, సంసర్గనియమాల ద్వారా, అయత్నంగా, గత జన్మలను జ్ఞాపకం చేసు కోవడం ఉంది.[10] ట్రాయ్ ముట్టడికాలంలో, తన పూర్వజన్మలో, ఒక గ్రీకు దేవాలయం నుంచి, ఒక పతాకాన్ని, తాను మోసుకు పోయి నట్లు, స్పష్టంగా పైథాగరస్ గుర్తు తెచ్చు కొన్నాడని చెప్ప బడింది.[11]'' ఎలాగో మరి ఈ అద్భుత బాలురు తమ జ్ఞాపక శక్తిని తరవాత కోల్పోతున్నారు. బాల మేధావుల విషయం గూడ ఇలాగే ఉంది.

ఆధునిక అసాధారణ మానసికుల (Psychics) నమ్మదగిన అనుభవాలు, ప్రేత దృగ్విషయం, ఆత్మల (spirits) భావ ప్రసారం, అపూర్వ వైకల్పికా బహుళ మూర్తి మత్వాలు (Multiple Personalities) —ఇవన్నీ గూడ పునర్జన్మ సమస్య మీద కొంత వెలుగును ప్రసరిస్తాయి.

వంగీస అనే ఒక బ్రాహ్మణుని ఆసక్తికరమైన గాథను థేరగాథా చెబుతుంది. ఆగాథ ప్రకారం, ''అతడు పుర్రెల మీద వేళ్ళ గోరులతో తట్టి ఆ పుర్రెలు గలిగిన వారు ఎక్కడ పునర్జన్మ ఎత్తారో చెప్పే వాడట. ఈ విధంగా అతడు గురువుగా ప్రసిద్ధు డయ్యాడు.''

ఒక ప్రత్యేక జన్మలోనే ఒకడు వేరు వేరు మూర్తిమత్వాలను ప్రదర్శించవచ్చు. ఆచార్య జేమ్స్, తన *Principles of Psychology* లో ఇటువంటి అద్భుతమైన సంఘటనలను పేర్కొన్నాడు. (See F.W.H. Myers, *Human Personality and its Survival of Bodily Death*). ఒకదైవం ఒక ఉపాసకుని శరీరంలోకి ప్రవేశించిన ఆసక్తికరమైన సంఘటనను విశుద్ధి మగ్గ పేర్కొంటున్నది. (see *The Path of Purity,* 1.p.48).

అదృశ్య వ్యక్తులు తమ ఆలోచనలను ప్రసారం చేయ డానికి సాధనాలుగా నియోగితులైన వారిని ఈ రచయిత కలుసు కొన్నాడు. దెయ్యాలు పట్టిన వారిని గూడ ఇతడు చూశాడు. ఈ సమ్మోహ నిద్రావస్థలో (Hypnotic State) ఉండగా వాళ్ళు, మామూలుగా తమకు తెలియని అనేక విషయాలను, ఆస్థితి, నుంచి బయట పడిన తరవాత గుర్తుతెచ్చుకోలేని అనేక విషయాలను చెబుతారు.

కొంతమంది సమ్మోహ నిద్రావస్థలో తమ గత జన్మల అనుభవాలను చెప్ప గలుగుతారు. (అమెరికాకు చెందిన) ఎడ్గార్ కేసీ లాంటి వాళ్ళు ఇతరుల గత జన్మల గురించి చెప్పడమే కాక, జబ్బులను గూడ నయం చేశారు.[12]

గౌణమూర్తి మత్స్యాలను, గత వ్యక్తిక అనుభవాల ద్వారాగాని, ''అదృష్టశక్తి ఆవేశం దనడం'' ద్వారాగాని వివరించాల్సి ఉంటుంది. మొదటి వివరణ ఎక్కువ హేతుబద్ధంగా ఉంది. అయినా రెండోదానిని పూర్తిగా నిరాకరించ లేము.

మనం తరచు ఎంతోమందిని చూస్తుంటాం. వారిలో కొందరిని మనం ఎప్పుడు కలిసి ఉండం. కాని వారిని ఎక్కడో చూసిన అనుభూతి కలుగుతుంది. అలాగే కొన్ని ప్రదేశాలను సందర్శించి నప్పుడు, వాటిని ఎప్పుడూ చూసి ఉండకపోయినా, ఎప్పుడో చూసిన అనుభూతి కలుగు తుంది.

అటువంటి సంఘటనలను చూసి, సర్ వాల్టర్ స్కాట్ ' ఆత్మవలస' (Metempsychosis) అనుకొన్నాడు. స్కాట్ దినచర్య గ్రంథంలో ఒక పేజీ నుంచి ఈ దిగువ విషయాన్ని, అతని 'జీవితకథ' రాసిన లోఖార్ట్ ఉటంకించాడు.

''ఈ విషయం రాయ దగిందో కాదో నేను చెప్పలేను. నిన్న భోజన సమయంలో, నన్నొక అనుభూతి వెంటాడింది. దానిని నేను ప్రాక్ అస్తిత్వ (Pre-existence) జ్ఞానం అంటాను. అదేమిటంటే, అక్కడ జరిగిం దేదీ మొదటి సారిగా జరిగింది కాదని, కొత్తది కాదని, గత విషయాలే మళ్ళీ నిన్న చర్చితా లయ్యాయనీ, గతాభిప్రాయాలే మళ్ళీ వెళ్ళడయ్యాయనీ ఒక అస్పష్ట భావన కలిగింది. ఆ భావన ఎంత బలంగా ఉందంటే, అదేదో ఎడారిలో ఎండ మావిలా, ఓడలో ప్రయాణించే టప్పుడు కలిగే చిత్త భ్రమలా అనిపించింది.''

బుల్వర్ లిటన్ ఈ మార్మిక అనుభవాలను ఇలా వర్ణించాడు: ''అవొక అపూర్వ అంతరంగ ఆధ్యాత్మిక జ్ఞాపకాలు. ఇవి మనం ఎప్పుడూ చూచి ఉండని వ్యక్తులను, ప్రదేశాలను జ్ఞప్తికి తెస్తాయి. వీటిని అసంతృప్తి, కోర్కెలు తీరని గతజన్మ చేతనగా ప్లేటో వాదులు చెబుతారు'' (H.M. Kitchener, The Theory of Reincarnation, p.7)

గత జన్మల జ్ఞాపక శకలాలను గుర్తు చేసు కొన్న కొందరు వ్యక్తులను ఈ రచయిత కలిశాడు. అందులో ఒక విశిష్ట ఐరోపా డాక్టరు గూడ ఉన్నాడు. ఇతడైతే ప్రజలను సమ్మోహ నిద్రలోకి పంపి వారి గత జన్మల విశేషాలను వర్ణింప జేశాడు.

ధమ్మపద వ్యాఖ్యానం ఒక భార్యాభర్తల కథచెప్పింది. వారు బుద్ధుని చూడగానే పాదాభివందనం చేసి ఇలా అన్నారు: ''ప్రియపుత్రా, ముసలి వారైన తలిదండ్రులను కనిపెట్టి ఉండే బాధ్యత బిడ్డలకు లేదా? మరి ఇంతకాలంగా నీవు మాకు ఎందుకు కనిపించ లేదు? ఇప్పుడే నిన్ను మొదటి సారిగా చూస్తున్నాము.''

ఆకస్మికంగా పొంగి పొరలిన ఈ మాతా పితల ప్రేమకు కారణం, వారు గత జన్మలలో అనేక పర్యాయాలు తనకు తలిదండ్రులు కావడ మేనని చెప్పి, ఇలా అన్నాడు బుద్ధుడు:

''గత సంసర్గం లేదా ప్రస్తుత ఆనుకూల్య పరిస్థితుల వల్లగాని
పాతప్రేమ, నీటిలోని పద్మంలా ఎగుస్తుంది''[13]

ఈ ప్రపంచంలో బుద్ధుని లాంటి పరిపూర్ణులు, బాగా సుసంపన్నమైన మూర్తిమత్వాలు (personalities) ఆవిర్భవిస్తారు. వారు ఆకస్మికంగా, ఒక్కసారిగా, అలా పుట్టగలరా? వారు ఒక జన్మ ( ఒకే అస్తిత్వంలో = Single existence) లోనే అంతటి వారు కాగలరా?

కన్ఫ్యూషియస్, పాణిని, బుద్ధఘోష, హోమర్, ప్లేటో లాంటి మహామహులు, కాళిదాసు, షేక్స్‌పియర్‌ల లాంటి మహారచయితలు, రామానుజన్, పాస్కల్, మొజార్ట్, బీథోవెన్‌లాంటి అద్భుత బాలమేధావులు ఇంకెందరో గొప్పవారు. వారికి ఈ గొప్పతనం ఎలా వచ్చిందో మనం ఎలా వివరించాలి?

గతజన్మలలో అటువంటి అనుభవాలను పొంది, ఉన్నత జీవితాలను అనుభవించక పోతే ఇదెలా సాధ్యం? కేవలం అదృష్టం వల్ల వారు అటువంటి తలిదండ్రులకు పుట్టడం, అటువంటి అనుకూల పరిస్థితులలో ఉండడం జరిగిందా?

బాల మేధావులు శాస్త్రజ్ఞులకు సమస్యే అయ్యారు. బాల మేధోతనానికి కారణాన్ని కొందరు వైద్య శాస్త్రజ్ఞులు పిట్యూటరి, పీనియల్, ఎడ్రినల్ గ్రంథుల అసాధారణ ప్రభావంలో చూస్తున్నారు. ఈ గ్రంథులు కొందరిలో ఇలా అసాధారణంగా ప్రవర్తించడానికి గతజన్మ కర్మ గూడ కారణం కావచ్చు. కేవలం గ్రంథుల అసాధారణ ప్రవర్తనే కారణమైతే, పుట్టిన కొద్ది గంటలలోనే, ఒక క్రైస్తవ హైనెకెన్ ఎలా మాటాడ గలిగాడు? సంవత్సరం దాటకముందే బైబిల్ పుటలకు పుటలు ఎలా అప్ప చెప్ప గలిగాడు? రెండు సంవత్సరాల వయస్సులో భూగోళానికి సంబంధించిన ఏ ప్రశ్ననైనా ఎలా చెప్ప గలిగాడు? మూడు సంవత్సరాలకే

ఇరవై ఆరో ప్రకరణం

# జనన మరణాల రీతులు

మంద మతులు మళ్ళీ మళ్ళీ పునర్జన్మను కోరతారు
మళ్ళీ మళ్ళీ చావు పుట్టుకలు వస్తాయి
మనుషులు మనలను మళ్ళీ మళ్ళీ శ్మశానానికి మోసుకెళతారు

- సంయుత్త నికాయ

పునర్జన్మ ప్రక్రియను ప్రతీత్య సముత్పాదం సూక్ష్మ సాంకేతిక పదాలలో వర్ణించి, మరణం ఈ క్రింది నాలుగు కారణాల వల్ల సంభవిస్తుందని చెబుతుంది:

1. పునరుత్పత్తి కమ్మశక్తి (కమ్మ క్ఖాయ) ఖర్చయిపోవడం

బ్రతికి ఉన్నప్పుడు బలంగా ఉన్న ఆలోచన, సంస్కారం, లేదా వాంఛ మరణ సమయంలో ప్రబలమై, తరువాతి జన్మను నిబద్ధిస్తుందని బౌద్ధుల నమ్మకం. ఈ అంతిమ ఆలోచనా ప్రక్రియలో ఒక ప్రత్యేక బీజం ఉంది. ఈ పునరుత్పత్తి కర్మ బీజ శక్తి ఖర్చయి నప్పుడు, జీవశక్తి నిబిడీకృతమై ఉన్న భౌతిక శరీర సేంద్రియ చర్యలు, ఒక ప్రత్యేక స్థలంలో, జీవిత ప్రమాణం అంతమయ్యే లోపల అంతర్హిత మవుతాయి. ఇది తరుచుగ అపాయకర (దుఃఖ) పరిస్థితులలో పుట్టిన వారికి సంభవిస్తుంది. కాని ఇది ఇతర ఆయతనాలలో గూడ జరుగుతుంది.

2. వేరు వేరు ఆయతనాలలో మారే ఆయుః ప్రమాణ (ఆయుక్ఖాయ) సమాప్తి

వృద్ధాప్యం వల్ల మామూలుగా సంభవించే మరణాలు దీని క్రిందికి వస్తాయి.

అనేక వయో పరిమితులతో గూడిన అనేక అస్తిత్వ భూమిక లున్నాయి. కమ్మ శక్తితో సంబంధం లేకుండ, ఎవరైన, తప్పక, గరిష్ట వయో పరిమితిని చేరి నప్పుడు మరణించ వలసిందే. పునరుత్పత్తి కమ్మశక్తి అత్యంత బలంగా ఉన్నప్పుడు, అదే భూమికలో కమ్మశక్తి తిరిగి పదార్థీకరణం చెందుతుంది లేదా దేవతల విషయంలోలాగ, మరో ఉన్నత భూమికలో పదార్థీకరణం చెందుతుంది.

3. పునరుత్పత్తి కమ్మశక్తి, జీవిత కాల సమాప్తి - ఈరెండు ఏక కాలమందే శోషిస్తాయి (ఉభయక్ఖాయ).

''ఈ విసగటు గలిగించే అవిద్యా చక్రంలో (ఎక్కడెక్కడో) లెక్కలేనన్ని జనన మరణా లుంటాయి.''

''కాని జ్ఞానికోసం అనంతరత అనేది వేచి ఉండదు.''[8]

**పాదసూచికలు :**

1. తబ్భావభావీభావాకారమత్త – అభిధమ్మ సంగహ. Seet Narada Thera, *Manual of Abhidhamma*, P.360.
2. సుత్త నిపాత, P. 730
3. సంఖార 14
4. ''పబ్బస్సరమ్ ఇదమ్ చిత్తమ్'' "Radiant is this consciousness" అంటాడు బుద్ధుడు అంగుత్తర నికాయంలో 1P.10. వ్యాఖ్యాత ప్రకారం బుద్ధుడు ఈ విధంగా 'పునర్జన్మ విజ్ఞానాన్ని' వర్ణించాడు.
5. ''కారణ రహిత ఫలాల'' విషయంలో (అహేతు- విపాక)
6. ''కారణ సహిత ఫలితాల'' విషయంలో (సహేతుక -విపాక)
7. సంయుత్త నికాయ, 11, P.70, *Kindred sayings*, 11, P.50
8. Chalmers *"Buddha's Teachings"* vv. 729,730.

ప్రతీత్య సముత్పాదం

**"Dependent origination"**



మనస్సు పదార్థాల నాశంతో, షడింద్రియ ఆయతనాలు

షడింద్రియ ఆయతనాల నాశంతో సంస్పర్శ

సంస్పర్శ నాశంతో వేదన నాశం

వేదన నాశంతో తృష్ణ నాశం

తృష్ణ నాశంతో గ్రహణ వాశం

గ్రహణ నాశంతో కర్మల నాశం

కర్మల నాశంతో జన్మనాశం సంభవిస్తాయి.

జన్మ రాహిత్యంతో జరా, మరణ, దుఃఖ, విలాప, భాధ, రోదన, నిస్పృహలు రహితమవుతాయి.

ఈవిధంగా మొత్తం దుఃఖ స్కంధం రహితమవుతుంది.

ఈ పన్నెండు కారకాలలో మొదటిరెండు గతానికి సంబంధించినవి, మధ్య ఎనిమిది వర్తమానానికి , చివరి రెండు భవిష్యత్తుకు సంబంధించినవి.

వాటిల్లో నైతిక, అనైతిక చర్యలను (సంఖారాలు), కర్మ (భవ)లను కర్మ (కమ్మ) అంటారు. అవిద్య, తృష్ణ, ఉపాదానలను రాగాలు లేదా క్లేశాలు అంటారు. పునస్పంధించే విజ్ఞానం (పతిసంధివిఞ్ఞాణం) నామరూపాలు (మనస్సు దేహాలు) షడాయతనాలు (సళాయతన), సంస్పర్శ (ఫస్స వేదన (feeling), జాతి (జననం), జరామరణాలను ఫలితాలని (విపాక) అంటారు.

ఈ విధంగా అవిద్య, సంఖారాలు, తృష్ణ, ఉపాదాన, కమ్మ, గతంకు చెందిన ఐదు కారణాలు, ప్రస్తుతానికి చెందిన ఐదు ఫలాలను, అంటే పతి సంధి విజ్ఞానం, మనస్సు, పదార్థం, షడాయతనాలు, సంస్పర్శ, వేదనలను నిబద్ధిస్తాయి. అదేవిధంగా తృష్ణ, గ్రహణం, కమ్మ, అవిద్య, ప్రస్తుత సంఖారాలు భవిష్యత్తుకు చెందిన ఐదు ఫలాలను విబద్ధిస్తాయి. ఈ కార్యకారణ సంబంధం అనంతంగా కొనసాగుతుంది. ఈ ప్రక్రియకు ఆదిని నిర్ణయించడం అసంభవం. ఎందుకంటే, ఈ జీవిత ప్రవాహం అవిద్యా పరివేష్టితం కాని ఒక దశను ఊహించడం కష్టం. కాని ఈ అవిద్య స్థానంలో జ్ఞానం ప్రవేశించినప్పుడు, జీవిత ప్రవాహం నిబ్బాణ ధాతువును (నిర్వాణ ధాతువును) యధార్థీకరణం చెందించు కొన్నప్పుడు మాత్రమే పునర్జన్మ ప్రక్రియ అంత మవుతుంది.

జన్మ నుంచి జరా, మరణం, దుఃఖం, విలాపం,-బాధ, రోదనం, నిస్పృహలు.

ఈ విధంగా మొత్త దుఃఖ స్కంధం రూపొందుతుంది.

అవిద్య పూర్తి నాశంతో ఔపాధిక కర్మలు

ఔపాధిక కర్మల నాశంతో పునస్సంధి విజ్ఞానం

పునస్సంధి విజ్ఞాన నాశంతో మనస్సు,-పదార్థాల నాశం

**భవచక్రం**



జననాన్ని ఖచ్చితంగా చెప్పాలంటే. మానసిక - దైహిక దృగ్విషయం రూపొందడం, (ఖంధానం పాతుభావొ).

జరామరణాలు పుట్టుక వలన వచ్చే అనివార్య ఫలితాలు.

ఒక కారణం వలన ఫలితం సంభవిస్తే, ఆ కారణం లేకుండా పోతే ఆ ఫలితం గూడ లేకుండా పోవాలి.

ప్రతీత్య సముత్పాదాన్ని వ్యతిరేక క్రమంలో చెబితే విషయం స్పష్టమవుతుంది.

జరామరణాలనేవి 'మానసిక – దైహిక' జీవిలో, జీవితో మాత్రమే, అంటే షడింద్రియ యంత్రంతో, యంత్రంలో మాత్రమే సంభవం. అటువంటి జీవి (యంత్రం) పుట్టాలి. పుట్టాలంటే పూర్వభావనగా దానికి జన్మ ఉంటుంది. కాని గత జన్మ కర్మకు అనివార్యఫలం జననం. ఈ గత కర్మను తృష్ణ కారణంగా జరిగిన గ్రహణం నిశ్చయిస్తుంది. అటువంటి తృష్ణ వేదన కలిగి నప్పుడు కనిపిస్తుంది. వేదన అనేది వస్తువుల ఇంద్రియాల సన్నికర్ష నుంచి జనిస్తుంది.

దీనికి పూర్వ భావనగా, అందుకని, ఇంద్రియాలుండాలి. ఇవి మనస్సు దేహం లేకుండ ఉండ లేవు. వస్తువులను యథా తథంగా చూడ లేని అవిద్య కారణంగా చేసిన కర్మలతో నిబద్ధమైన పునర్జన్మ విజ్ఞానం నుంచి మనస్సు జనిస్తుంది.

మొత్తం ప్రతీత్య సముత్పాద సూత్రాన్ని ఇలా చెప్పవచ్చు :

అవిద్య ఆధారంగా సంఖార చర్యలు (కర్మలు) ఏర్పడతాయి. ట

సంఖార కర్మల నుంచి పునస్సంధి విజ్ఞానం

సంఖార విజ్ఞానం నుంచి మనస్సు, పదార్థం,

మనస్సు, పదార్థాల నుంచి షడాయతనాలు

షడాయతనాల నుంచి సంస్పర్శ

సంస్పర్శ నుంచి వేదన

వేదన నుంచి తృష్ణ

తృష్ణ నుంచి ఉపాదాన (గ్రహణం)

ఉపాదాన నుంచి చర్యలు (కమ్మభవం)

చర్యల నుంచి జన్మ

రూప, రసం లాంటి ఆరు ఇంద్రియ వస్తువులకు సదృశమైన ఆరు రకాల తృష్ణలు ఉన్నాయి. వాటిని బాహ్య, అంతరాలుగ విభజించి నప్పుడు అవి పన్నెండు అవుతాయి. భూత, వర్తమాన, భవిష్యత్సం బంధాలుగా వాటిని లెక్కించి నప్పుడు అవి ముప్పై ఆరు అవుతాయి. వీటిని ఇంతకు ముందు చెప్పిన మూడు రకాల తృష్ణతో గుణిస్తే అవి మొత్తం 108 అవుతాయి.

విషయాసక్తునికి ఇంద్రియ సుఖాల పట్ల తృష్ణ పెంచకోవడం సహజం. ఇంద్రియ వాంఛలను జయించడం దుస్తరం. భవచక్రంలో అత్యంత ముఖ్యమైన కారకాలు అవిద్య, తృష్ణలు. ప్రతీత్య సముత్పాదానికి ముఖ్యకారణాలు. ప్రస్తుతాన్ని నియంత్రించే గత కారణంగా అవిద్యను చెబుతారు. భవిష్యత్తును నిర్ణయించే ప్రస్తుత కారణం తృష్ణ అంటారు.

తృష్ణ మీద ఆధారపడినది గ్రహణం (ఉపాదన). ఇది అతితీవ్ర తృష్ణ. తణ్ణ అనేది చీకట్లో వస్తువును దొంగిలించే వెదుకులాట. ఉపాదాన వాస్తవంగా వస్తువును దొంగిలించడం లాంటిది. రాగం దోషం – రెండింటివల్ల గ్రహణం (ఉపాదాన) జనిస్తుంది. 'నేను', 'నాది' అనే తప్పుడు అభిప్రాయాలను ఇది కలిగిస్తుంది.

గ్రహణం నాలుగు విధాలు. అవి: ఇంద్రియాసక్తి, మిధ్యాదృష్టి, కర్మకాండకు అంటి పెట్టుకోవడం, ఆత్మ సిద్ధాంతం.

చివరి రెండింటిని మిధ్యాదృష్టులుగా పరిగణిస్తారు.

గ్రహణం ఆధారంగా 'భవం' జనిస్తుంది. దీని శబ్దార్థం పరిణమించడం. దీనిని నైతిక, అనైతిక చర్యల ద్వారా వివరిస్తారు. ఈ చర్యలు కమ్మ యొక్క, వేరు వేరు అస్తిత్వ ఆయతనాల యొక్క, అంటే 'కమ్మభవ' యొక్క ' ఉపపత్తిభవ' యొక్క నిర్మాణాంశాలు. కమ్మ భవం అంటే, పరిణామ ప్రక్రియ. వేరు వేరు అస్తిత్వ ఆయతనాలు (ఉపపత్తి భవ) అంటే నిష్క్రియాత్మక పరిణామ ప్రక్రియ. సంఖారకు, కమ్మభవానికి ఉన్న సూక్ష్మభేదం ఏమిటంటే, మొదటిది గతానికి చెందుతుంది, రెండోది ప్రకృత జీవితానికి సంబంధించింది. రెండింటికీ అర్థం కర్మ చర్యలనే (Kammic activities). కమ్మభవం మాత్రమే భావి జన్మను నిబద్ధిస్తుంది.

భవం ఆధారంగా తరువాతి జన్మ (జాతి) వస్తుంది.

ఖచ్చితంగా చెప్పాలంటే, ఒక వస్తువు ఇంద్రియాలతో స్పర్శలోకి వచ్చినప్పుడు అనుభవించేలోకి వచ్చేది వేదన. ఈ జీవితంలోగాని, గతజీవితంలో గాని చేసిన కర్మల వాంఛనీయ లేదా అవాంఛనీయ ఫలాన్ని అనుభవించేది ఈ వేదనయే. ఈ కర్మ ఫలాన్ని అనుభవించ డానికి ఈ మానసిక స్థితి కంటే వేరే భిన్నమైన ఆత్మగాని, ఏజెంట్‌గాని, మరేది గాని లేదు.

వేదనను కొంతమంది ఇంద్రియజ్ఞానం (Sensation)గా చెబుతారు. ఇది అన్ని రకాల విజ్ఞానానికి సామాన్య స్థితి. ముఖ్యంగా మూడు రకాల వేదన లున్నాయి. అవి: సుఖకర (సౌమనస్స), అసుఖకర (దౌమనస్స) తటస్థ (అదుఃఖమసుఖ). శారీరక దుఃఖ, శారీరక సుఖాలతో కలుపుకొని మొత్తం మీద ఐదు రకాల వేదనలున్నాయి. తటస్థ వేదనను ' ఉపేక్ష' అంటారు. దీనిని ఔదాసీన్యమని, సమచిత్తమని గూడ అంటారు.

అభిధమ్మం ప్రకారం, బాధతో పాటు ఉండేది ఒకరకం విజ్ఞానం మాత్రమే. అలాగే సుఖంతో పాటుగా ఉండేదీ ఒకే ఒకరకం విజ్ఞానం. రెండు రకాల విజ్ఞానం అసంతోషకర వేదనతో ముడివడి ఉంటుంది. మొత్తం 89 రకాల విజ్ఞానంలో, మిగిలిన 85లో, ఒక సుఖకరమైన వేదనగాని, ఒక తటస్థ వేదన గాని ఉంటాయి.

నిర్వాణానందం మాత్రం ఏరకమైన వేదనతో కలిసి ఉండదని అర్థం చేసుకోవాలి. నిజంగా నిర్వాణానందం అన్నింటి కంటె సంతోషకరమైంది. (నిబ్బాణం పరమమ్ సుఖం), కాని అది దుఃఖ నుంచి విముక్తి వలన కలిగిన సుఖం. అది ఏ రకమైన సంతోష కరమైన వస్తువును అనుభవించడం వలన లభించేది కాదు.

వేదన మీద ఆధారపడి తృష్ణ జనిస్తుంది. అవిద్య లాగే ఇదీ ప్రతీత్య సముత్పాదంలో మరో ముఖ్యమైన అంశం. తృష్ణ అనే ఈ పాళీ మాటకు, 'రాగ'మని, 'దాహ'మని 'వేళ్ళాడ'మని అనువదిస్తారు.

తృష్ణ మూడు విధాలు. అవి: ఇంద్రియ సుఖాల కోసం వెంపర్లాట (కామతృష్ణ), శాశ్వత వాదంతో అనుసంధించి ఉన్న ఇంద్రియ సుఖం కోసం వెంపర్లాట (భవతృష్ణ) అంటే, సుఖాలు శాశ్వతాలనే దృష్టితో వాటిని అనుభవించడం, శూన్యవాద దృక్పథంతో ఇంద్రియ సుఖాలను కోరడం (విభవతృష్ణ) అంటే, మరణం తరవాత ప్రతిదీ నశిస్తుందనే దృష్టితో సుఖాలను అనుభవించడం. చివరిది భౌతిక వాద దృక్పథం.

భవతృష్ణ, విభవతృష్ణలను రూప భవ, అరూపభవాల యెడ రాగంగా వ్యాఖ్యానించారు. మామూలుగా ఈరెండు పదాలకు భవం, అభవం (అస్తిత్వం, నాస్తిత్వం)ల కోసం తృష్ణగా చెబుతారు.

మెదడో తిన్నగా స్పష్టంగా, చెప్ప లేదు. కాని, వ్యాఖ్యాతలు బుద్ధఘోషుడు, అనురుద్ధల ప్రకారం, విజ్ఞానకేంద్రం ఖచ్చితంగా గుండెయే. బుద్ధుడు నాటి ప్రచలిత హృదయకేంద్ర సిద్ధాంతాన్ని అంగీకరించనూ లేదు, తిరస్కరించనూ లేదు.

భ్రూణ కాలంలో ఇంద్రియ భూమికలు (సళాయతనలు) క్రమంగా, ఈ మానసిక - దైహిక దృగ్విషయాల నుంచి పరిణమిస్తాయి. ఈ దృగ్విషయాలలో అనంత సంభావ్యత లుంటాయి. అప్రముఖమైన అనంతంగా చిన్నదైన ఒక బిందువు ఇప్పుడు షడింద్రియ సంశ్లిష్ట యంత్రాంగంలోకి మారుతుంది.

మానవయంత్రం ఆరంభంలో చాల సరళం, కాని అంత్యంలో చాల సంశ్లిష్టమైంది. మామూలు యంత్రాలు మొదట్లో సంక్లిష్టంగా ఉండి చివరికి సరళా లవుతాయి. ఒక చిన్న చిటికెన వ్రేలి శక్తి చాలు ఒక బృహత్యంత్రాన్ని నడప డానికి.

ఇప్పుడు షడింద్రియ మానవ యంత్రం, ఏ ఆత్మ, ఏ చాలకుడు లేకుండానే దాదాపు యాంత్రికంగా నడుస్తుంది. ఆరింద్రియాలకు - కన్ను, ముక్కు, చెవి, నాలుక, 'మనస్సు - శరీరం' (నామరూప) - వాటి వాటి వస్తువులు, ప్రకార్యాలు వాటికి ఉన్నాయి. రూపాలు, శబ్దాలు, గంధాలు, రసాలు, స్పర్శనీయ వస్తువులు - మనస్సు వస్తువులు, లాంటి ఆరింద్రియాల వస్తువులు తమ తమ ఇంద్రియాలతో సన్నికర్షలో (Contact) కి వచ్చి, ఆరు రకాల విజ్ఞానాన్ని ( ఇంద్రియ జ్ఞానాన్ని) ఇస్తాయి. ఇంద్రియ ఆయతనాల - ఇంద్రియ వస్తువుల సంయోగం, ఈ సంయోగం నించి నిష్పన్నమైన విజ్ఞానం, సంస్పర్శ (Contact) అవుతుంది. ఈ సంస్పర్శ పూర్తిగా ఆత్మికం, అవైక్తికం.

**బుద్ధుడు అంటాడు** :

''కన్నూ, రూపాల కారణంగా చక్షువిజ్ఞానం కలుగుతుంది. సంస్పర్శ మూడింటి సంయోగం. చెవి, శబ్దాల కారణంగా శ్రవణ విజ్ఞానం కలుగుతుంది. ముక్కు వాసనల కారణంగా నాసా ఇంద్రియజ్ఞానం, నాలుక, రసాలు కారణంగా జిహ్వేంద్రియ జ్ఞానం, శరీరం, వస్తువులు కారణంగా స్పర్శ ఇంద్రియజ్ఞానం, మనస్సు, మానసిక వస్తువులు కారణంగా మనో ఇంద్రియ జ్ఞానం కలుగుతాయి. ఈ మూడింటి సంయోగమే సంస్పర్శ[7]''

కేవలం ఒకదానిని ఒకటి ఢీకొనడమే సంస్పర్శ (ఫస్స) అని అర్థం చేసుకోరాదు (న సంగతి మత్తొ ఎవ ఫస్సొ)

నామరూప సమ్మేళనాన్ని, నామం (మనస్సు) వేరుగా, రూపం (పదార్థాన్ని) వేరుగా కాక నామరూపంగా (మనస్సు పదార్థాన్ని) కలిపి అర్థంచేసుకోవాలి. అరూప భూమికలలో మనస్సు మాత్రమే జనిస్తుంది. అమనస్క, (అసఙ్ఞ) భూమికలలో కేవలం పదార్థం మాత్రం, కామలోకాల్లో (Sentient), రూపలోకాల్లో మనస్సు, పదార్థం - రెండూ జనిస్తాయి.

ఇక్కడ 'నామ' అంటే వేదన, సంజ్ఞ, మానసికస్థితులు (సంఖారా) అనే మూడు స్కంధాలు. ఈ మూడు 'పునస్సంధి విజ్ఞానం' తో పాటు జనిస్తాయి. రూపం అంటే కాయ (శరీరం) భావ (లైంగికత = sex) (వత్తు) విజ్ఞానకేంద్రంల త్రికం. ఈ త్రికం గూడ, గత కర్మ ప్రభావితమైన పునస్సంధి విజ్ఞానంతో పాటు జనిస్తుంది.

శరీరశ్రేణి నాలుగు మూలాలతో ఏర్పడుతుంది. అవి: 1) వ్యాప్తి మూలకం (element of extension = పఠవి) (2) సాయుజ్యమూలకం ఆపో (3) తెజో మూలకం (4) గతి మూలకం (వాయొ), దీని నాలుగు నిష్పన్నతలు ( ఉపాదా రూప) అంటే : (5) రంగు (వణ్ణ) (6) వాసన (గంథ) (7) రుచి (రస) (8) పోషకసారం (ఒజా) (9) ప్రాణికశక్తితో (జీవితింద్రియంతో) (10) శరీరం (కాయ) కలుపుకొని .

భావశ్రేణి (Sex-decad), మరియు ఆధారశ్రేణి గూడ మొదటి తొమ్మిది, ఇంక లైంగికత, విజ్ఞాన కేంద్రాలను (వత్తు) వరుసగా కలిగి ఉంటాయి.

దీనిని బట్టి లైంగికతను (సెక్సును) జీవి, గర్భంలో పడినప్పుడే గతకర్మ నిశ్చయిస్తుందని తెలుతుంది.

ఇక్కడ కాయ అంటే దేహంలోని సున్నిత భాగం ( ప్రసాద)

గర్భధారణ సమయంలోనే సెక్సు నిర్ణయం కాదుగాని, దాని బీజం మాత్రం గుప్తంగా ఉంటుంది. విజ్ఞానానికి కేంద్రాలని భావించబడిన మెదడుగాని, గుండెకాని గర్భధారణ సమయంలో పరిణమించవు కాని, ఆ కేంద్రాల బీజశక్తి గుప్తంగా ఉంటుంది.

ఈ సందర్భంలో మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. బుద్ధుడు ఇతర జ్ఞానేంద్రియాలలోవలె, విజ్ఞానానికి ఒక ప్రత్యేక ఆసనాన్ని గుర్తించ లేదు. ఆ రోజుల్లో హృదయ సిద్ధాంతం - గుండె విజ్ఞానానికి ఆసనం - ప్రబలంగా ఉంది. ఇదే సిద్ధాంతాన్ని ఉపనిషత్తులు బల పరిచాయనేది స్పష్టం. బుద్ధుడు ఈ ప్రసిద్ధ సిద్ధాంతాన్ని అంగీకరించి ఉండ గలడు కాని, అతడు దీనిని బల పరచ లేదు. పత్థాన - (సంబంధాల) - గ్రంథంలో బుద్ధుడు విజ్ఞాన కేంద్రాన్ని పరోక్షంగా ఈ మాటలలో చెప్పాడు: ''యమ్ రూపమ్ నిస్సాయ ఆ భౌతిక వస్తువు మీద ఆధారపడి''. ఆ పదార్థం - (రూపం) - హృదయ (హదయ)మో,

ాపం (పదార్థాన్ని) వేరుగా
ాలి. అరూప భూమికలలో
ో కేవలం పదార్థం మాత్రం,
- రెండూ జనిస్తాయి.

(సంఖారా) అనే మూడు
ాయి. రూపం అంటే కాయ
త్రికం. ఈ త్రికం గూడ,
వి.

వ్యాప్తి మూలకం (element
(3) తెజొ మూలకం
ఉపాదా రూప) అంటే :
(8) పోషకసారం (ఒజా)
య) కలుపుకొని .

మొదటి తొమ్మిది, ఇంక
ు.

ండే గతకర్మ నిశ్చయిస్తుందని

ి బీజం మాత్రం గుప్తంగా
ని, గుండెకాని గర్భధారణ
ఉంటుంది.

బుద్ధుడు ఇతర జ్ఞానేంద్రి
ు. ఆ రోజుల్లో హృదయ
సిద్ధాంతాన్ని ఉపనిషత్తులు
అంగీకరించి ఉండ గలడు
) - గ్రంథంలో బుద్ధుడు
ుమ్ రూపమ్ నిస్సాయ ఆ
హృదయ (హదయ)మో,

నైతిక అనైతిక ఆలోచనలు, మాటలు, కర్మలు సంఖారలో ఉంటాయి. తిన్నగా అవిద్యలో వేళ్ళూనిన లేదా పరోక్షంగా అవిద్యతో ప్రభావితమైన, తమ ఫలితాలను ఇచ్చి తీర వలసిన, కర్మలు - అవి మంచివైనా చెడ్డవైనా - సంసారంలో పరిభ్రమణాన్ని పెంచుతాయి. ఏమైనా, లోభ, మోహ, ద్వేషాల నుంచి విముక్తమైన సత్కర్మలు, జీవితంలో దుఃఖాలను తొలగించు కోవడానికి ఆవశ్యకం. అందుకని బుద్ధుడు ధమ్మాన్ని సముద్రాన్ని, దాటించే తెప్పతో పోల్చాడు. బుద్ధుల, అర్హంతల చర్యలను, ఎలాగైనా, సంఖారాలుగ పరిగణించ లేదు. ఎందుకంటె వారు అవిద్యలను జయించారు.

అవిద్య అనైతిక చర్యలలో ప్రబలంగాను నైతికచర్యలలో గుప్తంగాను ఉంటుంది. అందుకని ధార్మిక, ధార్మితిక చర్యలు - రెండూ అవిద్య వలన వచ్చినవిగానే పరిగణిస్తారు.

గత ఔపాధిక చర్యల నుంచి పునస్సంధించే అతికే లేదా పునర్జన్మ విజ్ఞానం (పటిసంధి విఞ్ఞాణ), అనంతర జన్మలో పుడుతుంది. దానిని అలా ఎందుకు పిలిచారంటే, అది గతాన్ని వర్తమానంతో అతుకుతుంది. గర్భధారణ సమయంలో మొదట అనుభవానికి వచ్చే విజ్ఞానం ఇదే.

అభిధమ్మంలో వర్ణించిన పందొమ్మిది రకాల 'పునర్జన్మ - విజ్ఞానా'న్ని (పటిసంధి విఞ్ఞాణం) విఞ్ఞాణ సూచిస్తుంది. జీవితకాలంలో అనుభవించిన ఫలిత విజ్ఞానం (విపాకచిత్తం) యొక్క ముప్పైరెండు రకాలను ఈ పదం సూచిస్తుంది.

తలిదండ్రుల శుక్ర అండాల కలయికతో పాటు ఈ 'పునస్సంధి విజ్ఞానం' కలవడంతో, తల్లి గర్భంలో పిండం తయారవుతుంది. ఒక ప్రత్యేక వ్యక్తి జీవిత ప్రవాహం ప్రవత్తులు, శీలం, గత ముద్రలు - అన్నీగూడ ఈ చేతనలో గుప్తంగా దాగి ఉంటాయి.

ఈ పునర్జన్మ విజ్ఞానాన్ని శుద్ధమైన[4] దానిగా పరిగణిస్తారు. ఎందుకంటే దానిలో లాలస, ద్వేషం, మోహాల[5] మూలాలు లేకపోవడం గాని, లేదా దానితోపాటు నైతిక మూలాలు ఉండడం గాని జరుగుతుంది[6].

పునస్సంధి విజ్ఞానంతో పాటు నామరూపాలు ఏర్పడతాయి. లేదా కొంత మంది పండితులు చెప్పినట్లు ''కాయికజీవి'' (corporeal organism) ఏర్పడుతుంది.

రెండో మూడో కారకాలైన సంఖారా, విజ్ఞానాలు (విఞ్ఞాణాలు) ఒక వ్యక్తిగత ప్రకృత జీవితాలకు సంబంధించి ఉంటాయి. మూడో, నాలుగో కారకాలైన విఞ్ఞాణ, నామరూపాలు సమకాలీనాలు.

దుఃఖం, దాని కారణం, నివారణం, నివారించే విధానం - ఈ నాలుగింటికి సంబంధించిన అవిద్యయే, భవచక్రాన్ని నడిపే ముఖ్య కారణం. ఇంకో విధంగా చెప్పాలంటే, వస్తువులను విషయాలను, ఉన్నవాటిని ఉన్నట్లు, యథాతథంగా తెలుసు కో లేక పోవడం. తనను తాను యథాతథంగా తెలుసుకో లేక పోవడమే అది.

''అవిద్య అనేది గాఢ మోహం, దానిలో పడి చాల కాలంగా అక్కడే పరిభ్రమిస్తు న్నాము,'' అన్నాడు బుద్ధుడు.[2]

అవిద్య నాశమై తెలివిగా మారినప్పుడు, బుద్ధుల, అర్హంతల విషయంలో లాగ కారణత చెల్లా చెదురవుతుంది.

ఇతిఉత్తుకోలో బుద్ధుడు అంటున్నాడు. ''మోహాన్ని నాశం చేసి, చీకటిని చీల్చుకు వచ్చిన వారు పరిభ్రమించే పని లేదు. వారికి కారణత ఇక ఏమాత్రం ఉండదు.''

గతానికి, భవిష్యత్తుకు సంబంధించిన అజ్ఞానం, రెండింటికి సంబంధించిన అజ్ఞానం, ప్రతీత్య సముత్పాదానికి సంబంధించిన అజ్ఞానం, అన్నీ కూడ అవిద్య క్రిందకే వస్తాయి.

అవిద్య కారణంగానే సంఖారాలు (నిబద్ధచర్యలు)పుడతాయి.

'సంఖార' అనేక అర్థాలున్న పదం. సందర్భాన్నిబట్టి దాన్ని అర్థం చేసు కోవాలి. ఇక్కడ ఈపదం పునర్జన్మకు కారణమైన, కర్మకు మూలకాలైన, అకుశల, కుశల, అవిచల (ఆనెనాజ) చేతనలను సూచిస్తుంది. మొదటిది పన్నెండు రకాల అనైతిక విజ్ఞానలోని అన్ని చేతనలను పరివేష్టిస్తుంది. రెండోది ఎనిమిదిరకాల శోభన(beautiful) నైతిక విజ్ఞానాలను, ఇంకా ఐదురకాల నైతిక రూపఝాన విజ్ఞానాల చేతనలను పరివేష్టిస్తుంది. మూడోది నాలుగు రకాల నైతిక అరూపఝాన విజ్ఞాన చేతనలను పరివేష్టిస్తుంది.

సంఖార, పంచస్కంధాలలో ఒకటిగ, ఏభైరెండు మానసిక స్థితులలో రెండింటిని - సంజ్ఞ, వేదనలను - మినహాయించి మిగతా ఎభై మానసికస్థితులను పరివేష్టిస్తుంది.

ఈ పాళీపదానికి సమానార్థం చెప్పే ఆంగ్లపదం ఏదీ లేదు.

నాలుగు లోకోత్తర మార్గచిత్త (మగ్గచిత్త) వేదనల (Volitions)ను సంఖారాలుగ పరిగణించరు. ఎందుకంటే అవి అవిద్యను నిర్మూలించ ప్రయత్నిస్తాయి. లోకోత్తర విజ్ఞాన రకాలలో ప్రజ్ఞ (పఞ్ఞా) ప్రబలంగా ఉంటుంది. ఇహ విజ్ఞానంలో చేతన ప్రబలంగా ఉంటుంది.

ఇరవై ఐదో ప్రకరణం

# భవచక్రం

# ప్రతీత్యసముత్పాదం

ఈ భవచక్రానికి
ఏ దేవుడు, ఏ బ్రహ్మ పదార్థం లేవు,
కేవలం దృగ్విషయం మాత్రమే పరిభ్రమిస్తుంది
అన్ని ప్రత్యయాల ఆధారంగా !

– విశుద్ధిమగ్గ

ప్రతీత్య సముత్పాద సూత్రంతో బుద్ధుడు పునర్జన్మ ప్రక్రియను వివరించాడు. పటిక్క (ప్రతీత్య) అంటే ''ఎందు వల ననగా,'' '' ఆధారపడి'' అని. సముప్పాద (సముత్పాద) అంటే ''పుట్టడం'', ''ఆవిర్భావం'' అని. శబ్దార్థపరంగా చూసినట్లయితే ''దాని వలన పుట్టుట'' లేదా ''ఆధారంగా.పుట్టడం, ఆవిర్భవించడం'' ''పొంది పుట్టుట''. అయినప్పటికీ, దీనిని మొత్తం కార్యకారణ సూత్రానికి అనుప్రయుక్తం చేస్తారు. ఈ సూత్రంలో పన్నెండు పరస్పరాధార కారణాలు, ఫలితాలు ఉన్నాయి. సాంకేతికంగా వీటిని పచ్చయ (ప్రత్యయ) పచ్చయుపపన్న (ప్రత్యయుపపన్నాలు) అంటారు.

**ప్రతీత్య సముత్పాద విధానాన్ని ఈ దిగువ విధంగా అర్థం చేసుకోవాలి :**

A కారణంగా B జనిస్తుంది. B కారణంగా C పుడుతుంది. A లేకపోతే B లేదు. B లేక పోతే C లేదు. మరోవిధంగా చెప్పాలంటే, ''ఇది ఇలా ఉంది కనుక అది ఉంది; ఇఎ అలా లేదు కనుక అది లేదు.'' (ఇమస్మిమ్ సతి, ఇదం హోతి; ఇమస్మిమ్ అసతి, ఇదమ్ న హోతి).

ప్రతీత్య సముత్పాదం జనన మరణాల ప్రక్రియ వివరణే కాని, ప్రపంచ పరిణామ వివరణా తాత్విక సిద్ధాంతం కాదు. బాధామయ జీవితం నుంచి బయట పడడానికి మార్గం చూపే ఉద్దేశంతో, అది పునర్జన్మ దుఃఖాల గురించి పరిశీలిస్తుంది. అసలు ప్రాణం ఎప్పుడు ఎక్కడ పుట్టిందనే పరమ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి అది ప్రయత్నించదు.

అది కేవలం, ''ఒక స్థితి దాని పూర్వ స్థితి మీద ఎలా ఆధారపడి ఉందో''[1] మాత్రమే వివరిస్తుంది.

9. ప్రథమ వీక్షణంలోనే కనపరిచే సహజాత యిష్టాయిష్టాలను అవి తెలుపుతాయి.

10. మనలో చెడ్డతనం, చెత్త కుప్పలు, మంచితనం, బంగారురాశులు ఎలా ఉన్నాయో వివరిస్తాయి.

11. అత్యంత సభ్యత కలిగిన ఒక నాగరకునిలో అనుకోకుండా ఎలా మోహం పెల్లుబికి వస్తుందో, ఆకస్మికంగా ఒక నేరస్తుడు రుషిగా ఎలా మారతాడో అవి వివరిస్తాయి.

12. ఋషితుల్యులకు దురాచారులు ఎలా పుడతారో, దురాచారులకు రుషిపుంగవులు ఎలా పుడతారో అవి వివరిస్తాయి.

13. ఒక అర్థంలో, ఇప్పటి మనం, గతంలోని మనంకు వారసులం. రేపటి మనం, ఇప్పటి మనంకు వారసులం. మరో అర్థంలో ఇప్పటి మనం గతంలోని మనకు కేవలం (పూర్తి) వారసులం కాము, రేపటి మనం ఇప్పటి మనంకు కేవల (పూర్తి) వారసులం కాము – ఇలా ఎందుకు జరుగుతుందో అవి వివరిస్తాయి.

14. అకాల మరణాన్ని, అనూహ్య అదృష్ట దృష్ట పరివర్తలను వివరిస్తాయి.

15. అనుపమానమైన దైహిక, మానసిక బౌద్ధిక లక్షణాలున్న బుద్ధులు లాంటి పరిపూర్ణ సర్వజ్ఞులైన గురువులు ఎందుకు పుడతారో అవి వివరిస్తాయి.

**పాదసూచికలు :**

1. మజ్ఝిమనికాయ, 1,36, మహాసచ్చక సుత్త, P 248
2. అలాగని పునర్జన్మ భావనకు బుద్ధుడే మూలమని భావించరాదు. ఆరోజుల్లో ఆభావన బాగా ప్రచారంలోనే ఉంది. అయితే దానిని సార్వజనీనికంగా అంగీకరించ లేదు. ఆభావన తొలి ఉపనిషత్తులలో ఉంది – సంపాదకుడు.
3. ధమ్మపద, P. 153
4. మజ్ఝిమనికాయ 1,26, P.261.
5. మజ్ఝిమనికాయ 11, 81, P.45.
6. *Ibid,* 111,143, P. 258
7. I P.111
8. దీఘనికాయ, 11, 16, P. 91
9. CP. Mr. J.G. Jennings, The Vedantic Buddhisan of the Buddha
10. భారత దేశానికి చెందిన శాంతిదేవి మంచి ఉదాహరణ See *The Bosat,* vol xiii, No.2, P.27
11. William W. Atkinson and E.D. Walter, *Reincamation and the Law of Kama*
12. See *Many Mansions* and *The world within* by Gina Cerminara
13. See *Buddhist Legends,* 111 P 108
14. Cylon Observer, November 21, 1948

చెడ్డగా ప్రవర్తిస్తు న్నప్పటికి సుఖసంతోషాలతో తులదూగ వచ్చు. దీనికి కారణం మన గత జన్మల సత్కర్మ. ప్రకృత మంచి చెడు పనులు, మొదటి అవకాశంలోనే వాటి ప్రభావాన్ని చూపుతాయి.

**ఒక పాశ్చాత్య పండితుడంటున్నాడు :**

''మనం గత జన్మలను విశ్వసించినా, విశ్వసించకపోయినా, దైనం దిన జీవిత విషయాలకు సంబంధించిన జ్ఞానంలో, మనకు కనిపించే ఖాళీలను వివరించ డానికి అదొక్కటే న్యాయమైన భూమికగా తోస్తున్నది. కవలల మధ్య తేడాలు ఎందు కుంటున్నాయో, షేక్స్పియర్ లాంటివారు, తమ పరిమిత అనుభవంతోనే, వివిధ రకాల పాత్రలను, దృశ్యాలను - వీటికి సంబంధించిన వాస్తవ జ్ఞానం అతనికి లేదు - ఎలా చిత్రించ గలిగారో, ఒక మేధావి తన అనుభవాన్ని అవశ్యం దాటి, ఆవలికి ఎలా వెళ్ళగలుగుతున్నాడో, శైశవంలోనే మించిన తెలివితేటలు ఎందు కున్నాయో, మనస్సులలో, నీతిలో, వెందడులో శరీరాల్లో పరిస్థితులలో, పరిసరాల్లో ఎందుకు తేడా లున్నాయో - వీటన్నింటిని మనం చూస్తూనే ఉన్నాం - గత జన్మ, కర్మలు మాత్రమే వివరించ గలుగుతాయి.''

### *కర్మ పునర్జన్మలు ఏమి తెలుపుతాయి?*

1. అవి దుఃఖ సమస్యను వివరిస్తాయి. దుఃఖానికి బాధ్యులం మనమే.
2. మానవాళి మధ్య ఉండే అసమానతలను వివరిస్తాయి.
3. అద్భుత శక్తిమంతులైన బాలలు, మహామేధావుల పుట్టుకకు కారణం వివరిస్తాయి.
4. దైహికంగా ఒకే విధంగా ఉండి, ఒకే అవకాశాలను అనుభవిస్తున్న కవలలు ఎందుకు మానసికంగా, నైతికంగా, ఔద్వేగికంగా, బౌద్ధికంగా వేరు వేరు శీలాన్ని ప్రదర్శిస్తున్నారో తెలియ జేస్తాయి.
5. ఒకే కుటుంబానికి చెందిన పిల్లల మధ్య సాదృశ్యాలను ఆనువంశికత వివరించి నప్పటికీ, తేడాలను అవి వివరిస్తాయి.
6. కొంత మందిలో ఉండే అంతస్సిద్ధ సామర్థ్యాలకు కారణాలను అవి తెలియ జేస్తాయి.
7. తలిదండ్రుల, వారి పిల్లల మధ్య తెలివితేటల్లో ఉండే తేడాలకు కారణాన్ని అవి వివరిస్తాయి.
8. పసిపాపలు అయత్నంగానే, లోభం, కోపం, అసూయల లాంటి గుణాలను ఎలా పెంపొందించు కొంటారో అవి వివరిస్తాయి.

ఫ్రెంచ్, లాటిన్ భాషలను ఎలా మాటాడ గలిగాడు? నాలుగో సంవత్సరానికే దర్శన శాస్త్ర విద్యార్థి ఎలా అయ్యాడు? అలాగే జాన్ స్టువర్ట్ మిల్ మూడు సంవత్సరాలకే గ్రీకును చదివాడు. ఆరు సంవత్సరాలకే మెకాలే ప్రపంచ చరిత్ర రాశాడు. అమెరికా అద్భుత బిడ్డ 'విలియమ్ జేమ్స్ సిడిస్' రెండు సంవత్సరాల వయస్సులోనే రాయడం చదవడం చేశాడు. ఎనిమిది సంవత్సరాలకే ఫ్రెంచ్, రష్యన్, ఇంగ్లీష్, జర్మన్, కొంత లాటిన్, గ్రీకులను మాటాడ గలిగాడు; మాంచెస్టర్‌కు చెందిన చార్లెస్ బెనెట్, మూడు సంవత్సరాల వయస్సులోనే అనేక భాషలు మాటాడగలిగాడు – ఇవన్నీ అద్భుత సంఘటనలు. శాస్త్రజ్ఞులు కాని వారికి అర్థం కాని సంఘటనలు[14]. గ్రంథులే కారణమైతే ఆ గ్రంథులు కొంతమందిలోనే ఎందుకు అసాధారణంగా ప్రవర్తిస్తాయో విజ్ఞాన శాస్త్రం వివరించలేక పోతోంది. అసలు సమస్య అపరిష్కృతంగానే మిగిలి పోతోంది.

ఆనువంశికత ఒక్కటే, కొందరు మాత్రమే మేధావులైన కారణాన్ని వివరించ లేదు ''అలా కానట్లైతే, వారి పైతృకత (ancestry) దానిని ఎరుక పరిచేది. వారి పౌతృకత వారికంటె ఎక్కువమేరకు, దానిని ప్రదర్శించి ఉండేది, ఋజువు చేసి ఉండేది.''

ఈ చిక్కుముడిని విప్పడానికి అనువంశకతతో పాటు, కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలను సంధించాలి.

సుఖ దుఃఖాలనే రెండు శాశ్వతాల మధ్య ప్రస్తుత జీవితకాలం ఒక్కటేనా అస్తిత్వం ? మరికొన్ని ఆస్తిత్వాలున్నాయా ? మనం ఇక్కడ గడిపే అల్ప కాలం – మహాఅయితే ఐదు ఇరవైల (100) సంవత్సరాలు – శాశ్వతత్వానికి సిద్ధం కావడానికి సరిపోయింది మాత్రం కాదు.

ఒకడు వర్తమానాన్ని, భవిష్యత్తును నమ్మితే, అతడు గతాన్ని నమ్మడం న్యాయం.

మనం గతంలో ఉన్నామని నమ్మితే ప్రస్తుత జీవితం గతించిన తరవాత, మన జీవితం కొనసాగింపును నమ్మక పోవడంలో అర్థం లేదు.

''వర్తమానం గత కాలపు బిడ్డ అని, భావికి మాతృక అని మనం నమ్ముతున్నాము.'' టి.హెచ్.హక్సలీ

''ఈ ప్రపంచంలో మంచి వాళ్ళకు దురదృష్టం ఎదురవుతుంది. చెడ్డవాళ్ళు సుఖ సంపదలతో తులదూగు తున్నారు.'' అన్నాడు ఎడిసన్. ఇది నిజంగా పూర్వ, భావి జన్మలున్నా యనడాన్ని సమర్థిస్తున్నది.

మనం తయారు చేసు కొన్న స్థితిలోకే మనం పుట్టాం. ఇప్పుడు మనం మంచిగా ఉన్నా, దరదృష్ట జీవితాన్ని గడపవలసి వస్తే, అది మన గతజన్మ చెడ్డకర్మ ఫలితం. ఇప్పుడు మనం

ో సంవత్సరానికే దర్శన
డు సంవత్సరాలకే గ్రీకును
ు. అమెరికా అద్భుత బిడ్డ
యడం చదవడం చేశాడు.
టిన్, గ్రీకులను మాటాడ
్రాల వయస్సులోనే అనేక
ప్రజ్ఞులు కాని వారికి అర్థం
ంతమందిలోనే ఎందుకు
ోతోంది. అసలు సమస్య

కాన్ని వివరించ లేదు ''అలా
వారి పౌత్రికత వారికంటె
ేది.''

్మ, పునర్జన్మ సిద్ధాంతాలను

ుం ఒక్కటేనా అస్తిత్వం ?
లం – మహాఅయితే ఐదు
నికి సరిపోయింది మాత్రం

్ల నమ్మడం న్యాయం.
ున తరవాత, మన జీవితం

మనం నమ్ముతున్నాము.''

్తుంది. చెడ్డవాళ్ళు సుఖ
ది నిజంగా పూర్వ, భావి

ండు మనం మంచిగా ఉన్నా,
్మ ఫలితం. ఇప్పుడు మనం

**4.** జీవిత కాలం పరిసమాప్తి కాకముందే, పునరుత్పత్తి కర్మప్రవాహాన్ని అనుకోకుండ బలవత్తరమైన కమ్మ విరుద్ధచర్య అడ్డుకోవడం. ( ఉపచ్ఛేదక కమ్మ)

వ్యక్తుల అకాల ఆకస్మిక మరణాలు, శిశుమరణాలు ఈ కారణంవల్ల సంభవిస్తాయి.

ఎగిరే బాణాన్ని అంతకంటె బలమైన వ్యతిరేక శక్తి, ఆపి, నేలకు దించ గలదు. అలాగే బలమైన గత కర్మశక్తి అంత్య ఆలోచనా ప్రక్రియ బీజశక్తిని నిరోధింప చేసి, జీవి మానసిక జీవితాన్ని నాశనం చేయ గలదు. ఉదాహరణకు, అతడు తన జీవిత కాలంలో చేసిన వినాశకర్మ కారణంగానే దేవదత్తుని మరణం సంభవించింది.

మొదటి మూడు మరణాలు ''కాల మరణాలు'' నాలుగోది ''అకాల మరణం''.

నూనెతో వెలిగే దీపం ఈ దిగువ నాలుగు కారణాలతో, దేనితోనైనా, ఆరి పోవచ్చు. అవి: వత్తి అయి పోవడం, నూనె అయి పోవడం, నూనె, వత్తి ఒకేసారి అయిపోవడం, లేదా గాలి వీచడం లాంటి బాహ్యాకారణం.

అందుకని మరణం, పై చెప్పిన వాటిలో ఏ కారణం వల్లనైనా కావచ్చు.

మరణ కారణాలను వివరిస్తూ బౌద్ధం, నాలుగు తీరుల జననం ఉంటుందని చెబుతుంది. అవి: **1**) గుడ్డు నుంచి వచ్చిన వారు (అండజులు), **2**) యోని నుంచి వచ్చినవారు (జలాభుజులు), **3**) తేమ నుంచి వచ్చిన వారు (సమ్‌సెదజులు), **4**) అయత్నంగా వచ్చిన వారు (ఒపపాతికలు) ఈ విస్తృత విభాజనం క్రిందకు ప్రాణులన్నీ వస్తాయి.

పక్షులు, గుడ్డునుంచి వచ్చిన పాములు, మొదటి విభజన క్రిందకు వస్తాయి.

యోనినుంచి వచ్చినవారు – మనుషులు, భూమి మీద చరించే దేవతలు, తల్లి గర్భంలో గర్భధారణ జరిగి పుట్టే జంతువులు రెండో విభజన క్రిందకు వస్తాయి.

తాము పెరగడం కోసం తేమను గూడుగా ఉపయోగించు కొనే పిండాలు – జంతువులలో అధోవర్గం – మూడో విభాగం క్రిందకు వస్తాయి.

అయత్నంగా జన్మించేవి సాధారణ భౌతిక నేత్రానికి కనిపించవు. వాటి గత కర్మకారణంగా, పిండ దశను పొంద కుండానే, అవి జనిస్తాయి. దేవతలు, ప్రేతాలు, బ్రహ్మలు ఈ వర్గం క్రిందికి వస్తాయి.

ఇరవై ఏడో ప్రకరణం

# అస్తిత్వ లోకాలు

*''గమనంతో చేరగ రానిది ప్రపంచాంతం''*

– సంయుత్త నికాయ

బౌద్ధం ప్రకారం, ఈ విశ్వంలో ఒక అతి చిన్న శకలమైన ఈ భూమి ఒక్కటే కాదు, వాస యోగ్య మైంది; మనుషులొక్కరే ప్రాణులు కారు . ప్రపంచం అనంతం. ప్రాణులూ అంతే. ''పునర్జన్మకు మార్గం, పాదిగిన గుడ్డు ఒక్కటే కాదు.'' గమించడం ద్వారా ఎవడు విశ్వం అంచుకు చేర లేడు,[1] అన్నాడు బుద్ధుడు.

వేరు వేరు అస్తిత్వకాల్లో పుట్టడం జరగ వచ్చు. వారి వారి నైతిక, అనైతిక కర్మలనుబట్టి, జీవులు వాటంతట అవి అభివ్యక్తం అయ్యే ముప్పై ఒక్క స్థలాలున్నాయి.

నాలుగు అసుఖ స్థితు లున్నాయి. వీటిని మానసికస్థితులుగాను, స్థలాలుగాను (రెండింటిగా) చూస్తారు.

**అవి :**

**1.** నిరయ (ని + అయ; సంతోషలేమి) – జీవులు తమ పాపకర్మలకు ప్రాయశ్చిత్తం చేసు కొనే దుఃఖమయ స్థితులు. అవి జీవులను అనంతంగా బాధలకు గురిచేసే శాశ్వత నరకాలు కావు. అటువంటి స్థితులలో పుట్టిన జీవులు, చెడ్డకర్మ ఖర్చయిన తరువాత, వారిగత కర్మల ఫలంగా, ఆనందమయ స్థితులలో పుట్టే అవకాశం ఉంది.

**2.** తిరచ్చాన – యోని (తిరో = అడ్డంగా; అచ్చాన = వెళ్ళుట) అనేది జంతు లోకం. పాపకర్మ కారణంగా జీవులు జంతువులుగా పుడతారని బౌద్ధుల నమ్మకం. సంచిత గత మంచి కర్మ ఫలితంగా జంతువులు మానవులుగా జన్మించే అవకాశం ఉంది. ఎలాగ, విద్యుచ్ఛక్తి వెలుతురు, వేడి, గతిగ అభివ్యక్త మ్మవుతుందో (ఇవి ఒక దాని నుంచి ఒకటి అవశ్యం రానవసరం లేదు.) ఖచ్చితంగా చెప్పాలంటే, అలాగే మానవ రూపంలో అభివ్యక్తమైన కర్మే జంతు రూపంలోను అభివ్యక్తం కావచ్చు, జంతు రూపంతో అభివ్యక్తమైన కర్మే మానవ రూపంలోను అభివ్యక్తం కావచ్చు.

మనం ఒక మాట చెప్పవచ్చు: కొన్ని సార్లు కొన్ని జంతువులు, ప్రత్యేకంగా కుక్కలు, పిల్లులు, వాటి గతకర్మ కారణంగా, కొందరు మానవుల కంటె సుఖకరంగా జీవించ వచ్చు.

జీవి భౌతిక రూప స్వభావాన్ని దాని గత కర్మ నిర్ణయిస్తుంది. ఈ రూప స్వభావం ఆ జీవి చర్యల నిపుణత, అనిపుణతల మీద ఆధార పడుతుంది.

3. పెత యోని (ప + ఇత; ప్రేతయోని) శబ్దార్థ పరంగా దీని అర్థం విగత జీవులు లేదా పూర్తిగా సుఖ సంతోషాలు లేని వారు. వారు శరీరం విడిచిన దయ్యాలు లేదా భూతాలు కావు. వివిధ స్థాయిలలో విరూపితమైన దేహాకృతులను అవి కలిగి ఉంటాయి. ఈ ఆకృతులు మామూలుగా నగ్న నేత్రానికి కని పించవు. వాటికి వాటి లోకాలు లేవు. అరణ్యాలలోను, మురికి కూపాలలోను ఉంటాయి. ''పెతవత్తు'' అని ఒక ప్రత్యేక గ్రంథం ఉంది. ఇది ఆ దురదృష్ట జీవుల కథలను చెబుతుంది. సంయుత్తనికాయం గూడ ఈ పెతల (ప్రేతాల) కు సంబంధించిన ఆసక్తికర విషయాలను చెబుతుంది.

ఒక ప్రేతం దయనీయ స్థితిని వర్ణిస్తూ గౌరవనీయ మొగ్గల్లాన అంటాడు:

''ఇప్పుడు నేను రాబందుల కొండదిగి వస్తుండగా, గాలిలో ఒక కంకాళం ఎగిరి పోవడం చూశాను. దాని వెనుక రాబందులు, కాకులు, బైరి పక్షులు, ఎగురుతూ, దాని పక్కటెములను పొడిచి, చీల్చి వేస్తూ ఉన్నాయి. అదేమో బాధతో అరుస్తోంది. స్నేహితుడా, నేను ఇలా అనుకొన్నాను: ' కాని ఇది అద్భుతంగా ఉంది. ఒక మూర్తి అటువంటి ఆకృతిని దాల్చడమా! ఆర్జించిన వ్యక్తిత్వం అలాంటి రూపం పొందడమా!' ''

బుద్ధుడు అప్పుడు చెప్పాడు: ''గత జన్మలో ఇతడు శోనికుడు (జంతువులను నరికే కసాయి). అతని గత పాపకర్మ వల్ల ఈ స్థితిలో పుట్టాడు''[2]

మిళిందప్రశ్నలు (Questions of Milinda) గ్రంథం ప్రకారం నాలుగు రకాల ప్రేతాలున్నాయి. అవి: వమనం తిని జీవించే వంతాసికులు, ఆకలి దప్పుల క్షుత్పిపాసినులు, దప్పికలతో కాగిపోయే నిఝామతణ్హికాలు, ఇతరుల దానం మీద జీవించే పరదుత్తూప జీవినులు.

తిరోకుడ్డ సుత్త చెప్పినట్లు, చివర పేర్కొనబడిన ప్రేతాలు, తమ పేరుతో, బ్రతికి ఉన్న తమ బంధువులు చేసిన పుణ్యంలో, పాలు పంచుకొని సుఖకర స్థితులను పొంద గలవు.

4. అసుర యోని = అసుర (రాక్షసు)ల స్థలం. అసుర పదానికి శబ్దార్థం ఎవరు ప్రకాశించరో వారు, వేటాడరోవారు. వీరు గూడ ప్రేతాలలా, మరో అసంతోషకర జీవుల వర్గం. అయితే వీరు దేవతలకు వైరులైన అసురుల కంటె భిన్నమైన వారని గుర్తుంచు కోవాలి.

**ఈ నాలుగు దుర్గతుల తరవాత మరి ఏడు సద్గతులున్నాయి. అవి :**

1. మనుస్స – మనుష్యలోకం[3]

   మానుషలోకం సుఖ దుఃఖాల సమ్మేళనం. బోధి సత్త్వులు మనుష్యలోకాన్ని కోరుకొంటారు. ఎందుకంటే, ప్రపంచానికి సేవచేయడానికి, బుద్ధత్వాన్ని పరిపూర్ణం గావించు కోవడానికి అది తగిన క్షేత్రం. బుద్ధులు ఎప్పుడూ మనుష్యులుగానే పుడతారు.

2. చతుమ్మహారాజిక – దివ్య క్షేత్రాలలో అట్టడుగుది. దీనిలో నభోమండలం నాలుగు దిక్కులను కాపాడే దేవతలు (దిక్పాలకులు) తమ అనుచరగణంతో ఉంటారు.

3. తావతింస – శబ్దార్థపరంగా ముప్పైమూడు – ముప్పైమూడు దేవతల స్వర్లోకం. దీనిని దేవ సక్క పాలిస్తాడు. ఈ పేరు రావడం వెనక ఒక కథ ఉంది. మఘ (సక్క మరోపేరు) నాయకత్వంలో, స్వార్థ రహితులైన ముప్పైముగ్గురు దేవతలు పుణ్యకార్యాలు నిర్వహించడవల్ల, ఈ దివ్యలోకంలో పుట్టారు. ఈ లోకంలోనే, బుద్ధుడు, మూడు నెలల పాటు, దేవతలకు, అభిధమ్మాన్ని బోధించాడు.

4. యామ – యామదేవతల లోకం. బాధను నాశం చేసేది యామ.

5. తుసిత – శబ్దార్థం సుఖవాసులు, సంతోష రాజ్యం.

   బుద్ధత్వాన్నికి కావలసిన అన్ని అర్హతలు పొందిన బోధిసత్వులు బుద్ధత్వాన్ని పొంద డానికి మానవ లోకంలో జన్మించే మంచి సమయం ఆసన్న మయ్యేవరకు, ఈ లోకంలో నివసిస్తారు. భావి బుద్ధుడు, బోధిసత్త్వ (మెత్తెయ్య) మానవుడుగా జన్మించి, బుద్ధుడు గావడానికి, తగు సమయం కోసం ప్రస్తుతం, ఈలోకంలో వేచి ఉన్నాడు.

   బోధిసత్త్వునితల్లి, మరణానంతరం, ఈలోకంలో 'దేవుడు' గా పుట్టింది. ఇక్కడ నుంచి, అతడు తావతింస స్వర్గానికి, బుద్ధుడు బోధించే అభిధమ్మం వినడానికి, వెళ్ళాడు.

6. నిమ్మానరతీ – నిర్మిత హర్మ్యాలలో విలాసంగా ఉండే దేవతల లోకం.

7. పరనిమ్మిత వసవత్తీ – ఇతరులు సృష్టించిన వాటిని తమ అవసరాలు తీర్చుకోవడానికి వాడుకొనే దేవతల లోకం.

   చివరి ఆరు లోకాలు దేవ లోకాలు. ఈ దేవతలు మామూలు కంటికి కన పడరు. మానవుల కంటె సూక్ష్మమైన వారు, అదృశ్యులు. అయితే మర్త్యులు లాగే వీరూ

మరణానికి గురయ్యే వారే. అయితే కొన్ని విషయాల్లో నిర్మాణంలో, భోజనంలో, నివాసంలో – మానవుల కంటె మెరుగైన వారు. కాని మనుష్యుల కంటె జ్ఞానంలో గొప్పవారై తీరాల్సిన పని లేదు. వారు అయత్నంగా పుడతారు. పదిహేను, పదహారేడుల యువతీ యువకులులా దర్శన మిస్తారు.

ఈ ఆరు దివ్యలోకాలు తాత్కాలికానంద లోకాలు. ఇక్కడి జీవులు చంచల ఇంద్రియ సుఖాలను అనుభ విస్తుంటారని భావించ బడుతుంది.

నాలుగు దుర్గతులను, ఏడు సుగతులను కలిపి కామలోకం అంటారు.

ఈ కామలోకాల కంటె ఉన్నతమైన లోకాలు బ్రహ్మలోకాలు లేదా రూపలోకాలు. వీనిలో జీవులు ఇంద్రియ సుఖాలను పరిత్యాగం చేసి, ఝానానందంతో నివసిస్తారు.

ఝానా (లేదా అలవర్చుకొన్న హర్షోన్మత్తత)ల ప్రకారం రూపలోకంలో పదహారు విభాగాలుంటాయి. అవి :

(ఎ) ప్రథమ ఝానలోకం :

1. బ్రహ్మపారిసజ్జ – బ్రహ్మపరివార లోకం (భూమి)
2. బ్రహ్మ పురోహిత – బ్రహ్మ పురోహిత లోకం (భూమి)
3. మహాబ్రహ్మ – మహా బ్రహ్మలలోకం (భూమి)

మొదటి మూడింటిలో అన్నింటికంటె ఉన్నతమైంది మహాబ్రహ్మ. ఈ లోకాన్ని అలా ఎందుకు పిలుస్తారంటే, ఇందులో ఉండేవారంతా, వారి వారి అంతర్గత మానసిక వికాసంవల్ల, సుఖంలోను, అందంలోను, ఆయుః ప్రమాణంలోను ఇతరులను మించి ఉంటారు.

(బి) రెండో ఝాన లోకం :

4. పరిత్తాభా – అల్పప్రభాసలోకం (భూమి)
5. అప్పమాణాభా – అనంత ప్రభాసలోకం (భూమి)
6. ఆభస్సరా – ప్రభాస బ్రహ్మల లోకం (భూమి)

(సి) మూడో ఝాన లోకం :

7. పరిత్తసుభ – అల్పప్రభాసోద్గార బ్రహ్మల లోకం (భూమి)
8. అప్పమాణసుభ – అనంత ప్రభాసోద్గార బ్రహ్మల లోకం
9. సుభకిణ్హ – స్థిర ప్రభాసోద్గార బ్రహ్మల లోకం

(డి). నాలుగో ఝాన లోకం

10. వెహాప్పల - మహాప్రతిఫల బ్రహ్మలలోకం
11. అస్సఞ్ఞాసత్త - మతిలేని (అసంజ్ఞ) జీవుల లోకం
12. సుధావాస - శుద్ధనివాసాలు. ఇవి మళ్ళీ ఐదుగ విభాజితమయ్యాయి, అవి:

(i) అవిహా - అవినాశలోకం
(ii) అతప్ప - ప్రశాంత లోకం
(iii) సుదస్స - సౌందర్యలోకం
(iv) సుదస్సి - స్పష్ట దర్శనలోకం
(v) అకణిట్ఠ - ఉన్నత తమ లోకం

ఝానాలను అలవరుచుకొన్నవారు మాత్రమే ఈ ఉన్నత లోకాలలో జన్మిస్తారు. మొదటి ఝానం చేసిన వారు మొదటి లోకంలో పుడతారు. రెండో, మూడో ఝానాలను చేసిన వారు రెండో లోకంలో జన్మిస్తారు. నాలుగు, ఐదు ఝానాలను చేసిన వారు మూడు, నాలుగు లోకాలలో జన్మిస్తారు వరుసగా.

ప్రతి లోకంలోను ఝానంలో ఒక మామూలు స్థాయిని చేరిన వారికి, మొదటి శ్రేణి, ఝానంలో ఇంకొంత పైస్థాయికి ఎదిగిన వారికి రెండో శ్రేణి, ఝానాల మీద పూర్తి అదుపును, సాధించిన వారికి మూడో శ్రేణి దక్కుతుంది.

అసంఞ్ఞాసత్త అని పిలవబడే పదకొండో లోకంలో విజ్ఞాన రహితంగా పుడతారు.

ఇక్కడ కేవలం పదార్థప్రవాహం మాత్రమే ఉంటుంది. ఝాన ప్రభావం ఉంటూ ఉండగానే, మనస్సు తాత్కాలికంగా ఉపసంహరింప బడుతుంది. మామూలుగా అయితే మనస్సు, పదార్థాలు విడదీయ రానివి. ఇప్పుడు ఇక్కడ జరిగి నట్లుగానే, కొన్ని సందర్భాలలో, ధ్యాన శక్తితో మనస్సును పదార్థం నుంచి వేరు చేయడం సాధ్యమే. ఒక అర్హంత నిరోధ సమాపత్తిని గూడ పొంది నప్పుడు విజ్ఞానం తాత్కాలికంగా అంతర్హిత మవుతుంది. అటువంటి స్థితిని మనం మామూలుగా ఊహించలేం. కాని మనం ఊహించ లేని యథార్థ విషయాలు ఉండ వచ్చు.

సుధావాసాలు లేదా శుద్ధలోకాలు అనాగామినుల (ఎప్పుడు తిరిగిరాని) ఆవాసాలు. మామూలు జీవులు వీటిల్లో జన్మించరు. ఇతర లోకాల్లో అనాగామిత్వాన్ని సాధించిన వారు ఈ శుద్ధలోకాల్లో జన్మిస్తారు. తరవాత వారు అర్హతత్వాన్ని పొంది, ఆలోకాల్లోనే, ఆయువు తీరే వరకు ఉంటారు.

| | | భవలోకాలు | | వయోపరిమితి |
|---|---|---|---|---|
| అరూప లోక (4) రూప రహిత లోకాలు | | న ఏవ సంఞ్ఞాన అసంఞ్ఞాయతన | | 84,000 M.K. |
| | | ఆకిఞ్చ ఞ్ఞాయతన | | 60,000 M.K. |
| | | విఞ్ఞాణ ఞ్చయతన | | 40,000 M.K. |
| | | ఆకాసానఞ్చాయతన | | 20,000 M.K. |
| రూప లోక (16) రూప సహిత భూములు | చతుర్థ ఝానభూమి నాలుగో ఝానలోకం | సుద్ధావాస శుద్ధలోకాలు | అకనిట్ఠ | 16,000 M.K. |
| | | | సుదస్సీ | 8.000 M K. |
| | | | సుదస్స | 4,000 M.K. |
| | | | అతప్ప | 2,000 M.K. |
| | | | అవిహ | 1,000 M.K. |
| | | | అసంఞ్ఞా సత్త | 500 M.K. |
| | | | వెహఫల | 500 M.K. |
| | తతియఝాన భూమి తృతీయఝాన లోకం | | సుభకిణహ | 64 M.K. |
| | | | అప్పమానసుభ | 32 M.K |
| | | | పరిత్తసుభ | 16 M.K. |
| | దుతీయఝాన లోకం రెండో ఝానలోకం | | అభస్సర | 8·M.K |
| | | | అప్పసమాణాభ | 4 M.K. |
| | | | పరిత్తాభ | 2 M K. |
| | పఠమఝాన భూమి ప్రథమఝాన లోకం | | మహాబ్రహ్మ | 1 M.K. |
| | | | బ్రహ్మపురోహిత | 1/2 M.K |
| | | | బ్రహ్మపారిసజ్జ | 1/3 M.K. |
| కామ లోక (11) దర్శన, వేదన శక్తిగల వారిలోకం | సుగతి (7) సంతోష స్థితిలు | దేవలోక (6) దివ్యలోకాలు | పరనిమ్మిత వసవత్తి | 16,000 M.K. |
| | | | నిమ్మాణరతి | 8,000 M.K |
| | | | తుసిత | 4,000 M.K. |
| | | | యామ | 2,000 M.K. |
| | | | తావతింస | 1,000 M.K |
| | | | చతుమ్మహారాజిక | 500 M.K |
| | | మనస్సు - మానుషలోకం | | పరిమితిలేదు |
| | దుగ్గటి (4) ప్రేత స్థితులు | అసురయోని | | ,, |
| | | ప్రేతయోని | | ,, |
| | | తిరచ్చానయోని | | ,, |
| | | నిరయ | | ,, |

M.K. = మహాకల్ప;
A K. = అసంఖేయకల్ప;
C Y = దేవసంవత్సరాలు

అరూపలోకాలని పిలవబడే నాలుగు లోకాలున్నాయి. వీటిల్లో పదార్థంగాని, దేహాలుగాని ఏమీ ఉండవు. కేవలం శరీరం లేని మనస్సు మాత్రమే ఉండే లోకా లుంటాయని బౌద్ధులు చెబుతారు. కశ్యపథేర చెప్పినట్లుగా, గాలిలోకి విసిరిన ఇనుప కడ్డీ, జవం ఉన్నంత సేపు అలాగే ఎలా నిలిచి ఉంటుందో, అలాగే, బలమైన మనోశక్తి విసరిన రూపరహిత జీవి నిలిచి ఉంటుంది. మామూలుగా కలిసి ఉండే మనస్సు పదార్థాలకు ఇది తాత్కాలిక వియోగం.

రూపారూపలోకాలలో లింగపరమైన భేదాలు ఏమీ ఉండవని చెప్పాలి.

నాలుగు అరూపఝానాల ప్రకారం, అరూపలోకం, నాలుగు లోకాలుగా విభాజితమైంది. అవి :

1. ఆకాసాణ ఞ్చాయతన – అనంతాకాశ భావనా గోళం
2. విఞ్ఞాణఞ్చాయతన – అనంత విజ్ఞాన భావనా గోళం
3. ఆకిఞ్చఞ్ఞాయతన – శూన్యభావనా గోళం
4. న' ఏవ సంఞా న' ఆసం ఞాయతన – సంజ్ఞా సంజ్ఞలు లేని గోళం[4]

జగత్సిద్ధాంతాన్ని దేనిని బుద్ధుడు ప్రతిపాదించ యత్నించలేదని గుర్తించాలి.

ఈ లోకాలు ఉండడం, ఉండక పోవడం వల్ల బుద్ధుని బోధలసారం ఏమాత్రం మారదు. తన అనుభవంలోకి రాని దానిని దేనినీ, ఎవడూ నమ్మ వలసిన పని లేదు. తన పరిమిత జ్ఞానానికి అంద లేదని దేనినీ నిరాకరించడం గూడ అంత సబబైన పని కాదు.

**పాదసూచికలు :**

1. See, *Kindred Sayings,* 1.PP.85-86
2. See, *Kindred Sayings,* 11, P.170
3. శబ్దార్థ పరంగా ఉద్ధాన, లేదా వికసిత మనస్కులో (మనో ఉన్నన మెతెసమ్). మనుస్సకు సంస్కృత పదం వమానుష్య అంటె మనుసంతానం. వారిని అలా ఎందుకన్నారంటే, మనువురుషిని అనుసరించి వారు సభ్య సంసారాలు కలవారయ్యారు.
4. వివిధ భూములు వివరాలకోసం, ఆయుప్రమాణాల కోసం నారద థేరుని A *Manual of Abhiddhamma,* PP.234-246 చూడండి.

ఇరవై ఎనిమిదో ప్రకరణం

# పునర్జన్మ ఎలా కలుగుతుంది

"ఒక అనంత కాలం పాటు నివసించిన
ఒక మనిషి (అన్ని జన్మల శరీరాల) ఎముకల పోగు
ఒక పర్వతం అంత ఎత్తు అవుతుంది,
అలాగని మహారుషి అన్నాడు"

– ఇతి ఉత్తక

మరణిస్తున్న మనిషికి, ఈసంకట స్థితిలో, అభిధమ్మం ప్రకారం 'కమ్మ', 'కమ్మ నిమిత్త' లేదా 'గతినిమిత్త'లు బహూకరింప బడతాయి.

ఇక్కడ కమ్మ అంటే, అతడు తన జీవిత కాలంలో చేసిన మంచి, లేదా చెడ్డ కర్మ లేదా అతని మరణ సమయానికి ముందు చేసిన, మంచి లేదా చెడ్డకర్మ. అది మంచి ఆలోచన లేదా చెడ్డ ఆలోచన కావచ్చు. మరణిస్తున్నఅతడు పితృ హత్యలాంటి పంచఘోర నేరాలలో (గరుక కమ్మ) ఒకదానిని చేసి నట్లైతే లేదా ఝానాలను పెంపొందించుకొని ఉంటే, అతడు మరణం ముందు అటువంటి కర్మనే అనుభవిస్తాడు. ఇవి చాల శక్తిమంతాలు. అవి ఇతర కర్మ లన్నింటికి గ్రహణం పట్టించి, మనోనేత్రం ముందు చాల స్పష్టంగా దర్శన మిస్తాయి. అతడు గనుక అటువంటి బరువైన కర్మలు ఏమీ చేసి ఉండక పోతే, మరణాసన్న ఆలోచనా ప్రక్రియకు వస్తువుగా మరణాసన్న కర్మను – అంటే మరణానికి అవ్యవహితంగా జరిగిన ముందరి కర్మను – గ్రహిస్తాడు. ఇటువంటి కర్మను "మరణాసన్న కర్మ అంటారు."

మరణాసన్న కమ్మ ఏదీ లేనప్పుడు, మంచి లేదా చెడ్డ ఆచరణ కమ్మ (ఆచిణ్ణకమ్మ) లను స్వీకరించడం జరుగుతుంది. ఈ మంచి చెడ్డ కమ్మలు ఎలాంటి వంటే ఒక మంచి వైద్యుడు రోగిని బాగు చేయడం, ఒక పవిత్ర భిక్కు ధమ్మ బోధ చేయడం, ఒక దొంగ అలవాటుగా దొంగతనం చేయడం లాంటివి. ఈ కర్మలు గూడ లేనట్లయితే, ఏదో ఒక తత్కాల అల్ప మంచి లేదా చెడ్డ కర్మ (కతత్తా కమ్మ) మరణ ఆలోచన ప్రక్రియకు వస్తువు అవుతుంది.

కమ్మ నిమిత్త లేదా "ప్రతీక" అంటే ఏదో ఒక ముఖ్యమైన మంచి లేదా చెడ్డ కర్మ జరుగు తున్నప్పుడు ప్రబలంగా ఉండే, రుచి, రంగు, వాసన, స్పర్శ, దృశ్య, భావాల మానసిక

రూపం. జంతు వధకుని విషయంలో కత్తులు లేదా మరణిస్తున్న జంతువుల దృశ్యం, వైద్యుని విషయంలో రోగులు, భక్తుని విషయంలో పూజావస్తువు అలాంటివే.

గతినిమిత్త లేదా ''విధి ప్రతీక'' అంటే భావిజన్మ స్థలానికి సంబంధించిన ఏదో ఒక ప్రతీక. మరణిస్తున్న వ్యక్తుల కిది తరుచు కనిపించి, తన ముద్రను – సంతోషం లేదా దుఃఖం – వారి లక్షణాల మీద గుద్దుతుంది. భావి జన్మకు సంబంధించిన అటువంటి సూచనలు అందగానే, అవి చెడ్డవైతే, వాటిని, కొన్నిసార్లు, రహితం చేయవచ్చు. మరణిస్తున్న మనిషి ఆలోచనలను ప్రభావితం చేయడంద్వారా ఈ పని చేయవచ్చు. విధికి సంబంధించిన అటువంటి భావి సూచక దృశ్యాలు[1] అగ్ని, అరణ్యాలు, పర్వత ప్రదేశాలు, తల్లిగర్భం, దివ్యహర్మ్యాలు ఇంకా అలాంటివి కావచ్చు.

ఒక ఆలోచనా ప్రక్రియ, తనకు వస్తువుగా కమ్మను గాని, కమ్మ ప్రతీకను గాని, విధిప్రతీకను గాని తీసుకొని, మరణం తక్షణమే సంభవించినా గూడా, దాని గతిని అది పూరిస్తుంది.

సౌలభ్యం కోసం, మానవ లోకంలో పునర్జన్మ ఎత్త వలసిన మరణిస్తున్న ఒకవ్యక్తిని తీసుకొందాం. ఆలోచనా ప్రక్రియ వస్తువుగ ఒక మంచి కర్మను ఊహిద్దాం.

అతని భవంగ విజ్ఞానానికి భంగం కలుగుతుంది. ఒక్క ఆలోచనా క్షణం ప్రకంపించి అంతర్హిత మవుతుంది, ఆ తరవాత మనోద్వార విజ్ఞానం (మనో ద్వారా వజ్జన) పుట్టి, గతిస్తుంది. ఆ తరవాత మనో విజ్ఞాన పరమైన ముఖ్యమైన దశ వస్తుంది. ఇది జవన ప్రక్రియ. దాని బలహీనత కారణంగా అది మామూలుగా ఉండ వలసిన ఏడు ఆలోచనా – క్షణాలకు మారుగా, ఐదు ఆలోచనా క్షణాలే నడుస్తుంది. దానికి పునరుత్పాదక శక్తి ఉండదు. దాని ముఖ్యకార్యం కేవలం నూతన అస్తిత్వాన్ని (భవాన్ని) నియంత్రించడం వరకే. ఇక్కడ వస్తువు కోరదగింది కనుక, అతడు అనుభవించే విజ్ఞానం ధార్మికం అవుతుంది. ఆవిధంగా దర్శించిన వస్తువును రెండు క్షణాల పాటు గుర్తించే లేదా గుర్తు పెట్టుకో వలసిన తదాలంబన విజ్ఞానం దాని ననుసరించి రావచ్చు, రాకపోవచ్చు. ఈ జీవితంతో అనుభవించ వలసిన చివరి ఆలోచనా – క్షణం – మరణ విజ్ఞానం (చుతిచిత్త), దీని తరవాత వస్తుంది.

తరువాతి జన్మను ఈ చివరి ఆలోచనా క్షణం నిబద్ధిస్తుందనే ఒక అపార్థం కొందరిలో ఉంది. అసలు అది నిర్వహించాల్సిన ప్రత్యేక కార్యమంటూ ఏదీ లేదు. తరువాతి జన్మను అసలు నిబద్ధించేది జవన ప్రక్రియలో ఏది అనుభవంలోకి వస్తుందో అది.

'రుగ్మతా – విజ్ఞానం' అంతం కావడంతో వాస్తవ మరణం సంభవిస్తుంది. అప్పుడు మనస్సు ఆహారాల (చిత్త ఆహారజాల) నుంచి జనించిన భౌతిక లక్షణాలు ఇక నిష్పన్నం

కావు. శవం మట్టై పోయేదాకా, కేవలం ఉష్ణం నుంచి జనించిన (ఉటుజ) భౌతిక గుణాలశ్రేణి మాత్రమే కొనసాగుతుంది.[2]

పునర్జన్మ విజ్ఞానంతో పాటు కాయ, భావ, వత్థు దసకలుగూడ ఏక కాల మందే జనిస్తాయి.[3]

బౌద్ధం ప్రకారం, ఆడగా లేదా మగగా పుటట్టడం అనేది గర్భధారణ క్షణంలో నిశ్చితమై, కర్మతో నిబద్ధిత మవుతుందే గాని, శుక్ర – అండ కణాల యాదృచ్ఛిక సంయోగం వలన కాదు.[4]

గత జన్మ విజ్ఞానం గతించడమే తరువాతి జన్మలో నూతన విజ్ఞానం అవతరించే సందర్భం. ఏది ఏమైన, మారనిదీ, శాశ్వతమైనది ఏదీ గతం నుంచి ప్రకృతానికి బదిలీ కాదు.

బండి చక్రం భూమిని ఎప్పుడూ ఒక బిందువు వద్దే తాకుతుంది. అలాగే, సరిగ్గా చెప్పా లంటే, మనం కేవలం ఒక 'ఆలోచనా – క్షణం' మాత్రమే జీవిస్తాం. మనం ఎప్పుడూ వర్తమానంలోనే ఉంటాం. ఆ వర్తమానం ఎప్పుడు, తిరిగి రాని గతంలోకి జారిపోతూ ఉంటుంది. పరివర్తితమయ్యే జీవిత ప్రక్రియ యొక్క ప్రతి క్షణిక విజ్ఞానం గతించి పోతూ, దాని మొత్తం శక్తిని, దాని మీద పడిన చెరగని ముద్రలను, దాని తరవాత దాని ననుసరించి వచ్చే క్షణిక విజ్ఞానానికి ప్రసారం చేస్తుంది. ప్రతి తాజా విజ్ఞానం, అందుకని, దాని పూర్వ క్షణిక విజ్ఞానాల వాసనలను శక్మల (Potentials) ను కలిగి ఉండమే కాక, వాటితో పాటు కొంత అదనాన్ని గూడ కలిగి ఉంటుంది. మరణ సమయంలో విజ్ఞానం మరణిస్తుంది. ఎందుకు? పునర్జన్మలో మరో దానికి జన్మ నివ్వడానికి మాత్రమే. అసలు వాస్తవానికి అది ప్రతిక్షణమూ మరణిస్తూనే ఉంటుంది. ఈ పునర్నవీకృత విజ్ఞానం గతానుభవాల నన్నింటిని వారసత్వంగా పొందుతుంది. ఎప్పుడూ మారే పలక లాంటి మనస్సు మీద అన్ని అనుభవాలు ముద్రితమైన కారణాన, జీవితం నుంచి జీవితానికి బీజశక్తులు ప్రసారిత మవడం వల్ల, తాత్కాలికంగా అవి విచ్ఛిన్నమైనా, గతజన్మల, సంఘటనల వాసన లుండ వచ్చు. జ్ఞాపకాలు కేవలం మెదడు కణాల మీద ఆధారపడి నట్లయితే, అటువంటి స్మృతికి అవకాశమే లేదు.

భిక్కు శీలాచారుడు అంటున్నాడు: ''కమ్మశక్తి ప్రవాహ అభివ్యక్తి అయిన ఈ నూతన జీవి, ఆ వరుసలో తన పూర్వజీవి కంటె భిన్నమైంది. దీనికి కారణం దీనిని తయారించిన స్కంధాలు పూర్వజీవిని తయారించిన స్కంధాల కంటె భిన్నాలు. అయినా ఇది పూర్వ జీవి కంటె పూర్తిగా వేరైనదీ భిన్నమైనదీ కాదు. ఎందుకంటే దీనిలోను, దానిలోను, అదే కమ్మశక్తి ఉంది. కాకపోతే అది పూర్వ జీవిగా దర్శన మిచ్చిన కారణాన, తరువాతి జీవిగా కనిపించిన కారణాన, కొద్ది మార్పు ఉంటుంది.

మరణం అంటే బౌద్ధం ప్రకారం, ఒకే ఒక వైయక్తిక భవానికి సంబంధించిన మానసిక శారీరక జీవితం (జీవితింద్రియం) అంతం కావడం. ఆయువు (vitality)ను కోల్పోవడం. అంటే, జీవితింద్రియాన్ని, ఉస్మ (ఉష్ణ) విజ్ఞానాలను కోల్పోవడం.

మరణం అంటే జీవి పూర్తిగా నాశం గావడం కాదు. ఎందుకంటే, ఒక ప్రత్యేక 'జీవితావధి' అంతమైనా, ఇంతకు ముందు దానిని ప్రోత్సహించిన శక్తి అంతం కావడం లేదు.

బయటికి కనిపించే ఒక విద్యుద్దీపపు వెలుగు, అదృశ్య విద్యుచ్ఛక్తికి ఎలా అభివ్యక్తో, అలాగే మనమూ అదృశ్య కమ్మశక్తికి బాహ్య అభివ్యక్తి రూపాలం. బల్బు పగిలి పోవచ్చు, వెలుగు ఆరిపోవచ్చు. విద్యుత్తు ఉంటుంది. అది మరొక బల్బును వెలిగించ వచ్చు. అలాగే భౌతిక శరీర విచ్ఛిత్తి జరిగినా, కమ్మబలం చెక్కుచెదరక నిలుస్తుంది. ప్రస్తుత విజ్ఞానం గతించడం మరో జన్మలో తాజా విజ్ఞానం పుట్టడానికి దారి తీస్తుంది. కాని మారనిది, శాశ్వతమైంది ఏదీ వర్తమానం నుంచి భవిష్యత్తుకు ''పోదు''.

ఇంతకు ముందు చెప్పిన సందర్భంలో, మరణానికి ముందర అనుభవించిన ఆలోచన నైతికమైంది కనుక, తత్ఫలితంగా రూపొందిన పునర్జన్మ విజ్ఞానం, దానికి కావలసిన పదార్థాన్ని మానవ మాతా పితరుల శుక్రాండాల నుంచి గ్రహిస్తుంది. పటిసంధి విజ్ఞానం అప్పుడు భవంగ స్థితిలోకి జారిపోతుంది[5].

మరణ సమయంలో, ప్రవాహసాతత్యం, కాలంలో తెగిపోదు. విజ్ఞాన ప్రవాహానికి గండి పడదు.

ఆకాశంలోకి పంపిన విద్యుదయస్కాంత తరంగం ఎలా వెంటనే రేడియో సెట్టును చేరుతుందో, అలాగే పుట్టిన లోకంతో సంబంధం లేకుండ, పునర్జన్మ వెంటనే సంభవిస్తుంది. మానసిక ప్రవాహ పునర్జన్మ గూడ (మధ్యలో మరేది ప్రవేశించడానికి వీలు లేకుండా) వెంటనే జరుగుతుంది. (అనతరభవ)[6]. మరణించిన వ్యక్తి ఆత్మ (Spirit), ''పునరవతారాని''కి దానికి తగిన స్థలం దొరికేదాక, ఏదో ఒక తాత్కాలిక స్థితిలో ఉంటుందనే విశ్వాసాన్ని శుద్ధ బౌద్ధం బల పరచదు.

అవ్యవహిత పునర్జనన సమస్యను ''మిళింద ప్రశ్నలు'' చక్కగా చెప్పింది.

మిళిందుడు ప్రశ్నిస్తున్నాడు:

''గౌరవనీయ నాగసేనా, ఒకడు ఇక్కడ మరణించి బ్రహ్మలోకంలో పుట్టాడు. మరొకడు ఇక్కడ చనిపోయి కాశ్మీర్‌లో పుట్టాడు. వారిలో ఎవరు ముందుగా చేరతారు?''

''ఓ, రాజా'' వారిద్దరూ ఒకే సారి చేరతారు,

''రాజా, మీరు ఏ నగరంలో జన్మించారు?''

''గౌరవనీయమైన అయ్యా 'కలసి' అనే గ్రామంలో''

''ఓ, రాజా? కలసి ఇక్కడకు ఎంత దూరం''

''సుమారు రెండు వందల మైళ్ళు, గౌరవనీయా!''

'' ఇక్కడకు కాశ్మీర్ ఎంత దూరం, రాజా?''

''దాదాపు పన్నెండు మైళ్ళు, గౌరవనీయా.''

'' ఇప్పుడు మీరు కలని మనస్సులోకి తెచ్చు కోండి.''

''అలాగే, తెచ్చుకున్నాను''

'' ఇప్పుడు కాశ్మీర్‌ను మనస్సులోకి తెచ్చు కోండి, రాజా''

''గౌరవనీయా, తెచ్చుకొన్నాను.''

''ఈ రెండింటిలో, ఓ రాజా, ఏది నెమ్మదిగా, ఏది త్వరగా మీ మనస్సులోకి తెచ్చుకొన్నారు?''

''రెండింటిని త్వరగానే సమవేగంతోనే, గౌరవనీయా ''

''అలాగే, ఓ రాజా, ఇక్కడ మరణించి బ్రహ్మలోకంలో పుట్టినవాడు, ఇక్కడ మరణించి కాశ్మీర్‌లో పుట్టిన వానికంటె ఆలస్యంగా జన్మించ లేదు''

''మాకు మరో ఉపమానాన్ని ఇవ్వండి, అయ్యా.''

''దీనిని గురించి మీరే మంటారు?: రెండు పక్షులు ఆకసంలో ఎగురు తున్నాయి. ఒకే సారి తమ గమ్యాలకు చేరు కోవాలి. ఒక దాని గమ్యం ఎత్తైనచెట్టు, రెండోదానిది తక్కువ ఎత్తు చెట్టు. అందులో ఏ పక్షి నీడ భూమిని ముందుగా చేరు తుంది? దేనినీడ ఆలస్యంగా చేరు తుంది?''

''రెండింటి నీడలు ఒకేసారి, ఒక దాని కంటె మరొకటి ముందు, వెనక కాక, కనిపిస్తాయి.''[7]

ఒక ప్రశ్న ఉదయించ వచ్చు: పునర్జన్మ ఆలోచనను గ్రహించడానికి శుక్రాండాల కణాలు ఎప్పుడూ తయారుగా ఉంటాయా?

బౌద్ధం ప్రకారం, జీవులు అసంఖ్యాకాలు. ప్రపంచాలు అంతే. గర్భధారణ జరిగిన గుడ్డు ఒక్కటే పునర్జన్మకు మార్గం కాదు. రః విశ్వంలో, అప్రముఖ శకలమైన భూమి ఒక్కటే

నివాస స్థలం కాదు. మానవులొక్కరే ప్రాణులూ కారు. అందుకని అంతిమాలోచన ప్రకంపనను గ్రహించడానికి ఎప్పుడూ తగిన స్థలం ఉంటుందనే దానిని నమ్మడం అసంభవ మేమీ కాదు. పడుతున్న రాతిని గ్రహించ డానికి ఎప్పుడూ ఒక స్థలం ఉండనే ఉంటుంది.

**పాదసూచికలు :**

1. ''పునర్జన్మ లోకాలకు సంబంధించిన భావిసూచనలు'' కోసం డా. W.Y. Evans-wentz రాసిన *The Tibetans Book of the Dead,* P 183 చూడండి.

2. బౌద్ధం ప్రకారం భౌతిక లక్షణాలు నాలుగు విధాల ఉత్పాదిత మవుతాయి: (i) కమ్మ అంటే గతనైతిక, అనైతిక చర్యలు (ii) ఉటు అంటే భౌతిక మార్పు లేదా వేడి, చలి రెండింటిని కలిగిన తేజా (ఉష్ణం) (iii) చిత్త అంటే మానసిక లక్షణాలు, మనస్సు (iv) ఆహార అంటే ఆహారంలో ఉండే పోషకం.

3. 25వ ప్రకరణం చూడండి.

4. ''పరిపక్వం చెందిన లైంగిక కణ నిర్మితిలోని క్రోమోజోములు గర్భధారణలో వ్యక్తి లింగాన్ని నిర్ణయిస్తాయి. దీని ద్వారా పిండానికి, ఏదో ఒక లింగంగా మారే బీజశక్తి లభిస్తుంది.'' ఫ్రాంక్ అలెగ్జాండర్, *Psychosomaatıc Medicine,* P.219.

5. నారద థేర, *A Manual of Abidhamma,* P. 273

6. ''టిబెటన్ గ్రంథాల ప్రకారం, మధ్యంతరస్థితి ఉంది. ఇందులో జీవులు ఒకటి, రెండు, మూడు, ఐదు, ఆరు లేదా ఏడు వారాలు – 49 రోజు వరకు ఉంటాయి. ఈ దృక్పథం బౌద్ధానికి వ్యతిరేకం. *"The Tibeton Book of the Dead;* p.p. 160-165.'' డా. ఇవాన్‌వెంట్జ్, చూడండి.

7. మిళింద ప్రశ్నలు, 1, P.P. 127–128

8. ''పాలపుంతలో పది లక్షల గ్రహ వ్యవస్థ లున్నాయి. వాటిల్లో జీవులుండ వచ్చు'' See Fred Hoyle, *The Nature of the Universe,* PP 87-89.

ఇరవైతొమ్మిదో ప్రకరణం

# తిరిగి పుట్టిన దేది?

## (ఆత్మ లేదు)

" అది అదీ కాదు, మరొకటీ కాదు"

– విశుద్ధిమగ్గ

మనిషిలో అతడి నిర్మాణాంశాలైన మనస్సు, పదార్థం కంటె భిన్నమైన శాశ్వతాత్మ లేదా శాశ్వత అహం లేదు అంటుంది, బౌద్ధం. దీనిని మానవుడు ఒక మార్మిక పద్ధతిలో, అంతే మార్మికమైన ఒక మూలం నుంచి పొందాడు.

శాశ్వతమైన ఆత్మ ఎటువంటి మార్పుకు లోను గాక అదే విధంగా ఉండాలి. మానవుని సారంగా భావించ బడిన ఆత్మ గనుక శాశ్వతమైతే, నిత్యమైతే, దానిలో ఎదుగు బొదుగు లుండే అవకాశమే లేదు. "అసలు ఆత్మలు ఎందుకు వివిధంగా నిర్మితాలయ్యాయో," ఎవరూ వివరించ లేరు.

ఒక శాశ్వత స్వర్గంలో అనంతంగా సుఖం ఉంటుందనీ, ఒక శాశ్వత నరకంలో అనంతంగా పీడ ఉంటుందనీ సమర్థించ డానికి ఒక అమర్త్య ఆత్మ ఉండాలని ప్రతిపాదించి తీరాలి.

బెర్ట్రాండ్ రసెల్ తన *Science and Religion* అనే గ్రంథంలో (1960 Edn , pp 132-133) ఒక మాట చెప్పితీరాలన్నాడు: "ఆత్మకు శరీరానికి మధ్య పూర్వపు తేడా, ఇప్పుడు ఇగిరి పోయింది, ఎందుకంటే పదార్థం తన ఘనత్వాన్ని, మనస్సు తన ఆధ్యాత్మికతను కోల్పోయాయి." ఆ తరవాత (పే.143) "మనోవిజ్ఞాన శాస్త్రం.... శాస్త్రీయం కావడం మొదలైంది..... మనో విజ్ఞాన శాస్త్రం, శరీధర్మ శాస్త్రాలు ఇప్పుడున్న స్థితిని బట్టి చూస్తే, ఏమైనా, అమర్త్యత్వాన్ని విజ్ఞాన శాస్త్రం బలపరచదు."

*"Riddle of the Universe"* గ్రంథకర్త ప్రకారం (పే.166):

"వ్యక్తిక సృష్టికర్త మనిషిలోకి ఒక అమర్త్య ఆత్మను (మామూలుగా దీనిని దివ్యాత్మలో ఒక భాగంగా పరిగణిస్తారు) ఊదాడనే ఆధ్యాత్మిక సిద్ధాంతం ఒట్టి పుక్కిటి పురాణం. ప్రపంచ నైతిక వ్యవస్థ కొనసాగా లంటే మానవాత్మకు శాశ్వతత్వం ఉండి తీరాలనే విశ్వసిద్ధాంతం ఆధార రహిత ఛాందసం. లోపభూయిష్టమైన తన ఆత్మను, మరణానంతరం గూడ

పరిపూర్ణం గావించు కోవడం, మానవుని '' ఉన్నత విధి'' (higher destiny) లో ఒక భాగమని చెప్పే ''అంతిమకారణాలా'' (final cause) సిద్ధాంతం తప్పుడు మానవజాతి శాస్త్రం క్రిందకు వస్తుంది. మనిషి పృథ్వీజీవితంలోని లోపాలు, తీరని కోర్కెలు, స్పష్ట పరిహారం క్రింద, శాశ్వతత్వానికి ఆవలివైపున పూరింప బడతాయి అనే నైతిక వాదం ఒక పవిత్రవాంఛ కంటేవేరు కాదు. ''దేవుని మీద విశ్వాసంలా, అమర్త్యతలో విశ్వాసం అంతఃస్పిద్ధ సత్యం, మానవాళి అంతటికి ఈ విశ్వాసం సామాన్యం'' - అనే సాంస్కృతిక సిద్ధాంతం దోష పూరితం. సరళ అభౌతిక, అవిభాజ్య సత్యమైన ఆత్మ మరణంతో కలుషితం కాలేదనే సత్తా సిద్ధాంతం మానసిక దృగ్విషయానికి సంబంధించిన తప్పుడు దృక్పథం. ఆధాత్మిక ఆభాస అది. ఇవీ, ఇంకా ఇటువంటి అమర్త్యతా (Athanatism) సిద్ధాంతాలు అపాయకర స్థితిలో ఉన్నాయి. ఇటీవలి దశాబ్దాలలో వచ్చిన శాస్త్రీయ విమర్శ వాటిని తోసి వేసింది.''

మరి ఈ జీవితం నుంచి మరో జీవితానికి వెళ్ళేది ఆత్మగాని, స్పిరిట్‌గాని కాక పోతే, తిరిగి పుట్టేది ఏమిటి?

అసలు ఈ ప్రశ్నే, ఏదో ఒకటి తిరిగి పుడుతుందనే విషయాన్ని, ప్రశ్నించకుండానే అంగీకరిస్తున్నది.

కొద్ది శతాబ్దాల క్రితం ఇలా వాదించ బడింది: ''నేను ఆలోచిస్తాను కనుక నేను ఉన్నాను'' (Cogito, ergo sum) (ఆలోచించాలంటే ఆలోచించే వాడొకడు ఉండాలి కదా). నిజమే, కాని అసలు ఆలోచించడానికి ''నేను'' అనేది ఉండాలి అనే విషయం రుజువు చెయ్యాలి కదా.

మనకు, అది నిజం కాదని తెలిసినా, సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమిస్తాడని చెబుతుంటాం, చూడడానికి అలాగే కనిపించినా. ఎవడు అదే చోటును రెండుసార్లు తాక లేడు.

ప్రతిదీ వెంట వెంటనే మారుతుంది. మనం ఏ రెండు క్షణాల పాటు అదే మనుషులం కాము.

బెర్ట్రాండ్ రసెల్ *Religion and science* (1960 edn, pp 118-19) లో చెప్పిన దానితో బౌద్ధులు ఏకీభవిస్తారు.

'' 'ఇవ్వాల్టి నేను' 'నిన్నటి నేను' ఒకటే అనడంలో కొంత అర్థం ఉంది. ఇంకా స్పష్టమైన ఉపమానం చెప్పాలంటే, ఏక కాల మందే నేను ఒక మనిషిని చూడడం, అతని మాటలను వినడం సంభవిస్తే, అతనిని చూసిన 'నేను' అతనిని విన్న 'నేను' - రెండూ ఒకటే అనడంలో కొంత అర్థం ఉంది.''

ఇటీవల వరకు శాస్త్రజ్ఞులు అణువును విభజించలేమని, నాశం చేయ లేమని భావించారు. ''తగు హేతువులతోనే, భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్తలు అణువును సంఘటన శ్రేణిగా పరివర్తించారు. అంతే బలమైన కారణాలతో మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు, మనస్సును ఏ రెండు క్షణాలు కొనసాగే ఒకే వస్తువుగా పరిగణించక, అత్యంత సన్నిహిత సంబంధాలతో బంధితమైన అనేక సంఘటనల శ్రేణిగా భావించారు. ప్రాణంతో ఉన్న ఒక దేహానికి సంబంధించిన సంఘటనలకు ఆ శరీరం మరణించిన తరవాత సంభవించే ఇతర సంఘటనలకు మధ్య అటువంటి సన్నిహిత సంబంధం ఉన్నదా లేదా అనేదానికి సంబంధించిన ప్రశ్న అవుతుంది అమర్త్యతా ప్రశ్న'' *(Religion and Science,* 1960 Edn., pp. 138-39).

''పదార్థం మన కళ్ళ ఎదుటే విచ్ఛిన్నమై పోయింది, అది ఇప్పుడు ఏ మాత్రం ఘనం కాదు. ఏమాత్రం మన లేదు. ఏ మాత్రం అవశ్యక నియమాలతో నిశ్చితం కావడం లేదు, అన్నింటినీ మించి అది ఏమాత్రం జ్ఞాతం కావడం లేదు.'' (C.E.M. Joad, *The Meaning of Life.)*

పరమాణువులని పిలవబడేవి ఇప్పుడు పగల గొట్టడానికి, నాశనం చేయ డానికి – రెండూ జరగడానికి – అవకాశం ఉన్నట్లు కనపడుతుంది. ''పరమాణువుల నిర్మాణకాలైన ఇలెక్ట్రానులు, ప్రోటానులు ఒకదానితో ఒకటి ఢీకొని నాశం చేసు కోగలవు. అవి సతతం ఆకృతిలోను, స్థానంలోను ( ఉన్నచోట ఉండ కుండ) మారుతూ, ఒక వస్తువులాగ కాక, స్థిర సరిహద్దులేని (అంచులు లేని) తరంగంలా కొనసాగుతాయి.''

''అణువు అని పిలవబడే 'ఇది' ఒక అధిభౌతిక కల్పన,'' అని చెప్పిన బిషప్ బర్క్లీ, 'ఆత్మ' అనే ఆధ్యాత్మిక పదార్థం ఉందని భావించాడు:

ఆత్మను వెతుక్కొంటూ పోయిన డేవిడ్ హ్యూమ్ *(A Treatise of Human Nature, BK. Pt. IV, Sect vi)* క్రింది విధంగా ప్రకటించాడు.

'''ప్రతి క్షణమూ మనం ఆత్మ (self) అని పిలిచేదానికి సన్నిహితంగా సచేతనులమై ఉంటాం; దాని అస్తిత్వాన్ని సాతత్యాన్ని అనుక్షణం అనుభూతి చెందుతూ ఉంటాం. దాని తాదాత్మ్యత, సరళతలను, రుజువు చేసి చూపలేం. కాని, అవి నిజమనడంలో సందేహం లేదు' – అని అనుకొనే కొందరు తత్త్వవేత్తలున్నారు... నాకు సంబంధించినంత వరకు, నేనెప్పుడు అత్యంత సన్నిహితంగా నా ఆత్మ అని పిలిచే దానిలోకి తొంగి చూసు కొన్నా, నాకు తగిలేవి సంజ్ఞలో, ఉష్ణ శీతలాలో, వెలుగు నీడలో, రాగ ద్వేషాలో, బాధా సుఖాలో మాత్రమే[1]. ఏదో సంజ్ఞ లేకుండా దానిని నేనెపుడు పట్టుకోలేక పోయాను. సంజ్ఞ (Perception) ను తప్ప దేనినీ చూడ లేక పోయాను.''

హ్యాన్రీ బర్గసన్ అంటాడు,

''చేతన మంతా (All consciousness) కాలికం. చేతన స్థితి ఏదీ మారకుండా కొనసాగదు. అది అంతరించ కుండ జరిగే మార్పు. మార్పు అంతరించి నప్పుడు అదీ అంతరిస్తుంది. దానికై అది మార్పు తప్ప మరేమీ కాదు.''

ఒక ప్రముఖ మనోవిజ్ఞాన శాస్త్రవేత్త జె.బి. వాట్సన్ ప్రవర్తన వాదం *(Behaviourism* 1970 edn., p.3) లో అంటాడు :

''ఎవడూ ఆత్మను తాక లేదు. శోధన నాళికలో దానిని ఉంచ లేదు. నిత్యం మనం అనుభవించే వస్తువులతో సంబంధాలు పెట్టుకొన్నట్లుగా దానితో సంబంధాలు పెట్టుకో లేదు. అలాగై గూడ, దాని ఉనికిని శంకిస్తే పాషండుడు, నాస్తికుడు అవుతాడు. ఒకప్పుడు అలా శంకించి తల దీయించు కొన్న సందర్భా లున్నాయి. ఈ రోజు గూడ పెద్ద పదవిలో ఉన్న వాడు దానిని ప్రశ్నించ సాహసించ లేడు.''

ఆత్మ సమస్యను చర్చిస్తూ విలియమ్ జేమ్స్ *Principles of Psychology* (p.248) లో అంటాడు:

''వాస్తవంగా రుజువైన చేతనానుభవ విషయాలకు సంబంధించినంతవరకు, ఆత్మ - సిద్ధాంతం పూర్తిగా అతిరేకం (Superfluity). ఇంత వరకు, స్పష్టమైన శాస్త్రీయ కారణాల వల్ల, ఎవరినీ దానిని ఒప్పుకోమని నిర్బంధించ లేము.''

ఇంకా (P.P. 400-401) ఇలా అంటాడు:

''వస్తుగతంగా తెలిసిన విషయాల ఆనుభవిక సమాహారమే ఈ 'నన్ను' (me). వాటిని ఎరిగే 'నేను' (I) - అది ఒక సమాహారం కావడానికి వీలు లేదు. మనోవైజ్ఞానిక అవసరాలకు గూడ, దానిని, ఆత్మలాంటి, ఒక మారని అధిభౌతిక సత్యంగా పరిగణించ వీలు లేదు. లేదా దానిని 'కాలం వెలుపలి' శుద్ధ అహం లాగ ఒక ముఖ్యమైన సత్వంగా పరిగణించ వీలు లేదు. అది ప్రతిక్షణంలోని ఒక 'ఆలోచన'. అంతకు ముందరిక్షణం ఆలోచన కంటె భిన్నమైన ఆలోచన. తరువాతి ఆలోచనను 'నాది' అని చెప్పు కొనే దాని నంతటిని తగువిధంగా సందర్భోచితం చేస్తుంది. ఈ వర్ణనలో ఆనుభవిక విషయాలకు వాటి చోటు వాటికి ఉంది. అయితే ఇందులో గతిస్తున్న ఆలోచనలు లేదా మానసిక స్థితులు తప్ప వేరే ప్రాక్కల్పన లేదు''

ఆత్మ (Self) ప్రకరణంలో అతని మాటలున్నాయి:

''.... అలాంటప్పుడు చింతనే చింతనుడు (Thinker)....''

గంగా లోయలో బుద్ధుడు 2500 సంవత్సరాల నాడు పలికిన పలుకులకు ఇది ప్రతిధ్వని.

సైక్ (ఆత్మ) లేని మనోవిజ్ఞానాన్ని బోధిస్తూ బౌద్ధం జీవిని నిరతం ప్రవహించే మనస్సు – పదార్థాలుగ (నామ – రూపాలుగ) పరిగణిస్తుంది.

ప్రాచీన కాలంలో భారతీయ రుషులు గూడ అభేద్యమైన అణువును విశ్వసించారు. వారు దానిని పరిమాణువు అన్నారు. ప్రాచీనుల విశ్వాసం ప్రకారం అణువు ముప్పై ఆరు పరమాణువులతో నిర్మిత మవుతుంది. ముప్పై ఆరు అణువులతో ఒక తజ్జారి, ముప్పై ఆరు తజ్జారీ లతో ఒక రథ రేణువు నిర్మిత మవుతాయి. మనకు సూర్యకాంతి పుంజంలో కనిపించే ధూళి రేణువులనే రథరేణవు లంటారు. అందుకని ఒక పరమాణువు అంటే రథరేణువులో 1/46,656 వ భాగం. ఈ అసాధారణ దృష్టితో బుద్ధుడు పరమాణువును విశ్లేషించి, అది పరమత్థలని పిలవబడే అంతస్సంబంధ శక్తులతో కూడి ఉందని చెప్పాడు. ఈ పరమత్థలు పదార్థ అవశ్యక మూలకాలు.

ఈ పరమత్థలు పఠవి (పృథవ్వ), ఆపో, తెజో, (తేజస్సు) వాయో (వాయు)లు.

పృథివి అంటే, విస్తృతి మూలకం, పదార్థానికి ఆశ్రయం. ఇది లేనిదే వస్తువులు ఆకాశాన్ని నింప లేవు. సాపేక్షాలైన గట్టితనం, మృదుత్వాలు; ఇవే మూలకానికి ఉపాధులు.

ఆపో అనేది సంసక్త మూలకం. పృథ్వి వలె కాక దీనిని తాకలేం. చెదరి ఉన్న పదార్థాణువులను ఒకచోట చేర్చి కలిపి ఉంచి, వస్తు భావనను ఇచ్చేది ఈ మూలకమే. ఘన వస్తువులను కరిగించి నప్పుడు తయారైన ద్రవంలో ఈ మూలకం ప్రముఖంగా కనిపిస్తుంది. ఘన వస్తువులను పిండిగా దంచి నప్పుడు, ఆ అల్పకణాలలో గూడ ఈ మూలకం కనిపిస్తుంది. విస్తృతి, సంసక్తత మూలకాలు ఎంత దగ్గర సంబంధాన్ని కలిగి ఉంటాయంటే, సంసక్తత లేకపోతే విస్తృతి గూడ లేకుండా పోతుంది.

తేజో అంటే ఉష్ణ మూలకం. శీతలం గూడ తేజోకు మరోరూపం. తేజోలో ఉష్ణ శీతలాలు రెండూ ఉన్నాయి. ఎందుకంటే, వస్తువులను పరిపక్వం గావించే గుణం వాటికి ఉంది. మరోమాటలో చెప్పా లంటే అది ప్రాణిక శక్తి. వస్తువులు అలాగే కొనసాగడం (స్థితి పాలనం = సంరక్ష = Preservation) చెడి పోవడం (decay) దీని కారణంగానే. ఇతర మూడు పదార్థ మూలకాల వలె కాక, 'ఉతు' అని పిలవబడే ఇది, తననుతాను పునర్జీవించుకోగల శక్తి కలిగి ఉంది.

'వాయో' చలన మూలకం. దీని వలనే చలనాలు కలుగుతాయి. చలనంను శక్తిగా, ఉష్ణజనకంగా భావిస్తారు.

పదార్థ ప్రపంచంలో చలన, ఉష్ణాలు మానసిక క్షేత్రంలోని విజ్ఞాన, కర్మలకు వరుసగా సరి పోతాయి.

ఈ నాలుగు, పదార్థం ప్రాథమిక పరిమాణాలు. ఇవి అవశ్యం తమ నాలుగు నిష్పన్నతల (derivatives) – రంగు (వన్న) వాసన (గంధా) రుచి (రస), పోషక సారం (ఓజస్సు) – తో కలిసి ఉంటాయి.

ఈ నాలుగు మూలకాలు, వాటి నిష్ప న్నాలు అవి భాజ్యాలు, పరస్పర సంబంధితాలు. అయితే ఒక మూలకం రెండో దాని కంటె, ఆధిక్యాన్ని ప్రదర్శించ వచ్చు. ఉదాహరణకు భూమిలో విస్తృతి మూలకం ఆధిక్యంలో ఉంటుంది. నీటిలో సంసక్తత, నిప్పులో ఉష్ణం, గాలిలో చలనం ఆధిక్యాన్ని ప్రదర్శిస్తాయి.

ఈ విధంగా పదార్థంలో, నిరతం ప్రవహించే శక్తులు, గుణాలు ఉంటాయి. బౌద్ధం ప్రకారం, పదార్థం పదిహేడు 'ఆలోచనా – క్షణాలు' మాత్రమే కొనసాగుతుంది.

ఒక 'ఆలోచనా – క్షణం' కాలవ్యవధి, మెరుపుకు పట్టే కాలంలో పది వేల వంతు కంటె తక్కువ.

సంక్షిప్త మానవయంత్రంలో మనస్సు చాల ముఖ్యమైన భాగం. దీనిలో ఏభైరెండు మానసిక స్థితు లుంటాయి. వేదన ఒకటి. సంజ్ఞ (perception) మరొకటి. మిగతా ఏభైని చేతన చర్యలు (Volitional activities) అంటారు. అసలివి సంఖారాలు. అయితే 'చేతనచర్యలు' అనే పదాలు పాళీ సంఖారాలు ఇచ్చే అర్థాన్ని సరిగా ఇవ్వలేవు. వాటిలో చేతన (Volition) ముఖ్యమైన కారకం. ఈ మానసిక స్థితులన్నీ విజ్ఞానం నుంచి జనిస్తాయి.

ఏదో ఒక వస్తువును – అది భౌతికం కా వచ్చు, మానసికం కావచ్చు – పట్టుకొని వేలాడని ఎదో ఒకరకం ప్రత్యేక విజ్ఞానాన్ని అనుభవించ కుండ మనిషి ఒక్క క్షణం గూడ ఉండడని బౌద్ధం అంటున్నది. అటువంటి విజ్ఞానం కాల అవధిని ఒక ఆలోచనా క్షణం అన్నారు. ప్రతి ఆలోచనా క్షణాన్ని అనుసరించి మరో క్షణం వస్తుంది. ఈ విధంగా మానసిక స్థితుల లోని అనుక్రామికలో 'కాల' మూలకం ఉంటుంది. అటువంటి క్షణాల అనుక్రామిక వేగాన్ని మనం ఊహించ లేం.

ప్రతి విజ్ఞాన ప్రమాణం (యూనిట్)లో మూడు క్షణా లుంటాయి. అవి ఉపాద (జననం), నిశ్చల లేదా వికాసం (ఠితి), లయ (భంగం)లు.

ఒక 'ఆలోచనా – క్షణం' అయిపోగానే, తరువాతి 'ఆలోచనా – క్షణం' జనన దశ సంభవిస్తుంది. నిరతం మారే ఈ జీవిత ప్రక్రియలోని ప్రతి 'క్షణిక విజ్ఞానం' గతించి పోయే

టప్పుడు, దాని మొత్తం శక్తిని, దాని మీద పడిన చెరగరాని ముద్రలను, దాని తరవాత వచ్చే క్షణిక విజ్ఞానానికి అందిస్తుంది. అలా తరవాత వచ్చే తాజా విజ్ఞానం, దాని పూర్వ క్షణిక విజ్ఞానం, బీజశక్తులను కలిగి ఉండడమే కాక, ''మరికొంత'' గూడ అందులో ఉంటుంది. అందువలన, ఒక ప్రవాహంలా ఎడతెగ కుండ విజ్ఞానం ప్రవహిస్తూ ఉంటుంది. తరువాతి ఆలోచనాక్షణం, పూర్తిగా, పూర్వక్షణం విజ్ఞానం లాంటిది కాదు, పూర్తిగా దాని కంటె భిన్నమైందీ కాదు. ఎందుకంటే దాని నిర్మితి పూర్తిగా అదే కాదు, దాని కంటే భిన్నమూ కాదు. కాని అదే జీవిత ప్రవాహం. అదే వస్తువు లేదు కాని, అదే ప్రక్రియ మాత్రం ఉంది.

అయితే విజ్ఞానాన్ని విడివిడిపెట్టెలు కలిపిన రైలుబండిలా లేదా లింకులు కలిపిన గొలుసులా అర్థం చేసు కో రాదు. ''అది ఎడతెగక పారే యేరు. దారిలో, తన వరద ప్రవాహానికి ఇంద్రియ ప్రవాహ ఉపనదులను కలుపుకొంటూ, ఇలా కలుపుకొన్న ' ఆలోచన పదార్థాన్ని' దాని చుట్టూ ఉన్న ప్రపంచానికి పంచి పెడుతూ ముందుకు సాగి పోతుంది.''[1]. దాని మూలం జన్మలో ఉంది. మరణం చీలిక (ముఖం = Mouth)లో ఉంది.

క్షణభంగురాలైన విజ్ఞాన స్థితులు ఒకదాని సరసన ఒకటి ఉంటాయి. కాని, కొంద రనుకొన్నట్లు, ఒక దాని మీద ఒకటి ఉండదు. ఏ స్థితీ ఒకసారి గతించిన తరవాత మళ్ళీ తిరిగి రాదు. ముందర గతించిన స్థితిలో మరే స్థితి పూర్తిగా తాదాత్మ్యతతో ఉండదు. ఈ స్థితులు ఎప్పుడూ మారుతుంటాయి. ఏ రెండు వరుస క్షణాలు పాటు అది అదిగా ఉండదు. భ్రమలో చిక్కుకొన్న ఇహ లోక వాసులు, పైకి కనిపించే ఈ సాతత్యాన్ని శాశ్వతమని భావించి, ఒక అపరివర్తనీయ ఆత్మను నిరత పరివర్తనాశీలి అయినా విజ్ఞానంలో ప్రవేశపెట్టే దాక పోతారు. (ఆత్మ అంటే కర్త అనీ, అన్నిచర్యలను చూసే వాడని భావించబడింది.)

నాలుగు రకాల మానసిక దృగ్విషయం, శారీరక దృగ్విషయంతో కలుపుకొని, పంచస్కంధాలు (పఞ్చఖ్ఖంద) రూపొందుతాయి. ఈ సంక్లిష్ట సమ్మేళనాన్ని ప్రాణి (జీవి) అన్నారు.

ఒకని వ్యక్తిత్వం ఈ ఐదు స్కంధాల సంయోగమే.

సముద్రంలో ఎంతో నీరు వ్యాపించి ఉండడాన్ని చూస్తాం. కాని సాగరంలోని నీరు అసంఖ్యాక నీటి బిందువుల సంయోగం. సముద్ర తీరం అసంఖ్యాక ఇసుక రేణువులను కలిగి ఉంటుంది. కాని అది ఒక దీర్ఘ ఫలకం లాగ కనిపిస్తుంది. తరంగాలు లేచి ఒడ్డుకు తగిలి విరిగి పోతాయి. సరిగా చెబితే, లోతైన నీలి సముద్ర గర్భం నుంచి, తన రూపురేఖలను కోల్పోవ డానికి ఏ అల ఒడ్డుకు రాదు. సినిమాలో చలిస్తున్న దృశ్యాన్ని చూడడానికి,.

ప్రొజెక్టరులో సెకనకు 24 ఫ్రేములు కదలాలి. ఏక చలన దృశ్యంగా కనిపించేది అనేక క్షణిక చిత్రాల సంయోగం.

పూవు వాసన, దాని పత్రాలలో ఉందని గాని, గర్భకేసరాలలో ఉందని గాని, దాని రంగులో ఉందని గాని చెప్పలేం. ఎందుకంటే వాసన పూవులో ఉంది.

అదే విధంగా ఒకని వ్యక్తిత్వం మొత్తం ఐదుస్కంధాల సంయోగమే.

నిరతం భవం (becoming) చెందుతూ, గతించే మానసిక - శారీరక దృగ్విషయం మొత్తం ప్రక్రియను కొన్నిసార్లు, మామూలు జనుల భాషలో, ఆత్మ (అత్తా) అన్నాడు బుద్ధుడు. కాని ఈ విధంగా బుద్ధుడు వా కొన్న అది ఒక ప్రక్రియయే గాని, సత్వం కాదు.

వ్యక్తిత్వాన్ని బౌద్ధం, అనుభవికార్థంలో, పూర్తిగా తోసి వేయదు. అది కాదనేది ఒక శాశ్వత సత్వాన్ని, అది 'తదేవం' అనే భావనను. అంతే కాని ప్రక్రియా సాతత్యాన్ని కాదనదు. బౌద్ధంలో వ్యక్తిని సూచించ డానికి వాడే పదం ''సంతతి'' అంటే ప్రవాహం, సాతత్యం. మానసిక - దైహిక, కర్మ ప్రభావిత అభంగ ప్రవాహం లేదా సాతత్యం అది. గతంలో ఈ ప్రవాహం ఎప్పుడు ప్రారంభమైందో తెలియదు. భవిష్యత్తులో ఇది ఎప్పుడు అంత మవుతుందో అంత కంటె తెలియదు. అయితే ఇది అష్టాంగ మార్గం వల్ల మాత్రం అంత మవుతుందని తెలుసు. ఇతర మతాల వారు ఉపయోగించే శాశ్వత ఆత్మకు బదులుగా బౌద్ధులు దీనిని వాడతారు.

తిరిగి పుట్టే ఆత్మ లేక పోతే పునర్జన్మ ఎలా సాధ్యం?

బౌద్ధం ప్రకారం పుట్టుక అంటే 'స్కంధాలు' లేదా సమాహారాలు కనబడడమే.

ఒక భౌతిక వస్తువు ఉండడానికి దాని ముందరి స్థితి దానికి ఎలా కారణ మవుతుందో అలాగే, మానసిక - దైహిక దృగ్విషయం గూడ, అది పుట్టక ముందరి కారణాలతో నిబద్ధిత మవుతుంది. ఈ ప్రకృత భవ (becoming) ప్రక్రియ పూర్వ జన్మలో భవతృష్ణ ఫలితం. ప్రకృత సహజాత తృష్ణ భావి జన్మను నిబద్ధిస్తుంది.

ఒక 'ఆలోచనా - క్షణం' నుంచి తరువాతి 'ఆలోచనా - క్షణానికి', శాశ్వత సత్వం (ఆత్మ) ఏదీ లేకుండ, ఒక జీవిత కాలం ప్రక్రియలో, పయనించడం ఎలా సంభవ మైందో, అలాగే ఒక అస్తిత్వం నుంచి మరో అస్తిత్వానికి (జన్మనుంచి జన్మకు), గమించేది ఏది లేకుండానే, సాధ్యం.

బౌద్ధుల పునర్జన్మ సిద్ధాంతాన్ని ఇతరుల అవతారవాదం (పునర్జన్మ) నుంచి వేరుగా చూడాలి. ఇతరుల పునర్జన్మ సిద్ధాంతంలో ఆత్మ, దాని అపరివర్తనీయ భౌతిక పునర్జన్మ ఉంటాయి. బౌద్ధంలో అటువంటి ఆత్మ లేదు.

ఒక జీవితం నుంచి మరో జీవితానికి వలస పోయేది ఏదీ లేదని, చెప్పడానికి ''మిళింద ప్రశ్నల''లో నాగసేనుడు, ''విశుద్ధిమగ్గ''లో బుద్ధఘోషుడు అనేక దృష్టాంతాలను చూపించారు.

దీప శిఖ ఉదాహరణ కన్నుల కట్టినట్లుగా ఉంటుంది. జీవితాన్ని దీపశిఖకు పోలుస్తారు. పునర్జన్మ అంటే, ఈ జ్వాలను ఒక సమూహం నుంచి మరోదానికి అంటించడం. మరణ సమయంలో పైకి 'భంగం' కనిపించినా, జీవన జ్వాల సాతత్యమే.

రాజు మిళిందుడు ప్రశ్నిస్తున్నాడు:

''గౌరవనీయ నాగసేనా, గమించేది ఏదీ లేకుండా, పునర్జన్మ సాధ్యమే నంటారా?''

''అవును, రాజా, పునర్జన్మ, ఏదీ గమించ కుండానే, సాధ్యం.''

'' ఒక దృష్టాంతం చెప్పండి.''

''రాజా, ఒకడు ఒకదీపంతో మరోదీపాన్ని వెలిగించా లనుకోండి, అప్పుడు ఈ దీపజ్వాల ఆదీపజ్వాలోకి వెళ్ళి పోతుం దంటారా?''

''లేదు. ఇది నిజం, గౌరవనీయా.''

''సరిగ్గా అదేవిధంగా, ఓ రాజా, ఏదీ గమించ కుండానే పునర్జన్మ సంభవం''

''మరో దృష్టాంతాన్నివ్వండి.''

''మీరు పిల్లవాడుగా ఉన్నప్పుడు, మీ గురువుగారి దగ్గర నుంచి నేర్చుకొన్న ఎదైనా పద్యం మీకు గుర్తుందా?''

''అవును, గుర్తుంది.''

''అలాగైతే రాజా, ఆ పద్యం మీ గురువు నుంచి మీకు వచ్చిందా?''

''రా లేదు, మా గురువుగారి నుంచి నాకు రా లేదు.''

''సరిగ్గా అదే తీరులో, ఓ రాజా, గమించేది ఏదీ లేకుండానే పునర్జన్మ సంభవిస్తుంది.''

మళ్ళీ రాజు ప్రశ్నించాడు.

''గౌరవనీయ నాగసేనా, మరి తరువాతి అస్తిత్వంలో (జన్మలో) పుట్టేంది ఏమిటి?''

''హే రాజా, మనస్సు-శరీరాలు (నామ - రూప) తరువాతి అస్తిత్వంలోకి పుట్టాయి.''

''ఇదే మనస్సు, ఇదే శరీరం తరువాతి జన్మలోకి పుట్టా యంటారా?''

''ఓ రాజా, ఈ మనస్సు, ఈ శరీరాలే మరు జన్మలోకి పుట్టవు. కాని, ఒకడు ఏదైనా కర్మను - అది మంచి గానీయండి, చెడ్డ గానీయండి - చేస్తాడు. ఆ కర్మ కారణంగా మరో మనస్సు మరో శరీరం, తరువాతి అస్తిత్వంలోకి వస్తాయి.''

''గౌరవనీయా, ఈ మనస్సు, ఈ దేహం తరువాతి అస్తిత్వంలోకి పుట్టక పోతే, మరి అలాంటప్పుడు, ఒకడు తన చెడ్డకర్మ నుంచి విముక్తుడైనట్లే గదా?''

''ఒకడు మరోజన్మ ఎత్త నట్లైతే, అతడు చెడ్డ కర్మల నుంచి విముక్తుడైనట్లే, కాని, ఓ రాజా, అతడు పునర్జన్మ ఎత్తాడు అంటే, ఆదృష్ట్యా అతడు చెడ్డకర్మ నుంచి విము క్తుడు కానట్లే.''

''ఒక దృష్టాంతరం ఇవ్వండి.''

''ఓ రాజా, ఒకడు మరొకని మామిడి పండ్లను తీసుకొని పోగా, మామిడి పళ్ళ స్వంతదారు వచ్చి, అతనిని పట్టుకొని, రాజు దగ్గరకు తీసుకు వచ్చి, 'అయ్యా ఇతడు నా మామిడి పండ్లను తీసుకొన్నాడు', అని ఫిర్యాదు చేయగా, పండ్లు తీసుకొన్నవాడు, 'అయ్యా, నేను అతని పండ్లను తీసుకో లేదు, ఇతడు నాటిన మామిడి పండ్లు వేరు. నేను తీసుకొన్న మామిడి పండ్లు వేరు, అందుకని నేను శిక్షార్హుడను కాను' అన్నాడు. ఇప్పుడు చెప్పండి, ఓ రాజా, అతడు శిక్షార్హుడేనంటారా?''

''తప్పకుండా. అతడు దండనార్హుడే.''

''ఏ కారణాన?''

''ఎందుకంటే, అతడు ఏమైన చెప్పనీయండి, ఈ చివరి మామిడి పళ్ళు (ఇతడు తీసుకొన్నవి) మొదటి మామిడిపళ్ళ (నాటినవి) నుంచి వచ్చినవి.''

''సరిగా అలాగే, ఓ రాజా, ఈ మనస్సు - శరీరంతో ఒకడు ఒక కర్మ చేస్తాడు - అది చెడ్డ కర్మకావచ్చు, మంచి కర్మ కావచ్చు - ఈ కర్మ కారణంగా మరో మనస్సు, శరీరం తరువాతి అస్తిత్వంలోకి జనిస్తాయి. అందువలన ఒకడు తన చెడ్డకర్మల నుంచి తప్పించుకో లేడు.''[2]

గౌరవనీయ బుద్ధఘోషుడు,- ఈ క్లిష్టసమస్యను వివరించడానికి ప్రతిధ్వని, ముద్రిక వల్ల ఏర్పడ్డ ముద్ర (impression of a seal), దర్పణంలో ప్రతిబింబం, దీపం - ఉపమానాలను ఇచ్చాడు.

''స్థిరంగా ఉన్న చివరి బంతివేసి, మరో బంతిని దొర్లించినట్లయితే, దొర్లే బంతి దానికి తగిలి అక్కడితో ఆగిపోతుంది. ముందరి స్థిర కందుకం చలిస్తూ ఉంటుంది.... మొదటి కదిలే బంతి దాటి పోక ఆగిపోతుంది, చనిపితుంది కాని ఈ బంతి చలనం, దీని 'జవం' (momentaum), దీని కర్మ (చర్య)లు మాత్రమే మొదటి బంతిలో పునర్జన్మించాయి. అంతేకాని నూతనంగా సృజితమైన ఏ కొత్త చనలనమూ దానిలో పునర్జన్మించలేదు.''[3]

అదేవిధంగా, మామూలు పరిభాషలో చెప్పాలంటే, శరీరం చస్తుంది, దాని కర్మశక్తి (Kammic force) మరో దానిలో పునర్జన్మిస్తుంది. కాని ఒక జన్మ నుంచి మరోజన్మకు వలస పోయేది ఏదీ ఉండదు. ఈ జీవితం చివరి 'ఆలోచన - క్షణం', తరువాతి జీవితపు 'ఆలోచనా - క్షణా'న్ని నిబద్ధిస్తూ, మరణిస్తుంది. ఈ కొత్త జీవి పూర్తిగా పాతదే కాదు. ఎందుకంటే, అది మారింది; పూర్తిగా కొత్త కాదు, ఎందుకంటే, అది అదే కమ్మ ప్రవాహం. అక్కడ కేవలం ఒక ప్రత్యేక జీవిత ప్రవాహ సాతత్యం మాత్రమే ఉంది; అంతే, అంతకంటే ఎక్కువ ఏ మాత్రం లేదు.

**పాదసూచికలు :**

1. See, *Compendium of Philosophy*, P.12
2. See, Warren, *Buddhism in Translations,* PP.234,235.
3. Dr Ananda Coomara Swamy, *Buddha and the Gospel of Buddhism,* P.106.

ముప్పైయ్యో ప్రకరణం

# ధార్మిక బాధ్యత

''తన వల్లే తా మలిను డవుతాడు
తన వల్లే తా అమలిను డవుతాడు''
– ధమ్మపధ, వి. 165

తరువాతి జన్మలో కర్మఫలాన్ని అనుభవించేది కర్మ చేసిన వాడా? మరొకడా?[1] 'నాటినవాడు అనుభవించిన వాడు పూర్తిగా ఒకడే' అనడం ఒక అంత్యమైతే, 'నాటిన వాడు అనుభవించిన వాడు పూర్తిగా భిన్నం' అనిచెప్పడం మరో అంత్యం. బుద్ధుడు ఈ రెండు అంత్యాలను పరిహరించి, కార్యకారణ సిద్ధాంత పరంగా 'మధ్యేమార్గ' సిద్ధాంతాన్ని వివరిస్తాడు. ''అది అదే కాదు, వేరేదీ కాదు'' (న చ సొ న చ అంఞో) అని చెబుతాడు బుద్ధఘోషుడు విశుద్ధి మగ్గలో. ఉదాహరణగ సీతాకోక చిలుక పరిణా దశలను చెప్ప వచ్చు.

అది మొదట గ్రుడ్డు. తరువాత కోషదశ. తరువాత ప్యూపా దశ. చివరకు సీతాకోక చిలుక అవుతుంది. ఈ ప్రక్రియ ఒక జీవిత కాలంలో జరుగుతుంది. సీతా కోకచిలుకపూర్తిగా కోషమూ కాదు, పూర్తిగా కోషం కంటె భిన్నమైందీ కాదు. ఇక్కడ గూడ జీవిత ప్రవాహం లేదా సాతత్యం ఉంది.

గౌరవనీయ నాగసేనుడు రాత్రంతా వెలిగే దీపం ఉదాహరణతో ఈ విషయాన్ని వివరిస్తాడు. మొదటి జాములో జ్వాల, మూడో జాములో జ్వాల ఒకటి కావు. అయినా, రాత్రి అంతా గూడ, అదే దీపం మీద ఆధార పడి వెలుగు వస్తున్నది. జ్వాల లాగే జీవిత సాతత్యమూ – తరువాత వచ్చే ప్రతిదశ అంతకు ముందరి దశమీద ఆధార పడుతుంది.

మరి ఆత్మ లేదను కొంటే, నైతిక బాధ్యత ఉండదా?[2]

ఉంటుంది. ఎందుకంటే, ప్రక్రియలో సాతత్యం ఉంది. అదే ప్రక్రియ ఉంది. తాదాత్మ్య వ్యక్తిత్వానికి బదులు సాతత్య ప్రక్రియను ప్రత్యామ్నాయం చేయడం జరిగింది.

ఉదాహరణకు, ఒకపిల్లవాడు కాలక్రమంలో మనిషి అవుతాడు. ఈ పెద్దగా ఎదిగిన మనిషి పూర్తిగా ఆ చిన్న పిల్లవాడు కాదు – ఎందుకంటె శరీర కణాలు పూర్తిగా మారి పోయాయి. – పూర్తిగా భిన్నమూ కాదు, ఎందుకంటే అదే ప్రవాహ సాతత్యం. అయినా,

'మనిషి' వ్యక్తిగా తాను చిన్నతనంలో (పిల్లవాడిగా) చేసిన వాటిన్నింటికి బాధ్యు డవుతాడు. ప్రవాహం ఇక్కడ మరణించి, మరోచోట పునర్జన్మించినా, లేక అదే జీవితంలో కొనసాగినా, ముఖ్యమైన అంశం ఏమిటంటే, ఠః సాతత్యత. ఒక వ్యక్తి గత జన్మలో 'ఎ', ఈ జన్మలో 'బి' అనుకోండి. 'ఎ' మరణంతో, భౌతిక వాహనాన్ని, బయటికి అభివ్యక్తమయ్యే కమ్మశక్తిని, విడిచి వేయడం జరుగుతుంది. 'బి' జననంతో తాజా భౌతిక వాహనం పుడుతుంది. భౌతికమైన మార్పు లున్నప్పటికీ, విజ్ఞాన ప్రవాహం (చిత్తసంతతి) కొన సాగుతూనే ఉంటుంది. మరణంతో ప్రవాహ సాతత్యం తెగి పోదు. ప్రవాహం, ఇంద్రియ ప్రవాహ ఉపనదుల నుంచి గ్రహించిన ముద్రలను, తనతో పాటు తీసుకు పోతూ, పయనిస్తూ ఉంటుంది. మామూలు సంప్రదాయ భాషలో చెబితే, తనకు పూర్వుడైన 'ఎ' చేసిన షనులకు 'బి' బాధ్యత వహించ వలసిన పనిలేదా?

ఈ సందర్భంలో, మరణం జోక్యం వల్ల జ్ఞాపకం పోతుందని కొందరు అడ్డుచెప్ప వచ్చు.

కాని, నైతిక బాధ్యతను బేరీజు వేయడంలో కావలసింది తాదాత్మ్యతా లేక స్మృతా?

సరిగా చెబితే ఈ రెండింటిలో ఏదీ ఆవశ్యకం కాదు.

ఒకడు నేరం చేస్తాడు. అతనికి వెంటనే మతి మరుపు వచ్చి, ఆ సంఘటనను మరిచి పోతాడు. మరి అతడు అతని చర్యకు బాధ్యత వహించ వలసిన అవసరం లేదా?

అతని మతిమరుపు నేర బాధ్యతనుంచి తప్పించదు. దీనికి ఒకడు ఇలా అభ్యంతరం లేవదీయ వచ్చు: ''తాను పలాన నేరానికి శిక్షించబడు తున్నానని తెలియ నప్పుడు, అతనిని దండించి ప్రయోజనం ఏమిటి? ఇదేమైనా న్యాయమేనా.''

న్యాయం కాక పో వచ్చు, ఎప్పుడు, మనకు వరాలను, దండనలను ఇచ్చే దేవుడొకడు తన యిష్టం వచ్చినట్లు పరిపాలిస్తు న్నప్పుడు.

బౌద్ధులు న్యాయమైన, హేతుబద్ధమైన కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతారు. అది స్వయం చాలితంగా, దండన పారితోషికాలకు బదులు కార్యకారణాల పరంగా, పని చేస్తుంది.

భిక్కు శీలాచారుని మాటలలో చెప్పాలంటే: ''నిద్రలో నడిచే ఒకడు మంచం మీద నుంచి లేచి, వరండా దిగి, రోడ్డు మీదపడిపోయాడు. కాలో చెయ్యో విరగగొట్టుకొన్నాడు. ఇది నిద్రలో నడిచి నందుకు దండన కాదు, అది కేవలం ఫలితం (దండన వేరు ఫలితం వేరు). వరండా దాటి బయటికి పోతున్న విషయం అతనికి తెలియక పోయినా, ఫలితంలో మాత్రం ఏ రకమైనా తేడా ఉండదు. ఎముకలు, (తెలియక నడిచినా), అలాగే విరుగుతాయి.

అందుకని బుద్ధుని అనుయాయి అయిన వాడెవ్వడు, నిద్రలోగాని, మేల్కొనిగాని, వరండాలమీద గాని, ఇంక ఇతర అపాయకర ప్రదేశాలలోగాని, తనకు అపాయం జరగకుండ, ఇతరుల మీద పడి వారికి అపాయం కలిగించకుండా, ఉండడానికి వీలైన అన్ని జాగ్రతలు తీసుకొంటారు."

ఒక వ్యక్తికి తన గతం గుర్తు లేదనేది, కర్మ నియమం పని సరళిని తెలివిగ అర్థం చేసుకోవడానికి అడ్డు కాదు. సంసారంలో ఒకని జీవిత గతిలో కర్మ పరం పరాగతానికి సంబంధించిన జ్ఞానం బౌద్ధుని శీలాన్ని మలచ డానికి తోడ్పడుతుంది.

**పాదసూచికలు:**

1. See, *Questions of Milinda,* 1, P.11 and Dr. Dhalke, *Buddhism and science,* P. 64
2. See, Mr. A.D. Jayasurya, *"Anatta and Moral Responsibility," Mahabodhi Journal,* Vol.41, P. 93

ముప్పై ఒకటో ప్రకరణం

# కమ్మ అవరోహణారోహణలు

*''ఉన్నత గతులకు, అధోగతులకు చెందిన వారిగా జీవులను కమ్మ వేరు చేస్తుంది.''*

– మజ్జిమ నికాయ

కమ్మ అవరోహణం సంభవమా? మరో విధంగా చెప్పాలంటే, మనిషి జంతువై పుట్టగలడా?

బౌద్ధులు చెప్పే సమాధానం అందరికీ అంగీకారం కాక పోవచ్చు. ఎందుకంటే, బౌద్ధం ఈ సంభావ్యతను గుర్తిస్తుంది.

జీవిత సాతత్యం అభివ్యక్తమయ్యే భౌతిక రూపాలు కమ్మశక్తి యొక్క తాత్కాలిక, దృశ్యమాన, అభివ్యక్త రూపాలు. ప్రస్తుత భౌతిక శరీరం తిన్నగా గత భౌతిక ఆకృతి నుంచి వచ్చింది కాదు, కాని ఈ గతాకృతికి అది అనుక్రామిక. ఎందుకంటె అది, కమ్మశక్తి ప్రవాహంతో అనుసంధితమైంది.

విద్యుత్ప్రవాహం వెలుతురు, ఉష్ణం, చలనం రూపాలలో వరుసగా అభివ్యక్తం కావచ్చు. ఇందులో ఒకటి రెండోదాని నుంచి పరిణ మించదు. అలాగే కమ్మ శక్తి గూడ దేవ, మానవ, జంతు లేదా మరోజీవి ఆకృతులలో అభివ్యక్తం అవుతుంది. వీటిలో ఒక ఆకృతికి, మరో ఆకృతికి ఏ రకమైన భౌతిక సంబంధం లేదు. ఒకని భౌతిక ఆకృతి స్వభావాన్ని అతని కమ్మ నిర్ణయిస్తుంది. ఈ భౌతికాకృతి స్వభావం అతని గతకర్మల వైదగ్ధ్యం కారణంగా మారుతుంది. ఇది గూడ మళ్ళీ, ''వాస్తవాన్ని'' గ్రహించడంలో అతని ఎదుగుదల మీద పూర్తిగా ఆధారపడి ఉంటుంది.

మనిషి జంతువై పోతాడు లేదా జంతువు మనిషై పోతుంది, అని చెప్పడానికి బదులు, మానవాకృతిలో అభివ్యక్తమైన కమ్మశక్తి, జంతువు ఆకృతిలో అభివ్యక్త మవుతుందని చెప్పడం సబబుగా ఉంటుంది.

సంసారంలో మనం చేసే పర్యాటకాలలో, – మామూలు సంప్రదాయ భాషలో చెబితే – మనం అనేక అనుభవాలను సంచయం చేసుకొంటాం; అనేక రకాల ముద్రలను గ్రహిస్తాం; వివిధ శీల లక్షణాలను ఆర్జిస్తాం. చెరిపి వేస్తే చెరిగి పోయే పలకలాంటి మన మనస్సు మీద,

మన ఆలోచన, వాక్కు, కర్మలు చెరిగి పోకుండా రికార్డు అవుతాయి. ఈ విధంగా మనం అనేక అనుక్రామిక జన్మలలో, మానవులుగా గాని, జంతువులుగా గాని, దేవతలుగా గాని, ప్రేతాలుగా గాని, జన్మించి, ఆర్జించిన వివిధ స్వభావ, శీలాలు మనలో నిద్రపోతూ ఉంటాయి. మనం ఈ ప్రపంచంలో విషయాసక్తులుగా ఉన్నంతకాలం, ఈ అవినాశ స్వభావాలు అనుకోని, ఊహించని సందర్భాలలో, ఉపరి తలానికి వచ్చి, మనలను ''కలంత'' పెడుతూ, మన గుప్త కమ్మ ప్రవృత్తులను బహిర్గతం జేస్తాయి.

మంచి సభ్యతా సంస్కారాలున్న మనిషిలో ఇలాంటి వికారాలు పెల్లు బుకి రావడం చూసి మనం సహజంగానే ఇలా అంటాం : ''ఈ పని అతడెలా చేయ గలిగాడు? ఎవరను కొన్నారు అతడు అలాంటి పని చేస్తాడని!''

అతని ఈచెడు ప్రవర్తనలో వింత ఏమీ లేదు. అతనిలో అంతర్గతంగా ఉన్న విషయం బహిర్గతం కావడం. ఈ కారణం చేతనే, ఉన్నత విలువలున్న మనుషులు, మనం వారి నుంచి ఎప్పుడూ ఆశించని, ఊహించని పనులు చేస్తారు.

దేవదత్తుడు కులీనుడే. సంఘ సభ్యుడే. అసాధారణ శక్తులున్న వాడే. అయినా, అతనిలో దాగి ఉన్న అసూయ అతనిని పై కొనగా, తన గురువైన బుద్ధుని చంపడానికి అనేక ప్రయత్నాలు చేశాడు.

మానవుని స్వభావం అత్యంత సంక్లిష్టమైంది. ఒకని అవ్యవహిత గతం అతని అవ్యవహిత అనాగతానికి నిజమైన సూచిక కాదు. ప్రతిక్షణమూ మనం నూతన కర్మను సృష్టిస్తుంటాం. ఒక అర్థంలో, గతంలోని 'మనం' ఇప్పటి 'మనం' ఒకటే. ఇప్పటి 'మనం' అనాగతంలోని 'మనం' ఒకటే. మరో అర్థంలో, ఇప్పటి 'మనం' పూర్తిగ గతంలోని 'మనం' ఒకటి కాము. ఇప్పటి 'మనం' పూర్తిగ రేపటి 'మనం' ఒకటి కాము. నిన్నటి దొంగ ఇవ్వాళ రుషి పుంగవుడు కావచ్చు. ఇవాల్టి పవిత్రుడు రేపు పాపి కావచ్చు.

మన మీద ఈ 'శాశ్వత ప్రకృతం' (eternal present) తో ఏదోషం లేకుండ న్యాయంగ తీర్పు వెలువరించ వచ్చు. భావి విత్తనాలను ఈ రోజు మనం నాటుతాం. ఈ ప్రత్యేక క్షణంలో మనం మూర్ఖంగా వ్యవహరించి మన నరకాన్ని మనం సృష్టించుకో వచ్చు. లేదా మరో ప్రక్క, లోకోత్తరంగా వ్యవహరించి మన స్వర్గాన్ని మనం సృష్టించుకో వచ్చు. ప్రతి 'ప్రస్తుత 'ఆలోచనా - క్షణం' తరువాతి 'ఆలోచనా-క్షణాన్ని' నిబద్ధిస్తుంది. బౌద్ధం ప్రకారం, ఈ జీవితంలోని చివరి ఆలోచనా ప్రక్రియ తరువాతి జన్మను నిబద్ధిస్తుంది. జీవిత గతిలో

ప్రతి ఆలోచన చచ్చిపోతూ, దాని తరువాత వచ్చే దానికి, దాని బీజ శక్తులన్నింటిని ఎలా అందిస్తుందో, అలాగే ఈ జన్మలోని చివరి ఆలోచన ప్రక్రియ అంత మవుతూ, తరువాతి క్షణానికి – అంటే తరువాతి జీవితంలోని మొదటి క్షణానికి – తన ఆర్జిత లక్షణాలను, స్వభావాలను అందిస్తుంది.

మరణిస్తున్న వ్యక్తి నీచ వాంఛ లేదా భావంతో ఉంటే, లేదా అతనికి ఒక చెడ్డ ఆలోచన వస్తే, లేదా ఒక జంతువులాగ ప్రవర్తిస్తే, అతని చెడ్డ కర్మ అతనిని జంతువు ఆకృతిలోకి నిబద్ధిస్తుంది. మానవాకృతిలో అభివ్యక్తమైన కమ్మశక్తే , జంతువు ఆకృతిలో అభివ్యక్త మవుతుంది. దీని అర్థం అతని గత జన్మ మంచి కర్మ ప్రవృత్తులన్నీ నశించాయని కాదు. అవిగూడ, ఉపరితలానికి రావడానికి అవకాశం కోసం ఎదురు చూస్తుంటాయి. అటువంటి సత్కర్మ మానవుడుగా జన్మించడానికి ప్రభావం చూపుతుంది.

చివరి ఆలోచనా – ప్రక్రియ, మనం జీవిత కాలంలో చేసిన మొత్తం కర్మల మీద ఆధారపడి తీరాలని నియమ మేదీ లేదు. మామూలుగా చెబితే మంచి వ్యక్తికి మంచి జన్మ, చెడ్డ వ్యక్తికి చెడ్డ జన్మ లభిస్తుంది. అయితే అసాధారణ పరిస్థితులలో అసాధారణమైన దేదో జరగ వచ్చు.

ఉదాహరణకు, రాజు కొసలుని భార్య, బుద్ధుని సమకాలీన అయిన మల్లిక, మంచి జీవితాన్నే గడిపింది. కాని మరణ సమయంలో ఆమె కొచ్చిన చెడ్డ ఆలోచనా ఫలితంగా దుఃఖ భాగ జీవితంలో జన్మించింది. ఆమె సత్కర్మ బలమైంది కావడంతో, ఆమె దుఃఖమయ జీవితం కొద్ది రోజులకే పరిమితమైంది.

'' ఇది సబబేనా?'' అని ఎవరైన అడగవచ్చు.

ఒక పవిత్రవ్యక్తి, రెచ్చ గొట్టబడి నప్పుడు, క్షణికోద్రేకంలో, హత్యగావిస్తే, అతనిని హంతకుని చేసి, నేరం మోపుతారు. అతని ఆదాయవ్యవ పట్టికలో అతని సత్కర్మ ఆదాయంగా చూప బడుతుం దనడంలో సందేహం లేదు. కాని అతని దారుణ చర్యను అతని గత సత్కర్మ తుడిచి వేయ లేదు. బహుశ అతని సత్కర్మ అతనికి పడే శిక్షను తగ్గింప జేస్తుందే కాని, పూర్తిగా అతనిని ఆదారుణ నేరాన్నుంచి తప్పించదు. ఈ అనూహ్య, అనుకోని సంఘటన, అటువంటి నేరస్థుల మధ్య, అననుకూల వాతావరణంలో, జీవించాలని ఒత్తిడి చేస్తుంది. ఇది న్యాయమేనా? ఒకే ఒక అనైతిక కర్మ ఒక పవిత్రుని ఎలా పతనం చేసిందో ఊహించండి!

ఒకసారి పున్న, సెనియ అనే ఇద్దరు సన్యాసులు బుద్ధుని వద్దకు వచ్చి తమ భావి విధి (destiny) ఎలా ఉంటుంది? అని అడిగారు. అందులో మొదటివాడు వృషభ సన్యాసాన్ని' (ox-ascetism) రెండోవాడు 'శునక – సన్యాసాన్ని' ఆచరిస్తున్నారు.

బుద్ధుడు సమాధానం చెప్పాడు:

''ఒకడు పూర్తిగా, స్థిరంగా, ఒక కుక్క మనస్తత్వాన్ని, అలవాట్లను, తీరుతెన్నులను, ఆచరణలను ఈ ప్రపంచంలో అలవరచు కొన్నట్లయితే, అతడు వీటన్నింటిని తనవిగా చేసు కొన్నాడు గనుక, ఈ శరీరం భంగమైన తరవాత, కుక్కల మధ్య జన్మిస్తాడు. ''ఇదొక గొప్ప జీవితం, ఒకగొప్ప త్యాగం, దీని ఈ ఆచరణవల్ల నేను ఏదో ఒక రకం దేవతను అవుతాను'', అని ఒకడు నమ్మినట్లయితే, ఆ నమ్మకం ఒక పెద్ద అబద్ధం. ఎందుకంటే, అబద్ధపు నమ్మకం ఉన్నవానికి నేను ఈమాట చెబుతాను: అటువంటి వానికి రెండు గతులలో ఏదో ఒకటి లభిస్తుంది. అది పీడాస్థితి లేదా జంతులోకం. పీడాస్థితి తప్పితే, అతని విజయవంతమైన 'శునకసన్యాసం'తో అతడు కుక్కల మధ్య మాత్రమే పుడతాడు''[1].

అదేవిధంగా వృషభ సన్యాస మాచరించిన వాడు, శరీర భంగం తరవాత ఎద్దుల మధ్య జన్మిస్తాడు.

జీవుల పరిణామ విలువల క్రమంలో బంధితుడైన వానికి కర్మా వరోహణా సంభావ్యత ఉంది.

అలాగే పైదానికి వ్యతిరేకమైన కర్మా రోహణకు అవకాశం ఉంది.

ఉదాహరణకు ఒక జంతువు మరణాసన్న దశలో ఉన్నప్పుడు, దానికి ధార్మికాలోచన వస్తే, ఈ ధార్మికాలోచన మానవ జన్మగా పరిణతి చెందవచ్చు. ఈ చివరి ఆలోచనా ప్రక్రియ, పూర్తిగా ఆ జంతువు యొక్క ఏ ఒక చర్యమీదో, ఆలోచన మీదో ఆధారపడదు. ఎందుకంటే, మామూలుగా చెబితే, దానికి పెద్దగా ఆలోచనాశక్తి లేదు, నైతిక చర్య చేసే శక్తి లేదు. ఇది అంతకు ముందరి అస్తిత్వ చక్రంలో చేసిన సత్కర్మ మీద ఆధారపడి జరుగుతుంది. ఆ సత్కర్మ తన అనివార్య ఫలితాన్ని ఇవ్వకుండా ఇన్నాళ్ళుగా నిరోధితమైంది. జంతువు, తన అంతిమ (ఘడియలలో, ఆకారణాన, మానవ జన్మకు దారితీసే భావనలను, ప్రతిమలను భావించి ఉండ వచ్చు.

లా వాల్లీ పౌసిన్(La Vallee Pousin), ఫ్రెంచి రచయిత, ఈ విషయాన్ని అనువంశికతా (వారసత్వం) నియమం ద్వారా వివరిస్తాడు: '' ఒకడు తన తండ్రిలా గాక తాతలాగ ఉండవచ్చు. ఒక పూర్వీకుని రోగక్రిములు జీవిలోకి ప్రవేశించ వచ్చు. కొన్ని తరాల పాటు అవి నిద్రావస్థలో ఉండవచ్చు. అవి ఆకస్మికంగా ఆ తరవాత వాస్తవ రుగ్మతగా పరిణ మించవచ్చు.''[2]

కర్మ, పునర్జన్మల ఈ సిద్ధాంతం అంత జటిలమైంది!

మనం ఎక్కడనుంచి వచ్చామో, ఎక్కడకు వెళ్తున్నామో, ఎప్పుడు వెళ్తామో మనకు తెలియదు. కాని మనం వెళ్ళవలసి ఉంటుందని మాత్రం మనకు తెలుసు.

మనం ఎంతో మమకారంతో పోగు చేసుకొన్న సంపదలు చుట్టపక్కాలు మన వెన్నంటి రావు. అంతేకాదు, మనవి అని అనుకొన్న మన శరీరాలు గూడ మన వెంట రావు. భూతాలనుంచి (మూలకాలనుంచి) వచ్చాయి, భూతాలలోకే వెళతాయి. డొల్లకీర్తి, వ్యర్థవైభవం - అన్నీ గాలిలో కలిసి పోతాయి.

ఆటు పోటుల సంసార సంద్రంలో, మన కర్మ మనలను అటు ఇటూ మృదువుగా నడుపు తుండగా, ఇక్కడ జంతువుగా, అక్కడ మనిషిగా, అదృష్టం బాగుంటే ఒక దేవునిగానో, లేదా బ్రహ్మగానో కనిపిస్తూ, మనం ఒంటరిగా పరిభ్రమిస్తుంటాం.

కలుస్తాం, విడిపోతాం. అయినా మళ్ళీ ఒకరి నొకరు తెలియ కుండానే కలుసుకో వచ్చు. మన ఈ పర్యాటక చక్రంలో ఎప్పుడో ఒకప్పుడైనా తండ్రి, తల్లి, చెల్లి, కొడుకు, కూతురు లను చూడ వచ్చు.

బుద్ధుడు అంటాడు: ''ఈ భారత దేశంలోని గడ్డి గాదం, పుల్లలు, కొమ్మలు, రెమ్మలు - అన్నింటిని ఒకడు చెక్కి, ఒక చోట చేర్చి, నాలుగేసీ అంగుళాల కుప్పగా పేర్చి, అందులో ప్రతి ఒక్కదానిని చూపించి, 'ఇది నాతల్లి, ఇది నా తల్లి తల్లి' అని చెప్పుకొంటూ పోతే, భారత దేశంలోని గడ్డి, పుల్లలు, కొమ్మలు, రెమ్మలు - అన్నీ అయిపోతాయి గాని, ఆ మనిషి తల్లి తల్లులు మాత్రం పూర్తిగారు.''[3]

సంసార పర్యాటక సమయంలో మనం అంత సన్నిహితంగా బంధితులం.

అనంతంగా ఉన్న గతకాలంలో, అసంఖ్యాకంగా మనం ఎత్తిన జన్మలు, అసంఖ్యాకంగా మనం అనుభవించిన దుఃఖాలు ఎలాంటి వంటే వాటిని గురించి బుద్ధుడు ఇలా చెప్ప వలసి వచ్చింది :

''సంసార చక్రంలో (అనేక జన్మలలో) తిరుగాడే ఒకే ఒక వ్యక్తి ఎముకలను ఎవడైన పోగుచేసి, కుప్పలుగా చేసి, వాటిని రాశిగా చేస్తే, ఆకుప్పలన్నీ నాశనం కాకుండా ఉంటే, అవి వెపుల శిఖరం అంత ఎత్తురాశి అవుతాయి.

''ఈ సుదీర్ఘ సంసార చక్ర పయనంలో ఎంతోమంది తల్లులు, తండ్రులు, కొడుకులు, కూతుళ్ళను పోగొట్టుకొని దుఃఖించావు. నీవు ఈ దుఃఖ సమయంలో, ఈ సుదీర్ఘ పయనంలో నీవు కార్చిన కన్నీళ్ళు, నాలుగు సముద్రాలలోని నీటి కంటె ఎక్కువ.

''నీవు వృషభాలుగా, గేదెలుగా, గొర్రె పొట్టేళ్ళుగా, మేకలు మొదలైన జంతువులుగా జన్మించి తలలు పోగొట్టు కొన్నప్పుడు, సుదీర్ఘకాలం నీరక్తం ప్రవహించింది.

''ఈ సుదీర్ఘపయనంలో, నీవు దొంగలు, దోపిడిముతాల, దస్యుల, పరదారా గామినుల చేతుల్లోబడి, తలలు పోగొట్టుకోవడం వల్ల, నాలుగు సముద్రాలలోని నీటికంటె ఎక్కువ రక్తమే ప్రవహించింది.

''ఎంతో కాలంలో, సుదీర్ఘ సంసార చక్రంలో, నీవు ఎన్నో బాధల ననుభవించావు. అత్యంత పీడలకు, దురదృష్టాలకు గురయ్యావు. ఎన్నో శ్మశానాలను నింపావు. అన్ని రకాల అస్తిత్వాలతో (జంతువులు, మనిషి అన్ని రకాల రూపాలతో) నీవు అసంతృప్తి చెందావు. ఈ పునర్జన్మలకు విముఖడవై, వీటన్నింటి నుంచి విముక్తుడవు కావడమే తరువాయి.''[4]

**పాదసూచికలు :**

1. *మజ్జిమని కాయ*, 1,57, P. 387
2. *Louis de la* valle pousin, *The way of Nirvana*, P. 88.
3. సంయుక్త నికాయ, 11, P.178
4. See, *The Book of gradual Sayings*, 1, PP.31-34

ముప్పై రెండో ప్రకరణం

# కర్మ, పునర్జన్మల మీద పాశ్చాత్యం ఏమంటున్నది?

కర్మ, పునర్జన్మలు, ప్లేటో దర్శనానికి మూలస్తంభాలు, జీవులు ఎప్పుడూ ''ఒక అవశ్యకతావలయం''. (a cycle of necessity) లో తిరుగాడుతూ ఉంటాయి. వారు, తమ పయనంలో ఒక అర్థ వృత్తంలో చేసిన చెడు, రెండో అర్థవృత్తంలో శమిస్తుంది. అతడి ఆదర్శరాజ్యం (Republic) లో కర్మ, ఆవశ్యకత కూతురైన లచిసిస్ (Lachesis) గా మూర్తీభవిస్తుంది. శరీరాలను విడిచిన ఆత్మలు ఏ ఏ అవతారాలు ఎత్త వలసిందీ, ఈమె చేతుల్లోనే ఉంది. ఆర్ఫియస్ (Orpheus) హంస శరీరాన్ని ఎంచుక్కొన్నాడు. థెర్సిస్టీ (Theristes) కోతి శరీరాన్ని, అగమెమ్నన్ (Agamem on) గరుడ శరీరాన్ని కోరు కొన్నారు. ''అదేవిధంగా, కొన్ని జంతువులు మనుషుల శరీరాలలోకి, కొన్ని పరస్పర శరీరాలలోకి, అన్యాయులు క్రోధనులుగా న్యాయులు సాధువులుగా మారాయి.

పర్షియన్ యుద్ధాలకు పూర్వం, ప్రాచ్య పాశ్చాత్యాల మధ్య సంపర్కం హోమరు ప్రతిపాదించిన సరళ అపర సిద్ధాంతం (అంతిమ విషయాలను, మరణాన్ని, మరణానంతర జీవితాన్ని చెప్పే సిద్ధాంతం) ఒక విప్లవాన్ని తెచ్చి పెట్టింది. దానితో జీవితాన్ని లోతుగ వివరించాలనే తపన బయలు దేరింది. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, ఈ అన్వేషణ, భారతీయులతో ప్రభావితమైన ఆసియామైనరులోని అయోనియన్ గ్రీకులు మొదలు పెట్టారు.

'పైథాగరస్'[1] సామోస్ ద్వీపంలో 580 B.C.లోజన్మించాడు. చాల ప్రాంతాలు తిరిగాడు. అతడి జీవిత కథ వ్రాసిన వాని ప్రకారం, భారతీయుల బోధలను అధ్యయనం చేశాడు. పాశ్చాత్యానికి కర్మ, పునర్జన్మలను గురించి చెప్పిన వాడు ఇతడే.

బౌద్ధికంగా పొంగి పొరలుతున్న ఆ యుగంలో, పర్షియా ద్వారా, కొంచెం ఇంచు మించుగా, ప్రాచ్య జ్ఞానాన్ని, బుద్ధుని సమకాలీనుడైన, కుతూహలుడైన గ్రీకు, ఆర్జించా డనడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

---

★ లచిసిస్ గ్రీకుల పురాణ దేవత. ఈమె జీవుల ఆయుష్కాలాన్ని నిర్ణయిస్తుంది.

## పునర్జన్మను ఇతరులు చూసిన తీరు

**భగవద్గీత :**

''చిరుగుల గుడ్డలను ఒకడు తీసి పారవేసి, నూతన వస్త్రాలను ఎలా ధరిస్తాడో, అలాగే శరీరంలో ఉండే నివాసి, చితికి జీర్ణమైన దేహాలను వదిలివేసి, నూతనాలైన దేహాలలోకి ప్రవేశిస్తాడు''.

''పుట్టిన వాడు గిట్టక తప్పదు. గిట్టిన వానికి పుట్టుక తప్పదు.''

**హెరడటస్ (Herodotus) :**

'మానవ ఆత్మకు చావు లేదు' అనేసిద్ధాంతాన్ని ఈజిప్షియన్లు ప్రతిపాదించారు. ''ఎవరి. శరీరమైన చని పోయి నప్పుడు, అది, దానిని గ్రహించ సిద్ధంగా ఉన్న మరో దేహంలోకి ప్రవేశిస్తుంది''.

**పైథాగరస్ (Pythagoras) :**

''అన్నింటికీ ఆత్మలున్నాయి. అంతా ఆత్మే, అది సేంద్రియ ప్రపంచంలో, శాశ్వత సంకల్పాన్ని లేదా నియమాన్ని అనుసరిస్తూ తిరుగు తుంటుంది.''

**ప్లేటో (Plato)**

'' ఆత్మ శరీరం కంటే పురాతన మైంది. ఆత్మలు నిరంతరం మళ్ళీ మళ్లీ ఈ జీవితంలో ప్రవేశిస్తాయి.''

**పై థాగరస్ మీద ఒవిడ్ ( అనువాదం డ్రెడన్) :**

''మృత్యువు అని పిలవ బడేది, పాతవస్తువు
కొత్త ఆకృతిని ధరించడం తప్ప మరేమీ కాదు;
దుస్తులు మారతాయి, వాస స్థలం మారుతుంది,
అయినా ఆత్మ ఇంకా అదే, రూపం మాత్రమే మారింది.
మృదు మైనం ముద్రలను గ్రహించి నట్లు
ఈ ముఖం వస్తుంది, ఆ ముఖం పోతుంది,
ఇప్పుడు ఈ పేరు, మరో అప్పడు మరో పేరు
ఆ కృతి మారింది, మైనం ఇంకా అదే.

అలాంటప్పుడు పుట్టడ మంటే
అంతకు ముందర మనం కాని మరొకరంగా ఆస్తిత్వారంభమే
రూపాలు మారతాయని నేనంగీకరిస్తాను,
అది ప్రారంభమైన ఆకృతిలో ఏదీ కొనసాగ లేదు.''

**షోపన్ హార్ (Schopenhauer) :**

''జన్మాంతరతా (Metempsychosis) సిద్ధాంతం అత్యంత ప్రాచీన, మానవజాతి ఉదాత్త దశలనుంచి వచ్చింది. మానవాళిలో అధిక భాగం నమ్మిన విశ్వాసంగా ఈ భూమి మీద ప్రచలితమైంది. యూదు, దాని నుంచి వచ్చిన రెండు మతాలు తప్ప, అన్నీ అంగీకరించాయి. అంతకు ముందే చెప్పి నట్లు ఇది బౌద్ధ సత్యానికి చాలా దగ్గరగా వచ్చింది. దీని ప్రకారం, తన మూర్తి మత్వాన్ని తాను పొంది, తనను తాను గుర్తించే మరోలోకంలో కలుసుకో వచ్చనే నమ్మకంతో క్రైస్తవులు తమను తాము ఓదార్చు కొంటుండగా, ఈ ఇతర మతాలలో మళ్ళీ కలుసు కోవడం అనేది ఇప్పటికే జరిగి పోతుంది. అయితే ఈ కలుసు కోవడం అజ్ఞాతంగా, ఇప్పుడు మనతో ఎటువంటి సంబంధాలతో ఉన్నారో, ప్రేమలతో ఉన్నారో, ద్వేషాలతో ఉన్నారో, అటువంటి సంబంధాలతోనే, మన జన్మాంతర జన్మలలో గూడ వారూ మనతోపాటు పుట్టి, ఉంటారు.

''భారత దేశంలోని అన్ని పవిత్ర గంథ్రాలలో వలె, వేదాలలో బోధించిన జన్మాంతరతా సిద్ధాంతం, బ్రాహ్మణ, బౌద్ధవాదాలకు ఆయువు పట్టుగా ఉందనే విషయం అందరికీ తెలుసు. ఈ నాటికి మహమ్మదీయేతర ఆసియాలో అది ప్రబలంగానే ఉంది. ఈ విధంగా అది మానవ జాతిలోనే సగానికి పైగా జనాభాలో, ఒక ఆచంచల విశ్వాసంగా, నమ్మశక్యం కానంత ఆచరణాత్మక ప్రభావంగా ఉంది, ఈజిప్షియన్ల విశ్వాసం గూడ అదే. వీరినుంచే ఆర్ఫియస్, పైథాగరస్, ప్లేటోలు ఉత్సాహంతో దానిని గ్రహించారు. అయితే, పైథాగరనియన్లు దానిని నిలుపుకొన్నారు. గ్రీకుల మార్మికతలలో దీనిని బోధించారు. ఈ విషయం Plato's Laws తొమ్మిదో పుస్తకాన్ని అనుసరిస్తుం దనడంలో సందేహం లేదు.

''జననాంతరతావాదాన్ని Edda గ్రంథం ప్రత్యేకంగా "Volusna" లో చెబుతుంది. డ్రూయిడ్ (Druids = క్రైస్తవ పూర్వమత పూజారులు) లకు అది పునాదని వేరే చెప్ప నక్కర లేదు.

''దీని అంతటిని బట్టి చూస్తే, మానవుడు ఎప్పుడు నిష్పక్షపాత బుద్ధితో పర్యాలో చించినా, జననాంతరతా వాదంలో మనిషికి విశ్వాసం ఉండడం సహజమేమో అని పిస్తుంది.....''

The World as Will and Idea

**హ్యూమ్ (Hume) :**

''అమర్త్యతా దర్శనమైన జననాంతరతా సిద్ధాంతాన్ని ఒక్కదాన్నే తత్వశాస్త్రం వినగలిగేది.''

**డిజ్రేలీ (Disrali)**

''జననాంతరతా సిద్ధాంతమంత సరళమైంది, మన అవగాహనకు విరుద్ధం కానిది ఏదీ లేదు. ఈ సిద్ధాంతం ఆధారంగా, ఈ జీవితపు సుఖదుఃఖాలు, మరో జీవితంలో మనం చేసిన పనులకు నష్టపరిహారాలు లేదా దండనలుగా పరిగణిస్తున్నాం.''

**డాంటే (Dante)**

''మళ్ళీ అప్పుడు పుత్రా, నీ మర్త్యభారం కారణంగా తిరిగి క్రిందికి వస్తావు.''

**ఎమర్సన్ (Emerson) :**

''అసంఖ్యాక అనుభవాలను పొందడానికి, సహజాతబోధితమైన సంసిద్ధతనుంచి మన విధిని అనుమానించా (infer) లి. ఆ అసంఖ్యాక అనుభవాలకు పైకి కనిపించే విలువ ఏమీ ఉండదు. వాటిని జీర్ణించు కోవడం లేదా తోసి వేయడం జరిగే లోపల ఎన్నో జన్మలలో వాటిని మనం గ్రహిస్తాం.''

**లెసింగ్ (Lessing)**

''జ్ఞానాన్ని, నూతన అనుభవాన్ని ఆర్జించగల సామర్థ్యం ఉన్నప్పుడెల్ల నేను ఎందుకు మరలి రాగూడదు?'' ఒకరాకలోనే నేను అంత సంపాదించుకో గలిగానా మరో మారు శ్రమిస్తే ఏమీలేక పోవడానికి.

**హక్స్లీ (Huxley)**

''పరిణామ సిద్ధాంతానికి వలె, జననాంతరతా సిద్ధాంతానికి వ్రేళ్లు వాస్తవికతా క్షేత్రంలోనే ఉన్నాయి.

అనువంశికత అనే పేరు క్రిందకు వచ్చే వాస్తవాలన్నింటిని దైనందిన అనుభవాలు మనకు తెలియ జెప్పుతున్నాయి. మనలో ప్రతి ఒక్కరమూ, పైతృకలక్షణాలను, బహుశా సుదూర (పూర్వ) పైతృక సంబంధాలను, కలిగి ఉన్నాము. ప్రత్యేకంగా చెప్పాలంటే, మనతో ఒక ప్రత్యేక పద్ధతిలో పనిచేయించాలనే ప్రవృత్తులు, – ఇలా ఒక పద్ధతిలో పని చేయడాన్ని 'శీలం'

అంటారు – తరచు పూర్వజుల, సపిండుల సుదూర శ్రేణి నుంచి రావడం చూస్తున్నాం. అందుకని, ఈ శీలం, ఈ నైతిక బౌద్ధిక మానవ సారం, మాంస నిర్మితమైన ఒక అచిర ఆవాసం నుంచి మరో ఆవాసానికి వస్తుందని చెప్పడంలో అసంగత మేమీ లేదు. నిజంగానే ఇది ఒకతరం నుంచి మరో తరానికి వస్తుంది. నూతనంగా జన్మించిన శిశువులో శీల సంబంధ బీజం గుప్తంగా అణిగి ఉంటుంది. ఇక ఈగో (అహం) మాట కొస్తే అది ఒక బీజాల సమాహారం కంటే ఎక్కువ ఏమీ కాదు. కాని, ఇవి, చాల త్వరగానే యథార్థీకరణం చెందుతాయి. బాల్యం నుంచి, వయస్సు పెరిగే కొలది, అవి వికసిస్తాయి. ఆ వికాసంలో అవి మందంగా ఉండవచ్చు, చురుకుగా ఉండవచ్చు, బలహీనంగానో, బలంగానో ఉండవచ్చు; అవిక్రూరమైనవి కావచ్చు, సౌమ్యమైనవి కావచ్చు. ప్రతి లక్షణము ఇతరంతో కలిసి, పరివర్తితమై కనిపించ వచ్చు. కాక పోతే ఆ శీలం నూతన శరీరాలలో అవతరించ వచ్చు.

''ఈ విధంగా నిర్వచించబడిన శీలాన్ని భారతీయ దర్శనకారులు 'కర్మ' అన్నారు. ఈ కర్మే జీవితం నుంచి జీవితానికి పయనించి, వాటిని జననాంతరతా గొలుసులో లింకులుగా బంధించింది. ఇది ప్రతి జన్మలో కొంత పరివర్తిత మవుతుందంటారు వారు. మార్పు పైతృకతా సంయోగం వల్ల కాక, దాని చర్యలవల్లనే జరుగు తుందంటారు.''

టెనిసన్ (Tennyson)

''లేదా నేను అధోజీవితాలనుంచి వచ్చి ఉంటే,
అనుభవం అంతా గతించినా,
నామరూపాలలో స్థిరీ భూతమైంది
నా బలహీన అదృష్టాన్ని మర్చి పోవచ్చు;
ఎందుకంటే మన మొదటి సంవత్సరం విస్మృతమైనా
కాని స్మృతి ప్రతిధ్వని వెంటాడడం మానలేదు.''

**వర్డ్స్ వర్త్ (Words Worth)**

''మన జన్మ ఒక నిద్ర, ఒక విస్మృతి కంటె ఏమీ కాదు:
మనతో పాటు వచ్చే ఆత్మ, మన జీవన తార,
దాని ఆవాసం ఎక్కడో ఉంది,
సుదూరంనుంచి అది వస్తుంది,
కాని పూర్తి విస్మృతితో కాదు.
పూర్తి నగ్నతతో కాదు,.....''

షెలీ (Shelly)

"పైకి కనిపించే భావప్రారంభానికి ముందు కాలంలో మనం ఉన్నామని అనుకోవడానికి కారణం లేక పోతే, అలాంటప్పుడు, మన భావం లేదా అస్తిత్వం అంతమైన తరవాత గూడ మనం ఉంటామని అనుకోపడానికి ఆధారాలు ఏమీ లేవు".

హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య ఫ్రాన్సిస్ బోవెన్ క్రైస్తవులకు, పునర్జన్మను అంగీకరించ మంటూ ఇలా రాస్తాడు :

"శాశ్వతమైన ఉన్నతమైన అనంతర జీవితం కోసం, ఈ భూమి మీది మన జీవితం ఒక శిక్షణ, ఒక తరిఫీదు. కాని, ఇది ఒక జీవితానికి పరిమితమైతే, అంతటి మహాలక్ష్యానికి సరిపో దనిపిస్తుంది. శాశ్వతతకు తయారు కావడానికి మూడు ఇరవైలు ఆపైన పది సంవత్సరాలు ఏ మాత్రం సరిపోవు. ఆత్మ పరీక్షాకాలం (Probation) ఈ స్వల్ప పరిమితులకే పరిమితం మైందనే హామీ ఏమైనా మనకు ఉందా? ఒకే మూర్తి మత్వం (ఆత్మ) అనుక్రామికంగా, అసంఖ్యాకంగా ఒక దేహాని తరవాత మరోదేహాని సచేతనం చేస్తూ, తను పొందిన శిక్షణను తనతో పాటు మోసుకు పోతూ, తనురూపొందించుకొన్న శీలం, తను పంచుకొన్న కోపతాపాలు, ప్రవృత్తులతో, అంతకుముందరి అవ్యవహిత అస్తిత్వం అడుగు జాడల్లో, ఎందుకు అనేక తరాల అనుక్రామిక శ్రేణుల్లో కొనసాగరాదు? ప్రకృతి స్వభావంలో గట్టిగా నాటుకు పోయిన పరిణామాలకు ఫలితాలకు సంబంధించిన గత చరిత్రను అది గుర్తు పెట్టుకోవాల్సిన అవసరం లేదు. ఒక జీవి భవ చక్రాలు - అవి ఒక మనిషిని మరో మనిషికినుంచి వేరుగా గుర్తించడానికి దోహదం చేసే గుండె, బుద్ధినిర్మాణా లకు తోడ్పడి ఉండవచ్చు - ఇప్పుడు మనం ఎన్నింటిని మరిచి పోలేదు? అటువంటి మతిమరుపు వల్ల మన బాధ్యత ఏ మాత్రం తగ్గదు. మనం దేనిమీద, ఎలా కాలాన్ని దుర్వినియోగం చేశామనే విషయాన్ని మరిచి పోయినా, ఆదుర్వియోగానికి బాధ్యత మనదే. చెడిన ఆరోగ్యం, దిగ జార్చే కోర్కెలు, తగ్గిన శక్తిసామర్థ్యాల ద్వారా, మనం ఇప్పుడు గూడ విస్మృతాలైన మన స్వీయార్థ, కామాచార, పాపకార్యాల ఫలాలను అనుభవిస్తున్నాం. మరిచి పోవడం ఎందుకు జరుగుతుందంటే, అవి అసంఖ్యాకాలుగా ఉన్నాయి.

ప్రతి జన్మ ఒకస్వతంత్ర పూర్తి సృష్టికార్యం అయితే, ఒకకొత్త జీవిని జీవితానికి పరిచయం చేయడమైతే, ఎందుకు వేరు వేరు ఆత్మలు అసలు ముమ్మందుగా ఎందుకు వివిధంగా నిర్మితాలయ్యాని మనం ప్రశ్నించడంలో తప్పు లేదు. ఈ ప్రపంచ దివ్యపాలనలో జనానాంతరత ఒక అంతర్భాగంగా ఉండి ఉంటే, ఈ ప్రశ్న ఉదయించదు. ఈ దృక్కోణం

నుంచి విషయాన్ని పరిశీలించినట్లయితే, ప్రతి ఒక్కడు తన గతచరిత్రలో ఆర్జించిన స్థితిలోనే పుడతాడు... అనువంశిక పాపం, దాని ఫలితాల సిద్ధాంతం మనం నేర్చుకోవలసిన ఒక కఠిన పాఠం. కాని, తాను తన నుంచి అంటే తన పూర్వజన్మల నుంచి వారసత్వంగా పొందిన ప్రవృత్తులను, శక్తియుక్తులను గురించి ఎవడూ ప్రశ్నించ లేదు.... మరణం అని మనం పిలిచేది ఈ భూమిమీద మరో జీవితాన్ని ప్రవేశపెట్టడమే. ఈ జీవితం, గత జీవితం కంటె ఉన్నతమైందీ, మంచిదీ కానట్లయితే అది మన తప్పిదం.''

**పూర్వ అస్తిత్వం**

''షంద్రం తీరాన పవళించాను,
ఒకింత స్వప్న జగత్తులోకి జారుకొన్నాను,
మహాతరంగాలు విరగడం; మొరగడం విన్నాను
సూర్యుడు నా ముఖం మీద ఉన్నాడు.

''నిర్వ్యాపారంగా నా నీరు కావి రంగు చేతుల వ్రేళ్ళు
ధూసరవర్ణ గులకరాళ్ళతో ఆడాయి;
తరంగాలు వచ్చాయి, తరంగాలు వెళ్ళాయి;
అత్యంతంగా వజ్రనిర్ఘోషతో, ప్రమోదంగా.

''శర్కరాఖండాలు (గులకరాళ్ళు)', అవిమృదువుగా, వర్తులంగా
నా చేతుల మీద వెచ్చగా ఉన్నాయి;
ఇసుకతిన్నెల మధ్య కూర్చున్న
నే చూసిన అల్ప జనుల్లా.

''మిల మిల మెరిసే అల్ప ఇసుక రేణువులు
మెత్తగా నా వ్రేళ్ళ సందుల్లోంచి జారిపోయాయి;
సూర్యుడు దాని మీద అంతటా ప్రకాశించాడు
అలాగ నా స్వప్నం ఆరంభమైంది;

''ఇదంతా గతంలో ఎలా ఉంది
యుగయుగాల క్రితం ఎలా ఉంది,
నేను ఏదో ఒక విస్మృత తీరాన పడుకొని ఉన్నాను
నేను ఈ రోజు ఇక్కడ పడుకొని ఉన్నట్లుగానే

‘‘అప్పుడూ అలలు వచ్చాయి, సైకతాలను మెరిపిస్తూ,
ఈ రోజు ఇక్కడ అవి మెరిపించినట్లుగానే;
నా ప్రాక్ - పలాజియన్ హస్తాలలో
ఇసుక వెచ్చగా, సుందరంగా ఉంది.

‘‘నేను ఎక్కడ నుంచి వచ్చిందీ మరిచి పోయాను,
నా యిల్లు ఏదై ఉంటుందో మరిచాను.
ఏ అపూర్వ, ఆటవిక నామంతో
ఆ సముద్రాన్ని పిలిచానో మరిచాను.

‘‘సూర్యుడు ప్రకాశించాడని మాత్రమే తెలుసు
అది ఇంక ఈ రోజుకి ప్రకాశిస్తున్నట్లుగా
నా సుదీర్ఘ ధూసర అంగుళిలలో
చిన్నారి శర్కరా ఖండాలు ఆడుకొంటున్నాయి.’’[2]

**పాదసూచికలు**

1. ట్రోజన్ యుద్ధంలో తాను, యుఫోర్బస్‌గా యుద్ధం చేసినట్లు పైథాగరస్ జ్ఞప్తి చేసుకోగలిగాడు. యమ్పెడాక్లీజ్ తన గత జన్మలలో ఒక బాలుడు, ఒక బాలిక, ఒక పిట్ట, సముద్రంలోని ఒక చేపగా ఉన్నాడు (Frag. 117, Diels).

2 Frances Cornford, *An Anthology of Modem Verse,* chosen by A Methuen, London, Mathuen and Co. and reproduced in the *Buddhist Annual,* Cylon, 1927.

ముప్పైమూడో ప్రకరణం

# నిబ్బాన

''నిబ్బానం పరమానందం.''

– ధమ్మపద, V. 203/204

**నిర్వాణమే బౌద్ధం పరమార్థం**

ఈ ప్రగాఢ విషయం మీద ఒకడు ఎంత స్పష్టంగా రాసినా, వర్ణించినా, దాని పరమ ప్రశాంతతను ఎంత వైభవోపేతమైన పదాలలో చెప్పినా, కేవలం పుస్తకాలు చదవడం ద్వారా నిర్వాణాన్ని అర్థం చేసుకోవడం దుర్లభం. నిర్వాణం అచ్చులో నిబద్ధించేది కాదు. అది కేవలం బుద్ధి కుశలతతో మాత్రమే గ్రహింప దగిందీ కాదు. అది లోకోత్తరస్థితి. అంతర్బోధిక ప్రజ్ఞ ద్వారా మాత్రమే దానిని యథార్థం చేసుకోవడం సాధ్య మవుతుంది.

కేవలం బుద్ధి పరంగా నిర్వాణాన్ని అవగాహన చేసుకోవడం దుస్తరం. ఎందుకంటే అది తార్కిక వివేచన ద్వారా అందుకోదగిన విషయం కాదు. బుద్ధుని మాటలన్నీ శుద్ధ తార్కికాలు, కాని బౌద్ధం పరమార్థమైన నిర్వాణం తర్కం పరిధికి వెలుపలిది. అయినా, జీవితం యొక్క నకారాత్మక, సకారాత్మక పక్షాలను జాగ్రత్తగా చూస్తే, ఒక తార్కిక నిర్ణయానికి చేరతాం. నిర్ణయం (conclusion) ఇది: ఒక నిబద్ధిత దృగ్విషయక అస్తిత్వం కంటే వేరైన దుఃఖ రహిత, మరణ రహిత, అనిబద్ధ అస్తిత్వం ఒకటి ఉండి తీరాలి.

బోధిసత్త్వుడు 'సుమేధా'గా జన్మ ఎత్తి నప్పుడు ఈ విధంగా పర్యాలోచించాడని, జాతక వ్యాఖ్యానం చెబుతున్నది :

''అక్కడ దుఃఖం ఉంటు న్నప్పటికి, అదే సమయంలో,
సుఖం గూడ అక్కడ దొరుకుతుంది;
అలాగే అక్కడ నిజంగా అస్తిత్వం ఉన్నా
అనస్తిత్వాన్నీ అదే సమయంలో అక్కడ కనుగొనాలి

''అక్కడ ఉష్ణం ఉన్నప్పటికీ, అదే సమయంలో,
అయినా అక్కడ ఆహ్లాదకర శీతలం గూడ ఉంటుంది;

అలాగే, త్రిగుణ జ్వాల ఉన్నప్పటికీ,
అదే విధంగా నిర్వాణాన్ని అన్వేషించాలి.

''అక్కడ దుఃఖం ఉన్నా, అదే సమయంలో,
మంచిదేదో అది అక్కడ లభిస్తుంది;
అలాగే, జననం ఉన్న మాట నిజం
జననం కాని దేదో దానిని అన్వేషించాలి[1]''.

**నిర్వచనం**

'నిబ్బాన' అనేపాళీ పదం (నిర్వాణ – సంస్కృతం) 'ని', 'వాన' అనేపదాల సంయోగం. 'ని' నకారాత్మక ఉపసర్గ (particle) 'వాన' అంటే నేయడం, లేదా వాంఛించడం. ఈ తృష్ణ (వాంఛ) ఒక జీవితాన్ని మరో జీవితంలో కలిపే రజ్జువు(తాడు)లాగ పనిచేస్తుంది.

''దానిని నిబ్బాన అని ఎందుకంటున్నా, మంటే, అక్కడ 'వాన' లాలస, అని పిలవబడే తృష్ణ నుంచి వెడలి పోవడం (ని) ఉంది.''[2]

ఒకడు తృష్ణతో లేదా రాగంతో బద్ధుడై ఉన్నంతకాలం నూతన 'కర్మ' సంచిత మవుతుంది. ఇలా సంచితమైన కర్మ ఏదో ఒక రూపంలో జనన మరణ శాశ్వత వలయంలో యధార్థ రూపం దాల్చ వలసి ఉంటుంది. అన్నిరకాల రూపాల తృష్ణలు అంతర్థితమై నప్పుడు, పునరుత్పాదన కర్మశక్తులు నశిస్తాయి. అప్పుడు అతడు, జీవన మరణ వలయాన్ని ఛేదించుకొని నిర్వాణం చెందుతాడు. బౌద్ధం ప్రకారం ముక్తి అంటే, కేవలం పాపపుణ్యాల నుంచి విముక్తం కావడం కాదు, ఎప్పుడూ పునరావృతమయ్యే జనన మరణ వలయం నుంచి ముక్తి పొందడం.

నిబ్బానాన్ని లోభ, దోస (ద్వేష), మోహ (భ్రమ)ల ఉచ్ఛేదంగా గూడ చెబుతారు. ఈ సందర్భంగా బుద్ధుని మాటలను గుర్తుకు చేసుకోవాలి. ''ప్రపంచం అంతా జ్వాలల్లో ఉంది'', అది ఏ నిప్పుతో రాజేయ బడింది? లోభ దోస మోహాల నిప్పు ద్వారా. జనన జరామరణ, దుఃఖ, విచార, బాధ, నిస్పృహలనే నిప్పుతో అది వెలిగించబడింది''.

ఒక అర్థంలో నిబ్బాణం అంటే, ఈ జ్వాలలను ఆర్పడం. దీనిని బట్టి నిబ్బాన అంటే ఈ మంటలను ఆర్పడం కంటే మరేమీ లేదను కోరాదు. సాధనాలను, లక్ష్యం నుంచి వేరుగా చూడాలి. ఇక్కడ మంటలను ఆర్పడం నిబ్బానం పొందడానికి సాధనం మాత్రమే.

**నిబ్బానం అంటే శూన్యమా?**

అంధుడు వెలుగును చూడలేని కారణంగా వెలుగే అసలు లేదని అనడం ఎంత అసంబద్ధమో, నిర్వాణాన్ని మనం జ్ఞానేంద్రియాలతో దర్శించలేని కారణంగా, దానిని శూన్యమని చెప్పడం అంతే అతార్కికం. ప్రఖ్యాతమైన ఒక కథలో, నీటిని మాత్రమే ఎరిగిన

ఓ చేప, తాబేలుతో వాదిస్తూ, 'భూమి అనేదే లేదు' అనే నిర్ణయానికి విజయ వంతంగా వచ్చింది, ఎందుకంటే దాని అన్ని ప్రశ్నలకు ''లేదు' అనే సమాధానమే వచ్చింది.

అనగా అనగా ఒక చేప ఉంది. అది చేప గనుక, దాని జీవిత మంతా నీటిలోనే గడచింది. నీటిని గురించి తప్ప దానికి మరి దేనిని గురించి ఏమీ తెలియదు. అది ఒక రోజు, తను ఎన్నాళ్ళగో ఉంటున్న నీటికొలనులో తిరుగాడుతూ, దానికి బాగా పరిచయం ఉన్న తాబేలును కలిసింది. ఈ తాబేలు అంతకు ముందే, నేల మీద కొంత కాలం విహారం చేసి తిరిగి వచ్చింది.

''తాబేలుగారూ నమస్కారం'', అంది చేప . ''మిమ్మల్ని చూడక చాల కాలమైంది, ఎక్కడకు వెళ్ళారు, ఏమిటి కథ ?''

''ఆఁ అవును'', ''నేల అలా ఎండు నేల మీదకు పర్యటనకు వెళ్ళాను అంది తాబేలు''.

''పొడినేల మీదికా!'' ఆశ్చర్యపోయింది చేప. ''పొడినేల అంటే ఏమిటి మీ ఉద్దేశంలో? అసలు పొడి నేల అనేదే లేదు. నేనెప్పుడూ అటువంటి దానిని చూడ లేదు. పొడి నేల శూన్యం.''

''బాగుంది,'' అంది తాబేలు సదుద్దేశంతోనే. మీరు అలా అనుకొంటానంటే అనుకోవచ్చు. అలా అనుకోకుండా మిమ్ము ఆపే వారెవరూ లేరు. కాని ఏమైనా, నేను వెళ్ళింది మాత్రం పొడినేల మీదికే''.

''ఇదిగో ఇటు చూడండి'', అంది చేప. ''మాటాడేదానికి కొంచెమైనా అర్థం పర్థం ఉండా లండి. ఇప్పుడు చెప్పండి, మీరు వెళ్ళి వచ్చామంటున్న ఆ పొడినేల ఎలా ఉంటుందో నాకు కొంచెం వివరించండి? అది అంతా తడిగా ఉంటుందా?''

''లేదు. అది తడిగా ఉండదు,'' అంది తాబేలు.

''అది అందంగా, చల్లగా, తాజాగా ఉంటుందా?'' చేప అడిగింది..

''లేదు, అదే అందంగా, చల్లగా, తాజాగా ఉండదు,'' తాబేలు సమాధానం చెప్పింది.

''దాని గుండా వెలుతురు వచ్చేందుకు వీలుగా అది స్వచ్ఛంగా ఉంటుందా?

''అది స్వచ్ఛంగా లేదు. వెలుతురు దానిగుండా రా లేదు''.

''నారెక్కలను కదిలించి, నా ముక్కును జొనప డానికి వీలుగ, అది మృదువుగా, నమ్యంగా అనిరోధంగా ఉంటుందా?

''కాదు అది మెత్తగా అనిరోధంగా ఉండదు. అందులో మీరు ఈద లేరు.''

''అది ప్రవాహం వలె కదులు తుందా, ప్రవహిస్తుందా?

''అది కదలదు, ప్రవహించదు.''

''అది తరంగాలుగా, నురుగుతో ఎగిరిపడుతుందా?'' అంది చేప. ఈ లేదు, లేదులతో విసిగి, అసహనంతో.

''లేదు!'' తాబేలు అంది నిజాయితీతో. ''అది తరంగాలుగా ఎగిరిపడదు. నేను చూశాను.''

''ఆc అదీ విషయం'', విజయవంతంగా చేప ఆశ్చర్యాన్ని అభివ్యక్తం చేసింది. ''నేను చెప్పలేదా, మీరు చెప్పే ఈ నేల శూన్యమని? నేను మిమ్మల్ని ఇప్పుడు అడిగాను గదా, మీరేమో అది తడిగా ఉండదని, మెత్తగా, తాజాగా, చల్లగా ఉండదని, అది ప్రవహించదని, తరంగాలుగా ఉండదని చెప్పారు. అది ఈ చెప్పిన వాటిల్లో ఏ ఒక్కటీ కాకపోతే, అది 'శూన్యం' కాక మరేమవుతుంది? నాకివన్నీ చెప్పొద్దండి''.

''బాగుంది, బాగుంది'', తాబేలు అంది,''. పొడినేల శూన్యమని మీరు అనుకోవాలను కొంటే అనుకోండి. నాకేం అభ్యంతరం లేదు. కాని, నీరూ, నేలా రెండింటిని ఎరిగిన వాడు నిన్నొక మూర్ఖ మత్స్యం అంటాడు, ఎందుకంటే, నీకు తెలియని దాని నెల్ల శూన్య మంటావు, ఎందుకంటే అది నీకు తెలియదు.''

దీనితో తాబేలు, చేపను తన మానానికి తనను ఆ కొలను వదిలి వేసి, మరోసారి నేల మీదికి, ''శూన్యమన్న ఆ నేల'' మీదికి విహారానికి బయలు దేరింది.[3]

ఈ కథనుంచి, నేల, నీరూ రెండింటిని ఎరిగిన తాబేలు నేలను గురించి చేపకు తెలియజేయ లేక పోయిందనీ, కేవలం నీటిని మాత్రమే తెలిసిన చేపా, నేలను గురించి గ్రహించ లేక పోయిందని తెలుసుకొంటాం. అలాగే, లోకాన్ని లోకోత్తరతను ఎరిగిన అర్హంతలు విషయాసక్తునికి లోకోత్తరత అంటే ఏమిటో ఇహ లోకపరంగా వివరించ లేరు. అలాగని, విషయాసక్తుడు, ఇహలోక జ్ఞానంతో లోకోత్తరతను అర్థం చేసుకోనూ లేడు.

నిర్వాణమే కనుక శూన్యమై నట్లయితే, అది అప్పుడు అవశ్యంగా ఆకాశంతో ఒకటై తీరాలి. నిర్వాణమూ, ఆకాశమూ నిత్యాలు, అపరివర్తనీయాలు. మొదటి దానికి కాలదేశాలు (Time & space) లేవు. రెండోది శాశ్వతం. ఎందుకంటె దానికై అది శూన్యం (nothing in itself) రెండింటి మధ్య తేడాను చెప్పవలసి వస్తే నిర్వాణం ఉన్నది, ఆకాశం లేనిది.

వేరు వేరు అస్తిత్వ భూమికల గురించి మాటాడుతూ శూన్యాన్ని ( ఆకించాఞ్ఞా యతాన్ని) గురించి ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

నిర్వాణం ఒక మానసిక వస్తువుగా (వత్థుధమ్మా) సాధిత మవుతుంది. కనుక, అది శూన్యం కాదని తేలి పోతున్నది. అది నిజంగా శూన్యమే కనుక అయి నట్లయితే, బుద్ధుడు దానిని 'అనంత'మని, 'అసంఖాత' (Non - Conditioned) అని, 'అనుపమేయ'మని, 'అనుత్తర' (supreme) మని, 'పరం' (highest) అని, 'పారం' (beyond) అని, 'పరాయనం' (Highest refuge) అని, 'తాణ' (Safty) అని 'క్షేమం' (ఖేమ = Security) అని 'శివం (happiness), అని, 'కేవల' (unique) మని, 'అనాలయ' (abodeless) మని, అక్షర (అఖ్ఖర = imperishable) మని, ''విశుద్ధ' (absolute purity) మని, 'లోకోత్తర'మని, 'అమర్త్య'మని, ముక్తి (ముత్తి) అని 'శాంతి' మొదలైన పదాలలో వర్ణించి ఉండేవాడు కాడు.

'ఉదాన', 'ఇతివృత్తక'లలో బుద్ధుడు నిర్వాణాన్ని గురించి ఇలా చెప్పాడు:

''ఓ భిక్కులారా, ఒక అజాత, అభూత, అకత (unmade), అసంఖాత స్థితి ఉంది. ఓ భిక్కులారా, ఈ అజాత, అభూత, అకత, అసంఖాత స్థితే కనుక లేనట్లయితే, జాత, భూత, కత సంఖాతులైన వారికి ముక్తి సంభవం కాదు. ఒక అజాత, అభూత, అకత, అసంఖాత స్థితి ఉన్న కారణాననే, జాత, భూత, కత, సంఖాతులైన వారికి ముక్తి సంభవం అవుతున్నది[4].

**ఇతి వృత్తక ఇలా అంటున్నది :**

పుట్టినది, పరిణమించేది, ఉత్పాదితమూ సమ్మేళితమూ అయినదేదీ మనుగడ లేనిదే. జనన మరణాలతో గూడిన, రోగ నిలయము, పెళుసు అయిన, అన్నంతో కొనసాగే వస్తువు – అటువంటిది. సంతోషింప దగింది కాదు. దానీ నుంచి విముక్తి – ఇదే నిజమైంది – హేతువుకు అందనిది, అది అజాతం, అనుత్పాదితం, దుఃఖరహితం. దుఃఖం నుంచి విముక్తి కలిగించి, శాంతిచేకూర్చే, దుఃఖ విషయాలకు దూరంగా ఉంచే, అకలంక పథం అది''[5]

అందువల్ల బౌద్ధుల నిర్వాణం, శూన్యస్థితీ కాదు, కేవల విరమ స్థితీ కాదు ఏది కాదో దానిని ఎవరైన ఖచ్చితంగా చెప్పవచ్చు. అది ఖచ్చితంగా ఏమిటో, పూర్తిగా ఎవరూ చెప్ప లేరు. కారణం అది అనన్యమైనది. అది ఎవరికి వారు యదార్థీకరణం చెందడం ద్వారా తెలుసుకో దగింది.

**సోపాధిశేష, అనుపాదిశేష నిర్వాణం**

**(సోపాది సెస, అనుపాదిసెస నిబ్బానధాతు)**

గ్రంథాలలో తరచు నిర్వాణాన్ని సాపాదిసెస్, అనుపాదిసెస నిబ్బాణధాతువుగా పేర్కొనడం జరుగుతోంది.

ఇవి వాస్తవానికి రెండు రకాల నిర్వాణాలు కావు. అది ఒకటే. కాకపోతే. మరణా త్పూర్వమూ, మరణానంతరమూ పొందే అనుభవం ప్రకారం అలా పిలుస్తారు.

అన్వేషి దానికి తగిన వాడైతే, ఈ జీవితంలోనే, నిర్వాణం సాధ్య మవుతుంది. అనంతర (ఆవలి) జీవితంలోనే పరమలక్ష్యం సాధ్యమని బౌద్ధం ఎక్కడా చెప్ప లేదు. ఇక్కడే బౌద్ధ నిర్వాణ భావనకు, బౌద్ధేతర నిర్వాణ భావనకు మధ్య ఉన్న తేడాను చూడవచ్చు. బౌద్ధేతర నిర్వాణ భావన ప్రకారం, శాశ్వత స్వర్గం ఒకటి ఉంటుంది, దానిని మరణానంతరం మాత్రమే సాధించడం జరుగుతుంది.

నిర్వాణాన్ని ఈ శరీరంతోనే సాధిస్తే, దానిని సోపాధిశేష నిబ్బాణధాతు అంటారు. శరీరం భౌతికావశేషాలు ఏమీ మిగలకుండ లయమై నప్పుడు అర్హంత పొందే పరినిర్వాణాన్ని అనుపాధిశేష నిబ్బాణ ధాతు అంటారు. ఇతివుత్తకలో బుద్ధుడు అంటాడు:

''ఓ భిక్కులారా రెండు నిర్వాణ అంశాలున్నాయి, ఏమిటారెండు? భూమిక (ఉపాధి) ఇంకా ఉన్న నిర్వాణాంశం ఒకటి, అది లేనిది రెండోది.

''ఓ భిక్కులారా, మలినాలను తుడిచిపెట్టి, చేయవలసిన వాటిని చేసి భారాన్ని దించు కొని, లక్ష్యాన్ని సాధించిన వాడు, అస్తిత్వశృంఖలాలను ఛేధించుకొన్న వాడు, తిన్నగా అవగతం చేసుకొన్న వాడు అర్హంత అయి ముక్తి పొందుతాడు. అతని పంచేంద్రియాలు చెక్కుచెదరవు. అవి ఉంటాయి. వాటి ద్వారా సుఖ, దుఃఖ అనుభవాలను పొందుతూనే ఉంటాడు. అటువంటి, రాగ, మోహ, భ్రమల నాశాన్ని, 'భూమిక యధాతథంగా ఉన్న నిర్వాణాంశం' అంటారు.

''ఓ భిక్కులారా, భూమిక లేని నిర్వాణాంశం ఏదంటారు?

''చూడండి, ఓ భిక్కులరా, ఒక భిక్కు అర్హంత అయి, ముక్తి పొందుతాడు. ఈ జీవితంలో అతనికి ఇంద్రియాలు ఏమాత్రం ఆనందాన్ని ఇవ్వవు. అవి శమిస్తాయి. దీనినే 'భూమికలేని నిర్వాణాంశమంటారు.'

''ఈ రెండు నిర్వాణ స్థితులను
ఎవడు దర్శిస్తాడో, ఎవడు అటువంటి వాడవుతాడో, విరాగి అవుతాడో,
అతడుప్రదర్శిస్తాడు.
ఒక స్థితి, ఈ జీవితంతోనే, భావ ప్రవాహం తెగి,
భూమికతో ఉంటుంది.

రెండో స్థితి, భూమికలేనిది, భావికి చెందింది,

ఇందులో భవాలు (becomings) పూర్తిగా అంతర్హితాలవుతాయి.

ఈ స్థితిని అసమ్మేళనం (Non compounded) గా,

ఎరిగినవారు, ప్రవాహాన్ని ఛేదించుకొని, ముక్తిని పొందుతారు.

ధమ్మ సూక్ష్మాన్ని చేరినవారు భవాంతాన్ని సంతోషంగా చేస్తారు. అటువంటి వారు అన్ని భవాలను పరిత్యజించిన వారవుతారు''[7].

**పాద సూచికలు**

1. Warren, *Buddhism in Translations,* P. 6
2. See Narada Thera, A Manual of Abhidhamma PP. 317 ff. *Compendium of Philosophy.*
3. ''నాలుగు ఆర్య సత్యాలు'' అనే భిక్కు శీలాచార్యుని పుస్తకం నుంచి ఉటంకితమైంది.
4. వ్యాఖ్యానం ప్రకారం ఈ నాలుగు పదాలు పర్యాయ పదాలుగానే ఉపయోగించ బడ్డాయి. 'అజాత' అంటే హేతుప్రత్యయాల (హేతుపచ్చయ = causes or conditions) వలన పుట్టనిది అని అర్థం. అభూత అంటే పుట్టినిది అని అర్థం. అది ఒక కారణం నుంచి పుట్టలేదు కనుక, భవంలోకి రాలేదు కనుక, అది దేని కారణంగాను తయారు కానిది (అకత). భవము, పుట్టుక మనస్సు, పదార్థాల లాంటివి సంఖాత వస్తువుల లక్షణాలు; కాని నిర్వాణానికి అటువంటి లక్షణాలు లేవు, కనుక అది అసంఖాతం. *Verses of Uplift,* p. 98, *As it was said*, P. 142 చూడండి.
5. Woodward, *As It was said,* P. 142
6. స = తో, ఉపాది = సమాహారములు - మనస్సు, పదార్థం. సెస = శేష. సమాహారాలను ఉపాధులంటారు. ఎందుకంటె, వాటిని తృష్ణ, అవిద్యలు గట్టిగ పట్టు కొంటాయి.
7. Woodward, *As It was said,* P. 144.

ముప్పై నాలుగో ప్రకరణం

# నిర్వాణ లక్షణాలు

''మిత్రమా, నిర్వాణ మంటే ఏమిటి?

రాగ, ద్వేష, మోహాల వినాశం. ఓ మిత్రమా, నిర్వాణమంటే''.

– సంయుత్త నికాయ.

సంసారం అంటే దృగ్విషయిక అస్తిత్వానికి భిన్నంగా నిర్వాణం శాశ్వతం (ధ్రువ) వాంఛితం (సుభ), సుఖకరం (సుఖ).

బౌద్ధం ప్రకారం వస్తువులన్నీ – ఇహ పర వస్తువున్నీ – రెండు వర్గాలుగా విభజితాలు. అవి సంఖాతాలు, అసంఖాతాలు.

''ఈమూడు సంఖాత వస్తువుల లక్షణాలు: పుట్టుట, గిట్టుట, స్థితిమారుట''[1].

హేతుప్రత్యయాలు పొందిపుట్టిన వస్తువుకు భవం అవశ్యలక్షణం. భవమైన ప్రతివస్తువు మార్పుకు గురై లయం చెంద వలసిందే. సంఖాత వస్తువు ప్రతిదీ భవం చెందుతూ, నిరతం మారుతూ ఉంటుంది. సార్వత్రిక పరివర్తన నియమం ప్రతి వస్తువుకు – మానసిక, భౌతిక – అత్యంత సూక్ష్మమైన జీవి లేదా కణం నుంచి, ఉన్నత జీవి లేదా అత్యంత రాశీభూత వస్తువు వరకు, వర్తిస్తుంది. మనస్సు, కనిపించక పోయినా, పదార్థం కంటె త్వరగా, వేగంగా మారుతుంటుంది.

బుద్ధులు, అర్హంతలు యధార్థం చెందించు కొన్న లోకోత్తరమైన నిర్వాణం కారణ జనితం కాదని ప్రకటించారు. కనుక అది భవానికి గాని, పరివర్తనకుగాని, లయానికి గాని గురి కాదు. అది అజాతం, అవినాశం, అమర్త్యం, ఖచ్చితంగా చెప్పాలంటే, నిర్వాణం కారణమూ కాదు, కార్యమూ (ఫలితమూ) కాదు. అందువలన అది అనన్యం.

కారణం వలన పుట్టిన ప్రతిదీ గతించ వలసిందే. అందుకని అది అవాంఛనీయం.

జీవితం మనిషికి అన్నింటి కంటె ప్రీతి పాత్రమైనది. కాని, అదే జీవితం అతనికి అధిగమించ రాని కష్టా లెదు రైనప్పుడు, మోయలేని బరువులు మీద పడ్డప్పుడు, విపరీతమైన భారంగా తోస్తుంది. కొన్ని సార్లు, అతడు ఆత్మహత్యే తన సమస్య లన్నింటికి పరిష్కార మన్నట్లు, జీవితాన్ని అంత మొందించుకో జూస్తాడు.

శరీరాన్ని అలంకరిస్తాం, ఆరాధిస్తాం. కాని, ఆ అందమైన, ఆరాధనీయాలైన, ప్రలోభాలైన ఆకృతులు, కాలంతో, రుగ్మతతో వికృతాలైనప్పుడు, చాల జుగుప్సాకరంగా తయారవుతాయి.

తన వారితో, వినోదాలతో, సుఖాలతో ప్రశాంతంగా, ఆనందంగా కాలం గడపాలని మనిషి కోరు కొంటాడు. కాని, ఏదో దురదృష్టం వల్ల, ఈ క్రూర ప్రపంచం వారి ఆశంసలకు, ఆశలకు విరుద్ధంగా ఎదురు నడిచి నప్పుడు, ఆ అనివార్య విషాదం చెప్పరానంత ఘాటుగా ఉంటుంది.

ఈ దిగువ కథ, జీవిత ప్రవాహ స్వభావాన్ని, దాని ప్రలోభక సుఖాలను చక్కగా చూపుతుంది.

రాయి – రప్ప, ముళ్ళతో కంటకితమైన దట్టమైన అడవి గుండ ఒకడు పోతున్నాడు.. ఆకస్మికంగా ఒక ఏనుగు వచ్చి అతని వెంట పడింది. భయంతో పరుగు లంకించు కొన్నాడు. ఒక బావి కనిపించగా, దాక్కొన డానికి దాని దగ్గరకు వెళ్ళాడు. కాని ఆబావిలో ఒక పాము ఉంది. మరిక తప్పించు కొనే మార్గం ఏదీ లేనందు వల్ల, బావిలోకి దూకేశాడు. ఆ బావిలో పెరుగుతున్న ముళ్ళ తీగను పట్టుకొన్నాడు. పైకి చూస్తే, ఆ ముళ్ళ తీగను రెండు ఎలుకలు – ఒకటి తెల్లనిది, మరొకటి నల్లనిది – కొరుకు తున్నాయి. అతని ముఖానికి తిన్నగా ఒక తేనె తొట్టె ఉంది. దాని నుంచి అప్పు డప్పుడు తేనెచుక్కలు పడుతున్నాయి.

ఈ మనిషి, తానున్న అపాయకర స్థితిని విస్మరించి, బుద్ధిహీనంగా తేనె చుక్కలను చప్పరించడం మొదలు పెట్టాడు. ఒక దయా మయుడు అతనికి బయట పడేమార్గం చూపించ డానికి ముందుకు వచ్చాడు. కాని ఆ ఆశపోతు మనిషి, తన ఆనందం పూర్తయ్యేదాక ఆగ వలసిందని కోరాడు.

ఆ కంటక మార్గం సంసారం – జీవిత సంద్రం. మానవుని జీవితం గులాబీల పాన్పు కాదు. దానిలో అధిగమించ వలసిన అనేక కష్టాలు, ఆటంకాలు ఉన్నాయి. వ్యతిరేకతలు, అహేతుక విమర్శలూ ఉంటాయి. అవమానాలు, దాడులు ఉంటాయి. అటువంటిది కంటక జీవితం.

ఇక్కడ ఏనుగు మరణాన్ని ప్రతిబింబిస్తుంది. పాము వృద్ధాప్యాన్ని, తీగ జననాన్ని, రెండు ఎలుకలు రేబవళ్ళను, ప్రతీకీకరిస్తాయి. తేనె చుక్కలు క్షణిక ఇంద్రియ సుఖాలకు ప్రతీకలు. మనిషి 'సత్వం' ను దయామయుడు బుద్ధుని సూచిస్తాయి.

తాత్కాలిక భౌతిక సుఖం కేవలం ఏదో ఒక వాంఛా తృప్తి మాత్రమే. ఆశించిన వస్తువు లభించగానే, మనస్సులో మరో కోరిక లేస్తుంది. అన్ని వాంఛలూ అసంతృప్తాలే.

దుఃఖం జీవితంలో భాగం. దానిని పరిహరించ లేం.

నిర్వాణం, అసంఖాతం గాబట్టి అది శాశ్వతం, వాంఛనీయం, సుఖమయం.

నిర్వాణ సుఖాన్ని మామూలు ఇహలోక సుఖం కంటె భిన్నంగా చూడాలి. నిర్వాణ సుఖం సారహీనం కాదు, విసగట కలిగించదు. అది ఎప్పుడూ మోహం మొత్తించని ఆనంద రూపం. అదెప్పుడూ డోలాయమానం కాదు. ఏదో ఒక వాంఛ సంతృప్తం కావడంతో జనించే తాత్కాలిక ప్రాపంచిక సుఖం వలెకాక, మోహ వికారాలను దూరం చేయడం వలన అది కలుగుతుంది.

బహువెదనీయసుత్త[2]లో బుద్ధుడు, ఇంద్రియాల ఉద్దీపనతో కలిగే స్థూల భౌతిక సుఖాలతో మొదలుపెట్టి, పది స్థాయిల సుఖాలను చెప్పాడు. ఒకడు నైతికంగా ఉన్నతోన్నత శిఖరాలను అధిరోహించే సరికి, సుఖం సూక్ష్మమై, సున్నితమై, ఉన్నత మవుతుంది. అలా కావడంతో ప్రపంచం దానిని సుఖంక్రింద చూడదు. ప్రథమ ఝానంలో, పూర్తిగా పంచేంద్రియాల కంటె స్వతంత్రమైన, సుఖాన్ని అనుభవిస్తాడు. భౌతిక వాది ఎక్కువగా విలువ నిచ్చే ఇంద్రియ సుఖ వాంఛను ప్రత్యాదేశితం చేయడం ద్వారా ఈ సుఖాన్ని పొందుతారు. నాలుగో ఝానంలో అయితే, ఈ రకం సుఖాన్ని గూడ, స్థూలమని, అప్రయోజన కరమని భావించి, వదిలివేసి, ఉపేక్షను వహిస్తారు. ఉపేక్షనే సుఖమని వాకొంటారు.

బుద్ధుడు అంటాడు:[3]

''ఆనందా, ఐంద్రియక బంధాలు ఐదు, ఆ ఐదు ఏమిటి? కంటితో చూడగల ఆక్రుతులు – వాంఛనీయమైనవి, ప్రియమైనవి, అందమైనవి, మోహ పూరితమైనవి, తృష్ణతో గూడినవి, రాగధూళిని రేపేవి. చెవితో వినే ధ్వనులు; ముక్కుతో గ్రహించే వాసనలు, నాలుకతో చూసే రుచులు; శరీరంతో పొందే స్పర్శలు – వాంఛనీయమైనవి, ప్రియమైనవి, అందమైనవి, తృష్ణతో గూడినవి, రాగధూళిని రేపేవి. ఆనందా, ఈ ఐదూ ఐంద్రియక బంధాలు. ఈ ఐంద్రియక బంధాల నుండి పొందే ఏ సుఖమైన ఐంద్రియక సుఖం అవుతుంది.

'' 'మనుష్యులు అనుభవించే ఈ సుఖమే, సంతోషమే పరమోన్నతం' అని ఎవడైనా అంటే, నేను అతనిని ఒప్పుకోను, ఎందుకని? ఎందుకని అంటే, ఇంత కంటె ఉన్నతమైంది, సూక్ష్మమైంది మరో సుఖం ఉంది.

''మరి ఆ ఉన్నతమైన, సూక్ష్మమైన సుఖం ఏమిటి? పూర్తిగా ఇంద్రియ సుఖాలకు దూరంగా, అ నైతికానికి ఆమడ దూరంలో, ఏకాంతంగా ఉండడం వల్ల జనించిన ప్రాథమిక, సంసక్త యోజనతో, సుఖ సంతోషాలతో, ప్రథమ ఝానంతో ఒక భిక్కు ఉన్నాడు. ఈ సుఖం ఉన్నత తర, సూక్ష్మతర మైంది.

''ఎవరైన, 'ఇదే జీవులు అనుభవించ గల అత్యుత్తమ సుఖ సంతోషాలని' అంటే అతనితో నేను ఏకీభవించను, ఎందుకని? ఎందుకని అంటే, దీనికంటే సూక్ష్మమైంది ఉన్నతమైందీ మరో సుఖం ఉంది.

''ప్రాథమిక, సంసక్త యోజనను నిశ్చలం చేసి, అంతరంగంగా ప్రశాంతతను సాధించి, మనస్సును ఏకబిందువుపై నిలిపి, ప్రాథమిక సంసక్త యోజన అంతర్హితం కాగా, ఏకాగ్రత కారణంగా సుఖ సంతోషాలతో ద్వితీయ ఝానంలో ఉన్నాడు ఒక భిక్కు. ఇది అధిక ఉన్నత, సూక్ష్మ సుఖం.

అయినా 'ఇంకెవరైన ఇదే మనుషులనుభవించగలిగిన పరమ ఉన్నత సుఖమని చెబితే', నేను అతనిని ఒప్పుకోను. ఇంక ఇంతకంటె ఉన్నత సుఖం ఉంది.

''ఇక్కడ ఒక భిక్కు ఉన్నాడు. అతడు సంతోషాన్ని పరిహరించి, ప్రశాంతతకు అంటి పెట్టుకొని, అప్రమత్తతతో సచేతనుడై ఉన్నాడు. 'సంయమనంతో, అప్రమత్తతతో ఆనందంలో ఉండడం' అని ఆర్యులు చెప్పే దానిని శరీరంతో అతడు అనుభూతి చెందు తున్నాడు. ఈ విధంగా ఆ భిక్కు తృతీయ ఝానంలో ఉన్నాడు. ఇది ఆ మరో సూక్ష్మ, ఉన్నత సుఖ సంతోషాలు.

''ఇంకా ఎవరైన 'ఇదే పరమ సుఖమని' చెబితే నేను అతనితో విభేదిస్తాను. 'ఇక్కడ ఒక భిక్కు సుఖదుఃఖాలను విడనాడి, అంతకుముందరి సుఖదుఃఖాలను వెనకనే వదిలిపెట్టి - బాధారహితంగా, సుఖరహితంగా, పరిపూర్ణ సంయమనంతో, అప్రమత్తతతో, చతుర్థ ఝానంలో ఉంటున్నాడు. ఇది ఆ మరో ఉన్నత, సూక్ష్మ సంతోషం.

''దీనిని ఎవరైన పరమ సుఖమని చెబితే నేను ఒప్పుకోను. దీని కంటె గూడ ఉన్నత, సూక్ష్మసుఖం ఉంది.

''ఒక భిక్షువు ఉన్నాడు. అతడు రూప సంజ్ఞ (Perception of form) లను అధిగమించి, ఇంద్రియ ప్రతిస్పందన రహితంగా, సంజ్ఞా వైవిధ్యం నుంచి విముక్తమై ఇలా అనుకొంటాడు: 'ఆకాశం అనంతం' - అనంతాకాశం (ఆకాశాన ఞ్చాయతన) లో ఉంటాడు. ఈ మరో సుఖం ఇంకా ఉన్నతమైంది, సూక్ష్మమైంది.

''అయినా ఎవరైన ఇదే పరమ సుఖమని చెబితే, నేను ఒప్పను - ఇంకా పరమమైన సుఖం ఉంది.

''ఒక భిక్షువు అనంతాకాశాన్ని అధిగమించి ఇలా అనుకొంటాడు: 'విజ్ఞానం అనంతం'

అనంతవిజ్ఞాన లోకం (విజ్ఞాణఞ్చాయతన) లో ఉంటాడు. ఈ మరోసుఖం అంతకంటె ఉన్నతం, సూక్ష్మం.

''దీనిని ఎవరైన పరమని చెబితే నేను అంగీకరించను. ఇంకా ఉన్నతమైన సుఖం ఉంది.

''అనంత విజ్ఞాన లోకాన్ని అధిగమించిన భిక్కు ఇలా అనుకొంటాడు: 'అక్కడ ఏమీలేదు'. శూన్యలోకం (ఆకిఞ్చఞ్ఞాయతనం) లో ఉంటాడు. ఈ మరోసుఖం ఉన్నతమూ, సూక్ష్మమూ అయినది.

''దీనిన గూడ ఎవరైన పరమమని చెబితే నాకు సమ్మతం కాదు. ఇంత కంటె గూడ అధికృత సుఖం ఉంది.

''శూన్యతా లోకాన్ని అధిగమించిన భిక్కు సంజ్ఞాయతనంలోగాని, అసంజ్ఞాయత నంలోగాని ఉండడు. (న' ఏవ సంజ్ఞా న ఆసంజ్ఞాయతన). ఇది మరీ ఉన్నతమైన సుఖం.

''ఇదే ఉన్నతోన్నత సుఖమని ఎవరైన అంటే అది నాకు ఆమోద యోగ్యం కాదు. ఎందుకని? దీని కంటె మరో ఉన్నత సుఖం ఉంది.

''మరి ఆ ఉన్నతమైన సూక్ష్మమైన, సుఖం ఏది? సంజ్ఞా సంజ్ఞాలోకాలను అధిగమించిన భిక్కు ఇక్కడ సంజ్ఞా వేదనల నిరోధాన్ని సాధిస్తాడు. ఆనందా, ఇది ఆ మరో సుఖం. ఉన్నతం పరమం''

పది సుఖాలలోకి ఇది ఉన్నతం, సూక్ష్మం, ఈ అధిభౌతిక స్థితి నిరోధ సమాపత్తి. ఈ జీవితంలోనే నిర్వాణాన్ని అనుభవించడం అంటే ఇదే.

బుద్ధుడు ఊహించి నట్లుగానే ఎవరైనా ఇలా ప్రశ్నించ వచ్చు: '' అసలు దానిని అనుభవించే విజ్ఞాన (చేతనం = Consciousness) మే లేనప్పుడు, ఆ స్థితిని అత్యంత ఉన్నత సుఖ స్థితి అని చెప్పడం ఎలా?''

బుద్ధుడు ఆ ప్రశ్నకు ఇలా సమాధానం చెబుతాడు: ''అలా కాదు, శిష్యులారా, కేవలం సుఖకర సంవేదన కారణంగానే తథాగతుడు ఆనందా (Bliss) న్ని గుర్తించడు. ఎప్పుడు ఆనంద స్థితిని చేరినా, సిద్ధుడు, దానిని అక్కడికక్కడే ( ఏ సంవేదన లేకుండానే) దానిని ఆనందంగా తెలుసు కొంటాడు.''[4]

బుద్ధుడు అన్నాడు: ''నేనొకమాట చెబుతాను. 'ఇంద్రియాలద్వారా అనుభవంలోకి వచ్చిందంతా దుఃఖమే'. కాని ఎందుకని? ఎందుకని అంటే దుఃఖంతో ఉన్నవాడెవడైన సుఖం కోసం వెంపర్లా డతాడు. సుఖంగా ఉన్నవాడు మరింత సుఖాన్ని కోరతాడు. ఈ ప్రాపంచిక సుఖం ఎప్పటికి సంతృప్తం కానిది.

సంప్రదాయ భాషలో బుద్ధుడు ఇలా అంటాడు: ''నిర్వాణమ్ పరమమ్ సుఖమ్ (నిబ్బానమ్ పరమమ్ సుఖమ్). నిర్వాణం అత్యంత ఆనందం''. అది పరమ సుఖం, ఎందుకంటే, అది ఇంద్రియాల ద్వారా పొందింది కాదు. జీవిత బాధలను సకారాత్మకంగా పొందిన ఆనంద స్థితి.

దుఃఖ నిరోధమే సుఖమని మామూలుగా చెబుతాం. కాని ఇలా చెప్పడంలో దాని నిజ స్వభావం వెల్లడి కాదు.

**నిర్వాణం ఎక్కడ ఉంది?**

'మిళిందప్రశ్నలు'లో గౌరవనీయ నాగసేనుడు ఒక ప్రశ్నకు ఇలా సమాధానం చెబుతాడు:

''నిర్వాణం తూర్పునో, దక్షిణానో, పడమరనో, ఉత్తరానో, క్రిందో, పైనో, ఆవలో ఈవలో ఉండదు. అయినా నిర్వాణం ఉంటుంది. తన జీవితాన్ని సరిగా నడుపు కొన్నవాడు, నీతి బద్ధంగా, హేతుబద్ధంగా ఉన్నవాడు, అతడు గ్రీసులో ఉన్నా, చైనాలో ఉన్నా, అలెగ్జాండ్రియాలో ఉన్నా, కొసలలో ఉన్నా, దానిని యథార్థీకరణం చెందించు కొంటాడు.

''నిప్పును ఎవరూ ఒకచోట నిలవ ఉంచరు. కావలసిన పరిస్థితులు ఏర్పడ్డప్పుడు అది ఎక్కడైన పుడుతుంది. అలాగే నిర్వాణం ఏదో ఒక చోట ఉండదు, కాని అనుకూల పరిస్థితులలో అది ఎక్కడంటే అక్కడే సాధ్య మవుతుంది''.

'రోహితస్స సుత్త'లో బుద్ధుడు అంటాడు: ''దాని సంజ్ఞలు, ఆలోచనలతో పాటు ఈ నిలువెత్తు దేహంలో, నేను ఈ ప్రపంచాన్ని, ప్రపంచ మూలాన్ని, ప్రపంచ నిరోధాన్ని, ప్రపంచ నిరోధ మార్గాన్ని ప్రకటించేదా?''[5]

ఇక్కడ ప్రపంచం అంటే దుఃఖం. ప్రపంచ నిరోధం అంటే దుఃఖ నిరోధం - అదే నిర్వాణం.

ఒకని నిర్వాణం అతని నిలువెత్తు దేహం మీద ఆధారపడి ఉంది. అది ఏదో సృష్టింప బడిందీ కాదు, సృష్టింప బడవలసిందీ కాదు.''[6]

సంసక్తత ( ఆపో) వ్యాప్తి (పృథ్వి) ఉష్ణం (తెజో) గతి (వాయో) - ఈనాలుగు మూలకాలు నిలదొక్కుకోని చోట నిర్వాణం ఉంది.

నిర్వాణం ఎక్కడ ఉంది? అనేదాని గురించి సంయుత్తనికాయం (1, P. 14) అంటున్నది:

''ఎక్కడ నాలుగు మూలకాలు చీలి, సాగి, మండి, చలిస్తాయో అక్కడ ఇంకా కాలూనే చోటు లేదు''[7].

''ఉదాన''[8] లో బుద్ధుడు ఇలా అంటున్నాడు:

'''ఓ భిక్కులారా, ఎలాగైతే మహాసంద్రంలో, నదులన్నీ చేరినా, ఆకాశం నుంచి ధారపాతంగా పడిన వర్షపు నీరు చేరినా, అది పెరగదు తరగదో, అలాగే నిరవశేష పరి నిర్వాణంలోకి ఎంతమంది భిక్కులు ప్రవేశించినా, నిర్వాణ మూలకం పెరగదు, తరగదు''.

అందుకని నిర్వాణం అనేది ఆధిభౌతిక ఆత్మ (Transcendental ego) నివసించే స్వర్గం కాదు. అదొక ధమ్మం (సిద్ధి) అందరికీ చేరువలో ఉండేది.

మనిషి కోరుకొన్న అన్నిరకాల సుఖాలను ఇచ్చి, తనివితీరా సుఖాన్ని అందించే ఒక శాశ్వత స్వర్గాన్ని ఆచరణాత్మకంగా ఊహించడం సాధ్యం కాదు. ఎక్కడైనా అది వాస్తవంగా, శాశ్వతంగా ఉంటుందని ఊహించడం దుర్లభం.

''సరే ఒప్పుకొందాం. నిర్వాణం ఉండే ఒక చోటు అయితే లేదని ఒప్పుకొందాం. బాగానే ఉంది'', అంటూ రాజు మిళిందుడు ఇలా ప్రశ్నించాడు: ''గౌరవనీయ నాగసేనా, మనిషి తన జీవితాన్ని ధమ్మ బద్ధంగా దిద్దుకోవడానికి, నిర్వాణం పొందడానికి అతనికి భూమిక ఏమైనా ఉందా?''

''అవును, రాజా, అటువంటి భూమిక ఉంది''.

''అయితే గౌరవనీయ నాగసేనా, అటువంటి భూమిక ఏదంటారు?''

'' ఓ రాజా, అది ధమ్మం. ఎలాగంటే, ఒకడు, ధమ్మాచరణంలో నిలబడి, అప్రమత్తతో ఉండి 'తన జీవితాన్ని సరిగా నడుపుకొంటే' అతడు ఎక్కడ ఉన్నా, సిధీయన్ల(Saythians) దేశంలో ఉన్నా, గ్రీసులో ఉన్నా, చైనాలో, టార్టరీలో, అలెగ్జాండ్రియాలో, నికుంబలో, కాశీలో, కొసలలో, కాశ్మీర్‌లో, గాంధారలో ఉన్నా, పర్వత శిఖరాగ్రాన ఉన్నా, నిర్వాణాన్ని పొందుతాడు''[9].

**నిర్వాణాన్ని పొందేది ఏది?**

ఈ ప్రశ్న అర్థ రహిత మైంది. ఎందుకంటే బౌద్ధం ఒక శాశ్వత సత్వాన్ని, లేదా శాశ్వత ఆత్మను ఎప్పుడూ గుర్తించ లేదు.[10]

'' ఆత్మకు తొడుగు'' అని చెప్పబడే జీవి (సత్వం) కేవలం కారకాల సంఖారం. అర్హంత అయిన భిక్కుని వజీరా అంటున్నది:

'' ఎలాగైతే విడి భాగాలను సరిగా అమర్చినప్పుడు
మన మనస్సులలో 'రథం' అనే పదం ఉత్పతిల్లుతుందో,
అలాగే, అక్కడ సంభారా లున్నప్పుడు
మనం దానిని సత్వం (Being) అంటాం''[11].

బౌద్ధం ప్రకారం జీవి (సత్వం) మనస్సు - పదార్థ (నామరూప) నిర్మితం. ఇది మెరుపు వేగంతో ఎప్పుడూ మారుతూ ఉంటుంది. ఈ రెండు నిర్మాణకాంశాలు తప్ప, శాశ్వత ఆత్మ, అపరివర్తనీయ సత్యం అంటూ ఏదీ లేదు. మనం ''నేను'' అని పిలిచేది గూడా భ్రమే.

శాశ్వతాత్మ లేదా భ్రమైక ''నేను'' లకు బదులుగా, భౌద్ధం గతిశీల జీవ ప్రవాహాన్ని (సంతతిని) ప్రవేశ పెడుతుంది. అవిద్య, తృష్ణలో ఉన్నంత కాలం అది అనంతంగా ప్రవహిస్తూనే ఉంటుంది. అర్హతత్వం పొందడంతో ఏ వ్యక్తి అయినా, ఈ మూల కారణాలను ఉత్తరించినట్లయితే, అవి అతని అంతిమ మరణంతో ప్రవహించక ఆగి పోతాయి.

సంప్రదాయ భాషలో, అర్హంత పరినిర్వాణం చెందాడని, లేదా నిర్వాణంలోకి వెళ్ళాడని చెబుతారు.

'' ఇప్పుడు ఇక్కడికిక్కడ'' ఒక శాశ్వతాత్మగాని, తాదాత్మ్యతా జీవి గాని లేదు గనుక నిర్వాణంలో ''నేను'' గాని, '' ఆత్మ''గాని ఉండదని చెప్పడం అనవసరం.

విశుద్ధిమగ్గ (XVI, 90) అంటున్నది:

''దుఃఖం మాత్రం ఉంది, దుఃఖితుడు లేడు.
కర్త లేడు కాని కర్మ ఉంది;
నిర్వాణం ఉంది, దాని అన్వేషి లేడు
పథం ఉంది, పాంథుడు లేడు.''

బౌద్ధుల నిర్వాణ భావనకు, హిందువుల నిర్వాణ లేదా ముక్తి భావనకు ఉన్నతేడా ఎక్కడంటే, బౌద్ధులు తమ లక్ష్యాన్ని శాశ్వతాత్మ, సృష్టికర్త లేకుండా నిర్వచించు కొంటే, హిందువులేమో, శాశ్వతాత్మను, సృష్టికర్తను నమ్ముతారు.

ఈ కారణం వల్లనే బౌద్ధాన్ని శాశ్వత వాదమని కాని, శూన్యవాదమని కాని చెప్ప లేం.

నిర్వాణంలో ఏదీ శాశ్వతీకరించ బడదు. (eternalised) ఏదీ వినాశం కావించ బడదు.

సర్ ఏడ్విన్ ఆర్నాల్డ్ అంటున్నారు:

> ''ఎవరైనా, నిర్వాణాన్ని ఉచ్ఛేదమంటే,
> వారికి వారు చెప్పేది అబద్ధమని చెప్పండి.
> ఎవరైనా నిర్వాణం అంటే జీవించడం అని చెబితే
> వారు తప్పుడు భావనలో ఉన్నారని వారికి చెప్పండి.''

★ ★ ★

బుద్ధుని బోధలో నిర్వాణ సమస్య అతిగూహన మైందని ఒప్పు కోవాలి. మనం ఎంతగా ఆలోచించినా, దాని నిజ స్వభావాన్ని గ్రహించ లేం. నిర్వాణాన్ని అవగాహన చేసుకొనే ఉత్తమ మార్గం దానిని మన అంతర్బొద్ధిక జ్ఞానంతో (intuitive Knowledge) యధార్థీకరణం చెందించు కోవడమే.

నిర్వాణాన్ని పంచేంద్రియాలతో చూడ లేక పోయి నప్పటికి, అది సగటు మనిషికి అర్థం కానప్పటికీ, దానిని చేరే ఒకే ఒక తిన్నని మార్గాన్ని బుద్ధుడు అన్ని వివరాలతో అందరి ఎదుట పరిచాడు. లక్ష్యం మేఘావృతమై ఉన్నా మార్గం స్పష్టం. లక్ష్యాన్ని సాధించి నప్పుడు, మబ్బు విడచిన చంద్రునిలా, అది స్పష్టంగా కనిపిస్తుంది.

**పాద సూచికలు :**

1. See *Gradual Sayings* 1. P. 35.
2. *మజ్ఝిమనికాయ,* 1, 59, P. 396.
3. *Ibid,* The Blessing, No. 4, PP. 129 - 132.
4. *Ibid.*,
5. *సంయుత్తనికాయ,* 1. P 62
6. ఇది (నిర్వాణం) పథం ద్వారా మాత్రమే పొంద బడుతుంది. ఇది సృష్టింప బడింది కాదు.
7. *Kindred Sayings,* 1, P. 23.
8. See Woodward, *Verses of Uplift,* PP. 66 - 67
9. మిళిందప్రశ్నలు (Questions of King Milivda, PP. 202 - 204
10. 29వ ప్రకరణం చూడు.
11. *Kindred Sayings,* 1.P. 170.

ముప్పై ఐదో ప్రకరణం

# నిర్వాణపథం

## (I)

"ఈ మధ్యేమార్గం ప్రశాంతికి, యథార్థీకరణకు, జ్ఞానోదయానికి నిర్వాణానికి తీసుకు వెడుతుంది".

– ధమ్మ చక్క సుత్త.

నిర్వాణానికి మార్గం మధ్యమ పథం (మజ్ఝిమా పటిపదా). బుద్ధిని మందగింపజేసే అతిగా స్వీయ కఠోర శిక్షకు శరీరాన్ని గురిచేయడం గాని, ధార్మిక ప్రగతిని అడ్డుకొనే అతిగా స్వీయ వాంఛలలో మునిగిపోవడం గాని ఈ మార్గం పరిహరిస్తుంది. అంటే ఈ మార్గం అటుగాని, ఇటుగాని అతికి పోదు.

మధ్యమ మార్గంలో ఎనిమిది అంశాలున్నాయి: సమ్యక్‌దృష్టి, సమ్యక్‌సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి.

మొదటి రెండింటిని 'ప్రజ్ఞ' (పఞ్ఞా) గాను, రెండో మూడింటిని 'శీలం' క్రింద, చివరి మూడింటిని సమాధి క్రింద వర్గీకరించారు.

నిర్వాణానికి దారి తీసే రాచ బాటలో, వికాస క్రమంలో, శీల, సమాధి, ప్రజ్ఞలు అనే మూడు దశలున్నాయి.
ఈ మూడు దశలు హృద్యమైన ప్రాచీన పదం చెబుతున్నది:[1]
చెడుకు దూరంగా ఉండడం.
మంచిని అలవరుచు కోవడం
మనస్సును క్షాళనం గావించు కోవడం –
ఇదే బుద్ధులందరూ చెప్పిన సలహా.

★ ★ ★

మనం విత్తిన దానిని కోసుకొంటాం. చెడు బాధను కలిగిస్తుంది, మంచి సుఖాన్నిస్తుంది. మన బాధా సుఖాలు తిన్నగా మన మంచి చెడుల నుంచి వస్తాయి.

సమ్యక్ దృష్టి ఉన్న వ్యక్తి ఈ ధర్మబద్ధమైన 'చర్య – ప్రతిచర్య' నియమాన్ని తనంత తానే ఎరుగుతాడు. ఎరిగి, తనకు చేతనైనంత వరకు చెడు చేయ కుండ మంచినే చేస్తాడు. అలాగ అతడు తన, ఇతరుల మంచి కోసం చేస్తాడు. అందరికి, తనకు మంచిగ ఉండడం తన విధిగ భావిస్తాడు.

‘జీవితం అందరికి విలువైంది. మరొక ప్రాణం తీసే హక్కు ఎవరికీ లేదు’ – ఈ సంగతిని ఎరిగి, అతడు ప్రతి జీవి మీదికి తన పాదాల దగ్గర పారాడే అల్ప జీవిపైకి సహితం, అనుకంప, ప్రేమపూరితమైన కరుణలను సారిస్తాడు. ఏ జీవికి అపాయం కలిగించడం కాని, ఏ జీవిని చంపడం కాని చేయడు.

ఒకటి మరొక దానిని ఆహారంగా చేసు కొని జీవించాలనే నియమం ఏదీ లేదు. ఏమైన, బలమైనవి బలహీనులను దయా హీనంగా చంపి, వాటి మాంసంతో విందు చేసు కొంటాయి. ఇది జంతు సహజాతం. అటువంటి చర్యలు జంతువుల విషయంలో క్షమార్హాలు. ఎందుకంటె వాటికి తామేమి చేసేది తెలియదు. కాని వివేచన, అవగాహన ఉన్నవారు అటువంటి నేరాలను చేస్తే క్షమించ లేం. జిహ్వా చాపల్య సంతృప్తికో, వినోదానికో ఒక జంతువును చంపడం కాని, చంపించడం కాని చేస్తే, అది న్యాయం కాదు. జంతువులను చంపడమే దోషమై నప్పుడు, శాంతికోసం, మతం కోసం, లేక మంచిగా కనిపించే మరే పని కోసమైన, దారుణ లేదా నాగరిక విధానాలద్వారా, మనుషులను వైయక్తికంగా గాని, ఉమ్మడిగా గాని చంపడం ఎంతటి ఘోర నేరం?

నిజాయితీ, విశ్వసనీయత, ఋజువర్తనలు సమ్యక్ దృష్టి ఉన్నవ్యక్తి లక్షణాలు. మాయోపాయంతోగాని, తెలిసేట్టుగా గాని, అన్ని రకాల దొంగతనం నుంచి అటువంటి వ్యక్తి దూరంగా ఉంటాడు. మనిషిని ఉన్నత స్వభావం నుంచి పతనం గావించే లైంగిక అత్యాచారానికి దూరంగా ఉండి, అతడు విశుద్ధుడుగా ప్రవర్తిస్తాడు. అతడు అబద్ధాలాడడు. పరుషంగా మాటాడడు. అపవాదులు వేయడు. ఉబుసుపోని కబుర్లు చెప్పడు. నిజమే మాటాడతాడు. తియ్యగా, దయతో, మాట్లాడతాడు. కొన్ని పానీయాలు ప్రమత్తతను, మానసిక విచలనాన్ని కలిగిస్తాయి కనుక, అతడు మద్యాన్ని సేవించడు. అతడు ప్రమత్తతను, విస్పష్టదృష్టిని అలవరుచు కొంటాడు.

నిర్వాణ పథన నడిచే వానికి, ఈ ప్రాథమిక ప్రవర్తన సూత్రాలు ఆవశ్యకం. ఎందుకంటే అవి ముఖ్యంగా, మాటలను చేతులను – రెండింటిని నియంత్రిస్తాయి. వాటిని అతిక్రమిస్తే, నైతిక ప్రగతి కుంటు పడుతుంది. వాటిని ఆచరించడం అంటే, పథం వెంట మృదువుగా, స్థిరంగా పయనించడమే.

క్రమంగా ఇలా ఒకడుగు ముందుకు వెళ్ళిన తరవాత, సాధకుడు ఇప్పుడు తన ఇంద్రియాలను నియంత్రించ ప్రయత్నిస్తాడు.

ఆహారం యెడ తృష్ణ కోసం, మనస్సు దేహాలను తేలికగా ఉంచడం కోసం మితాహారం తీసుకోవాలి. లేదా నెలకొక మాటు ఉపవాసం ఉండడం మంచిది. విలాస విషయాసక్త

'క్కు ఎవరికీ లేదు' - ఈ సంగతిని
అల్ప జీవిపైకి సహితం, అనుకంప,
మం కలిగించడం కాని, ఏ జీవిని

లనే నియమం ఏదీ లేదు. ఏమైన,
నాటి మాంసంతో విందు చేసు
ర్యలు జంతువుల విషయంలో
సుదు. కాని వివేచన, అవగాహన
చాపల్య సంతృప్తికో, వినోదానికో
ది న్యాయం కాదు. జంతువులను
లేక మంచిగా కనిపించే మరే పని
ను వైయక్తికంగా గాని, ఉమ్మడిగా

కే దృష్టి ఉన్నవ్యక్తి లక్షణాలు.
దొంగతనం నుంచి అటువంటి
నుంచి పతనం గావించే లైంగిక
స్తాడు. అతడు అబద్ధాలాడడు.
ఎపోని కబుర్లు చెప్పడు. నిజమే
న్ని పానీయాలు ప్రమత్తతను,
ంవించడు. అతడు ప్రమత్తతను,

త్రాలు ఆవశ్యకం. ఎందుకంటే
ంత్రిస్తాయి. వాటిని అతిక్రమిస్తే,
ంటే, పథం వెంట మృదువుగా,

త, సాధకుడు ఇప్పుడు తన

ఉంచడం కోసం మితాహారం
మంచిది. విలాస విషయాసక్త

జీవితం కంటె సరళ నిరాడంబర జీవితం మంచిది. విలాస జీవితం మనిషిని మోహానికి దాసుణ్ణి చేస్తుంది. బ్రహ్మ చర్యం మంచిదే. ఈ విధంగా జీవించడంలో పొదుపైన శక్తిని, తన, ఇతరుల, బౌద్ధిక, నైతిక వికాసానికి ఉపయోగించ వచ్చు. అటువంటి జీవితంలో, నైతిక ప్రగతికి అడ్డుపడే అదనపు ప్రాపంచిక బంధాలకు దూరంగా ఉంటాడు. దాదాపు ధర్మ బోధ చేసే గురువులంతా అలతినలతిగానే తమ శరీరాలను పోషించుకొని, కఠోర బ్రహ్మచర్య జీవితాన్ని, సారళ్యంతో, ఐచ్ఛిక పేదరికంతో, నిగ్రహంతో గడిపినట్లు కనిపిస్తుంది.

అతడు నిదానంగా, స్థిరంగా నియంత్రిత వాక్కర్మ ఇంద్రియాలతో ప్రగమిస్తుండగా, సాధకుని కర్మబలం అతనిని ప్రాపంచిక సుఖాలను వదిలి, సన్యాసి జీవితాన్ని గడప వలసిందని ఒత్తిడి పెడుతుంది. అప్పు డతనికి ఈ భావన కలుగుతుంది:

> ''కుటుంబ జీవితం విప్రతిపత్తి కుహరం
> అది ప్రయాస, అవసరాలతో నిండి ఉంటుంది.
> కాని నిర్గృహులు (సన్యాసులు) గడిపే జీవితం
> వివృతా కాశంలా స్వేచ్ఛాయుతమైంది, ఉన్నతమైంది''[2]

ఈ విధంగా ఐంద్రియక సుఖాల నిరర్థకతను గుర్తించి, ఐహిక భోగాలను ఐచ్ఛికంగా విడనాడి, సన్యాసి వస్త్రాలు ధరించి, పవిత్ర జీవితాన్ని గడప ప్రయత్నిస్తాడు.

ఏమైనా, ఒక మనిషి పవిత్రత బాహ్య రూపంలో లేదు. అంతశ్శుద్ధిలోను, ఆదర్శ జీవితంలోను ఉంది. పరివర్తన బయటినుంచి కాక లోపల నుంచి రావాలి. నిర్వాణం పొందడానికి, ఏకాంతానికి పోయి, సన్యాసి జీవితాన్ని గడపడం అంత ఆవశ్యక మేమీ కాదు. భిక్కు జీవితం ధార్మిక ప్రగతిని త్వరితం చేసే మాట నిజమే కాని, మామూలు మనిషి కూడ ఋషిత్వాన్ని సాధించ వచ్చు. ఒక భిక్కు విమోహ రహిత పరిసరాలలో ఉండి అర్హతత్వాన్ని సాధించడం కంటే అన్ని రకాల వ్యామోహాల మధ్య ఉండి అర్హతత్వాన్ని సాధించే మామూలు మనిషి గొప్పవాడు.

అర్హతత్వాన్ని పొందిన ఒక మతాచార్యుడు మంచి దుస్తులు వేసుకొని ఏనుగు ఎక్కి ఉండగా బుద్ధుడు ఇలా వ్యాఖ్యానించాడు:

> ''ఒకడు బాగా అలంకృతుడై గూడా, ప్రశాంత జీవితాన్ని గడుపుతూ
> నిర్మలంగా, వినమ్రం, పరిశుద్ధంగా ఉండి,

ఏ ప్రాణిని హింసించకుండ ఉంటే,

అతడే బ్రాహ్మణుడు, అతడే సన్యాసి, అతడే యతి''[3]

ఈ ప్రపంచాన్ని పరిత్యజించ కుండానే నిర్వాణం పొందిన మామూలు జనులు చాల మంది ఉన్నారు. అత్యంత భక్తిగల, ఉదారుడైన మామూలు వ్యక్తి అనాధపిండిక సోతాపన్ను డయ్యాడు. సాక్యమహానామ 'సకదాగామి' అయ్యాడు కుమ్మరి అయిన ఘటీకారుడు అనాగామి అయ్యాడు. రాజు శుద్ధోదనుడు అర్హంతగా చని పోయాడు.

భిక్ఖు అయినవాడు నాలుగు రకాల ఉన్నత నీతిని ఆచరించాలి - అవి:

పాతిమొక్ఖ శీల - భిక్ఖు పాటించవలసిన అనేక నియమాలు;

ఇంద్రియ సంవర శీల: ఇంద్రియనిగ్రహానికి సంబంధించిన శీలం

ఆజీవపారిశుద్ధి శీల: జీవనోపాధికి సంబంధించిన శీలం.

పచ్చయ సన్నిస్సిత శీల: జీవితావసరాల వినియోగానికి సంబంధించిన నీతి

ఈ నాలుగు రకాల నైతిక శీలాలను కలిపి 'శీలవిశుద్ధి' అంటారు. నిర్వాణ పథంలోని ఏడు దశలలో మొదటిది ఇది.

ఒకడు సంఘంలో ప్రవేశించి, 'ఉపసందను' తీసుకొన్నప్పుడు, అతనిని భిక్ఖు అంటారు. భిక్ఖు అనే పాళీ పదానికి సమానార్థక పదం ఆంగ్లంలో లేదు. ''భిక్షుక సన్యాసి'' (Mendicant monk) అనేపదం దగ్గరగా ఉంటుంది. కాని, బిచ్చమెత్తుకొనే అర్థంలో కాక, దానం మీద జీవించే వాడనే అర్థంలో చెప్పు కోవాలి.

భిక్ఖుకు ప్రతిజ్ఞలంటూ ఏమీ లేవు. అతనికి ఇష్టం వచ్చినంత కాలం పవిత్ర జీవితం గడపడానికి, ఐచ్ఛికంగా భిక్ఖు అవుతాడు. కావాలనుకొన్నప్పుడు అతడు సంఘాన్ని విడిచి పెట్ట వచ్చు.

ఒక భిక్ఖు 220 నియమాలను పాటించాల్సి ఉంటుంది. అదనంగా చిన్న చిన్న నియమాలు కొన్ని ఉన్నాయి. పరిపూర్ణ బ్రహ్మచర్యం, స్తేయం (దొంగతనం), హత్య, ఉన్నత ధార్మిక శక్తులు పొందినట్లు అబద్ధాలు చెప్పడం - వీటికి సంబంధించిన నాలుగు ముఖ్య నియమాలను ఖచ్చితంగా పాటించడం. వీటిల్లో దేనినైన ఉల్లంఘిస్తే అతడు పరాజికా (పరాజితుడ) అవుతాడు. అతడిక భిక్ఖు ఏమాత్రం కాడు. అతడు కావాలను కొంటే, సంఘంలో మళ్ళీ చేరి సామణెర (ఛేలా = కొత్తగా చేరిన శిష్యుడు)గా కొన సాగ వచ్చు.

ఇంకా ఏవైనా ఇతర నియమాలను అతడు ఉల్లంఘిస్తే, నేర గురుత్వాన్ని బట్టి, నష్టపరిహారాన్ని చెల్లించుకోవాలి.

భిక్కుల ముఖ్యశీల లక్షణాలు పరిశుద్ధత, కఠోర బ్రహ్మచర్యం, ఐచ్ఛిక పేదరికం, వినమ్రత, సరళత, నిస్వార్థసేవ, ఆత్మనిగ్రహం, సహనం, అనుకంప, నిరపాయతలు.

భిక్కు జీవితం ఐహిక సుఖాలను, వాంఛలను పరిత్యాగం చేయడం. అనిర్వాణం పొందడానికి సాధనమే కాని అదేది లక్ష్యం కాదు.

**పాదసూచికలు :**

1. ధమ్మపద, V. 183
2. 'సుత్త నిపాత', 3, 1, 'పబ్బజ్జాసుత్త', V. 406 (V.2)
3. ధమ్మపద, V. 142.

ముప్పై ఆరో ప్రకరణం

# నిర్వాణ పథం

## (II)

## ధ్యానం

''జయం కూర్చే ఒక మార్గం ఇది
మరో విధంగా ఇది నిర్వాణ మార్గం''

– ధమ్మపద V. 75

**ఏకాగ్రత (సమాధి)**

శీలంలో బాగా నిలదొక్కు కొన్నాక సాధకుడు సమాధి అభ్యసనం మొదలుపెడతాడు. అంటే మనసును నియంత్రించి వ్యవసాయం చేయడం. ఇది 'విశుద్ధి మార్గం'లో రెండోదశ.

సమాధి అంటే మనస్సును ఒకే బిందువు పై నిలపడం. అంటే ఇతరాలన్నింటిని వదిలి వేసి, ఒకే ఒక వస్తువుపై మనస్సును నిలపడం.

బౌద్ధం ప్రకారం నలభై ధ్యాన సాధ్యాలు ఉన్నాయి. అవి వ్యక్తుల ప్రవృత్తులను బట్టి వేరు వేరుగా ఉంటాయి.

**అవి :**

a. దశ కసిణలు[1] (ఉపాయాలు) అవి: (i) పృథ్వీ కసిణ (ii) జాల కసిణ (iii) అగ్నికసిణ (iv) వాయు కసిణ (v) నీలి కసిణ (vi) పీత కసిణ (vii) అరుణ కసిణ (viii) శ్వేత కసిణ (ix) కాంతి కసిణ (x) ఆకాశ కసిణ.

b దశమాలిన్యాలు (అసుభ) – అవి: దశ శవాలు[2] (i) ఉబ్బిన = (ఉద్ధుమాతక bloated) (ii) వివర్ణ (వినీలక = discoloured) (iii) కుళ్ళిన (విపుబ్బక = festering) (iv) కోయబడిన (విచ్ఛిద్దక= dissected) (v) ముక్కలు ముక్కలుగా కొరక బడిన (విఖ్ఖాయితక) (vi) ముక్కలుగా వెదజల్ల బడిన (విఖ్ఖిత్తక) (vii) వికలాంగం కావించి ముక్కలు ముక్కలుగా వెదజల్ల బడిన (హత విఖ్ఖిత్తక)

(viii) రక్తసిక్త (లోహితక) (ix) క్రిములు సోకిన (పులవక) (x) కంకాళం (అధిక)

c. పది పర్యాలోచనలు (అనుస్మృతి = reflections) అవి: (i) బుద్ధుని మీద (బుద్ధానుస్సతి) (ii) ధమ్మం మీద (ధమ్మానుస్సతి) (iii) సంఘం మీద (సంఘానుస్సతి) (iv) శీలం మీద (శీలానుస్సతి) (v) త్యాగం మీద (చాగానుస్సతి) (vi) దేవతల మీద (దేవతానుస్సతి) (vii) ఉపశమం మీద (ఉపసమానుస్సతి) (viii) మృత్యువుమీద (మరణానుస్సతి). ఈ ఎనిమిది పర్యాలోచనలు వరుసగా, (ix) శారీరక అప్రమత్తత (కాయగతాసతి) (x) శ్వాసకు సంబంధించిన అప్రమత్తత (ఆనాపానసతి) లతో కలుపుకొని.

d నాలుగు అమేయాలు లేదా నాలుగు బ్రహ్మ విహారాలు అవి: (i) మైత్రి (మెత్త) (ii) కరుణ (iii) మోదం (ముదితా) (iv) ఉపేక్ష (equanimity)

e. ఆ ఏకైక సంజ్ఞ (The one Perception) అంటే భౌతికాహార జుగుప్సాకర సంజ్ఞ (ఆహారె పటికూల సంఞ్ఞా)

f. ఆ ఏకైక విశ్లేషణ అంటే, చాతుర్ధాతు విశ్లేషణ (చతుధాతువవత్థాన – పృథ్వి, ఆపో, తెజొ, వాయోల విశ్లేషణ – వాటి ప్రత్యేకశీల లక్షణాళను దృష్టిలో ఉంచుకొని).

g. నాలుగు అరూప ఝానాలు. అవి: (i) అపరిమేయ ఆకాశ లోకం (ఆకాసానఞ్చా యతన) (ii) అపరిమేయ విజ్ఞానలోకం (విఞ్ఞాణఞ్చా యతన) (iii) శూన్యతా లోకం (ఆకిఞ్చఞ్ఞాయతన) (iv) సంజ్ఞాసంజ్ఞాలోకం (న' ఏవ సంఞ్ఞా-న' ఆసంఞ్ఞాయతన)

**వేరు వేరు స్వభావాలకు అర్హమైన ధ్యాన వస్తువులు**

ప్రామాణిక గ్రంథాల ప్రకారం, లాలస స్వభావులకు దశమాలిన్యాలు, ఇంక శరీర సతీ (ముప్పైరెండు భాగాలు లాంటివి) తగిన ధ్యాన వస్తువులు. ఎందుకంటె, అవి శరీరం అంటే ఏహ్యతను కలిగిస్తాయి. ఈ విధంగా ఇంద్రియాల యెడ ఉన్న వ్యామోహాన్ని, ప్రతిఘటిస్తుంది.

ద్వేష స్వభావికి నాలుగు అపరిమేయాలు, నాలుగు వర్ణిత కసిణలు అర్హమైనవి.

భక్తిశీలునకు బుద్ధుని పై పర్యాలోచన లాంటివి తగిన ధ్యాన వస్తువులు.

బుద్ధిశీలురకు, మరణం, శాంతి, భౌతికాహార ఏహ్యతాసంజ్ఞ విశ్లేషణ, నాలుగు భూతాల విశ్లేషణ తగిన ధ్యాన వస్తువులు.

మిగిలిన ధ్యాన వస్తువులు - ముఖ్యంగా బుద్ధుడు, మైత్రి, శరీర సతి, మరణ పర్యాలోచన, ఏరకమైన ప్రత్యేక శీలం లేనివారికి తగినవి.

ఆరు రకాల చరితలు (శీలాలు) ఉన్నాయి. అవి:

1. రాగచరిత
2. దొసచరిత
3. మోహచరిత
4. సద్ధాచరిత
5. బుద్ధిచరిత
6. వితర్క-చరిత (వితక్క- చరిత)

చరిత (శీల) అనేది ఒక వ్యక్తి అంతర్గత స్వభావాన్ని తెలియ జేస్తుంది. ఏ విషయంతోను ప్రభావితం కాకుండ మామూలు స్థితిలో ఉన్నప్పుడు అది బహిర్గత మవుతుంది. వారు చేసే పనుల వైవిధ్యం లేదా కర్మకారణంగా వారి చరితలు వేరు వేరుగా ఉంటాయి. అలవాటుగా చేసే పనులు ప్రత్యేక చరితలను సృష్టిస్తాయి.

రాగ లేదా లాలస కొంత మందిలో ప్రబలంగా ఉంటే, కొందరిని దొస (కోపం) ద్వేషం ఏలుతూ ఉంటుంది. చాల మంది ఈ వర్గాలకే చెందుతారు. కొద్దిమంది ఉంటారు - వారికి తెలివితేట లుండవు. వారు దాదాపు మోహ చరితులు. వీరిని బోలిన వారే మరి కొందరుంటారు. వీరి మనస్సు డోలాయమాన స్థితిలో ఉండి, ఏ వస్తువుమీద మనస్సును, కావాలనుకొన్నా కేంద్రీకరించ లేరు. వీరు వితక్క- చరితులు. స్వభావరీత్యా కొందరు శ్రద్ధాళువులు (సద్ధాచరితులు). మరికొందరు అసమాన్య బుద్ధి గలిగినవారు. వీరు బుద్ధి చరితులు.

ఈ ఆరు రకాల చరితలను ఒకదానితో ఒకటి కలిపితే, మనకు 63 రకాలు వస్తాయి. వీటికి దృష్టి (దిఠ్ఠి) చరితను కలిపితే 64 రకాలు అవుతాయి.

వివిధ చరితలకు, వివిధ రకాల ప్రజలకు, వివిధ రకాల ధ్యాన వస్తువులను ఎంపిక చేయడం జరుగుతుంది.

సమాధిని అనుష్ఠించక ముందే, అర్హుడైన సాధకుడు ధ్యాన వస్తువును జాగ్రత్తగా పరిశీలించు కోవాలి. తన చరితను బట్టి తనకు ఏ ధ్యాన వస్తువు సరిపోతుందో, దానిని తెలుసుకోవడానికి పూర్వం రోజుల్లో శిష్యులు తగిన గురువును ఎంపిక చేసుకొనే వారు. కాని నేడు, సరైన గురువు దొరక్క- పోతే, సాధకుడు తన విచక్షణ జ్ఞానాన్ని ఉపయోగించి తనకు బాగా సరిపోతుం దనుకొన్న ధ్యాన వస్తువును ఏరు కోవాలి.

ధ్యాన వస్తువును ఎంచుకొన్న తరవాత, ప్రలోభాలు ఏమీ లేని ఏకాంత ప్రదేశానికి అతడు వెళ్ళాలి. గుహైనా, అరణ్యమైన, ఏకాంత ప్రదేశమైనా, వాంఛనీయమే. ఎందుకంటే అక్కడ అభ్యాసానికి అతి తక్కువగా అంతరాయా లుంటాయి.

మనందరిలోను ఏకాంతం ఉందని అర్థం చేసు కోవాలి. మన మనస్సు సరిగా నిలదొక్కుకోక పోతే, ప్రశాంత అరణ్యంగూడ తగిన చోటు కాదు. మనం నివసించే వాతావరణం, పరోక్షంగా మన మనస్సులను ప్రశాంతంగా ఉంచడంలో తోడ్పడుతుంది.

తరవాత సాధకుడు నిర్ణయించు కోవాల్సింది సమయం. ఆచరణకు ఏ ఏ సమయాలలో తన పరిసరాలు అనుకూలిస్తాయో గుర్తించాలి.

మనస్సు తాజాగా, క్రియా శీలంగా ఉండే వేకువ ఝాము, అంతగా అలసి పోకపోతే రాత్రి నిద్ర కుపక్రమించే ముందు కాలం, ధ్యానానికి మామూలుగా మంచి సమయాలు. సాధకుడు ఏ సమయాన్ని ఎంచుకొన్నా, ప్రతిరోజు అదే సమయంలో అతడు ధ్యానం చేయాలి. ఎందుకంటె అప్పుడు మన మనస్సు అభ్యాసానికి అలవాటు పడుతుంది.

ధ్యాన ఆసనం (Posture) గూడ ఏకాగ్రతకు మంచి శక్తిమంతమైన సహాయకారి.

తూర్పు దేశాల వారు సాధారణంగా వ్యస్తపాదు (cross legged) లై, శరీరం తిన్నగా ఉండేట్టు కూచుంటారు. కుడి పాదాన్ని ఎడమ తొడమీద, ఎడమ పాదాన్ని కుడి తొడమీద ఉంచి కూచుంటారు. ఇది నిండు ఆసనం. ఈ ఆసనం కష్టమైతే, (కొందరికి ఇది నిజంగా కష్టమే), అర్థాసనాన్ని వేయవచ్చు. అర్థాసనం అంటే, కుడిపాదాన్ని ఎడమ తొడమీద ఉంచడం లేదా ఎడమ పాదాన్ని కుడి తొడ మీద ఉంచడం.

ఈ త్రికోణ స్థితిలో ఉన్నప్పుడు మొత్తం శరీరం సమతుల్యంగా ఉంటుంది. కుడి చేయి ఎడమ చేతిపై ఉంచాలి. మెడ నిటారుగా ఉంచాలి. నాసిక, నాభి ఒకదాని కొకటి లంబకోణంలో ఉండాలి. నాలుక అంగిలిపై భాగాన్ని తాకుతూ ఉండాలి. కాంచీ (బెల్టు)ని వదులు చేయాలి. దుస్తులను సరిగా సర్దుకోవాలి. కొంతమంది, అనవసరపు వెలుతురును, దృశ్యాలను దూరం చేయడానికి కన్నులు మూసు కోవడానికి ఇష్టపడతారు.

కన్నులు మూసు కోవడం వల్ల కొంతప్రయోజనం ఉన్నప్పటికీ, దీనిని అన్నిసార్లు సిఫారసు చేయము, ఎందుకంటే కళ్ళు మూసుకొంటే కొందరికి మగత వస్తుంది. మనస్సు నిర్లక్ష్యంగా తిరుగాడుతుంది. దిమ్మరి ఆలోచనలు వస్తాయి. మనస్సు అదుపు తప్పుతుంది. శరీరం తిన్నని స్థితిని కోల్పోతుంది. అచేతనంగా నోరు తెరచు కొంటుంది. సొంగ కారుతుంది. తల ఊగు తుంది.

బుద్ధులు మామూలుగా, అర్థ నిమీలిత నేత్రాలతో, నాసికాగ్రం మీదుగా, నాలుగడుగుల దూరాన్ని మించక, చూస్తూ కూర్చొంటారు.

వ్యస్తపాదాసనం బాగా కష్టమనిపించిన వారు, ఆను కోవడాని వీలున్న ఎత్తైన సుఖాసనం మీద కాళ్ళు నేల మీద ఆనేట్టు కూచో వచ్చు.

ఆసనం తేలికగా, సుఖంగా ఉన్నంత వరకు, ఏ ఆసనంలో కూర్చొని ధ్యానం చేశా డనేది ముఖ్యం కాదు.

మానసిక ఏకాగ్రతను పొందాలనుకొన్న సాధకుడు, అనారోగ్యకర ఆలోచనలను ఆదిలోనే తుంచివేసే ప్రయత్నం చేయాలి.

'సుత్తనిపాత'ంలో 'పధానసుత్త'లో చెప్పినట్లుగా అతని మీద మారుని పది సైనిక దళాలు దాడి చేయ వచ్చు. ఆ దళాలు: (i) కామ వాంఛలు (కామ) (ii) నిరుత్సాహం (అరతి) (iii) ఆకలి దప్పులు (iv) తృష్ణ (v) సోమరితనం, మాంద్యత (థినమిద్ధ) (vi) భీతి (భయ) (vii) శంక (విచికిత్స = విచికిచ్ఛ) (viii) పరధ్యానం, మంకుతనం (మఖ్ఖ, థమ్మ) (ix) లాభం, పొగడ్త, గౌరవం, మిథ్యాకీర్తి (లాభ, సిలోక, సక్కార, మిచ్ఛాయస) (x) స్వీయ ప్రశంస, పరద్వేషం (అత్తుక్కంసన, పరవంభన).

అటువంటి సందర్భాలలో బుద్ధుడు చెప్పిన ఆచరణాత్మక సూచనలు ఉపయోగ కరంగా ఉంటాయి.

1. దాడిచేసే ఆలోచనకు వ్యతిరేకంగా మంచి ఆలోచనపై మనస్సు నిలుపుట. ఉదాహరణకు ద్వేషాలోచనకు వ్యతిరేకంగా మైత్రి మీద మనస్సు నిలపడం.
2. సంభావ్యాలనుకొన్న దుష్టాలోచనా పరిణామాలపై పర్యాలోచించడం ఉదా: కోపం హత్యకు దారితీస్తుంది.
3. వాటిని వదిలి వేయడం లేదా వాటిమీద పూర్తిగా శ్రద్ధను కనపరచక పోవడం.
4. అకుశల ఆలోచనకు ఆరంభ కారణాన్ని అన్వేషించడం. ఈ ప్రతీప గమన ప్రక్రియలో ఆ అకుశల ఆలోచనలను మరచిపోడం.
5. ప్రత్యక్ష భౌతిక శక్తి

ఒక బలవంతుడు బలహీనుని ఎలా లొంగ దీసు కొంటాడో అలాగే అకుశల ఆలోచనలను శారీరక బలంతో అధిగమించాలి. బుద్ధుడు సలహా ఇచ్చాడు: ''పళ్ళు బిగబట్టి, నాలుక అంగలికి తొక్కి పట్టి, సన్యాసి తన బలంతో మనస్సును వంచి, తొక్కి పట్టాలి. ఇలా

తొక్కిపడితే, ఆ అకుశలాలోచనలు అణగారి అంతర్హితాలవుతాయి: ఆవిధంగా అవి అంతర్హితం కావడంతో మనస్సు నిలకడ చెంది, వినమ్రమై, ఐక్యమై, కేంద్రీకృత మవుతుంది''[3]

ఈ ప్రాథమిక విషయా లన్నింటిని చక్కగా తెలుసు కొన్న సాధకుడు, ఏకాంత ప్రదేశానికి వెళతాడు. తాను తప్పకుండ తన లక్ష్యాన్ని సాధించ గలననే నమ్మకాన్ని కుదుర్చుకొని, ఏకాగ్రతను పెంపొందించు కోవడానికి సడలని ప్రయత్నం చేస్తాడు.

కసిణ చక్రం లాంటి భౌతిక వస్తువు ఏకాగ్రతకు మాత్రమే సహాయ పడుతుంది. కాని మైత్రి లాంటి సుగుణం వల్ల ప్రత్యేక ప్రయోజనం ఉంది. ఆ ప్రయోజనం ఏమిటంటే అది ఆవ్యక్తి శీలంలో ఆ ప్రత్యేక గుణాన్ని నాటుతుంది.

ధ్యానంలో ఒకడు ఏదైన ప్రత్యేక సూత్రానికి సంబంధించిన పదాలను పునరుచ్చరణ చేయ వచ్చు. ఎందుకంటె ఆ పదాలు వేటికి ప్రతీకలో ఆ భావనలను, అవి అతనిలో రేకెత్తించ వచ్చు.

సాధకుడు ఎంత పట్టుదలతో ధ్యాన వస్తువు మీద కేంద్రీకరించి నప్పటికి, ఆదిలో ఎదురయ్యే తొలి కష్టాలను అతడు ఎదుర్కో వలసిందే. ''మనస్సు పరిభ్రమిస్తుంది. ఆలోచనలు అతని ముందు నర్తనం చేస్తాయి. ప్రగతిలో జాప్యం జరిగే కొలది అసహనం అతనిని పై కొంటుంది. ఫలితంగా అతని ప్రయత్నాలు సడలుతాయి.'' నిశ్చితుడైన సాధకుడు ఈ అవరోధాలను ఆహ్వానిస్తాడు. కష్టాలను ఛేదిస్తాడు. తిన్నగా లక్ష్యం కేసి చూసాడు. దాని నుంచి క్షణం గూడ కన్ను మరల్చడు.

ఉదాహరణకు ఒకసాధకుడు మట్టి కసిణను ధ్యాన వస్తువుగా గ్రహించా డనుకోండి.

ఒక అడుగు వ్యాసం కలిగిన దాని ఉపరితలాన్ని మట్టితో అలికి, బాగా నునుపు చేస్తారు. ఈ ఏకాగ్రతా చక్రాన్ని ప్రాథమిక వస్తువు అంటారు. దానిని తనకు నాలుగడుగుల దూరంలో ఉంచుతాడు. దాని మీద మనసు లగ్నం చేసి, 'పృథ్వి' 'పృథ్వి' అంటూ, దానిలో అతడు పూర్తిగా లీనమై, ఇతర ఆలోచనలన్నీ దూర మయ్యే దాక కొన సాగిస్తాడు. ఇలా కొంతకాలం – బహుశ వారాలు, నెలలు, సంవత్సరాలు – కొనసాగించాక, వస్తువును మూసిన కన్నులతోనే చూడ గలుగు తాడు. వస్తువుయొక్క మానసిక ప్రతిమ అయిన, చాక్షుష ప్రతిమ మీద, అది భావనాప్రతిమగా మారేదాక, అతడు కేంద్రీకరిస్తూనే ఉంటాడు.

విశుద్ధిమగ్గ ప్రకారం మొదటి చాక్షుష ప్రతిమకు రెండో భావనా ప్రతిమకు తేడా ఇలా ఉంటుంది: మొదటిదానిలో ఒక పగులు (fault) కనిపిస్తుంది. రెండోది ఒక నంచి లోంచి తీసిన మండలం వంటి అద్దంలా , లేదా బాగా తుడిచిన శంఖువులా లేదా మేఘాల నుంచి బయట పడుతున్న చంద్రబింబంలా కనిపిస్తుంది.

భావనా ప్రతిమకు రంగు, ఆకృతులు ఉండవు. అది కేవలం కనిపించే ఒక క్రమం (Mode) మాత్రమే. అది సంజ్ఞా జనితం (Perception born) అతడు నిరతం అమూర్త భావన మీదే కేంద్రీకరిస్తే ''ఉపచార సమాధి'' (Proximate concentration) లో ఉన్నట్లు. ఆధ్యాత్మిక ప్రగతికున్న ఐదు అంతస్స్పర్ధ ఆటంకాలు (నివారణలు) – ఇంద్రియక వాంఛలు (కామచ్ఛంద), అవిశ్రాంతి, వ్యాకులత (ఉద్ధచ్ఛకుక్కుచ్ఛ), డోలాయమానం (విచికిత్స = విచికిచ్ఛ), ద్వేషం (వ్యాపాద) సోమరి తనం, మాంద్యత (థీన మిద్ధ) - వీటిని తాత్కాలికంగా వరుసగా ఏకాగ్రత, సుఖ, విచార, ప్రీతి, ప్రాథమిక యోజన (వితక్క)లు ప్రత్యాదేశిస్తాయి.

అంతిమంగా పరమానందాన్ని కలిగించే ఏకాగ్రతను (అప్పణా సమాధి) పొంది, ఒకే బిందువు వద్ద కేంద్రీకృతమైన మనస్సులో ఉన్న ఆనందాన్ని ప్రశాంతతను అనుభవిస్తాడు.

ఆటంకాలను తొలగించి ఇలా ఏక బిందుచిత్తాన్ని సాధించడాన్ని 'చిత్తవిశుద్ధి' అంటారు. ఇది విశుద్ధి మార్గంలో రెండో దశ.

జల కసిణ కోసం ఒక పాత్ర నిండ రంగు లేని నీటిని – వాన నీటిని – తీసుకొని దానిమీద 'ఆపో' 'ఆపో' అంటూ మనసు నిలపాలి. ఇలా ఏక బిందుచిత్తాన్ని (one printedness of the mind) పొందే దాక చేయాలి.

అగ్ని కసిణను పొంద దలచు కొన్నవారు, జ్వాలను చేసి, ఒక గడ్డి చాపకు లేదా తోలుకు లేదా వస్త్రానికి జాన బెత్తెడు (Span = కిష్కువితస్తి) రంధ్రం చేసి, ఆరంధ్రం ద్వారా జ్వాల మీద కేంద్రీ కరించాలి. వాయు కసిణ కోసం గోడ లోని రంధ్రం ద్వారాగాని కిటికీ గుండా గాని వచ్చే గాలి మీద, 'వాయో' 'వాయో' అంటూ మనస్సును కేంద్రీ కరించాలి.

వర్ణ కసిణలు పొందా లనుకొన్న వారు, చెప్పిన కొలతలతో ఒక మండలాన్ని తయారు చేసి, దానికి నీలం పీత, లేదా అరుణ, లేదా శ్వేత రంగు వేసి, ఏ రంగును వేశారో ఆ రంగు నామాన్ని ఉచ్చరిస్తూ మనస్సును దానిపై నిలపాలి.

అతడు నీలం, పీత, అరుణ, శ్వేత పుష్పాల మీద కూడ కేంద్రీకరించ వచ్చు.

కాంతి కసిణ (Light Kasina) కోసం చంద్రబింబం మీద, నేల మీద వర్తులాకారంలో మంట చేసి కాని, సూర్య లేదా చంద్ర కాంతి గోడ రంధ్రాల ద్వారా పడ్డప్పుడు ఏర్పడే వలయం మీద 'ఆలోక' 'ఆలోక' (కాంతి, కాంతి) అంటూ మనస్సును కేంద్రీ కరించాలి.

ఆకాశ కసిణ పొందగోరిన వారు, ఒక మంచి పటమండపం (పందిరి) లో లేదా తోలు, చాపలలో జాన బెత్తెడు వేళ్ళతో రంధ్రం చేసి 'ఆకాశ', 'ఆకాశ' అంటూ ధ్యానం చేయాలి.

**అసుభ**

ప్రాచీన భారతదేశ స్మశానాలతో ఈ పదిరకాల శవాలు దొరికేవి. అక్కడ శవాలను వదిలి వేసే వారు. మాంసాహార జంతువులు అక్కడకు వచ్చేవి. ఇవ్వాళ అయితే శవాలు దొరకవు.

**అనుస్మతి**

'బుద్ధానుస్సతి' అంటే, బుద్ధుని గుణాల మీద ఈ విధంగా పర్యాలోచించడం:

''బుద్ధుడు నిజంగా అంతటి మహామహుడు - అర్హుడు, పూర్తిగా జ్ఞానోదయమైన వాడు, జ్ఞాని, సచ్చరితుడు, అందరి సంక్షేమం కోరేవాడు, ప్రపంచాలను ఎరిగినవాడు, వ్యక్తులకు శిక్షణ నివ్వడంలో అసమాన రథచోదకుడు. దేవతల, మానవుల గురువు. సర్వజ్ఞాని, పవిత్రుడు.''

'ధమ్మానుస్సతి' ధమ్మ శీలం మీద పర్యాలోచించడం:

''ఆ ఉన్నతుడు ధమ్మాన్ని చక్కగా వివరించాడు. తెలివైన వాడు ఎవరికి వారు అర్థం చేసుకొనే విధంగా, నిర్వాణానికి దారితీసే పద్ధతిలో, పరిశోధనకు అవకాశం కల్పిస్తూ, సద్యః ఫలితాన్ని ఇచ్చే తీరులో, అందరూ యథార్థీకరణం చెందేలాగ ప్రతిపాదించాడు.''

'సంఘానుస్సతి' అంటే శుద్ధ సంఘ సభ్యుల గుణాలను, ఈ విధంగా పర్యాలోచించడం:

''ఆ ధన్యుని శిష్యుల సంఘశీలం మంచిది. ఆ ధన్యుని శిష్య సంఘ శీలం రుజువర్తనం కలది. ఆ ధన్యుని శిష్య సంఘశీలం జ్ఞానయుతమైంది. ఆ ధన్యుని శిష్య సంఘశీలం విధివిహితమైంది. ఈ నాలుగు జంటల వ్యక్తులు మొత్తం ఎనిమిది మంది వ్యక్తులవుతారు. ఆధన్య జీవి శిష్యుల సంఘం పూజింప దగింది, కానుక లివ్వ దగింది, అతిథ్యమివ్వదగింది, నమస్కరించ దగింది, ప్రపంచానికి అసమానమైన ఉత్కర్ష అది.''

'శీలానుస్సతి' అంటే స్వీయగుణ శీల ప్రవర్తన పరిపూర్ణత మీద పర్యాలోచన చేయడం.

'చాగానుస్సతి' అంటే స్వీయ దాన గుణం మీద పర్యాలోచన.

'దేవతానుస్సతి': ''వారి విశ్వాసాలు, గుణాలు కారణంగా దేవతలు అటువంటి ఉన్నతస్థితులలో పుట్టారు. నాకూ ఆ గుణాలు విశ్వాసాలు ఉన్నాయి''. ఈ విధంగా ఒకడు తన గుణాల, విశ్వాసాలమీద; దేవతలు సాక్షిగా, పర్యాలోచన చేసి నట్లయితే దానిని దేవతానుస్సతి అంటారు.

'ఉపసమానుస్సతి' అంటే, దుఃఖ నివృత్తి లాంటి నిర్వాణ లక్షణాల మీద పర్యాలోచన చేయడం.

'మరణానుస్సతి' అంటే, మానసిక - దైహిక జీవిత అంత్యం మీద పర్యాలోచన చేయడం

మరణ పర్యాలోచనతో ఒకనికి జీవిత క్షణిక స్వభావం అవగత మవుతుంది. 'మరణం తథ్యం, జీవితం అనిశ్చితం' అని అర్థం చేసు కొన్న ప్పుడు, పూర్తిగా ఇంద్రియక సుఖాలలో కూరుకు పోక, తన ఇతరుల అభివృద్ధి కోసం పని చేయడం ద్వారా, ఒకడు తన జీవితాన్ని బాగా ఉపయోగించు కొనే ప్రయత్నం చేస్తాడు. నిరత మరణ ధ్యానం ఒకనిని నిరాశావహుని, జడుని చేయదు. అంతేకాదు, అది, అతనిని క్రియాశీలునిగా, శక్తివంతునిగా చేస్తుంది. అతడు మరణాన్ని ప్రశాంతంగా ఎదుర్కో గలుగు తాడు.

మరణం మీద ధ్యానం ఉంచి నప్పుడు, జీవితం ఒక జ్వాల అని, లేదా జీవులని పిలవ బడేవన్నీ అదృష్ట కర్మ శక్తికి బాహ్యతాత్కాలిక అభివ్యక్తులని ఒకడు భావించ వచ్చు. తనకిష్టమైనన్ని ఉపమానాలను వాడుకొంటూ, అతడు జీవితం అనిశ్చితతమీద, మరణం తథ్యత మీద ధ్యానం చేయ వచ్చు.

'కాయగతాస్సతి' అంటే, జుట్టు, శరీరంమీది రోమాలు, గోళ్ళు, పళ్ళు, చర్మం, మాంసం, స్నాయువులు, ఎముకలు, మజ్జ, మూత్రపిండాలు, గుండె, కాలేయం, ఉదరవితానం, ప్లీహం, ఊపిరితిత్తులు, ప్రేవులు, ఆంత్రపేశి, ఉదరం, మలం, మెదడు, పిత్తరసం, కఫ్లె, చీము, రక్తం, స్వేదం, శోషరసం (lymph), కన్నీరు, కొవ్వు (grease), లాలాజలం, నాసిక చీమిడి, సంధిద్రవం (articular fluid), మూత్రం లాంటి ముప్పైరెండు శరీర మలిన భాగాలమీద పర్యాలోచన చేయడం.

శారీరక ఏహ్యత మీద ఇలా ధ్యానం చేయడంతో విరాగం (dispassion) ఏర్పడుతుంది. ఈ మలినాల మీద, బుద్ధుని కాలంలో, చాల మంది భిక్కులు ధ్యానం నిలిపి, అర్హంతత్వాన్ని పొందారు. ఈ మొత్తం 32 భాగాలతో గాఢపరిచయం లేనట్లయితే, ఎముకలనో, మాంసాన్నో, చర్మాన్నో దేనినో ఒకదానిని ఎన్నుకొని; దాని మీద కేంద్రీకరించ వచ్చు.

ఈ శరీరం లోపల కంకాళం ఉంది. అది మాంసంతో నిండి చర్మతో కప్పబడుతుంది. అందం చర్మం వరకే. ఈవిధంగా శరీరంలోని మలిన భాగాల మీద కేంద్రీకరిస్తే ఈ శరీరం మీద మోహరాగం క్రమంగా నశిస్తుంది.

ఇంద్రియ లాలసులు కాని వారికి ఈ ధ్యానం నచ్చదు. అటువంటి వారు, ఈ సంక్లిష్ట మానవ యంత్రంలోని సృజనాత్మక సంభావ్యతల మీద ధ్యానం చేయ వచ్చు.

'ఆనాపానసతి' శ్వాసమీద మనసు నిలపడం. 'ఆన' అంటే నిశ్వాస, 'అపాన' అంటే ఉచ్ఛ్వాస (గాలి బయటకు వదలుట)

కొన్ని గ్రంథాలలో ఈ రెండు పదాలను వ్యతిరేక క్రమంలో చెబుతారు.

శ్వాసమీద కేంద్రీకరిస్తే మనస్సు ఏకాగ్రతను పొందుతుంది. అంతిమంగా అది ప్రజ్ఞ (insight)కు, అర్హంతత్వానికి దారితీస్తుంది.

ఇది (శ్వాస) అన్నింటి కంటె మంచి ధ్యాన వస్తువు. అందరికీ నచ్చేది గూడ. బుద్ధుడు గూడ, తన జ్ఞానోదయానికి పూర్వం ఆనాపాన సతిని ఆచరించాడు.

ఈ ధ్యాన పద్ధతిని గురించిన పూర్తి వివరణ 'సతిపట్ఠాన సుత్తా'లోను 'విశుద్ధి మగ్గ'లోను ఉంది.

సుఖకరమైన ఆసనాన్ని వేసి, గాలిని వదిలి, నోటిని మూసు కోవాలి. ఆ తరవాత గాలిని మామూలుగా, ప్రయాసతో కాక, పీలుస్తూ వదలుతూ ఉండాలి. ముందు లోపలికి గాలిని పీల్చి ఒకటి అని లెక్కించాలి. గాలి వదలి రెండు అని లెక్కించాలి. ఇలా చేస్తున్నప్పుడు మనస్సును శ్వాసక్రియ మీదనే నిలపాలి. ఈ విధంగా పదివరకు లెక్కించవచ్చు. కాని మనస్సు ఎప్పుడూ స్థిరంగా శ్వాసక్రియ మీదనే ఉండాలి. పది లెక్కించే లోపలే మనస్సు ఎక్కడెక్కడో తిరగ డానికి వెళ్ళ వచ్చు. అంతమాత్రంతో నిరుత్సాహ పడ వలసిన అవసరం లేదు. విజయం సాధించే దాక ప్రయత్నించడమే. క్రమంగా శ్రేణుల సంఖ్యను పెంచవచ్చు – అంటే పది అంకెల ఐదు శ్రేణులను. తరవాత గణన లేకుండానే శ్వాసమీద మనస్సును కేంద్రీకరించవచ్చు. ఏకాగ్రతకు సహాయకారిగా ఉంటుందని కొందరు ఒంట్లు లెక్క పెడతారు. కొందరు ఈ పద్ధతిని పరిగ్రహించరు. ముఖ్యమైంది ఏమిటంటే మనస్సును లగ్నం చేయడం కాని, గణన కాదు. గణన గౌణం. ఈ రకం కేంద్రీకరణ కుదిరి నప్పుడు, శరీరం, మనస్సులు తేలిక పడతాయి. ప్రశాంతంగా గూడ ఉంటుంది. గాలిలో తేలి పోతున్న అనుభవం గూడ బహుశ కొందరికి కలుగ వచ్చు. ఈ కేంద్రీకరణం కొంతకాలం సాగిన తరవాత ఒక రోజు వస్తుంది. ఆ రోజున శరీరం కేవలం శ్వాసయేనని, శ్వాస ఆగినప్పుడు శరీరం నశిస్తుందని తెలుసుకొంటాడు. వెంటనే అశాశ్వతత్వాన్ని గుర్తిస్తాడు. ఎక్కడ మార్పు ఉంటుందో అక్కడ శాశ్వత సత్యం, అమర్త్య ఆత్మ ఉండడానికి వీలు లేదు. అప్పుడు అర్హంతత్వం కోసం 'ప్రజ్ఞ'ను పొందవచ్చు.

ఈ రకం కేంద్రీకరణ లక్ష్యం కేవలం ఏకాగ్రతను సాధించడం కాదని, నిర్వాణాన్ని పొందడానికి కావలసిన ప్రజ్ఞను ఆర్జించడానికని ఇప్పుడు మనకు స్పష్టమైంది.

ఏరకమైన హాని లేకుండ ఈ సరళ పద్ధతిని ఎవరైన ఆచరించ వచ్చు.

ఇంక ఎక్కువ వివరాల కోసం పాఠకుడు 'విశుద్ధిమగ్గ'ను చూడవచ్చు.

సతి పట్ఠాన సుత్త ప్రకారం 'ఆనాపానసతి':

''మనస్సును శ్వాసపై ఉంచి అతడు గాలి పీలుస్తాడు. మనస్సును శ్వాసపై ఉంచి గాలి వదులు తాడు.''

''దీర్ఘంగా గాలి లోపలికి పీల్చేటప్పుడు, అతనికి తెలుసు, 'నేను దీర్ఘంగా గాలి పీలుస్తున్నాను,' అని. దీర్ఘంగా గాలి విడుస్తున్నప్పుడు, అతినికి తెలుసు: 'నేను దీర్ఘంగా గాలిని వదులుతున్నాను' అని.

''హ్రస్వంగా గాలి పీలుస్తున్నప్పుడు అతనికి తెలుసు: ''నేను హ్రస్వంగా గాలి పీలుస్తున్నాను''. అని హ్రస్వంగా గాలి వదులుతున్నప్పుడు అతనికి తెలుసు: 'నేను హ్రస్వంగా గాలి వదులుతున్నాను'' అని.

'' 'మొత్తం శ్వాసప్రక్రియను (అంటే దాని ఆదిమధ్య తుదిని) స్పష్టంగా గమనిస్తూ నేను గాలిని పీలుస్తాను'; ఈ విధంగా అతడు తనకు తాను శిక్షణ ఇచ్చు కొంటాడు. 'మొత్తం శ్వాస ప్రక్రియను స్పష్టంగా పరికిస్తూ, నేను గాలిని వదులుతాను;' ఈ విధంగా అతడు తనను తాను శిక్షించుకొంటాడు.

'' 'శ్వాసను శమింపజేస్తూ, నేను గాలి పీలుస్తాను, ఈ విధంగా అతడు తనను తాను శిక్షించుకొంటాడు; శ్వాసను శమింపజేస్తూ, నేను గాలిని వదులుతాను'; ఈ విధంగా తనను శిక్షించుకొంటాడు.''

**బ్రహ్మవిహార**

ఇక్కడ 'బ్రహ్మ' అంటే, బ్రహ్మచర్యంలో లాగ, 'ఉత్కృష్ట' లేదా 'శ్రేష్ఠ' అని అర్థం. 'విహార' అంటే పద్ధతి, లేదా ప్రవర్తన స్థితి, లేదా జీవన పద్ధతి. వాటిని అప్పమఞ్ఞ (Appamanna) (అపరిమేయ హద్దులు లేని)లని గూడ పిలుస్తారు. ఎందుకంటే, ఈ ఆలోచనలు సర్వజీవుల యెడ అపరిమేయంగా ప్రసారితాలవుతాయి.

మెత్తా (సంస్కృతంలో మైత్రి) ప్రేమ పూరిత కరుణ, పరహితేచ్ఛ, హితకామన, హృదయాన్ని మృదులం కావించిదిగా నిర్వచించారు. ఇది శారీరక ప్రేమ కాదు. వైయక్తిక

ప్రేమ అంత కంటె కాదు. దాని సూటి శత్రువు ద్వేషం లేదా క్రోధం (కొధ); దీని పరోక్ష శత్రువు వైయక్తిక వాత్సల్యం (ప్రేమ). మెత్తా, ఏ మినహాయింపు లేకుండ, సర్వ జీవులను పరివేష్టిస్తుంది. మైత్రి పరాకాష్ఠ ఎక్కడ ఉందంటే, ఒకడు సర్వ జీవులతో తాదాత్మ్యం చెందడం (సబ్బత్తతా)లో ఉంది. అది అందరి మంచిని సుఖాన్ని కోరడం. పరహితేచ్ఛ దాని ముఖ్యలక్షణం. అది ద్రోహచింతను పూర్తిగా విడనాడుతుంది.

ఇతరులు కష్టాలలో, బాధలలో ఉండగా చూసి నప్పుడు మంచివారి హృదయాలను చలింప జేసేది 'కరుణ' గా నిర్వచించారు. లేదా ఇతరుల బాధలను కరిగించేది కరుణ. దీని ముఖ్య లక్షణం ఇతరుల బాధలను తొలగించడం. దీని సూటి శత్రువు హింస అయితే , పరోక్ష శత్రువు రాగపూరిత చింత (దొమనస్స). కరుణ చింతాక్రాంతులను కౌగిలించుకొని క్రూరత్వాన్ని తొలగిస్తుంది.

'ముదిత' కేవలం సహాను భూతి కాదు. సహానుభూతితో పొందే సంతోషం. దీని సూటి శత్రువు అసూయ. పరోక్ష శత్రువు ఆనందం. దీని ముఖ్యలక్షణం ఇతరుల అభివృద్ధి, విజయాలలో సంతోషంగా పాలు పంచు కోవడం. ముదిత అభివృద్ధి చెందే సర్వ జీవులను కౌగిలించు కొంటుంది. అయిష్టతను తొలగిస్తుంది. అది వ్యక్తి యొక్క అభినందించే దృక్పథం.

'ఉపేక్ష' - శబ్దార్థ పరంగా చూస్తే నిష్పక్షపాతంగా విషయాలను చూడడం. అంటే రాగ ద్వేషాలు లేకుండ, అనుకూలత వ్యతిరేకత లేకుండ చూడడం. అది సుఖ పర ఉదాసీనత (hedonic indifference) కాదు. పరిపూర్ణ సంయమనం, సమచిత్తం. కీర్తి అమానాలలో, బాధా సుఖాలలో, గౌరవాగౌరవాలలో సమతూక మనస్సు అది. దీని సూటి శత్రువు రాగం (attachment). పరోక్షశత్రువు కాఠిన్యత. ఉపేక్ష పట్టుకు వేళ్ళాడడాన్ని, విముఖతలను పరిహరిస్తుంది. నిష్పాక్షికత దీని ముఖ్య లక్షణం.

ఉపేక్ష అంటే కేవలం తటస్థ వేదన కాదు. అది సారభూతం. సంయమనం, మానసిక సమతౌల్యతలు దానికి దగ్గరగా ఉండే సమానార్థకాలు. మంచి, చెడులను రెండింటిని ఉపేక్ష కౌగిలించు కొంటుంది. ప్రేమిత అప్రేమిత, సంతోష అసంతోషాలను గూడ.

ఝానాలను పెంపొందించు కోవడం కోసం బ్రహ్మవిహారాన్ని అలవరచుకొనే విధానాన్ని విశుద్ధి మగ్గ వర్ణిస్తుంది. ఒకసారి సాధకుడు ఝానాలను సాధించిన తరవాత, ఏ మాత్రం కష్టం లేకుండా, పంచ అభిజ్ఞాలను దివ్య చక్షువు (దిబ్బచక్ఖు), దివ్యకర్ణం (దిబ్బసోట) పూర్వజన్మల స్మృతి (పుబ్బె నివాసానుస్సతి ఞాణ), పరచిత్త పఠనం (పరిచిత్త విజానన)

ఇంక అనేక మానసిక శక్తులు (ఇద్ధివిధ). వాటి స్వంత దారునికి నిస్సందేహంగా ఎపి ప్రయోజన కారులే అయినా, సమాధి, ఈ లోకోత్తర శక్తులు అర్హంతత్వం పొందడానికి ఆవశ్యకాలని చెప్ప లేము. ఉదాహరణకు శోషిత దృష్టి అర్హంతలు (dry - visioned Arhants) ధ్యానాల సహాయం లేకుండానే, ప్రజ్ఞను మాత్రమే పెంపొందించుకొని తిన్నగా అర్హంతత్వాన్ని సాధించారు. ధ్యానాల అవసరం లేకుండానే, బుద్ధుని కాలంలో స్త్రీ పురుషులు అర్హంతత్వాన్ని సాధించారు.

ఐదో ధ్యానాన్ని పొందిన వాడు మాత్రమే ఐదురకాల అభిజ్ఞలను పొందగలడు.

'దివ్యచక్షువు' అంటే దేవతా నేత్రం. మామూలు భౌతిక నేత్రంతో కనిపించని దూర, దగ్గరి వస్తువులను దీనితో చూడ వచ్చును. ఇది అతీంద్రియ దర్శనం.

'చుటూ పపాతఞాణ' అంటే మరణిస్తున్న, మరల కనిపించే జీవులకు సంబంధించిన జ్ఞానం. ఇది దివ్య నేత్రానికి సమానం.

'అనాగతమ్ సఞాణ' భవిష్యత్తుకు సంబంధించిన జ్ఞానం. 'యథాకమ్మూ పగతఞాణ' అంటే తమ మంచి చెడ్డ కర్మానుసారం జీవుల మనుగడకు సంబంధించిన జ్ఞానం. ఈ రెండు జ్ఞానాలు గూడ అదే తరగతికి చెందినవి.

'దిబ్బసొత' అటే దివ్య శ్రోత్రేంద్రియం. దీనిని అతీంద్రియ శ్రవణం అంటారు. దీనితో దూరదగ్గర సూక్ష్మస్థూల శబ్దాలను విన వచ్చును.

'పుబ్బెనివాసానుస్సతిఞాణ' అంటే తన, ఇతరుల గతజన్మల స్మృతి. ఈ విధమైన శక్తి బుద్ధునికి అపారంగా ఉంది. ఇతరుల విషయంలో ఇది పరిమితం.

'పరచిత్త విజానన' అంటే ఇతరుల ఆలోచనల విచక్షణీకరించడం.

'ఇద్ధివిధ' అంటే గాలిలో ఎగిరే, నడిచే, నీటి మీద నడిచే, భూమిలోకి చొచ్చుకు పోయే, నూతనాకృతులను సృజించడం లాంటి శక్తి.

**పాదసూచికలు :**

1. కసిణ అంటే మొత్తం, పూర్ణం, పరిపూర్ణం. దీనిని పరిపూర్ణం అని చెప్పడానికి కారణం ఏమిటంటే, కసిణ వస్తువు భావనా ప్రతిమ నుంచి ఉద్గారమవుతున్న ప్రక్షేపప్రభాసను ఎంతవరకైన, అపరిమేయంగా విస్తరించవచ్చు.

పృధ్వి కసిణ విషయంలో ఒకడు జాన బెత్తెడు వ్యాసంతో చక్రాన్ని చేసి, దానిని ఉషోదయ కాంతి వర్ణ మృత్తికతో కప్పి, అలకాలి. ఉషోదయ కాంతి మృత్తిక సరిపడ లభించక పోతే, క్రింది భాగంలో మరో రకం మట్టిని ఉపయోగించాలి. ఈ కేంద్రీకరణ పరిధిని కసిణ మండలం అంటారు.

మిగతా కసిణలను అలాగే అర్థం చేసుకోవలి. వివరాలు విశుద్ధిమగ్గలో ఉన్నాయి. కాంతి, ఆకాశ కసిణలను వైదిక గ్రంథాలలో పేర్కొన లేదు. వాటిని వదిలి వేస్తే, ముప్పై ఎనిమిది వస్తువు లున్నాయి.

2. ప్రాచీన కాలం సమాధి స్థలాలలో, శవగృహాలలో ఈ పదిరకాల శవాలు ఉండేవి. ఈ స్థలాలలో శవాలను పూడ్చిపెట్టక, దహనం చేయక, మాంసభక్షకులైన జంతు, పక్షులు తినడాని వీలుగ వదిలి వేసేవారు. ఈ ఆధునిక యుగంలో అటువంటి శవాలు ధ్యానవస్తువులుగా దొరకడం అసంభవం.

3. మజ్ఝిమ నికాయ, 1, 20, వితక్క సంధానసుత్త, P. 120

ముప్పై ఏడో ప్రకరణం

# నివారణలు లేదా ప్రతిబంధకాలు

''హృదయ మాలిన్యాలు ఐదు ఉన్నాయి. ఈ మాలిన్యాలతో కలుషితం కావడం వల్ల హృదయం మృదువుగా గాని, కోమలంగా గాని, తేజోవంతంగా గాని లేదు. అది అపరిపూర్ణంగా నిర్మితమైంది. ఈ మాలిన్యాల వినాశానికి వీలుగ అది లేదు.''

– సంయుత్త నికాయ

నివారణ (ని + వార్, ఆటంకపరుచు, అడ్డుకొను) అంటే ఒకని ప్రగతిని నిరోధించేది, లేదా ముక్తి పథాన్ని అడ్డుకొనేది, స్వర్గలోకాలను అడ్డుకొనేది. ''ఆలోచనలకు గంతలు కట్టి, వాటిని కప్పి పెట్టేది, ఆటంక పరిచేది'' అని గూడ అర్థం.

ఐదురకాల ఆటంకాలున్నాయి. అవి: (i) ఐంద్రియక వాంఛలు (కామ చ్ఛంద) (ii) దుష్టభావం (వ్యాపాద = ill will) (iii) సోమరితనం, జడత (థిన – మిద్ధ) (iv) అవిశ్రాంతి – వ్యాకులత (ఉదచ్చ – కుక్కుచ్చ) (v) శంక (విచికిత్స = విచికిచ్చా).

1. కామచ్ఛంద అంటే ఐంద్రియక లేదా విషయవాంఛలు. ఆకృతి, ధ్వని, రుచి, వాసన, స్పర్శ లాంటి సుఖకర ఐంద్రియక వస్తువుల మీది రాగం. వ్యక్తిని సంసారానికి బంధించే శృంఖలంగా దీనిని పరిగణిస్తారు.

సాధారణ వ్యక్తి ఈ ఐంద్రియక వస్తువులకు తప్పకుండ ఆకర్షితు డవుతాడు. ఆత్మ నిగ్రహ రాహిత్యం అనివార్యంగా రాగంలోకి దించుతుంది. ఈ నివారణం ఏకాగ్రతతో ప్రత్యాదేశిత మవుతుంది. ఏకాగ్రత అనేది ఝానం ఐదు లక్షణాలలో ఒకటి. సకదాగామి దశ చేరడంతో, అది నీరసమై, అనాగామిని పొందడంతో పూర్తిగా తొలగించ బడుతుంది. రాగ సంబంధ సూక్ష్మ రూపాలు – రూపరాగం, అరూపరాగం – అర్హతత్వం పొందగానే అంతర్హిత మవుతాయి.

ఐంద్రియక వాంఛలను తీసి వేయ డానికి ఈ దిగువ ఆరు విషయాలు పనిచేస్తాయి. (i) వస్తువు ఏ హ్యతను గమనించడం (ii) ఏ హ్యత మీద స్థిరంగా నిరత ధ్యానం చేయడం (iii) ఇంద్రియ నిగ్రహం (iv) మితాహారం (v) మంచి వారి స్నేహం (vi) ప్రయోజనకరమైన భాషణం.

2. వ్యాపాద అనేది దుష్ట భావం లేదా విముఖత. వాంఛనీయవస్తువు రాగాన్ని పెంచుతుంది. అవాంఛనీయ వస్తువు విముఖతకు దారితీస్తుంది. ప్రపంచాన్ని దహించేవి ఈ రెండు అగ్నులే. అవిద్య తోడు కాగా, ఈ రెండూ ప్రపంచంలోని దుఃఖాన్నంతా ఉత్పాదిస్తాయి.

వ్యాపాదను ప్రీతి లేదా సంతోషం ప్రత్యా దేశిస్తుంది. ప్రీతి ఝాన కారకాలలో ఒకటి. సకదాగామిని చేరడంతో ఇది బలహీనపడి, అనాగామిని పొందడంతో పూర్తిగా నశించి పోతుంది.

ఈ దిగువ పేర్కొన్న ఆరు విషయాలు వ్యాపాదను తుడిచి పెడతాయి. అవి: (i) సద్భావంతో విషయాన్ని పరిశీలించడం (ii) మైత్రిమీద స్థిర నిరత ధ్యానాన్ని ఉంచడం (iii) కర్మ అనేది తను చేసు కొన్నదే అని అనుకోవడం (iv) ఆ దృక్పధానికే కట్టువడి ఉండడం (v) మంచివారి స్నేహం (iv) ప్రయోజనకర భాషణం.

3. థిన (కార్యవిముఖత = సోమరితనం)ను మనస్సు అనారోగ్యస్థితిగా చెప్పారు. మిద్ధ (మాంద్యం)ను మానసిక రోగంగా చెప్పారు. ''అజ్ఞ మనస్సు చెట్టుకు వేళ్ళాడుతున్న గబ్బిలంలా కదల లేనిది. కర్రకు అంటుకొని ఉన్న బెల్లపు సాగు లాంటిది. కరగని గట్టి వెన్నముద్ద లాంటిది''. థిన, మిద్ధలను శారీక మగతగా, మాంద్యంగా, బద్ధకంగా అర్థం చేసుకో రాదు. ఎందుకంటె ఈ రెండు స్థితులను పరిహరించిన అర్హంతలు శారీరకంగా అలసి పోవడం ఉంది. ఈ రెండు స్థితులు మానసిక జడతకు దోహదం చేసి, తీవ్ర ప్రయత్నాన్ని (విరియ) అడ్డు కొంటాయి. ఈ రెండింటిని వితక్క (వితర్క) అనే ఝాన కారకం ప్రత్యాదేశిస్తుంది. అర్హతత్వంతో ఇవి పోతాయి.

ఈ దిగువ చెప్పిన ఆరు విషయాలు థిన, మిద్ధలను పరిహరిస్తాయి. అవి: (i) మితాహారం మీద పర్యాలోచన (ii) శరీరాసనాలను మార్చడం ద్వారా (iii) కాంతి వస్తువును ధ్యానించడం (iv) బహిరంగా నివసించడం (v) మంచి స్నేహం (vi) ప్రయోజనకర భాషణం.

4 ఉదచ్చ అనేది మానసిక అవిశ్రాంతి లేదా మనసు ఉత్తేజ పడడం. అన్ని రకాల అనైతిక విజ్ఞానంతో ముడివడి ఉన్న మానసిక స్థితి అది. చెడు చేయడం అనేది తప్పకుండా అవిశ్రాంతి స్థితి లేదా ఉత్తేజంగా ఉన్నప్పుడే జరుగుతుందని నియమం.

కుక్కుచ్చ అనేది వ్యాకులత. అది చెడు చేసి నప్పుడు కలిగే పశ్చాత్తాపం కాని, లేదా చేయ లేని ఒక మంచిని గురించిగాని పడే పశ్చాత్తాపం. చెడు చేసి పశ్చాత్తాప పడినంత మాత్రాన దాని అనివార్య ఫలితాల నుంచి ఎవడూ తప్పించుకో లేడు. సరైన మంచి పశ్చాత్తాపం ఏమిటంటే, మళ్ళీ తిరిగి చెడు చేయనని సంకల్పించడం.

సుఖ లేదా సంతోషం అనే ఝాన కారకం ఈ రెండు నివారణనలను ప్రత్యాదేశిస్తుంది. అవిశ్రాంతి అర్హతత్వం రావడంతో తొలగి పోతుంది. వ్యాకులత అనాగామిత్వాన్ని పొందడంతో పెకలించి వేయ బడుతుంది.

ఈ రెండు స్థితులను ఈ దిగువ ఆరు విషయాలు పెకలించి వేస్తాయి. అవి: (i) పాండిత్యం (ii) ప్రశ్నించడం లేదా చర్చ (iii) వినయశిక్షణ స్వభావాన్ని అర్థం చేసుకోవడం (iv) స్థవిరులతో సంపర్కం (v) మంచి స్నేహం (vi) ప్రయోజనకర భాషణం

5. విచికిచ్ఛ అంటే శంక, అనిర్ణాయకస్థితి. విచికిచ్ఛ అంటే జ్ఞానం అనే విరుగుడు లేనిది అని అర్థం. (వి = శూన్యం, లేని; చికిచ్ఛ = జ్ఞానం) దీనిని కలంత పెట్టే ఆలోచనతో కలిగే క్లేశంగా గూడ చెబుతారు. (విచి = అన్వేషణ, కిచ్ఛ = క్లేశం)

ఇక్కడ ఈ పదాన్ని, బుద్ధునికి సంబంధించి, 'శంక' అనే అర్థంలో ఉపయోగించ లేదు. ఎందుకంటే బౌద్ధులు కాని వారు గూడ విచికిచ్ఛను ప్రత్యాదేశించి, ఝానాలను పొందారు. అదొక శృంఖలం అనుకొంటే బుద్ధుడు మొదలైన వారి గురించి నది ఆ శంక; కాని ఒక ఆటంకంగా, ఒక పని చేయడంలోని అస్థిరతను అది సూచిస్తుంది. వ్యాఖ్యానాల ప్రకారం విచికిత్స అంటే, 'అది అలాగు' అని స్పష్టంగా దేనినీ నిశ్చయించ లేని అసమర్థత. మరో మాటల్లో అది అనిశ్చయం (indecision).

ఈ దిగువ ఆరు విషయాలు ఈ స్థితిని పెకలించి వేయడానికి దోహదం చేస్తాయి.

ఝానకారకమైన 'విచార' ఈ స్థితిని ప్రత్యాదేశిస్తుంది 'సోతాపత్తి' తో ఇది పెకలించబడుతుంది. అవి: (i) ధమ్మ వినయాల జ్ఞానం (ii) ప్రశ్నించడం, చర్చ (iii) వినయ శిక్షణ స్వభావాన్ని అవగాహన చేసు కోవడం (iv) అతివిశ్వాసం (v) మంచి స్నేహం (vi) ప్రయోజనకరంగా మాట్లాడట ం.

ముప్పై ఎనిమిదో ప్రకరణం

# నిర్వాణ పథం

(III)

"సంఖాత వస్తువులన్నీ క్షణ భంగురాలే...
దుఃఖ భాజకాలే సంఖాత వస్తువులన్నీ...
సంఖాతా సంఖాతాలన్నీ అనత్తలే (అనాత్మలే)"

– ధమ్మపద, వి. 277-79

**విపస్సనా (insight)**

నివారణాలను (ఆటంకాలను) తాత్కాలికంగా ప్రత్యాదేశిస్తూ, ఝానాలు పెంపొందించుకొన్నప్పుడు మనస్సు ఎంతగానో పరిశుద్ధ మవుతుంది. ప్రతిదానిని స్పష్టంగా ప్రతిబింబించే తరిణ బట్టిన అద్దలా మనస్సు తయా రవుతుంది. అయినప్పటికి ఇంకా అకుశల ఆలోచనల నుంచి పూర్తి స్వేచ్ఛ ఉండదు. ఎందుకంటే, మనస్సును కేంద్రీకరించడం ద్వారా దుష్ట ప్రవృత్తులు తాత్కాలికంగా మాత్రమే ప్రత్యాదేశితా లవుతాయి. అవి అనుకోకుండ ఊహించని సమయాల్లో ఉపరితలానికి వస్తాయి.

క్రమశిక్షణ, మాటలను చేతలను క్రమబద్ధీకరిస్తుంది; కేంద్రీకరణం మనస్సును అదుపులో ఉంచుతుంది; మూడోది, చివరిదీ అయిన ప్రజ్ఞ (insight పఞా) సాధకుని రుషిత్వాని (Sainthood)కి చేర్చి, సమాధి ప్రత్యాదేశించిన మాలిన్యాలను పూర్తిగా తుడిచిపెట్టడానికి సమర్ధుని చేస్తుంది.

మొట్టమొదటిగా అతడు, వస్తువులను, విషయాలను యథాతథంగా అంటే ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడడానికి దృష్టిని శుద్ధి (దిఠ్ఠివిశుద్ధి)[1] చేసుకొంటాడు. ఏక బిందు మనస్సుతో ఈ 'సత్వం' (being) అని పిలవబడే, దానిని విశ్లేషించి పరీక్షిస్తాడు. ఈ పరిశోధనాత్మక పరీక్ష, అతడు "నేను" (I) అని పిలిచిన దానిని, అంటే మూర్తిమత్వాన్ని (personality) నిరంతరం ప్రవాహస్థితిలో ఉన్న మనస్సు, పదార్థాల సంక్లిష్ట సమ్మేళనం (compound) అని తెలుసు కొంటాడు.

ఈవిధంగా "సత్వం" (being) అని పిలవబడే దాని స్వరూప స్వభావాలను బాగా అర్థం చేసుకొని, 'ఆత్మ శాశ్వతం' అనే భావన నుంచి బయట పడి, అతడు ఈ 'నేను' కు,

మూర్తిమత్వానికి కారణాలను వెతుకుతాడు. ఈ ప్రపంచంలో ప్రతిదీ ఏదో ఒక గత, ప్రస్తుత కారణాల నుంచి పుట్టింది అని ఎరుగుతాడు. తన ఇప్పటి ఈ అస్తిత్వం (జన్మ) గత అవిద్య, తృష్ణ, ఉపాదాన (grasping), కర్మల కారణంగానే వచ్చిందని, ఈ ప్రకృత జీవితానికి అది భౌతికాహారమని ఎరుగుతాడు. ఈ ఐదు కారణాల వల్ల ఈ సత్వం అని పిలవబడేది పుట్టింది. గతకారణాలు ప్రకృతాన్ని నిబద్ధించి (condition)నట్లుగానే, ప్రకృతం భావిని నిబద్ధిస్తుంది. ఈ విధంగా ధ్యానం చేయడం వల్ల గత, వర్తమాన, అనాగతాలకు సంబంధించిన అన్ని సందేహాలను అధిగమిస్తారు.[2]

అంతటు, అన్ని సంఘటిత (సంఖార) వస్తువులన్నీ అనిత్యాలనీ, దుఃఖానికి అతీతాలు కావనీ, వాటిల్లో శాశ్వతాత్మ ఒకటి లేదనీ (అనత్త అనీ) మననం చేసు కొంటాడు. అతడు తన కళ్ళను ఎటు తిప్పినా కనిపించేది శూన్యమే. కాని ఈ మూడు లక్షణాలు (అనిత్య, దుఃఖ, అనత్త) మాత్రం కొట్ట వచ్చి నట్లు కనిపిస్తాయి. జీవితం అంతర, బాహ్య కారణాలతో నిబద్ధమైన ఒక కేవల ప్రవాహమని అతడు గుర్తిస్తాడు. ప్రతిదీ ప్రవాహమే కనుక, అతనికి ఎక్కడా నిజమైన సుఖం కనిపించదు.

ఈ విధంగా జీవితం నిజస్వభావాన్ని గురించి ఆలోచిస్తూ, ధ్యానంలో మునిగిన అతనికి ఆశ్చర్యకరమైన ఒకరోజు ఎదురవుతుంది. ఆరోజున అతడు తన శరీరం నుంచి ఒక ప్రభా మండలం (aura) ఉద్గార మవుతున్నట్లు గ్రహిస్తాడు. అంతకు ముందెన్నడూ అనుభవించని సుఖసంతోషాలను, ప్రశాంతతను అనుభవిస్తాడు. అతడు సమచిత్తు డవుతాడు. ధార్మికత ఇనుమడిస్తుంది. సతీ స్పష్ట మవుతుంది. విపస్సన పదును దేలుతుంది. పొరపాటుగా అతడు ఈ నైతిక ప్రగతి అభివృద్ధి స్థితిని, ముఖ్యంగా కాంతి పరివేషాన్ని చూసి, రుషిత్వంగా భావించి, ఈ మానసిక స్థితిమీద ప్రేమ పెంచు కొంటాడు. త్వరలోనే, ఈ నూతన పరిణామాలు నైతిక ప్రగతికి ఆటంకాలని గుర్తించి, అతడు, ఏది మార్గమో, ఏదీ కాదో అనేదానికి సంబంధించి పరిశుద్ధ జ్ఞానాన్ని అలవరచు కొంటాడు.[3]

సరైన పథాన్ని ఎరిగి, సంఖాత వస్తువుల 'రాక' 'పోక' (arising, passing) ల మీద ధ్యానం చేస్తాడు. ఈ రెండు స్థితులలో రెండోది బాగా హత్తుకు పోతుంది. ఎందుకంటే మార్పు భవం (becoming) కంటె ప్రముఖంగా గోచరిస్తుంది. అందువల్ల అతడు తన మనస్సును వస్తువుల లయం (dissolution) మీద నిలుపుతాడు. ఏ రెండు క్షణాలు అదే విధంగా ఉండకుండ, సత్వంలోని నిర్మాణాంశాలు రెండూ - పదార్థం, మనస్సు - నిత్య ప్రవాహాలని ఎరుగుతాడు. లయమయ్యే వస్తువులన్నీ భయానకాలనే జ్ఞానం అతనికి అప్పుడు కలుగుతుంది. ప్రపంచం అతనికి మండుతున్న నిప్పుకణికల గుండం -

అపాయమూలంగా – అతనికి కనిపిస్తుంది. తరవాత ఈ భయానక, మోహ ప్రపంచం యొక్క నైచ్యం, అహంకారాల మీదకు అతని మనస్సును తిప్పుతాడు. అప్పుడతనికి దానిమీద ఏహ్యత జనించి, దానిని నుంచి ముక్తి పొంద గోరుతాడు.

ఈ లక్ష్యంతోనే, అనిత్యత, అనత్తత, దుఃఖాల మీద ధ్యానాన్ని కొన సాగిస్తాడు. ఆ తరవాత, ప్రపంచంలోని ఏ వస్తువు యెడ రాగం గాని, విముఖత గాని లేకుండ, అన్ని సంఖాత వస్తువుల యెడ సంపూర్ణ ఉపేక్షను పెంపొందించు కొంటాడు.[4]

ధార్మిక అభ్యసనంలో ఈదశ చేరుకొన్న తరవాత, తాను ప్రత్యేకంగా ప్రయత్నిస్తున్న వస్తువుల మూడు లక్షణాలలో ఒకదానిని ఎంచుకొని ఆ ప్రత్యేక దిశలో తన అంతిమ లక్ష్యమైన నిర్వాణాన్ని మొదటి సారిగా యథార్థీకరణం చెందించు కొనే వైభవోపేతమైన ఆరోజు వచ్చే దాక, తీవ్రంగా ప్రజ్ఞా వ్యవసాయం, చేస్తాడు.

డా. దాహ్ల్కె (Dr. Dahlke) చెప్పినట్లుగా,

'' ఒక యాత్రికుడు, ఒక మెరుపు వెలుగులో స్థల దృశ్యం చూస్తాడు. మిరుమిట్లు గొన్న అతని కన్నుల ముందు, అలా పొందిన ఆ దృశ్యం, ఆ తరవాత చాలకాలం వరకు నిలిచే ఉంటుంది. అలాగే, ప్రజ్ఞా ప్రభాస మెరుపులో అంతటి స్పష్టతతో చూసిన 'నిర్వాణ దర్శనం' అనంతర ప్రతిమగా (after - image) సాధకుని మనస్సు నుంచి చెదిరి పోదు.''

'ధార్మిక యాత్రికుడు ప్రప్రథమంగా నిర్వాణాన్ని గుర్తించి నప్పుడు, అతనిని సోతాపన్నుడు – అంటే మొదటిసారి నిర్వాణానికి దారితీసే ప్రవాహంలో ప్రవేశించినవాడు' – అంటారు.

ప్రవాహం ఆర్య అష్టాంగ మార్గాన్ని సూచిస్తుంది.

ఇక సోతాపన్నుడు ఏమాత్రం విషయాసక్తుడు (పుథుజ్జన = పృథ్వీజనుడు) కాడు. అతడు అరియ ( ఆర్యుడు = శ్రేష్ఠుడు).

సోతాపన్నుడు (నదిని దాటినవాడు) – ఈ మొదటి దశను చేరిన వాడు, ఈ దిగువ చెప్పిన ఈ అస్తిత్వానికి కట్టి పడ వేసిన మూడు శృంఖలాలను (సంయోజనలను) తొలగించు కొంటాడు. అవి:

(i) సక్కాయ దిఠ్ఠి = సతి + కాయె + దిఠ్ఠి (సత్కాయదృష్టి) సమూహం లేదా సమ్మేళనం (Compound) ఉన్నప్పటి దృష్టి. ఇక్కడ కాయం – పదార్థం, వేదన, ప్రజ్ఞ, మానసిక స్థితులు, విజ్ఞానాలనే పంచ స్కంధాలను సూచిస్తుంది. మానసిక – దైహిక స్కంధాల సంశ్లిష్ట

సమ్మేళనాన్ని నిత్య సత్వంగా, శాశ్వత ఆత్మగా చూసే దృష్టిని సత్కాయ దృష్టి అంటారు. ధమ్మసంగణి అటువంటి ఇరవై రకాల ఆత్మ సిద్ధాంతాలను చెబుతుంది.[6] సక్కాయ దిత్థిని మామూలుగా ఆత్మ భ్రమగా (self illusion), వ్యక్తిత్వ సిద్ధాంతంగా, వ్యక్తివాద భ్రమగా పరిగణిస్తారు.

(ii) విచికిచ్ఛ – సందేహాలు. ఆ సందేహాలు (i) బుద్ధునికి సంబంధించినవి (ii) ధమ్మానికి సంబంధించినవి (iii) సంఘానికి (iv) వినయానికి (v) గతానికి (vi) అనాగతానికి (vii) గతాగతానికి – రెండింటికి (viii) ప్రతీత్య సముత్పాదానికి సంబంధించినవి.

(iii) శీలబ్బట పరామాస– తప్పుడు కర్మకాండకు అంటి పెట్టుకొని ఉండుట.

ధమ్మ సంగణి – (1005వ విభాగం) దానిని ఈ విధంగా వివరిస్తున్నది ''నైతిక ప్రవర్తన నియమాల పాలనను, లేదా కర్మకాండను లేదా నైతిక ప్రవర్తన నియమాలపాలన, కర్మకాండలు రెండింటిని పాటించడం వలన పరిశుద్ధులవుతారనే వాదం, ఈ ధమ్మానికి వెలుపలి వారైన సన్యాసులు, బ్రాహ్మణులు చెప్పే సిద్ధాంతం''.

మిగిలిన ఏడు శృంఖలాలను తెంచుకోవడానికి సోతాపన్నుడు మహా అయితే ఏడుసార్లు జన్మిస్తాడు. అతడు బుద్ధునిలో, ధమ్మంలో, సంఘంలో అంతర్గత విశ్వాసాన్ని పెంచుకొంటాడు. ఏ కారణాన గూడ అతడు పంచ శీలాల (five precepts) ను ఉల్లంఘించడు. అతడు జ్ఞానోదయ పథంలో ఉన్నాడు కనుక దుఃఖభాజక పునర్జన్మలు, అతనికి ఉండవు.

నిర్వాణానికి సంబంధించిన ఈ సుదూర మెరుపు దర్శనం ఫలితంగా ఈ ఉత్తమ యాత్రికుడు, నూతన ధైర్యోత్సాహాలతో, శీఘ్రంగా ప్రగతిని సాధిస్తాడు. కామ రాగ, దుష్ట భావం (పతిఘ) లనే రెండు ఇతర శృంఖలాలను బలహీన పరిచి, తన ప్రజ్ఞను పరిపూర్ణం గావించుకొని, సన్యాసత్వంలో రెండోదశ అయిన సకదాగామిత్వాన్ని చేరతాడు.

ఇప్పుడతన్ని 'సకదాగామి' (ఒకసారి మరలువాడు) అని అంటారు. ఎందుకంటే, అదే జన్మలో అతడు అర్హతత్వాన్ని పొందాలి. ఎందుకంటే మానవ లోకంలో ఒకసారే జన్మిస్తాడు. అనాది నుంచి అతనిని బంధించిన ఈ రెండు శక్తిమంతమైన శృంఖలాలను, సన్యాసత్వంలో రెండోదశను చేరిన అరియ రుషి (శ్రేష్ఠుడైన రుషి) బలహీన పరచ గలడు. అయినా, కొన్నిసార్లు, కొద్దిమేరకే అయినా, రాగద్వేష సంబంధ ఆలోచనలు అతనికి వస్తాయి.

సన్యాసత్వంలో మూడోదైన 'అనాగామి' (ఎప్పుడు తిరిగిరాని వాడు) దశను చేరిన తరవాత, అతడు ఆ రెండు శృంఖలాలను పూర్తిగా తెంచుకో గలుగుతాడు. ఆ తరవాత, ఈ ప్రపంచానికీ తిరిగిరాడు, దివ్యలోకాల్లోనూ జన్మించడు, ఎందుకంటే ఇంద్రియక

సంతుష్టిని పూర్తిగా పెకలించి వేశాడు. మరణానంతరం అతడు 'అనాగామి'ల కోసం ప్రత్యేకించ బడిన శుద్ధావాసాలలో జన్మిస్తాడు. అక్కడ అర్హతత్వాన్ని పొంది, జీవితాంతం అక్కడే ఉండి పోతాడు.

ఒక సాదా మనిషి 'అనాగామి' అయినప్పుడు, అతడు బ్రహ్మచర్య జీవితాన్ని గడుపుతాడు.

ఇప్పుడు అనాగామి చివరి ఉన్నత దశను చేరతాడు. రూపరాగం, అరూపరాగం, మాన (Pride), అవిశ్రాంతి (ఉదచ్చ), అవిద్యలనే మిగిలిన ఐదు శృంఖలాలను ఛేదించుకొని, రుషిత్వంలో అంతిమదశ అయిన అర్హతత్వాన్ని పొందుతాడు.

నదిని దాటిన వాడు (సోతాపన్నుడు), ఒకసారి తిరిగివచ్చేవాడు (సకదాగామి) ఎప్పటికి తిరిగి రానివాడు (అనాగామి) – వీరిని సెఖలు* అంటారు. ఎందుకంటే వీరు శిక్షణ పొంద వలసిన వారు. అర్హంతలను 'అసెఖ'లంటారు. అంటేవారు ఇంక ఏమాత్రం శిక్షణ పొందరు.

శబ్దార్థపరంగా అర్హంత అంటే అర్హుడు, యోగ్యుడు అని అర్థం. అతనికి పునర్జన్మ లేదు. ఎందుకంటే అతని నూతన కమ్మ సంచితం కాదు. అతనికి సంబంధించిన పునరుత్పత్తి బీజాలన్నీ నాశనం అయ్యాయి.

సాధించ వలసిందంతా సాధించడం జరిగిందనీ, అంతిమంగా అతిభారమైన దుఃఖాన్ని దించు కోవడం జరిగిందనీ, అన్ని రకాల తృష్ణ, అవిద్య పూర్తిగా నాశమయ్యాయనీ అర్హంత గుర్తిస్తాడు. అనిర్వచనీయ నిర్వాణానందాన్ని అనుభవిస్తూ, ప్రపంచ మాలిన్యాలకు, అనియంత్రితా రాగాలకు బహుదూరంగా దివ్యలోకాల కంటే పైన ఇప్పుడు ఆ సుఖ యాత్రికుడు నిల బడతాడు.

పునర్జన్మ బాధ అతనికి లేదు, ఎందుకంటె అతని నూతన కర్మచేష్టల వల్ల పునరుత్పత్తి బీజాలు తయారు కావు.

అతడు అర్హంత అయిన గూడ శారీరక బాధల నుంచి పూర్తిగా దూరం కాడు. ఎందుకంటె ఈ నిర్వాణ సుఖానుభవం విరామాలతో గూడినది. అదీగాక ఇంకా అతడు భౌతిక కాయాన్ని వీడ లేదు.

అర్హంతను 'అసేఖ' అంటారు. అసేఖ అంటే శిక్షణ పొందని వాడు. అతడు శిక్షణ పొందాల్సిన అవసరం ఎందుకు లేదంటే అతడు తన లక్ష్యాన్ని సాధించాడు. 'సోతాపత్తి'

---

* 'సెఖ' అంటే శ్రేష్ఠ అభ్యాసి, ఉన్నత శిక్షణ పొందేవాడు. అనువాదకుడు.

దశ నుంచి అర్హంత దశ వరకు ఉన్న ఇతర రుషులను 'సెఖ' లంటారు. ఎందుకంటే వారు ఇంకా శిక్షణ పొందుతున్నారు.

ఈ జీవితంలోనే ఏడురోజుల పాటు ఎడతెగ కుండ, నిర్వాణానందాన్ని, రూపారూప ఝానాలను పెంపొందించుకొన్న 'అనాగామి' లు, అర్హంతలు, అనుభవించవచ్చు. దీనిని పాళీభాషలో 'నిరోధసమాపత్తి'[7] అంటారు. ఈ స్థితిలో అరియ (శ్రేష్ఠుడు) పూర్తిగా బాధల నుంచి విముక్తు డవుతాడు. మానసిక క్రియలు స్తంభిస్తాయి. అతడి విజ్ఞాన స్రవంతి తాత్కాలికంగా ప్రవహించడం ఆగి పోతుంది.

'నిరోధసమాపత్తి' పొందినవానికి, చచ్చిపోయిన వానికి మధ్య ఉన్న తేడా గురించి విశుద్ధిమగ్గ (xxiii, 51) ఇలా అంటుంది: ''శవంలో శరీర నమ్యశక్తులు అంటే శ్వాస, భాషణం, మనస్సు శమిస్తాయి, విరమిస్తాయి. ఇంకా ప్రాణికత శోషిస్తుంది. ఉష్ణం చల్లారుతుంది. ఇంద్రియ ప్రకార్యాల విరిగి పోతాయి. అదే ఝానంలో ఉన్న భిక్కులో అయితే శ్వాస, పరిశీలన, సంజ్ఞానం, నిశ్చలమై, విరమించి నప్పటికీ ప్రాణికత ఉంటుంది, గుండెకొట్టు కొంటుంది. ఇంద్రియ ప్రకార్యాలు స్పష్టంగా ఉంటాయి''

మామూలు సంప్రదాయక భాషలో చెప్పాలంటే, బౌద్ధం ప్రకారం, ఈ జీవితంలో అనుభవించ సంభవమయ్యే అత్యంత ఉన్నత ఆనందం ఇదే.

**అర్హంత నిర్వాణం పొంది గూడా, ఇంకా ఎందుకు జీవితాన్ని కొనసాగిస్తాడు?**

ఎందుకంటే, ఈ జన్మను కలిగించిన అతని కమ్మశక్తి పూర్తిగ వ్యయమై పో లేదు. షోపన్ హర్‌ను ఇక్కడ ఉటంకిచవచ్చు: కులాలుడు తన చేతిని, దానినుంచి తీసిన చక్రం లాంటి దది. లేదా మనగ్రంథాల నుంచే మంచి ఉదాహరణను చెప్ప వచ్చు: చెట్టు నుంచి ఖండించిన కొమ్మలాంటిది అది. ఆ కొమ్మ కొత్తగా చిగురించదు, పుష్పించదు, ఫలించదు. ఎందుకంటే దానికి చెట్టు నుంచి ఏమాత్రం సారం అందడం లేదు. అప్పటికే ఆ కొమ్మలో ఉన్నవన్నీ చివరిదాక మనుగడ సాగిస్తాయి.

ఏమాత్రం నూతన కర్మను సంచితం చేయకుండ, మరణం అంటే ఖాతరు చేయకుండ అర్హంత తన జీవన కాలాన్ని జీవిస్తాడు.

గౌరవనీయ సారిపుత్రునిలా అతడు ఇలా అంటాడు:

> ''నాకు మరణించాలనే కోర్కె లేదు. జీవించాలనే కోర్కెలేదు.
> నేను ఈ మర్త్య కాయాన్ని వెంటనే త్యజిస్తాను

జాగృత మనస్సుతో నియంత్రితో విజ్ఞానంతో.
మరణాలోచనతో నేను ఆటలాడను, అలాగని
జీవించడంలోను ఆనందం పొందను. తన పనిని
పూర్తి చేసిన భృత్యునిలా, ఆఘడియ కోసం వేచి ఉంటాను.''[8]

**గతించిన తరవాత అర్హంత కేమవుతుంది?**

''గాలికి ఊగిసలాడి ఆరిపోయిన దీపం ఇక ఉండదు. అలాగే, మనస్సు, పదార్థాల నుంచి విముక్తమైన అర్హంత, అంతర్ధానమై, మరిక ఉండడు'' – అంటాడు బుద్ధుడు.

అటువంటి అర్హంత కేవలం అంతర్ధానం మాత్రమే అయ్యాడా? లేక నిజంగా అతడు ఏమాత్రం ఉండడా? – అని ప్రశ్న.

'సుత్తనిపాతర' అంటున్నది: అంతర్ధానమైన అతనికి, ''అతడు ఉన్నాడు'' అని చెప్పేందుకు వీలుగ ఎటువంటి ఆకృతి ఉండదు. అన్ని పరిస్థితులు తెగి పోయి నప్పుడు, అక్కడ చర్చించాల్సిన విషయం కూడ ఏమీ ఉండదు.

ఈ సంక్లిష్ట విషయాన్ని 'ఉదాన' ఇలా చెబుతోంది:

''కొలిమి నుంచి వచ్చే నిప్పురవ్వలు ఒక్కొక్కటే ఆరిపోయి
అవి ఎక్కడికి పోతాయో ఎవరికి తెలియనట్లే-
పూర్తిగా ముక్తి పొందిన వారూ అంతే,
వాంఛా వెల్లువను దాటిన వారు,
ప్రశాంత ఆనందంలో ప్రవేశించిన వారు
వీరికి సంబంధించి ఏ జాడ మిగలదు.''[9]

ఇదే సమస్యకు సంబంధించి బుద్ధునికి వచ్ఛగొత్తకు మధ్య జరిగిన ఒక ఆసక్తి కరమైన చర్చను మజ్జిమ నికాయం చెబుతుంది.[10]

పర్యాటక సన్యాసి వచ్ఛగొత్త బుద్ధుని సమీపించి ఇలా ప్రశ్నించాడు:

''గౌతమ, మనస్సు నుంచి విముక్తమైన భిక్కు తిరిగి ఎక్కడ పుడతాడు''?

అతడు అర్హంతను మనస్సులో ఉంచుకొని మాటాడు తున్నాడనేది స్పష్టం.

బుద్ధుడు సమాధానం చెప్పాడు: ''వచ్ఛ, అతడు తిరిగి పుడతాడనడం ఈ సందర్భంలో పొసగదు.''

''అలాగైతే, గౌతమ, అతడు తిరిగి పుట్టడం లేదు.''

''వచ్ఛ, అలా గనడం గూడ ఈ సందర్భంలో పొసగదు.''

''అలాగైతే, గౌతమ, అతడు తిరిగి పుడుతున్నాడు, తిరిగి పుట్టడం లేదు.''

''వచ్ఛ, అతడు రెండూ - తిరిగిపుడుతున్నాడు, తిరిగి పుట్టడం లేదు - అనడం ఈ సందర్భంలో పొసగదు''.

''అలాగైతే, గౌతమ, అతడు తిరిగి పుట్టడం లేదు తిరిగి పుట్టకుండ ఉండడం లేదు''.

''వచ్ఛ, అతడు తిరిగిపుట్టడం లేదు, తిరిగిపుట్టకుండ ఉండడంలేదు, అనేది గూడ సరికాదు.''

పైకి అసంగతంగా కనిపించే ఈ సమాధానాలను చూసి, వచ్ఛ గందరగోళపడి, ఆ తికమకలో ఇలా ఆశ్చర్యం వ్యక్తం చేశాడు:

''గౌతమ, ఈ విషయం నాకేమీ బోధ పడడం లేదు. నేను చాల గందరగోళంలో పడ్డాను''

''చాలు వచ్ఛ, ఇందులో నీవు గందరగోళ పడవలసింది, అంతగా తికముక పడవలసింది ఏమీ లేదు. ఓ వచ్ఛ, ధర్మం గంభీరమైంది. గహనమైంది. దురవగాహం, మంచిది, శ్రేష్ఠమైనది; కేవలం వివేచనతో తెలుసు కొనేది కాదు. జ్ఞానులకు మాత్రమే తెలుస్తుంది. నీవు తెలుసు కోవడానికి అది చాల కష్టమైన ధర్మం. ఎందుకంటె నీవు మరో ధర్మానికి, విశ్వాసానికి, చెందిన వాడవు. మరో గురువు పాదాల దగ్గర కూర్చొనే వాడివి. అందుకని, ఓ వచ్ఛ, ఇప్పుడు నేను నిన్ను ప్రశ్నిస్తాను. నీవు మంచి దనుకొన్న తీరులో సమాధానం చెప్పు. ఏమంటావు, వచ్ఛా? నీ ముందు ఒకజ్వాల లేచింది అనుకో. నీముందు మంట లేచిందనే సంగతి నీకు ఎరుక అవుతుందా? లేదా?''

''గౌతమ, నా ముందు మంటలేస్తే, 'నాముందు మంట లేచింద'ని నాకు తెలిసి తీరుతుంది.''

''ఓ వచ్ఛ, ఎవడైనా వచ్చి నిన్ను ఇలా 'నీ ముందు మండుతున్న ఆ అగ్ని దేని మీద ఆధారపడుతుంది?' అని ప్రశ్నించాడనుకో. దీనికి నీ సమాధానం ఏమిటి?''

''నా ఎదుట మండుతున్న ఈ అగ్ని, గడ్డి, కొయ్య వంట చెరుకు మీద ఆధార పడిందని నేను సమాధానం చెబుతాను.''

''ఓ వచ్ఛ, నీ ముందున్న ఆ మంట ఆరి పోతే, అది ఆరి పోయిందని నీకు తెలుస్తుందా?''

''తప్పకుండా?''

కాని వచ్చ, ఎవరైన వచ్చి, ఆ ఆరిపోయిన మంట ఏ దిశలో - తూర్పుకా, పడమరకా, దక్షిణానికా, ఉత్తరానికా - వెళ్ళిందని అడిగితే, నీవు ఏమి సమాధానం చెబుతావు?''

''గౌతమ, మీ ప్రశ్న ఈ సందర్భానికి పొసగదు. గడ్డిగాదం మీద ఆధారపడిన జ్వాల, గడ్డీ, కొయ్య అయిపోగానే, మరింకేమీ వంట చెరకు లేదు గనుక, అది ఆరిపోతుంది. అది ఉచ్ఛేద మవుతుంది.''

''సరిగ్గా అదే విధంగా, ఓ వచ్చ, అన్ని రూపాలు, సంవేదనలు. సంజ్ఞలు, మానసిక క్రియలు, విజ్ఞానం - వదిలి వేయ బడతాయి, పెకలించ బడతాయి, తాటిచెట్టు మోడులా అయిపోయి, ఉచ్ఛేదితాలవుతాయి. తిరిగి భవిష్యత్తులో మోసు లెత్తవు.

''ఓ వచ్చ, పంచ స్కంధాలని చెప్పబడిన వాటి నుంచి విముక్తుడైన ఋషి మహా సముద్రంలా, కొలవ వీలు లేని వాడు. అతడు తిరిగి పుడతాడని చెప్పడం లేదా తిరిగి పుట్టడని చెప్పడం పొసగదు.'' -

అర్హంత తిరిగి పుడతాడని చెప్పలేం, ఎందుకంటే పునర్జన్మను నియంత్రించే రాగాలన్నీ తొలగించ బడ్డాయి. అలాగని అర్హంత పూర్తి నాశనమయ్యాడనీ చెప్పలేం, ఎందుకుంటే అక్కడ నాశనం అయ్యేందుకు ఏమీ లేదు.

రాబర్ట్ అపెన్‌హైమర్ అనే విజ్ఞాన శాస్త్రవేత్త రాస్తాడు:

ఉదాహరణకు, ఇలెక్ట్రాన్ స్థానం మారకుండా ఉంటుందా అంటే, 'లేదు' అని మనం చెప్పాల్సి ఉంటుంది. కాలంలో ఇలెక్ట్రాన్ స్థానం ఎప్పుడూ మారుతూ ఉంటుందా అంటే, 'లేద'నే మనం చెప్పాల్సి ఉంటుంది. మరి అలాగని అది గతి (motion) లో ఉందా అంటే, అప్పుడూ మనం 'లేదు' అనే చెప్పాల్సి ఉంటుంది.

మరణానంతరం మనిషి ఆత్మ (self) ను గురించి ప్రశ్నించినప్పుడు బుద్ధుడు అలాంటి సమాధానాలనే చెప్పాడు. కాని, అవి, **17,18** శతాబ్దాల విజ్ఞానశాస్త్రం ఇచ్చే సమాధానాల నుంచి చూస్తే, అంత పరిచితాలుగా ఉండవు.

''క్లేశాల (కిలెశ = defilements) నివృత్తివల్ల నిర్వాణం, పొంద వచ్చునని, కాని, ఆ పరమ స్థితి స్వభావం (ధమ్మ) గురించి మాటలలో చెప్పలేమని మనం అనుకోవచ్చు.

అధిభౌతిక దృక్పథం నుంచి చూస్తే నిర్వాణం. అంటే దుఃఖం నుంచి పూర్తి విముక్తి. మనో విజ్ఞాన పరంగా అయితే, స్వార్థ పరతను పరిహరించడం. నైతిక దృక్పథం నుంచి చూస్తే రాగం, ద్వేషం, అవిద్యల నాశమే నిర్వాణం.

**పాదసూచికలు :**

1. విశుద్ధి మార్గంలో మూడోదశ
2. కంఖావితరణవిసుద్ధి - విశుద్ధి మార్గంలో నాలుగోదశ.
3. మగ్గామగ్గఞాణదస్సనవిసుద్ధి - మార్గంలో ఐదోదశ.
4. ఈ తొమ్మిది రకాల ప్రజ్ఞ - అంటే ఉదయ, వయ, భంగ, భయ, ఆదినవ, నిబిద, ముఞ్చితుకమయతా, పటిసంఖా, ఉపేఞాణాలు మొత్తం కలిపి పటిదా ఞాణ దస్సన విసుద్ధి అంటారు. ప్రగతి జ్ఞానానికి సంబంధించిన దృష్టి శుద్ధి, ఇది విశుద్ధిమార్గంలో ఆరోదశ
5. ఈ లోకోత్తర పథంలో లభించిన ప్రజ్ఞను ఞానదస్సనసుద్ధి అంటారు. - ఇది దృష్టి విశుద్ధి. ఇదే జ్ఞానం, విశుద్ధి మార్గంలో ఏడో అంగం.
6. ధమ్మ సంగణి అనువాదం, P. 259 చూడండి.
7. శబ్దార్థపరంగా, నివృత్తిని పొందడం. See Narada Thera, *A Mannal of Abhidhamma*, PP 227, 435
8. *Psalms of the Brethem*, P. 346.
9. See Woodward, *Verses of Uplift*, P.114.
10. 1, 72 అగ్గివచ్ఛగొత్త సుత్త, P 483

ముప్పై తొమ్మిదో ప్రకరణం

# అర్హంతస్థితి

''పవిత్ర గ్రంథాలను వల్లె వేయక పోయినా, ధమ్మం ప్రకారం నడుచుకొంటూ, రాగ ద్వేష, అవిద్యలను విడనాడి, బాగా విముక్తమైన మనస్సుతో, ఇహ పరాలకు అంటి పెట్టుకొని వేళ్ళాడ కుండా, నిజం తెలుసుకొని, చరించేవాడు పవిత్ర జీవిత ఫలాన్ని పొందుతాడు''

– ధమ్మపద V.20

ఇతర సత్యాన్వేషకులకు ఆదర్శప్రాయంగా, మంచి వచనం చెబుతూ, ఈ ప్రపంచంలో జీవితాంతం ఉండే ఒక అర్హతుని శాంతి యుత, సంతోషకర స్థితిని వర్ణించే ఆసక్తికరమైన, ఉద్ధరించే ఎన్నో వాక్యాలు త్రిపిటకాల నిండా ఉన్నాయి.

ధమ్మపదంలో బుద్ధుడు అంటాడు:

యానం[1] పూర్తిచేసిన వానికి, దుఃఖం[2] లేనివానికి, పూర్తిగా ప్రతిదాని[3] నుంచి స్వేచ్ఛ పొందిన వానికి, అన్ని బంధాలు[4] తెంచు కొన్న వానికి రాగజ్వరం ఉండదు[5].

అప్రమత్తులు వారంత వారే శ్రమిస్తారు. ఏ ఆవాసానికి అంటిపెట్టుకోరు. కొలనులను వదలి వేళ్ళే హంసలలా, వారూ గృహం తరవాత గృహాన్ని వదిలి వెళతారు[6].

ఎవరికి సంచయం[7] లేదో, ఎవరు తమ ఆహారం[8] మీద పర్యాలోచన చేస్తారో, శూన్యమూ, సంజ్ఞారహితమూ అయిన మోక్షాన్ని[9] తమ వస్తువుగా పొందుతారో, గాలిలోని పక్షులకు వలె వారి దారి జాడను తీయ లేము.

ఎవని కలుషితాలు క్షాళన మయ్యాయో, ఎవడు ఆహారానికి బంధితుడు కాలేదో, శూన్యమూ సంజ్ఞారహితమూ అయిన మోక్షాన్ని వస్తువుగా పొందాడో, అతని పథాన్ని, గాలిలో ఎగిరే పక్షుల పథం లా జాడ తీయ లేము.

ఎవని ఇంద్రియాలు, రథచోదకుడు బాగా తర్ఫీదునిచ్చిన గుర్రాలలా శమయించాయో, ఎవని పీచ మణచ బడిందో, ఎవడు మాలిన్యాల నుంచి విముక్తు డయ్యాడో, అటువంటి అతన్ని దేవతలు ప్రియంగా చూస్తారు.

పృథ్వికి వలె, సమచిత్త క్రమశిక్షణ కలిగిన వ్యక్తి కోపించడు. అతడు ఒక ఇందఖీల[10]

వంటి వాడు. బురద కాని కొలను వంటివాడు. అటువంటి సమచిత్తుని[11]కి జీవిత పర్యాటకాలుండవు.[12]

అతని చిత్తం ప్రశాంతం, భాషణం ప్రశాంతం, చేతలు ప్రశాంతం, ఎవడు సరిగా తెలిసిన వాడో వాడు విముక్తుడు[13], పూర్తిగా ప్రశాంతుడు[14], సమాకృతుడు.[15] శ్రద్ధాళువు[16] కానివాడు, అసృజిత[17] (నిర్వాణ)ను అర్థం చేసుకొన్నవాడు, గొలుసులు[18] తెంచుకొన్నవాడు, (మంచి చెడు) ఉత్పాదనలకు అంతం పలికిన వాడు, అన్ని కోర్కెలను[21] త్యజించిన[20] వాడు, అతడు నిజంగా పరమోన్నతడు.

గ్రామంలోగాని, లేదా అరణ్యంలోగాని, లోయలోగాని, కొండ[22] మీద గాని అర్హతుడు ఎక్కడ ఉన్నా, ఆ చోటు నిజంగా సంతోషంతో నిండి ఉంటుంది.

విషయాసక్తులకు ఆహ్లాదమివ్వని అరణ్యాలు అతనికి ఆహ్లాదాన్నిస్తాయి. అక్కడ విరాగు[23]లు సంతోషంగా ఉంటారు, ఎందుకంటె వారికి ఇంద్రియ సుఖాలతో పని లేదుగాబట్టి.

విద్వేషుల మధ్య ద్వేషం లేకుండ మేము ఆనందంగా ఉంటాం. వారిమధ్య ద్వేషి లేకుండ ఉంటాం.

ఆహా, రోగుల మధ్య మంచి ఆరోగ్యం[24]తో సుఖంగా ఉంటాం. రోగుల మధ్య మంచి ఆరోగ్యంతో ఉంటాం.

ఆహా, మేము విషయ లోలుర మధ్య కామ వాంఛలు లేకుండ ఉంటాం.

ఆహా, నివారణల (ఆటంకాలు) మధ్య మేము సుఖంగా ఉంటాం. దివ్యలోకాల దేవతల లాగే మేమూ సంతోషాన్ని స్తాము.

ఎవనికి ఈ పారము[26] ఆపారమూ [27] అని లేదో, రెండు తీరాలు[28] లేవో, ఎవనిని శోకం తాకదో,[29] ఎవడు మచ్చ లేని వాడో, ఏకాంతుడో,[30] తన విధులను పూర్తిగా నిర్వర్తించి, మాలిన్యాలనుంచి విముక్తుడో,[31] పరమలక్ష్యాన్ని[32] చేరాడో, అతనిని నేను బ్రాహ్మణుడంటాను.

అన్ని బంధాలను ఎవడు తెంచుకొన్నాడో, కంపించడో, బంధాలను దాటి పోయాడో, అబంధితుడో, అతనిని బ్రాహ్మణుడంటాను.

ఎవడు ద్వేషాన్ని, తృష్ణను, ఇతర ధర్మాలను, అంతర్గత ప్రవృత్తులతో సహా తెంచుకొన్నాడో, అవిద్యను తోసివేసి, బుద్ధుడయ్యా[33]డో (జ్ఞాని) అతనిని నేను బ్రాహ్మణుడని పిలుస్తాను.

‘‘కోపరహితుడై, దూషణను, కశాఘాతాలను, శిక్షలను ఎవడు భరిస్తాడో, ఎవరి బలం – శక్తిమంతమైనసేన – సహనమో, అతనిని నేను బ్రాహ్మణుడంటాను.

ఎవడు కృద్ధుడు కాక, విధి నిర్వాహకుడో[34], గుణియో, తృష్ణ నుంచి స్వేచ్ఛ పొందాడో, స్వయం నిగ్రహుడో, అంతిమ శరీరాన్ని ధరిస్తాడో[35], అతనిని బ్రాహ్మణు డంటాను.

తామరాకుపై నీటి బొట్టు చందాన, సూది మొన మీద ఆవగింజలా, ఎవడు కామసుఖాలను పట్టుకు వేళ్ళాడడో, అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఈ ప్రపంచంలో ఎవడు తన దుఃఖ వినాశాన్ని ఎరుగుతాడో, భారాన్ని[36] ప్రక్కన ఉంచుతాడో, విముక్తుడయ్యాడో, అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఎవని జ్ఞానం గాఢమో, ఎవడు జ్ఞానియో, మంచి చెడులు[37] తెలియడంలో ఎవడు నేర్పరియో, పరమలక్ష్యాన్ని చేరాడో, అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

సంసారులతోగాని, సన్యాసులతోగాని ఎవడు సన్నిహితంగా ఉండడో, స్థిర వాసం లేక పర్యటిస్తాడో, వాంఛా రహితుడో, అతనిని బ్రాహ్మణు డంటాను.

జీవులతో వ్యవహరించే టప్పుడు ఎవడు తన కర్రను ప్రక్కన పడేస్తాడో, అవి బలహీనమైనవి కావచ్చు, బలవంతమైనవి కావచ్చు, ఎవడు హాని చేయడో, చంపడో – అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఎవడు శత్రువులకు మిత్రుడో, తీవ్రవాదుల మధ్యశాంతుడో, రాగుల మధ్య విరాగో[39] అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

సూది మొననుంచి ఆవగించ రాలి పడి నట్లుగా ఎవని నుంచి రాగ, ద్వేష అహంకారం, విచలనాలు పడిపోతాయో – అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఎవడు నెమ్మదిగా, ఉపదేశాత్మకంగా, సత్యవచనాలు పలుకుతాడో, ఎవరినీ తన మాటలతో బాధించడో – అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఈ లోకానికిగాని, పర లోకానికి గాని సంబంధించి ఎవడు కోరికలు లేకుండా ఉంటాడో, వాంఛా రహితుడో, విముక్తుడో – వానిని నేను బ్రాహ్మణు డంటాను.

ఇక్కడ ఎవడు మంచి చెడులను, బంధాలతో[40] పాటు అధిగమించాడో, దుఃఖ రహితుడో, మచ్చ లేని వాడో, పరిశుద్ధుడో – అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

చంద్రునిలాగా ఎవరు మచ్చ లేని వాడో, పరిశుద్ధుడో, ప్రశాంతుడో, అవికలుడో[41] భవంకోసం తృష్ణను పరిమార్చాడో, అతడు బ్రాహ్మణుడు.

మానవ, దైవ బంధాలను వదలివేసి, ఎవడు అన్ని రకాల బంధాలనుంచి విముక్తు డయ్యాడో - అతనిని నేను బ్రాహ్మణు డంటాను.

ఇష్టా[42]యి ష్టాల[43]ను పరిహరించి, ప్రశాంతుడై, మాలిన్యాలు[44] లేనివాడో, ప్రపంచా[45]న్ని జయించాడో, ఆవిశ్రాంతంగా కష్టపడతాడో అతడు బ్రాహ్మణుడు''.

''భూత, భవిష్యత్, వర్తమానాలకు చెందిన సంఖారాలను పట్టుకు వేళ్ళాడడో, గ్రహణం (grasping) లేదో అతనిని బ్రాహ్మణు డంటాను''.

నిర్భయుడు,[46] శ్రేష్ఠుడు, నాయకుడు, మహర్షి,[47] విజేత,[48] వాంఛారహితుడు (మాలిన్యాలను) శుద్ధం చేసే వాడు,[49] జ్ఞాని[50] అయిన వాడు బ్రాహ్మణుడు.

గత ఆ వాసాల గురించి తెలిసిన రుషి, సుఖ[51] దుఃఖ[52] స్థితుల రెండింటిని చూసే జన్మ[53] పరంపర అంతాన్ని చేరిన వాడు, ఉన్నత జ్ఞానంతో తనను తాను పరిపూర్ణంగావించు కొన్నవాడు[54], పవిత్రజీవితాన్ని పూర్తి[55] చేసిన వాడు, అన్ని రాగాల అంతాన్ని చూసినవాడు బ్రాహ్మణుడు.

**పాదసూచికలు :**

1. అస్తిత్వంలో ఒక సారి మాత్రమే జీవితం. అంటే అర్హతుడు.

2. రుషిత్వంలో మూడోదశ అయిన 'అనాగామి' చేరడంతో ఒకడు దుఃఖాన్ని జయిస్తాడు. ఈ దశలోనే ఒకడు పూర్తిగా, కామవాంఛల రాగాన్ని, దుష్ట లేదా విముఖ భవాన్ని పూర్తిగా తొలగించు కొంటాడు.

3. సబ్బధి - పంచ స్కంధాలు మొదలైనవి.

4. నాలుగు రకాల గ్రంధులు (బంధాలు) ఉన్నాయి - అవి (1) లాలస (అభిజ్జా) (2) వ్యాపాద (దుష్టభావం) (3) దోషభూయిష్ట కర్మకాండలో మునిగిపోవడం (సిలబ్బటవరామాస) (4) తను ముందుగా ఏర్పరుచుకొన్న అభిప్రాయాలనే సత్యమని నమ్మట (ఇదమ్ సచ్చాభినివాస)

5. ఈ పద్యం ఒక అర్హతుని నైతిక స్థితిని సూచిస్తుంది. ఉష్ణం - మనస్సుకి దేహానికి - రెండింటికి సంబంధించింది. అర్హతుడు, తాను జీవించి ఉన్నంత కాలం శారీరక ఉష్ణాన్ని అనుభవిస్తాడు, కాని ఆకారణంగా అతడు వ్యాకులత చెందడు. రాగ సంబంధ మానసిక ఉష్ణాన్ని అతడు అనుభవించడు.

6. 'నేను', 'నాది' అనే భావనలకు వారు దూరులు గనుక, అర్హంతలు, ఏమాత్రం ఒక ప్రత్యేక స్థలానికి కట్టుబడి ఉండక, ఏచోటు అంటె ఆ చోటుకు పర్యాటనం చేస్తారు.

7. రెండు రకాల సంచయం ఉంది. అవి కమ్మక్రియలు, నాలుగు జీవనావసరాలు. మొదటిది సంసారంలో జీవితాన్ని పొడిగింప ప్రయత్నిస్తుంది. రెండోది, ముఖ్యమే అయినా, ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధమే అవుతుంది.

8. ఆహార వాంఛను వదిలించు కొనుట

9. నిర్వాణం అంటే దుఃఖం విముక్తి (విమొక్ష). దానిని శూన్యం అంటారు ఎందు కంటె, దానిలో రాగం, ద్వేషం, అవిద్య లుండవు. అంతేగాని అది ఏమి లేని దని కాదు. నిర్వాణం సకారాత్మక లోకొత్తరస్థితి. దీనిని ఇహ పర పదాలలో చెప్పడం సాధ్యం కాదు. అది సంజ్ఞారహితం. ఎందుకంటే దానిలో రాగ సంజ్ఞలు లాంటివి ఏమీ ఉండవు. అర్హంతలు బ్రతికి ఉండగానే నిర్వాణాన్ని అనుభవిస్తారు. మరణించిన తరవాత అర్హంత ఉంటా డనడం సరికాదు. ఎందుకంటే నిర్వాణం అటు శూన్యవాదమూ కాదు, ఇటు శాశ్వతవాదమూ కాదు. నిర్వాణంలో ఏదీ శాశ్వతీకరింప బడదు. రాగం తప్ప ఏదీ క్షతం కాదు.

ఈ జీవితంలోనే అర్హంతత్వ ఫలాన్ని సాధించడం ద్వారా, నిర్వాణానందాన్ని అర్హంతలు అనుభవిస్తారు.

10. 'ఇందఖీల' అంటే సక్కకు చెందిన దాని అంతటి ఎత్తైన గట్టి స్తంభంలాంటిదని గాని లేదా నగర ప్రవేశంలో ఉండే ముఖ్యస్తంభమంతటిదనిగాని.

ఇందఖీలలు గట్టిస్తంభాలని, వీటిని నగరంలోపలగాని, వెలుపలగాని, అలంకారం కోసం నిల బెడతారని వ్యాఖ్యాతలు చెబు తున్నారు. మామూలుగా వాటిని ఇటుకలతోగాని, చాల కాలం మన్నే కొయ్యతోగాని చేస్తారు. అష్టభుజి ఆకృతిలో ఉంటుంది. సగం స్తంభం భూమిలోకి ఉంటుంది. అందుకని 'ఇందుఖీ'ల అంతటి గట్టి, స్థిరము అని రూపకం.

11. 'తాది' అంటే ఎవరంటే, వాంఛనీయవస్తువుల యెడ రాగం, అవాంఛనీయ వస్తువుల యెడ విరాగం లేని వాడు. అతడు దేనికీ అంటుకు పోడు. ఎనిమిది ఇహలోక పరిస్థితులలో – లాభనష్టాలు, ఖ్యాతి అపఖ్యాతులు, నిందా ప్రశంసలు, బాధాసుఖాలు – అర్హంత రాగ విముఖతలను అభివ్యక్తం చేయకుండ, ఉల్లాసం కుంగ కుండ చెక్కు చెదరక ఉంటాడు.

12. జనన మరణాలకు వారు గురికారు కనుక

13. అన్ని రకాల మాలిన్యాల నుంచి

14. అతని మనస్సు పూర్తిగా పరిశుద్ధంగా ఉండడం వల్ల

15. మూలపాళీలో ఉన్న శ్లేష అనువాదంలో రాలేదు.

16. అస్సద్ధం – శబ్దార్థపరంగా అవిశ్వాస. కేవలం అతడు ఇతరులనుంచి ఇతర మూలాల నుంచి దేనినీ అంగీకరించడు. ఎందుకంటె అతనికి వైయక్తికానుభవం ఉంది.

17. అకత, నిర్వాణ, దానిని అలా ఎందుకు పిలచా రంటే, అది ఎవరు సృష్టించింది కాదు. అకత ఇానుు గూడ కృతఘ్నుతని చెప్ప వచ్చు.

18. అస్తిత్వం, పునర్జన్మల మధ్య లింకులు. సంధిచ్చెదొ అంటే ఇంటిని కొల్లగొట్టువాడు అంటే దొంగ అని చెప్ప వచ్చు.

19. హత + అవకాసా : అవకాశాన్ని నాశనం చేసు కొన్న వాడు.

20. వంత + ఆసా : వాంతిని తినువాడు అని మరో అర్థం.

21. రుషిత్వం నాలుగు మార్గాల ద్వారా, అంటే స్థూల వాంఛా రూపాలను మొదటి మూడు దశలలోను, సూక్ష్మవాంఛా రూపాలను చివరి దశలోను తొలగించు కొంటారు.

22. నిన్న, ధల : నిమ్నస్థల : శబ్దార్థపరంగా, పల్లము, మెరక

23. విషయాసక్తులకు ఆకర్షణకాని ఏకాంత అరణ్యాలలో విరాగ అర్హతలు ఆనందం పొందుతారు.

24. రాగ రుగ్మతల నుంచి స్వేచ్ఛ.

25. కిఞ్చన – ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధాలైన రాగ, ద్వేష, అవిద్య లాంటివి.

26. పారమ్ – ఆరు వ్యక్తిక ఐంద్రియక క్షేత్రాలు.

27. అపారమ్ – ఆరు బాహ్య ఐంద్రియక క్షేత్రాలు.

28. 'నన్ను', 'నాది'గా దేనిని గ్రహించక పోవడం.

29. సమధ (Concentration) విపస్సన (insight) లను ఆచరించే వాడు.

30. ఆసినమ్ అరణ్యంలో ఒంటరిగా ఉండుట.

31. నాలుగు సత్యాలను యధార్థీకరించుకొని, బంధాలను ఛేదించడం.

32. అంటే నిర్వాణం.

33. నాలుగు ఆర్య సత్యాలను అర్థం చేసుకొన్నవాడు.

34. మత కఠోరతకు (తపస్సుకు) అంకితమైన.

35. ఎందువల్ల నంటే, అతడు రాగాలను నిర్మూలించి నందువల్ల ఇక తిరిగి జన్మ ఎత్తడు.

36. స్కంధాలు భారం.

37. దుఃఖ, ఆనంద స్థితులకు, నిర్వాణానికి మార్గం తెలిసిన వాడు.

38. శబ్దార్థపరంగా జీవుల యెడ అని.

39. స్కంధాలకు అంటి పెట్టుకొన్న వారు.

40. రాగ, ద్వేష, మోహ, అహంకార, ఛద్మ దృష్టి.

41. మాలిన్యాలతో (క్లేశాలతో) చెక్కు చెదరని.

42. అంటే కామ వాంఛలకు అంటుకొని ఉండడం.

43. అరతి – అరణ్య జీవితం యెడ విరాగం (వ్యాఖ్యానం)

44. ఉపధి–నాలుగు రకాల ఉపాదులున్నాయి. అవి స్కంధాలు, క్లేశాలు, అభి సంఖారాలు, కామాలు.

45. అంటే స్కంధ ప్రపంచం.

46. ఉసభమ్ – ఎద్దువలె భయ మెరుగక.

47. మహెసిమ్ – ఉన్నత నీతి, సమాధి, జ్ఞానాల అన్వేషి.

48. విజితావినమ్ – క్లేశ విజేత

49. నహాతకమ్ – మాలిన్యాలన్నింటిని కడిగి వేసిన వాడు.

50. బుద్ధమ్ – నాలుగు ఆర్య సత్యాలను అర్థం చేసుకొన్న వాడు.

51. సగ్గ – ఆరుదివ్యలోకాలు, పదహారు రూప లోకాలు, నాలుగు అరూపలోకాలు.

52. అపాయ – నాలుగు దుఃఖ స్థితులు.

53. జాతిక్ఖయమ్ అంటే అర్హంతత్వం.

54. అభిఞ్ఞా వోసితో అంటే, పెంపొందించ వలసిన దానిని పెంపొందించు కొంటూ, వదలి పెట్టవలసిన దానిని వదిలి పెడుతూ, అర్థం చేసుకోవాలసిన దానిని అర్థం చేసుకొంటూ, యధార్థీకరణం చెందించుకోవలసిన దానిని యధార్థీకరణం చెందించు కొంటూ, పతాకస్థాయిని చేరడం (వ్యాఖ్యానం).

55. సబ్బ వోసిత వోసానమ్ అంటే అన్ని క్లేశాల అంతమైన అర్హతత్వ పథానికి సంబంధించిన జ్ఞానం పరాకాష్ఠగా ఉన్న పవిత్ర జీవితాన్ని గడిపిన.

# బోధిసత్త్వాదర్శం

''రక్తమాంసాల నా యీ దేహాన్ని
ఈ ప్రపంచ యోగక్షేమాలకే ధరిస్తాను''
– శ్రీ సంఘబోధి

బుద్ధుని బోధలలో, పారమార్థికలక్ష్యం యధార్థీకరణకు, మూడు విధాల బోధి (Enlightenment) ఉంది. సాధకుడు తన శీలప్రవృత్తిని బట్టి, ఆ మూడింటిలో ఏదో ఒక దానిని ఎంచుకో వచ్చు. అవి: సావక బోధి, పచ్చెక బోధి, సమ్మా సంబోధిలు.

సావక సంబోధి అంటే వినడం ద్వారా ఒక శిష్యుడు జ్ఞానోదయాన్ని పొందడం. సావక అంటే శ్రావక, అంటే వినడం. ఇది అర్హంత (శబ్దార్థ పరంగా యోగ్య లేదా రాగ రహిత) ఆదర్శం. అర్హంత కాదలిచిన వారు మామూలుగా విశిష్టంగా జ్ఞానోదయమైన వాని ఉప దేశాన్ని తీసు కొంటారు. సదవగాహన ఉన్న ఒక గురువు చేసిన చిన్న సూచన చాలు నైతికంగా ప్రగమించిన ఒక సాధకుడు బోధి పథాన ముందుకు పోవ డానికి. ఉదాహరణకు గౌరవనీయ సారిపుత్రుడు, అర్హతుడైన అస్సజి నుంచి కేవలం ఒక్క సగం పద్యం మాత్రమే విని, ఋషిత్వంలో మొదటి దశను పొందాడు. తన పాదాలను కడిగిన నీటిని చూసి నంతనే, తనకు అయిన వాళ్ళందరిని పోగొట్టుకొని, విషాద పరిస్థితులలో ఉన్న, దుఃఖ భాగిని అయిన పతాచార, అర్హంత అయింది. ఆరి పోతున్న దీపాన్ని చూసి, తన మృత శిశువును బ్రతికించ మని బుద్ధుని వేడు కొన్న, చిన్న పిల్లలాంటి కిసాగోతమీ అర్హంత అయింది – నాలుగు నెలలైనా ఒక పద్యం అప్పచెప్పడం రాని చూలపంథక, ఒక చేతిలో పరిశుభ్ర ధవళ వస్త్రాన్ని పట్టుకొని, సూర్యుని వంక అనిమేషంగా చూస్తూ అశాశ్వత్వం మీద మనస్సు కేంద్రీకరించి అర్హంతత్వాన్ని పొందాడు.

తనలక్ష్యాన్ని సాధించిన తరవాత, అర్హతుడు, తన శేష జీవితాన్ని, శాంతిని అన్వేషించే ఇతర సాధకులకు ఆదర్శ వంతంగా, మంచి వచనాలు చెబుతూ గడుపుతాడు. మొదట తనను తాను పరిశుద్ధం గావించు కొని, ఆ తరువాత ఇతరులను, తానే బోధలను ఆచరించాడో వాటినే చెబుతూ, పరిశుద్ధులను గావిస్తాడు. అర్హంత తన వైయక్తిక అనుభవంతో ఏదైనా చెబుతాడు గనుక, సత్యాన్ని యధార్థీకరణం చెందించుకొనె ధర్మాన్ని బోధించాలంటే ఇతర ప్రాపంచిక గురువుల కంటె, అతడే బాగా తగిన వాడు.

అర్హంతత్వ ఆదర్శంలో స్వార్థ మనేది ఉండదు. ఎందుకంటే, అసలు అర్హంతత్వాన్ని అన్నిరకాల స్వార్థాన్ని నాశం చేసిన తరవాతనే పొందింది. అర్హతత్వం పొందా లంటే ఆత్మ భ్రమ (Self illusion) ఆత్మ లాభం (స్వార్థం) అనే శృంఖాలలను ఛేదించాలి. 'ప్రస్తుత జీవితంలోనే ఎవరికి వారు తమ బోధిని పొందండి' అని బుద్ధుడిచ్చిన సువర్ణావకాశం వల్ల, బుద్ధుని కాలంలోని జ్ఞానులైన ఆడ, మగ జనులు ఆ తరువాతి వారు గూడ చాల ప్రయోజనం పొందారు.

పచ్చెక బోధి అంటే, ఇతరుల సహాయం లేకుండానే, స్వీయ ప్రయత్నంతోనే, బాగా ఎదిగిన వ్యక్తి సాధించే స్వతంత్రబోధి. అటువంటి పవిత్రవ్యక్తి పచ్చెక (స్వీయ Private) బుద్ధ అంటారు. ఎందుకంటె, తాను స్వయంగా కనుగొన్న ధమ్మాన్ని బోధించడం ద్వారా ఇతరులను పరిశుద్ధులు గావించి, వారికి సేవ చేసే శక్తి అతనికి లేదు. అయినా అతడు ధమ్మాన్ని బోధిస్తాడు.

బోధ లేని కాలాల్లో పచ్చెక ప్రత్యేక బుద్ధులు వస్తారు. సమ్మా సంబుద్ధులు విషయంలోలాగ, ఒక ప్రత్యేక సమయంలో వారి సంఖ్య ఒకరికి మాత్రమే పరిమితం కాదు. ఈ శకానికి చెందిన బుద్ధగౌతమ గతించినా గూడ మనం ఇంకా అదే బుద్ధ వలయంలో నివసిస్తున్నాం. ఎందుకంటె, పూర్వపరిశుద్ధతతోనే ఆ బోధ ఇప్పటికీ ఉంది. ఆ ప్రకారం పచ్చెక బుద్ధు లెవరూ ఈ కాలంలో రా లేదు. సుత్తనిపాతంలోని ఖగ్గవి సుత్త సానలో పచ్చెక బుద్ధుల జ్ఞానయుతమైన వాక్యాలు నిక్షిప్తమై ఉన్నాయి అవి :

1. సర్వజీవుల యెడ దండా (కర్రన్ని) ప్రక్కనపెట్టి, వాటిలో దేనికీ హాని చేయకుండ, స్నేహితులని, పుత్రులని, ఆక్రోశించ కుండ, ఒంటరిగా ఖడ్గ మృగంలా తిరుగు.
2. సాన్నిహిత్యంతో వాత్సల్యం పుడుతుంది. తద్వారా దుఃఖం కలుగు తుంది. వాత్సల్యం నుంచి జనించిన దుఃఖాన్ని గుర్తించి ఒంటరిగా ఖడ్గమృగంలా తిరుగు.
3. మేము సాహచర్య విలువను గుర్తిస్తాం, ఒకడు తనకంటె అధికులతో, సములతో కలవాలి. వారితో తప్పితే, నిందా రహిత జీవితాన్ని గడపాలి. అలా ఒంటరిగా ఖడ్గమృగంలా తిరగాలి.
4. ఇంద్రియసుఖాలు చిత్రాలు, మధురాలు, మోహనాలు. వివిధరీతులు హృదయాన్ని విమోహింప చేస్తాయి. వాటి బెడదను గుర్తించి, ఖడ్గమృగంలా ఒంటరిగా తిరుగు.
5. శీతోష్ణాలు, ఆకలిదప్పులు, గాలి, సూర్యుడు, దోమలు, పాములు వీటిని దాటి, ఖడ్గ మృగం వలె ఒంటరిగా తిరుగు.

6. ప్రతి శబ్దానికి వణకని సింహంలా, వల కన్నాలకు అంటుకోని గాలిలా, బురదతో మురికి కాని పద్మంలా, ఖడ్గమృగంలా ఒంటరిగా తిరుగు.

7. తగిన సమయంలో మైత్రిని, ఉపేక్షను, అనుకంపను, ముక్తిని, ఆస్వాదక సుఖాన్ని, అలవరుచుకొని ప్రపంచంతో ప్రతిరోధితం కాక, ఒంటరిగా ఖడ్గమృగంలా సంచరించు.

  

సమ్మాసంబోధి అంటే, అత్యంతంగా శ్రేష్టతనొందిన, అత్యంత దయామయ, అత్యంతంగా ప్రేమించే, సర్వం తెలిసిన జీవి ఆర్జించిన బోధి. ఈ బోధిని ఆర్జించిన వానిని 'సమ్మా సంబుద్ధ ' అంటారు. శబ్దార్థపరంగా పూర్తిగా స్వయం బోధి అయిన వాడు. అతనిని అలా పిలవ డానికి కారణం, అతడు తనస్వంత ప్రయత్నంతో, జ్ఞానంతో ధమ్మాన్ని గ్రహించడమే కాదు, ఎప్పటికీ అంతం కాని ఈ జనన మరణ వలయం నుంచి సత్యాన్వేషకులను రక్షించ డానికి, వారిని పరిశుద్ధం కావించడానికి ధమ్మ బోధ చేస్తాడు. పచ్చెక బుద్ధుల వలెకాక, కొన్ని వృక్షాలమీద ఒకే ఒక పువ్వు ఎలా వికసిస్తుందో, అలాగే ఒక ప్రత్యేక శకంలో ఒకే ఒక బుద్ధుడు పుడతాడు.

సమ్మాబుద్ధత్వాన్ని పొందాలని ఆశించేవానిని బోధిసత్వుడంటారు. బోధిసత్వుని ఆదర్శం అత్యంత సుందర మైంది, పరిశుద్ధ మైంది. అది ఎంత గొప్పదంటే, ఈ అహం కేంద్ర ప్రపంచంలో ఎప్పుడూ ఎవరూ ఊహించ రానంతటిది. ఎందుకంటె, సేవా, పరిశుద్ధ జీవితం కంటె గొప్పది ఏముంది కనుక?

సంసారంలో పరిభ్రమించే వారు ఇతరులకు సేవ చేసి, పారమార్థిక పరిపూర్ణతను చేర దలచు కొంటే, బోధిసత్వ ఆదర్శాన్ని వారు అనుసరించ వచ్చు. కాని అందరూ బుద్ధత్వాన్ని పొందడానికి ప్రయత్నించి తీరాలనే ఒత్తిడి ఏమీ లేదు. అతి తక్కువలో తక్కువగా చెబితే, బుద్ధత్వాన్ని సాధించడం అసంభవం. ప్రపంచానికి దూరంగా, ప్రశాంతంగా, సుఖంగా, నిష్క్రియాత్మకంగా ఉండే సన్యాస జీవితానికి వ్యతిరేకంగా, బోధిసత్వా దర్శం ప్రతిపాదించ బడిందని చెప్పే విమర్శకులకు పరిశుద్ధ బుద్ధ ధర్మ గురించి ఏమీ తెలియ దను కోవాలి.

ప్రజ్ఞాపారమితకు ఉపవ్యాఖ్యానమైన, తరువాతి సంస్కృత గ్రంథమైన, ''అభిసమయాలంకార - ఆలోక'' ఇలా అంటున్నది:

''అవశేషసహితంగా, రహితంగా శ్రావకులు రెండు రకాల జ్ఞానోదయాన్ని పొంది, (శ్రావకసంబంధ, ప్రత్యేక బుద్ధ) భయ మనస్కులుగా మిగిలి పోయారు. ఎందుకంటే వారు మహాకరుణ, ఉన్నత జ్ఞానాలకు వంచితులయ్యారు (ఉరు కరుణా ప్రజ్ఞా వైకల్యేన). గత జీవ శక్తితో ఉత్పాదితమైన జీవ శక్తిని ఉచ్ఛేదించడం ద్వారా నిర్వాణం సంభవ మవుతుంది. కాని వాస్తవానికి (హీన యాన భిక్కులు) 'ఆరిపోయిన దీపంతో సరిపోలిన నిర్వాణం' లాంటి ఆభాసిక నిర్వాణాన్ని మాత్రమే పొందుతున్నారు. మూడు అస్తిత్వలోకాలలో జన్మలు నిలిచి పోయాయి. కాని వారి ఇహ జన్మ (అస్తిత్వం) అంతమై నప్పుడు, అర్హంతలు అత్యంత శుద్ధ అప్రభావిత బుద్ధచర్య లోకంలో (అనాస్రవధాతు), సతత సమాధిస్థితిలో, పద్మ పత్రాలలో (పద్మపుటేషు జాయంతే) ఉంటున్నారు. ఆ తరవాత సూర్యుని బోలిన బుద్ధ అమితాభ ఇంకా మిగతా బుద్ధులు వారిని అవిద్య నుంచి మేల్కొలుపుతారు. అంతట 'ఉన్నతబోధి' కోసం సృజనాత్మకంగా ప్రయత్నిస్తారు. విముక్త స్థితి లోనే ఉన్నా, వారు నరకంలోకి అవరోహిస్తున్నట్లు (ఈ దృగ్విషయిక ప్రపంచంలో) గా నటిస్తారు. క్రమంగా బోధిని పొందడానికి కావలసిన అన్ని కారకాలు సంచితమైన తరవాత, వీరు ప్రాణులకు (అంటే బుద్ధులకు) గురువు లవుతారు''.

ఇది బుద్ధుని మౌలిక బోధలకు సంబంధంలేని పూర్తిగా కల్పిత దృక్పథం.

అర్హంతత్వం స్వార్థపర మైందని ఇతరులను పైకి తీసుకు రావడానికి అందరూ బుద్ధత్వాన్ని సాధించాలని వాదిస్తున్నారు. బాగుంది. ఎవరైన ఇలా అడగవచ్చు: ''బుద్ధత్వాన్ని పొందడంలో లక్ష్యం ఏమిటి? ఇతరులను అర్హంతలుగా చేసి వారిని పైకి తీసుకు రావ డమేనా? అలాగే అయితే, తార్కికంగా కొసకంట లాగితే, బుద్ధత్వం గూడ స్వార్థాన్ని పెంచుతుంది. మరి ఇది అసంబద్ధం.

మూడు ఆదర్శాలలోకి బుద్ధత్వం అన్నింటి కంటె, మంచిది, శ్రేష్ఠమైంది. కాని అందరూ ఉన్నత లక్ష్యాన్ని సాధించ లేరు. విజ్ఞాన శాస్త్ర వేత్తలందరూ ఐన్స్టైయిన్లు, న్యూటన్‌లు కాలేరు. ఎవరెవరి శక్త్యానుసారం ప్రపంచానికి సహాయ పడే తక్కువస్థాయి విజ్ఞాన శాస్త్ర వేత్తలు గూడ ఉండాలి.

పాళి పదం అయిన ''బోధి సత్త'' బోధి (అంటే ''జ్ఞానం'' లేదా ''జ్ఞానాగమం'') సత్త (అంటే ''అంకితమైన'' లేదా ''ఏకాగ్రమైన'') అనేపదాల సంయోగం. అందుకని బోధిసత్త్వుడంటే, జ్ఞానం మీద, జ్ఞానాగమనం మీద ఏకాగ్రత కలిగిన అంకితమైన వాడు అని అర్థం. సంస్కృత రూపం 'బోధి శక్త' కావాలి. కాని ప్రాచుర్యం లోకి వచ్చిన పదం బోధిసత్త్వ. దీని కర్థం జ్ఞాన జీవి (wisidom being) లేదా బుద్ధుడు కావాలని ఆశించే జీవి.

జ్ఞానాగమనం కోసం ప్రయత్నించే ఎవనికైన ఈ పదం సామాన్యంగా అన్వయించ బడుతుంది. కాని ఖచ్చితంగా చెప్పాలంటే. ఈ పదాన్ని 'ఉన్నత జ్ఞానులు'[1] కానున్న వారికే అన్వయించాలి.

ఒక అర్థంలో అందరూ బీజరూపక బుద్ధులే, ఎందుకంటే బుద్ధత్వం అనేది ఏ ప్రత్యేకంగానో అనుగ్రహించిన ప్రత్యేక వ్యక్తుల హక్కు కాదు.

మనందరిలోను అభివృద్ధి గావించ బడవలసిన, నిద్రాణ దివ్య విస్ఫులింగం ఉందని బౌద్ధులు విశ్వసించరు. ఎందుకంటె వారు సృష్టి కర్తను కాదంటారు. కాని మనిషి అంతస్స్పర్థ సంభావ్యతలను, సృజనాత్మక శక్తిని వారు గుర్తిస్తారు.

అనుభవాలను సంచితం చేసుకొంటూ, ఒక జన్మనుంచి మరోజన్మకు వలస పోయే శాశ్వతాత్మను బౌద్ధం నిరాకరిస్తుంది. మానవుని సారమని పిలిచే, అపరివర్తనీయ ఆత్మకు బదులుగా, అది గతిశీల జీవన ప్రవాహాన్ని ప్రతిపాదిస్తుంది. అయితే ఈ ప్రవాహప్రక్రియలో తాదాత్మ్యత ఉంటుంది.

ఏ మనిషి అయినా ఆశించ దగిన, అత్యంత ఉన్నత పరిపూర్ణతా స్థితి అయిన బుద్ధత్వాన్ని, తన స్వంత సంకల్ప బలంతో, జ్ఞానంతో, ప్రేమతో ఒక మనిషిగా రాకుమారుడు సిద్ధార్థుడు సాధించాడు. అక్కడకు (బుద్ధత్వానికి) చేర్చగల ఒకే ఒక మార్గాన్ని అతడు మానవాళికి బహిర్గతం చేశాడు. బౌద్ధం యొక్క ఒకే ఒక ప్రత్యేక లక్షణం ఏమిటంటే, తగిన పరిశ్రమ చేస్తే, ఎవరైన గురు స్థితిని ఆశించ వచ్చు. బుద్ధత్వంపై తనదే గుత్తాధిపత్యమని బుద్ధుడు ఎప్పుడూ చెప్పుకోలేదు. అది ఒక రకం పరిణామ ప్రక్రియ కాదు. ఎవరి సహాయం లేకుండ ఎవడైన తనకై తాను, తగు ప్రయత్నంతో సాధించ వచ్చు. జనాన్ని పాపులని బుద్ధుడు ఎప్పుడూ చెప్ప లేదు. అంతే కాదు వారంతా పుట్టుకతో పరిశుద్ధులని చెబుతూ వారిని ప్రోత్సాహ పరుస్తాడు.

అధికృత బుద్ధత్వ స్థితి తన ఒక్కడిదే నని చెప్పి, ఇతరులలో న్యూనతా భావాన్ని నాటి అనుయాయులను నిరుత్సాహ పరచడానికి బదులు, తనకు వలె ఎదగాలని, తనను మించాలని వారిని ఉత్తేజ పరుస్తాడు.

బోధి సత్త్వుడు బౌద్ధుడు అయి తీరాల్సిన అవసరం లేదు. వారికి వారి ఉదాత్తాశయాలు తెలియ నప్పటికి, నేటి బౌద్ధులలో సర్వదా ప్రేమించే బోధిసత్త్వులను చూడ వచ్చు. ఇతర మతస్థులలో గూడ బోధిసత్త్వులుండ వచ్చు.

**మూడురకాల బోధి సత్త్వులు**

బౌద్ధం ప్రకారం మూడురకాల బోధి సత్తులున్నారు. వారు : బుద్ధిపర బోధి సత్త్వులు

(పజ్ఞాధికులు) భక్తి పర బోధిసత్త్వులు (సద్ధాధికులు) శక్తిమంతమైన బోధి సత్త్వులు (విరియాధికులు). ఈ ముగ్గురు హిందువుల జ్ఞాన, భక్తి, కర్మయోగులకు సమ మవుతారు.

బుద్ధి పరబోధిసత్త్వులు తక్కువ భక్తిని, ఎక్కువశక్తిని ప్రదర్శిస్తారు; భక్తి పర బోధిసత్త్వులు తక్కువ శక్తి మంతులు, ఎక్కువ బుద్ధిపరులు; శక్తి పర బోధిసత్త్వులు తక్కువ బుద్ధి పరులు, అధిక భక్తిపరులు. ఈ మూడు లక్షణాలు ఎప్పుడూ ఏ ఒక్కనిలోను సమరసంలో ఉండవు. బుద్ధగౌతముని బౌద్ధిక వర్గంలో చెబుతారు. బౌద్ధ గ్రంథాల ప్రకారం బుద్ధి పరులు బుద్ధత్వాన్ని త్వరితంగా, కొద్దికాలంలోనే పొందుతారు. భక్తి పరులుకు ఎక్కువకాలం, శక్తిమంతులకు ఇంకా ఎక్కువ కాలం పడుతుంది.

బుద్ధిపర బోధిసత్త్వులు, జ్ఞానం మీద, ధ్యానం మీద కేంద్రీకరిస్తారు. బాహ్యరూపాలైన ప్రణతి ప్రణామాలను పట్టించు కోరు. వారికి హేతువు ముఖ్యం. అంధ విశ్వాసం మీద ఆధార పడి దేనిని అంగీకరించరు. వారు తమను తాము అర్పించుకోరు. ఏ గ్రంథానికి, ఏ వ్యక్తికి వారు బానిసలు కారు. వారు ఏకాంత ధ్యానాన్ని కోరు కొంటారు. నిశ్శబ్ద, శక్తిమంతమైన శాంతి వ్యాపింప జేసే వారి ఆలోచనలు వారి ఏకాంత ఆరామం నుంచి వికిరణం చెంది బాధాతప్త మానవాళికి ధార్మిక సహాయాన్ని అంద జేస్తాయి.

శ్రద్ధ, శ్రద్ధను తోడు చేసుకొని వారు తమ లక్ష్యాన్ని సాధిస్తారు. అన్ని రకాల శ్రద్ధాంజలిలో బోధిసత్త్వులు నిశిత ఆసక్తి కనపరుస్తారు. నమ్మదగిన విశ్వాసం, భక్తి పర బోధిసత్త్వులలో ప్రబలంగా ఉంటుంది. బుద్ధ ప్రతిమ వారికి ప్రబోధకం.

బౌద్ధులు ప్రతిమలను పూజించరని గుర్తుంచు కోవాలి. అది దేనిని ప్రతీకీకరిస్తుందో దానిని ప్రణుతిస్తారు. బుద్ధుని (ప్రతిమ మీద కాక) గుణాలను పర్యాలోచిస్తారు. బుద్ధుని గురించి ఆలోచించే కొలదీ, ఎక్కువగా అతనిని ప్రేమిస్తారు. ఈకారణం చేతనే బౌద్ధం బాహ్య ప్రణుతి రూపాలను నిరాకరించదు. కాని వారు నిస్సందేహంగా ఆచరణను మెచ్చుకోదగిన దానిగా, ఉన్నతమైనదిగా గుర్తిస్తారు. సంతృప్తికరమైన ఫలితాలు రావాలంటే రసహీన ప్రజ్ఞ (dry intellect)కు శ్రద్ధ (విశ్వాసం) ను జోడించాలి. అతి విశ్వాసం గూడ మంచిది కాదు. జ్ఞానంతో దానికి అడ్డుకట్ట వేయాలి.

శక్తిమంత బోధిసత్త్వులు ఎప్పుడూ ఇతరులకు సేవ చేయాలని చూస్తారు. క్రియాశీలక సేవ కంటె వారికి ఆనందాన్ని చ్చేది మరేదీ లేదు. వారికి పనే సంతోషం. సంతోషమే పని. వారు క్రియాశీలంగా లేక పోతే వారికి ఆనందమే ఉండదు. శ్రీలంకకు చెందిన రాజు సంఘ బోధి చెప్పినట్లుగా, ''ఈ రక్తమాంసాలు శరీరాన్ని ఇతరులు సుఖసంతోషాల కోసమే ధరిస్తారు.'' వారు వారి కోసమే కాక ఇతరుల కోసమూ జీవిస్తారు.

ఈ నిస్వార్థ సేవా స్ఫూర్తి బౌద్ధులందరి ముఖ్యలక్షణం. మొక్కవోని శక్తితో అవిరళంగా వారు పనిచేస్తారు. కాని బానిసల్లా కాక యజమానుల్లా పనిచేస్తారు. కీర్తి ప్రతిష్టలకోసం వారు ఆక్రోశించరు. వారికి సేవ తప్ప మరొకటి పట్టదు. వారి నిస్వార్థ సేవాకార్యాన్ని ఇతరులు గుర్తించారా లేదా అనే దానితో వారికి నిమిత్తం లేదు. నిందా ప్రశంసలకు వారు అతీతులు.

ఇతరులకు చేసే నిస్వార్థ సేవలో వారు తమను తాము మరిచి పోతారు. ఇతర తోటి జీవిని అది కాపాడు తుందంటే వారు తమ ప్రాణాన్నైనా త్యాగం చేయ డానికి వెన కాడరు.

ఇతరుల సేవలో తమను తాము మరిచి పోయే బోధిసత్త్వులు కరుణ, మైత్రిలను అసాధారణ స్థాయిలో ప్రదర్శించాలి.

బోధిసత్త్వుడు ప్రపంచ యోగక్షేమాలను కోరతాడు. తల్లి తప్పక బిడ్డను ప్రేమించినట్లు, అతడు జీవు లందరిని ప్రేమిస్తాడు. అతడు అందరితో తాదాత్మ్య మవుతాడు. అందరూ తన సోదర సోదరీమణులని అనుకోవడం కంటె ఇంక ఏదీ అతనికి సంతోషాన్ని ఇవ్వదు. జీవులన్నింటికి అతడు తల్లి, తండ్రి, సోదరుడు, స్నేహితుడు, గురువు.

''తాను ఇతరు లందరితో సమానమే, ఇతరులు తనకు ప్రత్యామ్నాయులే, అని గుర్తించ డంలోనే బోధిసత్త్వుని కరుణ ఉంది.'' అలా అనుకొన్నప్పుడు ''నేను'' - భావనను కోల్పోయి, ఇతరులకు తనకు, మధ్యతేడాను చూడడు. అతడు చెడుకు మంచిని తిరిగి ఇస్తాడు. తన కెగ్గు తల పెట్టిన వారికి అడగకనే సహాయం చేస్తాడు. ఎందుకంటే అతనికి తెలుసు : ''మత గురువు బలం అతని సహనమే'', అని.

''తిట్టినా తిట్టడు; కొట్టినా కొట్టడు; బాధించిన బాధించడు. పృథ్వీమతల్లి నిశ్శబ్దంగా తనకు చేసిన దానినంతా ఎలా సహిస్తుందో, అలాగే అతని క్షమాగుణం ఎప్పుడూ విఫలం కాదు.''

**పాదసూచికలు :**

1. బుద్ధ జాతక కథలలో రైస్ డేవిడ్స్ రాస్తాడు (P.XXXIV) : ''బర్లామ్, జోసఫ్ అనే మత పర కాల్పనిక కథా ఉంది. ఆ కథ భారత దేశ రాకుమారుని బర్లామ్ పరివర్తించగా, అతడు సన్యాసి అయిన సంగతిని వివరిస్తుంది. ఈ కథ బుద్ధుని జీవితం నుంచి గ్రహించా రంటే పాఠకునికి ఆశ్చర్యం వేస్తుంది. జోసఫ్ మరోపేరుతో ఉన్నబుద్ధుడే. జోసఫ్ లేదా జోసఫాట్ అనే పదం బోధిసత్త్వుని పదం, అపభ్రంశ రూపమే.'' '' అరబ్బీభాషలో జోసఫ్ (Josaph) యుదసత్స (Yudasts) అవుతుంది; ఇది, ఆరబ్బీ అక్షరాలు Y,B, ల మధ్య తికమక కారణంగా, బోధిసత్‌కు బదులుగా వచ్చింది. (See *Encyclopaedia of Religion and Ethics,* Vol. 7, P. 567).

నలభై ఒకటో ప్రకరణం

# పారమీ

## పారమితలు

''పరహితం కోసం పాటుపడు''

– సుత్తనిపాత

పది పారమార్థిక విలువ లున్నాయి. వాటిని పాళీభాషలో, ''పారమా'' అంటారు. వీటిని సమ్మాసంబుద్ధత్వాన్ని పొందడానికి ప్రతి బోధిసత్త్వుడు అభ్యాసం చెయ్యాలి. అవి: దాన, శీల, పరిత్యాగం (నిక్కామ) ప్రజ్ఞ (wisidom), వీర్య (విరియ) క్షాంతి (సహనం) సచ్చ (సత్యం), అధిట్ఠాన (స్థిరనిశ్చయం), మైత్రి (మెత్తా) ఉపేక్ష (ఉపెఖ్ఖ)లు.

'చరియా పిటక' వ్యాఖ్యానం ప్రకారం, పారమితలు కరుణతో పెంపొందించుకొనే గుణాలు. అవి హేతు నిర్దేశితాలు. స్వార్థ ప్రేరణలతో ప్రభావితం కానివి. దుష్ట విశ్వాసంతో కళంకితం కానివి. అహంకా రానుభూతులతో ప్రభావితం కానివి. పారమితలు అటు వంటివి.

సర్వ జీవుల యెడ కేవలం కరుణతో ప్రభావిత మైనవి కనుక బోధిసత్త్వుని చర్యలు పూర్తిగా నిస్వార్థాలు. అతని ప్రేమ అపారం, అతని కరుణ అనంతం. అవి ఎంతటి ప్రేమ, కరుణ లంటే, అతని అసంఖ్యాక జీవిత శ్రేణు లంత. పేదవారి, అధోజనుల గౌరవం ఇనుమడించ డానికి, అవసరమైన వారికి అన్నివిధాల సహాయ పడ డానికి, దుఃఖాన్ని తగ్గించ డానికి అతడు కృషి చేస్తాడు.

దురదృష్టవంతులైన తన సోదర సోదరీమణులు దుఃఖంలో కూరుకు పోయి ఉండగా, అతడు స్వీయ లాలసలో మునిగి ఆనందం పొంద లేడు. దుఃఖాన్ని తొలగించ డానికి మన కత్యంత ప్రీతి పాత్రమైన దానిని దేనినీ, అతని ప్రాణంతో సహా, త్యజించ డానికి వెన కాడడు. వ్యాఘ్రజాతక కథలో చెప్పి నట్లుగా, సర్వజీవుల హితం కోసం, సుఖం కోసం, హృదయ పూర్వక కరుణతో, హేతు నిర్దేశంతోనే, పని చేస్తాడు. బుద్ధికి (తలకు) దయకు (గుండెకు) సంబంధించిన అన్ని ఆవశ్యక గుణాలు నిండుగా అతనిలో కని పిస్తాయి. ఈ గుణాలను అతడు ప్రపంచ సేవకు అంకితం చేస్తాడు.

ఇతరులకు సేవ చేయడంలో, బోధిసత్త్వునికి అధికారం, ఆస్తిపాస్తుల మీద మమకారం ఉండదు. అతనికి తెలుసు: అర్హునికి అయాచితంగానే కీర్తి వస్తుంది. అలాంటి దాని కోసం తా నెందుకు పని చేయాలి? అతని ప్రేరకాలన్నీ పూర్తిగా పర హితాలే. అతని నిష్కామ కర్మలలో స్వార్థానికి చోటు లేదు.

''మామూలు వాళ్ళను, సన్యాసులను ఇలా అనుకోనీయండి: 'ఈ పని నేను చేశాను, పని చిన్నదైనా పెద్దదైనా వారిని నా దగ్గరకే రానీయండి'. ఇది బుద్ధిమాలిన వాని కోరిక. వాని అహంకారం, వాంఛలు అధికమవుతాయి'', ధమ్మపద అంటుంది. (V 74) అటువంటి సంకుచిత, స్వార్థచింతలు బోధిసత్త్వుని మనస్సులో ప్రవేశించవు.

**దాన**

దానం లేదా త్యాగం ప్రథమ పారమీ. దాతకు అది రెండు రకాల ప్రయోజనాన్ని ఇస్తుంది. స్వార్థ పరత యొక్క అధార్మిక ఆలోచనలనుంచి విముక్తి కలిగిస్తుంది. అదే సమయంలో శుద్ధ నిస్వార్థ ఆలోచనలను పెంపొందిస్తుంది. ''అది దాతను, గ్రహీతను ఇద్దరిని ఆశీర్వదిస్తుంది''

గ్రహీత నిజంగా అవసరంలో ఉన్నాడా లేడా అని చూడడు బోధి సత్త్వుడు. ఎందుకంటే, దానా చరణలో అతని లక్ష్యం, తనలో నిద్రాణంగా ఉన్న తృష్ణను తీసి వేయడమే. సేవ చేయడంలో ఉన్న ఆనందం, దానితో పాటు లభించే సంతోషం, దుఃఖోపశమనం, ఈ మూడు దానం వల్ల చే కూరే అదనపు లాభాలు.

అసాధారణ దానంతోపాటు ప్రేమను పంచడంలో ఒకరికి మరొకరికి మధ్య విచక్షణ చూపడు. కాని ఈ దానంలో ఉచిత విచక్షణను ఉపయోగిస్తాడు. ఉదాహరణకు, ఒక త్రాగుబోతుకు సహాయం చేయ వలసి వస్తే, అతడు ఆ సహాయాన్ని దుర్వినియోగం చేస్తాడని తెలిస్తే, బోధిసత్త్వుడు తప్పకుండా అటువంటి దానిని చేయ నిరాకరిస్తాడు, ఎందుకంటే అపాత్రదానం పారమీ లో భాగం కాదు.

ఒక మంచి కారణానికి ఎవరైన అతని సహాయం కోరితే, అప్పుడు తెచ్చిపెట్టుకొన్న ''గౌరవాకృతి''ని ప్రదర్శించక, లేదా లేని పోని డాంబికాలు పోక, ఆ సహాయం చేయ డానికి లభించిన అవకాశాన్ని జారి పోనీక, ఇష్టపూర్తిగా, వినమ్రతతో, సంభావ్యమైన దానినంతా చేస్తాడు. అయినా అతడు దానిని తాను మరొకనికి చేసిన అనుగ్రహంగా తన ఖాతాలో జమ వేసు కోడు సరికదా తాను చేసిన సేవలకు ఆ గ్రహీత ఋణపడి ఉన్నాడని భావించడు. అతనికున్న ఆసక్తి ఆ ఉత్తమ కార్యం మీదే. దాని నుంచీ నిష్పన్న మయ్యే మరి

దేని మీద అతనికి ఆసక్తి ఉండదు. ప్రతిఫలంగా ఏ పారితోషికాన్ని ఆశించడు, తద్వారా ఖ్యాతి పెరగాలని అసలే కోరడు.

'బోధిసత్త్వుడు ఎప్పుడు దానం చేయ డానికి సిద్ధంగానే ఉన్నా, తను మాత్రం ఎవరిని ఏమీ అడగడు. 'బ్రహ్మదత్తజాతక' (323) కథలో ఇలా ఉంది : ఒకసారి ఒక బోధిసత్త్వుడు ఒక రాజుకు చెందిన వనంలో సన్యాసి జీవితాన్ని గడుపు తున్నాడు. రాజు రోజూ వచ్చి అతని దర్శనం చేసుకొని అతని అవసరాలు చూస్తుంటాడు. అయినా అతడు పండ్రెండు సుదీర్ఘ, సంవత్సరాలలో, అవసరమైనా గూడ, ఏనాడూ ఒక చెప్పుల జతను ఇమ్మని రాజును అడగ లేక పోయాడు. మరి చెప్పుల జత చాల అల్ప విషయమే.

అతని అపూర్వ నమ్రతా దృక్పధాన్ని గురించి ప్రశ్నించి నప్పుడు అతడు ఇలా రాజుకు సమాధానం చెప్పాడు:

> ''పాంఛాల ప్రభూ, ఇతరులకోసం ఏడవా లను కొనే వారు సంతోషులు, ఇతరుల కోసం ఏడవ నిరాకరించే వారు తిరిగి మళ్ళీ ఏడవాల్సి ఉంటుంది''

అతడు ఇతరులకు, వారి కుల గోత్రాలు, రంగు చూడ కుండా, తనకు తిరిగి ఏదైనా దక్కాలని కోరుకో కుండా, ఎంతో ఇస్తాడు. ఎడ్వర్డ్ డైయర్ వర్ణించిన 'పరిపూర్ణ తృప్తి' అతని మానసిక లక్షణం:

> ''కొంతమందికి ఎంతో ఉంటుంది. అయినా ఇంకా ఇంకా కావాలని కోరతారు.
> నాకేమీ లేదు, అయినా నే నేమీ కోరను,
> వారికి అంత ఉన్నా, వారు పేద వారే,
> నాకేమీ లేక పోయినా నేను ధనికుడనే''.

'కణ్హ జాతకం'లో (No. 440) సక్క, ఆదర్శవంతమైన గుణ శోభితమైన బోధిసత్త్వుని జీవితాన్ని చూసి, అతని దగ్గరకు వెళ్ళి, అతనికోవరం ఇచ్చి, కోరుకో మన్నాడు. దయా పూరితమైన సక్కని విన్నపా న్ననుసరించి అతడు ఈ క్రింది వాటిని కోరు కొన్నాడు:

1. నా పొరుగు వాని మీద నాకు అసూయ, క్రోధాలు లేకుండు గాక !
2. నా పొరుగు వాని ఆస్తిపాస్తులు కోరకుందును గాక !
3. ఇతరుల యెడ వైయక్తిక వాత్సల్యాన్ని పెంచుకొన కుందును గాక !
4. నేను ఉపేక్షను ప్రదర్శింతును గాక!

భాగా నిరుత్సాహ పడిన సక్క, అతని నిష్కామ ప్రదర్శనకు సంతసించి, మరోవరం కోరు కొమ్మని, అతని బ్రతిమి లాడాడు. అతడు ఇలా సమాధానం చెప్పాడు:

''నేను ఎక్కడ అరణ్యాలలో ఉన్నా
నేను ఎక్కడ ఏకాంతంగా ఉన్నా
నా శాంతిని ఏరుగ్మత పాడు చేయ కుండు గాక,
లేదా నా ధ్యానాన్ని చెరప కుండు గాక''

దీనిని విని సక్క ఇలా తల పోశాడు : ''జ్ఞాని అయినవాడు కణ్ణ. వరం కోరు కోవడంలో జీవికకు సంబంధించి దేనిని కోరుకో లేదు. అతడు కోరుకొన్న దంతా సన్యాస జీవితానికి సంబంధించిందే''

అయినా సక్క అన్నాడు, మరో ''వరం కోరుకొండ''ని

బోధిసత్త్వుడు ఇలా ప్రతిస్పందించాడు :

''ఓ, సక్క, మహాప్రభూ, నాయీ అభీష్టాన్ని ప్రకటించండి: నా కోసం ఏ జీవికి, ఎక్కడ, మనస్సుకు గాని, శరీరానికి గాని, హాని కలిగించ రాదు, ఇది నా ప్రార్ధన ఓ సక్క!''.

బోధిసత్త్వుడు ఈ ఔదార్య గుణాన్ని ఎంతవరకు ప్రదర్శిస్తాడంటే, అతడు తనకున్న ఆస్తిపాస్తులనే కాదు, ఇంకా ఇతర విలువైన వస్తువులనే కాదు, అతని రాజ్యాన్ని, అవయవాలను, కావాలంటే ఇంకా అతని భార్యా బిడ్డలను గూడ ఇచ్చివేస్తాడు; మానవాళికి మేలు జరుగు తుందను కొంటే అతడు తన ప్రాణాన్నే ఇచ్చి వేస్తాడు.

వెస్సంతర జాతక కథ (No 54), వెస్సంతరుడు ఎనిమిదేళ్ళ బాలుడుగా ఉన్నప్పుడు, ''ఎవరికైనా నా గుండె కావాలంటే నా రొమ్మును చీల్చి దానిని బయటికి తీసి ఇస్తాను; ఎవరైనా నా కళ్ళు కావాలంటే, వాటిని పీకి అతనికి ఇచ్చి వేస్తాను. నా మాంసం కావా లంటే, అతనికి కావలసి నంత కోసి ఇస్తాను,'' అని చెప్పిన విషయాలను తెలియ జేస్తుంది.

వ్యాఘ్రి జాతక కథ, ఇతరుల సుఖ సంతోషాల కోసం ఇష్ట పూర్తిగా, సంతోషంగా తన జీవితాన్ని త్యాగం చేసిన సంఘటనను వివరిస్తుంది. జాతక మాలలో ఆ కథ ఇలా నడుస్తుంది:

''ఒకసారి బోధిసత్త్వుడు, తన శిష్యునితో గూడ అరణ్యం గుండా వెళ్తు న్నప్పుడు, ఒక ఆడపులిని, దాని పిల్లలతో సహా చూశాడు. అవి ఆకలితో మరణ మాసన్నమైన దశలో ఉన్నాయి. అతడు ఆ దృశ్యానికి చలించి పోయి, వాటి కేదైనా ఆహారం తెచ్చి పెట్ట వలసిందని, అతని శిష్యుని కోరాడు. శిష్యుని అవతలికి పంపడానికి ఇదొక మిష మాత్రమే. ఎందు కంటే బోధిసత్త్వుడు ఇలా అనుకొన్నాడు:

''నా శరీరం ఇక్కడ ఉండగా మరొకరి మాంసం కోసం నే నెందుకు వెదకాలి? ఇతరమాంసం దొరకడ మనేది యాదృచ్ఛికం. అదీగాక ఇది నాకొచ్చిన ఈ విధి నిర్వహణా వకాశాన్ని చేజార్చు కోవడం అవుతుంది.

''ఈ శరీరం మలినం, దుఃఖమూలం. మరొకరి ప్రయోజనం కోసం దీనిని ఖర్చు చేయడంలో ఆనందం పొందని వాడు జ్ఞాన హీనుడు. ఇతరుల బాధను ఖాతరు చేయక పోవ డానిక రెండు విషయా లున్నాయి: తన సుఖ సంతోషాలకే అంటి పెట్టుకొని ఉండడం, సహాయ పడే శక్తి లేక పోవడం. కాని అవతలి వాడు బాధ పడు తుంటే నాకు సహాయ పడ గలిగిన శక్తి ఉన్నంత వరకు నేను ఎందుకు ఉదాసీనం వహించాలి?

''నేను నా ఈ శరీరాన్ని ఈకొండ కోన నుంచి జార విడవడం ద్వారా దానిని త్యాగం చేస్తాను. అది పులి ఆకలి తీరుస్తుంది. ఆ విధంగా అది, దాని పిల్లలు దాని కోరల నుంచి చావ కుండ బయట పడతాయి.

''ఇంకా నేను ఇలా చేయడం ద్వారా, ప్రపంచానికి సేవ చేయాలను కొనే వారికి మార్గదర్శి నవుతాను. బలహీనులకు ఉత్సాహం కలిగిస్తాను. దానం అంటే అర్థం తెలిసిన వారికి సంతోషం కలిగిస్తాను. గుణవంతులను ఉత్తేజ పరుస్తాను. అంతిమంగా, నా శరీర భాగాలతో ఇతరులకు మేలు చే కూర్చే అదృష్టం ఎప్పుడు లభిస్తుందా అని ఎదురు చూసిన నాకు, ఇప్పుడా అవకాశం అనతి కాలంలోనే లభిస్తున్నది. సమ్మాసంబుద్ధత (పరమబోధిని) పొందుతాను'''.

ఈ విధంగా తనలోతాను అనుకొని, తన జీవితాన్ని ఆ నిస్సహాయ జీవుల సంక్షేమం కోసం, కొండ కోన నుంచి జారి, త్యాగం చేశాడు. ఈ ఆసక్తికర, దయనీయ కథ నెవరి (నేపాలి) పాఠం ఇలా ఉంది:

''అతి ప్రాచీన కాలంలో ఒక భక్తి పరుడు, శక్తిమంతుడు అయిన మహారథ అనే పేరుగల రాజు ఉండే వాడు. అతనికి ముగ్గురు పుత్రులున్నారు. వారి పేళ్లు మహాప్రషాద, మహాదేవ, మహా సత్త్వలు. ముగ్గురూ మంచివారు, విధేయులు.

ఆహ్లాదకరమైన ఒక రోజున రాజు తన ముగ్గురు తనయులతో, పరివారంతో, ఒక అరణ్యవనానికి విహారానికి వెళ్ళారు. ఆ వనంలోని చెట్ల పూలనుచూసి మంత్రముగ్ధులై, ఆ ముగ్గురు రాకుమారులు అరణ్యం లోపలకు వెళ్ళి పోయారు. వారు అక్కడ లేక పోవడం గమనించిన సేవకులు, ఆ విషయాన్ని రాజుకు తెలియ జేసారు. వారిని వెతక వలసిందని రాజు తన మంత్రులను ఆదేశించి, తాను రాజ ప్రాసాదానికి తిరిగి వెళ్ళాడు.

అరణ్యంలో తిరుగుతూ, తిరుగుతూ రాకుమారులు పర్వతాగ్రాన్ని చేరుకొన్నారు. అక్కడ నుంచి, వారిలో పెద్ద వాడు, ఆకలితో దాదాపుగా చచ్చి పోబోతున్న ఒక పులిని, దాని ఐదు పిల్లలతో సహా, చూశాడు. అది ప్రసవించిన అనంతరం ఏడు రోజుల నుంచి దానికి ఆహారం లేదు. పిల్లలేమో పాలు తాగ డానికి తల్లిని చేరాయి. కాని వాటి ఆకలిని తీర్చ డానికి దాని దగ్గర ఏమీ లేదు. ఆకలితో మాడుతున్న ఆ పులి తన పిల్లలనే కబళించ సిద్ధ మవు తున్నది. తల్లి తన పిల్లలను తినడం అసహజం.

ఈ దయనీయ దృశ్యాన్ని మొదట చూసింది వారిలో పెద్దవాడు. పులిని తన సోదరులకు చూపి, అతడు అన్నాడు: ''చూడండి ఆదయనీయ దృశ్యాన్ని, ఓ తమ్ములారా! ఆ ఆకలి గొన్న పులి తన బిడ్డలనే తినాలని చూస్తున్నది. ఎంత మంద భాగ్యం, వాటి పరిస్థితి!''

''వాటి ముఖ్యాహారం ఏమిటి సోదరా?'' మహాసత్త్వుడు ప్రశ్నించాడు. ''పులుల, సింహాల ముఖ్యాహారం రక్తమాంసాలు'', మహాప్రషాద చెప్పాడు.

''పులి చాల బల హీనంగా ఉన్నట్లుంది. దీనిని బట్టి అది కొన్ని రోజులుగా ఆహారం లే కుండ ఉన్నట్లుంది. ఎవడైన తన శరీరాన్ని వాటి కోసం త్యాగం చేస్తే ఎంత బాగుంటుంది!''

''కాని ఎవరు అటువంటి త్యాగం చేయడానికి ఇష్ట పడతాడు!'' మహాదేవుడు అన్నాడు.

''నిజంగా, అలా ఎవరూ చేయ లేరు,'' మహాప్రషాద అన్నాడు.

''నాకు తెలివి లేదు. పరుల కోసం తమ శరీరాలను, అజ్ఞులైన మన లాంటి వారు, త్యాగం చేయ లేరు. కాని ఇష్ట పూర్వకంగా ఆ పని చేయ డానికి అపార కరుణామయులైన నిస్వార్థులు కొందరు ఉండ వచ్చు.'' అని మహాసత్త్వుడు దయా పూరిత కంఠంతో అన్నాడు.

వారిలో వారు ఈ విధంగా చర్చించు కొని, చివరి సారిగా అ పులిని చూసి అక్కడ నుంచి వెళ్ళి పోయారు.

మహాసత్త్వుడు తనలోతాను ఇలా తల పోశాడు:

''ఆకలి గొన్న ఈ పులికోసం, క్షణ భంగురమైన ఈ శరీరాన్ని నేను త్యాగం చేసి తీరాలి. మలినమీ దేహం. జరా మరణ మీదేహం. ఒకడు దానిని అలంక రించ వచ్చు. దానికి అత్తరు పూయ వచ్చు, కాని అది త్వరలోనే దుర్వాసన కొట్టి, నశిస్తుంది''.

ఈ విధంగా మనస్సులో అనుకొని, తన సోదరులను ముందుకు నడవ వలసిందని, ఏదో ఒక సాకు చెప్పి, పంపించాడు.

పులి ఉన్నచోటుకు అతడు వెళ్ళాడు. తన దుస్తులను, హారాలను ఒక చెట్టు కొమ్మకు తగిలించి, మళ్ళీ ఇలా ఆలోచించాడు :

''ఇతరుల క్షేమం కోసం నేను పని చేయాలి. సర్వ జీవుల యెడ కరుణను చూపాలి. మన సహాయాన్ని ఆశించే వారికి సేవ చేయడం మన ముఖ్య ధర్మం. ఈ మలిన దేహాన్ని నేను త్యాగం చేసి, ఈ పులిని, పిల్లల్ని కాపాడతాను. ఈ మంచి కార్యం వల్ల నేను సమ్యక్ సంబుద్ధత్వాన్ని పొంద వచ్చు. సర్వజీవులను సంసార సముద్రం నుంచి కాపాడ వచ్చు! సర్వ జీవులు సుఖసంతోషాలతో ఉండుగాక!''

దయతో చలించిన వాడై నిస్వార్థ సేవతో ఉత్తేజితుడై కొండపై నుంచి పులి దగ్గరకు దూకాడు.

ఆ దూకడంతో అతని ప్రాణాలు వెంటనే పో లేదు. పులి స్వభావరీత్యా కనికరం లేనిదైనా, బోధిసత్త్వుని కనికరించి, అతని శరీరాన్ని కనీసం తాక లేదు.

బోధిసత్త్వుడు మరోవిధంగా భావించాడు: ''పాపం దానికి నన్ను తినే శక్తి గూడ లేదేమో!'' అందుకని అతడు ఆయుధం కోసం వెతికాడు. ఒక బొంగు బద్ద దొరికింది. పులి వద్దకు చేరు కొని, ఆ బొంగు బద్దతో మెడను కోసి కొని, నేల మీద పడి, రక్తం మడుగులో, మరణించాడు. ఆకలి గొన్న పులి ఆశగా రక్తాన్ని త్రాగి, మాసం తిని, ఎముకలను వదిలి వేసింది. ఆకథ అదనంగా ఇలా చెబుతుంది : బోధిసత్త్వుడు తన శరీరాన్ని త్యాగం చేసి నప్పుడు భూమి కంపించింది. సముద్రాలలోని నీరు అతాకుతల మయ్యాయి. సూర్యకిరణాలు మంద గించాయి. కను చూపు తాత్కాలికంగా బైర్లు కమ్మింది. దేవతలు సాధు ఆక్రందనలు చేశారు. పారిజాత పుష్పాల వర్షం కురిసింది, స్వర్గం నుంచి. భూకంపాన్ని చూసిన అతని అగ్రజులిద్దరు, తమ అనుంగు సోదరుడు పులికి ఆహారమై ఉంటాడని సరిగానే ఊహించారు.

''తప్పకుండా, మహాసత్త్వుడు తన శరీరాన్ని త్యాగం చేసి ఉండాలి, ఎందుకంటె అతడు చాల అనుకంప స్వనంతో మాట్లాడాడు'', మహాదేవుడన్నాడు.

ఇద్దరు వెను దిరిగి ఆ స్థలాన్ని చేరు కొన్నారు. ఊహించని అదృశ్యం చూసి వారు భయంతో స్తంభీ భూతు లయ్యారు. వారు చూసింది తమ సోదరుని కాదు, రక్త సిక్తమైన ఎముకల పోగును. ఆ దగ్గరలోనే ఉన్న చెట్టుకు వేళ్ళాడుతున్న దుస్తులను, హారాలను చూశారు.

వారు రోదించి మూర్ఛిల్లారు. స్పృహ వచ్చిన తరువాత భారమైన హృదయంతో ఇంటికి వెళ్ళి పోయారు.

బోధిసత్త్వుడు తన శరీరాన్ని త్యాగం చేసిన రోజున రాజమాతకు ఒక కల వచ్చింది. ఆకలితో తన పళ్ళు రాలి పోయి నట్లు, ఏదో పదునైన ఆయుధంతో తన శరీరాన్ని కోసి నట్లు బాధను అను భవించింది. ఇంకా ఆ కలలో, ఇంటికప్పు మీద ఉన్న మూడు అందమైన కపోతాలలో ఒక దానిని డేగ తన్నుకు పోయింది.

రాణి భయకంపిత అయింది. ఆమెనిద్ర లేచిన తరవాత, తన ముగ్గురు పుత్రులు అరణ్యంలోకి అలా వాహ్యాళికోసం వెళ్ళి నట్లు గుర్తు తెచ్చు కొంది. వెంటనే రాజుగారి దగ్గరకు వెళ్ళి, తన కొచ్చిన అమంగళకర స్వప్నాలను చెప్పింది.

రాకుమారులు తప్పి పోయారని తెలియడంతో, వారిని వెదికించ వల సిందని రాజును కోరింది.

అంతకు ముందే వారి కోసం వెదక డానికి వెళ్ళిన మంత్రులు, రాజ ప్రాసాదానికి కనిష్ఠ రా కుమారుని మరణ వార్తను మోసు కొచ్చారు. దానిని విన్న వారెవరికీ దుఃఖం ఆగలేదు. ఎలాగో రాజు రాణిని ఓదార్చి, ఒక ఏనుగును అధిరోహించి, త్వరగా తన సేవకులతో అరణ్యాన్ని చేరి, దుఃఖితులైన ఆ ఇరువురు రాకుమారులను ఇంటికి తీసుకు వచ్చాడు.

వారికి దుఃఖంతో మాట రాలేదు. తరవాత ఎలాగో ధైర్యం తెచ్చుకొని, తమ తల్లికి తమ అరియ సోదరుని వీరోచిత కార్యాన్ని వివరించారు.

తరవాత వెంటనే తామంతా, ఆ స్మరణీయ సంఘటనా స్థలాన్ని దర్శించడానికి తగు ఏర్పాట్లు గావించ వలసిందని ఆజ్ఞాపించాడు రాజు.

కొంతసేపైన తరవాత ఆ స్థలాన్ని చేరారు. అక్కడక్కడ చెల్లా చెదురుగా పడి ఉన్న తమ ప్రియ తనయుని రక్తసిక్త ఎముకలను చూసి రాజు, రాణి మూర్ఛ పోయారు. బ్రాహ్మణ పురోహితుడు వెంటనే చందన జలాన్ని వారి మీద చల్లాడు. అప్పుడు వారికి స్పృహ వచ్చింది.

అంతట అతని జుట్టును, ఎముకలను, దుస్తులను ఒక రాశిగా చేయమని మంత్రులను ఆదేశించాడు. వారు అలా చేయగా, ఆరాశిని పూజించాడు. ఆ అవశేషాల మీద బంగారు చెతియను నిర్మించమని మంత్రులను ఆదేశించి, రాజు ప్రాసాదానికి మరలి పోయాడు.

ఆ చేతియకు తరవాత '' ఓమ్ నమో, బుద్ధా'' అని పేరు పెట్టారు. ఆ చెతియను ఇప్పుడు ''కమురా'' అంటున్నారని ఆ జాతక కథాంతంలో పేర్కొనబడింది.

రెండు పాఠాలకు తేడా ఉన్నప్పటికీ, రెండింటిలోని కేంద్రక విషయం బోధిసత్త్వుని ఆత్మ – త్యాగమే. బోధిసత్త్వుడు తన దేహాన్ని, సన్యాసిగా త్యాగం చేశాడా, రాకుమారునిగా త్యాగం చేశాడా అనేది అప్రస్తుతం.

ఇతర జాతకాలలోవలె 'నిదాన' లేదా 'జాతక' కారణం ఇందులోనూ కనిపిస్తుంది. కాని జాతకాలలో కనిపించే వ్యక్తుల గుర్తింపు ఇక్కడ లేదు.

సంస్కృత పాఠం కంటె, నెవరి పాఠంలో, వర్ణన అధికంగా ఉంది. నెవరి మూలం ఏదో తెలియదు.

★ ★ ★

బోధిసత్త్వల దానాచరణ విధానానికి సంబంధించిన ఆసక్తికరమైన విషయం 'చరియా పిటక' వ్యాఖ్యానంలో ఉంది.

బోధిసత్త్వుడు దానం చెయ్యడంలో, గ్రహీత దీర్ఘాయువు కావాలని, అందం, ఆరోగ్యం, బలం, జ్ఞానం, అన్నింటిని మించి నిర్వాణం పొందాలని ఉద్దేశిస్తాడు. అతడు దప్పిగొన్న వారికి నీరు ఇచ్చే టప్పుడు గ్రహీత 'రాగ దప్పిక' తీరాలని కోరతాడు; దుస్తులిచ్చేటప్పుడు ధార్మిక భీతి, ధార్మిక లజ్జ గ్రహీతకుండాలని ఆశిస్తాడు. యానాన్ని చ్చేటప్పుడు గ్రహీత మనో శక్తులను అలవరుచు కోవాలని వాంఛిస్తాడు. సుగంధాలను దానం చేసే టప్పుడు గ్రహీతలో ధార్మిక గంధం వెలువడాలని ఆశిస్తాడు. పూలమాలలు, చందనాదులను ఇచ్చే టప్పుడు బుద్ధుని గుణవైభవాన్ని పొందాలని, ఆసనా లిచ్చే టప్పుడు జ్ఞానాసనం పొందాలని, ఆవాసం కల్పించే టప్పుడు, అది ఈ ప్రపంచానికి ఆశ్రయం కావాలని, దీపాలను ఇచ్చే టప్పుడు ఐదు నేత్రాలను పొందాలని - భౌతికనేత్రం, జ్ఞాననేత్రం, దివ్య నేత్రం (చక్షువు), బుద్ధనేత్రం, సర్వజ్ఞ నేత్రాలు - ఆకృతులను బుద్ధ పరివేషంకోసం, ధ్వనులను బ్రహ్మవాణి లాంటి మధుర ధ్వనికోసం; రుచులను గ్రహీత అందరినీ సంతోషం పెట్టేట్టుగా ఉండడానికి; సంస్పర్శలను బుద్ధుని సున్నిత శరీరాన్ని పొందాలని; మందును మరణరాహిత్యం (నిర్వాణ) కోసం ఇస్తారు. అతడు బానిసలకు విముక్తి కలిగిస్తాడు, ఎందుకంటె మనుషులను రాగాలకు బానిసలు కాకుండ నిలవరించడానికి; బిడ్డలను త్యాగం చేయడం ఎందుకంటే, వారు అందరి యెడ పైతృక భావాన్ని పెంపొందించడం కోసం; భార్యలను త్యజించడం ప్రపంచం యజమాని కావడం కోసం; రాజ్యాల త్యాగం ధార్మిక రాజ్యానికి వారసులు కావడం కోసం.

బోధిసత్త్వుని పరహిత దృక్పథాన్ని అభివ్యక్తం చేయడమే కాక, ఈ ఉత్తుంగ ఆశయాలు, మానవాళి ఉపశమం కోసం అతడు చేసే నిష్కామ ప్రయత్నాలను వెల్లడిస్తాయి.

**శీల**

బోధిసత్త్వుని ఈ అసాధారణ ఔదార్యంతో ముడివడి ఉన్న మరో గుణం శీలం. ఈ పాళి పదానికి అర్థం క్రమ శిక్షణ. దీనిలో అతడు చేయవలసిన విధులు (చారిత్త) ఇంకా

కొన్ని చేయ కూడనివి (వారిత్త) అంటే నివృత్తులు ఉన్నాయి. తలిదండ్రుల, పిల్లల, భర్త, భార్య, గురువుల, విద్యార్థుల, స్నేహితుల, సన్యాసుల, అధీనుల యెడ నిర్వహించవలసిన విధులు వివరంగా 'సిగాలోవాద సుత్తా'లో ఉన్నాయి.

సామాన్యుడు ఆచరించ వలసిన విధులను సంబంధాల శ్రేణులలో ఇవ్వడం జరిగింది. తేలికగా గుర్తుంచుకోవడానికి వీలుగ ప్రతి నిశ్రేణిలో ఐదేసి అంశా లివ్వ బడ్డాయి:

1. ఒక బిడ్డ తన తలిదండ్రులకు సంబంధించి : (i) వారికి ఆధారంగా ఉండాలి (iii) వారి యెడ తమ విధులను నిర్వర్తించాలి. (iii) వారి వంశాన్ని నిలబెట్టాలి. (iv) వంశానికి తగు నట్లుగా ఇంకా దానిని ఇనుమడింప జేయాలి (v) మృత బంధువుల గౌరవార్థం దాన ధర్మాలు జేయాలి.

2. ఈ విధంగా బిడ్డలు తమ విధులను నిర్వహించి నప్పుడు తలిదండ్రులు: (i) వారిని చెడు మార్గాన నడవ కుండా చూడాలి. (ii) మంచి చేయమని ప్రోత్సహించాలి (iii) వారిని ఏదైన కళలో తీర్చి దిద్దాలి (iv) తగిన భార్యను తేవాలి (vi) తగిన సమయంలో వారికి వారసత్వపు ఆస్తిని అంద చేయాలి.

3. శిష్యుడు గురువు యెడ: (i) ముందుగా నిద్రలేవటం (ii) ఉపచర్యలు చేయడం (iii) శ్రద్ధగ వినడం (iv) వ్యక్తి గత సేవ (iv) ఉపదేశాన్ని గౌరవంగా స్వీకరించడం.

4. ఈ రకంగా నియుక్తమైన శిష్యుని యెడ గురువు: (i) మంచి విద్యాబుద్ధులుగరపాలి (ii) తాము బాగా అవలంబించిన వాటిని శిష్యులు గ్రహించేట్టు చేయాలి. (iii) తగిన కళాశాస్త్రాలు నేర్పడం (iv) వారిని తమ స్నేహితులను, సహచరులను వారికి పరిచయం చేయాలి. (v) ప్రతి వైపు నుంచి వారిని రక్షించాలి.

5. భర్త భార్యయెడ: (i) దాక్షిణ్యం చూపాలి. (ii) ధిక్కరించ రాదు. (iii) విశ్వాసంతో ఉండాలి. (iv) అధికారాన్ని అప్పగించడం (v) కావలసిన భూషణాలు ఇవ్వడం.

6. ఈ విధంగా చూసిన భర్తకు భార్య: (i) తన విధులను పూర్ణంగా నిర్వహించాలి, (ii) చుట్టుపక్కల వారికి ఆతిథ్యం ఇవ్వాలి. (iii) విశ్వాసంగా ఉండాలి. (iv) అతడు తెచ్చిన వాటిని జాగ్రత్త చేయాలి. (iv) తన విధి నిర్వహణలో సోమరిగా ఉండక క్రియా శీలంగా ఉండాలి.

7. కులీన అనుజుడు (Noble Scion కుటుంబంలో చిన్నవాడు) స్నేహితులతో సహచరులతో: (i) ఔదార్యం (ii) సభ్య భాషణం (iii) వారి మంచిని పెంచడం (iv) సమానత (v) సత్యసంధతలతో ఉండాలి.

8. ఈ విధంగా ప్రవర్తించిన అనుజుని యెడ స్నేహితులు, సహచరులు: (i) అలక్ష్యంగా ఉన్నప్పు డతనిని న రక్షించాలి. (ii) ప్రమత్తంగా ఉన్నప్పు డతని ఆస్తిపాస్తులను రక్షించాలి. (iii) అతడు భయ పడి నప్పుడు ఆశ్రయం కల్పించాలి. (iv) అపాయంలో అతడు న్నప్పుడు అతనిని వదల కుండ ఉండాలి. (v) అతని సంతానాన్ని గురించి పట్టించు కోవాలి.

9. యజమాని తనసేవకుల, తన క్రింది ఉద్యోగుల యెడ: (i) వారి శక్త్యానుసారం వారికి పని అప్పగించాలి. (ii) వారికి ఆహారం జీత భత్యా లివ్వాలి. (iii) జబ్బు చేసి నప్పుడు వారికి ఉపచారం చెయ్యాలి. (iv) అసాధారణ మధుర భక్ష్యాలను వారితో పంచు కోవాలి. (v) వారి బాధలను తొలగించాలి.

10. ఈవిధంగా తన విధులను నిర్వహించిన యజమాని యెడ సేవకలు:

(i) అతని కంటె ముందుగా లేవాలి (ii) అతడు నిద్ర పోయాకే వీళ్ళు నిద్ర పోవాలి. (iii) ఇచ్చిందేదో అదే తీసుకోవాలి. (iv) సంతృప్తికరంగా తమ విధులను నిర్వర్తించాలి. (v) అతని కీర్తి ప్రతిష్ఠలను వ్యాపింప జేయాలి.

11. కులీనుడు సన్యాసుల, బ్రాహ్మణుల యెడ: (i) ప్రీతి కార్యాలే చేయాలి (ii) ప్రీతి వాక్యాలు పలకాలి. (iii) ప్రీతి ఆలోచనలు చేయాలి. (iv) వారికి తలుపులు మూయ రాదు. (v) వారి భౌతికావసరాలను తీర్చాలి.

12. బ్రాహ్మణులు సన్యాసులు ఆ కులీనుని యెడ : (i) చెడు నుంచి మరల్చాలి. (ii) మంచి చేయ ప్రోత్సహించాలి. (iii) దయా హృదయంతో అతనిని ప్రేమించాలి. (iv) అంతకు ముందతడు వినని దానిని వినిపించాలి, అంతకు ముందు విన్న దానిని విడ మరచాలి (v) స్వర్గానికి అతనికి మార్గాన్ని చూపాలి. చారిత్త శీలాన్ని పూర్తిగా నిర్వహించిన బోధిసత్త్వుడు ఆర్య శబ్దానికున్న ఖచ్చితమైన అర్థంలో, నిజంగా పరమ శుద్ధ ఆర్యుడు, అవుతాడు.

చర్య ప్రతిచర్యా నియమాన్ని తన్నకై తాను విడ మరుచు కొని, చెడుకు దూరంగా ఉండి, తనకు చేతనైన మేర మంచి చేస్తాడు. ఎవరికీ – మనష్యులకూ, జంతువులకూ – తానొక శాపం కాకుండ, వరమై, మసలు కోవడం తన విధిగా భావిస్తాడు.

ప్రాణం అందరికీ విలువైందే. అందుకని ఎవరికీ మరొకరి ప్రాణం తీసే హక్కులేదు. అందుకని అతడు మైత్రిని, కరుణను ప్రతి జీవికి – తన పాదాల వద్ద పారాడే అతి అల్ప ప్రాణికి – సారించి, ఏ జీవిని చంపడు. హాని కలిగించడు. మనిషిలోని జంతు సహజాతం

(animal instinct), నిర్భయంగా బలహీనులను చంపి, వాటి మాంసంతో విందు చేసుకొమ్మని, అతనిని పురికొల్పుతుంది. తన ఆకలిని తీర్చు కోవడానికి గాని, లేదా మృగయా వినోదానికి గాని, క్రూరంగా గాని, మానవీయంగా గాని, ఏ పద్ధతిలో నైనా నిస్సహాయ జంతువును చంపడం గాని, చంపించడం గాని ఏ మాత్రం న్యాయం కాదు. ఒక జంతువును చంపడం తప్పైతే, మానవుల మారణాన్ని గురించి ఏమి చెప్పాలి? మొదట సారి చూసి నప్పుడు ఆచర్య వెనుక ఉద్దేశం ఎంతో మంచిదిగా కనిపించ వచ్చు గాక.

ఇంకా బోధిసత్త్వుడు అన్నిరకాల ప్రత్యక్ష, పరోక్ష అస్తేయాన్ని (దొంగతనం చేయకుండుట) పాటిస్తాడు ఆ విధంగా నిజాయితీ, విశ్వసనీయత, ఋజువర్తన పెంపొందించు కొంటాడు. మానవునిలోని ఉన్నత ప్రవృత్తిని నీచ పరిచే దుర్నడత (దుశ్శీలం) నుంచి దూరంగా ఉండి, తన లైంగిక జీవితంలో శుద్ధంగా, అమలినంగా ఉంటాడు. అబద్ధమాడడు. పరుష పదాల నుపయోగించడు. అపవాదులు వేయడు. ఉబుసు పోని శుష్క కబుర్లు చెప్పడు. నిజమైనవి, మధుర మైనవి, శాంతి కారకా లైనవి, సహాయ కారు లైనవి అయిన మాటలనే మాటాడతాడు. మనస్సును విచలింప జేసి తికమక గలిగించే మత్తుపానీయాలను సేవించడు. అప్రమత్తతతో స్పష్ట దృష్టిని అలవరుచు కొంటాడు.

బోధిసత్త్వుడు ఈ ఐదు సూత్రాలకు కట్టుబడి ఉంటాడు. వాక్కర్మలను నియంత్రించ ప్రయత్నించే ఈ ఐదు సూత్రాలు తనకు అర్థాన్ని చే కూర్చేవి అయినా, అనర్థాన్ని చే కూర్చేవి అయినా, వాటిని వీడడు.

సంసార పర్యాటకగతిలో వ్యవహరించే టప్పుడు బోధిసత్త్వుడు పరిపూర్ణుడని భావించ రాదు. ఇహ వాసి గనుక అతనికీ అతని పరిమితులు, అపజయాలు ఉంటాయి. కువేరజాతక (No 318) లాంటి జాతక కథలు బోధిసత్త్వుని దారి దోపిడి గజ దొంగగా అభివర్ణించింది. ఏమైనా ఇది సాపవాదమే కాని నియమం కాదు.

ఒక సాధకుడు బుద్ధత్వానికి, శీలానికి ఇచ్చిన ప్రాముఖ్యం, శిలవిమంస జాతక (No. 362) లో బోధిసత్త్వుడు చెప్పిన మాటలను బట్టి తెలుస్తుంది:

''శీలరహిత జ్ఞానానికి విలువ ఏమీ లేదు''.

ఇతర ఉన్నత విలువలకు పునాది అయిన శీలాన్ని మెచ్చు కొంటూ బుద్ధఘోషుడు తన విశుద్ధిమగ్గలో ఇలా అంటాడు :

> ''గాలితో, గాలి కెదురుగా ఏ ఇతర గంధం విరాజిల్లుతుంది?
> దాని వలె ఏ సోపాన పథం స్వర్గ ద్వారానికి చేరుస్తుంది?

నిర్వాణ నగరానికి ఏది ద్వారం?
తన శీలమే తన కలంకారమైన రుషి,
రాజుల, హారాల ముత్యాల వైభవాన్ని దాటి ప్రకాశిస్తాడు.
మానవులలో శీలం ఆత్మనిందను నాశం చేస్తుంది,
సంతోషాన్ని ప్రశంసను ఇస్తూ.

మంచికి మూలం, దోషహారిని అయిన శీలశక్తి మొత్తం ఉపన్యాసాన్ని ఈ విధంగానే ఎరగాలి''

**నెక్కమ్మ (పరిత్యాగం)**

బోధిసత్త్వుడు పరిత్యాగం వైపు చూపే ఉత్సాహం చాల నిశితమైంది. ఎందుకంటె స్వభావ రీత్యా అతడు ఏకాంత ప్రేమికుడు. పరిత్యాగంలో, ఐహిక సుఖాలను వదిలివేసి, సన్యాస జీవితాన్ని స్వీకరించడమూ ఉంటుంది. ఇంకా తాత్కాలికంగా ఝానాల ద్వారా నివారణల (అవరోధాల) ప్రత్యా దేశమూ ఉంటుంది. బోధిసత్త్వుడు స్వార్థ పరుడూ కాడు. తనకోసం ఏమీ కూడ బెట్టు కోడు. అతడు చేసే ఏ పనిలోనూ స్వార్థం ఏమీ ఉండదు. ఇతరుల కోసం తన సుఖాన్ని త్యాగం చేయ డానికి ఎప్పుడు సిద్ధంగా ఉంటాడు.

విషయ సుఖాల్లో మునిగి ఉన్నా, కామ సుఖాల్లో తేలి యాడుతున్నా, అవి అశాశ్వతాలని అర్థం చేసుకొని, త్యాగ ప్రాముఖ్యాన్ని గుర్తిస్తాడు.

ఈ విధంగా, భౌతిక సుఖాలలోని డంబాన్ని గుర్తించి, ఐచ్ఛికంగా తనకు చెందిన ఐహిక విషయాలను వదిలి వేస్తాడు. నిరాడంబరంగా భిక్కుల దుస్తులు ధరించి పూర్తి పవిత్ర జీవితాన్ని గడప ప్రయత్నిస్తాడు. ఇక్కడ, అతడు ఉన్నత ధార్మిక జీవితాన్ని గడుపుతాడు. ఇలా గడపడంలో ఆచరణాత్మకంగా అతడు చేసే అన్ని పనులలోను నిస్వార్థంగా ఉంటాడు. ఏ ప్రోత్సాహం - అది కీర్తి కానీయండి, సంపద, గౌరవం, లేదా ప్రాపంచిక లాభం, ఏదైనా కానీయండి - అతనిని తన ఆదర్శాల నుంచి మరల్చ లేదు.

కొన్నిసార్లు, మఖాదేవ జాతక (No 9) లో లాగ, మొదటి నెరసిన వెంట్రుక చాలు, బోధిసత్త్వుడు స్వతంత్ర ఏకాంత రుషి జీవితం కోసం ప్రాసాద అనుకూల వాతావరణాన్ని విడిచి పెట్టడానికి. కొన్నిసార్లు ఒక తుషార బిందువు లేదా ఒక పండిన ఆకు చాలు, అతడు సన్యాస జీవితాన్ని పరిగ్రహించ డానికి.

ఏమైన, బోధిసత్త్వులందరూ అన్నివేళల పరిత్యాగం చేస్తారని లేదు. ఉదాహరణకు కుస జాతక (No. 531) లో. అందాల రాకుమారి ప్రభావతి చేయి అందుకో డానికి బోధిసత్త్వుడు అవమానాల పాలు కావలసి వచ్చింది.

మళ్ళీ, దరిముఖ జాతక (No. 376) లో బోధిసత్త్వుని పూర్వ స్నేహితుడు, ప్రత్యేక బుద్ధుడు, అతని దగ్గరకు వచ్చి, ఇలా అన్నాడని, ఉంది:

''విషయ సుఖాలు చిత్తడి, బురద, తప్ప అన్యం కావు,
నేను వాటినిన త్రిగుణంగా నాటిన భీతి అంటాను.
అయ్యా, నేను వాటిని దుమ్ము ధూళి క్రింద చెప్పాను,
సంఘంలో చేరు, వాటి నన్నింటి వదలివెయ్యి''.

అతడు వెంటనే టపీమని సమాధానం చెప్పాడు:

''నేను విమోహితుడను, బంధితుడను, గాఢ కలుషితుడను
బ్రాహ్మణా, సుఖాలతో. అవి భయానకాలే కావచ్చు.
కాని నేను జీవితాన్ని ప్రేమిస్తాను, వాటిని కాదన లేను.
ఎడతెగక మంచి పనులు చేస్తాను.

బుద్ధుడు లేని యుగంలో బోధిసత్త్వుడు సన్యాసి జీవితాన్ని గ్రహించి ఏకాంతంలో పవిత్ర బ్రహ్మచర్య జీవితాన్ని గడుపుతాడు. బుద్ధుడున్న యగంలో జన్మిస్తే, అతడు ఖచ్చితమైన భిక్కు నియమాల ప్రకారం భిక్కు జీవితాన్ని గడుపుతాడు. అతడు సమాజానికి బరువు కాడు, ఎందుకంటె అతడు ఎవరికీ ఏ కష్టం కలిగించడు. పుష్పానికి ఏమీ హాని జరగకుండా తేనె పీల్చే తేనె టీగ లాంటి వాడు అతడు. అతనికి ఆస్తి అంటూ ఉండదు. ఎందుకంటె అతడు ప్రాపంచికమైన దంతా త్యజించాడు. అతని అవసరాలు బహు అల్పం. తృప్తి అతని సంపద - అతనికి గతాన్ని గురించి వగపు లేదు. అనాగతాన్ని గురించి వ్యాకులతా లేదు. ప్రాపంచిక బంధాలు లేక, బాధ్యతల నుంచి విముక్తమై, అతడు ప్రకృతంలోనే జీవిస్తాడు. ఒక ప్రత్యేక ఆవాస స్థలానికి అంటి పెట్టు కోక, పరహితం కోసం, అతడు కావాలనుకొన్న చోట కెల్ల స్వేచ్ఛగా వెళతాడు. జీవితం ఒడిదుడుకు లన్నింటిలోను అతడు సమచిత్తాన్ని ప్రదర్శిస్తాడు. ఇతరుల సేవకు అతడు ఎప్పుడూ సిద్ధం.

బౌద్ధేతర సన్యాసులను తప్పకుండ పరిబ్బాజకులు (పరివ్రాజకులు) ఆ జీవకులు, సన్యాసులు.అనిపిలుస్తారు. భిక్కు (సంస్కృతం భిక్షు) అనేపదం కేవలం బౌద్ధులకే వాడతారు.

అతనిని పరుల నుంచి దేనిని యాచించ డానికి భిక్కు నియమాలు ఒప్పుకోవు. అతడు నాలుగు ఆవశ్యక వస్తువులను పరిగ్రహించ వచ్చు. అవి: దుస్తులు, భిక్ష, ఆవాసం, వైద్యాలు. వాటిని అడిగి ఇస్తేనే అంగీకరిస్తాడు. ఒక వేళ వాటిల్లో ఏదైనా అవసరమైతే, అతడు తన

దలిదంద్రులను గాని, దగ్గర బంధువులను కాని లేదా అంగీకృత పోషకుల (Professed supporters) ను కాని అడగ వచ్చు.

భిక్షువు జీవితాంత శపధాలకు, నియమాలకు బంధితుడు కాడు; తన ఇష్ట పూర్తిగానే పవిత్ర జీవితాన్ని గడపడానికి సంఘంలో చేరతాడు. సంఘంలో తాను ఉండాలను కొన్నంత కాలమే ఉంటాడు. అర్థం తల గుర్తు అయిన పీతాంబరాన్ని ఒకసారి ధరించిన తరవాత, దానికి సంబంధించిన నియమాల నన్నింటిని పాటించి తీరాలి.

పవిత్ర జీవితం గడప డానికి, నిస్వార్థ సేవ చేయ డానికి, మనస్సును తేలికగా అదుపులో ఉంచి పరిశుద్ధం కావించ డానికి, వస్తువులను విషయాలను యథాతథంగా చూడ డానికి, తిన్నగా లోతుగా ఆలోచించ డానికి, మానవుని ఉన్నత ప్రవృత్తిని పెంపొందించుకోవ డానికి, ఉన్నత ఆధ్యాత్మిక విలువలను నిండుగా ఆస్వాదించ డానికి, భిక్కు జీవితం కంటె మరే ఇతర జీవితమూ అటువంటి సౌకర్యాలు, అవకాశాలు కల్పించదు.

భిక్కు ఒక, ధ్యాన శీల జీవితాన్ని గాని, అధ్యయన తత్పరతా శీల జీవితాన్ని గాని గడప వచ్చు. మొదటిది భిక్కు ఆదర్శానికి దగ్గరగా ఉంటుంది. ఎందుకంటె, పవిత్రతకు, వినమ్రతకు గుర్తైన పచ్చ దుస్తుల ధారణ రాగాలను నాశం చేసి, నిర్వాణాన్ని పొందడానికే.

**పఞ్ఞా (ప్రజ్ఞ)**

పరిత్యాగాన్ని అనుసరించి ప్రజ్ఞ వస్తుంది. ప్రజ్ఞ అంటే జ్ఞానం లేదా బోధ. అనిత్యత, దుఃఖం, అనత్త (అనాత్మ)లను దృష్టిలో ఉంచుకొని, ఈ ప్రపంచ స్వభావాన్ని అర్థం చేసు కోవడమే ప్రజ్ఞ. బోధిసత్త్వుడు వీటిమీద కొంత వరకే ధ్యానం చేస్తాడు. కాని అర్హతత్వం పొందే దాక చేయడు. ఎందుకంటే ఇలా చేయడం అంటే అతడు తన లక్ష్యం నుంచి ప్రక్కదారి పట్టడమే.

అదే సమయంలో ప్రపంచ జ్ఞానాన్ని అతడు హీనంగా చూడడు. తన సేవకుల నుంచి గూడ అతడు జ్ఞానాన్ని పొంద డానికి వెనకాడడు. అంతే కాదు, తన జ్ఞానాన్ని ప్రదర్శించాలని అతడు కోరు కోడు. పది మందిలో తన అజ్ఞానాన్ని ఒప్పుకోవ డానికి సిగ్గు పడడు. ఎందుకంటే అతడు ఏపరిస్థితులలోను తాను ప్రగల్భి కావడానికి ఇష్ట పడడు. తనకు తెలిసిందంతా అందరికీ అందుబాటులో ఉంటుంది. అందరికీ దానిని పంచిపెడతాడు. ఏ అరమరికలు లేకుండ తనకు చేతనైనంత వరకు ఇతరులను అంధకారం నుంచి వెలుగులోకి తీసుకు వెళతాడు.

జ్ఞానం మూడు విధాలు - మొదటిది సుతమయ పఞా (శృతమయ ప్రజ్ఞ =నోటితో చెప్పగా విని గ్రహించినది). ప్రాచీన కాలంలో, అచ్చు ప్రాచుర్యంలోకి రాక ముందు, జ్ఞానాన్ని వినడం ద్వారా గ్రహించే వారు. అందుకని ఆరోజుల్లో జ్ఞానిని బహుస్సుత (బహుశృత = చాల విన్నవాడు) అనే వారు. ఇది ఆంగ్లంలో Erudition (పాండిత్యాని)కి సమానం. రెండోరకం జ్ఞానం చింతామయ పఞా (చింతామయ ప్రజ్ఞ). పాశ్చాత్య ఆచరణాత్మక విజ్ఞాన శాస్త్ర జ్ఞానమంతా తిన్నగా ఈ రకం జ్ఞానం నుంచి వచ్చిందే. మూడోరకం జ్ఞానం భావనామయ పఞా (భావనామయ ప్రజ్ఞ). దీనిని ధ్యానం ద్వారా, భావన ద్వారా పొందుతారు. తార్కిక హేతుజ్ఞానానికి అందని అంతర్బొద్ధిక సత్యాలను అటువంటి ధ్యానం ద్వారా పొందుతారు. భావనా లేదా ధ్యానం అనేది క్రియాశీల ప్రయత్నం. అది స్వయం ఉన్నతికి స్వయ శిక్షణకు, నిగ్రహానికి, ఆత్మా జ్ఞానానికి దారితీస్తుంది. అది గుండెకు ఔషదం (Tonic). బౌద్ధానికి శిఖరం జ్ఞానం. ఆర్య అష్టాంగ మార్గంలో అది మొదటిదైన సమ్మాదిఠ్ఠి (సమ్యక్ దృష్టి). బోధలోని ఏడు కారకాలలో అది ఒకటి ధమ్మ విచయసమ్బొజ్ఞంగా. అది నాలుగు నివృత్తి సాధనాలలో ఒకటి వీమనస ఇద్ధిపాద. పంచశక్తులలో ఒకటి పఞాబల. పంచనియంత్రణా శక్తుల (పఞ్ఞింద్రియ శక్తులల)లో అది ఒకటి. పరిశుద్ధతకు, అంతిమంగా మోక్షానికి దారి తీసేది ప్రజ్ఞయే.

**విరియ**

ప్రఞాకు సన్నిహితంగా ఉండేది విరియ. విరియ అంటే శక్తి, పట్టుదల, శారీరక బలం. మంచి లాభకరమే అయినా, ఇక్కడ విరియ అంటే అర్థం అదికాదు. అది మనోబలం. శీలబలం, ఇది శారీరక బలం కంటె ఉన్నత మైంది. మనసా, కర్మణా పరహితం కోసం పట్టు వదలక పని చేయడంగా దీనిని నిర్వచిస్తారు. బోధి సత్త్వుడు ఈ సుగుణంలో బాగా నిలదొక్కు కొని, స్వావలంబనాన్ని అలవరుచు కొని, దానిని తన ముఖ్య శీల లక్షణాలలో ఒకటిగా చేసు కొంటాడు.

డా. ఠాగోర్ మాటలలో చెప్పాలంటే, బోధిసత్త్వుడు స్వశక్తి ఆధారంగా తన మనస్సును ఇలా రూపొందించు కొంటాడు.

''అపాయాలనుండి రక్షణ కోసం కాక,
వాటిని ఎదుర్కోవడంలో నిర్భీతుణ్ణి కావ డానికి ప్రార్థించనీ.
నా బాధోపశమనానికి వేడక,
దానిని జయించే మనోనిబ్బరం కోసం యాచించనీ.

వ్యాకులతా భీతితో రక్షించ బడాలని ఆక్రోశించక,

నా స్వేచ్ఛను పొందే సహనాన్ని ఆశించనీ''.

బోధిసత్త్వుని 'విరియ'ను మహాజనక జాతక (నెం. 539) స్పష్టంగా వర్ణించింది. నడి సంద్రంలో నావ భంగమై పోగా, ఏడు రోజుల పాటు ఆశ వదలక, అంతిమంగా రక్షించ బడే వరకు, అలా ప్రయత్నాన్ని వీడ లేదు.

అపజయాలు విజయాలకు సోపానాలంటాడతడు. వ్యతిరేకత అతని ప్రయత్నాలను రెండింతలు చేస్తుంది. అపాయాలు అతని ధైర్యాన్ని పెంచుతాయి. దుర్బలుల ఉత్సాహాన్ని నీరు కార్చే కష్టాలగుండా అతడు దూసుకు పోతూ, మామూలు, మనుషుల నిరుత్సాహ పరిచే, అవరోధాలను అధిగమిస్తూ, తిన్నగా లక్ష్యం వేపే చూస్తాడు. లక్ష్యం చేరే వరకు అతడు విశ్రమించడు.

తన అన్వేషణను కొనసాగించ వలదని మారుడు బోధిసత్త్వుని కోరగా, బోధిసత్తుడు ఇలా సమాధానం చెప్పాడు: ''మోహంతోడి యుద్ధంలో ఓటమి, అపజయ జీవితం గడిపే కంటే, నా దృష్టిలో గౌరవ ప్రదమనిపిస్తుంది''.

అతని జ్ఞానం ఎలా ఇతరుల సేవకు నియోగిత మవుతుందో, అతని శక్తి గూడ అంతే. తన వ్యక్తిగత లక్ష్యాల సిద్ధి కోసం దారి తీసే సంకుచిత మార్గానికి పరమితం చేయ డానికి బదులు, సార్వత్రిక సుఖానికి దారి తీసే, క్రియల మీదికి దానిని సారిస్తాడు. ఏరకమైన వేతనం కాని, పారితోషికం గాని ఆశించక, అవిరామంగా, అనలసత్వంతో ఇతరులకోసం పరిశ్రమిస్తాడు. యథాశక్తి ఇతరులకు సేవ చేయ డానికి అతడు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడు. కొన్ని కోణాలనుంచి చూస్తే, లక్ష్యసాధనలో ప్రజ్ఞ కంటె విరియ ఎప్పుడూ ముఖ్యపాత్రను నిర్వహిస్తుంది. ఆర్య అష్టాంగ మార్గాన్ని అనుసరించే వానిలో, సమ్యక్ యత్నం (సమ్మా వయామ లేదా విరియ), దుస్థితుల ప్రభావాన్ని అణచివేస్తుంది; ప్రభవించిన వాటిని పెకలించి వేస్తుంది; మంచి స్థితులను ఉద్దీపిస్తుంది; మంచి స్థితులు అంతకు ముందే ప్రభవించి ఉంటే వాటిని పరిపూర్ణం చేస్తుంది. బోధలోని ఏడు కారకాలలో ఒకటిగా (విరియ సమ్‌బోజ్ఞంగ)·పనిచేస్తుంది. బోధ నాలుగు కారకాలలో ఒకటిగ (విరియద్ధిపాద) పనిచేస్తుంది. సమగ్యయత్నం నాలుగు విధాల ప్రకార్యాలను నిర్వహించేది విరియ (సమప్పధాన). అది ఐదుబలాలలో ఒకటి (విరియబల). అది ఐదు నియంత్రణ శక్తులలో ఒకటి విరియింద్రియ.

కనుక విరియను తొమ్మిది ప్రకార్యాలను నిర్వహించే అధికారిగా పేర్కొన్న వచ్చును. అని లక్ష్యాల సాధనలో మంచి శక్తిమంతమైన 'చేయి'గా పనిచేసే జ్ఞానంతో జతపరిచిన ప్రయత్నం అది.

## క్షాంతి

విరియ ఎంత ముఖ్యమైందో క్షాంతీ అంతే ముఖ్యమైంది. ఇతరులు తనకు కలిగించిన బాధను సహనంతో అనుభవించడం అది. ఇతరుల తప్పులను భరించడం.

బోధిసత్త్వుడు ఎంతగా క్షాంతిని ఆచరిస్తాడంటే, అతని చేతులు కాళ్ళు నరికి వేసినా గూడా అతనికి కోపం రాదు. క్షాంతి వాది జాతక(No. 313) లో బోధిసత్త్వుడు మదిరాపాన మత్తుడైన రాజుపెట్టిన హింసను సంతోషంతో భరించినట్లు కనిపిస్తుంది. ఆ రాజు అతని చేతులు, పాదాలు, ముక్కు, చెవులు దయాహీనంగా కోసివేయిస్తే, అతడు ఆ గాయాలకు బదులుగా, రాజును దీవించాడు. నేల మీద తన రక్తపు మడుగులో ఖండా వయవాలతో పడి ఉండి, బోధిసత్త్వుడు అంటాడు:

''ఎవని క్రూర హస్తం నా శరీరాన్ని విలోపించిందో, ఆ రాజు దీర్ఘాయుష్కుడవుగాక.

నా వంటి పరిశుద్ధాత్మలు ఇటువంటి చేష్టలను కోపంతో ఎప్పుడూ చూడకుందురు గాక''.

అతని క్షమాగుణం గురించి ఇలా అంటారు: అతని కెప్పుడు హాని కలుగించినా, హాని కలిగించిన వానిని గురించి ఇలా ఆలోచిస్తాడు:

'' ఈ వ్యక్తి నాతోటి వాడు. తెలిసో, తెలియకో, నేను అతని కోపానికి కారణ మయ్యాను, లేదా అది నా గత జన్మ పాపకర్మ వల్ల కావచ్చు. అది నా చర్య ఫలితంగానే సంభవించింది గనుక, నేను అతని యెడ అహితంగా ఎందుకు ఆలోచించాలి?'' ఏ మని షైన సిగ్గుమాలిన విధంగా ప్రవర్తిస్తే అతనిని గురించి బోధిసత్త్వుడు చిరాకు పడడు.

సహనాన్ని అలవరుచు కోమని శిష్యులను హెచ్చరిస్తూ బుద్ధుడు కకచూపమసుత్తలో ఇలా అన్నాడు:

''దారి దోపిడి దొంగలే అయినా, వాళ్ళు నీ అవయవాలను రెండు వైపుల పిడి ఉన్న అంపంతో కోసినా, దానితో నీమనస్సును మలినం చేసు కొన్నా వంటే, నా బోధలను నీవు అనుసరించడం లేదన్న మాట.

''ఈ విధంగా మీరు క్రమశిక్షణలో ఉండాలి: మన హృదయాలు మైల పడ కుండు గాక. ఏ చెడ్డ మాట మన పెదవులు దాటి రా కుండు గాక. దయా, కరుణలతో, ప్రేమైక హృదయంతో, ఎవరి అహితము కోరక, ఈ బందిపోటు దొంగలను గూడ మైత్రితో కట్టి పడ వేస్తూ మనం ఉందుముగాక. వీటినుంచి ఇంకా కొంత ముందుకు పోయి, విశాల, అహిర, అనంత, శుభప్రద, ఐక్య మైత్రీ సంబంధాలోచనలతో ఈ ప్రపంచాన్ని వెలుగుతో నింపుదుము గాక''.

ఇతరులలోని వికృతాలను చూడకుండ, ఓర్పు, సహనాలను ఆచరిస్తూ, బోధిసత్త్వుడు అందరిలో అందాన్ని మంచిని చూస్తాడు.

సచ్చ

సత్యం లేదా సచ్చ ఏడో పారమిత. ఇక్కడ సచ్చ (సత్యం) అంటే ఇచ్చిన మాటను నిల బెట్టు కోవడం. ఇది బోధిసత్త్వుని ముఖ్యలక్షల క్షణాలలో ఒకటి. ఎందుకంటె అతడు వాగ్దాన భంగం చేయడు. అతడు చెప్పిందే చేస్తాడు, చేసిందే చెబుతాడు.

*హారిత జాతక* (No. 431) ప్రకారం, బోధిసత్త్వుడు తన జీవిత పర్యాటకాలాలో కొన్ని సార్లు మిగత నాలుగు శీలాల (Precepts) ను ఉల్లంఘించినా, అబద్ధం మాత్రం ఆడడు.

సభ్యతకోసమైన అతడు సత్యాన్ని దాచడు.

సత్యం అతనికి మార్గదర్శి. మాట నిలుపు కోవడం అతడి బద్ధవిధి. మాట ఇచ్చే ముందు అతడు బాగా ఆలోచిస్తాడు. ఒకసారి మాట ఇచ్చిన తరవాత, తన ప్రాణం పోయినా సరే, దానిని ఏమైనా నిలుపు కొంటాడు. *హిరిజాతక* (No. 313) లో బోధిసత్త్వుడు సలహా ఇస్తాడు :

''ప్రతి వాగ్దానాన్ని నిజం చెయ్యి,
నీ వల్లకాని దానిని నీవు వాగ్దానం చేయ వద్దు;
జ్ఞానులు డాంబికుని ఓరగా చూస్తారు''.

మళ్ళీ *మహాసుతసోమ జాతక* (No 537), బోధిసత్త్వుడు మాట నిలుపు కోవడానికి తన ప్రాణాన్ని సైతం ఇవ్వడానికి సిద్ధ పడ తాడని చెబుతుంది.

'' ఉదయతార ఎలా గగన వీధిలో
లయతో తన గతిని గమిస్తుందో,
అన్ని రుతువులు, అన్ని కాలాలు, సంవత్సరాలలు,
ఎప్పుడు తమ దారిని వీడవో
అలాగే అతడూ తన జ్ఞానయుత భాషణంలో
ఎప్పుడూ సత్యపథాన్ని వీడడు''.

బోధిసత్త్వుడు సత్య సంధుడు, నిజాయితీ పరుడు, విశ్వసనీయుడు. మనసా, వాచా కర్మణా అతనిలో పరిపూర్ణ సమరస భావన ఉంటుంది.

అతడు సాగించే అన్ని వ్యవహారాలలోను తిన్నగా, సుసంగతంగా ఉంటాడు. అతడు చిత్త శుద్ధి లేని వాడు కాడు. ఎందుకంటే ఖచ్చితంగా తన ఉన్నత నియమాలకు అంటిపెట్టుకొని ఉంటాడు. అతని అంతరంగానికి బాహ్యారంగానికి మధ్య అంతరం లేదు. అంతరంగ జీవితం బాహ్య జీవితం – రెండూ అతనికి ఒకటే. ఇతరులను ఆకట్టు కోవ డానికి వారిని ప్రశంసించడు. వారి మెప్పును పొందడానికి తను గొప్పలకు పోడు. తన లోపాలను దాచు కోడు. గుణాలను ఊరికే బహిర్గతం చేసు కోడు. అసూయ లేకుండ ప్రశంసించ వలసిన వారిని ప్రశంసిస్తాడు. న్యాయబద్ధంగా నిందార్హులను నిందిస్తాడు. ఈ పనిని అతడు ద్వేషంతో కాక కరుణతో చేస్తాడు.

సత్యాన్ని గూడ అతడు అన్ని వేళల చెప్పడు. అలా చెప్పడం వల్ల ఇతరులకు మంచి గాక చెడు జరుగు తుందని భావిస్తే అతడు మౌనం వహిస్తాడు. ఏ సత్యమైన ఇతరులకు మంచి చేకూరు స్తుందని భావిస్తే అది అతనికి ఎంత కీడు కలిగించేదైనా, దానిని చెబుతాడు. తన మాటకు ఎంత విలువ నిచ్చు కొంటాడో ఇతరుల మాటకు అంతే విలువ ఇస్తాడు.

**అధిఠ్ఠాన**

సత్యసంధతను అనుసరించి అధిఠ్ఠాన (గట్టి నిర్ణయం) వస్తుంది. దీనికి అర్థం స్థిర నిర్ణయం. ఈ స్థిర నిశ్చయం లేక పోతే మిగతా పారమితలు సాఫల్యం కావు. దీనిని ఒక భవనం పునాదితో పోల్చారు. ఈ సంకల్ప బలం, అన్ని ఆటంకాలను బోధిసత్త్వుని మార్గం నుంచి తొలగిస్తుంది. ఈ నిర్ణయంలో అతనికి ఏమైన జరగ వచ్చు. రుగ్మత, దుఃఖం, వినాశం, ఏదైనా అతనికి సంభవించ వచ్చు. ఏమి జరిగినా అతడు తన దృష్టిని తన లక్ష్యం నుంచి మరల్చడు.

ఉదాహరణకు, బోధి సత్త్వగౌతమ రాచ భోగాలను త్యజించి, జ్ఞానోదయాన్ని పొందాలని స్థిర నిశ్చయం తీసు కొన్నాడు. ఆరు సుదీర్ఘ సంవత్సరాల పాటు అతడు చేసింది మానవాతీత పోరాటం. ఆ సమయంలో అతడు ఎన్నో రకాల బాధలను, కష్టాలను ఓర్చు కోవలసి వచ్చింది. వారి సహాయం అవసరమైన ఒక సంకట సమయంలో, అతని ఐదుగురు శిష్యులు అతనిని విడిచి వెళ్ళారు. అయినా అతడు తన ప్రయత్నాన్ని వీడ లేదు. అతని ఉత్సాహం, పైగా రెట్టింపు అయింది. అతడు ఒంటరిగానే పయనించాడు; అతని లక్ష్యాన్ని సాధించాడు.

ఓ రాతి పర్వత శిఖరం,<br>
ఎలా చలించక నిలబడి ఉంటుందో,<br>
ఎప్పుడూ దాని స్థానంలో అది స్థిరంగా ఎలా ఉంటుందో,

అలాగే నీవూ ఎప్పుడూ ఉండాలి.

కందక పరివేష్టత నిశ్చయంతో,,[2]

బోధిసత్త్వుడు తన నిశ్చయాలలో ఉక్కు మనిషి. అతని ఆదర్శ సూత్రాలు మారవు. మంచి చేయ డానికైతే అతనిని తేలికగానే ఒప్పించ వచ్చు కాని అతడి ఆదర్శాలకు విరుద్ధంగా ఎవరూ అతని చేత ఏమీ చేయించ లేరు. సందర్భాన్ని బట్టి అతడు పూవు వలె మెత్తనివాడు, రాయి వలె గట్టివాడు.

**మెత్తా (మైత్రి)**

పారమిత లన్నింటిలోకి అత్యంత ముఖ్యమైంది మెత్తా (సంస్కృతం మైత్రి) మెత్తాకు సరిపోయే తేలిక పదం ఆంగ్లంలో లేదు. దీనిని పర హితేచ్ఛ, హిత కామం, స్నేహ పిచ్చలత, లేదా దయపూరిత కరుణ అని చెప్ప వచ్చు. మెత్తాను ఎవరిని మినహాయించ కుండ అందరి హితం కోరడమే అని నిర్వచించ వచ్చు. ఈ మైత్రి కారణంగానే, ఇతరుల ముక్తి కోసం బోధిసత్త్వుడు తన ముక్తిని త్యాగం చేస్తాడు. కుల, మత, వర్ణ, లింగ భేదాలు లేకుండ సర్వుల యెడ హితేచ్ఛ అతని నరనరాన ప్రవహిస్తూ ఉంటుం. సార్వత్రిక ప్రేమ కతడు మూర్తి కనుక అతడంటే ఎవరికీ భయం ఉండదు, అతడు ఎవరికీ భయ పడడు. ఏకాంత అరణ్యాలలో క్రూర మృగాలు అతని ప్రియ స్నేహితులు. అతడు వాటి మధ్య ఉంటే చాలు, అవి పరస్పరం మిత్రులై పోతాయి. జీవించే ప్రతి దాని యెడ అతడు తన హృదయంలో అపార హితేచ్ఛను పెంచు కొంటాడు.

బౌద్ధంలో మైత్రిని వ్యక్తిగత వాత్సల్యంగా, శారీరక ప్రేమగా చూడ కూడదు. వాత్సల్యం నుంచి భయం, దుఃఖం కలుగు తాయి. కాని, మైత్రినుంచి కలగవు. ఈ ప్రేమైక కరుణను సారించే టప్పుడు తనను గురించి మరిచి పో రాదు. ఇతరులతో పాటు తన యెడ గూడ ధానిని సారించు కోవాలి. బౌద్ధమైత్రి తనతో కలుపుకొని ప్రపంచం మొత్తాన్ని పరివేష్టిస్తుంది.

**మహా - ధమ్మపాల జాతక** (No 385) లో, యువ బోధిసత్త్వుడు, తనను హింసించి చంపమని ఆదేశించిన క్రూరుడైన తండ్రి యెడ, హంతకుని (Excutioner) యెడ, తన ప్రియమైన దుఃఖిస్తున్న తల్లియెడ, తన యెడ, మైత్రిని సమ పాళ్ళలో చూపించి నట్లు ఉంది.

ప్రేమైక కరుణలో ఒక మార్మిక శక్తి ఉంది. అది దూర, దగ్గరి జీవు లందరినీ ప్రభావితం చేస్తుంది. ఈ హితేచ్ఛను ఉద్గారించే పరిశుద్ధ హృదయం అడవి మృగాలను పెంపుడు జంతువులుగా, హంతకులను మనుషులుగా మార్చ గలదు. ఆ మార్మిక శక్తి మనందరిలోనూ ఉంది. కాక పోతే దానిని స్వంతం చేసు కోవడానికి చిన్న ప్రయత్నం చేయాల్సి ఉంటుంది.

''పర్వత సానువులలో ఉంటూ, నేను సింహాలను పులలను ప్రేమైక కరుణతో నా దగ్గరకు తెచ్చుకో గలిగాను. సింహాలు, పులులు, చిరుతలు, గేదెలు, జింకలు, తేళ్ళు, ఎలుగుబంట్ల మధ్య నేను నివసించాను. జంతువులు నన్ను చూసి భయ పడ లేదు. నేనూ వాటిలో దేనినీ చూసి భయ పడ లేదు. ప్రేమైక కరుణ నా బలం. నేను ఆవిధంగా పర్వతపార్శ్వ మీద నివసించాను'', అన్నాడు బుద్ధుడు.

ఒకడు ఇతరుల నెలా ప్రేమిస్తాడో, ఇతరులూ అతనిని అలాగే ప్రేమిస్తారు. ఈ రకమైన ప్రేమైక మైత్రి పరివేషంతో రక్షితుడైన వానిని, ఏ విరుద్ధశక్తులు, ఏ ద్వేష ప్రకంపనాలు, ఏన కారాత్మకాలోచనలు ప్రభావితం చేయ లేవు. మనస్సు ప్రశాంతంగా ఉన్నప్పుడు, అతడు తను సృజించు కొన్న స్వర్గంలో ఉంటాడు. అతనితో సంస్పర్శలోకి వచ్చిన ప్రతి ఒక్కడూ ఆనందాన్ని అనుభవిస్తాడు. అలవాటుగా ఒకడు ప్రేమైక కరుణను అనుభవిస్తూ, మాటలలో చేతలలో దానిని ప్రదర్శిస్తే, అరమరికలు అంతర్హితా లవుతాయి. తేడాలు అంతర్థాన మవుతాయి. ''నేను'' అనేది ''అందరి'' లో లీన మవు తుంది. అంతేకాదు, అసలు అక్కడ 'నేను' అనేదే ఉండదు. అంతిమంగా, ఒకడు, తనను అన్నింటితో తాదాత్మ్యం చేసుకో గలడు. అదే మెత్తా పతాక స్థాయి.

బోధిసత్త్వుడు ఈ మెత్తాను, కుల, మత, వర్ణ, లింగ భేదం లేకుండ, ప్రతి జీవి పైకి సారించి, అన్నింటితో మమేకమై పోతాడు. ఒకరి నుంచి మరొకరిని వేరు పరిచే అడ్డగోడలను బీటలు వారించేది ఈ మెత్తయే. బోధి సత్త్వుడు దూరం, దగ్గరలు లేవు; శత్రువులు లేదా విదేశీయులు లేరు; ధర్మభ్రష్టుల లేరు. అంటరాని వారు లేరు; ఎందుకంటే అవగాహనతో సాధించిన సార్వత్రిక ప్రేమ సర్వజీవుల సౌభ్రాతృత్వాన్ని స్థాపించింది. బోధిసత్త్వుడు నిజమైన ప్రపంచ పౌరుడు. ఎప్పుడూ దయా మయుడు, స్నేహితుడు, కరుణా మయుడు.

**ఉపేఖ్ఖా (ఉపేక్ష)**

పదో పారమిత ఉపేఖ్ఖా లేదా సంయమనం. ' ఉపేఖ్ఖా' అనే పాళీ పదం ' ఉప', ' ఇఖ్ఖా' అనే పదాల సంయోగం. 'ఉప' అంటే 'న్యాయంగా', 'నిష్పక్షపాతంగా' లేదా ' ఉచితంగా' (యుక్తితో) అని అర్థం. ఇఖ్ఖ అంటే చూడటం, విచారణ లేదా దృష్టి అని అర్థం. శబ్దార్థపరంగా ఉపేఖ్ఖా అంటే, ఉచితంగా విచారించుట, న్యాయబద్ధంగా చూడడం లేదా నిష్పక్షపాతంగా చూడడం అని అర్థం. అంటే రాగ విరాగాలు లేకుండా అనుగ్రహానుగ్రహాలు లేకుండా చూడడం.

పట్టించు కోక పోవడం లేదా తటస్థంగా ఉండడం అనే అర్థంలో ఇక్కడ ఈ పదాన్ని వాడడం లేదు. అన్ని పారమితలలోకి కష్టమైంది, ఆవశ్యకమైంది ఈ ఉపేక్షయే. ముఖ్యంగా

అటూ ఇటూ ఊగిస లాడే అదృష్టం, దురదృష్టంలతో అసమంగా ఉండే ఈ ప్రపంచంలో నివసించే సామాన్యుడికి, ఇది కష్టసాధ్యం.

తృణీకారాలు, అవమానాలు మానవాళికి సహజ భాగదేయం. ప్రశంసా నిందలు, లాభ నష్టాలు, బాధా సుఖాలు అంతే. అటువంటి ఒడిదుడుకుల జీవితంలో బోధిసత్త్వుడు, పరిపూర్ణ ఉపేక్షను పాటిస్తూ, నిశ్చల శిలలా నిలబడ ప్రయత్నిస్తాడు.

బాధా సుఖ సమయాలలో, ప్రశంసా నిందలలో అతడు సమతూకంతో ఉంటాడు. ఏ శబ్దానికి చలించని సింహంలా, అతడు విష పూరిత మాటల ఈటెలకు చలించడు. వల కంతలకు అంటని గాలిలా, ఈ పరివర్తనా మయ ప్రపంచంలోని భ్రమైక సుఖాలకు అంటుకు పోడు. తను పుట్టిన పంకిలంతో పద్మం ఎలా మురికి కాదో, అతడు ఈ ప్రపంచంలో ప్రాపంచిక లోభాలతో మైలపడి పోక, ఎప్పుడూ ప్రశాంతంగా, నిర్మలంగా ఉంటాడు. 'అలలు సముద్ర గర్భ ప్రశాంతిని ఎలా చెదరగొట్టలేవో, అలాగే అతని మనస్సూ చెదరదు''[3]

ఇంకా, మైత్రిని పాటించే బోధిసత్త్వుడు, వాంఛ (చంద) ద్వేషం (దోస) భయ, మోహ (ignorance) లతో ప్రభావితం కాక అందరికీ న్యాయం చేస్తాడు. పై పారమితలను బట్టి చూస్తే, బోధిసత్త త్వం పూర్తిగా, స్వార్థత్యాగం, శిక్షణ, పరిత్యాగం, గాఢ ప్రజ్ఞ (సతీ), విరియ, సహనం, సత్య సంధత, నిశ్చయం, అపారప్రేమ, పరిపూర్ణ మానసిక సమతౌల్యాలని అర్థ మవు తుంది.

★ ★ ★

ఈ పది పారమితల కంటె అదనంగా బోధిసత్త్వుడు మూడు రకాల శీలాన్ని (చరియా) ఆచరించాలి. అవి: బుద్ధి చరియ అంటే స్వీయాభివృద్ధిని విస్మరించ కుండ జ్ఞానంతో మంచి చేయడం. నాట్యత్థ చరియా అంటే చుట్టపక్కాల అభివృద్ధికి పాటు పడడం, లోకథ చరియా అంటే ప్రపంచం మొత్తానికి ఉపశమనం కలిగేలా పని చేయడం.

రెండోరకం చరియా అంటే బంధు ప్రీతికాదు, పక్షపాతం లేకుండ బంధు జనం క్షేమాన్ని పెంపొందించడం.

ఈ విధంగా పది పారమితల ఉన్నతస్థాయి పరిపూర్ణత వరకూ ఆచరిస్తూ, అదే సమయంలో మూడు చరియాలను పెంపొందించు కొంటూ, నిరోధించలేని కర్మశక్తితో, అటూ ఇటూ తోయబడిన, తుఫానుతో కదలించబడిన సంసార సంద్రంలో, అనేక జన్మలలో వేరు వేరు కాలాలలో, అభివ్యక్తమవుతూ పయనిస్తూ ఉంటాడు. ఒకప్పుడు బలోపేతమైన సక్కగా లేదా వెలుగు వెదజల్లే దేవ గా, మరొకసారి ఉన్నత, నీచ మానవుడుగా,

మళ్ళీ జంతువుగా, పారమితల పరాకాష్ట చేరి అంతిమంగా తుసిత స్వర్గంలో జన్మించేవరకు యానం చేస్తూనే ఉంటాడు. ఈ భూమి మీద సమ్మాసంబుద్ధగా జన్మ ఎత్తే శుభ సమయం వచ్చే వరకు ఎదురు చూస్తూ అక్కడే ఉంటాడు.

సార్వత్రిక అనుభవాన్ని ఆర్జించేందుకు బోధిసత్త్వుడు ఉద్దేశ పూర్వకంగా, వివిధ రూపాలలో అభివ్యక్త మవుతా డనుకోవడం సరికాదు. ఉల్లంఘించ వీలులేని కమ్మనియమం నుంచి ఎవడూ తప్పించుకో లేడు. పునర్జన్మకు అంతం పలికిన బుద్ధులు, అర్హంతలు విషయంలో తప్ప, అది (కర్మ) ఒక్కటే వ్యక్తుల భావి జన్మలను నిర్ణయిస్తుంది[4].

అతని అంతర్గతం పుణ్యం కారణంగా , ఎలాగైన, బోధిసత్త్వునికి కొన్ని ప్రత్యేక శక్తులున్నాయి. ఉదాహరణకు అతడు అసంఖ్యాక యుగాల ఆయు ప్రమాణమున్న బ్రహ్మలోకంలో జన్మిస్తే, తన సంకల్పబలాన్ని ఉపయోగించి, అక్కడ నివసించ కుండ, పారమీలను ఆచరిస్తూ ప్రపంచాన్ని సేవించే మరోతగిన చోట తిరిగి పుడతాడు.

ఈ ఐచ్ఛిక మరణం కాక, సంసార చక్ర పర్యాటనలలో సంచితమైన తన బీజరూప కమ్మశక్తి ఫలితంగా, బోధిసత్త్వుడు తిరిగి పుట్టని పద్దెనిమిది స్థితులు న్నాయని, జాతక వ్యాఖ్యానం చెబుతున్నది. ఉదాహరణకు, అతడు ఎప్పుడూ గుడ్డి, చెవిటిగా పుట్టడు; కమ్మను దాని ఫలితాలను కాదనే వాడుగా అతడు ఎప్పుడూ పుట్టడు. అతడు జంతు ప్రపంచంలో పుడతాడు కాని ఏనుగు కంటె పెద్దగా కాకుండా దీర్ఘ చంచువు (పొడవాటి ముక్కుగల పక్షి) కంటె చిన్నగా కుండా పుడ తాడు. అతడు దుఃఖంతో బాధితుడు కావచ్చు. కాని అన్నింటికంటే అధో దుఃఖస్థితికి మాత్రం పోడు. అనాగామిలు తిరిగి పుట్టే శుద్ధావాసలలో బోధిసత్త్వుడు పుట్టా లనుకోడు; ఇతరులకు సేవ చేసే అవకాశం లేని అరూపలోకాలలో అతడు పుట్టాలని కోరుకోడు.

ఎవరైన ఇలా అడగవచ్చు: అతడి జన్మ పరంపర గతిలో బోధిసత్త్వునికి తాను బుద్ధత్వం కోసం ఆకాంక్షిస్తున్నట్లు తెలుసా?

కొన్నిసార్లు అతనికి తెలుసు, కొన్నిసార్లు తెలియదు.

కొన్ని జాతక కథల ప్రకారం, కొన్నిసార్లు బోధిసత్త్వ గౌతమకు తాను బుద్ధత్వం కోసం శ్రమిస్తున్నట్లు పూర్తిగా తెలుసు. విసయసెట్ఠి జాతక(No. 340)ను ఉదాహరణగా ఉటంకించ వచ్చు. ఈ ప్రత్యేక కథతో సక్క బోధిసత్త్వుని ఎందుకు అంత అసాధారణ ఔదార్యంతో ఉన్నారని అడుగుతాడు. అది ఏరకమైన ప్రాపంచిక శక్తికోసం కాదు, కేవలం పరమ బుద్ధత్వాన్ని పొందడం కోసమేనని సమాధానం చెబుతాడు. కొన్ని జన్మమలో, ఉదాహరణకు జోతి పాల్ జన్మలో, తనలో ఉన్న ఆ ఉన్నత ఆకాంక్ష తెలియక పోవడమే కాదు, పవిత్ర పదమైన

'బుద్ధ'ను ఉచ్చరించిన మాత్రానినే, కులీన బుద్ధకశ్యప ఆచార్యుని దూషించడం గూడ జరిగింది. ఈ బుద్ధుని నుంచే అతడు తన అంతిమ ఆవిష్కారాన్ని (Revelation) పొందాడు.

మనలో ఎవరైతే ఈ ప్రపంచాన్ని సేవించడానికి మన జీవితాలను అంకితం చేస్తామో, వారూ బోధిసత్త్వులు కావచ్చు. బోధిసత్త్వ ఆదర్శం అతి మానవుల (Superman) కే ప్రత్యేకితమని భావించ నవసరం లేదు. ఉత్సాహం పరిశ్రమ ఉంటే ఒకడు చేసిందాన్ని మరొక డెవడైనా చేయ వచ్చు. సేవా, పరిపూర్ణతల ఉన్నతాదర్శం మన జీవిత ధ్యేయంగా పెట్టుకొని, మన, ఇతరుల మంచి కోసం నిష్కామంగా పనిచేయ డానికి మనమూ ప్రయత్నిద్దాం.

''పరిపూర్ణుడవు కావడానికి సేవ చెయ్యి; సేవ చెయ్యడానికి పరిపూర్ణుడవుకా''.

**పాదసూచికలు**

1. పారమీ = పారమ్, ఆవల (అంటే, బోధి, లేదా జ్ఞానోదయం) + ఇ= వెళ్ళుట. శబ్దార్థపరంగా ఆవలితీరానికి చేర్చేది. పారమిత అనే పాళీ పదాన్ని గూడ అదే అర్థంలో ఉపయోగిస్తాడు.
2. Warren *Buddhism in Translations,* P. 27.
3. See chalmers, *Buddha's Teachings*, P. 221.
4. థేర్వాదానికి మహాయానానికి మధ్య ఉన్న సైద్ధాంతి కీలక భేదం ఇది. మహాయానం ప్రకారం, బోధిసత్త్వుడు, అన్ని జీవులు నిర్వాణం పొందేవరకు, తన నిర్వాణాన్ని వాయిదా వేసుకొంటాడు. (సంపాదకుడు).
5. *మజ్ఝిమనికాయ,* 11, 81, *ఘటీకార సుత్త,* P. 45.

నలభై రెండో ప్రకరణం

# బ్రహ్మ విహార

## సూక్ష్మధర్మాలు

''మానవజన్మ కడు దుర్లభం
మర్త్యుల జీవితం క్లేశ భూయిష్టం
ఈ అవకాశాన్ని చేజార్చుకోకు''

– ధమ్మపద, V.182,315.

మానవుడు, అనూహ్య బీజ రూప శక్తుల మార్మిక జీవి. అతనిలో అంతర్గతంగా ఋషి ప్రవృత్తి, నేర ప్రవృత్తులు - రెండు ఉన్నాయి. అవి ప్రశాంతిని భంగ పరిచే విధం మనకు తెలియదు. మనకు తెలిసిందల్లా, అవి వివిధ స్థాయిల్లో మనిషిలో నిద్రాణంగా ఉంటాయని మాత్రమే.

ఈ సంక్లిష్ట మానవ యంత్రంలో బలోపేతమైన మనస్సులో, మంచి, చెడ్డ గుణాలు మొగ్గదొడిగి పుష్పించిన ఆయా లక్షణాలను బట్టి, అతడు సమాజానికి ఒక వరమూ కావచ్చు, లేదా ఒక శాపమూ కావచ్చు.

ఉదాత్తులు, సేవాతత్పరులు, గొప్పవారు కాదలచు కొన్నవారు, తమను తాము ఉదాత్తీ కరించ దలచు కొన్నవారు, ఆదర్శప్రాయంగా, శీల పరంగా మానవాళికి సేవ చేయదలచు కొన్నవారు, మానవులుగా పుట్టిన ఈ స్వర్ణావకాశాన్ని ఉపయోగించ దలచు కొన్నవారు, అంతర్గతంగా ఉన్న దుర్గుణాలను తొలగించు కొని, నిద్రాణంగా ఉన్న సద్గుణాలను పెంపొందించ ప్రయత్నిస్తారు.

భూగర్భంలో దాగి ఉన్న విలువైన రత్నాలను త్రవ్వి తీయ డానికి మనుషులు ఎంతో వ్యయ ప్రయాసలు కోర్చి, ఒక్కొసారి తమ ప్రాణాలను ఇవ్వడానికి గూడ సిద్ధ పడతారు. కాని మనిషిలో అంతర్గతంగా ఉన్న సంపదను త్రవ్వి తీయడానికి నిర్విరామకృషి, పట్టుదల ఉండాలి. అతి పేద పురుషులు, స్త్రీలు గూడ ఈ పని చేయ వచ్చు. ఎందుకంటె, ఈ పారమార్థిక సంపదను సంచితం చేసు కోవ డానికి మామూలు సంపదతో పని లేదు.

విచిత్రం, మనిషిలో అంతర్గతంగా ఉన్న దుర్గుణాలు గూడ సహజాలు, అయత్నసిద్ధాలు. అంతే విచిత్రమైన మరో విషయం ఉంది. ప్రతి దుర్గుణానికి తద్వ్యతిరేకమైన సుగుణం

ఉంది. అయితే ఇది, అందరికి, అందుబాటులో ఉన్నా, అంత సహజంగాను, స్వయం చాలితంగాను కని పించదు. మనిషిలో ఉన్న ఒక శక్తిమంతమైన దుర్గుణం కోపం (దోస) ఈ చెడ్డ గుణాన్ని అణిచి, మనిషిని ఉదాత్తీకరించేది మైత్రి (మెత్తా).

ఈ ప్రపంచంలో ప్రబలంగా ఉన్న చాల దారుణాలకు, అనర్థాలకు మూలం మరో దుర్గణమైన హింస. దీనికి విరుగుడు కరుణ.

ఈర్ష్య మరో దుర్గుణం. ఇది మనిషి సమతుకాన్ని చెడ గొట్టి, అనారోగ్యకర స్పర్థలకు, పోటీలకు దారితీస్తుంది. ఈ విషానికి విరుగుడు ముదిత.

మానవుని సంయమనాన్ని తలక్రిందులు చేసే మరో రెండు సార్వత్రిక లక్షణా లున్నాయి. అవి : సంతోషకరమైన వాటి కోసం వెంపర్లాట, అసంతోషకరమైన వాటికి విముఖత. ఈ రెండు శక్తులను, ఉపేక్ష (equanimity) ను పొందించు కోవడం ద్వారా, తొలగించు కోవచ్చు.

ఈ నాలుగు మంచి గుణాల (మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష)ను ఉమ్మడిగా, పాలిలో, ''బ్రహ్మవిహార'' అంటారు. వీటిని ఉదాత్త ప్రవర్తన, ఉదాత్త స్థితులు లేదా దివ్యావాసాలతో పొంద వచ్చు.

ఈ సుగుణాలు మానవుని ఉన్నతుని చేస్తాయి. ఈ జీవితంలోనే, అవి మనిషిని, లోకోత్తర మానవుని చేస్తాయి. కుల, మత, వర్ణ, జాతి, లింగ భేదాలు లేకుండ అందరూ వాటిని అలవరుచు కొంటే, అందరూ ప్రశాంతతతో, ప్రపంచ పౌర ఆదర్శంతో, సమరసంగా జీవించ గల స్వర్గంగా ఈ భూమిని పరివర్తితం చేయ వచ్చు.

ఈ నాలుగు గుణాలను అపారాలంటారు (అప్పమఞ్ఞా). వాటిని అలా ఎందు కంటా రంటే, వాటికి పారం గాని, పరిమిత గాని లేవు. అందుకని వాటిని ఏ పాపవాదం లేకుండా, అందరికీ సారించాలి. అవి, జంతువులతో సహా సర్వ ప్రాణులకు పరివేష్టిత మవుతాయి.

మత విశ్వాసాలతో ప్రమేయం లేకుండ ఈ మంచి గుణాలను అలవరచు కొని, తనకు, ఇంకా ఇతరు లందరికి శ్రేయం కావచ్చు.

**మెత్తా (మైత్రి)**

ప్రథమ ఉదాత్త స్థితి మెత్తా (సంస్కృతం మైత్రి). దీని కర్థం గుండెను కరిగించేది అని లేదా ఒక మంచి స్నేహితుని స్థితి. ఏ పాపవాదం లేకుండ, సర్వజీవుల సంక్షేమ, సుఖాలను,

నిజాయితీతో నిజంగా వాంఛించడం అని దీనిని నిర్వచించ వచ్చు. దీనిని స్నేహ పూరిత ప్రవృత్తి అనవచ్చు, ఎందు కంటె నిజమైన స్నేహితుడు నిజాయితీతో తన స్నేహితుని హితం కోరతాడు.

'' ఒక తల్లి, తన ఏకైక సంతానాన్ని తన ప్రాణమైన ఇచ్చి ఎలా కాపాడు కొంటుందో, అలాగే సర్వజీవుల యెడ అపార మైత్రిని అలవరుచు కోవాలని,'' బుద్ధుడు సలహా ఇచ్చాడు.

ఇక్కడ చెప్పింది తల్లికి తన బిడ్డయెడ ఉన్న రాగపూరిత ప్రేమ గురించి కాదు. ఆ బిడ్డ క్షేమాన్ని కోరే నిజమైన నిజాయితీతో కూడిన వాంఛను. మైత్రి శారీరక ప్రేమ కాదు. వైయక్తిక వాత్సల్యమూ కాదు. ఎందుకంటే ఈ రెండింటి నుంచీ గూడ దుఃఖం జనిస్తుంది.

మైత్రికి ఇరుగు పొరుగు అని లేదు. ఎందుకంటే, ఇతరులకు, పొరుగు వారికి మధ్య అది తేడా చూపించదు. దానికి అందరూ ఒకటే.

మైత్రి కేవలం సార్వత్రిక సౌభ్రాతృత్వం కాదు. ఎందుకంటె, అది అన్ని ప్రాణులను జంతువులతో కలుపుకొని పరివేష్టిస్తుంది. మన అధో సహోదరులైన జంతువులకు కరుణ చూపించ వలసి ఉంటుంది. ఎందుకంటె, అవి నిస్సహాయాలు.

మైత్రి రాజకీయ సౌభ్రాతృత్వం కాదు. జాతి సౌభ్రాతృత్వం కాదు, జాతీయ సౌభ్రాతృత్వం కాదు, అది మతైక సౌభ్రాతృత్వం గూడ కాదు.

రాజకీయ సౌభ్రాతృత్వం అంటే ప్రజాస్వామికుల, సమసమాజవాదుల, కమ్యూనిస్టులు మొదలైన వారి పాక్షిక సౌభ్రాతృత్వంలాంటి, ఇంకా అదే రకం రాజకీయ దృక్పథం ఉన్నవారికి సంబంధించింది.

జాతి సౌభ్రాతృత్వం, జాతీయ సౌభ్రాతృత్వాలు ఒకే జాతి, ఒకే దేశానికి సంబంధించిన వారి సౌభ్రాతృత్వం. కొంత మంది జాతి వాదులు వారి జాతి వారిని ప్రేమిస్తారు. ఈ ప్రేమ ఎంత వరకు పోతుందంటే, వారు కొన్ని సార్లు, కనికరం లేకుండ అమాయకులైన స్త్రీ పురుషులను, పిల్లలను, తమకున్న తేలిక రంగు, అందమైన జుత్తు, నీలం కన్నులు, లేవన్న కారణాన చంపుతారు. శ్వేత జాతుల వారికి తమ తెల్ల చర్మం అంటే ప్రేమ, నలుపు వారికి నలుపు రంగు చర్మం అంటే, పీత వర్ణం వారికి పీత వర్ణ చర్మం అంటే, పింగల (brown) వర్ణం వారికి పింగల చర్మం అంటే, విపరీతమైన మక్కువ. ఇతర రంగుల వారిని కొన్ని సార్లు భీతితోను, అనుమానంతోను చూడడం జరుగుతుంది. తరచుగ, తమ జాతి అధిక్యతను రుజువు చేసు కోవ డానికి, వారు ఆకసం నుంచి బాంబుల వాన కురిపిస్తూ, దారుణ యుద్ధానికి ఒడి గడతారు. రెండో ప్రపంచ యుద్ధ దయనీయ సంఘటనలు మానవాళి మరిచి పోలేనివి.

విస్తృత ప్రాచీన జాతులలో, అల్ప సంఖ్యాక, కులాలు, వర్గాలు ఉంటాయి. ఇక్కడ, బలవంతులైన ప్రజా కంటకుల సౌభ్రాతృత్వం చాల పరిమితమైంది. ఎంత పరిమిత మైందంటే, పీడితులు యాదృచ్ఛికంగా ఏదో ఒక వర్గంలోనో వర్ణంలోనో పుట్టిన కారణాన, వారికి కనీస హక్కులు గూడ లేకుండా చేస్తారు. పాపం, మనం ఆ పీడా కారులను వారి సంకుచిత మనస్సును చూసి జాలి పడాలి.

అలాగని దానిని మత సౌభ్రాతృత్వం అన లేం. మత సౌభ్రాతృత్వ విచారణీయ పరిమితులు కారణంగా, జాలి లేకుండా తలలు తుంచ బడ్డాయి. దీని కారణంగానే నిజాయితీతో నిజం చెప్పే ఆడ మగ వారిని, వేయించారు. సజీవ దహనం చేశారు. అవర్ణ నీయ దారుణాలు జరిగాయి. ప్రపంచ చరిత్ర పుటలను భ్రష్టం చేసిన యుద్ధాలు జరిగాయి. బాగా జ్ఞానోదయం అయిం దనుకొన్న ఈ ఇరవయ్యో శతాబ్ది లోగూడ, ఒక మతావ లంబులు, కర్కశంగా, ఇతర మతాల వారిని, తమ విశ్వాసాలకు కట్టుబడి ఉండ లేదనో, లేదా వారికి వేరే విశ్వాసా లున్నాయనో, వేటాడి, వెంటాడి, చంపారు.

మత దృక్పథాలు కారణంగా, వివిధ మతాల వారు, సోదర సోదరీ మణులులా ఒకే వేదిక మీద కలవ లేక పోతే, కరుణను ప్రభోధించే మతాచార్యులు నిజంగా విఫలు రయ్యారను కోవాల్సి వస్తుంది.

మధుర మైత్రి ఈ అన్నిరకాల సౌభ్రాతృత్వాన్ని అధిగ మిస్తుంది. దాని పరిధిలో, పారంలో అది అపారం. దానికి అడ్డు గోడలు లేవు. వివక్ష దానికి లేదు. ప్రపంచాన్నే మాతృ భూమిగా, అందరిని సహజీవులుగా భావించేట్టు చేస్తుంది.

సూర్యుడు తన కిరణాలను అరమరికలు లేకుండా అన్నింటి మీద ఎలా ప్రసరిస్తాడో, ఉదాత్త మైత్రి గూడ తన మధుర దీవెనలను అందరిమీద - సంతోషకర, అసంతోషకర, పేద, ధనికుల మీద, ఉన్నత, అధోవర్గాల మీద, దుష్టుల మీద మంచి వారి మీద, పురుషుని మీద, స్త్రీ మీద, మనిషిమీద, జంతువు మీద – కురిపిస్తుంది.

తనను ప్రేమించిన వారి మీద, ద్వేషించిన వారి మీద, తనను చంపాలను కొన్న వారి మీద గూడ బుద్ధుడు కరుణను ప్రసరించాడు. ఆ బుద్ధుని అపార మైత్రి అటువంటిది.

తన కొడుకు రాహులుడు, తన వైరి దేవత్తుడు, తన సహచరుడు ఆనందుడు తనను అభిమానించే వారు, వ్యతిరేకించిన వారు– అందరిమీద బుద్ధుడు ఒకేవిధంగా మైత్రిని కురిపించాడు.

ఈ మైత్రిని తనపైకి ఎలా సారిస్తామో; స్నేహితుడు, శత్రువు, తటస్థుడు అందరి మీదకి అలాగే సమానంగా సారించాలి. అరణ్య మధ్యలో తను, తన స్నేహితుడు, శత్రువు, తటస్థుడు పయనించే టప్పుడు ఒక గజ దొంగ ఎదురై, అందులో ఒకరిని తనకు బలి పశువును చేయమని కోరాడను కోండి. ఆ పాంధుడు తనునే తీసుకొమ్మని గజదొంగను కోరితే, అప్పుడు తన మీద తనకు మైత్రి ఉన్నట్లు కాదు. మిగతా ముగ్గరిలో ఎవరినైనా ఒకరిని తీసు కొమ్మని చెబితే, అప్పుడూ ఆ ముగ్గరి యెడ అతనికి మైత్రి లేదు.

నిజమైన మైత్రి లక్షణం అది. ఈ అపార మైత్రిని సారిస్తు న్నప్పుడు తనను తాను విస్మరించ రాదు. ఈ సూక్ష్మ విషయాన్ని అపార్థం చేసు కోరాదు. ఎందుకంటె, ఆత్మ పరిత్యాగం ఒక మధుర సుగుణం, స్వాభిమాన రాహిత్యం మరో ఉన్నత గుణం. ఈ మైత్రి పరాకాష్ఠ, తాను ఇతర ప్రాణులతో, ఇతరుల మధ్య భేద భావం లేకుండా, తాదాత్మ్యం చెందడంలో ఉంది. అహం (నేను) అని పిలవ బడేది ఈ సర్వం (whole) లో లుప్తమవుతుంది. వేరు తనం అంతరిస్తుంది. ఏకత యధార్థీకరణం చెందుతుంది.

ఈ అందమైన పాళీ పదం 'మైత్రి' కి ఆంగ్లంలో సమానార్థక మేదీ లేదు. హితేచ్ఛ (good will) ప్రేమైక కరుణ (loving kindness), పరిహితేచ్ఛ (benevolence) సర్వజన ప్రేమ (universal love) లను సమానార్థకాలుగ చెప్పారు.

మైత్రికి విరుద్ధ సిద్ధాంతం కోపం, అహితం, ద్వేషం లేదా విముఖత. మైత్రి కోపంతో, పగలతో సహజీవనం చేయ లేదు.

బుద్ధుడు అంటాడు :

''ద్వేషం ద్వేషాన్ని హరించదు. ప్రేమ ద్వారానే అది అంతర్హిత మవుతుంది.[1]''

మైత్రి కోపాన్ని జయించ ప్రయత్నించడమే కాదు, ఇతరుల యెడ ఉండే ద్వేష పూరిత ఆలోచనలను గూడ సహించదు. మైత్రి ఉన్న వాడెవడూ, ఇతరులకు హాని తలపెట్టడు. ఇతరులను కించ పరచడు, దూషించడు. అటువంటి వ్యక్తి ఇతరులకు భయపడడు, మరొకరికి భయం కలిగించడు.

సూక్ష్మ పరోక్ష శత్రువు, మైత్రిని స్నేహితుని ముసుగులో ఢీ కొంటుంది. అది స్వార్థ పూరిత వాత్సల్యం (ప్రేమ). ఎందుకంటె అజాగరూక మైత్రిని కొన్ని సార్లు లాలస ఎదుర్కొంటుంది. ఈ పరోక్ష శత్రువు ఎలాంటి దంటే, ఏ కొండ కోనలలోనో, అరణ్యాలలోనో దూరంగా పొంచి ఉండి, ఇతరులకు హాని కలిగించే వ్యక్తి లాంటిది. వాత్సల్యం నుంచి దుఃఖం కలుగుతుంది, కాని మైత్రి నుంచి కాదు.

ఈ సున్నిత విషయాన్ని అపార్థం చేసు కో రాదు. తలిదండ్రులు తమ పిల్లలను ప్రేమించ కుండ ఉండ లేరు. పిల్లలూ తమ తలిదండ్రులను ప్రేమించకుండ ఉండ లేరు. భార్యలూ భర్తలూ అంతే, ఒకరినొకరు ప్రేమించ కుండా ఉండ లేరు. అటువంటి ప్రేమ కడు సహజం. పరస్పర ప్రేమ లేక ప్రపంచం మన జాలదు. ఇక్కడ స్పష్టం చేయాల్సిన అంశం ఏమిటంటే, నిస్వార్థ మైత్రి, మామూలు ప్రేమా – రెండూ ఒకటి కావు.

పరహితం మైత్రి ముఖ్య లక్షణం. మైత్రిని ఆచరించే వాడు ఇతరుల సంక్షేమాన్ని పెంచడంలో ఆసక్తి కన పరుస్తాడు. అతడు ఇతరులలో, వికారాన్ని కాక, మంచిని, అందాన్ని అన్వేషిస్తాడు.

**అనుషంగిక మైత్రి వలని శుభాలు**

1. మైత్రిని ఆచరించు వాడు సుఖంగా నిద్ర పోతాడు. ద్వేష రాహిత్యంతో తేలిక పడిన హృదయంతో నిద్రకుపక్రమిస్తే, అతనికి తేలికగా నిద్ర పడుతుంది. ప్రేమైక – కరుణామయులు ఈ విషయాన్ని రుజువు చేశారు. కళ్ళు మూసు కొన్న వెంటనే వారికి నిద్ర పడుతుంది.

2. ప్రేమ పూరిత హృదయంతో నిద్ర పోతే, అంతే ప్రేమైక హృదయంతో మేల్కొంటాడు. పరహిత కరుణామయ మూర్తులు నవ్వు ముఖాలతో నిద్ర లేస్తారు.

3. నిద్రలో గూడ, ప్రేమ మూర్తులు దుస్స్వప్నాలతో బాధితులు కారు. వారు మేల్కొని ఉన్న సమయంలో, పూర్తిగా ప్రేమతో ఉంటారు కనుక, నిద్ర కాలంలో గూడ ప్రశాంతంగానే ఉంటారు. వారు గాఢ నిద్రానా పోతారు, లేదా మంచి కలల నైనా కంటూ నిద్ర పోతారు.

4. మానవాళికి అతడు ప్రీతి పాత్రుడవుతాడు. అతడు ఇతరులను ప్రేమిస్తాడు గనుక, ఇతరులూ అతనిని ప్రేమిస్తారు.

   నగు మోముతో అద్దంలో చూసు కొంటే, అటువంటి ముఖమే అతనిని స్వాగతిస్తుంది. అలా కాక ఒకడు వికృత మోముతో అద్దంలో చూసు కొంటే అటువంటి ప్రతిబింబమే అతనికి ఎదు రవుతుంది. బాహ్య ప్రపంచానికి అతడు ఎలా ప్రతిస్పందిస్తాడో, అదీ అతని యెడ అలాగే ప్రతిస్పందిస్తుంది. దోష పూరితుడైన ఒకడు ఇతరులలోనే అనే దోషాలను చూస్తాడు. మంచిని అతడు విస్మరిస్తాడు. బోల్టన్‌హాల్ అనే ఒక ఆంగ్లకవి దీనినే చాల అందంగా చెప్పాడు:

   ''విమర్శ అనే సూక్ష్మ దర్శినితో నేను నా సోదరుని చూశాను;
   నేను అన్నాను: 'నా సోదరుడు ఎంత స్థూలంగా ఉన్నాడు!' ''

నేను అతనిని తృణీకారమనే దూర దర్శినితో చూశాను.
నేను అన్నాను: 'నా సోదరుడు ఎంత సూక్ష్మంగా ఉన్నాడు!'
నేను అప్పుడు సత్యమనే అద్దంలో చూశాను.
నేను అన్నాను: 'నా సోదరుడు ఎంత నాలా ఉన్నాడు!'''

మనలో కెల్లా మంచి వాళ్ళలో చెడ్డ, చెడ్డవాళ్ళలో మంచి ఉన్నప్పుడు, ఇతరులలో మనం అందలి వికారాన్ని ఎందుకు చూడాలి? మనం అందరిలోను మంచిని, సౌందర్యాన్ని చూడగలిగితే, అది ఆనంద దాయక మవుతుంది.

5. మైత్రిని పాటించే వాడు మానవేతరాలకు గూడ ప్రియమైన వాడు. జంతువులను గూడ అతడు ఆకర్షిస్తాడు. సన్యాసులు ప్రేమైక కరుణను ప్రసరిస్తూ, ఘోరారణ్యాల్లో క్రూర మృగాల మధ్య, వాటి వల్ల ఏ హాని లేకుండా, నివసిస్తారు.

6. అతడేదో అపరివర్తనీయ కర్మ చేస్తే తప్ప, మైత్రీ శక్తి ఉండడం వల్ల, అతనిని విషం గూడ ఏమీ చేయ లేదు.

మైత్రి నిర్మాణాత్మక ఆరోగ్యకరమైన శక్తి కావడం వల్ల, దానికి విరుద్ధ ప్రభావాలను ఎదుర్కొనే శక్తి ఉంది. దుర్మార్గపు ఆలోచనలు ఎలా మనిషిని విషపూరితం చేస్తాయో, అలాగే ప్రేమైక ఆలోచనలు ఆరోగ్య కరమైన, శారీరక ప్రభావాలను కలుగ చేయిస్తాయి. ఒక ఉదారశీలి, అంకిత భావం కల సుప్రియ (సుప్పియా) అనే మహిళ తొడలో గాయ మైంది. ఆమె బుద్ధుని చూడగానే అది నయం అయిందని గ్రంథాలు చెబు తున్నాయి. ఆమె యొక్క బుద్ధుని యొక్క ప్రశాంత ఆలోచనా ప్రకంపనలు, మిళితమై స్వాస్థ్య ప్రభావాన్ని కలుగ జేశాయి.

రాహులునికి ఏడేళ్ళ వయస్సు ఉన్నప్పుడు, బుద్ధుడు మొదటి సారి తన జన్మస్థలానికి తిరిగి వచ్చాడు. రాహులుడు బుద్ధుని చూసి, ''హే భిక్కు, మీ నీడే నాకెంతో ఆనంద దాయకంగా ఉంది'', అన్నాడు అ ప్రయత్నంగా. దీనిని బట్టి ఆ బాలుని, బుద్ధమైత్రి గాఢంగా ప్రభావితం చేసిందని తేలుతుంది.

7. అతడి మైత్రీ శక్తి కారణంగా అదృశ్య దేవతలు అతనిని రక్షిస్తారు.

8. మైత్రి మానసిక ఏకాగ్రతను త్వరితం చేస్తుంది. వైరి ప్రభావాలు మనస్సు మీద పడని కారణంగా, ఏక బిందు కేంద్రీకరణను తేలికగా సాధించ వచ్చు. మనస్సు ప్రశాంతం కావడంతో, అతడు తా సృష్టించుకొన్న స్వర్గంలో నివసిస్తాడు. అతని దగ్గరకు వచ్చిన వారికి గూడ అదే ఆనందం లభిస్తుంది.

9. మైత్రి అతని ముఖాభివ్యక్తిని సుందరం చేస్తుంది. ముఖం మనస్సును ప్రతిబింబిస్తుంది. ఒకనికి కోపం వచ్చి నప్పుడు, అతని గుండె, మామూలు కంటె రెండు మూడు రెట్లుగా పని చేసి రక్తాన్ని పంపుతుంది. కవోష్ణ రక్తం ముఖంలోకి వస్తుంది. అప్పుడు ముఖం ఎర్రగా లేదా నల్లగా మారుతుంది. కొన్ని సార్లు ముఖం జుగుప్సా కరంగా తయా రవుతుంది. దీనికి భిన్నంగా ప్రేమైక ఆలోచనలు హృదయాన్ని సంతోష పరిచి, రక్తాన్ని శుద్ధి చేస్తాయి. అప్పుడు ముఖం చూడ ముచ్చటగా ఉంటుంది.

బుద్ధునికి జ్ఞానోదయం అయిన తరవాత, కార్య కారణ సంబంధాల మీద పర్యాలోచన చేసి నప్పుడు, అతని హృదయం శాంతమై, రక్తం పరిశుద్ధమై, అతని శరీరం అనేక రంగులను - నీలం పసుపచ్చ, ఎరుపు, తెలుపు, నారింజ, ఇంకా ఈ రంగుల మిశ్రమాన్ని - విరజిమ్మి నట్లు గ్రంథాలు చెబుతున్నాయి.

10. మైత్రీ మూర్తికి ఏరకం ద్వేష పూరిత ఆలోచన లుండవు గనుక, అతడు ప్రశాంత మరణాన్ని పొందుతాడు. మరణం తరవాత గూడ, అతడి ప్రశాంత వదనం 'అతడు హాయిగా మరణించాడని' తెలియ జేస్తుంది.

11. మైత్రీ మూర్తి హాయిగా మరణిస్తాడు గనుక, తరవాత ఆనంద స్థితిలోనే జన్మిస్తాడు. అతడు ఝానాలను సాధించి ఉంటే, అతడు బ్రహ్మ లోకంలో జన్మిస్తాడు.

**మైత్రీ శక్తి**

ఈ ఐహిక మంగళాలే కాక, మైత్రికి అయస్కాంత శక్తి గూడ ఉంది. దూరంగా ఉన్న వారి మీద తన మంచి ప్రభావాన్ని వేయ గలదు. వారిని తన వైపు ఆకర్షించ గలదు.

ఒకసారి ఒక నగరాన్ని బుద్ధుడు దర్శించాడు. చాల మంది కులీనులు ఆయనకు స్వాగతం పలికారు. వారిలో ఆనందుని స్నేహితుడైన రోజ అనే అత డున్నాడు. అతని చూడగానే ఆనందుడు అన్నాడు: ''బుద్ధునికి స్వాగతం పలకడానికి మీరు రావడం నాకెంతో ఆనందంగా ఉంది.''

''అది కాదండి. నేను బుద్ధుని మీది గౌరవంతో, అతనికి స్వాగతం పలక డానికి ఇక్కడకు రాలేదు. బుద్ధనికి స్వాగతం పలక డానికి మాలో ఎవరం రాకపోయినా, రానివాడు 500 బంగారు నాణేలు అపరాధం చెల్లించాలని, మా లో మేము ఒప్పందం చేసుకొన్నాం. ఆ అపరాధ రుసుం భయంతో నేను ఇక్కడకు బుద్ధుని ఆహ్వానించ డానికి వచ్చాను,'' అని సమాధానం రోజ చెప్పాడు.

దీనితో ఆనందుడు కించిత్ అసంతోష కరంగా ఉన్నాడు. అతడు బుద్ధుని సమీపించి రోజకు ధమ్మోపదేశం చేయ వలసిందిగా అభ్యర్థించాడు.

రోజ శరీరం బుద్ధ మైత్రితో నిండి పోయింది. నిర్నిరోధమైన బుద్ధుని ఆకర్షక శక్తితో, చెప్పాలంటే, అతడు విద్యుదీ కరించ బడ్డాడు. తల్లి కోసం దూడ పరుగిడి నట్లు, బుద్ధుడు ఎక్కడ ఉన్నాడా అని, రోజ ఆరామంలోని ప్రతి గదికి పరుగులు తీశాడు. భిక్కులు అతనిని బుద్ధుని శాల వైపు మళ్ళించారు. అతడు తలుపు తట్టాడు. బుద్ధుడు తలుపు తెరిచాడు. లోపలికి వెళ్ళి, బుద్ధునికి నమస్కరించి, తరవాత ధమ్మం విని, పరివర్తను డయ్యాడు.

ప్రతి ఒక్కరు, యథా శక్త్యానుసారం, ప్రకటించగల మైత్రీ అయస్కాంత శక్తి అటు వంటిది.

ఒకసారి, బుద్ధుని హత్య చేసే ఉద్దేశంతో, నిషా ఎక్కిన ఏనుగును అతని వైపు తోలారు. బుద్ధుడు ప్రశాంతంగా తన ప్రేమను ఏనుగు పై ప్రసరించి, దానిని వినమ్రము గా చేశాడు.

బోధి సత్త్వుడు పూర్వ జన్మలో పిల్ల వాడుగా ఉన్నప్పుడు, అతని తండ్రే అతనిని చంపమని ఆజ్ఞాపించి నప్పుడు, అతడు అపారమైత్రిని ప్రదర్శించిన అందమైన కథ ఒకటి ఉంది. అతడు బాలుడే అయినా గూడ బోధిసత్త్వుడు ఇలా తల పోశాడు:

''నా మైత్రీ ప్రదర్శనకు ఇక్కడొక స్వర్ణావకాశం ఉంది. నా తండ్రి నా ఎదుట ఉన్నాడు. నా మంచి అమ్మ దుఃఖిస్తోంది. తలారి వాడు నా కాళ్ళు చేతులు నరక డానికి సిద్ధంగా ఉన్నాడు. బలి పశువునైన నేను మధ్యలో ఉన్నాను. ఏతేడాలు లేకుండ నేను నలుగురిని సమానంగా ప్రేమించాలి. ఈ దారుణ చర్యవల్ల నా తండ్రికి ఎటువంటి దుఃఖమూ కలుగ కుండుగాక! భవిష్యత్తులో నేనొక బుద్ధుడు నవుతాను!''

బోధిసత్తుడు, ఒకసారి, తన పూర్వ జన్మలో, రాజోద్యాన వనంలో, సహన వ్రత మాచ రిస్తున్నాడు. త్రాగుబోతు రాజు, అతని సహనాన్ని పరీక్షించాలని, అతనిని కొట్టి, కాళ్ళు చేతులు నరికి వేయమని తలారిని ఆదేశించాడు. అయినా అతని సహనం చెక్కుచెదర లేదు. దీనితో మరింత అసహనుడైన రాజు అతని ఎదురు రొమ్మున తన్నాడు. రక్తం మడుగులో, మరణాసన్న స్థితిలో ఉన్న బోధిసత్త్వుడు, రాజును దీర్ఘాయుష్కుడు కమ్మని ఆశీర్వదించి, తన లాంటి వారికి ఎప్పుడూ కోపం రాకుండు గాక అని కోరు కొన్నాడు.

భిక్కులు మైత్రిని ఎంత వరకు పాటించా లంటే, భూమిని తవ్వితే జీవులు మరణిస్తాయనే కారణంగా, తాను భూమిని త్రవ్వడం గాని, తవ్వించడం గాని చేయ రాదు.

బుద్ధుడు చేసిన ఈ దిగువ హెచ్చరిక వల్ల, భిక్కు పాటించ వలసిన మైత్రీ ప్రామాణికత ఏమిటో అర్థం అవుతుంది.

''బంది పోట్లు నీ అవయావాలను, రెండు పిడుల రంపంతో కోసి వేస్తే, నీ హృదయం అప్పుడు ద్వేష పూరిత మైతే, నీవు నా బోధను పాటించినట్లు కాదు.''

అంతటి సహనం అతి కష్టం, కాని బుద్ధుడు తన అనుచరుల నుంచి ఆశించేది అంతటి పరమ ధార్మిక ఆదర్శాన్నే.

బుద్ధుడే అటువంటి ఉన్నత ఆదర్శాన్ని ప్రదర్శించాడు.

''రణ భూమిలో విల్లు విడిచిన శరా ఘాతాలకు తట్టుకొని ఏనుగు ఎలా నిలబడు తుందో, అలాగే, నేను దూషణలను భరిస్తాను; కాని చాలమంది అంత శిక్షితులు కారు''[2].

ఇవ్వాళ ప్రపంచం గందరగోళంతో యుద్ధ ఘూర్ణితమై ఉంది. ఒక రంటే ఒకరు భయపడి, అంబుల పొదుల నిండ దేశాలు ఆయుధాలు సమకూర్చు కొంటున్నాయి. ఏక్షణమైనా పైకొనే అణ్వాయుధాలు ప్రాణాలను అరచేతిలో పెట్టు కొనేట్లు చేశాయి. ప్రశాంతంగా జీవించ డానికి, సోదర సోదరీమణులులా సమరస భావనతో జీవించడానికి అటువంటి ఈ ప్రపంచానికి సార్వత్రిక మైత్రి ఆవశ్యకత ఎంతో ఉంది.

బాంబులు, మారణాయుధాలతో ఒకరి నొకరు బెదిరించు కొంటున్న ఈ సమయంలో మైత్రి అచరణ సాధ్యమా?

సరే, పై నుంచి బాంబుల వర్షం కురుస్తుంటే, బలహీనులైన ప్రజలు ఏమి చేయ గలరు? అటువంటి ప్రళయాన్ని వారు ఆప గలరా?

అపరిహరనీయ మరణం తప్ప నప్పుడు, అటువంటి దారుణాయుధాలకు సమాధానం మైత్రి యే.

యుద్ధానికి కాలు దువ్వే దేశాలకు ఈ ఆధ్యాత్మిక మైత్రిని భౌతిక వినాశకర ఆయుధాలకు బదులు ప్రక్షేపించాలని బలాధికారాలతో గాక, న్యాయం ప్రేమలతో ప్రపంచాన్ని పాలించాలని నచ్చ చెప్ప గలిగితే, అప్పుడే ఈ ప్రపంచంలో నిజమైన శాంతి సౌఖ్యా లుంటానికి వీలుంది.

ఆచరణ సాధ్యం కాని పెద్ద సమస్యలను ఆవల ఉంచి, తాను తనతో, మిగతా మానవాళితో, మైత్రీ గుణాన్ని అలవరచు కోవాలని సలహా ఇవ్వాలి.

**మైత్రిని ఆచరించడం ఎలా?**

ఈ మైత్రీ ధ్యానానికి సంబంధించిన కొన్ని ఆచర ణాత్మక సూచనలు :

మైత్రిని ముందుగా తన మీదికి తిప్పు కోవాలి. అలా చేస్తు న్నప్పుడు, మనస్సును శరీరాన్ని గూఢ సుఖ శాంతులకు సంబంధించిన సకారాత్మక ఆలోచనలతో నింపు కోవాలి.

తాను ఎలా ప్రశాంతంగా, సుఖంగా, దుఃఖ విముక్తునిగా, వ్యాకులతా, కోపాలు లేకుండా ఉండాలో అతడు ఆలోచించు కోవాలి. అప్పు డతడు మూర్తీభవించిన మైత్రి అవుతాడు. మైత్రీ కవచం ఏర్పడింది కనుక, అతడు అన్ని వైరి ప్రకంపనలను, నకారాత్మక ఆలోచనలను తెంపి వేసు కొంటాడు. చెడుకు మంచిని, కోపానికి ప్రేమను, అతడు బదులుగా ఇస్తాడు. అతడు ఎప్పుడూ సహనంగా ఉంటాడు. ఎవరి యెడ ఏ సందర్భంలోను, కోపం జనించే అవకాశాన్ని ఇవ్వడు. సుఖ సంతోషాలతో అతడు విలసిల్లుతాడు గనుక, తన దైనందిన జీవితంలో మైత్రిని ఆచరణలో పెట్టడం ద్వారా, ఇతరులకు బాహ్యాం గాను అంతరికం గాను, మైత్రిని చూపిస్తాడు.

ద్వేషాలోచనలకు దూరంగా, నిండ ప్రశాంతంగా అతడున్నప్పుడు, మైత్రిని ఇతరుల యెడ సారించడం అతనికి తేలికగా ఉంటుంది. తనకు లేని దేదీ అతడు మరొకరి కివ్వ లేడు. ఇతరులను సంతోషింప జేసే ముందు, తాను ముందు సంతోషంగా ఉండాలి. తనకు తాను సంతోషంగా ఉండ డానికి కావలసిన మార్గాలు, సాధనాలు అతనికి తెలిసి ఉండాలి.

ఇప్పు డతడు ఇతరులకు వైయక్తికంగాను, ఉమ్మడిగాను, సుఖశాంతులు, బాధలనుంచి, రోగం, వ్యాకులత, కోపాలనుంచి విముక్తి ఉండాలని ఆకాంక్షిస్తూ తనమైత్రిని వెద జల్లుతాడు.

మైత్రీ ఆకాంక్షలను తనచుట్టు పక్కాల, స్నేహితుల పైకి సారిస్తూ వారిని తటస్థులుగా చేస్తాడు. తనకు తన దగ్గర వారికి సుఖశాంతులను ఎలా ఆకాంక్షిస్తాడో, అలాగే తనకు తటస్థులైన ఇతరులకు సుఖశాంతు లుండాలని నిజాయితీతో ఆకాంక్షిస్తాడు. వారు బాధా దుఃఖాల నుంచి విముక్తులు కావాలని కోరతాడు. అంతిమంగా ఇది కొంత మేరకు కష్టమే అయినా, తన మైత్రిని అతడు తన శత్రువుల (ఉంటే) యెడ గూడ సారించాలి. మైత్రీ ఆచరణలో గనుక అతడు తనకు శత్రువులను కొన్న వారి పట్ల, స్నేహ పిచ్చుల దృక్పధాన్ని ప్రదర్శిస్తే, అతడు చేసిన ఈ పని వీరోచితమూ, మెచ్చుకో దగిందీ అవుతుంది.

తనతో మొదలెట్టి క్రమంగా, తనను ఇతరులతో తాదాత్మ్యం చేసుకొనే దాక, ఏ అరమరికలు లేకుండ, మత, జాతి, కుల, లింగ, వర్ణ భేదాలు లేకుండా, జంతువులతో సహా, అందరి యెడ మైత్రిని విస్తరింప జేయాలి. ఈ విశ్వం మొత్తంలో అతడు సంలీనమై అందరితో మమేకం అవుతాడు. అతని కిప్పుడు స్వార్థపరత్వ ఆలోచన లుండవు. అన్నిరకాల 'వేర్పాటు వాదాలను' అతడు అధిగమిస్తాడు. అతడు ఇక ఏ మాత్రం సంకుచిత మనుష్యుడు కాలేడు. కుల, జాతి, వర్గ, దేశ, మత పక్షపాత ధోరణులను కలిగి ఉండడు. ప్రపంచాన్నే

తన మాత్ర దేశంగా భావిస్తాడు. ఈ జీవన సముద్రంలో అతడు అందరిని సహజీవులుగా భావిస్తాడు.

**కరుణా (కరుణ)**

మానవుని ఉదాత్తీకరించే రెండో శీలం కరుణ. ఇతరులు కష్టాలలో ఉన్నప్పుడు మంచి వారి గుండెలను కరిగించేది లేదా, ఇతరులబాధలను తొలగించేది కరుణగా చెప్ప వచ్చు. దాని ముఖ్యలక్షణం ఇతరుల బాధను తొలగించడం.

కరుణామయుల హృదయాలు పూల కంటె మెత్తనివి. ఇతరుల బాధలను తీసి వేసే దాక వారు అవిశ్రాంతులు కారు, కాలేరు. ఇతరుల బాధలు తొల గించడంలో వారు తమ ప్రాణాలను సైతం అర్పించే వరకు పోతారు. ఆకలితో మాడుతున్న పులి, దాని పిల్లలకు తన శరీరాన్ని త్యాగం చేసిన బోధిసత్త్వుని ఉదాహరణగా పేర్కొన వచ్చు. ఇది వ్యాఘ్రి జాతకంలో ఉంది.

పర హితేచ్ఛ ప్రేరణతో ఇతరులకు సేవ చేయాలని ఒత్తిడి తెచ్చేది కరుణే. నిజమైన కరుణామయుడు తన కోసం కాక, ఇతరుల కోసం జీవిస్తాడు. ప్రతిఫలం ఆశించక, కనీసం కృతజ్ఞతలు గూడ ఆశించ కుండ, అతడు ఇతరులకు సేవలు చేసే అవకాశాల కోసం అన్వేషిస్తూ ఉంటాడు.

**ఎవరికి కరుణ అవసరం?**

మనలో చాలమందికి మన కరుణ అవసరం, పేద బిక్కి, ఆర్తులు, రోగులు, నిస్సహాయులు, ఏకాంతులు, అనాధలు, అజ్ఞులు, క్రూరులు, ఆశ్రితులు, అశిక్షితులు, – వీరు ఏమతానికి, ఏ జాతికి చెందినా – వీరికి దయామయుల, ఉదారస్త్రీ పురుషుల కరుణ అవసరం.

కొన్ని దేశాలు భౌతికంగా ధనవంతాలే అయినా, ఆధ్యాత్మికంగా పేదవి. మరికొన్నేమో ఆధ్యాత్మికంగా భాగ్యవంత మైనవి కాని భౌతికంగా పేదవి. ఈ దయనీయ స్థితిని భౌతికంగా, ఆధ్యాత్మికంగా భాగ్యవంతాలైన దేశాలు పరిగణనలోకి తీసు కోవాలి.

కనీస జీవన అవసరాలు తీరని దురదృష్ట పేద దేశాలను ఆదుకోవడం ధనిక దేశాల పరమ విధి. తమకు ఏమాత్రం అసౌకర్యాల కలగ కుండి, ఎక్కువగా ఉన్న దేశాలు తమ అదనపు సంపదను పేద దేశాలకు తప్పక ఇవ్వ వచ్చు. 'తలుపుకు చలి వేయదు. పేదకు చలి వేస్తుంది', అని తల్లితో చెబుతున్న పేదవాని మాటలు విని, ఒకసారి ఒక యువ విద్యార్థి తమ ఇంటి 'తలుపు – తెర' (door curtain) గుడ్డను ఆపేదకు దానం చేశాడట. యువతీ యువకులలో అటువంటి దయార్ద్ర హృదయ దృక్పథాన్ని మెచ్చు కోవాలి

కొన్ని ధనికదేశాలు, అభివృద్ధి చెందని దేశాలకు సాయం చేయాలనే తలంపుతో, ముఖ్యంగా ఆసియా దేశాలకు అన్నివిధాల సాయం చేయాలనే ఉద్దేశంతో, లోకహితైక సంఘాలుగా ఏర్పడడం ముదావహం. అవసరమైన వారికి, పేదలకు అన్నివిధాల సహాయ పడాలని, అన్ని దేశాలలోను మగ, ఆడ, యువత ధర్మ సంఘాలు ఏర్పడ్డాయి. ఈ సందర్భంగా, మత సంస్థలు గూడ తమ వినమ్ర పద్ధతిలో; వాటి విధులను అవి నెరవేరు స్తున్నాయి. వృద్ధులకు ఆశ్రయాలు, అనాధాశ్రమాలు, ఇంకా అటువంటి సంస్థలు, అభివృద్ధి చెందని దేశాలలో, చాల ఆవశ్యకమై ఉన్నాయి.

భిక్షాటనం వృత్తిగా మారిన కొన్ని దేశాలలో, భిక్షుక సమస్యను ఇంకా పరిష్కరించ వలిసి ఉంది. ఆత్మ గౌరవం ఉన్న ఏ దేశానికైనా అడుక్కొనే వారున్నారంటే, అది అవమానకరమే. అందుకని భిక్షకుల యెడ కరుణ కారణంగా నైనా, ఆయా ప్రభుత్వాలు భిక్షుక సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించాలి.

భౌతికంగా పేద వారిపై భౌతికంగా ధనికులైన వారు కరుణ చూపి వారిని పైకి తీసుకు రావాలని ప్రయత్నించి నట్లే, ధార్మికంగా ధనికులైన వారు ధార్మికంగా పేదలైన వారిపై కరుణ కురిపించి, వారిని ఉదాత్తీకరించాలి, వారు ధనికులైనా కూడా. కేవలం ధనం మాత్రమే సుఖాన్నివ్వ లేదు. మనశ్శాంతి భౌతిక సంపదతో రాదు, ఆధ్యాత్మిక సంపదతో వస్తుంది. ఈ ప్రపంచంలో చాల మంది ధార్మికాహారం అవసరమై ఉన్నారు. అది వారికి అంత తేలికగా లభించదు. ఎందు కంటే ధార్మిక దరిద్రులు, భౌతిక దరిద్రులకంటె సంఖ్యాపరంగా ఎంతో మంది ఎక్కువగా ఉన్నారు. వీరు ధనిక,-పేద వర్గాలు – రెండింటిలోను ఉంటారు గనుక వీరి సంఖ్య అధికం.

పేదరికం కంటె ప్రపంచం అంతట 'రోగం' ఎక్కువగా ఉంది. కొంతమంది శారీరకంగా రోగులైతే, కొందరు మానసిక రోగులు. విజ్ఞాన శాస్త్రం చాలవరకు మొదటి తరగతికి ప్రభావక వైద్యం అంద జేస్తుంది కాని, రెండో వర్గానికి అంద చేయ లేక పోతోంది. వీరు మానసిక వైద్య కేంద్రాలలో మగ్గి పోతున్నారు.

ఈ రెండురకాల రోగాలకు కారణా లున్నాయి. సరైన ఉపశమనం జరగా లంటే, దయామయులైన స్త్రీ, పురుషులు ఆకారణాలను తొలగించ డానికి ప్రయత్నించాలి.

అనేక దేశాలు మానవాళి రోగోపచారాలకే కాదు, జంతువుల రోగోపచారాలకు కూడ ప్రభావక చర్యలు చేపట్టాయి.

రోగులకు పరిచారం చేసి బుద్ధుడు ఆదర్శాన్ని నెల కొలిపాడు. శిష్యులను ఈ చిరస్మరణీయ మాటలలో హెచ్చరించాడు:

''రోగులకు సేవచేస్తే నాకు సేవ చేసి నట్లే''.

నిస్స్వార్థ వైద్యులు కొందరు బాధలు తొలగించడంలో ఉచిత సేవలు చేస్తున్నారు. తమ ప్రాణాలను సైతం లెక్క చేయక తమ పూర్తి కాలాన్ని, శక్తిని పేద రోగుల సేవార్థం వినియోగిస్తున్నారు కొందరు.

ఆసుపత్రులు, ఉచితవైద్యశాలలు మానవాళికి వరాలు అయ్యాయి. పేదవారికి ఉపయోగ పడడానికి ఇంకా వాటి అవసరం చాల ఉంది. అభివృద్ధి చెందని దేశాలలో వైద్య సౌకర్యాలు లేక బాధ పడుతున్నారు. వైద్యం కోసం రోగులను, దగ్గరలో ఉన్న ఆసుపత్రికి తీసుకెళ్ళా లంటే మైళ్ళ మైళ్ళు దూరం చాల అసౌకర్యంతో తీసుకు వెళ్ళాల్సివస్తోంది. కొన్ని సార్లు ఆరోగులు మార్గమధ్యంలోనే మరణిస్తున్నారు. గర్భిణులు ఎక్కువగా బాధ పడు తున్నారు. ఆసుపత్రులు, వైద్యశాలలు, మాతృ సేవా సదనాలు వెనకపడిన గ్రామాలలో చాల అవసరం.

అధోవర్గాలు, అనాధలు, ధనికులైన స్త్రీ పురుషుల కరుణకు తగిన వారు. కొందరైతే సేవకులకు, పనివాళ్ళకు తగిన వేతనా లివ్వడం లేదు. వారికి తగిన ఆహారం, దుస్తులు, ఇవ్వడం లేదు. వారిని సరిగా చూడడం లేదు కూడా.

వారికి న్యాయం కూడ సరిగా జరగడం లేదు. వారి గురించి వారి వాణిని వినిపించే వారెవరూ లేరు గనుక, వారు శక్తి హీనులు, పరిత్యక్తులు. కొన్ని అసాధారణ సందర్భాలలో అమానుష క్రౌర్యం ప్రదర్శిత మైనప్పుడు ప్రచారం లభిస్తుంది. అటువంటి అనేక సంఘటనలు తెలియ రావడం లేదు. ప్రతి విషయాన్ని భూమాత మౌనంగా భరిస్తున్నట్లే, ఈ దురదృష్ట వంతులు మార్గాంతరం లేక వొంగి వొంగి అనుభవించ వలసిందే. దుఃఖం భరింప రాని స్థాయి చేరి నప్పుడు, వారు నిరాశా నిస్పృహలతో ఆత్మహత్యకు పాల్పడతారు.

శారీరకంగా బాధపడే వారి కంటే, దుర్మార్గులు, క్రూరులు, అజ్ఞానులు కరుణకు బాగా తగిన వారు. ఎందుకంటే వీరు మానసికంగా, ధార్మికంగా గూడ రోగులే. వారిని నిందించి అవమానించరాదు. వారి లోపాలకు, అవగుణాలకు వారిని జాలితో చూడాలి. తల్లి తన బిడ్డ లందరిని సమానంగానే చూసినా రోగ గ్రస్తమైన బిడ్డ మీద ఎక్కువ కరుణను చూపుతుంది. అలాగే గూడ, ధార్మిక రోగులను – వీరి రోగం వీరి శీలాన్ని పాడు చేస్తుంది కనుక – ఎక్కువ దయతో చూడాలి.

ఉదాహరణకు బుద్ధుడు, వేశ్య అయిన ఆమ్రపాలిని, హంతకుడైన అంగుళిమాలను ఎక్కువ కరుణతో చూశాడు. తరువాత వారిద్దరూ అతని అనుయాయులై తమ శీలాన్ని పూర్తిగా మార్చు కొన్నారు.

వారెంత దుర్మార్గులైన, గొప్పతనం అందరిలోను గుప్తంగా ఉంటుందని మనం అర్థం చేసుకోవాలి. బహుశ, సరైన సమయంలో సరైన మాట ఒక్కటి చాలు, ఒక వ్యక్తి మొత్తం దృక్పథాన్ని మార్చడానికి.

అశోక మహాచక్రవర్తి ఎన్నో నేరాలు చేశాడు. అందుకని 'క్రూరుడైన అశోకుడు' అని కళంకిత నామం అతనికి వచ్చింది. తరవాత ఒక నవ భిక్కు మాటలు', ''మరణ రాహిత్య పథం నిర్విరామ యత్నం,'' అనేవి అశోకుని పూర్తిగా మార్చి వేసినవి. దానితో అశోకుడు ''ధర్మాశోకు''డయ్యాడు.

బుద్ధి లేని వారి సామీప్యం కూడదని బుద్ధుని సలహా. దీని అర్థం, వారిని మార్చడానికి గూడ వారితో సంబంధం పెట్టు కోరాదని కాదు. అంటు వ్యాధులున్న వారి దరికి జనులు పోరు. కాని దయామయులైన వైద్యులు వారికి బాగు చేయ డానికి వారి దగ్గరకు వెళతారు అలా కానట్లయితే వారు చచ్చి పోతారు. వారి యెడ మంచివారు సహనం, కరుణ చూపక పోతే, క్రూరులు ధార్మికంగా చని పోతారు.

బుద్ధుడు ఒక నియమం ప్రకారం పేదలను, అజ్ఞానులను, దుర్మార్గులను వెతుక్కొంటూ వెళ్ళే వాడు. కాని సన్మార్గులు, గుణశీలురు ఆయన్ను వెతుక్కొంటు వచ్చే వారు.

మైత్రి లాగే, కరుణను గూడ, అపారంగా బాధితులు, నిస్సహాయులు అందరి యెడ, మూక జీవులు, ఫలదీకృత అండాలతో సహా, సారించాలి. కులం, రంగు, జాతి కారణంగా మానవాళి కున్న హక్కులను కాదనడం అమానుషం, క్రూరం. జంతువులను చంపి, చంపించి వాటి మాంసం తినడం, మానుష కరుణ అనిపించు కోదు. పైనుంచి బాంబుల వర్షం కురిపించి, దారుణంగా లక్షలాది స్త్రీ, పురుషుల, పిల్లల ప్రాణాలు తీయడం అన్నింటి కంటే క్రూర మైనది. మానవుని నేరాలలో ఇదే అత్యంత చెడ్డది.

ఈ రోజున దయాహీన, ప్రతి హింసాయుత ప్రపంచం, ఈ పృధ్వి మీద, అత్యంత విలువైన వస్తువును – ప్రాణాన్ని – పశు శక్తి పీఠం ఎదుట బలి ఇస్తున్నది. కరుణ ఎక్కడకు పారి పోయింది?

ఈ పృధ్వీ, ముఖం నుంచి హింసా, క్రౌర్యాలను పారద్రోలడానికి, ఈనాడు ఈ ప్రపంచానికి దయామయులైన స్త్రీ పురుషులు కావాలి.

బుద్ధ కరుణ కన్నీరు కార్చడంలో లేదు, ఎందు కంటె, కరుణకు పరోక్ష శత్రువు రాగపూరిత దుఃఖం (దొమనస్స).

కరుణ దుఃఖ భాగులను కౌగలించు కొంటె, మైత్రి సర్వప్రాణులను – సుఖులైన, దుఃఖులైనా – కౌగిలించు కొంటుంది.

**ముదితా**

మూడో ఉదాత్త గుణం ముదితా. ఇది కేవల అనుకంప కాదు. దాని ప్రత్యక్ష శత్రువైన ఈర్ష్యను మట్టు బెట్టే సహానుభూతి, సంతోషం లేదా గుణగ్రహ సంతోషం.

మనలను అతలా కుతలం చేసే ఒక శక్తి అసూయ. కొంత మంది ఇతరల జయ విజయాలను చూసి ఓర్వ లేరు. వారి ఓటమికి వీరు సంతోషిస్తారు కాని విజయానికి కాదు. వారిని అభినందించ డానికి మారు, వారిని వినాశం గావించడానికి, శిక్షించడానికి, దూషించ డానికి వెన కాడరు. ఒక విధంగా ముదిత ఇతరుల కంటె ఎక్కువగా తనకు సంబంధించిందే. ఎందుకంటే తనను నాశనం చేసే తనలోని అసూయను తొలగించడానికి అది సంబంధించింది. అంతే కాక, అది ఇతరులకు సహాయ పడుతుంది. ఎలాగంటే ముదితను ఆచరించే వారు ఇతరుల అభివృద్ధికి అడ్డు పడరు.

తనకు దగ్గర వారి విజయం సంతోష కారకమే. కాని తమ వైరుల విజయం చూసి సంతోషించ లేరు. అవును, అధిక సంఖ్యాకులకు ఆపని చేయడం చాల కష్టం. తమ వైరులను నాశనం చేయ డానికి వీలైనన్ని ఆటంకాలు కల్పించడంలో వారు ఆనందం పొందుతారు. మంచివారిని, గుణవంతులను, శిలువవేసి, విషం పెట్టి, చంపడానికి గూడ వారు వెనకాడరు.

సోక్రటీజ్ కు విష మిచ్చారు. ఏసును శిలువ వేశారు. గాంధీని కాల్చి చంపారు. అటువంటిది ఈ క్రూర, లోభ ప్రపంచ స్వభావం.

ముదితాచరణం కంటె మైత్రి, కరుణ ఆచరణలు తేలిక. ఎందుకంటె దీనికి వ్యక్తిగత ప్రయత్నం, బలమైన సంకల్పం ఉండాలి.

ప్రాచ్య దేశాల అభివృద్ధికి పాశ్చాత్య దేశాలు సంతసిస్తున్నాయా? పాశ్చాత్యదేశాల అభివృద్ధికి ప్రాచ్య దేశాలు సంతసిస్తున్నాయా? ఒక దేశం అభివృద్ధిని చూసి, మరో దేశం హర్షిస్తుందా? ఒక జాతి మరోజాతి ప్రగతిని చూసి మెచ్చు కొంటుందా? ధర్మాచరణకు కంకణం కట్టుకొన్న ఒక మత శాఖకు, మరో మత శాఖ ఆధ్యాత్మిక ప్రభావాన్ని చూసి కన్ను కుట్టడం లేదా?

ఒక మతాన్ని చూస్తే మరోమతానికి ఈర్ష్య. భూగోళంలో ఒక భాగాన్ని చూస్తే మరో భాగానికి కన్ను కుడు తుంది. ఒక సంస్థ అంటే మరో సంస్థకు పడదు. ఒక వ్యాపార సంస్థ అంటే మరో వ్యాపార సంస్థకు, ఒక కుటుంబం అంటే మరో కుటుంబానికి, తప్పిన విద్యార్థులకు ఉత్తీర్ణులైన విద్యార్థులంటే, కొన్ని సార్లు తొటి సోదరులు, సోదరీమణులతోనే ఒకరంటె ఒకరికి పడదు.

ఈ కారణానే, వ్యక్తులు తాము ఉదాత్తులు కావాలంటే, ఆంతరంగికంగా సుఖంగా ఉండా లంటే, వారు ముదితను ఆచరించాలి.

ముదిత ముఖ్య లక్షణం ఇతరుల అభ్యున్నతిని, విజయాన్ని చూసి సంతోషించడం. అంతేకాని నవ్వడం లాంటివి ముదిత లక్షణాలు కావు. ప్రహర్షం (పహాస) దాని పరోక్ష శత్రువు.

ముదిత అభివృద్ధి చెందే జీవులన్నింటిని కౌగిలించు కొంటుంది. అది వ్యక్తి ఇతరులను అభినందించే వ్యక్తి స్వభావం. విజేత అయిన యెడ అయిష్టతను అది తొలగిస్తుంది.

**ఉపేక్ష (సమచిత్తం)**

నాలుగో ఉదాత్త గుణం అన్నింటికంటె కష్టమైంది. అత్యంతావశ్యక మైంది. అది ఉపేక్ష లేదా సంయమనం. సమచిత్తం, భాషాపరంగా దీని అర్థం 'న్యాయంగా చూడడం', 'సూక్ష్మంగా దర్శించడం' లేదా 'పక్షపాత రహితంగా చూడడం' అంటే రాగ ద్వేషాలు లేకుండ, అనుకూల అననుకూల దృష్టి లేకుండ చూడడం.

ఇది మామూలు కుటుంబికి చాల అవసరం. ఎందు కంటె అతడు అసమతూక, నిలకడ లేని పరిస్థితులలో నివసించాలి.

అవమానాలు తృణీకరణలు జన సామాన్యానికి భాగ-దేయాలు. ప్రపంచ నిర్మితే అలా ఉంది, మంచి వాళ్ళను, సచ్ఛీలురను విమర్శించి, దాడి చేసే విధంగా. అటువంటి పరిస్థితులలో సమచిత్తాన్ని అవలంబించడం నిజంగా సాహసోపేతం.

లాభనష్టాలు, కీర్తి అప్రతిష్ఠలు, ప్రశంస నిందలు, బాధా సుఖాలు - ఈ ఎనిమిది ప్రాపంచిక పరిస్థితులు మానవాళిని ప్రభావితం చేస్తాయి. అటువంటి అనుకూల అననుకూల పరిస్థితులతో చాలమంది చికాకు పడతారు. పొగిడితే సంతోషం, తెగడితే కుంగి పోవడం. బుద్ధుడంటాడు: అటువంటి ఒడిదుడుకుల జీవితంలో, స్థిర శిలలా నిశ్చలంగా ఉన్నవాడు, పరిపూర్ణ సమచిత్తాన్ని అవలంబించిన వాడు జ్ఞాని.

బుద్ధుని అవమానించి నంతగా, విమర్శించి నంతగా, దాడి చేసి నంతగా, దూషించి నంతగా మరే మతాచార్యుని అవమానించ లేదు, విమర్శించ లేదు, దూషించ లేదు. అయినా అయనను ప్రశంసించి నంతగా, గౌరవించి నంతగా మరెవ్వరిని గౌరవించ లేదు, ప్రశంసించ లేదు.

ఒకసారి అతడు భిక్షకు వెళ్ళాడు. అధిక ప్రసంగి అయిన బ్రాహ్మణు డొకడు అతనిని అపాంక్తేయుడు★ (out cast) అన్నాడు. ఆ అవమానాన్ని ప్రశాంతంగా భరించి, పుట్టుక వల్ల ఎవడూ అపాంక్తేయుడు కాడు. అకులీన, శీలం భ్రష్టశీలం ఒకనిని అపాంక్తేయుని చేస్తాయి. బ్రాహ్మణుడు బౌద్ధంలోకి మారి పోయాడు.

---

★ తన సరసన, ఒకే పంక్తిలో కూచో తగని వాడు

బుద్ధుని భిక్షకోసం పిలిచి, ఒక గృహస్తు ఆరోజుల్లో బాగా ప్రబలతరంగా ఉన్న బూతు భాషలో, అతనిని తిట్టాడు. అతనిని పంది, మూర్ఖుడు, ఎద్దు మొదలైన పదాలతో దూషించాడు. కాని బుద్ధుడు అతనిపై ఏమాత్రం కోపగించు కోలేదు సరిగదా, తిరిగి తిప్పి కొట్ట లేదు. అతడు ప్రశాంతంగా గృహస్థుని ప్రశ్నించాడు:'' అతిథులు ఇంటికి వస్తే మామూలుగా నీ వేమి చేస్తావు?'' ''వారిని సంతోష పరచడానికి విందును ఇస్తాను.'' అని అతడు సమాధానం చెప్పాడు.

'' మంచిది వారు ఆ విందులో పాల్గొనక పోతే ఏమి చేస్తావు?'' బుద్ధుడు ప్రశ్నించాడు.

''అలాగైతే మేమే అందులో పాల్గొంటాము.''

''మంచిది, సోదరా, నీవు నన్ను మీ ఇంటికి భిక్షకు పిలిచావు. నీవు నన్ను దూషణ ప్రవాహంతో వినోద పరిచావు. నేను దానిని తీసుకోను. దయ చేసి నీవే దానిని తీసుకో,'' బుద్ధుడు ప్రశాంతంగా అన్నాడు.

అతడి శీలం పూర్తిగా మారి పోయింది.

''తిప్పి కొట్ట వద్దు. ఇతరుల నిన్ను తిట్టి నప్పుడు, పగిలిన జేగంటలా, నిశ్శబ్దంగా ఉండు. నీవు అలా చేస్తే, నీవు నిర్వాణాన్ని యధార్థీకరణం చెందించు కోక పోయినా, దానిని పొందినట్లే? అదీ బుద్ధుని సలహా.

క్రమ శిక్షణా రహిత నేటి ప్రపంచంలో, ఈ ''బంగారు మాటల''ను జాగరూకులమై గమనించాలి.

ఒక ఆస్థానానికి, చెందిన ఒక మహిళ కొంతమంది త్రాగుబోతులను, బుద్ధుని తిట్టమని పురి కొల్పింది. అప్పుడు అతని శిష్యుడైన గౌరవనీయ ఆనందుడు, మరో నగరానికి వెళదామని బ్రతిమి లాడాడు. కాని బుద్ధుడు చలించ లేదు.

ఒకసారి ఒక స్త్రీ.బూటకపు గర్భాన్ని నటించి తనను, ఆ స్థితికి తీసుకు వచ్చిన వాడు బుద్ధుడేనని నిందించింది. ఒక స్త్రీని అతని శత్రువులు చంపి, అనేరాన్ని బుద్ధుని మీదకు నెట్టారు. స్వయాన, తన దాయాది, అనుచరుడు అయిన దేవదత్తుడు, కొండ శిఖరం నుంచి ఒక రాతిని దొర్లించి, అతనిని చంపాలని విఫల ప్రయత్నం చేశాడు. అతని శిష్యులలోనే కొంతమంది అతడు అసూయా పరుడని, అతడు పక్షపాతి అని నిందించారు.

మరోవైపు అతని ప్రశంసా కీర్తనలను పాడారు. రాజులు అతని పాదాల వద్ద మోకరిల్లి, అత్యంతంగా గౌరవించారు.

భూదేవి లాగే, బుద్ధుడు ప్రతిదానిని నిశ్శబ్దంగా, పూర్ణ ఉపేక్షతో భరించాడు.

ప్రతి శబ్దానికి సింహం బెదరదు. అలాగే అదుపు లేని నాలుకల నుంచి వచ్చే విష పూరిత వచో బాణాలకు చలించ రాదు. వల కన్నులకు గాలి ఎలా అంటుకు పోదో, అలాగే క్షణ క్షణం మారే ఈ ప్రపంచ భ్రమ పూరిత సుఖాలకు అంటి పెట్టుకో రాదు. బురదలో పుట్టిన పద్మానికి బురద అంటదు. అలాగా ఈ ప్రాపంచిక ప్రలోభాలకు లొంగక, ఎప్పుడూ ప్రశాంతంగా ఉండాలి.

మొదటి మూడు గుణాలకు వలె, ఉపేక్షకు గూడ ప్రత్యక్ష శత్రువు రాగం. దాని పరోక్ష శత్రువు కనికరం లేక పోవడం లేదా తెలివి తక్కువగా దేనిని పట్టించు కోక పోవడం, ఉదాసీనం వహించడం.

ఉపేక్ష సుముఖతను, విముఖతను త్యజిస్తుంది. నిష్పక్షపాత ధోరణి దాని ముఖ్యలక్షణం. ఉపేక్షను అలవరుచు కొన్న వాడు వాంఛనీయ వస్తువులకు ఆకర్షితుడూ కాడు, అవాంఛినీయ వస్తువులకు వికర్షితుడూ కాడు.

పాపి అయినా, పుణ్యాత్ముడైనా అతని దృష్టిలో ఒకటే. ఎందుకంటే అతడు వారి మధ్య తేడా చూపించడు.

మైత్రి సర్వ జీవులను, కరుణ బాధితులను, ముదిత వృద్ధి చెందే వారిని, ఉపేక్ష మంచి వారిని చెడ్డవారిని, ప్రేమించిన ప్రేమించని వారిని, సంతోషకర అసంతోషకరమైన వారిని పరివేష్టిస్తాయి.

ఈ జీవితంలోనే దివ్యుడు కావాలను కొన్న ఎవడైన, మనందరిలో నిద్రాణంగా ఉన్న ఈ నాలుగు ఉదాత్త గుణాలను నిత్యం అలవరుచుకో ప్రయత్నించాలి.

ఈ అనంత పునర్జన్మల సంసార గతిలో తనను తాను పరిపూర్ణుని గావించు కొని, సర్వ జీవుల సంక్షేమానికి పాటు పడాలంటే, అతడు శ్రమించి పది పారమితలను పెంపొందించు కొని అంతిమంగా సమ్మా సంబుద్ధుడు కావాలి.

తొలి సంభావ్య అవకాశంలో నిర్వాణాన్ని పొందడం ద్వారా, తనరాగాలను తొలగించు కొని, దుఃఖానికి అంతం పలక దలుచుకొన్నవాడు, నేటికీ చెక్కు చెదర కుండ మనకు లభించిన ప్రాక్తన అనన్య అష్టాంగ మార్గాన్ని శ్రద్ధతో అనుసరించాలి.

బుద్దుడు హెచ్చరిస్తాడు :

''భిక్కులారా, ఈ మహా భూమి అంతా ఒక నీటి రాశి అనుకోండి. దానిలోకి ఒకడు ఒకే రంధ్రం ఉన్న కాడిని విసరి వేశాడను కోండి. అప్పుడు ఉత్తరపు గాలి దానిని దక్షిణానికి, తూర్పు గాలి పడమరకు, పడమర గాలి తూర్పుకు, దక్షిణపు గాలి ఉత్తరానికి నెట్టాయి. అనుకోండి. ఆ తరవాత, ఒక సారి నూరేళ్ళ తరవాత, ఒక గుడ్డి తాబేలు నీటిపైకి వచ్చింది. భిక్కులారా, ఇప్పుడు మీరేమంటారు? ఒక నూరు సంవత్సరాల తరవాత, ఆతాబేలు ఎప్పుడు నీటిపైకి వచ్చినా, దాని మెడను ఆ ఒంటి రంధ్రం కాడిలోకి దూరుస్తుందా?''

''అంధకూర్మం అలాచేయడం జరగదు భంతే''

అంతే దుర్లభమైంది, భిక్కులారా, మానవాకృతితో జన్మించడం; అంతే దుర్లభం తదాగతుడు, అర్హంత, పూర్తిజ్ఞాని ఈ ప్రపంచంలోకి రావడం; తథాగతుడు ప్రవచించిన ప్రమాణం, ధమ్మం ఈ ప్రపంచంలో కనిపించడం అంతే దుస్తరం.

'' ఇప్పుడు వాస్తవానికి భిక్కులారా, మానవ జన్మ ఎత్తడం జరిగింది. ఈ ప్రపంచంలోకి తథాగతుడు రావడం జరిగింది. తథాగతుడు ప్రవచించిన ప్రమాణం, ధమ్మం ఈ ప్రపంచంలో దర్శనమివ్వడమూ జరిగింది.

''అందుకని, ఓ బిక్కులారా, యథార్థీ కరణ చేసు కోవ డానికి మీరు ప్రయత్నించాలి. ఇది దుఃఖం. ఇది దుఃఖ సముదయం. ఇది దుఃఖనిరోధం. ఇది దుఃఖ నిరోధమార్గం.''[3]

**పాదసూచికలు :**

1. ధమ్మపద, V.5

2. ధమ్మ పద V. 320

3. *Kindred Sayings,* V.P. 384

నలభై మూడో ప్రకరణం

# ఎనిమిది ప్రాపంచిక ధర్మాలు

## *జీవిత గతులలో పరివర్తనలు*

**(అట్ఠలోక ధమ్మ)**

ఈ అసమ తూక ప్రపంచమంతా పూర్తిగా ఆశావహంగా ఉండదు. అది పూర్తిగా నిరాశావహమూ కాదు. గులాబి మెత్తగా, అందంగా, సువాసనతో ఉంటుంది. కాని దాని కాండం నిండా ముళ్లు ఉంటాయి. ఏది గులాబిత్వమో (rosy) అది గులాబిత్వం. ఏది కంటకితమో (thorny) అది కంటకితం. గులాబి ఉంది గదా అని ఎవడు ముళ్ళను తాకడు. ముళ్ళున్నాయి గదా అని గులాబీని ఎవడు తక్కువగా చూడడు.

ఆశావహునికి ఈ ప్రపంచమంతా గులాబీ తోట. నిరాశావహునికి ఈ ప్రపంచం ఒక ముళ్ళ కంప. కాని వాస్తవ వాదికి ఈ ప్రపంచం పూర్తిగా గులాబీ తోటా కాదు, పూర్తిగా ముళ్ళ కంపా కాదు. వాస్తవ దృక్పథం నుంచి చూస్తే అది పుష్కలంగా అందమైన గులాబీలతో, గుచ్చే ముళ్ళతో నిండి ఉంటుంది.

మంచి అవగాహన ఉన్నవాడు ఎవడైన, గులాబీ అందానికి విమోహితుడు కాక, దానిని 'ఉన్న దానిని ఉన్నట్లుగా' చూస్తాడు. ముళ్ళ స్వభావం తెలిసిన వాడు వాటిని అలాగే అంటే యథాతథంగా చూస్తాడు. ముళ్ళు గుచ్చు కోకుండ జాగ్రత పడతాడు.

ఒక లోలకం కుడి ఎడమలకు నిరంతరం డోలనాలు చేసే నట్లే, నాలుగు వాంఛనీయ, అవాంఛనీయ ధమ్మాలు ఈ ప్రపంచంలో డోలనాలు చేస్తాయి. వీటిని ప్రతి ఒక్కడూ, తప్పకుండ, నిర్బంధంగా, తన జీవన గతిలో ఎదుర్కోవాలిసి ఉంటుంది.

అవి : లాభ నష్టాలు (లాభాలాభాలు), యశస్సు అయశస్సులు, ప్రశంస నిందలు, సుఖదుఃఖాలు.

**లాభనష్టాలు**

వ్యాపారులు తప్పకుండ లాభనష్టాలకు గురవుతారు. లాభం వచ్చి నప్పుడు సంతృప్తి చెందడం సహజం. దానిలో దోషం ఏమీ లేదు. అటువంటి ధర్మ లేదా అధర్మ లాభాలు సంతోషాన్నిస్తాయి. దీనిని కావాలను కొంటారు సగటు మనుషులు. అవి తాత్కాలికా కాలే

అయినా, సంతోషక్షణాలు లేకుండ జీవించడం వృథా. ఈ పోటీ ప్రపంచంలో, గందరగోళ ప్రపంచలో, తమ హృదయాలకు సంతోషం కలిగించే సుఖాన్ని జనం బహు అరుదుగా గాని అనుభవించరు. అటువంటి సుఖం భౌతికమే అయినా, ఆరోగ్యకరమైంది. ఆయుస్సు పెంచుతుంది.

నష్టం సంభవించి నప్పుడే సమస్య ఉత్పన్న మయ్యేది. లాభాలను ఎవడైన చిరునవ్వుతో స్వీకరిస్తాడు. కాని నష్టాలను అలా స్వీకరించ లేడు. అవి మానసికవైకల్యానికి దారి తీస్తాయి. నష్టం భరించ లేనంత అధికంగా ఉన్నప్పుడు అది ఆత్మ హత్యకు గూడ దారి తీయ వచ్చు. అటువంటి విపత్కర పరిస్థితులలోనే నైతిక దిటవును ప్రదర్శించాలి. మనస్సును సమ తూకంలో ఉంచాలి. జీవన సమరంలో అందరికి ఎత్తు పల్లాలు ఎదు రవుతాయి. ప్రత్యేకంగా మనం ఎల్లప్పుడూ నష్టాలకు సిద్ధ పడి ఉండాలి. అలాగైతే నిరాశ అంతగా ఉండదు.

దేనినైనా దొంగలు అపహరించి నప్పుడు స్వంతదారుకు దుఃఖ కలుగుతుంది. దుఃఖించి నంత మాత్రాన నష్టం పూడదు. అది అధర్మమే కావచ్చు. కాని దాని వల్ల మరొకడు లాభ పడ్డాడని అనుకోవాలి. అతడు సుఖంగా హాయిగా ఉండుగాక!

లేదా ఈ విధంగా అతడు తనను తాను ఓదార్చు కోవచ్చు. ''అది అల్పనష్టం మాత్రమే''. లేదా తాత్విక ధోరణిని అలవరచు కోవచ్చు: ''నాది, నేను అనేది ఈ ప్రపంచంలో ఏదీ లేదు.''

బుద్ధుని కాలంలో, ఒక కులీన భద్ర మహిళ గౌరవనీయ సారిపుత్రునికి, ఇంకా కొంత మంది భిక్కులకు భిక్షను ఇస్తోంది. ఒక తగవు తీర్చడానికి వెళ్ళిన ఆమె భర్త, కొడుకులు మార్గమధ్యంలో, దారి దోపిడి దొంగల బారిన పడి మరిణించారని, వారికి వడ్డిస్తుండగా అమెకు లేఖ వచ్చింది. ఆమె ఏ మాత్రం డీలా పడి పోకుండా, ప్రశాంతంగా ఆ లేఖను రొంటి జేబులో దోపుకొంది, ఏమీ జరగనట్లు గానే. భిక్కులకు వడ్డించ డానికి, చేతి ముంతను తెస్తున్న పనిపిల్ల, చూడక కాలుజారి, దానిని జారవిడింది. అది పగలి పోయింది. సహజంగా ఆ మహిళ ఈ నష్టానికి బాధ పడుతుంధని భావించిన సారిపుత్రుడు ఆమెను మాటలతో ఓదార్చాడు: ''పగలి పోయే వస్తువులన్నీ పగిలి తీరతాయి.'' అన్నారు. ఆ గౌరవనీయ భద్ర మహిళ, ''భంతే, ఈ నష్టం ఏ పాటి? నా భర్త, కుమారులను హంతకులు చంపారని నాకు ఇంతకు ముందే లేఖ వచ్చింది. నా సంయమనం చెదరకుండ ఆ లేఖ నా తొంటి జేబులో దాచాను. అంతటి నష్టం సంభవించినా మీ కందరికీ నేను వడ్డన చేస్తున్నాను.''

ఆ సాహసోపేత అయిన ఆ మహిళ ధైర్యం కొనియాడ దగింది.

ఒకసారి బుద్ధుడు ఒక గ్రామానికి భిక్షకు వెళ్ళాడు. మారుని జోక్యం కారణంగా బుద్ధునికి అక్కడ భిక్ష దొరక లేదు. మారుడు బుద్ధుని వ్యంగ్యంగా అతడు (బుద్ధుడు) ఆకలిగొని ఉన్నాడా, లేదా అని అడిగినప్పుడు, ఆటంకాల నుంచి విముక్తుడైన వాని మానసిక ధోరణి ఎలా ఉంటుందో వివరిస్తూ బుద్ధుడు ఇలా అన్నాడు: ''ప్రతిబంధకాలు లేని మేము ఆనందంగా ఉంటాం, ప్రభాస లోకాల దేవతల వలె మేము సంతోష జనకుల మవుతాం.''

ఒకసారి బుద్ధుడు, అతని శిష్యులు, ఒక గ్రామంలో వర్షాకాలాన్ని గడుపుతూ ఉండగా, ఒక బ్రాహ్మణుడు వారిని భిక్షకు ఆహ్వానించాడు. కాని అతడు వారికి చేయ వలసిన మర్యాదలను, వారి అవసరాలను పూర్తిగా విస్మరించాడు. ఆ వర్షకాలం మూడువ నెలలు, గౌరవనీయ మొగ్గల్లాన తన మనోశక్తులతో ఆహారం తెప్పించ డానికి ఉద్యుక్తుడైనా, బుద్ధుడు మాత్రం, ఏ ఫిర్యాదు లేకుండ, ఒక గుర్రాల వ్యాపారి ఇచ్చిన, గుర్రాల దాణాతోనే తృప్తి పడ్డాడు.

బుద్ధుని శిష్యురాండ్రలో ముఖ్య ఉపాసిక అయిన విసాఖా, విలువైన పైవస్త్రాలు ధరించి, బుద్ధుని, సంఘం అవసరాలు చూడడానికి తరచు ఆరామానికి వచ్చేది. ఆ రామంలోకి రాగానే, ఆ విలువైన వస్త్రాలను తీసి, భద్ర పరచ మని దాసికి ఇచ్చేది. ఒకసారి ఆదాసి, ఏమరి పాటున, వానిని గుడిలోనే వదిలి, ఇంటికి వెళ్ళి పోయింది. వానిని చూసిన ఆనందుడు, విసాఖా మరల వచ్చి నప్పుడు ఆమెకు తిరిగి ఇవ్వ వచ్చుననే ఉద్దేశంతో దానిని భద్ర పరిచాడు. దుస్తులు పోయిన విషయాన్ని గమనించిన విసాఖా, చేటియతో అవెక్కడున్నవో చూసి రమ్మని చెప్పి, ఎవరైన భిక్కు గనుక వాటిని తాకితే, వాటిని అలాగే వది లేసి రమ్మంది. గౌరవనీయ ఆనందుడు దానిని భద్ర పరిచాడని చేటియ విచారించి తెలుసు కొంది. ఇంటికి వచ్చి ఆ విషయాన్నే చెప్పింది. విసాఖా ఆరామానికి తిరిగి వచ్చి, ఆ విలువైన దుస్తులు అమ్మగా వచ్చిన ధనంతో ఏమి పుణ్యకార్యం చేస్తే బాగుంటుందని బుద్ధుని అడిగింది. సంఘం కోసం ఒక ఆరామాన్ని నిర్మించ వలసిందిగా బుద్ధుడు సలహా ఇచ్చాడు. అంత ఖరీదు పెట్టి ఆ వస్త్రాలను కొనే వారు లేక పోవడంతో, అమే వాటిని కొని, ఆ ధనంతో ఆరామాన్ని నిర్మించింది. దానిని బుద్ధునికి సంఘానికి ఇచ్చివేసింది. అలా ఆరామాన్ని కానుకగా ఇచ్చిన తరువాత ఆమె, చేటియకు కృతజ్ఞత చెప్పు కొంటూ ఇలా అంది: ''నీవు ఏమరిపాటున నా దుస్తులను అక్కడ వదిలి వేసి రాక పోతే, ఈ పుణ్య కార్యం చేసే అవకాశం, అదృష్టం నాకు లభించి ఉండేది కాదు. దయ చేసి నీవు గూడ ఆ పుణ్యాన్ని పంచుకో''.

ఆ తాత్కాలిక నష్టానికి చింతించక, చేటియ అజాగ్రతకు ఆమెను మందలించక, సేవ చేయ డానికి ఒక అవకాశం కల్పించి నందుకు ఆమెకు కృతజ్ఞతలు తెలుపు కొంది.

నిస్సహాయులైన సేవకులు చేసే తప్పులకు ఊరకనే, తేలికగా చికాకు పడే వారికి విసాఖా ఉదంతం మంచి పాఠం. సంస్కారయుతమైన విసాఖా దృక్పథం పొగడ, దగింది. గుర్తుంచుకో

దగింది. నష్టాలను ఆనందంగా, శక్తిమంతంగా ఎదుర్కోవాలి. అవి అనుకోకుండా వస్తాయి. ఒంటరిగా రావు. తరచు కూడ బలుక్కొని అన్నీ ఒకే సారి వస్తాయి. వాటిని ఉపేక్షతో ఎదుర్కోవాలి. ఒక ఉదాత్త గుణాన్ని ఆచరించ డానికి దానిని ఒక అవకాశంగా భావించాలి.

**యశస్సు, అయశస్సులు :**

మన నిత్య జీవిత గతిలో మనకు ఎదురయ్యే అనివార్య ప్రాపంచిక స్థితుల, వృత్తుల మరోజంట ఈ యశస్సు అయశస్సులు

యశస్సును ఆహ్వానిస్తాం. అపకీర్తిని ఇష్టపడం. యశస్సు మన మనస్సును సంతసింప. జేస్తుంది. అపకీర్తి కుంగ దీస్తుంది. మనం కీర్తి కాముకులం. మన పేరు, బొమ్మ పత్రికలలో పడాలని కోరు కొంటాం. మన కార్యకలాపాలు ఎంత అల్పాలైనా, వాటికి మంచి ప్రాచుర్యం లభిస్తే మనకెంతో సంతోషం. కొన్ని సార్లు న్యాయమైన దాని కంటె ఎక్కువ ప్రచారాన్ని కోరు కొంటాం.

తమ బొమ్మ మేగజీన్‌లో పడ డానికి ఎంతైనా ఖర్చు పెట్ట డానికి వెన కాడరు. ఒక గౌరవాన్ని పొంద డానికి ఎంత లంచం బెట్ట డానికైనా సిద్ధమే లేదా అధికార పార్టీకి ఎంత చందా అయినా ఇస్తారు. ప్రచారం కోసం కొంత మంది, ఒక వంద మంది లేదా ఇంకా ఆపైన సన్యాసులకు భిక్ష నిచ్చి, తమ ఔదార్యాన్ని ప్రదర్శించు కొంటారు. కాని వారు తమ ఇరుగు పొరుగు పరిసరంలోని పేదల, ఆర్తుల బాధలను పూర్తిగా విస్మరిస్తారు. ఆకలిగొన్న ఒకడు తోటలోని ఒక కొబ్బరి కాయను దొంగిలిస్తే అతనిని శిక్షిస్తారు. కాని పేరు తెచ్చు కోవ డానికి వేయి కొబ్బరికాయలనైనా అర్పిస్తారు.

ఇవి మానవ దౌర్బల్యాలు. చాల మంది ఏదో అంతిమప్రేరణతో మంచి పనులు చేస్తారు. ఈ ప్రపంచంలో ఏమీ ఆశించక పని చేసే నిస్వార్థులు చాల తక్కువ. ఉద్దేశం అంత గొప్పది కాక పోయినా, మంచి పని చేసి నందుకు వారిని అభినందించాలి. చాలమంది విషయా సక్తులు దేనినో ఒకదానిని భవిష్యత్తులో వాడ డానికి రహస్యంగా సిద్ధంగా ఉంచు కొంటారు. అయితే, ఎవరు నూటికి నూరు పాళ్ళు మంచివారు? ఎంత మంది ఉద్దేశాలు పరిశుద్ధంగా ఉంటున్నాయి? ఎంత మంది పూర్తిగా పరహితేచ్ఛతో ఉంటున్నారు?

మనం కీర్తికోసం ఆరాట పడ నవసరం లేదు. కీర్తికి మనం అర్హులమైతే అది వెతకకనే మనలను వెతుక్కొంటూ వస్తుంది. తేనెటీగ తేనె నిండిన పూవుకు ఆకర్షిత మవుతుంది. ఏమైన పూవు తేనెటీగను ఆహ్వానించదు. మనపేరు దశ దిశల వ్యాపించి నప్పుడు, నిజంగా మనం సహజంగానే సంతోషిస్తాం. కాదు అమితంగా సంతోషిస్తాం. యశస్సు, గౌరవం,

వైభవం కాటికే దారి తీస్తాయని గుర్తించాలి. అవి గాలిలో అంతర్ధాన మవుతాయి. వినడానికి బాగానే ఉన్నా అవి ఖాళీపదాలు.

అపకీర్తిమాటేమిటి? అది మనస్సుకు, చెవికి – రెండింటికి రుచించదు. దయా హీనమైన కర్కశ అయశస్సు పదాలు చెవిని సోకి నప్పుడు నిస్సందేహంగా మనం కుంగిపోతాం. ఆ అపకీర్తి కనుక అన్యాయంగా, అయధార్థంగా మీద పడితే అప్పుడు మనస్సు పడే వేదన వర్ణనాతీతం.

ఒక బ్రహ్మాండమైన భవనాన్ని నిర్మించాలంటే ఏండ్లు పూండ్లు పడుతుంది. ఆధునిక ఆయుధాలతో, దానిని ఒకటి రెండు నిముషాలలోనే కూల్చి వేయ వచ్చు. మంచిపేరు తెచ్చు కోవ డానికి చాల సంవత్సరాలు లేదా ఒక జీవిత కాలం పట్ట వచ్చు. అలా కష్టపడి ఆర్జించిన యశస్సు అల్ప కాలంలోనే నాశం కావచ్చు. అయశస్కర పదమైన ''కాని'' తో మొదలయ్యే పద బంధం నుంచి ఎవరూ తప్పించు కోలేరు. అవును, అతడు మంచి వాడే, అతడు ఆ మంచి చేశాడు, ఈ మంచి చేశాడు, కాని.... ఈ ''కాని'' తోనే అతని శీలచరిత్ర అంతా మ్లానమై పోతుంది. నీవు బుద్ధుని జీవితం గడిపి ఉండ వచ్చు కాక. కాని నీవు విమర్శ నుంచి దాడి నుంచి, అవమానాల నుంచి తప్పించుకో లేవు.

అతని కాలంలో బుద్ధుడు అత్యంత యశస్వి, అత్యంత కళంక మతాచార్యుడు.

గొప్పవారు తరుచు బయటికి తెలియరు. ఒక వేళ వారు బయటికి తెలిసినా అపమార్గంలో తెలుస్తారు.

బుద్ధుని వ్యతిరేకులు కొందరు, ఒక స్త్రీ, రాత్రులందు, ఆరామంలో, అతనితో ఉంటుందని అపవాదు వేశారు.

ఈ నీచ ప్రయత్నంలో ఓడి పోయిన వారు, మరో అపవాదును జనంలో ప్రచారం చేశారు. అదేమి టంటే, ఆ స్త్రీని చంపి, ఆమె శరీరాన్ని ఆరామంలో, వాడి రాలిన పూల చెత్త రాశిక్రింద దాచారని. అతడి చారిత్రక ధర్మబోధ విజయం కావడంతో, ఆవైరులు అతని మీద విష విషప్రచారం మొద లెట్టారు. కొడుకులను తల్లులకు కాకుండా చేస్తున్నాడు. భార్యలకు భర్తలను కాకుండ చేస్తున్నాడు. దేశ ప్రగతిని అతడు అడ్డు కొంటున్నాడు'' అని ప్రచారం చేశారు.

అతని ఉదాత్త శీలాన్ని మలినం చేయడంలో విఫలమైన అతని దాయాది, అసూయాగ్రస్త శిష్యుడు దేవదత్తుడు, పై నుంచి రాయిని అతని మీదికి తోసి చంపాలని ప్రయత్నించాడు.

అతడు బుద్ధుడు కావడం వల్ల అతనిని చంప లేక పోయాడు. దోషం కలంకం లేన పరిశుద్ధులైన బుద్ధుల సంగతే అలా ఉంటే, మామూలు మనుషుల మాట ఏమిటి?

నీవు కొండను పైపైకి ఎక్కే కొలది అందరి దృష్టిని ఆకర్షిస్తావు. ఇతరుల కళ్ళల్లో చిన్నగా కనిపిస్తావు. నీ వీపే కనిపిస్తుంది. ముందు భాగం కని పించదు. ఎప్పుడూ తప్పులన్నే ఈ ప్రపంచం నీ లోపాలను, తప్పులను ఎంచుతుంది. నీ మంచి గుణాలను దాచి పెడుతుంది. తూర్పారపట్టే చేట పొట్టును ఊదేసి, ధాన్యాన్ని అట్టే పెడుతుంది; అలాగే వడ పోత పరికరం స్థూల అవశేషాలను మిగిల్చి మధురస్రావాన్ని నెట్టి వేస్తుంది. సంస్కారవంతులు స్థూల విషయాలను తోసి వేసి, సూక్ష్మ విషయాలను గ్రహిస్తారు. అసంస్కృతులు దీనికి వ్యతిరేకం.

ఉద్దేశ పూర్వకంగా గాని, ఉద్దేశ రహితంగా గాని, నిన్ను అపార్థం చేసు కొనేట్టు ప్రతిబింబించినా, అన్యాయంగా నీమీద రాసినా, యపిక్‌టీటస్ (Epictetus) సలహా ఇచ్చినట్లు, మనం ఆలోచించడం లేదా చెప్పడం తెలివైన పని. ఆయన సలహా ఇది :

''నాగురించి వారికి కొద్దిగానే తెలుసు కుసక నన్ను కొద్దిగానే విమర్శించారు. అదే నా గురించి బాగా తెలిసి నట్లుయితే, ఇంకా ఎక్కువగా, తీవ్రంగా విమర్శించే వారు''

పరిస్థితులు నిన్ను వివరణ ఇవ్వాలని ఒత్తిడి చేస్తే తప్ప నీమీది తప్పుడు ప్రచారాన్ని ఖండించడంలో కాలయాపన చేయడం అనవసరం. నీవు బాధ పడడం చూస్తే నీ శత్రువుకు సంతృప్తి. అతనికి కావలసిందే అది. నీవు పట్టించు కోక పోతే అటువంటి అబద్ధ ప్రచారం చెవిటి వాని ముందు శంఖం ఊదినట్లు అవుతుంది.

ఇతరులలోని దోషాలను చూసేటప్పుడు, మనం గుడ్డి వారిలా ప్రవర్తించాలి. ఇతరుల అన్యాయ విమర్శలను వినే టప్పుడు మనం చెవిటి వారిమి కావాలి. ఇతరుల గురించి చెడు చెప్ప వలసి వచ్చి నప్పుడు, మనం మూగ వారమై పోవాలి. అన్యా యారోపణలకు, అపవాదులకు అంతం పలకడం తేలిక కాదు.

ప్రపంచమంతా గులక రాళ్ళు, కంటక మయం. వాటిని తొలగించడం అసంభవం. అవి అక్కడు న్నప్పటికి నడవడం తప్పని సరైతే, వాటిని తొలగించ డానికి ప్రయత్నించే కంటే, ఏరి వేయడం ఎలాగు అసంభవం కుసక, చెప్పులు వేసు కొని నిరపాయంగా నడవడం మంచిది.

ధమ్మం ఇలా బోధిస్తుంది:

చప్పుళ్ళకు బెదరని సింహంలా ఉండు.
వల కన్నాలకు అంటుకోని గాలిలా ఉండు.
బురదలో పుట్టి బురద అంటని పద్మంలా ఉండు.
ఖడ్గమృగంలా ఏకాంతంగా సంచరించు.

అరణ్యానికి రాజులు కుసక, సింహాలకు భయం లేదు. స్వభావరీత్యా అవి ఇతర జంతువుల అరుపులకు భీతిల్లవు. ఈ ప్రపంచంలో అదుపు లేని నోళ్ళు నుంచి ఎన్నో వ్యతిరేక వాక్యాలు,

అబద్ధపు ఆరోపణలు, కించ పరిచే మాటలు విన వలసి రావచ్చు. సింహంలా, వాటిని మనం వినవద్దు. విసిరిన వానికే తిరిగి చేరే ఆయుధంలా, అవి ఎక్కడనుంచి వచ్చాయో అక్కడికే చేరతాయి.

కుక్కలు మొరుగుతాయి. కాని బిడారు వర్తక సమూహం ప్రశాంతంగా కదులుతూనే ఉంటుంది.

మనం పంకిల ప్రపంచంలో ఉంటున్నాం, దాని నుంచి పుట్టే పద్మాలు ఎన్నో. బురద అంట కనే అవి ప్రపంచాన్ని అలంక రిస్తున్నాయి. ఆ పద్మాలకు వలె, మనమూ, మనమీద విసరిన బురదను లెక్క చేయక, నిందా రహిత ఉదాత్త జీవితాలను గడపాలి.

గులాబీలు కాక, బురదే మనమీద చల్లుతారని మనం అనుకోవాలి. అలా అనుకొంటే నిరాశ ఎదురు కాదు.

కష్టమే అయినా మనం విరాగాన్ని (Non - attachment) అలవరుచు కోవాలి. ఒంటరిగానే వచ్చాం. ఒంటరిగానే పోతాం.

విరాగ మీ ప్రపంచంలో ఆనందం.

అదుపులేని నోళ్ళు వదిలే విష పూరిత బాణాలను పట్టించు కోకుండా, మన యధా శక్తిని ఇతరులకు సేవచేస్తూ, ఒంటరిగానే పర్యాటన చేద్దాం.

గొప్పవ్యక్తులను నీచంగా మాట్లాడారు. అపవాదులు వేశారు. విషమిచ్చారు. శిలువ వేశారు. కాల్చి చంపారు.

గొప్పవాడైన సోక్రటీస్‌కు విషం ఇచ్చారు. ఉదాత్త జీసస్‌ను నిర్ధయగా శిలువ వేశారు. నిరపాయకర గాంధీని కాల్చి చంపారు.

అయితే అతి మంచిగా ఉండడం అంత అపాయకరమా?

అవును, వారి జీవిత కాలాల్లో వాళ్ళను విమర్శించారు. దాడి చేశారు. చంపారు. మరణం తరవాత వారిని దేవతలుగా చేశారు. పూజించారు.

గొప్పవాళ్ళు ఎప్పుడు కీర్తి అపకీర్తులను పట్టించు కోరు. వారిని విమర్శించి నప్పుడు దూషించి నప్పుడు వారు బాధపడరు. ఎందుకంటె వారు పని చేసేది కీర్తి కండూతితో కాదు. ఇతరులు తమ సేవలను గుర్తించారా లేదా అనేది వారికి అనవసరం. ''పని చేసే హక్కు వారికుంది. దాని ఫలానికి హక్కు లేదు''.

**నిందాస్తుతులు**

మానవాళిని ప్రభావితం చేసే మరో రెండు వృత్తులు యశస్సు, నిందలు. ప్రశంసిస్తే పొంగిపోవడం, నిందిస్తే కుంగిపోవడం సహజం ప్రశంస, నిందల మధ్య, జ్ఞాని అయిన వాడు పొంగి పోడు, కుంగి పోడు, అంటాడు బుద్ధుడు. గాలికి కదలని స్థిర శిలకు వలె వారు నిందాస్తుతులకు చలించరు. స్తుతి, అర్థమైతే, వీనుల విందుగా ఉంటుంది. భట్రాజీయంలా అన్వర్థమైతే – అదీ ఇంపుగానే ఉండవచ్చు – కాని అది మోస పూరితం. అవి మన చెవులను చేర నప్పుడు అవి కేవల ఖాళీ శబ్దాలు.

జనసామాన్యం దృష్టిలో ప్రశంస చాల దూరం పోతుంది. పొగడ్త ద్వారా కొద్దిపాటి అనుగ్రహాన్ని సాధించ వచ్చు. వక్త మాటాడ బోయే ముందు ఒక మంచి మాట చెబితే, శ్రోతలను ఇట్టే ఆకట్టు కోవచ్చు. మొదట్లో వక్త శ్రోతలను పొగిడితే, వారిచెవులు చేటలై పోతాయి. అలా గాక అతడు శ్రోతలను విమర్శించి నట్లయితే వారి ప్రతిస్పందన అంత సంతృప్తికరంగా ఉండదు.

సంస్కార వంతులు ప్రశంసల నాశ్రయించరు. వారికి పొగడించు కోవడం ఇష్టం ఉండదు. పొగడ తగిన వారిని, ఏమాత్రం అసూయ లేకుండ, ప్రశంసిస్తారు. నిందించ వలసిన వారిని నిందిస్తారు. ఈపని వారు ద్వేషంతోకాక, వారిని మారుద్దామనే ఉద్దేశంతో చేస్తారు.

వారు అటువంటి ప్రశంసలకు అతీతులే అయినా, గొప్పవారిని, వారిని ఎరిగిన అల్పులూ అధికులూ అంతా ప్రశంసిస్తారు.

బుద్ధుని ఎరిగిన చాల మంది తమ తమ పద్ధతులలో బుద్ధుని కొని యాడారు. కొత్తగా మారిన కోటీశ్వరుడైన ఉపాలి ఆశువుగా బుద్ధుని గుణాలను గణిస్తూ పొగిడాడు. బుద్ధుని కాలంలో ప్రాచుర్యంలో ఉన్న తొమ్మిది వాస్తవిక గుణాలతో బుద్ధుని అనుయాయులు బుద్ధుని ప్రతిమను చూస్తూ ప్రశంసించారు. ధ్యానానికి అది ధ్యాన వస్తువు. ఆ మంచి గుణాలు ఇప్పటికి ఆయన అనయాయులకు ఉత్తేజకాలు.

మరి నింద మాటేమిటి?

బుద్ధుడు అంటున్నాడు: ''వాచాలురను (ఎక్కువగా మాటాడేవారిని) నిందిస్తారు. తక్కువగా మాటాడే వారిని నిందిస్తారు. మౌనంగా ఉండేవారిని నిందిస్తారు. ఈ ప్రపంచంలో నిందితుడు కాని వాడెవడూ లేడు''. నింద అనేది మానవాళికి సార్వత్రిక ఉత్తరదానం (Legacy) గా కనిపిస్తున్నది.

''ఈ ప్రపంచజనంలో అధికభాగం సహనం లేనివాళ్లు తన పైకి వదిలిన బాణాలను రణరంగంలో భరించే ఏనుగులా, నేను అన్ని అవమానాలను భరిస్తాను'' అన్నాడు బుద్ధుడు.

భ్రాంతి జనకులు, క్రూరులు, ఇతరుల మంచిని, అందాన్ని కాక, వారిలోని వికృతాన్ని మాత్రమే చూస్తారు.

బుద్ధుడు తప్ప, ఎవరూ, నూటికి నూరు పాళ్ళు మంచి వారు కారు. ఏ ఒక్కరూ నూరుశాతం చెడ్డ వాళ్ళు కారు. మనలో అత్యంత మంచి వారిలో గూడ కొంత చెడు ఉంటుంది. మనలో అతి చెడ్డ వారిలో గూడ కొంత మంచి ఉంటుంది. ''తన మీద దాడి జరిగి నప్పుడు తనను అవమానించి నప్పుడు, దూషించి నప్పుడు, ఓటి గంటలా, మౌనం దాలిస్తే, అతడు నిర్వాణాన్ని పొందక పోయినా, దాని సమ్ముఖంలో ఉన్నాడని నేను చెబుతాను,'' అన్నాడు బుద్ధుడు

ఒకడు సదుద్దేశంతోనే పని చేయ్యవచ్చు. కాని బాహ్య ప్రపంచం అతనిని అపార్థం చేసుకొని, కలలో గూడ రాని దురుద్దేశాలను అతనికి అంట గట్ట వచ్చు.

ఒకడు యధాశక్తితో ఇతరులను సేవించి, సహాయ, పడవచ్చు. కొన్నిసార్లు కష్టాల్లో ఉన్న స్నేహితునికి సహాయం చేయడం కోసం అతడు అప్పుల పాలే కావచ్చు, ఆస్తిపాస్తులనే అమ్మ వలసి రావచ్చు. కాని తరవాత తరవాత, ఈ భ్రమ పూరిత ప్రపంచం ఎలా తయారవు తుందంటే, అతని సహాయం పొందిన వారే అతన్ని దెప్పి పొడుస్తారు, తప్పులు వెదుకుతారు. శీల హత్య చేస్తారు. అతని పతనంలో ఆనందం పొందుతారు.

జాతక కథలలో ఇలా ఉంది : గుట్టిల అనే సంగీతాచార్యుడు, తనకు వచ్చిన విద్య నంత, ఏమాత్రం దాచక, తన శిష్యునికి నేర్పాడు. కాని ఆ శిష్యుడు కృతఘ్నుడై, గురువుతో పోటీ పడి నాశం చేయాలని ప్రయత్నించి, విఫల మయ్యాడు.

బుద్ధునికి దాయాది, శిష్యుడు, అయిన దేవదత్తుడు ఎన్నో మనోశక్తులను సాధించాడు. అతడు బుద్ధుని తెగడడమే కాక, బుద్ధుడు కొండ తగ్గర తిరుగాడు తుండగా, కొండ మీది నుంచి ఒక పెద్ద బండ రాయిని దొర్లించి, అతనిని చంపాలనే విఫల ప్రయత్నం చేశాడు.

బుద్ధునితో సమానంగా ప్రశంసించ బడిన, విమర్శింప బడిన, దూషించ బడిన, నిందించ బడిన మరో మతాచార్యుడు మనకు కాన రాడు.

బహిరంగంగా నలుగు రెదుట, సిఞా అనే పేరు గల ఒక నీచ స్త్రీ గర్భాన్ని నటిస్తూ బుద్ధుని కించ పరిచింది. దరహాస వదనంతో బుద్ధుడు అత్యంత సహనంతో, ఆ అవమానాన్ని భరించాడు. బుద్ధుని అమాయకత రుజువైంది.

తన శిష్యుల సహాయంతో బుద్ధుడు ఒక మహిళను హత్య చేశాడని నేరారోపణ జరిగింది. బౌద్ధులు కాని వారు, బుద్ధుని అతని శుష్యులను చాల తీవ్రంగా విమర్శించారు. ఆ విమర్శలకు గౌరవనీయ ఆనందుడు మరో గ్రామం వెళ్ళి పోదామని బుద్ధునికి విన్నవించు కొన్నాడు.

''ఆనందా, ఆగ్రామస్థులు మనలను ఇలాగే విమర్శిస్తే అప్పుడు ఏం చేదాం?'' అన్నాడు బుద్ధుడు.

''అప్పుడు, భంతే, మరోగ్రామం వెళదాం''. అన్నాడు ఆనందుడు.

''అలాం టప్పుడు ఆనందా, మనకు ఈ భారత దేశంలోనే చోటు దొరకదు. ఓర్పు పట్టు. దూషణలు వాటంతటవే ఆగి పోతాయి.

జనానాకు చెందిన మాగందియా అనేస్త్రీ బుద్ధుని మీద పగ పట్టింది. ఎందుకంటే, ఆమెతండ్రి, అమాయకంగానే, ఆమెకు బుద్ధునితో వివాహం చేయాలని తలపెట్టి నప్పుడు బుద్ధుడు ఆమె ఆకర్షణీయమైన దేహాన్ని గురించి మెచ్చు కోలేదు. ఆమె త్రాగు బోతులను బాడుగకు కుదుర్చు కొని, బుద్ధుని బహిరంగంగా అవమానించ డానికి నియోగించింది. పరిపూర్ణ ఉపేక్షతో బుద్ధుడు ఆ అవమానా లన్నింటిని సహించాడు. కాని మాగందియా ఆమె దుర్మార్గానికి బాధ పడ వలసి వచ్చింది.

అవమానాలు మానవాళి సామాన్య భాగధేయాలు. నీవు ఎంతగా పని చేసి, ఎంతగా గొప్ప వాడివి అయితే, అంతగా నీకు అవమానాలు ఎదురవుతాయి.

జీసస్ క్రైస్తను అవమాన పరిచారు, శిలువ వేశారు.

సోక్రటీస్‌ను తన స్వంత భార్యయే అవమానించింది. అతడెప్పుడు ఇతరులకు సహాయం చేయ డానికి బయటకు వెళ్ళినా, అతని అసహన సతి అతనిని తిడుతూ ఉండేది. ఒక రోజు ఆమెకు ఒంట్లో బాగుండక పోతే, ఆరోజు ఆమె తన '' ఆవిధేయకృత్యాన్ని'' నిర్వహించ లేక పోయింది. సోక్రటీజ్ ఆరోజు దిగాలు పడిన ముఖంతో బయటకు వెళ్లాడు. అతని స్నేహితులు ఆయన్ను ఆరోజు అంత దిగాలుగా ఎందుకు ఉన్నావని ఆడిగారు. ''నా భార్యకు ఒంట్లో కులాసాగా లేని కారణాన నన్ను తిట్ట లేదు''. అని సమాధానం చెప్పాడు.

''అదేమిటి, ఆవిడ తిట్టక పోతే మీరు సంతోషంగా ఉండాలిగాని, దిగాలు పడి పోవడ మేమిటి?'' అన్నారాయన స్నేహితులు.

''అలా కాదు, ఆమెనన్ను తిట్టి నప్పుడు, నేను నా సహనాన్ని పరీక్షించుకొనే అవకాశం లభిస్తుంది. ఈ రోజు ఆ అవకాశం లభించ లేదు. అందుకని నేను దిగాలుగా ఉన్నాను,''

అని సమాధానం చెప్పాడా తాత్త్వికుడు.

ఇవన్నీ అందరూ గుర్తుంచు కోదగిన పాఠాలు.

మనలను ఎవరైన అవమానిస్తే, అది మన సహనాన్ని అలవరుచు కొనే అవకాశం. వారి మీద కోసం తెచ్చు కోవడం కంటె మన వైరుల యెడ కృతజ్ఞతలతో ఉండాలి.

**సుఖ దుఃఖాలు**

విరుద్ధపదాల జంటలలో చివరిది సుఖ దుఃఖాలు. మానవాళిని ప్రభావితం చేయడంలో ఇవి చాల శక్తిమంతమైన కారణాలు.

సుకరంగా భరించ గలిగేది సుఖం (సంతోషం), కష్టంతో భరించేది దుఃఖం. కోరిక తీరడం మామూలు సుఖం. మన కోరిక తీరి తీరక ముందే మనలో మరో నూతన కోరిక జనిస్తుంది. మన స్వార్థ వాంఛలు ఎప్పటికీ తీరేవి కావు. మామూలు సగటు మనిషికి ఇంద్రియక సుఖాల సంతృప్తే అన్నింటి కంటె అధిక ఏకైక సుఖం. ఐంద్రియక సుఖ వాది అత్యంతంగా విలువ కట్టే అటు వంటి భౌతిక సుఖాల ఆశంస, తృప్తి, స్మృతులలో క్షణిక సుఖం ఉన్నమాట నిజం. కాని ఆ సుఖాలు భ్రమ జనితాలు, క్షణభంగురాలు.

భౌతిక సంపదలు నిజమైన సుఖాన్నిస్తాయా? అదే నిజమైతే, కోటీశ్వరులు ఆత్మహత్యలకు పాల్పడరు. భౌతిక సంపద పరాకాష్టకు చేరిన ఒక దేశంలో పదిశాతం మంది మానసిక వ్యాధులతో కుంగి పోతున్నారు. కేవలం భౌతిక సంపద ఒక్కటే నిజమైన సుఖాన్ని ఇవ్వ గలిగితే అలా ఎందుకు జరుగుతుంది? ప్రపంచాధిపత్యం నిజమైన సుఖాన్ని ఇవ్వ గలదా? విజయోపేతంగా, దారిలోని దేశా లన్నింటిని జయిస్తూ ఇండియాకు వచ్చిన అలెగ్జాండర్, ఇంకా జయించాల్సిన భూఖండాలు లేవే అని వాపోయాడట.

కిరీటాలు ధరించే రాజులు, రారాజులు ఎప్పుడూ సుఖంగా ఉన్నారా? చాల తరుచుగ అధికార బలం గల రాజనీతిజ్ఞుల, రాజ్యాధినేతల జీవితాలు సంశయాత్మకాలు. దయనీయమైన గాంధీ, కెనెడీల జీవితాలు ఉదాహరణలు.

నిజమైన సుఖం అంతరంగానికి సంబంధించింది. అందుకని దానిని బాహ్యాలైన సంపద, అధికారం, గౌరవం విజయాలతో నిర్వచించలేం.

అటువంటి ప్రాపంచిక ఆస్తులను బలవంతంగా లేదా అన్యాయంగా పొందినా, లేదా వాటిని అపమార్గం పట్టించినా, లేదా రాగబుద్ధితో చూసినా, వాటి స్వంతదారులకు అవి బాధ దుఃఖాలకు మూలా లవుతాయి. ఒకనికి సుఖమైంది మరొకనికి సుఖంకాదు. ఒకరికి అన్న పానీయమైంది మరొకరికి విషం కావచ్చు.

మామూలు కుటుంబికి బుద్ధుడు నాలుగు రకాల సుఖాన్ని చెప్పాడు : అవి: కలిగి ఉన్నానన్న సుఖం: అంటే ఆరోగ్యం, సంపద, అయుస్సు, అందం, సంతోషం, ఆస్తి, బలం, పిల్ల జెల్లలు మొదలైన వాటిని కలిగి ఉన్నానన్న సుఖం.

రెండో సుఖం వాటిని కలిగి ఉండడమే కాదు, వాటిని అనుభవించడంలో ఉంది. మామూలు ఆడ, మగ తమంత తాము సుఖపడాలను కొంటారు. ఈ ప్రాపంచిక సుఖాలను, అందరినీ వదిలి పెట్టి, ఏకాంతానికి పొమ్మని బుద్ధుడు సలహా ఇవ్వడు.

సంపదను తమకు తాము ఉపయోగించడంలో సుఖం లేదు. దానిని ఇతరుల కొరకు వ్యయం చేయడంలో ఉంది. మనం తినేది తాత్కాలికం. మనం దానిని వదిలి పెట్టి వెళ్ళి పోతాం. మనం ఇతరుల కిచ్చేదే మనకు దక్కేది. మన వెంట వచ్చేది. మన ఈ భౌతిక సంపదతో మనం చేసే మంచి పనులు కారణంగా మనలను ఎప్పటికీ గుర్తుపెట్ట కొంటారు.

ఋణగ్రస్తులం కాక పోవడం మూడో రకం సుఖం. మనకున్న దానితోనే తృప్తి చెంది, మనం పొదుపుగా ఉంటే, మనం ఎవరికీ ఋణగ్రస్తులం కాము. ఋణ గ్రహీతలు ఎప్పుడూ మానసిక బాధ ననుభవిస్తారు. ఋణ దాతలకు వారెప్పుడూ ఋణ పడే ఉంటారు. నీవు పేదవే అయినా, ఋణ విముక్తుడవై నప్పుడు, ఎంతో తెరిపిన పడతావు. మానసి కానందాన్ని అనుభవిస్తావు.

నిందారహిత జీవితాన్ని గడపడం మామూలు మనిషికి మంచి ఆనంద దాయక మూలం. నిందా రహితుడు తనకూ, ఇతరులకు గూడ ఒక వరం. అతనిని అందరూ మెచ్చు కొంటారు. ఇతరుల శాంతియుత ప్రకంపనలతో ప్రభావితం కావడం వల్ల అతడు సుఖా న్ననుభవిస్తాడు. అందరి చేత మంచి వాడని పించు కోవడం అత్యంత దుర్లభం అని చెప్పాలి. ఉదాత్త మనస్కులు నిందారహిత జీవితాన్ని మాత్రమే కోరుంటారు. వారికి ఇతరుల మెప్పు, అంగీకారం అవసరం లేదు. ప్రపంచంలో అధిక జనాభా సుఖాల ననుభవించడంలో హర్షం పొందితే, మరి కొందరు వాటిని పరి త్యజించడంలో మహ దానందాన్ని పొందుతారు. ఆధ్యాత్మికులకు సంతోష మంటే విరాగం, భౌతిక సుఖాల అధిగమనం. దుఃఖం నుంచి విముక్తి అయిన నిర్వాణ సుఖం అన్ని ఆనందానలను మించిన ఆనందం.

మామూలు సుఖాన్ని మనం ఆహ్వానిస్తాం, కాని దాని వైరి అయిన బాధను కాదు. ఎందుకంటె బాధను భరించడం బహు కష్టం.

మనం ముసలి వారమై నప్పుడు బాధ పడతాం. అది సహజం కూడా. ఉపేక్షతో దానిని మనం భరించాలి.

జరాదుఃఖం కంటె రుగ్మతాదుఃఖం – రుగ్మత దీర్ఘకాలికమైతే – బాధాకరమైంది. దీనికి బదులుగా మరణమే మేలు అనుకొంటాం. చిన్న పంటి నొప్పి, తలనొప్పి కొన్నిసార్లు భరింప రానిదిగా ఉంటుంది.

మనం జబ్బు పడ్డప్పుడు, వ్యాకులత చెంద కుండ, ఏమైనా సరే దానిని భరించ గలగాలి. మంచిది, ఇంతకంటె తీవ్రమైన, ఘోరమైన జబ్బు బారిన పడ లేదని మనలను మనం ఓదార్చు కోవాలి.

తరుచు మనం, మనకు దగ్గరను కొన్న వారికి దూర మవుతాం. అంటు వంటి ఎడబాటు మనకు మనోవేదనను కలిగిస్తుంది. సంయోగాలన్నీ వియోగాలతో అంతం మవుతా యని మన గుర్తించాలి. ఉపేక్షను పాటించడానికి ఇదొక మహదవకాశం.

అనేక సందర్భాలలో అసహ్యించుకొనే అసంతోషకరమైన వాటితో కలిసి ఉండాల్సి వస్తుంది. వాటిని మనం భరించ వలసిందే. బహుశ మన గత, ప్రస్తుత కర్మ ప్రభావాన్ని అనుభవిస్తున్నామేమో. ఈ నూతన సన్నివేశానికి మనం అనుగుణులం కావాలి లేదా ఏదో సాధనంతో అవరోధాన్ని అధిగమించాలి.

పరిపూర్ణుడైన బుద్ధుడు గూడా – మాలిన్యాల నన్నింటిని కడిగివేసి గూడ–రుగ్మత, ప్రమాదాలవలని శారీరక బాధలను అనుభవించక తప్ప లేదు.

బుద్ధునికి ఎప్పుడూ తలనొప్పి వస్తూ ఉండేది. అతని అంతిమ రుగ్మత అతనిని చాల శారీరక బాధకు గురి చేసింది. దేవదత్తుడు దొర్లించి రాతి ముక్క బుద్ధుని కాలికి తగిలి గాయం చేసింది. దానికి శస్త్రచికిత్స అవసరమైంది. కొన్ని సార్లు అతడు ఆకలితో మాడ వలసి వచ్చింది. కొన్ని సార్లు గుర్రాల దాణాతో పొట్ట నింపుకో వలసి వచ్చింది. తన శిష్యగణమే ఎదురు తిరగగా, అతడు మూడు నెలల పాటు అరణ్యంలో ఏకాంతంగా ఉండ వలసి వచ్చింది. ఆ అరణ్యంలో ఎముకలు కొరికే చలి గాలులలో, ఆకులు కప్పిన గరుకు నేల మీద పడుకొని పరిపూర్ణ ఉపేక్షతో నిద్ర పోయాడు. బాధాసుఖాల మధ్య సమచిత్తంతో జీవించాడు.

సంసార పర్యాటకాల గతిలో, మనం ఎదుర్కొనే అత్యంత అధిక దుఃఖం మరణం. కొన్ని సార్లు మరణం ఒంటరిగా రాదు, అది అసంఖ్యాకంగా వస్తుంది. పిచ్చెత్తించ వచ్చు గూడ.

పతాచారా తన చుట్ట పక్కాల నందరిని – తలిదండ్రులను, భర్తను, సోదరుని, ఇద్దరు పిల్లలను – పోగొట్టుకొంది. ఆమెకు పిచ్చెక్కింది. బుద్ధుడామెను ఓదార్చాడు.

కిసాగౌతమి తన ఒక్కడంటె ఒక్కబిడ్డను పోగొట్టు కొంది. మరణించిన తన కొడుకు మందు కోసం బయలు దేరింది. కొడుకు శవాన్ని ఎత్తుకొని, బుద్ధుని దగ్గరకు వెళ్ళి, మందు అడిగింది.

''మంచిది, సోదరీ, కొంచెం ఆవాలు తేగలవా?'' అని అడిగాడు బుద్ధుడు.

''తప్పకుండా, దేవా'' అంది ఆమె.

''కాని, సోదరీ, ఎప్పుడూ ఎవరూ చని పోని ఇంటి నుంచి వాటిని తేవాలి సుమా.''

ఆమెకు ఆవాలైతే దొరికాయి, కాని మరణం లేని ఇంటి నుంచి దొరక లేదు.

ఆమెకు జీవిత స్వభావం అవగతమైంది.

తన ఏకైక సంతానమైన ఒకే ఒక కొడుకు మరణించి నప్పుడు ఎందుకు దుఃఖించ లేదని ఒక తల్లిని అడిగితే, ఆమె ఇలా అంది: '' అడగకనే అతడు వచ్చాడు, అడగకనే అతడు పోయాడు. ఎలా వచ్చాడో అలాగే పోయాడు. మనం ఎందుకు ఏడవాలి? ఏడిస్తే ప్రయోజనం ఏమిటి?''

చెట్టు నుంచి ఫలాలు – పచ్చివి, పండువి – రాలి పోయి నట్లే మనమూ పిల్లలుగా, పెద్దవాళ్ళుంగా, వృద్ధులంగా మరణిస్తాం.

సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు పడమట అస్తమించ డానికే.

ప్రభాతవేళ పూలు వికసిస్తియి, సాయంత్రం వడబడి పోవ డానికే.

మరణ మనివార్యం. అది అందరికి వస్తుంది. దానిని మనం పరిపూర్ణ ఉపేక్షతో ఎదుర్కొవాలి.

''పృథ్వి మీదకు దేనిని విసరినా
అది మధుర మైన దైనా, కుళ్లిన దైనా,
అది అన్నింటిని ఒకేవిధంగా చూస్తుంది.
అది ద్వేషించదు, స్నేహించదు.
అలాగే అతడూ మంచిలో, చెడులో
ఎప్పుడూ సమతూకంలో ఉండాలి.''

బుద్ధుడు అంటున్నాడు :

ప్రాపంచిక పరిస్థితులు అర్హంత మనస్సును తాకి నప్పుడు అది ఎప్పుడూ చలించదు.

లాభనష్టాలలో, యశస్సు అయశస్సులలో, నిందా స్తుతులలో, సఖ దుఃఖాలలో సమచిత్తంతో ఉండడానికి ప్రయత్నిద్దాం.

నలభైనాలుగో ప్రకరణం

# జీవిత సమస్యలు

ఎవరు? ఎక్కడనుంచి? ఎక్కడకు? ఎందుకు? ఏమిటి? – అనేవి మానవాళి ఎదుర్కొనే కొన్ని ముఖ్య సమస్యలు.

''మనిషి ఎవరు?'' అనేది మన మొదటి ప్రశ్న.

అందరికీ తెలిసిన, స్వయం సిద్ధమైన దానితో మనం మొదలు పెడదాం.

మనిషికి ఒకదేహం ఉంది. దానిని మన జ్ఞానేంద్రియాలతో గాని, పరికరాలతోగాని చూడ వచ్చు. ఈ భౌతిక శరీరంలో కొన్ని శక్తులు, గుణాలు ఉన్నాయి. ఇవి నిరంతర ప్రవాహ స్థితిలో ఉంటాయి.

పదార్థం అంటే ఏమిటో నిర్వచించడం శాస్త్రజ్ఞులకే కొరుకుడు పడ లేదు. కొంత మంది తాత్త్వికులు పదార్థాన్ని ఇలా నిర్వచించారు: ''గతి (Motion) అని పిలవబడే పరివర్తనలు దేని నుంచి బయలు దేరుతాయో అది పదార్థం. పదార్థం నుంచి బయలు దేరే మార్పులే గతి[1]''.

పదార్థానికి పాళీమాట ''రూప''. పరివర్తన చెందేది లేదా విచ్ఛిత్తి అయ్యేది అని, దానిని వివరిస్తారు. అభివ్యక్త మయ్యేది రూప (పదార్థ) మని మరో వివరణ.

బౌద్ధం ప్రకారం నాలుగు ప్రాథమిక పాదార్థిక మూల కాలున్నాయి. అవి : పృథ్వి, ఆపో, తెజో, వాయొ లు.

పృథ్వి అంటే వ్యాపక లేదా విస్తృతిమూలకం. ఇది పదార్థాశ్రయం. అది లేక పోతే వస్తువులు ఆకాశాన్ని ఆవరించ లేవు. గట్టితనం మెత్తదనం అనే గుణాలు – ఇవి పూర్తిగా సాపేక్షాలు. ఈ మూలకం యొక్క రెండు ధర్మాలు. ఈ వ్యాపక లేదా విస్తృతిక మూలకం భూమి, నీళ్లు, నిప్పు, గాలిలో ఉంది. ఉదాహరణకు పైనీటికి క్రింది నీరు ఆధారం. గతి మూలకం (వాయొ) తో కలిసిన వ్యాపక మూలకం ఊర్ధ్వ పీడనాన్ని జనింప జేస్తుంది. చలి లేదా వేడి తెజో మూలక మైతే, ద్రవత ఆపో మూలకం.

ఆపో సంసక్తతా మూలకం. పృథ్వివలె కాక, ఇది తాక వీలు కానిది. ఈ మూలకం కారణంగానే, విక్షిప్త (విసరబడిన) పరమాణువులను సంసక్తం (కలపి) చేసి, మనకు వస్తువు భావనను ఇస్తుంది.

ఉష్ణమూలకం తెజొ  శీతలంగూడ తెజొ రూపమే. చలి, వేడి రెండూ తెజొలో ఉన్నాయి. ఎందుకంటె వాటికి వస్తువులను పరిపక్వం చెందించే శక్తి ఉంది. మరోమాటలో, చెప్పాలంటే, వాటికి ప్రాణశక్తి ఉంది. సంరక్ష (స్థితిపాలనం), వినాశం ఈ మూలకం కారణంగానే జరుగుతుంది.

వాయొ గతి మూలకం. చలనాలు దీని కారణంగా జరుగుతాయి. గతి అనేది శక్తి లేదా ఉష్ణ జనకం. భౌతిక ప్రపంచంలోని గతి, ఉష్ణాలు రెండూ వరుసగా మానసిక ప్రపంచంలోని విజ్ఞానానికి, కమ్మకు సరి  పోలుతాయి.

ఈ నాలుగు బలమైన శక్తులు అవిభాజ్యాలు, అంతర్గత సంబంధులు. కాని వాటిల్లో ఒక మూలకం మరోదాని కంటె అధికంగా ఉండ వచ్చు. ఉదాహరణకు పృథ్విలో విస్తృతి మూలకం ఎక్కువగా ఉంది. సంసక్తత నీటిలో, వేడి నిప్పులోను, గతి గాలిలోను ప్రబలంగా ఉంటాయి.

ఈ విధంగా పదార్థంలో శక్తులు, గుణాలు నిరతం మారుతూ ఉంటాయి. ఏ రెండు వరుస క్షణాల పాటు అవి అవిగా ఉండవు. బౌద్ధం ప్రకారం పదార్థం పదిహేడు ఆలోచనా క్షణాలు పాటు మాత్రమే స్థాత  మవుతుంది[2].

జీవశాస్త్రం ప్రకారం మనిషి గర్భంలో పడ్డప్పుడు, తన తలిదండ్రుల నుండి అత్యంత అల్ప కణాన్ని – ఇది అంగుళంలో 30 మిలియన్ల వంతు ఉంటుంది – వారసత్వంగా పొందుతాడు. ''తొమ్మిది మాసాల కాలం ఈ శకలం 15000 మిలియన్ల రెట్లు పెద్దదైన జీవద్రవ్యంగా పెరుగుతుంది''[3]. ఈ అల్ప (రసాయనిక – భౌతిక) శకలం మనిషికి భౌతిక భూమిక

బౌద్ధం ప్రకారం లింగం గూడ గర్భధారణ సమయంలోనే నిర్ధారిత మవుతుంది.

పదార్థంతో కలిసి మరో కారకం ఈ సంశ్లిష్ట మానవ యంత్రంలో ఉంది. అదే మనస్సు. మానవుడు = మనస్సు + శరీరం కాదు, మనిషి అంటే ''మనస్సు – శరీరం'' అని చెప్పడానికి చాల మంది పండితులు ఇష్టపడతారు. విజ్ఞాన శాస్త్రజ్ఞులేమో జీవం పదార్థం నుంచి వస్తుందనీ, మనస్సేమో జీవంనుంచి వస్తుందని చెబుతారు. కాని ''మనస్సు  వికాసం'' గురించి వారు మనకు సంతృప్తి కరమైన సమాధానం ఇవ్వండం లేదు.

భౌతిక శరీరం వలె కాక, అభౌతిక మనస్సు కనిపించదు. కాని దానిని ప్రత్యక్షంగా తెలుసుకో వచ్చు. ప్రాచీన ద్విపద ఇలా ఉంది:

మనస్సంటే ఏమిటి? పదార్థం లేకపోవడం
(What is mind ? No Matter)

పదార్థం అంటే ఏమిటి? మనస్సు లేకపోవడం.

(What is Matter? Never mind)★

సంవేదనల ద్వారా మనం ప్రత్యక్షంగా మన ఆలోచనాను భూతులను గ్రహిస్తాం. ఇతరులలో వాటి ఉనికిని ఉపమానం ద్వారా గ్రహిస్తాం.

మనస్సును తెలప డానికి అనేక పాళీ పదాలున్నాయి 'మన', 'చిత్త', 'విజ్ఞాణ', అనేవి వాటిలో ముఖ్యమైనవి. పాళీధాతువు 'మన్' ను - అంటే ఆలోచించుట, మననం చేయుట – ఆంగ్ల పదం 'Man' (మేన్) తో పోల్చి చూడండి. పాళీ పదం మనుష (Human = మానవ) అంటే విజ్ఞానాన్ని పెంపొందించు కొన్నవాడు అని అర్థం.

బౌద్ధంలో మనస్సు (Mind) కు విజ్ఞాన(Consciousness) తేడా లేదు. రెండింటిని పర్యాయ పదాలుగా ఉపయోగిస్తారు. క్రియలన్నింటిని నిర్దేశం చేసే ఒక కర్త గాని ఆత్మ గాని లేదు గనుక, మనస్సును "వస్తువును ఎరుగుట" (awareness of an object)గా నిర్వచించ వచ్చు. అది సతతం మెరుపు వేగంతో పుట్టిగిట్టే శీఘ్రగాములైన మానసిక స్థితుల (mental states) తో నిర్మితమైంది. "పుట్టుకను మూలంగా, మరణాన్ని నోరుగా చేసుకొని, ఇంద్రియక ఉపనదుల నుంచి గ్రహిస్తూ నిరతం పొంగి పారేనది లాంటిది". ఈ నిరతం ప్రవహించే జీవన ప్రవాహంలో ప్రతి "క్షణిక విజ్ఞానం" అది గతించి నప్పుడు, దాని మొత్తం శక్తిని, అది సంతరించుకొన్ని దాని చెరగని ముద్రలను, దాని తరవాత దానినుసరించి వచ్చే "క్షణిక విజ్ఞానానికి" అందిస్తుంది. అందువల్ల ప్రతి నూతన క్షణిక విజ్ఞానం దాని పూర్వక్షణిక విజ్ఞానాల బీజ శక్తులను కలిగి ఉంటుంది. చెరప డానికి వీలైన పలక లాంటి నిరతం మారే మనస్సు మీద 'వాసన' లన్నీ చెరగకుండ ముద్రితాలవుతున్నాయి. గనుక శక్తులన్నీ బీజరూపంలో ఒక జీవితం నుంచి మరో జీవితానికి ప్రసారితమవుతున్నాయి కనుక, తాత్కాలికంగా ఈదేహాల విచ్చితి జరిగినా, పూర్వ జన్మల, సంఘటనల స్మృతులు సంభవమని చెప్ప వచ్చు. స్మృతి గనుక కేవలం మెదడు కణాలమీద మాత్రమే ఆధార పడి జరిగితే, అది అసంభవమవుతుంది.

విద్యుత్తుకు వోలె, మనస్సు నిర్మాణాత్మక శక్తి, వినాశకరాత్మక శక్తి రెండింటితో రెండు వైపుల పదును ఉన్న ఆయుధం. దానిని మంచికి, చెడుకు – రెండింటికి వాడవచ్చు. ఈ అగోచర మనస్సులో పుట్టే ఒక్క ఆలోచన ప్రపంచాన్ని రక్షించగలదు, భక్షించగలదు.

---

★ దీనిని బెర్ట్రాండ్ రసెల్ హాస్య ధోరణిలో చెప్పినా అందులో సత్యం ఉంది ఆంగ్ల వాక్యాలలోని శ్లేషగమనార్హం - అనువాదకుడు

అటువంటి ఒక్క ఆలోచన ఒక దేశాన్ని నిర్మానుష్యం చేయ వచ్చు, లేదా జనంతో నింప వచ్చు. ఒకని స్వర్గాన్ని నిర్మించేది మనస్సే, నరకాన్ని సృజించేది అదే.

ఔస్‌పెన్‌స్కీ రాస్తాడు: ''విజ్ఞాన దృగ్విషయంలో ఉన్న గుప్త శక్తి అంటే ఆలోచనలలో, సంవేదనలలో, వాంఛలలో, ఉన్న శక్తి - దాని బీజశక్తి అపారమనీ, అమానీయఘనీ తెలుసుకొంటాం. వైయక్తికాను భవం నుంచి, పరిశీలన నుంచి, చరిత్ర నుంచి మనకు తెలుసు - భావాలు, వేదనలు, వాంఛలు, వాటి కవే అభివ్యక్తమవుతూ, అపారశక్తిని విడుదల చేసి అనంత దృగ్విషయ శ్రేణులను సృష్టించగలవని. ఒక భావం, నూతన శక్తిని విడుదలచేస్తూ, కొత్త దృగ్విషయ శ్రేణులను రేపుతూ, లోతుగ, గాఢంగా పాతుకుపోతూ యుగయుగాలుగ పని చేయ గలదు. ఆలోచనలు జీవించే ఉంటాయని మనకు తెలుసు. ఆ ఆలోచనకు మూల పురుషులైన వారి నామాలు పురాణాలై పోయి నప్పటికీ, - ప్రాచీన మతస్థాపకుల నామాలలా, ప్రాచీన అమరకావ్యాల సృష్టికర్తల నామాలలా, నాయకుల, ప్రవక్తల నామాలలా - వారి ఆలోచనలు జీవించి ఉంటాయి. వారి మాటలను అసంఖ్యాక పెదాలుచ్చరిస్తాయి. వారి భావాలను చదువుతారు, వ్యాఖ్యానిస్తారు.

'' ఒక బొగ్గు కణికలో నిక్షిప్తమై ఉన్న శక్తిలా లేదా ఒక సజీవ కణంలో ఉన్న శక్తిలా నిస్సందేహంగా ఒక కవి భావం అనంత శక్తిని కలిగి ఉంటుంది. కాని ఈ శక్తి సూక్ష్మమైంది. కొలవ డానికి వీలు లేనిది, వీర్యవంతమైంది.''[4]

ఉదాహరణకు బుద్ధుడు చెప్పిన అర్థవంతమైన పదాలలోని బీజ శక్తిని చూడండి:

''కర్మలకు ముందుగా మనస్సు నడుస్తుంది. మనస్సు ముఖ్యం. వాటిని మనస్సుచేసింది''

బౌద్ధం ప్రకారం, మనస్సు లేదా విజ్ఞానం గర్భధారణ సమయంలో పదార్థంతోపాటు పుడుతుంది. అందువల్ల భ్రూణంలోనే విజ్ఞానం ఉంది. ఈ తొలి - విజ్ఞానాన్ని సాంకేతికంగా 'పునర్జన్మ విజ్ఞానం' లేదా పునస్సంధించే విజ్ఞానం (పతిసంధి విఞ్ఞాన) అంటారు. ఇది ఆవ్యక్తి గతకర్మతో నిబద్ధితమై ఉంటుంది. మానవాళి మధ్య ఉండే మానసిక, బౌద్ధిక, ధార్మిక తేడాలకు కారణం ఈ కర్మనిబద్ధ విజ్ఞానం. ఇది మనిషి రెండో కారకం.

మానవుని నిర్మాణ కాంశ త్రికంలో మూడోది ఉంది. అది మనస్సు, పదార్థం - రెండింటినీ వీర్యవంతం చేసే జీవిత దృగ్విషయం. జీవం ఉండడం వల్లనే ప్రత్యుత్పత్తి సాధ్య మవుతుంది. జీవం 'శారీరక - మానసిక' దృగ్విషయం - రెండిటి ద్వారా అభివ్యక్త మవుతుంది. పాళీ భాషలో ఈ రెండు జీవిత రూపాలను నామ జీవితింద్రియమని, రూప జీవితంద్రియమని - మానసిక, శారీరక జీవితమని - అంటారు.

మనిషిని నిర్మించే ముఖ్య నిర్మాణాంశాలు మూడు. అవి : పదార్థం, మనస్సు, ప్రాణాలు. ఈ మూడింటి సంయోగంతో 'మనిషి' అనే బలమైన శక్తి అనూహ్య సంభావ్యతలతో, ఉనికిలోకి వస్తుంది. అతనిలో చెడు అనే చెత్త కుప్ప, మంచికి ఆలయమూ - రెండూ ఉంటాయి. అతనిలో క్రిమి, మృగం, మనిషి, అతి మనిషి, దేవుడు, బ్రహ్మ ఉన్నారు. నేర - ప్రవృత్తి, రుషిత్వం - రెండూ అతనిలో నిద్రాణంగా ఉంటాయి. తనకు, ఇతరులకు, అతడు వరమూ కావచ్చు, శాపమూ కావచ్చు. వాస్తవానికి మనిషి తనకై తానే ఒక ప్రపంచం.

''ఎక్కడ నుంచి?'' అనేది మన రెండో ప్రశ్న

మనిషి ఎక్కడ నుంచి వచ్చాడు?

మనిషికి 'ఆది' అయినా ఉండాలి. లేదా అనాది అయినా ఉండాలి. మొదటి దానిని బలపరిచే వారు ఒక ప్రథమ కారణాన్ని ప్రతిపాదిస్తారు. ఆ ప్రథమకారణం ఒక విశ్వశక్తి కావచ్చు, లేదా సర్వశక్తిమంతుడు కావచ్చు. రెండో దానిని బలపరిచే వారు, ప్రథమ కారణమేదీ లేదంటారు. ఎందుకంటే మన సామాన్యానుభవంలో ఎప్పుడూ కారణం కార్య మవుతుంది, కార్యం కారణ మవుతుంది. మరి ఈ కారణ కార్య వలయంలో ఏది మొదటి కారణమని చెబుతాం? మొదటిదాని ప్రకారం జీవానికి ఒక ఆరంభం ఉంటే, రెండో దాని ప్రకారం ఆరంభం లేదు (అనాది). కొందరి అభిప్రాయంలో ప్రథమ కారణం అనేది - ''గుండ్రని త్రిభుజి'' లా అనూహ్యం.

శాస్త్రం దృష్ట్యా. తలిదండ్రుల నుంచి వచ్చిన వీర్యాండాలనుంచి మానవుడు జనిస్తాడు. విజ్ఞాన శాస్త్రజ్ఞులు, జీవం అంతా జీవం నుంచే వస్తుందని చెబుతూ, మనస్సు, జీవాలు 'అజీవం' నుంచి వస్తా యంటారు.

శాస్త్రీయ దృక్పథం నుంచి మనిషి పూర్తిగా తలిదండ్రుల నుంచి వస్తాడు. అలాంటప్పుడు జీవానికి ముందు జీవం ఉటుంది. జీవానికి సంబంధించిన మొదటి ప్రోటోప్లాజమ్ ఎక్కడ నుంచి వచ్చిందని అడిగితే శాస్త్రజ్ఞులు అజ్ఞతను ప్రదర్శిస్తున్నారు.

బౌద్ధం ప్రకారం మనిషి ''కమ్మయోని'' (Matrix of action) నుంచి పుట్టాడు. తలిదండ్రులు చేసేదంతా కేవలం పాదార్థిక స్తరాన్ని పొరను కల్పించడమే. అలాంటప్పుడు జీవికి ముందు జీవి ఉంటుంది. గర్భధారణ సమయంలో, 'భ్రూణాన్ని వీర్యవంతం చేసే తొలి విజ్ఞానాన్ని నిబద్ధించేది కమ్మ. మానవుని నిర్మించే త్రికాన్ని పూర్తిచేయడానికి, అంతకు ముందే అక్కడ ఉన్న' భౌతిక దృగ్విషయంలో మానసిక జీవ దృగ్విషయాన్ని ఉత్పన్నం చేసేది ఈ అగోచర కమ్మ శక్తియే.

జీవన భావన గురించి బుద్ధుడు ఇలా అంటాడు :

'' ఎక్కడ మూడు కలిసి కనిపిస్తాయో అక్కడ అక్కడ జీవాణువు నాట బడుతుంది. తల్లితండ్రి కలిసి నప్పుడు, తల్లి రుతుక్రమం, పుట్టబోయే సత్వం (గంధబ్బ) ఈ రెండూ లేక పోతే, అప్పుడు ఎటువంటి జీవం నాట బడదు. తల్లి దండ్రి కలిసి నప్పుడు తల్లి రుతుక్రమం ఉండి, పుట్టబోయే సత్వం (గంధబ్బ) లేక పోతే అప్పుడూ ఏ జీవం నాట బడదు. తల్లిదండ్రులు కలిసి నప్పుడు, తల్లి రుతుక్రమం ఉండి, పుట్టబోయే సత్వం ఉంటే – రెండూ ఉంటే అప్పుడు జీవం నాట బడుతుంది.''

ఇక్కడ గంధబ్బ (=గంతబ్బ), ఒక ప్రత్యేక గర్భంలో పుట్టడానికి సిద్ధంగా ఉన్న తగిన జీవిని (సత్వాన్ని) సూచిస్తుంది. ఈపదాన్ని ఈ ప్రత్యేక సందర్భంలోనే ఉపయోగిస్తారు. దీనిని శాశ్వత ఆత్మ అని అపార్థం చేసుకో రాదు.

ఒక జీవి ఇక్కడ పుట్టాలంటే, ఒక జీవి వేరే చోట చని పోయి తీరాలి.

జీవి పుట్టుక గత జన్మలో జీవి మరణానికి సరి పోలుతుంది. మామూలు పరిభాషలో చెప్పా లంటే, ఒక చోట సూర్యోదయం అయిందంటే, మరోచోట సూర్యాస్తమయం అయిందన్న మాట.

''అవిద్యతో ఆటంకితమై, తృష్ణతో బంధితులై పర్యటిస్తూ, కొనసాగుతూ, ఉండే జీవుల 'ఆది'ని చూడడం వీలు కాదు,'' అని బుద్ధుడు చెప్పాడు.

జీవన ప్రవాహం, దానికి అవిద్య, తృష్ణలనే మురికి నీరు లభించినంతకాలం, అనంతంగా సాగి పోతుంది. ఈ రెండింటిని తెంపి వేసి నప్పుడు, జీవన ప్రవాహం, బుద్ధుల, అర్హంతల విషయంలో లాగ, ఆగిపోతుంది. పునర్జన్మ ఉండదు. ఈ జీవ ప్రవాహం అవిద్య, తృష్ణలతో నిండి ఉండని ఒక దశను మనం ఎప్పుడూ కానం కనక, దాని 'ఆది'ని మనం నిర్ణయించ లేం.

బుద్ధుడు ఇక్కడ ప్రాణుల జీవ ప్రవాహం గురించి మాత్రమే చెప్పాడు. విశ్వం పుట్టుక, దాని పరిణామం గురించి, విజ్ఞాన శాస్త్రజ్ఞులు మాత్రమే చెప్పాలి.

'' ఎక్కడకు?'' అనేది మన మూడో ప్రశ్న.

మనిషి ఎక్కడకు వెళతాడు ?

ప్రాచీన భౌతిక వాదాన్ని, పాళీ, సంస్కృత భాషలలో, 'లోకాయత' అంటారు. దీని ప్రకారం, మనిషి మరణంతో, తాను పుట్టించిన ఏ శక్తిని తన తరవాత వదిలిపెట్ట కుండ,

పూర్తిగా నాశనం అయిపోతాడు. ''మానవుడు నాలుగు మూలకాలతో సముద్భూత మయ్యాడు. మనిషి చని పోయి నప్పుడు పృథ్వీమూలకం భూమిలో తిరిగి కలిసి పోతుంది; నీటి మూలకం నీటిలోకి, అగ్ని మూలకం అగ్నిలోకి, వాయు మూలకం వాయువులోకి తిరిగి కలిసి పోతాయి. ఇంద్రియాలు ఆకాశంలో కలిసి పోతాయి. జ్ఞానులు, తెలివిహీనులు అందరూ ఒకేలా, శరీరం లయ మైనప్పుడు, ముక్కలై, నశిస్తారు, వారిక ఏ మాత్రం ఉండరు. మరో ప్రపంచం ఏదీ లేదు. ఈ ప్రకృత ప్రపంచమే వాస్తవం. స్వర్గం, నరకాలని పిలవ బడేవి వంచకుల సృష్టి[5].

భౌతిక వాదుల ఇంద్రియ గోచరమైన దానినే నమ్ముతారు. అలాంటప్పుడు కేవలం పదార్థం మాత్రమే వాస్తవం. అంతిమ మూలకాలు నాలుగే. అవి : భూమి, నీరు, నిప్పు, గాలి. అలాడిన్ దీపాన్ని రుద్దినప్పుడు భూతం కనిపించి నట్లుగా, ఆత్మచైతన్య జీవం, మార్మికంగా ఆనాలుగు మూలకాలనుంచి వస్తుంది. కాలేయం పిత్తరసాన్ని ఊరించి నట్లే, మెదడు ఆలోచనలను స్రవిస్తుంది.

రాధాకృష్ణన్ చెప్పినట్లుగా, ''భౌతిక వాదుల దృష్టిలో పరలోకాన్ని విశ్వసించడం, దివాళా కోరుతనానికి, ఆడంగి తనానికి, బలహీనతకు, పిరికితనానికి, నిజాయితీ రాహిత్యానికి నిదర్శనం.''

క్రైస్తవం ప్రకారం మనిషికి గతం లేదు. రెండు శాశ్వతాలైన స్వర్గ నరకాలకు ఈ ప్రస్తుత జీవితం తయారు చేస్తుంది. వాటిని లోకాలుగ చూసినా, రాజ్యాలుగా చూసినా, మనిషి భవిష్యత్తు అనంతం సంతోషంతో స్వర్గంలోనో, అనంత దుఃఖంతో నరకంలోనో ఉంది. కనుక మనిషి మరణం తరవాత గూడ ఉంటాడు. అంటే అతని సారం శాశ్వతత్వాన్ని చేరుతుంది.

షోపన్‌హర్ (Schopenhaeur) అంటాడు: ''తాను శూన్యం నుంచి వచ్చాడని ఎవడు భావిస్తాడో, మళ్ళీ శూన్యంలోకే వెడతానని అతడు అనుకోవాలి. ఎందుకంటె, అతడు లేక ముందు ఒక అనంతకాలం (శాశ్వతత్వం) గడిచింది, తరవాత రెండో అనంతకాలం ప్రారంభమైంది. ఈ రెండో దానిలో తాను ఎప్పటికీ ఉండిపోతానని భావించడం రాక్షసాలోచన.''

గతాన్ని ప్రస్తుతాన్ని విశ్వసించే హిందు వాదులు మరణం తరవాత మనిషి పూర్తిగా నాశం అవుతాడని చెప్పరు. మరణం తరవాత అతడు అనంతంగా ఉంటాడనీ వారు చెప్పరు. అనంత గతానాగతా పునర్జన్మల శ్రేణిని వారు విశ్వసిస్తారు. ఒకని కర్మలు – కర్మబలం – నెడుతున్నంత

కాలం, వారిదృష్టిలో, జీవిత ప్రవాహం అనంతంగా సాగుతూనే ఉంటుంది. కాల క్రమంలో, మనిషి సారం, అతని ఆత్మ ఎక్కడ నుంచి వచ్చిందో ఆ పరమాత్మలోకి, సంలీనం అవుతుంది.

బౌద్ధం వర్తమానాన్నే నమ్ముతుంది. ప్రస్తుతాన్ని ఆధారం చేసుకొని అది గతానాగతాలను చెబుతుంది. అగోచర విద్యుచ్ఛక్తికి విద్యుద్దీపం బాహ్యారూప మెలాగో, అలాగే అగోచర కమ్మకు మనిషి బాహ్యారూపం. బల్బు పగిలిపోవచ్చు. కాంతి పోవచ్చు. కాని విద్యుత్ప్రవాహం ఉంటుంది. కాంతి మరోబల్బు ద్వారా ప్రత్యక్షం కావచ్చు. అదే విధంగా భౌతిక శరీరం విచ్ఛిన్నమై ప్రకృతి విజ్ఞానం అంతమైనా, కమ్మ శక్తి చెదరక, మరోజన్మలో నూతన శరీరం ఆవిర్భావం కావడానికి దారి తీస్తుంది. ఇక్కడ కమ్మశక్తి విద్యుచ్ఛక్తి లాంటిది. బల్బు తలిదండ్రుల నుంచి వచ్చిన అండ కణం లాంటిది.

గత కర్మ వర్తమాన కర్మను నిబద్ధిస్తుంది; వర్తమాన కర్మ గత కర్మతో కలిసి భావి కర్మను నిబధిస్తుంది. వర్తమానం గతానికి బిడ్డ, భావికి తండ్రి. అందుకని మరణంతో మనిషి పూర్తి నాశం జరగదు. ఎందుకంటే, ఆ ప్రత్యేక అయుః ప్రమాణం అంతమైనా, దానిని ఇప్పటి వరకు నిల బెట్టిన శక్తి నాశం కా లేదు.

మరణానంతరం, అవిద్య, తృష్ణలు తోడై ఉన్నంత కాలం, జీవ ప్రవాహం అనంతంగా కొన సాగుతుంది. మామూలు పరిభాషలో చెబితే, మనిషి మనిషిగానే పునర్జన్మ ఎత్తాలని లేదు, ఎందు కంటె మనిషి ఒక్కడే జీవికాదు. అంతేకాదు, ఇంకా, ఈ విశ్వంలో ఒక అత్యల్ప శకలం అయిన భూమి ఒక్కటే కాదు మనిషి పునర్జన్మ ఎత్తడానికి. ఇంకా ఇతర వాస యోగ్యమైన లోకాల్లో అతడు పుట్ట వచ్చు[6].

ఈ పునర్జన్మ పరం పరను ఒకడు అంత మొందించు కోవా లంటే, బుద్ధుడు, అర్హంతలు చేసి నట్లుగానే, అన్నిరకాల పూర్తి తృష్ణారాహిత్యమైన నిర్వాణాన్ని యథార్థం చేసుకోవడం ద్వారా దానిని సాధించ వచ్చు.

మనిషి ఎక్కడకు వెళతాడు? అతడు అర్హుడైతే ఎక్కడికైనా వెళ్ళ వచ్చు. ఏ ప్రత్యేక కోరిక లేకుండ, తన మార్గాన్ని సంఘటనాశ్రేణి నిర్ణయానికి వదిలి వస్తే, అతడి కర్మాను సారం, అతడు ఎక్కడకు తగిన వాడో అక్కడికి వెళతాడు.

ఎందుకు ? అనేది మన చివరి ప్రశ్న.

మనిషి ఎందుకు ఉన్నాడు? జీవితానికి ఏదైన హేతువు (లక్ష్యం) ఉందా?
ఇది వివాదస్పద సమస్య.
భౌతికవాద దృక్పథం ఏమంటున్నది ?
విజ్ఞాన శాస్త్రజ్ఞులు సమాధానం చెబుతారు :

''జీవితానికి ఒక పరమార్థం ఉందా? ఉంటే అది ఏమిటి లేదా ఎక్కడ లేదా ఎప్పుడు? ఆకాశం నుంచి విశ్వం వచ్చింది, సూర్యుడొచ్చాడు, భూమి వచ్చింది, జీవం వచ్చింది. మనిషి వచ్చాడు, ఇంకా ఎన్నోరావాలి.

ఇహ, లక్ష్యం విషయానికి వస్తే : అది ఎవరిది లేదా ఎక్కడినుంచి? ఎందుకు ఏమీ లేదు''

ఇంద్రియ జ్ఞానానికి, ప్రస్తుత భౌతిక సంక్షేమానికి పరిమితమైన భౌతికవాదులు ఆధ్యాత్మిక విలువలను విస్మరించారు. అందుకని వారి దృక్పథం ధార్మికుల దృష్టికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. వారి దృష్టిలో జీవితానికి 'అర్థ కర్త' (purposer) ఎవడూ లేడు. అందుకని హేతువు (లక్ష్యం) లేదు. బౌద్ధులు ఆస్తికేతరులు (non - theists) కావడంతో. వీరూ 'సృష్టి అర్థం కర్త'ను విశ్వసించరు.

''నెమళ్ళకు అద్భుతమైన ఆరంగులను ఎవరు దిద్దారు లేదా కోకిలకు అంత బాగా కూయడం ఎవరు నేర్పారు?' ప్రతి దానిని ప్రకృతి సహజత్వానికే ఆపాదించ డానికి, భౌతిక వాదులు చేసే, ముఖ్యవాదనలలో ఇది ఒకటి.

''తిను, తాగు, సుఖించు, మరణం అందరికీ వస్తుంది, మన జీవితాలను పరిసమాప్తం చేస్తూ,'' అనేది వారి దర్శన నైతి కాదర్శం. రాధాకృష్ణన్ రాసినట్లు ''శీలం (virtue) అనేది ఒక మోహం (delusion), భోగానుభవమే సత్యం. మరణం జీవితానికి అంతం. మతం బుద్ధిహీన మానసికచ్యుతి, ఒక మానసిక వ్యాధి. మంచి, ఉన్నత, శుద్ధ, అనుకంపలు - అన్నింటి మీద వారికి అపనమ్మకం. వారి సిద్ధాంతం ఇంద్రియసుఖాన్ని, స్వార్థాన్ని, గ్రామ్య (అసభ్య) సంకల్పాన్ని బల పరుస్తుంది. మోహం, సహజాతాలను నియంత్రించాల్సిన అవసరం లేదు. ఎందుకంటె, అవి మనిషి ప్రకృతికి సహజంగా ఇచ్చినవి.[7]''

సర్వదర్శన సంగ్రహ (పుట. 2 ) అంటున్నది:

''జీవితం నీ చేతిలో ఉండగానే, సుఖంగా జీవించు
ఎవడూ మృత్యువు అవహిత నేత్రం నుంచి తప్పించుకోలేదు;
మన ఈ చట్రాన్ని వారు ఒకసారి కాల్చిన తరవాత,
అది మళ్ళీ ఎప్పటికైనా ఎలా తిరిగి వస్తుంది?''

''జీవం ఉన్నంత కాలం మనిషిని సుఖంగా ఉండ నీయండి. అప్పు చేసి అయినా పప్పుకూడు కుడవనీయండి.''

'ఎందుకు' - అనే ప్రశ్నకు విజ్ఞాన శాస్త్రం ఏం సమాధానం చెబుతుందో చూదాం. విజ్ఞానం శాస్త్రం వస్తువులను అధ్యయనం చేస్తుంది. 'ఉన్న' దానిని అధ్యయనం చేస్తుంది. మతమేమో ఆదర్శాలను అధ్యయనం చేస్తుంది. ఎలా ఉండాలో అధ్యయనం చేస్తుంది. విజ్ఞానంశాస్త్రం అసంపూర్ణం, ఎందుకంటె అది ' ఎందుకు' అనే ప్రశ్నకు సమాధానం చెప్ప లేదు, అంటాడు సర్. ఆర్థర్‌థాంప్సన్.

విశ్వహేతువు (లక్ష్యం) గురించి చెబుతూ, బెర్ట్రాండ్ రసెల్ మూడు దృక్పథాలను పేర్కొంటాడు. అవి : ఆస్తిక, విశ్వదేవతాత్మక, ఆకస్మికాద్భూతా (emergent) లు. అంతడంటాడు: ''మొదటి దాని ప్రకారం ఈ ప్రపంచాన్ని దేవుడు సృష్టించాడు. కాలక్రమంలో కొంత మంచి పరిణమిస్తుందని అతడు ముందుగానే ఊహించి, ప్రకృతి నియమాలను తయారు చేశాడు. ఆ దృష్టి ప్రకారం లక్ష్యం (అర్థం), తన సృష్టికి తానే వెలుపల ఉండే సృష్టికర్త మనస్సులో సచేతనంగా ఉంటుంది.

''విశ్వదేవతా దృక్పథంలో, దేవుడు విశ్వానికి వెలుపల ఉండడు. ఈ విశ్వాన్ని మొత్తంగా చూసి నప్పుడు, అతడే ఈ విశ్వం. అందుకని సృష్టిక్రియ ప్రసక్తి ఇక్కడ ఉండదు. కాని విశ్వంలో ఒక రకం సృజనాత్మక శక్తి ఉంది. ఈ శక్తి విశ్వాన్ని ఒక ప్రణాళిక ప్రకారం పరిణమింప జేస్తుంది. ఈ ప్రక్రియ అంతటా గూడ సృజనాత్మక శక్తి మనస్సులో ఈ ప్రణాళిక ఉంటుందని చెప్పబడింది.

ఆకస్మికాధ్భూత దృక్పథంలో లక్ష్యం చాల వరకు అంధమైంది. తొలిదశలలో, ఈ విశ్వంలో ఏదీ గూడ, తరువాతి దశను ముందుగా ఊహించదు. కాని ఒకరకం అంధ ప్రచోదనం బాగా అభివృద్ధి చెందిన రూపాలను ఉనికిలోకి తెచ్చే, 'పరివర్తన'లకు దారి తీస్తుంది. దీనిని బట్టి చూస్తే ఒక అస్పష్టార్థంలో 'అంతం' (లక్ష్యం) ఆదిలోనే అంతర్గతంగా ఉన్నట్లనిపిస్తున్నది.'' [8]

దీని మీద మనం ఏమీ వ్యాఖ్యానించం. ఇవి కేవలం కొంతమంది మత వాదుల, గొప్ప చింతనుల దృక్పథాలు.

ఈ విశ్వంలో ఒక హేతువు, లక్ష్యం, ఉద్దేశం ఉన్నా లేక పోయినా, ఒక ప్రశ్న ఉదియిస్తుంది: క్రిములు, పాములు, దోమలు, కుక్కకాటు పిచ్చి - ఇవి ఎందుకున్నట్లు? వీటి ఉపయోగం ఏమిటి? అసలు దుఃఖం ఎందుకుంది? భూకంపాలలు వరదలు, యుద్ధాలు, జాడ్యాలు ఉద్దేశపూర్వకంగానే వస్తున్నాయా ?

విశ్వ లక్ష్యం గురించి తన దృక్పథాన్ని వివరిస్తూ రసెల్ సాహసోపేతంగా ప్రకటించాడు: ఎందుకు మనిషిని ఇంతగొప్ప వాణ్ణి చేసి మటాడడం? పులుల సింహాల మాటేమిటి ?

మనం, మనుషులం, చంపే వాటి కంటే అవి తక్కువ గానే జంతువులను మనషులను చంపుతున్నాయి. ఇంకా అవి మనకంటె చాల అందమైనవి. చీమల సంగతి ఏమిటి? ఏ ఫాసిస్టు కంటె గూడ అవి కార్పొరేట్ వ్యవస్థను బాగా నడుపు తున్నాయి. క్రౌర్యం, అన్యాయం, యుద్ధాలతో గూడిన మన మానవ ప్రపంచం కంటె కోకిలల, భారద్వాపక్షుల, లేళ్ళ ప్రపంచం ఎంతో మంచిగా ఉండదా? 'విశ్వానికి ఒక ఉద్దేశం ఉంది' అనే వారు మనకు ఉన్నాయని, బావించబడిన తెలివి తేటలను ఎక్కువగా చేసి చెబుతున్నారు. కాని వారి వ్రాతలను చూస్తే ఆ తెలివి తేటలను శంకించ వలసి వస్తుంది. నేను సర్వశక్తి మంతుడనై, నాకుమిలయన్లసంవత్సరాలకాలం ప్రయోగాలు చేయ డానికి అవకాశం లభిస్తే, నా అన్ని ప్రయత్నాల అంతిమ ఫలితంగా'మనిషి' గర్వ పడడానికి ఏమీ లేదని చెబుతాను.''

వివిధ మతాల ప్రకారం జీవితార్థం ఏమిటి?

హిందూ మతం ప్రకారం జీవితార్థం ''బ్రహ్మతో ఐక్యం కావడం'' లేదా, ''తన ఆత్మ ఎక్కడ నుంచి వచ్చిందో ఆసారంలోకి తిరిగి సంలీనం కావడం.''

యూదు, క్రైస్తవ, ఇస్లాం మాతాల ప్రకారం, ''దేవుని కీర్తించడం, అతనితో ఎప్పటికీ ఉండడం.''

ఏ మతానికి చెందిన వాడైనా ఒక సామాన్యుడు, పరమశాంతి స్వర్గ అమర్త్యజీవితం కోసం, తానంటి పెట్టుకొని వేళ్ళాడే ఈ భూమిమీది జీవితాన్ని వదిలిపెట్టి పోతాడా?

సందేహమే. నిజం!

బౌద్ధం, '' ఎందుకు'' అనే ప్రశ్నకు ఎలా సమాధానం చెబుతుందో చూదాం.

సృష్టికర్తను నిరాకరిస్తుంది బౌద్ధం. అలాంటప్పుడు బౌద్ధ దృక్పధం నుంచి ఈ విశ్వంలో ఒక ''శక్తి నిర్దేశిత ఉద్దేశం'' ఉండ డానికి వీలు లేదు. అతవి స్వేచ్ఛా కర్మల కంటె స్వతంత్రంగా, మానవుని భవితవ్యాన్ని నియంత్రించే విధి వాదా (Fatalism) న్ని, నిశ్చయవాదాన్ని, లేదా పూర్వ నిర్దిష్ట వాదాన్ని అది సమర్ధించదు. అలాగైతే స్వేచ్ఛా సంకల్పం ఒక బూటకం అవుతుంది. ఈ జీవితం యాంత్రిక మవుతుంది.

స్వయం కృతం వల్ల, పెంపకం వల్ల, పరిసరం ఇంకా ఇలాంటి వాటివల్ల, ప్రభావితమైన మానవుని కర్మలు చాలవరకు యాంత్రికాలే. కాని కొంత మేరకు మనిషి స్వేచ్ఛా సంకల్పాన్ని ప్రదర్శించ గలడు. ఒక ప్రాణం లేని రాయిలాగే గోపురం నుంచి జారి పడిన మానవుడు భూమికి ఆకర్షితు డవుతాడు. రాతి కంటె భిన్నంగా అతనికి మనస్సు అనేది ఉన్నా, ఈ

సందర్భంలో దానిని అతడుపయోగించి, అదే గోపుర్నా ఎక్కడమైతే, అతడు తన స్వేచ్ఛా సంకల్పాన్ని ఉపయోగించి తన ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు. దీనికి భిన్నంగా రాయి, దాని అంతట పని చేయడానికి దానికి స్వేచ్ఛ లేదు. మనిషికి తప్పొప్పుల మధ్య, మంచి చెడుల మధ్య ఎంపిక చేసుకొనే శక్తి ఉంది. తనకు, ఇతరులకూ కూడ మనిషి స్నేహితునిగా గాని, శత్రువుగా గాని ఉండ గలడు. అంతా గూడ అతని మనస్సు, దాని వికాసం మీద, ఆధారపడి ఉంటుంది.

మానవ జీవితంలో ఒక ప్రత్యేక నిర్దిష్ట లక్ష్యం లేక పోయినా, అతనికి ఒక లక్ష్యాన్ని ఎంపిక చేసుకొనే స్వేచ్ఛ ఉంది.

అందుకని జీవితార్థం ఏమిటి?

'బౌస్ పెన్స్కీ రాస్తాడు'. ''కొంతమంది, జీవిత పరమార్థం అనేది సేవలో, ఆత్మార్పణలో, ఆత్మత్యాగంలో, అన్నింటిని పరిత్యజించడంలో - ప్రాణంతో సహా - ఉంది అన్నారు. మరి కొంత మందికి జీవిత పరమార్థం, దాని ఆనందంలో, అంతిమ మృత్యుహేల నుంచి బయట పడడంలో ఉందన్నారు. వేరు కొంత మంది దానిని, జీవిత పరిపూర్ణతలో, మరణానంతర సుకర భావి జీవిత సృష్టిలో, లేదా భావిజన్మలలో చూశారు. ఇంకొందరు దానిని అనస్తిత్వ (Non-existence) లేదా జీవిత రాహిత్యంలోను, వేరు కొందరు జాతిని పరిపూర్ణం గావించడం లోను, ఈ భూ జీవితాన్ని పండించు కోవడంలోను చూశారు. మరి కొంత మందైతే, దాని అర్థాన్ని తెలుసు కొనడానికి అసలు ప్రయత్నం చేయడమే కుదరదు పొమ్మన్నారు''.

ఈ బాగా చదువుకొన్న పండితుడు ఈ అన్ని దృక్పథాలను విమర్శిస్తూ అంటాడు: ''ఈ వివరణలన్నింటి లోపం ఎక్కడ ఉందంటే, అసలు అవన్నీ గూడ జీవితార్థాన్ని 'జీవితం వెలుపల' అంటే మానవాళి భవిష్యత్తులో, లేదా, ఉన్నదో లేదో తెలియని సమస్య అయిన మరణానంతర జీవితంలో, లేదా మళ్ళీ అనుక్రామిక పునర్జన్మల లేదా అవతారాల పరంపరలో, అహం (నేను) పరిణామంలో - అన్నీ ప్రస్తుత జీవితం వెలుపలే - దర్శించడానికి ప్రయత్నించాయి. ఈ విధంగా జీవితం గురించి ఊహలు చేసే బదులు, మనుషులు తమలోకి తాము చూసు కొంటే, వాస్తవానికి జీవితార్థాన్ని కనుక్కోవడం అంత కష్టం కాదు. అది జ్ఞానంలో ఉంది''.[10]

బౌద్ధుని దృష్టిలో జీవితార్థం సంబోధి. అంటే వాస్తవంగా తానెలా ఉన్నాడో అలాగే అర్థం చేసు కోవడం. సూక్ష్మశీలం ద్వారా, మానసిక వ్యవసాయం ద్వారా, నిశిత ప్రజ్ఞద్వారా, వేరే మాటలలో చెప్పాలంటే, సేవ, పరిపూర్ణతల ద్వారా, దీనిని సాధించవచ్చు.

అపార మైత్రి, కరుణ, పూర్ణ స్వార్థరాహిత్యాలు సేవలో ఉన్నాయి. స్వార్థరాహిత్యం ఇతరులకు సేవ చేయ పురి కొలుపు తుంది. పరిపూర్ణత అంటే పూర్ణశుభ్రత, పూర్తిజ్ఞానం.

**పాద సూచికలు**

1. Ouspensky, *Tertium Organum,* P. 8.
2. ఒక మెరుపు కాలంలో బిలియన్ల బలియన్ల ఆలోచనా క్షణాలుండ వచ్చు.
3. Sir Charles Sherrington, *Life's Unfolding,* P 32
4 Ouspensky, *Tertium Organum,* PP. 125, 126
5. Sri Radha krishna, *Indian Philosophy*, 1, P. 278
6. పాలపుంతలో పది లక్షల గ్రహ మండలా లున్నాయి. వాటిల్లో జీవం ఉండ వచ్చు.
   See Fred Hoyle, *The Nature of the Universe* PP. 87-89
7. *Indian Philophy* 1. P. 201
8. Bertrand Russell, *Religion and Science,* 1960 Edn. P. 191
9. Bertrand Russell, *Religion and Science,* 1960 Edn. PP. 221 - 222
10. *Tertium Organaum,* P. 192.

# మంగల సుత్త[1]

## మంగళకరాలు

**నేను ఇలా విన్నాను** :

ఒకసారి ఉన్నతుడు సావత్తి[3] (శ్రావస్తి) వద్ద, జేతవనం అనాథ పిండిక[2] ఆరామంలో ఉంటున్నారు. బాగా రాత్రి పొద్దు పోయాక, తన మిరుమిట్లు గొలిపే కాంతితో జెతవనాన్ని దేదీప్యమానంగా వెలుగొందిస్తూ ఒక దేవత బుద్ధుని వద్దకు వచ్చి, గౌరవ పురస్సరంగా నమస్కరించి, ఒక ప్రక్కగా నిలబడ్డాడు. ఈ విధంగా నిలబడి, ఒక పద్య రూపంలో ఉన్నతునితో ఇలా అన్నాడు[4]:

1. అనేక మంది దేవతలు, మనుషులు మంచిని ఆక్రోశిస్తూ, ఏది 'మంగళకరం' (blessing) అని తర్జన భర్జన పడ్డారు. దయచేసి చెప్పండి అన్నింటి కంటె మంగళకరమైంది ఏది?[5]

2. మూర్ఖులతో, జ్ఞానులతో కలియక, గౌరవార్హులను గౌరవించడం – ఇది అన్నింటి కంటె ఉత్తమ మంగళం.

3. అర్హ ప్రదేశంలో నివసించడం[6], గతంలో పుణ్యకార్యాలు చేసి ఉండడం, తనను తాను సరైన దారిలో పెట్టు కోవడం[7] – ఇది అన్నింటికంటె ఉత్తమ మంగళం.

4. విశాల పాండిత్యం[8], చేవృత్తి పరిపూర్ణతో[9], ఉన్నత శిక్షణ (వినయాన్ని) పాటించడం, మృదుభాషణం – ఇది అన్నింటికంటె ఉత్తమ మంగళం.

5. తలిదండ్రులకు ఆధారంగా ఉండడం, భార్యాబిడ్డల ఆలన పాలన చూడడం, ప్రశాంత వృత్తులు ఇది అన్నింటికంటె మంచి మంగళం.

6. స్వేచ్ఛ, ధార్మిక శీలం, బంధుజనానికి సహాయం చేయడం, అనిందా కార్యాలు– ఇది అన్నింకంటె ఉత్తమ మంగళం.

7. దుర్మార్గానికి దూరంగా ఉండడం[11], మత్తుపానీయాలకు దూరంగా ఉండడం, శీలంలో స్థిరత్వం – ఇది అన్నింటికంటె ఉత్తమ మంగళం.

8. గౌరవం[12], వినమ్రత, తృప్తి, కృతజ్ఞత, తగుసమయంలో ధమ్మశ్రవణం చేయడం[13] - ఇది అన్నింటి కంటె ఉన్నతమైన మంగళం.

9. సహనం, విధేయత, సమణుల[14] దర్శనం, తగు రుతువులో ధార్మిక చర్చ చేయడం - ఇది అన్నింటి కంటె ఉత్తమ మంగళం.

10. స్వీయ నిగ్రహం, పవిత్ర జీవనం, ఆర్య సత్యాల అవగాహన, నిర్వాణ యథార్థీకరణం - ఇది అన్నింటి కంటె మంచి మంగళం.

11. ఎవని మనస్సు ప్రాపంచిక విషయాలతో విచలితం కాదో, దుఃఖ, మలిన రహితంగా, భద్రతతో[16] ఉంటుందో వాడు - ఇది అన్నింటికంటె ఉత్తమ దీవెన.

12. ఇటువంటి సంతృప్తినిచ్చే విషయాలు[17], సర్వత్ర విజేతలయ్యే అన్నిరకాల సుఖంతోచరించే - వారికి ఇవి అన్నింటి కంటె మంగళకరాలు.

**మంగలసుత్త వ్యాఖ్యానం**

1. మహామంగళ జాతక (No. 453) తో పోల్చునది. సుత్తనిపాతలోను, కుద్దకనికాయంలోను ఈ సుత్త కనిపిస్తున్నది.

2. శబ్దార్థపరంగా, ''నిస్సహాయులకు, భిక్షనిచ్చేవాడు'' లేదా ''అనాధులకు అన్నం పెట్టేవాడు''. అతని పూర్వనామం సుదత్త. అతడు బౌద్ధం పుచ్చుకొన్నాక, రాకుమారుడు జెతకు చెందిన ఆహ్లాదకరమైన తోపును కొని, ఆరామాన్ని నిర్మించాడు. ఆ తరవాత దానికి జెతవనారామ మని పేరు పెట్టారు.

ఈ ఆరామంలోనే బుద్ధుడు తన జీవితంలో అధిక భాగాన్ని గడిపాడు.

సుదత్త బౌద్ధం పుచ్చుకొన్న తీరును వివరంగా *Kindred Sayings,* 1, P. 27 and Vinaya, 111, P. 179 లో ఉంది.

3. సాహెత్ - మాహెత్‌గా గుర్తింపబడింది.

4. ఒకరోజు, అన్నింటికంటె మంగళ కరమైంది ఏది అనే ఆసక్తికరమైన చర్చ ''బహిరంగ చావడి'' (Public Hall) లో జరిగిందని వ్యాఖ్యానం చెబుతున్నది. సహజంగా జనాలకు వివిధ రకాల దృక్పథా లుంటాయి. ఉదయం నిద్ర లేవగానే మంచి శకునాలు (బిడ్డతో ఉన్నతల్లి, చిన్న పిల్లలు, శ్వేత వృషభాలు మొదలైనవి) ఎదురైతే అది మంగళకరంగా భావించాలని ఒకడు అన్నాడు. మంచి శబ్దాలు - 'నిండ', 'అదృష్టం' లాంటివి - మంగళకారాలని, వేరొకడు అనుకూల అనుభవాలు - మంచి పూల వాసనలు, భూమిని తాకడం లాంటివి - మంగళకరాలన్నాడు.

మనుషులు వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలలో ఎంతగా చీలి పోయారంటే, వాళ్ళు ముఠాలుగా ఏర్పడ్డారు. ఈ చీలిక అంతిమంగా ఎంతవరకు పోయిందంటే, కథ ప్రకారం, దేవలోకాన్ని చేరింది. ఈ తగవు తీర్చు కోకుండ ఉండలేని దేవతలు, వారి అధినాయకుడైన సక్క-కు నివేదించారు. విచక్షణ జ్ఞానం ఉన్న ఆసక్క- ఒక దేవతను బుద్ధుని వద్దకు వెళ్ళి అతని విశ్వసనీయమైన అభిప్రాయాన్ని తెలుసుకొని రమ్మని పంపాడు. ఈ ప్రత్యేక దేవతయే బుద్ధుని వద్దకు వచ్చి, పద్యరూపంలో ప్రశ్నించింది.

5. వ్యాఖ్యానం ప్రకారం 'మంగళం' అంటే సుఖానికి, అభివృద్ధికి తగినదేదో అది. స్థానిక భాషాశాస్త్రజ్ఞులు 'మంగళ' అనే పదానికి శబ్దార్థ పరంగా ఇలా చెబుతారు: అది మూడు అక్షరాల (Syllables) నుంచి వచ్చింది. అవి ''మన్'' (దుఃఖస్థితి)కి ''గ'' (వెళ్ళుట) ''ల'' (ఖండనం)లు కష్టాలకు దారితీసే మార్గాన్ని అడ్డుకొనేది అని అర్థం.

6. అంటే భిక్కు-, భిక్కు-ని, ఉపాసక, ఉపాసిక లుండు చోటు, పదిపుణ్య కర్మలను పవిత్రులు చేసే చోటు, ధమ్మం సజీవంగా ఉన్నచోటు ఏదైనా (వ్యాఖ్య).

7. అంటే తన అశీలతను శీలంగా మార్చు కోవడం; అవిశ్వాసాన్ని విశ్వాసంగా, స్వార్థాన్ని ఔదార్యంగా మార్చు కోవడం.

8. బహుసుత్త అంటే శబ్దార్థపరంగా ''అధికశ్రవణం'' అని. ఆంగ్లంలో erudition (పాండిత్యం) కు ఏ అర్థం ఉందో అదే అర్థాన్ని ఈ పదం ఇస్తుంది. ప్రాచీన కాలంలో అతడు మౌఖిక బోధనుంచి విని గుర్తు పెట్టుకొన్న దాని మీద ఆధారపడి ఒకని పాండిత్యాన్ని అంచనా వేసే వారు. సుత్త, ఇక్కడ, ధమ్మజ్ఞానాన్ని సూచిస్తుంది.

9. వ్యాఖ్యానం రెండు రకాల చేతి వృత్తులను చెబుతున్నది. అవి: గృహస్థులు అవలంబించే కమ్మరి, కంసాలిలాంటి నిరపాయకర వృత్తులు మొదలైనవి. కుట్టే నిర్గృహులు (గృహంలేని వారు), వృత్తులు – చీవరాలు కుట్టడంలాంటివి.

10. వినయ అంటే మనోవాక్క- కర్మల క్రమ శిక్షణ. వ్యాఖ్యానం రెండు రకాల వినయాన్ని గురించి చెబుతుంది. – గృహస్థు వినయ అంటే పది దుశ్శీల కర్మలకు దూరంగా ఉండడం, రెండోది నిర్గృహులకు సంబంధించింది లేదా శీల నాలుగు భాగాలను పాటించడం.

11. అంటే కేవలం (పరిమిత) సంయమం కాక పూర్తి నివృత్తి.

12. అంటే బుద్ధుడు, శిష్యులు, గురువులు, తలిదండ్రులు, పెద్దలు, మొదలైనవారు.

13. ఉదాహరణకు, ఒకడు దుష్టాలోచనలతో ముట్టడించ బడినప్పుడు -

14. రాగాలను శమయింప జేసుకొన్నవారు.

15. లాభనష్టాలు, యశస్సు అయశస్సులు, కీర్తినిందలు, బాధాసుఖాలు - ఈ ఎనిమిది లోక ధర్మాలు.

16. అసోకమ్, విరజమ్, క్షేమమ్... ఈ మూడు మాటలు అర్హంత మనస్సుకు సంబంధించినవి. అసోక అంటే దుఃఖం నుంచి విముక్తి, విరజ అంటే లాలస ద్వేషం, అవిద్యల నుంచి విముక్తి. క్షేమ అంటే కామేచ్ఛ, భవ (Becoming), దిక్థి, అవిద్యల బంధాలనుంచి భద్రత.

17. పైన చెప్పిన ముప్పై ఎనిమిది మంగళాలు.

18. Compare T.W. Rhys Davids, *Buddhism,* P. 125 and F.L. Woodward, *Some Sayings of the Buddha,* P. 56

## పరాభవ సుత్త [1]
## పతనం

**ఈ విధంగా నేను విన్నాను :**

ఒకసారి, శ్రావస్తి సమీపంలోని జేత వనం అనాథపిండిక ఆరామంలో బుద్ధుడు నివసిస్తున్నాడు.

రాత్రి బాగా పొద్దు పోయిన తరవాత, తన మిరుమిట్లు గొలిపే ప్రభాస జెత తోపు మొత్తాన్ని వెలుగుతో నింపుతూ, ఒక దేవత బుద్ధుని వద్దకు వచ్చి, గౌరవ పురస్సరంగా అభివాదాలు కావించి, ఒక ప్రక్కగా నిలబడ్డాడు. ఈ విధంగా నిలబడి ఈ పద్య రూపంలో ఉన్నతుని ఇలా అడిగాడు:

1. పతిత మానవుని గురించి మీ దగ్గర తెలుసు కొందామని ఓ గౌతమ, నేను వచ్చాను. అసలు ఒక మనిషి ఎందుకు పతనమవుతాడో చెప్పండి.

2. ప్రగతి చెందుతున్న మానవుడు వూరికే తెలిసి పోతాడు. పతితుడూ అంతే తేలికగా తెలిసి పోతాడు. ధర్మాన్ని ప్రేమించే వాడు ప్రగతి మానవుడు. ధర్మ ద్వేషి పతితుడు.

3. అయితే ఇది, ఒకని పతనానికి ప్రథమ కారణమని తెలుసుకొన్నాము. హే, ఉన్నతుడా, దయచేసి మాకు చెప్పండి, ఒకని పతనానికి రెండో కారణం ఏమిటో.

4. అతనికి దుష్టులంటే ప్రీతి. సన్మార్గులలో సంతోషింపదగిందేదీ అతనికి కనిపించదు. అతడు దుర్మార్గ పక్షాలకు అనుకూలం: ఇది ఒకని పతనానికి రెండోకారణం.

5. ఒకని పతనానికి ఇది రోండో కారణం అని తెలుసుకొన్నాం. దయచేసి ఒకని పతనానికి మూడో కారణం చెప్పండి.

6. ఎప్పుడూ నిద్రమత్తులో ఉండడం, ఎప్పుడూ మందితో కలిసి తిరగడం, శ్రమ అంటే అయిష్టం, బద్ధకం, కోపప్రదర్శనం : ఇది ఒకని పతనానికి కారణం.

7. ఒకని పతనానికి ఇది మూడో కారణమని తెలుసుకొన్నాం. దయచేసి ఓ, ఉన్నతుడా, ఒకని పతనానికి నాలుగో కారణాన్ని చెబుతారా?

8. ఎవడైన, భాగ్యవంతుడై ఉండి, వృద్ధులైన తలిదండ్రులను చూడక పోవడం: ఇది ఒక పతనానికి కారణం.

9. దీనిని నాలుగో కారణం గా తెలుసుకొన్నాము. హే, ఉన్నతుడా, ఒకని పతనానికి ఐదో కారణాన్ని చెప్పండి.

10. అబద్ధాలు చెప్పి, బ్రాహ్మణుని, సన్యాసిని లేదా మరే యతినైనా మోసగించడం: ఇది ఒకని పతనానికి కారణం.

11. ఒకని పతనానికి ఇది ఐదో కారణమని తెలుసు కొన్నాము. దయచేసి ఒకని పతనానికి ఆరోకారణం చెప్పండి.

12. ఆహారం, బంగారం, ఆస్తి, ఉండి, వాటిని తానొక్కడే అనుభవించడం: ఇది ఒకని పతనానికి కారణం.

13. దీనిని మేము ఒకని పతనానికి ఆరో కారణంగా ఎరుగుతున్నాం. దయచేసి ఒకని పతనానికి ఏడో కారణం చెప్పండి.

14. వంశం, ధనం లేదా తన తెగ కారణంగా ఒకడు గర్వించి బంధుజనాన్ని హీనంగా చూడడం: ఇది ఒకని పతనానికి కారణం.

15. దీనిని మేము ఏడో కారణంగా తెలుసు కొన్నాం. దయచేసి, ఓ ఉన్నతుడా, ఒకని పతనానికి ఉన్న ఎనిమిదో కారణాన్ని మాకు చెప్పండి.

16. ఎవడు చెడ తిరుగుతాడో, త్రాగుబోతో, జూదగాడో, తనకున్న దాని నంతా దుబారా చేస్తాడో: ఇది ఒకని పతనానికి కారణం.

17. ఒకని పతనానికి ఇది ఎనిమిదో కారణమని తెలుసుకున్నాం. దయచేసి హే, ఉన్నతుడా, ఒకని పతనానికి తొమ్మిదో కారణాన్ని వివరించండి.

18. తనకున్న భార్యలు చాలక, వేశ్యలతో, ఇతరుల భార్యలతో తిరుగుతుంటే: ఇది ఒకని పతనానికి కారణం.

19. దీనిని, ఒకని పతనానికి, తొమ్మిదోకారణంగా తెలుసుకొన్నాం. దయచేసి మాకు పదో కారణాన్ని తెలియ చెప్పండి.

20. వయస్సుమీరీ, యువభార్యను తెచ్చుకొని, అసూయ కారణంగా ఆమెతో పడుకోకపోతే: ఇది ఒకని పతనానికి కారణం.

21. ఇది పదో కారణమని గ్రహించాం. దయచేసి ఒకని పతనానికి పదకొండో కారణాన్ని వివరించండి.

22. అదుపు లేకుండ దుబారాగా ఖర్చు పెట్టే ఆడదానికి లేదా అటువంటి స్వభావం ఉన్న మగ వానికి అధికారం అప్పచెప్పడం: ఇది ఒకని పతనానికికారణం.

23. ఒకని పతనానికి ఇది పదకొండో కారణం అని తెలుసుకొన్నాం. దయచేసి పన్నెండో కారణాన్ని చెప్పండి.

24. అల్పాదాయం ఉండి, గొంతెమ్మ కోర్కెలు కోరడం, సైనికుడుగా పుట్టి రాజు కావా లనుకోవడం: ఇది ఒకని పతనానికి కారణం.

25. ఈ ప్రపంచంలో పతనం కావడానికి ఉన్న ఈ కారణాలన్నింటిని తెలుసుకొని ప్రజ్ఞాయుతుడైన ఉత్తమ సన్యాసి, సుఖ స్థితిలో ఉంటాడు.

### పరాభవ సుత్త వ్యాఖ్యానం

ఒకని సుఖసంతోషాలకు, అభివృద్ధికి తోడ్పడే విషయాలున్న మంగళసుత్తను విన్న అనంతరం, దేవతలు బుద్ధుని నుంచి మనిషి పతనానికి కారణాలు తెలుసు కోదలిచారు. అందుకనే వారు బుద్ధుని వద్దకు వచ్చి, ఈ ప్రశ్నలు అడిగారు.

# వసల సుత్త

## ఛండాలుడు

**ఈ విధంగా నేను విన్నాను :**

ఒకసారి బుద్ధుడు శ్రావస్తి సామీపంలోని జెత తోపులో అనాధపిండిక అరామంలో ఉంటున్నాడు. అతడు ఒకరోజు పూర్వాహ్నం, చీవరాలు ధరించి, చేలాంచలం అందుకొని, భిక్షాపాత్ర చే బూని, భిక్షకోసం శ్రావస్తికి వెళ్ళాడు.

ఆ సమయంలో ఆగ్గిక భారద్వాజుని ఇంటిలో అగ్నిహోత్రం వెలుగూతూ ఉంది. నైవేద్యం తయా రవుతోంది. అప్పుడు ఉన్నతుడు భిక్షకోసం ఇల్లు ఇల్లు తిరుగుతూ బ్రాహ్మణుడు అగ్గిక భారద్వాజుని ఇంటిని సమీపించాడు. దూరం నుంచే ఆ బ్రాహ్మణుడు బుద్ధుని చూసి, ఇలా అన్నాడు: ''అక్కడే ఆగు, ఓరే కుర్రకుంకా! అక్కడే ఆగు, ఓ మందభాగ్య సన్యాసీ, అక్కడే ఆగు, ఓ దౌర్భాగ్య ఛండాలా!

అతడావిధంగా మాట్లాడిన తరవాత బుద్ధుడు అతనితో ఇలా అన్నాడు :

''హే బ్రాహ్మణా, నీకు తెలుసా, ఛండాలుడు ఎవరో లేక ఒకనిని ఏవి ఛండాలునిగా చేస్తాయో?''

''లేదు. నిజంగా, ఓ గౌరవనీయ గౌతమ![1] 'ఛండాలుడని' ఎవరిని అంటారో నాకు తెలియదు. ఒకనిని ఏవి ఛండాలుని చేస్తాయో నాకు తెలియదు. మరి గౌరవనీయ గౌతములు నాకు ధమ్మ బోధ చేస్తారా, ఎవడు ఛండాలుడో, ఒకనిని ఏవి ఛండాలుని చేస్తాయో తెలుసుకోవడానికి వీలుగ?''

''అయితే బ్రాహ్మణావిను శ్రద్ధగావిను, నేను చెబుతాను.''

''మంచిది గౌరవనీయా,'' బ్రాహ్మణుడు బదులు పలి కాడు.

బుద్ధుడు ఇలా చెప్పాడు[2]:

1. కోపావహుడు, అభిద్రోహుడు, దుష్టుడు, అమాది[3], విపరీత దృక్పథాలు కలవాడు, మోసగాడు ఎవడోవాని ఛండాలునిగా ఎరుగు.
2. ఈ ప్రపంచంలో ప్రాణులకు హాని కలిగించువాడు, (జీవుల యెడ కరుణ లేని వాడు) ఏకజుడైనా, లేదా ద్విజుడైనా[4] వానిని ఛండాలుడని ఎరుగు

3. గ్రామాలను, శివార్లను, ముట్టడించి, నాశంగావించి, ఎవడు ప్రజా కంటకుడుగా తెలియ బడతాడో వానిని ఛండాలుడని ఎరుగు.

4. గ్రామాలలోగాని, అరణ్యాలలోగాని దొంగిలించడం ద్వారా, ఇతరులకు చెందిన దానిని, లేదా తన కివ్వని దానిని, తనదిగా చేసు, కొంటాడో వాడు ఛండాలుడని ఎరుగు.

5. వాస్తవానికి అప్పు తీసుకొని, పారిపోయి, గట్టిగా అడిగి నప్పుడు, ''నీకు నేను బాకీ లేను'' అనేవానిని ఛండాలుడని ఎరుగు.

6. అల్ప విషయానికే, దారేబోయే వాణ్ణి చంపి, ఏదైన దొచుకొనే వానిని ఛండాలుడని ఎరుగు.

7. తన కోసం లేదా పరుల కోసం లేదా సంపద కోసం, సాక్ష్యం చెప్పమని కోరి నప్పుడు అబద్ధాలు చెప్పేవాడు ఛండాలుడు.

8. బంధు, మిత్రుల భార్యలతో బలవంతంగా గాని, అంగీకారంతో గాని అతిచరించు వాడు ఛండాలుడని ఎరుగు.

9. వయో వృద్ధులైన తలదంద్రులను, ధనం ఉండీ, చూడని వాడు ఛండాలుడు

10. తల్లిని, తండ్రిని, సోదరుని, సోదరిని – లేదా అత్తను, కొడతాడో లేదా మాటలతో బాధిస్తాడో, వాడు ఛండాలుడని తెలుసుకో.

11. ఏది మంచి? అని ప్రశ్నించి నప్పుడు తప్పుడు సలహా ఇచ్చిన వాడు, అసలు విషయాన్ని దాచి బోధిస్తాడోవాడు ఛండాలుడని తెలుసుకో.

12. ఒక చెడ్డపని చేసి, దానిని ఎవరికి తెలియ కుండా ఉంచాలను కొంటాడో, దొంగ చాటుగా పనులు చేస్తాడో, వాడు ఛండాలుడని ఎరుగు.

13. పరుల ఇంటికి వెళ్ళి, యిష్టాన్నాన్ని గుడిచి, మళ్ళీ ఆ పరులు తన యింటికి వచ్చి నప్పుడు తిరిగి గౌరవించడో వాడు ఛండాలుడని తెలుసుకో.

14. ఒక బ్రాహ్మణునో, ఒకసన్యాసిని, లేదా యతిని అబద్ధం చెప్పి ఎవడు మోస గిస్తాడో, వాడు ఛండాలుడని తెలుసుకో.

15. ఒక బ్రాహ్మణుని, లేదా సన్యాసిని, భోజనానికి వేళైనప్పుడు భిక్ష ఇవ్వక, మాటల ద్వారా నొప్పిస్తాడో వాడు ఛండాలుడని ఎరుగు

16. ఈ ప్రపంచంలో ఎవడు అవిద్యలో కూరుకు పోయి, దేనినో ఆశించి లేని దానిని జోస్యం చెబుతాడో వాడు ఛండాలుడని తెలుసుకో.

17. ఎవడు ఇతరులను తెగడి, తనను పొగడు కొని, గర్వంతో హీను డవుతాడో వాడు ఛండాలుడని తెలుసుకో.

18. ఎవడు బాధా కారుడో, లుబ్ధుడో, నీచ వాంఛా లోలుపుడో, స్వార్థుడో, మోసగాడో, లజ్జా విహీనుడో, (చెడు చేయడంలో) భీతి లేని వాడో - వాడు ఛండాలుడని ఎరుగు.

19. అతడు సన్యాసే కానీయండి, గృహస్థే కానీయండి, బుద్ధునిగాని, అతని శిష్యునిగాని అవక్షేపిస్తాడో వాడు ఛండాలుడని ఎరుగు.

20. అర్హంత కాకుండ అర్హంత అని చెప్పుకొనే వాడు ఈ మొత్తం విశ్వం[6]లోనే దొంగ - వాడు అందరి కంటె ఛండాలుడని తెలుసుకో.నేను నీకు వర్ణించిన వారంతా ఛండాలురు[7].

21. పుట్టుకతో[8] ఎవడూ ఛండాలుడు[9] కాడు. పుట్టుకతోనే ఎవడూ బ్రాహ్మణుడు కాడు. అతడు చేసే పనులు బట్టి అతడు ఛండాలుడు, అతడు బ్రాహ్మణుడు.[10]

22. ఈ దృష్టాంతం[11] ద్వారా అది అలా అని తెలుసుకో: ఒక ఛండాలుని కొడుకు, మాతంగు డనబడే కుక్కలు వండుకొనే[12] వాడు ఉన్నాడు.

23. ఈ మాతంగుడు యశోమంతు డయ్యాడు. సైనికులు బ్రాహ్మణులు అతనిని సేవించ డానికి వచ్చారు.

24. అతడు ఆకాశయానాన్ని[13] ఎక్కి, మోహరహితపథం[14]లో ఇంద్రియ సుఖాలను పరిత్యాగం చేసి బ్రహ్మ లోకాన్ని ఉద్గమించాడు[15]. బ్రహ్మలోకంలో జన్మించడానికి అతని పుట్టుక అడ్డురాలేదు.

25. (వేద) మంత్రాలను దర్శించిన ఆచార్యుల[16] కుటుంబాలలో జన్మించిన బ్రాహ్మణులు ఉన్నారు. వాళ్ళూ పాపకృత్యాలకు తరచుగా పాల్పడడం జరుగుతోంది.

26. ఈ జన్మలోనే వారు నింద్యు లవుతున్నారు. మరు జన్మలో వారు దుఃఖ స్థితిలో పుడుతున్నారు. నింద్యాస్థితి నుంచి కాని, దుఃఖ స్థితి నుంచి గాని వారి పుట్టుక వారిని తప్పించ లేదు.

27. పుట్టుకతో ఎవడూ ఛండాలుడూ కాడు, బ్రాహ్మణుడూ కాడు. చేతలు కారణంగానే ఒకడు బ్రాహ్మణు డవుతాడు.

ఇది చెప్పిన తరవాత అగ్గిక భారద్వాజ బ్రాహ్మణుడు బుద్ధునితో ఇలా అన్నాడు:

''చాల బాగుంది గౌతమ, చాల బాగుంది! ఇదెలా ఉందంటే ఓ గౌరవనీయ గౌతమ, తల క్రిందులైన దానిని సరిగా నిలబెట్టినట్లుగా, గుప్తంగా ఉన్నదానిని బహిర్గతం చేసి నట్లుగా, దారి తప్పిన వానికి దారి చూపినట్లుగా, అంధకారంలో దీపం చూపి నట్లుగా, కన్ను లున్న వాడెవడైన చూడ గలిగేట్లుగా. ధర్మాన్ని బోధించి నట్లుంది.

నేను గౌరవ గౌతముని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణం పొందుతున్నాను. ఈ రోజునుంచి జీవితాంతం శరణం పొందిన అనుచరునిగా గౌరవనీయ గౌతముడు నన్ను అనుచరుడిగా గ్రహించు గాక''

**వసల సుత్త వ్యాఖ్యానం :**

1. ఇక్కడ మొదట బ్రాహ్మణు డుప యోగించిన దూషణ పదాలకు, ఆ తరవాత గౌరవ పురస్సంగా ఉపయోగించిన పదాలకు తేడా ఉంది. ఈ తేడాను వివరించ వలసి ఉంది. ఆ రోజు ఉదయం బుద్ధుడు ప్రపంచాన్ని దివ్య శక్తితో చూసి నప్పుడు, ఈ బ్రాహ్మణుడు త్రిశరణాలను, పంచశీలాలను గ్రహించ డానికి పరిపక్వమై ఉన్నాడని తెలుసు కొన్నాడని వ్యాఖ్యానం చెబుతోంది. అందుకని బుద్ధుడు అతనితో సమాగమం కోసం బయలు దేరాడు. సరిగ్గా అప్పుడే బ్రహ్మ పూజ పూర్తి చేసు కొన్న బ్రాహ్మణుడు మంచి శకునం కోసం ఎదురు చూశాడు. అప్పుడు అతని కళ్ళు ఒక ''కుర్రకుంక'' (Shaveling) ఒక ''సమణు''ని మీద పడ్డాయి. బ్రాహ్మణుని మూఢ విశ్వాసాల ప్రకారం రెండూ అపశకునాలే. అతని భయాందోళన, కోపాలు దూషణ పదజాలంలో బహిర్గత మయ్యాయి. కాని బుద్ధుని ప్రవచనాన్ని కరుణాపూరిత వాణితో వినడంతో, బుద్ధుని అభివ్యక్తిలోని ప్రశాంత కరుణను చూడడంతో, బ్రాహ్మణుడు సిగ్గు పడి పోయాడు. అతని తరువాతి మాటలు అతని పశ్చాత్తాపాన్ని ప్రతిబింబిస్తున్నాయి.'' (కశ్యప థేర)

2. బాహ్యంగా అమంగళంగా కనిపించిన బుద్ధుని చూసి బ్రాహ్మణుడు మండిపడ్డాడు. అందుకని అమర్యాదగా మాట్లాడాడు. ఎప్పుడు తిరిగి తప్పి కొట్టని బుద్ధుడు, మర్యాదగా, ప్రశాంతంగా బ్రాహ్మణుని తెగడ కుండ, తనను పొగడు కోకుండ,

కోపాన్ని, వ్యాపాదను (ill - will) ఎవడు ప్రదర్శిస్తాడో వాడు బ్రహ్మ తలలోనుంచి పుట్టినా సరే ఛండాలుడేనని (వసల) చెప్పాడు. బుద్ధుని ఈ సమాధానంతో ''బుద్ధుడు నిజంగా బ్రాహ్మణుడేనని, బ్రాహ్మణుడని పిలవ బడుతున్న తాను నిజంగా ఛండాలుడే'' అని ఆ బ్రాహ్మడు గ్రహించక తప్ప లేదు.

3. మక్ఖి - మామూలుగా కుహక (Hypocritied) కుహకత (Hypocracy) చెప్తారు. శబ్దార్థ పరంగా ఇతరుల మంచిని తుడిచిపెట్టడం.

4. '' ఏకజమ్'' ''ద్విజమ్'' - ఒకసారి పుట్టినవాడు (Once Born): పక్షుల వలె గ్రుడ్డు నుంచి పుట్టినవి కాక, సర్వజీవులు ఒకసారి పుట్టినవే. ద్విజమ్ రెండు సార్లు పుట్టినవి (Twice born). మొదట గ్రుడ్డుగా కనిపించడం, ఆ తరవాత రెండో జన్మ అంటే గ్రుడ్డు పొదగబడి పిల్ల కావడం. ఇక్కడ బుద్ధుని హాస్యం స్పష్టం. ఎలాగంటే బ్రాహ్మణులు తమను ద్విజులుగా (రెండుసార్లు పుట్టిన వారుగా) చెప్పు కొంటారు.

5. అన్ని రాగాలను జయించి పరిపూర్ణ ఋషి.

6. సుబ్రహ్మకె లొకె - శబ్దార్థపరంగా ''బ్రహ్మతో సహ ప్రపంచంలో'' అంటే మొత్తం విశ్వం (వ్యాఖ్య)

7. ఈ **20** పద్యాలలో బుద్ధుడు ఛండాలు డన డానికి ఉన్న **34** లక్షణాలను చెప్పాడు.

మొదట పద్యం కోపంలాంటి ఆరులక్షణాలతో, రెండోది అపాయకరత్వంతో, మూడోది అణచివేతతో, నాలుగోది దొంగతనంతో, ఐదోది అప్పు ఎగవేతదా రులతో, ఆరు కొల్లగొట్టడంతో, ఏడు అబద్ధపు సాక్ష్యంతో, ఎనిమిది ద్రోహంతో, తొమ్మిది తలిదండ్రుల యెడ కృతఘ్నతతో, పదోది కొట్టడం, బాధించడంతో, పదకొండోది ఆత్మద్రోహంతో, పన్నెండు చెడు చేసి దాచడంతో, పదమూడు కృతఘ్నతతో, పద్నాలుగు మోసంతో, పదిహేను మతస్తులను బాధించడంతో, పదహారు మోసంతో, పదిహేడు తనను తాను మెచ్చుకోవటం స్తుతి - పరనిందతో, పద్దెనిమిది బాధించడం లాంటి ఏడు లక్షణాలతో, పందొమ్మిది బుద్ధుని అతని శిష్యులను తిట్టడంతో, ఇరవయ్యోది అర్హంతుడనని అబద్ధం చెప్పడంతో వ్యవహరించాయి. పుట్టుకను బట్టి కాక చేతలను బట్టి నిర్ణయించాలి - ఈ ముప్పై నాలుగు రకాల వ్యక్తులను అరియలు (శ్రేష్ఠులు) ఛండాలురని పిలిచారు.

8. బ్రాహ్మణుడు పట్టుకొని వేళ్ళాడుతున్న దోషభూయిష్ట దృక్పథాన్ని తొలగించ డానికి బుద్ధుడు ఈ పద్యాన్ని చెప్పాడు.

9. వ్యాఖ్యానం ప్రకారం వసల అంటే మలిన కార్యాలను వర్జించే (వస్సంతో) వాడని, బ్రాహ్మణ అంటే అమలిన కార్యాల ద్వారా మలినాలను తుడిచిపెట్టే (బహెంతో) వాడని అర్థం.

10. పోల్చునది.

పుట్టుక ఎవరిని బ్రాహ్మణుని, ఆ బ్రాహ్మణుని చేయదు.

జీవితమూ, చేష్టలు ఒకనిని నిజమైన బ్రాహ్మణునిగా మలుస్తాయి.

వారి జీవితాలు వారిని వ్యవసాయదారులుగా, వ్యాపారులుగా, వణిజులుగా, బానిసలుగా చేస్తాయి.

వారి జీవితాలు వారిని దొంగలుగా, సైనికులుగా, పురోహితులుగా, రాజులుగా చేస్తాయి.

– వాసెత్థసుత్త

11. బుద్ధుడు ఇక్కడ తన గత జన్మను దృష్టించుతో ఉంచు కొని చెబుతున్నాడు. ఆ జన్మలో బుద్ధుడు అసామాన్య శీల జీవితాన్ని గడిపాడు. అందరూ అతనిని గౌరవించారు. ఆ తరవాత బ్రహ్మలోకంలో పుట్టాడు. *మాతంగ జాతక* No. 497 చూచేది.

12. ఛండాలుడు, వర్ణబాహ్యుడు, అతని హీన జన్మను సూచిస్తుంది. 'సోపాక' అంటే తాను తినడం కోసం కుక్కలను వండు కొనే వాడు. అది అతని జీవన హైన్యాన్ని సూచిస్తుంది. అతడు మాతంగ అనే పేరుతో తెలియ బడతాడు (వ్యాఖ్య)

13. బ్రహ్మలోకానికి తీసుకెళ్ళ గల సామర్థ్యం ఉన్న ఆర్య అష్టాంగ మార్గ మది.

14. బుద్ధుడు లాంటి గొప్ప వ్యక్తులు ఆచరించిన మార్గం.

15. దేహం లయం అయిన తరవాత.

16. వేదాభ్యసనంలో మునిగి ఉన్నవారు.

# రతన సుత్త[1]

## రతనాలు

1. ఇక్కడ సమావేశమైన వారు ఎవరైనా కానీండి, వారు ఆకాశ వాసులే కానీండి భూ వాసులేకానీండి వారంత సుఖులై ఉందురుగాక. అంతేకాదు. వారంతా నా మాటలను శ్రద్ధగా ఆలకింతురు గాక!

2. ఆవిధంగా జీవులారా మీరంతా అప్రమత్తులై వినండి. రాత్రింబవళ్లు మీకు నైవేద్యం పెట్టే మానవులకు మీరు మీ ప్రేమను ప్రసాదించండి[2]. అందుకని వారిని మీరు ఉత్సాహంతో, వ్యగ్రతతో కాపాడండి.

3. ఈ లోకంలోగాని, పరలోకంలో గాని ఉన్న సంపద లేదా స్వర్గలోకాల[4]లో ఉన్న విలువైన రతనాలు[3] గాని ఏవీ సిద్ధునికి సమం గావు.

నిజంగా బుద్ధునిలో ఈ విలువైన రత్నం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

4. శాక్య శాంతముని[5] ఆ ఉచ్ఛేదాన్ని రాగరహిత పరమ అమర్త్యతను ఎరిగాడు. ఆ ధర్మంతో పోల్చ దగినది ఏదీ లేదు. ఇది సత్యం! ధమ్మంలో వెల లేని రతనం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

5. పరమ బుద్ధుడు ప్రశంసించిన పావనత ''అఖండ ఏకాగ్రత''[6] గా వర్ణితమైంది. అటువంటి ఏకాగ్రత మరేదీ లేదు.

ఇది సత్యం, ధమ్మమే ఈ వెల లేని రతనం.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

6. శీలవంతులు పొగిడిన ఆ ఎనిమిది మంది వ్యక్తులు[7] - వారు నాలుగు జంటలు. వీరికిచ్చిన కానుకలు అనంత ఫలాన్నిస్తాయి[8]

ఇది నిజం. సంఘంలో ఈ వెలలేని రతనం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవుగాక!

7. స్థిర చిత్తంతో, బుద్ధుడు చెప్పిన దానిని ఆచరించి (రాగ) రాహిత్యులైవారు చేర వలసిన దానిని చేరారు. వారు అమర్త్యులై వెల లేకుండ ఆర్జించిన శాంతిని వారు అనుభవిస్తారు.

ఇది సత్యం. సంఘంలో ఈ వెల లేని రత్నం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

8. భూమిలో బాగా లోతుగా పాతిన మేకు[9] నాలుగు గాలులకు ఎలా చలించదో, అలాగే నాలుగు ఆర్యసత్యాలను పూర్తిగా దర్శించిన వానిని నేను ధార్మిక శీలుడంటాను.

ఇది నిజం. సంఘంలో ఈ వెల లేని రతనం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

9. ఆర్యసత్యాలు బాగా అర్థం చేసుకొన్నవారు, లోతైన జ్ఞానం ఉన్న అతని బోధను బాగా విన్నవారు, వారెంతగా ప్రమత్తులైనా, ఎనిమిదో జన్మను[10] ఎత్తరు.

ఇది నిజం. సంఘంలో ఈ వెల లేని రతనం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

10. ప్రజ్ఞను సాధించిన వానికి భ్రాంతి[13], శంక[14], తప్పుడు కర్మ కాండలో మునిగి పోవడంలాంటి ఈ మూడు స్థితులు[12] ఇంకేమైనా ఉంటే అవి, అంతర్హిత మవుతాయి.

నాలుగు దుఃఖాల[15] నుంచి పూర్తిగా విముక్తుడవుతాడు. షష్ఠమహాపాతకాల[16]ను ఇక ఏ మాత్రం చేయలేడు.

ఇది నిజం. ఈ వెలలేని రతనం సంఘంలో ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

11. మనోవాక్కర్మలలో దేనితో అయినా ఏదైనా చెడ్డపని చేస్తే అతడు దానిని దాచ లేడు. ఎందుకంటే 'మార్గం' ఎరిగిన వానికి అటువంటి పని చేయడం అసంభవమని చెప్పబడింది.

ఇది సత్యం. సంఘంలో ఈ వెల లేని రతనం ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

12. వేసవి ఆరంభ ఉష్ణంలో[19], పుష్పించిన వృక్షాగ్రాల[18], వృక్షభూమితోపుల[17] లోవలె నిర్వాణానికి దారితీసే పరమ ధమ్మాన్ని, పరమ మంచి కోసం బోధించారు.

ఇది నిజం. ఈ వెల లేని రత్నం బుద్ధునిలో ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

13. అసమాన ఉన్నతుడు, తెలిసిన వాడు, దాత, పరమాన్ని తెచ్చేవాడు, ధర్మాన్ని వివరించాడు.

ఇది సత్యం. ఈ వెలలేని రత్నం బుద్ధునిలో ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

14. వారి గతం ఉచ్ఛేదిత మైంది. వారికి నూతన భవం (Becoming) లేదు. భావిజన్మకు వారి మనస్సులు బంధితాలు కాలేదు; వారికి వాంఛలు లేవు[20] ఆ జ్ఞానులు ఈ దీపం[21] వలె వెళ్ళిపోతారు.

ఇది నిజం. ఈ వెలలేని రతనం సంఘంలో ఉంది.

ఈ సత్యం కారణంగా ఎల్లరకు సుఖమవు గాక!

15. ఇక్కడ సమావేశమైన మనమంతా, భూవాసులమైనా, ఆకాశవాసులమైనా, మానవులు, దేవతలు గౌరవించిన సిద్ధబుద్ధనికి నమస్కరిద్దాం. అంతా శుభమవు గాక!

16. ఇక్కడ సమావేశమైన మనమంతా, భూవాసులమైనా, వ్యోమవాసులమైనా దేవతలు, మానవులు గౌరవించిన సిద్ధ ధమ్మానికి నమస్కరిద్దాం. అంతా శుభం అగు గాక!

17. ఇక్కడ సమావేశమైన మనమంతా, భూవాసులమైనా, వ్యోమ వాసుల మైనా దేవతలు, మానవులు గౌరవించిన సిద్ధ సంఘానికి నమస్కరిద్దాం. అంతా శుభమవుగాక![22]

## రతనసుత్త వ్యాఖ్యానం

1. ఈ ముఖ్య ఉపన్యాసం ఆవిర్భావాన్ని, వ్యాఖ్యానం సవివరంగా వర్ణిస్తుంది. ఒకసారి వెసాలి (వైశాలి) వాసులు మూడు అపాయాల - కాటకం, దుష్టశక్తులు, ప్లేగు జాడ్యం - తో పీడించ బడ్డారని ఆ వ్యాఖ్యానం చెబుతుంది. మొదటిగా కాటకం వచ్చింది. ఎంతోమంది పేద వారిని పొట్టన బెట్టు కొంది. కుళ్ళిన శవాల నుంచి వచ్చే కుళ్ళు కంపుకు ఆకర్షితులై అక్కడకు దుష్టశక్తులు వచ్చాయి. అంతిమంగా ప్లేగుజాడ్యం వచ్చి ఇంకా అనేక మందిని చంపి వేసింది. ఈ మూడు అపాయాలను ఎదుర్కొన్న వారు, సహనం చచ్చిపోయి, ఈ అంతిమ ఆపదను ఎలా ఎదుర్కోవాలో తెలియక, నిరాశలో మునిగి పోయారు. ఈ సంకట సమయంలో, బుద్ధుని తమ భయంకర నగరానికి ఆహ్వానించాలనే ఆలోచన వారికి ఆకస్మికంగా తట్టింది. ఆ సమయంలో బుద్ధుడు రాజగహలో ఉన్నాడు.

వెంటనే ఇద్దరు లచ్చవి కులీనులు, తగు పరివారంతో, రాజగహకు బయలు దేరారు. వారి రాకలోని ఆంతర్యాన్ని బుద్ధునికి వివరించిన తరువాత, తనరాక వల్ల కలిగే గొప్ప శుభాలను అవలోకించి, వారి ఆహ్వానాన్ని మన్నించాడు. అనేక మంది భిక్కులతో, ఆనంద థేరునితో సహా, బుద్ధుడు రాజగహను విడచి, గంగను దాటి వెసాలి నగరాన్ని చేరాడు.

బుద్ధుడు వెసాలికి వచ్చీ రాక ముందే పెద్ద వర్షం కురిసింది. ఎంత పెద్ద వర్షం అంటే, అది అక్కడ కుళ్ళుతున్న శవా లన్నింటిని ఊడ్చి వేసింది. దుర్గంధ పూరితమైన గాలిని శుభ్రం చేసింది. అంతట బుద్ధుడు ఈ రతన సుత్తను ఆనందునికి చెప్పి, దానిని ఉచ్చరిస్తూ నగర వాసుల రక్షణ గుర్తుగా ప్రకటిస్తూ, లచ్చవి కులీనులతో పాటు నగరమంతా తిరగ వల

సిందిగా అతనిని కోరాడు. ఆ విధంగానే గౌరవనీయ ఆనందుడు సుత్తను ఉచ్చరిస్తూ నగర పర్యాటనం చేస్తూ, బుద్ధుని బిక్షాపాత్ర నుంచి తెచ్చిన పవిత్ర ఉదకాలను నగర మంతా చల్లాడు. ఈ సందర్భంలో వ్యాఖ్యాత ఇలా అంటున్నాడు: థేరుడు ''యమ్ కిఞ్చి'' అనే పదాలను ఉచ్చరించడం తోనే, భయంతో దుష్ట శక్తు లన్నీ నగరం విడచి పారి పోయాయి. ప్లేగువ్యాధి గూడ తగ్గి పోయింది. థేరుడు పై చెప్పిన విధంగా, నగర ప్రజలను రక్షిస్తూ, నగరమంతా పర్యటించి బహిరంగ ప్రజావేదిక వద్దకు వచ్చాడు. అక్కడ బుద్ధుడు అతని శిష్యులు, అతని రాక కోసం ఎదురు చూస్తూ, సమావేశ మయ్యారు.

ఈ సందర్భంలో బుద్ధుడు మళ్ళీ, సమావేశాని కంతటికి, రతన సుత్తను చెప్పాడు.

2. వ్యాఖ్యానం ఏమి చెబుతుం దంటే, ప్రజలు దేవతల బొమ్మలను కొయ్యమీద గీసి, లేదా చెక్కి, వాటిని చెట్ల కొమ్మలకు వేళ్ళాడ గట్టి, లేదా గుళ్ళల్లో ఉంచి వాళ్ళ వాళ్ళ పేర్లతో నైవేద్యాలను అర్పిస్తారు.

3. రతన అంటే విలువైన వజ్రం. ''రతన'' అనే పదాన్ని ఇక్కడ బుద్ధునికి, ధర్మానికి, సంఘానికి అన్వయిస్తారు. భాషా శాస్త్రవేత్తల ప్రకారం ''రతన'' అనేది మూడు అక్షరాలతో సంరచిత మైంది. అవి: 'ర', 'త', న'లు. 'ర' అంటె ఆకర్షించుట 'త' అంటే దాటుట, 'న' అంటే దారి చూపుట. బుద్ధ, ధమ్మ, సంఘ - ఈ మూడింటిని కలిపి 'రతన' అంటారు. ఎందుకంటె అవి సంసార సంద్రాన్ని దాట డానిక సాధనాలుగా పనిచేస్తాయి. వాటిని శరణు జొచ్చిన వారికి స్వర్గాలకు నిర్వాణానికి దారి చూపు తాయి.

4. దీనిలో అధో లోకం నుంచి అన్నింటి కంటె పైన ఉన్న బ్రహ్మలోకం వరకు అన్నీ ఉన్నాయి. - అకనిఠ. (వ్యాఖ్య)

5. అలా ఎందుకు పిలిచా రంటే, సర్వరోగాలు తుడిచి పెట్ట బడ్డాయి (వ్యాఖ్య).

6. మార్గాన్ని (మగ్గ) 'ఆనంతరిక సమాధి' అని ఎందుకు అన్నారంటే, సద్యః ఫలం (మధ్యలో ఏ దశ లేకుండ) దక్కుతుంది.

7. అవి: (1) 'సొతాపత్తి' పధాన్ని పొందిన వాడు (ii) ఫలం, (iii) 'సకదాగామి' పధాన్ని సాధించినవాడు (iv) ఫలం, (v) 'అనాగామి' పధాన్ని పొందిన వాడు (vi) ఫలం, (vii) 'అర్హంత' పధాన్ని పొందినవాడు (viii) ఫలం ఈ విధంగా ఈ ఎనిమిది వ్యక్తులు నాలుగు జంటలవుతాయి.

8. అంటే అర్హంతత్వ ఫలం

**9.** ఇందఖీల – ఇంఖీ అంటే సక్క (ఇంద్రుడు) దేవతల రాజు లేదా ముఖ్యుడు. ఇందఖీల అంటే సక్రని అంత ఎత్తు, స్థిరమూ అయినది లేదా ముఖ్యస్తంభం. ఇంద ఖీలాలను అలంకారం కోసం నగరంలోపల లేదా రక్షణ దుర్గంగా, నగర వెలుపల నిర్మించే స్తంభాలని వ్యాఖ్యానాలు చెబు తున్నాయి. మామూలుగా వాటిని ఇటుకలతో, లేదా కాలంలో తట్టుకొని నిలచే కొయ్యతో అష్టభుజి ఆకృతిలో నిర్మిస్తారు. సగం స్తంభం భూమిలోకి పాతి ఉంటుంది. కనుక – ''ఇందఖీల అంతస్థిరము, గట్టి'' అనే రూపకం వచ్చింది.

'' ఇంద్రుని స్తంభం; నగర ద్వారం వద్ద లేదా ముందు ఉండేస్తంభం, కీలం, యూపం; గృహద్వారం వద్ద భూమిలోకి కొంత వరకు పాతబడిన రాతిబిళ్ళ . (P.T.S. Dict.)

**10.** ఋషిత్వం మొదటి దశ అయిన 'సొతాపత్తి' ని చేరిన వాడు, మహా అయితే ఏడు జన్మలు మాత్రమే ఎత్తుతాడు.

**11.** అది నిర్వాణం ప్రథమ క్షణిక దర్శనం

**12.** పది సంయోజనల (శృంఖలాలు) లోని మొదటి మూడు

**13.** సక్కాయదిఠ్ఠి – దేహం ఉన్నప్పుడు జనించే విశ్వాసం అంటే, శాశ్వతాత్మ భావన. శరీరానికి సంబంధించి ఏర్పడే యజ్ఞానాల, భావనల మూడింటిలో ఒకటి. మిగతా రెండు తృష్ణ (తణ్హ) గర్వం (మాన), (వ్యాఖ్య) *Buddhist Psychology,* P. 257 చూడండి.

**14.** (i) బుద్ధుని, (ii) ధమ్మ (iii) సంఘ, (iv) వినయ (v) గతం (vi) భవిష్యత్తు (vii) గతానాగతాలు, పటిక్కసముప్పాద (ప్రతీత్య సముత్పాదం) ఆధారంగా పుట్టుట అనే నియమాలకు సంబంధించిన శంక. See *Buddhist Psychology,* P. 260

**15.** అంటే – దుఃఖ స్థితులు (నిరయ), జంతులోకం, ప్రేత (పెత) లోకం, అసుర లోకాలు.

**16.** అభిఠానాని (i) మాతృహత్య (ii) పితృహత్య (iii) అర్హంతహత్య (iv) బుద్ధుని నెత్తురు కళ్ళ చూచుట (iv) సంఘంలో చీలిక తేవడం (vi) శాశ్వత దారుణ చద్మ విశ్వాసాలు.

**17.** వనప్పగుంబె: వ్యాఖ్యానం 'వనె పగుంబొ' గా (అడవిలోని పొద)గా చెబుతున్నది. ఇక్కడ సప్తమీ విభక్తి ప్రథమా విభక్తిగా చెప్ప బడింది.

**18.** ఇక్కడ గూడ సప్తమీ విభక్తి ప్రథమా విభక్తిగా చెప్ప బడింది.

**19.** వేసవి ఆరంభ మాసంలో పుష్పించి, తరు శిఖరాలతో అడవులు, వనాలు, చాల వైభవో పేతంగా కనిపిస్తాయి.

20. తన గత కర్మల కారణంగా అర్హంత తిరిగి జన్మించడు. అతడు తన జీవిత కాలంలో చేసే కర్మలన్నీ అప్రభావకాలుగా ఉంటాయి. ఎందు కంటె వాటిని తృష్ణ సోకదు.

21. నగర రక్షక దేవతల గౌరవార్థం వెలగించి ఉంచి, ఆ క్షణంలోనే ఆరి పోయిన దీపం కేసి చూపిస్తూ.

22. వెసాలి వాస్తవ్యులకు సుఖ శాంతులను అందించి, బుద్ధుడు తన ఉపన్యాసాన్ని ముగిస్తున్నప్పుడు, దేవతల రాజైన సక్క, చివరిమూడు పద్యాలను వల్లించి, తన పరివారంతో సహా బుద్ధుని వద్ద సెలవు గైకొన్నాడు.

బుద్ధుడు ఈ సుత్తను వరుసగా ఏడు రోజులు చెప్పాడని వ్యాఖ్యానం ద్వారా తెలుస్తున్నది.

# మెత్తా సుత్త[1]

## ప్రేమైక కరుణ (మైత్రి)

1. తన మంచి గురించి బాగా శిక్షితుడైనవాడు, శాంత[2] స్థితిని పొందా లను కొన్నవాడు ఈ విధంగా చేయాలి:

అతడు సమర్థుడై ఉండాలి. ఋజు వర్తనుడై ఉండాలి. పరిపూర్ణ ఋజువర్తనుడై[3] ఉండాలి. విధేయుడు, నెమ్మది, వినమ్రుడు అయి ఉండాలి.

2. సంతృప్తుడు, సహనుడు, దాదాపు ఏ విధులూ లేని, సరళ జీవితం గల, ఇంద్రియ నిగ్రహుడు, విచక్షణా పరుడు, సిగ్గున్నవాడు, కుటుంబాలకు లోభంతో అంటి పెట్టుకోనివాడు అయి ఉండాలి.

3. ఇతర జ్ఞాను లెవరూ అభిశంసించే అల్పదోషాన్ని గూడ అతడు చేయ రాదు. సర్వజీవులు సుఖ భద్రతలతో ఉండుగాక! వారి హృదయాలు హితావహాలుగా ఉండు గాక!

4. ప్రాణులు ఎటువంటి వారైనా: బలహీనులైనా, బలవంతులైనా, పొడుగైనా, లావైనా, పొట్టైనా, మధ్యరకమైనా, దృశ్యులైనా, అదృశ్యులైనా, దగ్గర నివసించే వారైనా, దూరంగా ఉండే వారైనా, పుట్టిన వారైనా, పుట్టనున్న వారైనా, – అందరు ఏ సాపవాదం లేకుండా, సుఖ మనస్కు లవుదురు గాక!

5. ఎక్కడైనా, ఏ వ్యక్తి అయినా మరొకని మోసగించకుండుగాక, కించ పరచ కుండుగాక, కోపంలోగాని, వ్యాపాద లోగాని, ఒకరు మరొకరికి హాని చేయకుండు గాక.

6. ఒక తల్లి, తన ప్రాణాన్ని సైతం లెక్కచేయక ఎలా తన బిడ్డను కాపాడుతుందో, అలాగే అతడు సర్వజీవుల యెడ అపార సహృదయాన్ని కలిగి ఉండు గాక.

7. అతని అపార ప్రేమ ఈ మొత్తం ప్రపంచాన్ని – క్రింద, పైన, అడ్డంగా – ఏ అడ్డంకులు లేకుండ, ద్వేషం, శత్రుత్వం లేకుండ పరివేష్టించు గాక.

8. అతడు పండుకొన్నా, కూర్చొన్నా, నడుస్తున్నా, నిలుచొన్నా, అతడు మేల్కొని ఉన్నంత సేపు, అతడు తన 'సతి' (అప్రమత్తతను) పెంపొందించు కోవాలి. దీనిని, వారు, ఉత్తమోత్తమ శీల[4]మని వాకొంటున్నారు.

9. దోషం[5] చేయకుండ, ప్రజ్ఞతో[6] కూడిన వాడై, ఇంద్రియ వాంఛలను అతడు వదిలి వేస్తాడు. నిజానికి, ఒక గర్భంలో జన్మించ డానికి అతడు తిరిగిరాడు[7].

## మెత్తాసుత్త వ్యాఖ్యానం

1. వర్షాకాలం సమీపిస్తుండగా, అనేకమంది భిక్కులు బుద్ధుని ఆదేశాన్ని అనుసరించి, ధ్యానానికి తగిన ప్రదేశం కోసం వెతకసాగారు. వారి పర్యాటక గతిలో సుందర దృశ్య సమన్వితమైన ఏకాంత స్థలాన్ని చూశారు. అక్కడే ఉండి పోయి, తమ ముక్తి కోసం ధ్యానం చేయా లనుకొన్నారు.

అక్కడ వృక్షాగ్రాల మీద ఉన్న దేవతలు, వారు అక్కడ ఉండడం ఇష్టం లేక, వారిని పారద్రోలా లనుకొన్నారు. రాత్రిళ్ళు వారి ధ్యానానికి భంగం కలిగించి, దేవతలు తమ ప్రయత్నంలో సఫలు లయ్యారు.

అటువంటి అననుకూల పరిసరాల్లో, తమ మనస్సులను ఏకాగ్రం చేయడం కష్టమై, బుద్ధుని వద్దకు వచ్చి, ఆయనకు తమ రే సంఘటనల వృత్తాంతాన్ని విన్నవించారు.

అంతట బుద్ధుడు ఈ సుత్తను చెప్పి, వారిని అదే ప్రదేశానికి వెళ్ళి, అలాగే చేయ వలసిందని సలహా ఇచ్చాడు.

వారు తమ ప్రేమ పూరిత ఆలోచనలతో అక్కడి వాతావరణం మొత్తాన్ని పరివేష్టించగా, దేవతలు ఇప్పుడు సంతోషించారు. వారి ఆధ్యాత్మిక ప్రగతిని అడ్డు కొనడానికి బదులు, వారికి కావలసిన సహాయం అంతా చేశారు.

వర్షాకాలం (వస్సావాస సమయం) పూర్తి అయ్యేలోపే భిక్కులు అర్హంత లయ్యారు. ఈ ఉపన్యాసం రక్షణకు గుర్తుగాను, ధ్యానానికి వస్తువుగాను – రెండింటికి పనికి వస్తుంది. ఈ ఉపన్యాసం మొదటి భాగంలో, తన క్షేమాన్ని కోరుకొన్న, ఎవడైన ఆచరించాల్సిన గుణ

శీలా లున్నాయి. తరువాతి భాగంలో, మైత్రిని (మెత్తా) లేదా పరహితాన్ని ఆచరించే విధానం వివరంగా ఉంది.

మెత్తా (సంస్కృతం మైత్రి): దీనికి సరిపోయే అందమైన ఆంగ్లపదాన్ని ఇవ్వడం కష్టం. కొన్నిసార్లు దీనికి సమానార్థకంగా 'benevolence' (పరహితేచ్ఛ) ను ఇస్తారు. కాని దీనిలో బౌద్ధుల 'మెత్తా' లోని 'పితి' (rapture = ప్రీతి – హర్షాతిరేకం) ని పట్టుకొనే గట్టితనం లేదు. See "Blessing". Page. 194

2. అంటే నిబ్బాణ

3. ఉజు, సూజూ. మొదటి పదం మాటల్లో చేతల్లో రుజుతనాన్ని సూచిస్తుంది. రెండో పదం మనస్సు రుజుతనాన్ని సూచిస్తుంది. (వ్యాఖ్యానం)

4. బ్రహ్మ విహార

5. ఇక్కడ దోషం అంటే, ఆత్మ భ్రమ (సక్కాయ దిఠ్ఠి)

6. అంటే నిర్వాణ ప్రథమ తటిద్దర్శనం (మెరుపు దర్శనం)

7. ఒకడు ' అనాగామి' దశను చేరు కొంటే, అతడు సుద్ధా వాసాలలో (శుద్ధావాసాలలో) పుడతాడు. మానవలోకంలో జన్మించడు.

# సతిపట్ఠాన సుత్త

## పరిచయం

ముఖ్యంగా అది సమథ (Concentration) విపస్సనా (insight) లను పెంపొందించు కోవడానికి వివిధ ధ్యాన వస్తువులతో వ్యవహరిస్తుంది గనుక, సతిపట్ఠాన సుత్త అత్యంత ముఖ్యమైంది.

సతిపట్ఠాన అనే పాళీ పదం 'సతి' 'పట్ఠాన' లేదా 'సతి' ' ఉపట్ఠాన' పదాలతో నిర్మితమైంది.

సతి అంటే అప్రమత్తత. విపస్సన అంటే ఎరుక లేదా జాగరితమై ఉండడం, ఒళ్ళు దగ్గరపెట్టుకొని ఉండడం. పట్ఠాన అంటే సంస్థాపనం, పునాదులు, భూమికలు, వస్తువులు, అనుస్థానం.

అందుకని సతిపట్ఠాన అంటే అప్రమత్తతా పునాదులు లేదా 'అప్రమత్తతా ముఖ్యవస్తువులు'

సతిపట్ఠాన ను 'సతి' + 'ఉపట్ఠాన' జాగృతించుట లేదా అనుష్ఠానం నుంచి గూడ సాధించవచ్చు. అందుకని సతిపట్ఠాన అంటే 'అప్రమత్తతను (విపస్సనను) అనుష్ఠించుట' లేదా 'అప్రమత్తతను జాగరితం చేయుట'

సతిపట్ఠానను 'అప్రమత్తత' లేదా 'విపస్సనకు భూమిక' గా లేదా ''విపస్సన అనుష్ఠాన ముఖ్య వస్తువులు' గా వ్యాఖ్యానించవచ్చు.

ఈ ఉపన్యాసంలో, నాలుగు ధ్యాన వస్తువులు (అనుపస్సనా) వేరు వేరు ప్రవృత్తుల వ్యక్తులను సరి పడేవిధంగా ఉన్నాయి.

మొదటి ధ్యానం శరీర సంబంధం (కాయానుపస్సనా). దీని ద్వారా అందం, వాంఛనీయత (సుభావిపల్లాస) లని పిలవబడే అపార్థాలను పోగొట్టుకోవచ్చు. ఈ ధ్యానం ద్వారా, అక్కడ కర్మ (పని) తప్ప కర్త (చేసేవాడు) లేదని, నటన తప్ప నటించే వాడు లేడని అర్థం చేసుకోవడానికి ఒకడు అవగతం చేసుకొంటాడు. ''నేను'' లేదని అతడు గుర్తిస్తాడు.

శరీరధ్యానం, ఏకాగ్రతను పొందడానికి, ఉచ్ఛ్వాస నిశ్వాసల (ఆనాపానసతి) మీద లగ్నం చేయడంతో, ఆరంభ మవుతుంది. ఇది ఝానాలకు అంతిమంగా అర్హంతత్వానికి దారి తీస్తుంది.

మానవుని ఈసంశ్లిష్ట యంత్రలోని అతిముఖ్యమైన కారకం మనస్సు. ఇది అగోచరమైంది. దీనిని తేలికగా అదుపులో ఉంచలేం. అది అటు ఇటు తిరుగుతుంది. కొన్ని క్షణాల పాటే అయినా మనస్సును ఒక వస్తువు మీద లగ్నం చేయడం, సూది మొన మీద ఆవగింజను నిలపడం లాంటిది. అది కష్టమే అయినా నిరత అభ్యాసంతో, ఏకాగ్రతను సాధించడం సంభవమే. ఎందుకంటే అది అందరిలోను గుప్తంగా ఉన్న సామాన్య మానసిక స్థితియే. ఈ ఏకాగ్రత కనుక అధార్మిక చేతన ( అకుశలచిత్తం)లో ఉన్నట్లయితే అది కీడును కలిగిస్తుంది. అదే కుశల మనస్సులో ఉంటే మంచిని కలిగిస్తుంది. ఈ ఏకాగ్రతను ఝాన కారకంగా పెంపొందించ వచ్చు. అదే ఏకాగ్రతను బోధి అంగంగా ( బోఝ్ఝంగ) ఉదాత్తీ కరించ వచ్చు. ఇంకా అష్టాంగ మార్గంగా (మగ్గంగ) ఉదాత్తీ కరించ వచ్చు. ఈ కారణం వల్లనే, బౌద్ధం, అందరిలోను మంచితనం, గొప్పతనం అంతర్గతంగా ఉన్నాయని చెబుతుంది. మనలో ''చెడ్డతనం, చెత్తకుప్ప'' ''సుగుణ భాండాగారం'' - రెండూ కనిపిస్తాయి.

ఈ ఏకాగ్రతతో ఝానాన్ని చేరడం ద్వారా, ఒకడు అర్హంతత్వాన్ని పొంద ప్రయత్నిస్తాడు. ఝాన స్థితి నుంచి పైకి వచ్చి అతడు మూడు లక్షణాల మీద ధ్యానం చేస్తాడు. ఆ మూడు: అనిత్యత, దుఃఖం, అనత్తలు. చాల శ్రమించిన తరవాత అర్హంతత్వం పొంది, పూర్తిగా తృష్ణ నుంచి, అ విద్యనుంచి, ఈ ప్రపంచాన్ని పట్టుకొని వెళ్ళాడం నుంచి, పూర్తిగా విముక్తుడై జీవిస్తాడు.

శారీర కాసనాల విభాగం - కూర్చోవడం, నిలుచోవడం, నడవడం, పండు కోవడాలకు సంబంధించిన విభాగం - గూడ కేంద్రీకరణకు, స్వీయ చైతన్యానికి, కారణ సంఖార చలనాలు తప్ప, కర్త లేడనే అవగాహనకు దారితీస్తుంది.

ముప్పై రెండు శారీరక భాగాల జుగుప్స, శరీరం అని పిలవబడే దాని నిర్మాణాంశాలైన నాలుగు మూలకాల, పదిశవాల - (i) ఉబ్బిన (ఉద్ధుమాతక) (ii) వివర్ణ (వినీలిక) (iii) చీము పట్టిన (విపుబ్బక = పూయము) (iv) కోయబడిన (విచ్ఛిదక) (v) కొరికి తునకలు చేయబడిన (విఖ్ఖాయక) (vi) ముక్కలుగా వెదజల్లబడిన (విక్షిత్తక) (vii) వ్యంగీకృత (అంగాలు తొలగించి విసరబడిన = హత విక్షిత) (viii) రక్తసిక్త (లోహిత) (ix) పురుగులతో లుక లుకలైన (పులవక) (x) కంకాళం (అత్థిక = హస్థికలు) - మీది విభాగం, ఈ నశ్వర శరీరం మీది స్వార్థవాంఛలను తొలగిస్తుంది.

ఒకనిలో కలిగే అన్నిరకాల వేదనలకు - అవి ఆధ్యాత్మికాలు కావచ్చు, ప్రాపంచికాలు కావచ్చు - సంబంధించింది రెండో ధ్యానం (వెదనానుపస్సనా). దీని ద్వారా ఒకడు

క్షణభంగుర సుఖానికి (సుఖ విపల్లాస) సంబంధించిన ఛద్మ భావనను తొలగించుకో గలుగుతాడు.

ఒకడు తన జీవిత గతిలో, సంతోషకర, అసంతోషకర, తటస్థ వేదనలను అనుభవిస్తాడు. అన్నీ క్షణ భంగురాలే. అందుకని వాటిల్లో నిజమైన సుఖం లేదు. నిర్వాణం పరమసుఖం. అది దుఃఖ విముక్తి నుంచి కలిగే ఆనందం.

మూడో ధ్యానం, ఒకడు అనుభవించే విజ్ఞాన స్థితుల (చిత్తానుపస్సనా) కు సంబంధించింది. ఇది శాశ్వత భావనను (నిచ్చవిపల్లాస) తరిమివేస్తుంది.

మనస్సు లేదా విజ్ఞాన మెరుపు వేగంతో పుడుతుంది. ప్రతిక్షణమూ మనకు ఒక ధార్మిక లేదా అధార్మిక ఆలోచన వస్తూ ఉంటుంది. వివిధ రకాల విజ్ఞానాన్ని, ఈ విభాగంలో, జంటలుగా అమర్చడం జరిగింది.

నాలుగో ధ్యానం ధమ్మానికి సంబంధించింది (ధమ్మానుపస్సనా). ధమ్మ అనే పాళీపదాన్ని ఈ సందర్భంలో ఆంగ్లంలోకి అనువదించడం కష్టం. ఇక్కడ ధమ్మం ఐదు నివారణలను (ఆటంకాలను), సప్తబోధి అంగాలను (బొజ్జంగ), పంచ ఉపాదాన స్కంధాలను, షడింద్రియాలను (సలాయతన), చతుర్థ ఆర్య సత్యాలను (అరియసచ్చ) పరివేష్టిస్తుంది. అందుకని పాళీ పదాన్ని ఉపయోగించడమే మంచిది.

ఈ ధమ్మానుపస్సనా మారని అమర్త్య ఆత్మకు (అత్తభావవిపల్లాస) సంబంధించిన ఛద్మ విశ్వాసాన్ని తొలగిస్తుంది.

ఈ నాలుగింటిలో దేనినైనా తన ప్రవృత్తికి తగినట్లు ఎన్నుకొని, అర్హంతత్వం వచ్చే దాక అనుష్ఠించ వచ్చు. లేదా ఆచరణకు వీలుగా నాలుగింటిని పర్యాయికంగా ఆచరించ వచ్చు. ధ్యానాలను పెంపొందించు కోవ డానికి తగిన ఒక వస్తువుకు మాత్రమే అంటిపెట్టు కొని ఉండడం మంచిది.

లాలస ప్రవృత్తి గలవారికి శారీరక ఏహ్యత మీద, సంఘాత మూలకాల మీద, పది శవాల మీద ధ్యానం నిలపడం మంచిది. ధ్యానానికి వస్తువును ఎంపిక చేసు కోవడంలో గట్టిగా పలాన నియమాన్నే పాటించాలని చెప్పలేం.

తనకు తానే ఈ విషయాల్లో మంచి నిర్ణేత.

ప్రశాంతంగా ఉండే ఏకాంత ప్రదేశం ఈ ధ్యానాలకు తగిన చోటు. అరణ్యం మంచిదే

గాని, తప్పని సరిగా అడవికే వెళ్ళాలని లేదు. అతని మనస్సును చెదర గొట్టే బాహ్య విషయాలేమీ లేక పోతే, తన గదిలో కూర్చునే ధ్యానం చేసుకో వచ్చు.

మన మనస్సు కుదురు కోక పోతే ప్రశాంత అరణ్యాలు గూడ తగిన ప్రదేశాలు కావు. మన మనస్సు కుదురు కొంటే, హడావుడిగా ఉండే నగర మధ్యం గూడ తగిందే. మనం నివసించే వాతావరణం మన మనస్సు ప్రశాంతంగా ఉంచడానికి పరోక్షంగా సహాయ పడుతుంది.

మామూలుగా మనస్సు ప్రశాంతంగా, క్రియాశీలంగా ఉండే ప్రభాత సమయాలు, ఒకడు బాగా అలసి పోక పోతే, నిద్ర కుపక్రమించే ముందు సమయాలు ధ్యానానికి తగిన సమయాలు. కాని, మనం ఏ సమయాన్ని ఎంచుకొన్నా, రోజూ అదే సమయాన్ని పాటించాలి. ఎందుకంటే మన మనస్సులు ఆ ఆచరణకు నిబద్ధాలవుతాయి.

ధ్యాన ఆసనం (Posture) గూడ ఏకాగ్రతకు బాగా సహాయ పడుతుంది.

ప్రాచ్యులు సాధారణంగా శరీరాన్ని తిన్నగా ఉంచి వ్యస్త పాదులై కూర్చొంటారు. వారు కుడి పాదాన్ని ఎడమ తొడ మీద, ఎడమ పాదాన్ని కుడి తొడ మీద ఉంచి కూర్చొంటారు. ఇది పూర్తి ఆసనం. ఇది కష్టమైతే - నిజంగా చాల మంది కది కష్టమే - అర్ధాసనాన్ని ఆచరించ వచ్చు. అర్ధాసనం అంటే కుడిపాదాన్ని ఎడమ తొడ మీద గాని, లేదా ఎడమ పాదాన్ని కుడి తొడ మీద గాని ఉంచడం.

ఈ త్రికోణాసనం వేసి కూర్చొ న్నప్పుడు మొత్తం శరీరం సమతూకంలో ఉంటుంది. కుడి చేతిని ఎడమ చేతి మీద ఉంచాలి. మెడను నిటారుగా, ముక్కు బొడ్డుకు లంబ కోణంలో ఉండేట్లు ఉంచాలి - నాలుక పై అంగిలి మీద ఉంచాలి. బెల్టు వదులు చేసు కోవాలి. దుస్తులు చక్కగా సర్దు కోవాలి. కొంత మంది బాహ్య దృశ్యాలను, వెలుతురును పరిహరించ డానికి, కళ్ళు మూసు కొంటారు.

కళ్ళు మూసు కొంటే కొన్ని ప్రయోజనాలున్న మాట నిజమే. కాని, ఇది అన్ని వేళల అందరూ చేసి తీరాలనే నియమం ఏదీ లేదు. ఎందుకంటే ఒక్కొక్కప్పుడు అది నిద్రను తెప్పిస్తుంది. అప్పుడు మనస్సు అదుపు తప్పి, నిర్లక్ష్యంగా, ఎలాబడితే అలా పర్యాటకం చేస్తుంది. యథేచ్ఛాలోచనలు వస్తాయి. శరీరం తిన్నని తనాన్ని కోల్పోతుంది. అచేతనంగా నోరు తెరుచు కొంటుంది. సొంగ కారు తుంది. తల ఊగు తుంది.

బుద్ధులు మామూలుగా అర్ధనిమీలిత నేత్రాలతో, నాసికాగ్రం మీదుగా నాలుగడుగుల దూరాన్ని చూస్తూ కూర్చొంటారు. వ్యస్తపాదులై కూర్చోవడం మరీ కష్ట మనిపిస్తే హాయిగా

కుర్చీలోగాని, లేదా ఏదైనా ఆనుడు పెట్టుకొని కూర్చో వచ్చు. కాళ్ళు నేలమీద హాయిగా ఉంచు కోవడానికి వీలైన ఎత్తుగా ఆ కుర్చీ ఉండాలి.

ఆసనం హాయిగాను, తేలికగాను ఉంటే, ఏ ఆసనంలో కూర్చొన్నాం అనేది ముఖ్యం కాదు.

రాగ, ద్వేషాల లాంటి వికారాలను అణచ డానికి ఈ ధ్యానంలో గట్టి ప్రయత్నం చేయాలి. సద్యఃఫలితాలను ఆశించ రాదు. చెప్పుకో దగిన ఫలితం రావ డానికి నెలలు, సంవత్సరాలు పట్ట వచ్చు లేదా ఒక రోజే సరి పోవచ్చు. కాని మనం నిరాశ పడ రాదు. నిరంతర ఆచరణ ఆవశ్యకం. వస్తువుల యథాతథ స్థితిని అవగాహన చేసు కొంటూ, గట్టి ప్రయత్నం చేయాలి. బౌద్ధానికి శిఖరాయమాణమైన జ్ఞానం (Wisidom) ఒకడు పరిశుద్ధం కావడానికి, తప్పనిసరి. ఇక్కడ లౌకిక విద్య ప్రయోజనకారిగా ఉంటుంది. కాని ముఖ్యమైన విషయం ఏమంటే తాను వాస్తవంగా ఎలా ఉన్నాడో 'అలాంటి తనను' అర్థం చేసు కోవడం ముఖ్యం. దుఃఖం నుంచి విముక్తి పొంద డానికి బౌద్ధంలో విన్నపాలకు ప్రార్థనలకు చోటు లేదు. ప్రయత్నం, జ్ఞానం ఎలా అవసరమో, నిరత అప్రమత్తత (సతి) అవసరం. ఈ మూడు ఉన్న తరవాత, తన ధార్మిక ప్రగతిని అడ్డు కొనే పంచ నివారణాలను తాత్కాలికంగా త్యజించాలి. కొన్ని సుఖాల యెడ రాగాన్ని అతడు అధిగమించ ప్రయత్నించాలి. దీని అర్థం అతడు అన్ని భౌతిక సుఖాలను పూర్తిగా వదిలి వేయాలని కాదు. కాని అతడు వాటికి బానిస కారాదు.

లాలస లాంటి మరో వినాశకర శక్తి కోపం లేదా ద్వేషం. లాలస, ద్వేషాలు రెండూ విధ్వంసకాగ్నులే. అవి అతనిని, ఇతరులను దహించి వేస్తాయి. సన్యాసిత్వంలో మూడో దశ అయిన అనాగామిని చేరే వరకు ఒకడు రాగ ద్వేషాలకు గురయ్యే మాట నిజమే. కాని అతడు తన శక్తి మేర వాటిని అధిగమించ ప్రయత్నించాలి.

ఈ అసమాన ధ్యానంలో విజయం గాంచా లంటే, మానసిక జాగరూకత, నిరర్థక వ్యాకులత నుంచి స్వేచ్ఛ, కోరుకొన్న లక్ష్యమేదో స్పష్టంగా నిర్వచించు కోవడాలు అంతే సమానంగాను ఆవశ్యకాలే.

ఈ ధ్యానాల అంతిమ లక్ష్యం, అర్హంతత్వ ప్రాప్తిద్వారా అవిద్య, తృష్ణల నుంచి పూర్తి ముక్తి. ఆ తరవాత అతడు ఈ ప్రపంచంలో దేనికీ అంటి పెట్టుకొని ఉండడు.

ఈ ఉపన్యాసాన్ని పూర్తి చేస్తూ బుద్ధుడు భరోసా ఇస్తాడు: ఏడు సంవత్సరాలలో కాదు, ఏడు రోజులలోనే సాధకుడు తన సత్ప్రయత్నంతో ఖచ్చితమైన విజయాన్ని సాధిస్తాడు.

# సతిపట్ఠాన సుత్త[1]

నేను ఈ విధంగా విన్నాను: -

బుద్ధుడు ఇలా చెప్పాడు: -

జీవులను పరిశుద్ధులు గావించడానికి, దుఃఖాన్ని నాశం[3] గావించ డానికి, జ్ఞానం పొందడానికి (ఆర్య అష్టాంగ మార్గం), నిర్వాణం పొందడానికి అంటే అప్రమత్తత యొక్క నాలుగు భూమికల యధార్థీకరణకు ఈ అనన్యమార్గం[2] ఉంది.

ఆ నాలుగు ఏమిటి?

ఇక్కడ (శిక్షణలో) ఒక శిష్యుడు[4] ఎలా ఉంటాడు:

తాత్కాలికంగా ఈ ప్రపంచంలో (లోకె = పంచస్కంధాలు) లుబ్ధత్వాన్ని (అభిజ్ఝా), దుఃఖాన్ని (దొమనస్స)[7] త్యజిస్తూ[6], శక్తిమంతంగా (ఆతాపి), స్పష్టమైన గ్రహణంతో, అప్రమత్తతతో (సతీ) శరీరాన్ని శరీరంలో ధ్యానిస్తూ ఉంటాడు.

(ii) వేదన ధ్యానం (వెదనానుపస్సనా);

(iii) చిత్తధ్యానం (చిత్తానుపస్సనా);

(iv) ధమ్మ ధ్యానం (ధమ్మానుపస్సనా)

  

## *1. శారీరకోపాసన*

***(కాయానుపస్సనా)***

శారీరక ధ్యానం ఒక శిష్యుడు ఎలా చేస్తాడు?
శ్వాసకు జాగరితుడై, అప్రమత్తుడై (అనాపాన సతి).

శిష్యుడు అరణ్యం[8] లోకి గాని, చెట్టు మొదలుకు గాని, ఏకాంత స్థలానికి కాని వెళ్ళి, వ్యస్త పాదుడై[9] శరీరాన్ని నిటారుగా ఉంచి, సతీ తో కూర్చొంటాడు.

అలా కూర్చొన్న సాధకుడు సచేతనం (సతొ) గాలిని పీలుస్తాడు. అలాగే గాలిని వదిలే టప్పుడు దానికి చేతనంగా ఉంటాడు. అంటే గాలిని పీల్చడం, వదలడం పై మనస్సును లగ్నం చేస్తాడు. అంటే శ్వాస ప్రక్రియ మీద కేంద్రీకరిస్తాడు.

అప్పుడు దీర్ఘంగా, లోతుగా గాలిని పీలుస్తాడు. అలా దీర్ఘంగా, గాఢంగా గాలి పీల్చడానికి అతను సచేతనుడై ఉండి, ''నేను దీర్ఘంగా గాఢంగా గాలి పీలుస్తున్నాను'' అని మనస్సును లగ్నం చేసే అనుకొంటాడు. ఇలాగే గాలిని గాఢంగా, దీర్ఘంగా వదిలేటప్పుడూ అనుకొంటాడు.

అల్పంగా, తేలికగా గాలిని పీల్చి, ''ఇప్పుడు నేను గాలిని అల్పంగా , తేలికగా గాలిని పీలుస్తున్నాను,'' అని మనస్సును గాలి మీద కేంద్రీకరించి అను కొంటాడు. గాలిని వదిలే టప్పుడు, ఇలాగే ''నేను గాలిని అల్పంగా తేలిగా వదలుతున్నాను,'' అని మనస్సును వదిలే గాలి మీద కేంద్రీకరించి అనుకొంటాడు.

మొత్తం మొత్తం శ్వాస ప్రక్రియ[10] (సబ్బకాయ పటి సంవెది)ను అనుభవిస్తూ ''నేను గాలిని పీలుస్తున్నా,'' అనే స్పృహతో సాధకుడు అభ్యాసం చేస్తాడు.

మొత్తం శ్వాస ప్రక్రియను అనుభవిస్తూ ''నేను గాలిని వదులుతున్నాను'', అనే స్పృహతో సాధకుడు అభ్యాసం చేస్తాడు.

అంటే సాధకుడు గాలిని పీల్చేటప్పుడు పీలుస్తున్నానని, వదిలే టప్పుడు వదులుతున్నాననే విషయాలకు అతడు స్పృహతో ఉంటాడు. దీర్ఘంగా లేదా హ్రస్వంగా పీల్చేటప్పుడు వదిలే లేదా టప్పుడు గూడ ఆ విషయాలకు జాగరితుడై ఉంటాడు. అంటే మొత్తం శ్వాసప్రక్రియ మీద మనస్సును నిలిపి ప్రతిక్షణం దానికి జాగరూకుడై ఉండి అభ్యాసం చేస్తాడు.

అంటే అతనికి శ్వాసక్రియ తప్ప మరొకటి కనిపించదు. శ్వాస క్రియే ధ్యాన వస్తువు.

నిపుణుడైన చక్రికి (తరిణ బట్టే వాడు) లేదా అతని దగ్గర తరఫీదు పొందే వానికి దీర్ఘ పరివృత్తిని ( దీర్ఘచక్రాన్ని, వలయాన్ని) చేసి నప్పుడు దీర్ఘపరివృత్తిని చేశానని, అల్ప పరివృత్తిని చేసి నప్పుడు అల్ప పరివృత్తిని చేశానని అతనికి ఎలా తెలుస్తుందో, అలాగే, దీర్ఘంగా గాలిని పీల్చి నప్పుడు దీర్ఘంగా గాలిని పీల్చానని, హ్రస్వంగా గాలి పీల్చి నప్పుడు హ్రస్వంగా గాలి పీల్చానని అతనికి తెలుస్తుంది. ఈ పైన చెప్పిన విధంగా అతడు శ్వాస మీద మనస్సు అభంగంగా నిలిపి తనను తాను శిక్షించు కొంటాడు.

ఈ విధంగా అతడు కాయాన్ని అంతరంగింకంగా, లేదా బాహ్యంగా[11] లేదా రెండు విధాల ధ్యానిస్తూ అతడు గడుపుతాడు.

శ్వాసకాయ స్వభావ సముదయాన్ని[12] (సముదయ ధమ్మ), అంతర్హిత స్వభావాన్ని[13] (వయధమ్మాలు), శ్వాసకాయ స్వభావ సముదాయ అంతర్హితాలను ధ్యానిస్తూ అతడు జీవిస్తాడు.

ఇప్పుడతనిలో ఒక అప్రమత్తత (ప్రజ్ఞ) జనిస్తుంది. దీనితో అతడు 'జ్ఞానం పెంపొందించుకోవడానికి, అప్రమత్తత పెరగడానికి అవసరమైనంత వరకే అక్కడ శరీరం[14] ఉంటుంది (శరీరం వీటికోసమే ఉంది). ఈ ప్రపంచాన్ని అంటిపెట్టుకోక[16] స్వతంత్రంగా[15] (అనిస్సితో) జీవిస్తాడు.

## *శారీరకాసనాల విభాగం :*

***(ఇరియాపథ)***

ఒక సాధకుడు నడుస్తున్నప్పుడు[17], 'తానునడుస్తున్నాని' తెలుస్తుంది. నిలుచొన్నప్పుడు, ''నేను నిలచొన్నాను,'' అని తెలుస్తుంది; కూర్చొన్నప్పుడు, 'నేను కూర్చొన్నాను', అని అతనికి తెలుస్తుంది. పండుకొని ఉన్నప్పుడు, తాను పండుకొని ఉన్నాడని అతనికి అవగత మవుతుంది. అతని శరీరం అనుసరించే ప్రతి ఆసనం అతనికి తెలుస్తుంది.

ఈ విధంగా అతడు శరీరాన్ని బాహ్యంగా, అంతరంగా లేదా రెండూ బాహ్యంగా అంతరంగా ధ్యానిస్తూ నివసిస్తాడు.

కాయ స్వభావ సముదాయాన్ని, కాయ స్వభావ అంత్వర్థితాన్ని లేదా రెండింటిని ధ్యానిస్తూ అతడు నివసిస్తాడు. ఇప్పుడతనిలో ఒక అప్రమత్త లేస్తుంది – శరీరం మాత్రమే ఉంటుంది... పై వలే ..... ఈ ప్రపంచంలో...



## జాగరితా విభాగం

***(చతు సంపజఞా)***

ముందుకు, చుట్టూ చూడడంలో, (అవయవాలను) ముడుచు కోవడంలో లేదా చాచు కోవడంలో, చీవరాలను, భిక్షాపాత్రలను ఉపయోగించడంలో, తినడం, త్రాగడం, నములడంలో, కాలకృత్యాలు తీర్చు కోవడంలో, వెళ్ళడంలో, నిలుచోవడంలో, కూచో వడంలో, నిద్ర పోవడంలో, మేల్కొని ఉండడంలో, మాట్లాడడంలో, నిశ్శబ్దంగా ఉండడంలో తాను ముందు వెనుకలకు వెళ్ళడంలో సాధకునికి పరిపూర్ణ అప్రమత్తత (ఎరుక, జాగృతి) ఉంది.

ఈ విధంగా అతడు కాయధ్యానం చేస్తూ నివసిస్తుంటాడు... పై వలె ... ఈ ప్రపంచంలో.



## జుగుప్సోపాసన[18]

**పటిక్కూలమనసికార**

**( మనస్సు ప్రతికూలమైన వాటి మీద ధ్యానం)**

అరికాళ్ళనుంచి పైకి శిరాగ్రం నుంచి క్రిందికి ఈ చర్మంలో చుట్టబడిన వివిధరకాల కలుషితాలతో తులతూగే ఈ శరీరం మీద సాధకుడు పర్యాలోచిస్తాడు.

ఈ దేహంలో తల, జుట్టు, శరీర రోమాలు, గోళ్ళు, పళ్ళు, చర్మం, మాంసం, స్నాయులు, ఎముకలు, మజ్జ, మూత్రపిండాలు, గుండె, కాలేయం, ఉదరవితానం, ప్లీహం, ఊపిరితిత్తులు, పొట్ట, ప్రేవులు, ఆంత్రపేశి, మలం, పైత్యరసం, కఫం, చీము, రక్తం, చెమట, కొవ్వు, కన్నీళ్ళు, వస (Grease), ఉమ్మి, చీమిడి, కీళ్ళ చమురు, మూత్రాలు ఉన్నాయి.

ఎలాగైతే బియ్యం, ధాన్యం, పెసలు, బఠానీలు, నువ్వులతో నిండుగా ఉన్న ఒక రెండు మూతుల గోతాన్ని, ముందు చూపు వున్న వ్యక్తి దానిని తెరిచి, ఈవిధంగా పర్యాలోచిస్తాడు: ఇవి బియ్యం, ఇవి ధాన్యం, ఇవి పెసలు, ఇవి బఠానీలు, ఇవి నువ్వులు అని చూస్తాడు. అలాగే సాధకుడు శరీరంలోని వివిధ కాలుష్యాలను ధ్యానిస్తాడు.

ఈ విధంగా అతడు శరీరాన్ని ధ్యానిస్తూ నివసిస్తాడు - పైవలె.... ఈ ప్రపంచంలో దేనికి అంటి పెట్టు కోకుండ.

  

## ధాత్వోపాసన

**(ధాతుమనసికార)**

శరీరం ఎలా ఉంటే అలా, ఏన్యాసంలో ఉంటే అలా, సాధకుడు ధాతువులకు సంబంధించి దానిని ధ్యానిస్తాడు. ఈ శరీరంలో పృథ్వీ మూలకం, (విస్తృతిధాతువు), జలధాతువు (సంసక్తధాతువు) అగ్ని ధాతువు ( ఉష్ణధాతువు) వాయుధాతువు (*గతిధాతువు*) ఉన్నాయి.

ఒక కసాయి వాడు లేదా వాని దగ్గర ఆ వృత్తి నేర్చుకొనేవాడు, ఒక ఎద్దును కొని, దానిని అనేక భాగాలుగ విభజించి, ఒక కూడలి వద్ద ఎలా కూర్చొంటాడో, అలాగే, సాధకుడు ధాతువులను దృష్టిలో ఉంచుకొని శరీరాన్ని ధ్యానిస్తాడు.

ఈ విధంగా అతడు శరీరాన్ని ధ్యానిస్తూ జీవిస్తాడు .... పైవలె .... ఈ ప్రపంచంలో దేనికీ అంటి పెట్టుకోక.

  

## తొమ్మిద రకాల శవాల ధ్యానం

**(నవసివథికాపబ్బ)**

(1) శవ స్థలంలో విసరి వేయ బడిన, ఒకరోజు గడిచిన శవం, రెండురోజులు గడిచిన శవం, మూడు రోజులు గడిచిన శవం, ఉబ్బి, విన్నర్ణమై, పురుగులు పడిన శవాలను సాధకుడు చూస్తాడు. ఈ దృశ్యాన్ని తన స్వంత దేహానికి ఈ విధంగా అన్వయించుకొంటాడు:

''నిజంగా ఈ (నా) దేహం కూడ అదే స్వభావం కలది. అలాగే అవుతుంది. ఆ స్థితిని తప్పించుకు పో లేదు''.

ఈ విధంగా అతడు శరీరధ్యానం చేస్తాడు. .... పై వలె... ఈ ప్రపంచంలో దేనినీ అంటి పెట్టుకోక.

(2) శవ స్థలం లోకి విసరబడిన దేహాన్ని కాకులు, గద్దలు, దూడబాతులు లేదా కుక్కలు లేదా నక్కలు లేదా అనేక రకాల పురుగులు పీక్కుతినడం సాధకుడు చూస్తాడు. అప్పుడు ఈ దృశ్యాన్ని తన స్వంత దేహానికి ఈ విధంగా అన్వయించు కొంటాడు: నిజంగా ఈ నా దేహం గూడ అదే స్వభావం గలది. అలాగే అవుతుంది కూడ. ఆ స్థితిని ఇది తప్పించుకోలేదు''.

ఈ విధంగా అతడు దేహాన్ని ధ్యానిస్తూ జీవిస్తాడు: .... పైవలె ... ఈప్రపంచంలో దేనినీ అంటి పెట్టు కోక.

(3) శవ స్థలంలోకి విసరి వేయబడిన దేహం, స్నాయువులతో అతుక్కొని, కొద్ది మాంసం, నెత్తురు దానికి అంటుకొని ఉన్న అస్థిపంజరంగా, మారడాన్ని సాధకుడు చూస్తాడు ....

(4) శవస్థలంలోకి విసరి వేయబడిన దేహం స్నాయువులతో అతుక్కొని, కొద్దిమాంసం గూడ లేకుండ నెత్తురు దానికి అంటుకొని ఉన్న కంకాళంగా మారడాన్ని సాధకుడు చూస్తాడు....

(5) శవస్థలంలోకి విసరివేయబడిన దేహం స్నాయువులతో అతుక్కొని, కొద్దిమాంసం, నెత్తురు గూడ లేకుండ ఉన్న అస్థిపంజరంగా మారడాన్ని సాధకుడు చూస్తాడు .....

(6) శవస్థలంలో విసరబడిన దేహం – చేతి ఎముకలు ఇక్కడ, కాలి ఎముకలు అక్కడ, తొడ ఎముకలు మరోచోట, వెన్నెముక వేరొక చోట, పుర్రె ఇంకొక చోట – ఇలా చెల్లా చెదురుగా – ఎముకలుగా మారడాన్ని సాధకుడు చూస్తాడు.....

(7) శవస్థలంలోకి విసరి వేయబడిన దేహం – శంఖువువలె తెల్ల రంగులోకి మారిన ఎముకలుగా పరివర్తితం కావడాన్ని సాధకుడు చూస్తాడు....

(8) శవస్థలం లోకి విసరివేయ బడిన దేహం ఎముకల పోగై, ఒక సంవత్సరం కాలం గడిచిన దానిని సాధకుడు చూస్తాడు....

(9) శవస్థలం లోకి విసర బడిన దేహం ఎముకలు కుళ్ళి మట్టిగా మారడాన్ని సాధకుడు చూస్తాడు. ఈ దృశ్యాన్ని, అప్పుడు, అతడు, ఈ విధంగా తనకు అన్వయించు కొంటాడు: నిజంగా నాయీ దేహమూ అటువంటిదే. అలాగే అవుతుంది. ఆ స్థితిని తప్పించుకో లేదు.

ఈ విధంగా అతడు దేహ ద్యానం చేస్తాడు .... పైవలె .... ఈ ప్రపంచంలో దేనికీ అంటిపెట్టుకో కుండ.

## 2 సంవేదనోపాసన

### (వెదనానుపస్సనా)

ఒక సుఖకర సంవేదనను అనుభవిస్తు న్నప్పుడు సాధకుడు దానిని ఎరుగుతాడు.

'నేను ఒక సుఖకర సంవేదనను అనుభవిస్తున్నాను' అని.

సాధకుడు ఒక బాధాకర సంవేదనను అనుభవిస్తున్నప్పుడు దానిని అతడు ఎరుగుతాడు–

'నేను ఒక బాధాకర సంవేదనను అనుభవిస్తున్నాను' అని.

సాధకుడు ఒక తటస్థ సంవేదనను అనుభవిస్తు న్నప్పుడు ఎరుగుతాడు –

'నేను ఒక తటస్థ సంవేదనను అనుభవిస్తున్నాను, అని.

సాధకుడు ఒక సుఖ ప్రాపంచిక వేదన (సామిస)ను అనుభవిస్తు న్నప్పుడు ఎరుగుతాడు:

'నేను ఒక సుఖకర ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను' అని.

సాధకుడు బాధాకర ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నప్పుడు ఎరుగుతాడు:

'నేను బాధాకర ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను' అని.

సాధకుడు ఒక తటస్థ ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నప్పుడు ఎరుగుతాడు:

'నేను ఒక తటస్థ ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను, అని.

సాధకుడు ఒక సుఖకర అప్రాపంచిక (నిరామిస) సంవేదనను అనుభవిస్తున్నప్పుడు ఎరుగుతాడు:

నేను ఒక సుఖకర అప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను' అని

సాధకుడు ఒక బాధాకర అప్రాపంచిక సంవేదనను అనుభవిస్తు న్నప్పుడు ఎరుగుతాడు:

'నేను ఒక బాధాకర అ ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను' అని.

సాధకుడు ఒక తటస్థ అ ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నప్పుడు ఎరుగుతాడు:

'నేను ఒక తటస్థ అ ప్రాపంచిక సంవేదనను అనుభవిస్తున్నాను' అని

ఈ విధంగా అతడు వేదనలను బాహ్యంగా, అంతరంగికంగా, లేదా రెండు బాహ్య, అంతరంగికంగా ధ్యానిస్తూ జీవిస్తాడు.

సంవేదనల సముదయ స్వభావాన్ని, వాటి నాశ స్వభావాన్ని, ఆ రెండింటిని ధ్యానిస్తాడు.

ఇప్పుడు అతడు జాగరిత మవుతాడు: అవసరమైన మేరకే వేదన లుంటాయి .... పైవలె ..... ఈ ప్రపంచంలో.

## 3. చిత్తోపాసన

### (చిత్తానుపస్సనా)

ఈ విధంగా అతడు మనోస్థితిలను బాహ్యంగా, అంతరంగా లేదా రెండు విధాలుగా ధ్యానిస్తాడు.

మానసిక స్థితుల స్వభావ సముదయాన్ని, వాటి స్వభావ వినాశాన్ని లేదా రెండింటిని ధ్యానిస్తాడు.

ఇప్పుడు అతనికి జాగరూకత కలుగుతుంది - మానసిక స్థితులు అక్కడ అవసరమైన మేరకే ఉంటాయి .... పైవలె .... ఈ ప్రపంచంలో

## 4. ధమ్మోపాసన

### (ధమ్మానుపస్సనా)

**(i) పంచ నివారణలు (నివరణ)**

ఐదు ఆటంకాలను దృష్టిలో ఉంచుకొని ధమ్మాలను సాధకుడు ధ్యానిస్తాడు. ఇంద్రియక వాంఛ (కామచ్ఛంద) ఉన్నప్పుడు, సాధకుడు ఎరుగుతాడు:

'నాలో ఇంద్రియక వాంఛ ఉంది' అని లేదా ఇంద్రియక వాంఛ లేనప్పుడు అతడు ఎరుగుతాడు : నాలో ఇంద్రియక వాంఛలేదు, అని. జనించని ఇంద్రియక వాంఛా

సముదయం ఎలా ఉంటుందో, అతనికి తెలుసు; జనించిన ఇంద్రియక వాంఛా త్యాగం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. భవిష్యత్తులో త్యజిత ఇంద్రియక వాంఛ అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

కోపం (వ్యాపాద) ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నేను కోపంగా ఉన్నాను' అని. లేదా కోపం లేనప్పుడు అతడు ఎరుగుతాడు – 'నేను కోపంగా లేను' అని. అజనిత కోప సముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు; జనిత కోపాన్ని త్యజించడం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు; భవిష్యత్తులో ఈ త్యజితకోప అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

అలసత, మందత (థినమిద్ధ) ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నేను అలసుడను మందుడను' అని. అవి లేనప్పుడు అతడు ఎరుగుతాడు– 'నాలో అలసత మందతలు లేవు', అని. అజనిత అలసత్వ మందతల సముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. జనిత అలసత మందతల త్యాజ్యం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు; భవిష్యత్తులో త్యజిత అలసత మందతల అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

అనిర్వృతి (అవిశ్రాంతత) చింతావ్యగ్రత (ఉద్ధచ్చ, కుకుచ్చ) లో ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నేను అవిశ్రాంతంగా, చింతావ్యగ్రతతో ఉన్నాను', అని. లేదా అవి లేనప్పుడు అతడు ఎరుగుతాడు – 'అవి నాలో లేవు' అని. అజనిత అనిర్వృతి చింతావ్యగ్రతల సముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. జనిత అనిర్వృతి చింతా వ్యగ్రతల వ్యాజ్యం ఎలా అయిందో అతనికి బాగా తెలుసు. భవిష్యత్తులో ఈ త్యజిత అనిర్వృతి, చింతావ్యగ్రతల అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

ఈ విధంగా సాధకుడు పంచ ఆటంకాలకు సంబంధించి ధమ్మోపాసన చేస్తాడు.

**(ii) పంచస్కంధాల గ్రహణం :**

సాధకుడు ఆలోచిస్తాడు: 'భౌతిక రూపం ఈవిధంగా ఉంటుంది, ఈ విధంగా పుడుతుంది. ఈ విధంగా అంతరిస్తుంది. వేదన ఈ విధంగా ఉంటుంది. ఈ విధంగా పుడుతుంది. ఇలా అంతమవుతుంది. మానసికస్థితులు ఈ విధంగా ఉంటాయి. ఈ విధంగా కలుగుతాయి. ఈ విధంగా అంతరిస్తాయి. విజ్ఞాన ఇలా ఉంటుంది. ఇలా వస్తుంది, ఇలా పోతుంది. ఈ విధంగా పంచస్కంధాలను దృష్టిలో ఉంచుకొని సాధకుడు ధమ్మోపాసన చేస్తాడు.

**(iii) అంతర షడంద్రియాయతనాలు**

**బాహ్య షడంద్రియాయతనాలు *(సలాయతన)***

నేత్రం, భౌతికాకృతి, – ఈ రెండింటి ఆధారంగా ఏర్పడిన పాశం గురించి సాధకునికి బాగా తెలుసు. అజనిత పాశోదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. జనిత పాశ త్యాగం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. భవిష్యత్తులో త్యజిత పాశ అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు

అదేవిధంగా చెవి – శబ్దాలు, ముక్కు – వాసనలు, నాలుక – రుచులు, దేహం – స్పర్శ, మనస్సు – మానసిక వస్తువులు, వరుసగా రెండింటి ఆధారంగా జనించే పాశాలు గురించి అతనికి బాగా తెలుసు. అజనిత పాశాల సముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. జనిత పాశాల త్యాజ్యం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. భవిష్యత్తులో త్యజిత పాశాల అసముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

ఈ విధంగా, సాధకుడు బాహ్య, అంతర ఐంద్రియక ఆయతనాల పరంగా ధమ్మోపాసన చేస్తాడు.

**(iv) అంగాలు *(బోఝంగ)***

సతీ బోధి అంగం (Mindfulness) ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో సతీ ఉంది', అని. అది లే నప్పుడు లేదని అతనికి బాగా తెలుసు. అ జనిత సతీ సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు. జనిత సతీ వలని సిద్ధి ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు.

సత్యాన్వేషణా బోధి అంగం ( ధమ్మవిచయ) ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో సత్యాన్వేషణ ఉంది', అని. అది లేనప్పుడు లేదని ఎరుగుతాడు. సత్యాన్వేషణా బోధ సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు. జనిత సత్యాన్వేషణ బోధి ధ్యానం వలన సిద్ధి ఎలా అవుతుందో అతనికి తెలుసు.

విరియ (శక్తి) బోధి అంగం ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో విరియ ఉంది,' అని. అది లేనప్పుడు లేదు అని ఎరుగుతాడు; అజనిత విరియ సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు; జనిత విరియ ధ్యానం వలన సిద్ధి ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు.

ప్రీతి ( పితి = joy) బోధి అంగం ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నేను సంతోషంగా ఉన్నాను, అని. అది లేక పోతే లేదు అని తెలుసుకొంటాడు. అనుదయ ప్రీతి బోధి అంగ

సముదయం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు. జనిత ప్రీతి బోధి అంగ ధ్యానం వల్ల సిద్ధి ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

ప్రశాంతి (పస్సద్ధి) బోధి అంగం ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో ప్రశాంతి బోధి అంగం ఉంది', అని. అది లేనప్పుడు లేదు అని తెలుసు కొంటాడు. అజనిత ప్రశాంతి సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు. జనిత ప్రశాంతి ధ్యానం వల్ల సిద్ధి ఎలా అవుతుందో అతనికి తెలుసు.

సమాధి (Concentration) బోధి అంగం ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో సమాధి సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు. జనిత సమాధి ధ్యానం వల్ల సిద్ధి ఎలా అవుతుందోఅతనికి బాగా తెలుసు.

ఉపేక్ష (బోధి అంగం) ఉన్నప్పుడు అతడు ఎరుగుతాడు – 'నాలో ఉపేక్ష ఉంది', అని. అది లేనప్పుడు లేదని ఎరుగుతాడు. అజనిత ఉపేక్ష సముదయం ఎలా అవుతుందో అతనికి బాగా తెలుసు. జనిత ఉపేక్ష ధ్యానం వల్ల సిద్ధి ఎలా అవుతుందో అనికి బాగా తెలుసు.

ఈ విధంగా అతడు ధమ్మాలను ధ్యానిస్తూ జీవిస్తాడు ..... పైవలె ... ప్రపంచంలో దేనినీ అంటి పెట్టుకోక.

ఈ విధంగా సాధకుడు బోధి ఏడు అంగాల ధ్యానంలో ఉంటాడు.

## 5. చతురార్య సత్యాల ఉపాసన

సాధకునికి పూర్తిగా అవి యథాతథంగా ఎలా ఉన్నవో తెలుసు – 'ఇదిదుఃఖం' 'ఇది దుఃఖ కారణం', 'ఇది దుఃఖ నిరోధం', ఇది దుఃఖ నిరోధ మార్గం'.

ఈ విధంగా అతడు ధమ్మాలను, బాహ్యంగాను, అంతరంగాను, లేదా రెండు విధాల, ధ్యానిస్తాడు. ధమ్మ స్వభావ సముదయాన్ని ధ్యానిస్తూ జీవిస్తాడు. లేదా వాటి అంతరించే స్వభావాన్ని, లేదా ధమ్మాల వచ్చే, పోయే స్వభావాన్ని ధ్యానిస్తూ జీవిస్తాడు.

ఇప్పుడు అతడు జాగరిత మవుతాడు – ''జ్ఞానం, సతీ ల వికాసానికి అవసరమైన మేరకే ధమ్మాలుంటాయి''. ఈ ప్రపంచంలో దేనినీ అంటిపెట్టుకోక స్వతంత్రంగా అతడు జీవిస్తాడు.

ఈ విధంగా అతడు నాలుగు ఆర్యసత్యాలను ఉపాసిస్తూ జీవిస్తాడు.

నిజంగా ఎవడైన ఈ నాలుగు సతీ భూమికలను ఈవిధంగా ఏడేళ్ళపాటు అభివృద్ధి చేసు కొంటే అతడు ఇప్పటి కిప్పుడే, ఇక్కడికక్కడే అర్హంత అవుతాడు. లేదా ఇంకా ఏదైన

అతనిలో రవ్వంత రాగం మిగిలితే అతడు అనాగామి అవుతాడు. లేదు, ఆరేళ్ళుపాటు .... ఐదేళ్ళపాటు .... నాలుగేళ్ళపాటు ... మూడేళ్ళపాటు ... రెండేళ్ళు, ఓ ఏడాది ... ఏడు నెలలు, .... ఆరు నెలలు, ఐదు నెలలు .... నాలుగు నెలలు .... మూడునెలలు .... రెండు నెలలు .... ఒకనెల ..... పక్షం .... వారం .... పాటు అతడు వాటిని పెంపొందించు కొంటే అతడు అర్హతు డవుతాడు. లేదా అనాగామి అవుతాడు. ఇంక ఏదైన ఈ జీవితం మీద రాగం మిగిలిపోతే.

అందువల్లనే ఇలా చెప్పారు -

దుఃఖ నిరోధానికి, జీవుల పరిశుద్ధికి, జ్ఞాన ఆర్జనకు, నిర్వాణ యథార్థీకరణకు ఒక అనన్య మార్గం ఉంది.

ఉన్నతుడు ఈ విధంగా చెప్పగా, శిష్యులు సంతోషించారు.

**వ్యాఖ్యానం :**

1. సతీ = అప్రమత్తత; పత్థాన = సంస్థాపనం, పునాదులు, భూమికలు, వస్తువులు, అనుష్ఠానాలు.

   సతీ = అప్రమత్తత; ఉపత్థాన = జాగృతం చేయడం, అనుష్ఠానం. సతీ అనుష్ఠానానికి ముఖ్య వస్తువులు

2. ఏకాయన = ఏకైక మార్గం, ఒక్కటే మార్గం, ఒక మార్గం, మొదలైనవి.
3. పాఠం చెబుతుంది - ఖేదం, విలాపం, బాధ, అసంతోషం - ఇవన్నీ దుఃఖం ఉన్నాయి.
4. సంఘానికి చెందినా చెందక పోయినా, దుఃఖ విముక్తి కోరిన వాడు ఎవడైన ఈ ధ్యానాలను చేయ వచ్చు.
5. కాయె కాయనుపస్సనా = శబ్దార్థ పరంగా శరీరంలో శరీర ధ్యానం అంటే సంవేదనలు, విజ్ఞానం, ధమ్మాలను వదిలి వేసి కేవలం శరీరాన్నే ఉపాసించడం. ఇతర ధ్యానాలను అలాగే అర్థం చేసు కోవాలి.
6. ఉపాసనా కాలంలో తాత్కాలికంగా త్యజించడం. ఖచ్చితంగా చెప్పాలంటే ఝానాలను పొందడం వల్ల అవి తాత్కాలికంగా ప్రత్యాదేశితాలై, అర్హంతత్వరాగానే పూర్తిగా తొలగించ బడతాయి.

7. ముఖ్యమైన రెండు అవరోధాలను పేర్కొనడంతో మొత్తం ఐదు నివారణలను అర్థం చేసుకోవాలి.

8. ప్రశాంతమైన స్థలం ఏదైనా. ఇంటిదగ్గరైనా సరే.

9. అభ్యాసానికి ఇది ఆదర్శవంతమైన ఆసనం. కూర్చున్న ఆసనం అనుకూలంగా లేక పోతే ఏదైన అనుకూల ఆసనాన్ని గ్రహించ వచ్చు.

10. సబ్బకాయ పటిసంవేదీ = ఇక్కడ 'కాయం' అంటే శ్వాసప్రక్రియకు సంబంధించిన మొత్తం శరీరం. మొత్తం శ్వాస ప్రక్రియా కాయం. ఆదిని, మధ్యను, తుదిని తనకు తాను స్పష్టం చేసు కొంటూ, అతడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేస్తాడు

11. నియమాను సారం ఈ సమాధిని అంతరంగానే చేస్తాడు.

12. శరీరం, నాసిక, విజ్ఞానాల కారణంగా శ్వాస జరుగుతుంది.

13. ఈ మూడు అంతం కావడంతో శ్వాస అంతమవుతుంది.

14. అంటే, జీవి లేదు, వ్యక్తి లేదు, పురుషుడు, స్త్రీ లేరు. ఆత్మ లేదు 'నేను' లేదు 'నన్ను' లేదు.

15. అనిస్సితో - తృష్ణ, దిట్ఠిలు ఆధారంగా లేక పోవడం.

16. ఈవిధంగా అతడు ఉచ్ఛ్వాస నిశ్వాసల మీద లగ్నం చేయగా ఒక దశరావచ్చు. ఆదశలో అతడు తాత్కాలికంగా పంచ అవరోధాలను ప్రత్యాదేశించి, ప్రథమ అనుష్ఠానం (వితక్క) విచార, ప్రీతి, సుఖ, ఏకాగ్రతలతో సంపూర్ణమైన ప్రథమా ఝానాన్ని పొందుతాడు. ఝాన అనే పదానికి శబ్ద పరంగా అర్థం 'వస్తువు మీది నిశిత ధ్యానం' లేదా ప్రతికూల ఆటంకాలను దగ్ధం చేయడం. ఈ పదానికి ఆంగ్లంలో సరైన సమానార్థకం లేదు. అది ఒక సమాధ్యవస్థ కాదు. అదొక ధార్మిక స్థితి, ఒక మత్తైకాను భవం. ఝానం నుంచి లేచి, అనిత్య, దుఃఖ, అనత్తలనే మూడు లక్షణాలమీద ధ్యానాన్ని నిలుపుతాడు. అతనికి రుషిత్వం వస్తుంది. అక్కడనుంచి తృష్ణ, దిట్ఠి, ప్రపంచంలో దేనికీ అంటి పెట్టుకొని ఉండకపోవడం - ల నుంచి విముక్తుడై (అనిస్సితొ) నివసిస్తాడు. అర్హంతత్వం పొందిన తరువాత, అతడు నన్ను, నాది, అనే తప్పుడు ఆలోచనలు చేయడు గనుక, ఈ ప్రపంచంలో దేనికీ అతడు అంటి పెట్టు కోడు.

ఆనాపాన సతీ అంతిమ లక్ష్యం మొదట ఝానాలను పొందడం, ఆ తరువాత నాలుగు లోకొత్తర పథాలను, ఫలాలను పెంపొందించు కోవడం.

ఈ కారణంగానే ఆదిలోనే చెప్పడం జరిగింది – జీవులను పరిశుద్ధం కావించ డానికి, దుఃఖ నిరోధానికి, ఆర్య అష్టాంగ పథాన్ని పొందడానికి, నిర్వాణం పొందడానికి.

17. జంతువు గూడ శారీరక చలనాలకు సచేతనమై ఉంటుంది. ఇందులో ఉద్దేశించింది, కేవలం సచేతనమై ఉండడం కాదు. నడిచేటప్పుడు, అతడు అక్కడ కేవలం 'ఒక నడక' తప్ప మరేమీ లేదని అర్థం చేసు కోవాలి. అంటే నడిచే వాడు, కర్త, ఏజెంటు ఎవరూ లేరని అతడు ఎరగాలి. వేరే మాటల్లో చెప్పాలంటే అక్కడ కర్మ మాత్రమే ఉంది. కర్త లేడు, చేత మాత్రమే ఉంది, చేయు వాడు లేడు. అటువంటి జాగృతివల్ల శాశ్వత ఆత్మకు సంబంధించిన తప్పుడు భావన ఏర్పడదు.

18. శరీర మాలిన్యాల మీద ధ్యానాన్ని చాల మంది భిక్కులు ఆచరిస్తారు. ఇది గౌరవనీయ ఆనందుని అభిమాన విషయం.

ఇది అందమైన శరీరానికి ఒకని విముఖుని చేస్తుంది గనుక, రాగప్రవృత్తి ఉన్నవారికి ఇది తగినది. కొందరు మనిషిలో నిద్రాణమై ఉన్న సంభావ్యతల మీద ధ్యానిస్తారు.

19. నాలుగు మూలకాలు పృథ్వి, ఆపో, తెజో, వాయులు. ఈ మూలకాలను భూమి, నీరు, నిప్పు, గాలిగా అర్థం చేసు కోరాదు. పృథ్వి విస్తృతి (Extension) మూలకం. అది పదార్థాశ్రయం. అది లేక వస్తువులు ఆకాశాన్ని ఆక్రమించ లేవు. సాపేక్షాలైన గట్టితనం, మెత్తదనం – ఈ రెండు ఈ మూలక లక్షణాలు.

'ఆపో' అనేది సంసక్తతా లక్షణం. పృథ్వివలె కాక ఇది తాక డానికి వీలు లేనిది. ఈ ధాతువు మూలాననే వెద జల్లబడిన పదార్థ కణాలు ఒకదానితో ఒకటి అంటుకొని 'వస్తువు' భావన కలుగుతుంది – కొన్ని వస్తువులను కరిగించినప్పుడు, వచ్చిన ద్రవంలో ఈ మూలకం ప్రముఖంగా కనిపిస్తుంది. విస్తృతి, సంసక్తతలు ఎంతో దగ్గర సంబంధం కలిగి ఉన్నాయి. సంసక్తత లుప్తమై నప్పుడు, విస్తృతి కనిపించ కుండ పోతుంది.

తెజో అనేది ఉష్ణ మూలకం. శీతం గూడ తెజో రూపమే. ఉష్ణం, శీతం – రెండూ తెజోలో ఉన్నాయి, ఎందుకంటె, వస్తువులను పక్వం చేసే శక్తి వాటికి ఉంది. మరో మాటలో చెప్పాలంటే తెజో ప్రాణిక శక్తి. ఈ ధాతువు కారణంగానే వస్తువులుకు సంరక్షణ, వినాశం (వస్తువులు అలాగే ఉండి పోవడం లేదా పాడైపోవడం) కలుగుతుంది. మిగతా మూడు ధాతువుల వలె కాక, దీనికి పదార్థాన్ని, దానికై దానినే పునరుత్పత్తి చేసే శక్తి ఉంది.

అవిభాజ్యంగా తెజోతో కలిసి ఉంది వాయొ. వాయొ గతి (motion) ధాతువు. చలనాలు ఈ ధాతువు వల్ల కలుగుతాయి. గతిని శక్తిగా, ఉష్ణజనకంగా భావిస్తారు. ''భౌతిక

ప్రపంచంలోని గతి, ఉష్ణాలు వరుసగ మానసిక ప్రపంచంలోని విజ్ఞానం కమ్మలకు సరిపోలుతాయి.''

ఈ నాలుగు ధాతువులు సహవాసులు, అవిభాజ్యాలు. కాని ఒకటి మరోదాని కంటె - ఉదాహరణకు పృథ్వి భూమిలో, ఆపానీటిలో, తెజొ నిప్పులో, వాయొ గాలిలో - ప్రబలంగా ఉంటాయి.

ఇంద్రియ ప్రపంచానికి చెందిన (కామావచ్చర), ఆకృతి ప్రపంచానికి చెందిన (రూపావచర) రెండు రకాల విజ్ఞానాన్ని ఉత్తరించ వచ్చు (దాటవచ్చు). కాని అరూప ప్రపంచానికి చెందిన విజ్ఞానాన్ని పరిగణనలోకి తీసుకో లేదు.

**21.** ధమ్మానుపస్సనా - ఇక్కడ ధమ్మం అంటే బోధ గాదు. లోక, లోకోత్తర వస్తువుల కుపయోగించే సామాన్య పదం. ఆంగ్లంలో 'Thing' (వస్తువు) ఎంత విస్తృతార్థాన్ని కలిగి ఉందో, దీనికి అంత విస్తృతార్థం ఉంది. ఈ సందర్భంలో 'ధమ్మ' అనే పదాన్ని, నివరణలకు (ఆటంకాలకు) బొజ్జంగ (బోధి కారకాలకు) లకు, గ్రహణం యొక్క పంచస్కంధాలకు (ఉపాదానఖ్ఖంధాలకు) ఆయతన (ఇంద్రియ లోకాలకు), ఆర్య సత్యాలకు (అరియ సచ్చలకు) అన్వయించ బడింది.

అందుకని 'పాళి' పదాన్ని ఉంచడమే శ్రేయస్కరం.



నారద మహాథేర గొప్ప బౌద్ధ ప్రచారకుడు. బౌద్ధానికి ఆయన చేసిన సేవలు అనన్యాలు, ప్రభావకాలు. అలుపెరగని ఆయన ధమ్మ దూత్యం (Missionary Work) కారణంగా, ప్రపంచమంతట బౌద్ధ సమాజాలలో ఆయన ప్రసిద్ధులు.

ఆయన బౌద్ధం మీద ఎన్నో ప్రామాణిక గ్రంథాలు రాశారు. అవన్నీ బౌద్ధ ప్రపంచానికి బాగా పరిచితాలు. ఆయన రచనలలో ముఖ్యమైనది "A Manual of Abhidhamma".

అనువాదుకులు అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి (1933 - ). 1958 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో యమ్.ఎ. తత్త్వం చేశారు. వి.యస్.ఆర్. కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేశారు. "సిగ్మండ్ ఫ్రాయిడ్", "మానవీయ బుద్ధ" లాంటి అనేక గ్రంథాలు రాశారు.

ప్రస్తుతం "**మిసిమి**" మాసపత్రికకు సంపాదకులుగా పని చేస్తున్నారు.

బుద్ధ పథంలో జీవితాన్ని మలుచుకొనే ప్రయత్నంలో ఉన్నారు.


Ananda Buddha Vihara Trust

Buddhanagar, Tukaram Gate, North Lallaguda
Secunderabad - 500 017. A.P., INDIA
Ph : 040-7732421, Fax : 040-7733160

# బుద్ధ దర్శనం




**ఆనంద బుద్ధవిహార**

సికింద్రాబాద్ : ఆంధ్రప్రదేశ్